శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భాగవత మహాపురాణము

## (దశమ స్కంధము)

శ్రీ వ్యాసమహర్షి కృత సంస్కృత భాగవతమునకు యథాతథ
ఆంధ్ర వచనానువాదము

# श्री

రచయిత :
రాయసం వీరేశ్వరశర్మ

ద్వితీయ ముద్రణ : 1997

మూల్యము : రూ. 100/-

## అంకితము

కలియుగ ప్రత్యక్ష దైవమగు
శ్రీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర భగవానుని
దివ్యపాదారవిందములకు

ప్రాప్తి స్థానము :

రాయసం వీరేశ్వరశర్మ
"శ్రీకృష్ణ సదనము"
23-23-28, శివరావు వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ – 520 011.
ఫోన్ : 437008

ముద్రణ :

జయశ్రీ ప్రెస్
విజయవాడ – 11.

# ప్రస్తావన

శ్రీ వేదవ్యాస విరచిత సంస్కృత శ్రీమద్భాగవత మహాపురాణమునకు నాచే రచింపబడిన వచనానువాదము నందు దశమ స్కంధము మాత్రము 1994 సంవత్సరము నందు ఆ శ్రీకృష్ణ భగవానుని యనుగ్రహమున ముద్రించుట జరిగినది. ధనాభావముచే మిగిలిన స్కంధముల ముద్రణ నిలిచిపోయినది.

1996 వ సంవత్సరమున శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు మిగిలిన పదకొండు స్కంధముల ముద్రణకు ఆర్థిక సహాయము చేయుటకు వాగ్దాన మొసంగుటచే, ఉత్సాహము చిగురించుటయు వారి నిబంధన ననుసరించి రెండు సంపుటములుగా (మొదటి 9 స్కంధములొక స్కంధముగాను 11, 12 స్కంధములు, మహాత్మ్యములు గలిసి రెండవ సంపుటముగాను) ముద్రించి వారికి పంపుటయు జరిగినది. పూర్వము ముద్రించిన దశమ స్కంధము యొక్క ప్రతులై పోయినందున ప్రస్తుతము ముద్రించిన పదకొండు స్కంధములకు దశమ స్కంధము లేని లోపము కనబడుటచేత మిత్రుల యభిప్రాయము ననుసరించి, దశమ స్కంధమును మరల ముద్రించి జతపరచి పురాణమునకు పూర్ణత్వము కలిగించవలసి వచ్చినది. వ్యయప్రయాసలకు తలవంచి దానిని గూడ ముద్రించి జతపరచటమైనది.

పూర్వము దశమ స్కంధమునకు పండితు లొసంగిన యభిప్రాయములను గూడ యిందు పొందుపరచుట జరిగినది.

గ్రంథ ముద్రణకు తగు ఆర్థిక సహాయము నందించి, చేదోడు వాదోడుగా సహకరించిన మిత్రులందరికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ బృహద్యజ్ఞమున కీనాటికి విధముగ పూర్ణత్వము కలిగించి నా జన్మ ధన్య మొనర్చిన శ్రీకృష్ణ పరమాత్మకు ధ్యానపూర్వక నమస్సుమాంజలుల నర్పించు చున్నాడ.

ఇట్లు
బుధజన విధేయుడు
కాయనం వీరేశ్వరశర్మ

# శ్రీ మదాంధ్ర వచన భాగవత మహాపురాణ గ్రంథావిష్కరణ సమర్పిత సన్మాన పత్రమ్

రాయసం వంశసంభూతః వీరేశ్వర మహామతిః
జీయాత్ వర్షశతంసాగ్రం ధర్మమార్గ ప్రవర్తకః

అతీత సప్తతి వర్షీయాః వీరేశ్వరశర్మా మహోదయాః సంస్కృతేకృత పరిశ్రమాః రామాయణ భాగవత గ్రంథయోః ఆంధ్రానువాదం సపరిశీలనం సరహస్యం కృత్వా జన్మ సాఫల్యం ప్రాప్నువన్తి ఇత్యత్ర నసంశయః। అతః —

స్వస్తిశ్రీ ఈశ్వరనామ సంవత్సర చైత్ర శుద్ధ సప్తమ్యాం భానువాసరే 13-4-97 దినాంకే శ్రీ విశ్వేశ్వరశర్మా మహోదయైః రచితస్య ఆంధ్రానువాదస్య శ్రీమద్భాగవత మహాపురాణ గ్రంథస్య ఆవిష్కరణ మహోత్సవే

## "వ్యాస హృదయ ద్రష్టా"

ఇతి ఉపాధినా శ్రీ దుర్గా సంస్కృత పాఠశాలా, భారత సంస్కృత పరిషత్ శ్రీ జగన్నాథ పండిత రాజపీఠం ఇత్యాది సంస్థాః సభాజయంతి అస్మాసువాత్సల్యేన స్వీకుర్వన్తు ఇతి అభిలషామః సంస్థానాం సభ్యాః వయమ్

ఇతిశమ్

ఎవం

శ్రీ శివరామకృష్ణ క్షేత్రమ్
విజయవాటికా
13-4-97

శ్రీ దుర్గా సంస్కృత పాఠశాలా
భారత సంస్కృత పరిషత్
శ్రీ జగన్నాథ పండిత రాజపీఠమ్.

# భాగవత రసాస్వాదము

"పరమహంసలచే నాస్వాదింపబడు చరణకమల చిన్మకరందము గలవాడును, భక్త జనుల మానసములందు వసించుచుండువాడునగు శ్రీరామచంద్రునకు నమస్సు మాంజలులు.

శ్రీ మద్భాగవత మహా పురాణము భక్తియోగ ప్రధానమనునది జగత్తునందు ప్రసిద్ధము. విష్ణు భక్తిని వాంఛించువారు దీనిని తప్పక శ్రవణము చేయవలయును. ఇది వాసుదేవునిచే చతురాననునకుపదేశింపబడినది. అదియే చతుశ్శ్లోకి భాగవతమను పేర బరగుచున్నది. భగవంతునిచే బోధింపబడినదిగాన భాగవతమనునది సార్థక నామము. ఆ చతుశ్శ్లోకిభాగవతమే పదునెన్మిదివేల శ్లోకములు గల యీ సంహితకు సూత్రప్రాయమైనట్టిది. అందు మొదటి శ్లోకమునందు ఆత్మ స్వరూపమును, రెండవ దానియందు మాయా స్వరూపమును, మూడవదానియందు పరమాత్మ యొక్క సర్వాంతరత్వమును, నాల్గవ దానియందు పరమాత్మ ప్రాప్తికి ఉపాయభూతమగు అన్వయ వ్యతిరేక విచారణయు నను నాలుగు పదార్థములు క్రమముగా నిరూపింప బడినవి. అందుచే భాగవత శ్రవణము వలన భక్తి లభించునని గూడా అందే చెప్ప బడినది.

"యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమ పూరుషే
భక్తిరుత్పద్యతే పుంసః శోక మోహ భయా పహా"

(భాగవత శ్రవణముచే పరమ పురుషుడగు శ్రీకృష్ణుని యందు, శోకమోహ ముల తొలగించునట్టి భక్తి యుద్భవించును)

ఆ భక్తి, సాధన భక్తి, ఫలభక్తియని రెండు విధములుగా నున్నది. హరి కథా శ్రవణాదులు మొదలుకొని ఆత్మనివేదనము వరకు గలది సాధన భక్తి యన బడును. "శ్రవణం కీర్తనం విష్ణోః" అని సప్తమ స్కంధము నందది చెప్పబడినది. ఇక సాధ్య భక్తియే 'ఫలభక్తి' యనబడును ఇది, "భక్త్యా సంజాతయా" అని ప్రారంభించి, యేకాదశ స్కంధమున బాగుగా వివరింపబడినది. ఈ ఫలభక్తి భగవ

వేకాకారమగు అంతఃకరణ వృత్తి రూపము. "భక్తి రసాయనము" నందు, ప॥ ప॥ మధుసూదన సరస్వతీ యతీంద్రులచే యీ ఫలభక్తి యీ క్రింది విధముగా నిరూపింపబడినది.

"ద్రుతస్య భగవద్ధార్మాద్ధారా వాహిక తాంగతా
సర్వేశే మనసోవృత్తిః భక్తిరిత్యభిధీయతే

("భగవద్ధర్మముచే ప్రవాహ రూపమునందిన వేగవంతమగు మనోవృత్తి భక్తి యనబడును" అని దాని యర్థము)

వేదవ్యాసాచార్యులు గూడ, యీ విష్ణుభక్తి బ్రహ్మ సాక్షాత్కారమునకు హేతుభూతమగునని వచించియున్నారు.

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తి యోగః ప్రయోజితః
జనయత్యాశువై రాగ్యం జ్ఞానంచయద హైతుకం" ఇతి—

ఇంకను, మోక్షమునకు గూడ భక్తియోగము స్వతంత్రముగా హేతువగునని చెప్పబడినది. "చైద్యః సిద్ధింగతో యధా" (శిశుపాలుడు సిద్ధి బొందినటుల) అను చోట సిద్ధియనగా మోక్షము. అది రెండు విధములు. కైవల్య రూపమయినదొకటి కాగా, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాత్మకమగునదింకొకటి. సాలోక్యాది మోక్ష స్వరూపము ముక్తికోపనిషత్తునందు శ్రీరామునిచే హనుమంతున కుపదేశింపబడినది.

గోపికలకు కామాదుల ద్వారా భగవదేకాకారాన్తః కరణ వృత్తి కలిగి, దానిచే భక్తిత్వము సిద్ధించినది. అందుచే గోపికల భక్తి మధుర భక్తియని వ్యవహరింపబడుచున్నది.

అది యేకాదశ భూమికకు చెందిన పరమోత్కృష్టభక్తియని, కవులు చెప్పుచుందురు. అందుచే యీ భాగవతము సందలి రాస పంచాధ్యాయియందు ఆ మధురభక్తి ప్రతిపాదింపబడినది. అందు శ్రీకృష్ణ పరబ్రహ్మమూర్తి యొక్క యోగలీలయే వర్ణింపబడుననునది రహస్యము.

"వనితా శతయూథపః, కృత్వాతావంతమాత్మానం యావతీ ర్గోపయోషితః" (వనితల శతయూథములకు పతియగు భగవానుడు గోపికలెందరుండిరో అన్ని (రూపములదాల్చి,) అను వర్ణనలుగల స్థలములందు, ఆత్మారాముడగు భగవానుడు గోపికలననుగ్రహించుటకే యన్ని రూపముల దాల్చి వారి నానందింపజేసెనని వర్ణించబడినది. విష్ణువే దేవతగా గలవారల శృంగారము గూడ శృంగారప్రాయమని

సంప్రదాయవిదులందురు. ఆ శృంగారము సంప్రయోగ, విప్రయోగత్వములచే రెండు విధములుగా నుండును. గోపికలతో గూడి విహరించిన సచ్చిదానందమూర్తి యగు శ్రీకృష్ణుని యీ ద్వివిధ శృంగారము రాసపంచాధ్యాయియందు సవిస్తరముగ నిరూపించబడినది. ఈ దివ్యమగు యోగలీలా వైభవమును పరమయోగులు నిరంతరము తమ యంతరంగములయందనుసంధాన మొనర్చుకొనుచుందురు. "ఆత్మన్యవరుద్ధసౌరతః" (మనస్సు నందు నిరోధింపబడిన సురత భావము గలవాడు) అను ప్రయోగముచే, అస్ఖలిత బ్రహ్మ చర్య రూపమగు పారమహంస్యత్వవర్ణన వలననిది తెలియబడుచున్నది. అనుభవ యోగ్యములగు విషయములు పుష్కలముగ సన్నిధానమందున్నప్పటికిని, చిత్త చాంచల్యము గలుగనట్టి పరమ వైరాగ్యాత్మకమగునట్టి ధైర్యము గూడ వర్ణితమైనదని గూడ బోధపడుచున్నది.

ఈ యోగలీల భగవానుడేలనంగీకరించెనన్నచో, బహిర్ముఖులై యున్న వారలను గూడ శృంగారరసాకృష్ట మానసుల గావించి తనవైపునకు త్రిప్పుకొనుట (అంతర్ముఖుల గావించుట) కొరకేనని, శ్రీధరాచార్యులవారు సమాధాన మొసంగియున్నారు. భాగవతము యొక్క పరమ తాత్పర్య విషయమగు భక్తియోగ దృష్టిచేత, "జ్ఞానినామాత్మభూతానాం" అను స్థలములయందు జ్ఞానయోగము కంటె భక్తియోగము యొక్క యుత్కర్షము గూడ వర్ణింపబడినది. వాస్తవికముగా, సగుణ నిర్గుణ బ్రహ్మ స్వరూపములొక్కటియే గనుక, భగవద్దర్శనముచే ముక్తి కలుగుననియు, ఆదర్శనము కలుగు వరకు బంధముండుననియు, యుక్తిచే సమర్థింపబడినది.ఇటులనే అద్వైతయనును సాంఖ్యయోగము గూడ ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడినది. ఇతరములగు, కాపిల పాతం జలములగు నిరీశ్వర సేశ్వర సాంఖ్యములందు ద్వైతముయొక్క సత్యత్వము చెప్పబడుటచేత, వానికిని పూర్వోక్త సాంఖ్యయోగమునకును గల భేదము, కపిల దేవహూతి సంవాద సారభూతమగు "సాంఖ్యమునందు, స్వప్న దృష్టాంతముతో ద్వైత మిథ్యాత్వమును ప్రతిపాదించి, అద్వైతాభేద ప్రబోధమే యంగీకరింపబడినది.

ఈ విధముగ ననేక శాస్త్రీయ విషయములు నిరూపింపబడినవి. ఉపక్రమోపసంహారములందు, తటస్థ లక్షణ నిరూపణపూర్వకమగు బ్రహ్మయొక్క స్వరూప లక్షణముగూడ 'సత్యంపరంధీమహి' యను వాక్యముచే నిరూపింపబడినది. అందుచే యీ భాగవతసంహిత సర్వవేదసారభూతమని తెలియుచున్నది. "అర్థోऽయం బ్రహ్మసూత్రాణాం" (ఇది బ్రహ్మసూత్రముల యర్థము) మొదలగు వాక్యములచే స్తుతింపబడుచుండుటగూడ విశేషము. శ్రీశుకులు పరీక్షిత్తున కొనర్చిన చరమోపదేశమునందు "అహంబ్రహ్మపరంధామ" యను శ్లోకముచేత "అహంబ్రహ్మాస్మి"

యను మహావాక్య లక్ష్యార్థము నిరూపింపబడినది. బ్రహ్మసూత్రములందలి వ్యతిహారాధికరణమునందు చెప్పబడినటుల జీవునకు అశోకత్వసిద్ధికొరకు "అహం బ్రహ్మే"తి (నేను బ్రహ్మను) అనిన్ని బ్రహ్మ పరోక్షత్వ సిద్ధికొరకు, బ్రహ్మను నేను' అను భావనను చేయుచుండవలయునని చెప్పినట్లయినది. శ్రుతిగీతలయందును, గజేంద్రకృత స్తవమునందుగూడ, అతద్వ్యావృత్తిచే శాస్త్ర ప్రామాణ్యము ప్రదర్శితమైనది. ఏకాదశస్కంథము నందు

శ్లో॥ అవిద్యమానోఽప్యవభాతేద్వయః
ధ్యాతుర్థియాస్వప్న మనోరథోయథా"

అను శ్లోకమునందు, విద్యమానముగాక యుండి భాసించుటచే స్వప్నమనోరథము వలె, ఉన్నటుల భాసించుచుండుటయే మిథ్యాత్వమని యుపపాదింపబడినది. సప్తమ స్కంథమునందు "ప్రతిముఖస్యయథాముఖశ్రీః" అని, రాసక్రీడా ఘట్టమునందు "యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః" అనియును, జీవ-బ్రహ్మలకు శ్రుత్యుక్తమగు బింబ ప్రతిబింబ భావమనువదింపబడినది. "అతఏవచోపమా సూర్యకాదివత్" అను బ్రహ్మ సూత్రార్థముగూడ చెప్పబడినట్లయినది.

వర్ణాశ్రమ ధర్మములు నిరూపింపబడినవి. కర్మకాండ వర్ణింపబడినది. ఈ మహాపురాణము కర్మ భక్తి జ్ఞాన కాండాత్మకమగు వేదముయొక్క యుపబృంహణమేనని విదితమగుచున్నది. "నిగమకల్పతరోః" అను శ్లోకమునందు, నిగమములను కల్పవృక్షముయొక్క ఫలముగా యిది కల్పన (భావన) చేయబడినది. అందుచేతనే కాండద్వయ విభాగమువలెనే కాండత్రయ విభాగముగూడ, మధుసూదన యతీంద్రులచే ప్రతిపాదింపబడినది.

శ్రీకృష్ణ-ఉద్ధవ సంవాదమునందుగూడ "యోగాస్త్రయోమయాప్రోక్తాః" అని ప్రారంభించి, అవి జ్ఞాన-కర్మ-భక్తి యోగములని భగవానునిచేతనే పలుకబడినవి. ఈ యోగత్రయబోధకమే కాండత్రయమను వేదభాగమని వ్యవహరింపబడుచున్నది. అందువలన "ఆమ్నాయార్థమంతయు నచ్చటచ్చట ననేక పర్యాయములు నిరూపించబడినది. సర్వజనులనుద్ధరించుటకై యవతరించిన విష్ణుభగవానుడే వేదవ్యాసాచార్యుడు. [వ్యాసోనారాయణోహరిః] పరమహంస సంహితయను పర్యాయనామముగల శ్రీమద్భాగవతమున కతడే కర్తయగుటచేత, యిది పరమ ప్రామాణ్యముగల గ్రంథము. భగవదవతారములయొక్క ముఖ్య ప్రయోజనము పరంపరగా జీవునకు మోక్షప్రాప్తి కల్గించుటయే యను విషయముగూడ శ్రుతిగీతలలోని "దురవగమాత్మతత్త్వనిగమాయ" యను శ్లోకమునందు స్పష్టీకరింపబడినది.

ఈ పురాణమునందు భాగవతోత్తముల లక్షణముగూడ "విసృజతి హృదయంనయస్య" మొదలగు శ్లోకములందు వివరించబడినది. ఎవనియొక్క భక్తి జ్ఞాన వైరాగ్యాదులు పరాకాష్ఠకు చేరునో వాడే భాగవతోత్తముడని చెప్పబడినది. జ్ఞానమనునది సగుణమని నిర్గుణమని రెండు విధములు. జ్ఞానమనగా సాక్షాత్కారము. లడ్డుకములు, ఘృతపూరాసికములగు ద్వివిధములగు మధురపదార్థములు గూడ ఆపేక్షింపబడుచునే యుండునట్లు, ద్వివిధ సాక్షాత్కారముగూడ రెండురకములగు ఆనందమును కల్గించునవి యగుటచేత భాగవతోత్తములచే నభిలషింపబడుచుండును. రసజ్ఞులచేతను, అటులనే భాగవతోత్తములచేతగూడ సగుణ బ్రహ్మ సాక్షాత్కారానందము, నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారజన్యమగు ఆనందము గూడ కోరబడుచుండునని, ధర్మసింధుకారులగు కాశీనాథోపాధ్యాయులచేత, శ్రుతిగీతోప వ్యాఖ్యయందు వివరించబనది.

ఇంకొక విషయము. భగవానుడు, రాధాదేవి నామముగూడ శ్రీకృష్ణ ప్రీతికొరకై రాసక్రీడా ఘట్టమునందస్పష్టముగ నుచ్చరించినాడని, "అనయారాధితో నూనమ్" అను పద్యమునందు 'ఆరాధిత' అను పదమును విభజించి శుకునకుప దేశించెదనని, కొందరు భక్తులను వ్యాఖ్యానకర్తలు వచించుచున్నారు. (రాధిత-అనునది ఇతచ్ ప్రత్యయాంతమగు పదము) ఈ గ్రంథమునకు ఆయా సంప్రదాయ వేత్తల కవకాశము కల్గించునట్టి యన్వాఖ్యానము లెన్నియో యుండుటయే యీ గ్రంథముయొక్క రామణీయకత. "వర్ణనాతీతముగాన వర్ణనమును విరమించుట శ్రేష్ఠమని తోచుచున్నది."

అట్టి పురాణరత్నమగు మహాభాగవతమును, సంస్కృత వ్యాఖ్యానమును హిందీ అనువాదమునుగూడ పరిశీలించి, విచారించి, తెనిగించుట సాధారణ పరిశ్రమముకాదు. కాని శ్రీ రాయసం వీరేశ్వరశర్మకుగల హరిభక్తి, ఉత్సాహమును కలిగించి ఆంధ్రీకరణరూపమగు కార్యమును చేయించినదని తోచుచున్నది. శ్రీకృష్ణ ప్రీతికొరకై వ్రాసిన వచనానువాదము భక్తిరసభరితము గనుక జనులలో విశిష్ట ప్రచారము గలుగునట్లు శ్రీకృష్ణభగవానుని ప్రార్థించుచున్నాను. వారిది మంచి యనువాదము. ఈ గ్రంథము భక్తజనుల కరకమలముల నలంకరించుగాక.

ఇట్లు
'సాహిత్యరత్నాకర' 'అభినవశుక'
**అంబటిపూడి కొండయ్యశాస్త్రి**
(వీరు ది. 4-1-1965న బ్రహ్మలీనులైరి)

# అభినందనలు

బ్రహ్మశ్రీ శ్రీరాయసం వీరేశ్వర శర్మగారు వచన రూపమున ఆంధ్రీకరించిన మహా భాగవతము దశమ స్కంధము పరిశీలించు భాగ్యము నా కబ్బినది. భాగవతాదులెంత చదివినను, యే రూపములోనున్నను తనివితీరనివి. అందుకే అవి పద్యములుగా, వచనములుగా, నాటకములుగా, పాటలుగా, యింకా యెన్నో రకాల ప్రక్రియలలో జనులకందింపబడుచున్నవి.

అందులో శ్రీ శర్మగారు తాము చదివి, చదివినది నెమరు వేసుకొనుటకా యన్నట్లు వచన రూపములో వ్రాసుకొన్న భాగవతము శ్రోతలకు వినిపింపగా, దానిలోని సౌలభ్యము వలన, మాధుర్యము వలన శ్రోతృబాహుళ్యమేర్పడినది. పండిత పామర హృద్యముగా, సుగమముగా, చక్కని వచన రచన వారి కబ్బినది. వారిది తెలుగు పండిత వృత్తి కాకపోయినను, అదృష్టవశమున వచన రచనా దురంధరులై చక్కగా తెనిగించుట విను వారి, చదువు వారి యదృష్టమనక తప్పదు. వారి యీ రచన వారికే పరిమితముగాక శ్రోతలకును ఆనందదాయకమైనట్లే, చదువరులకును ఆనందము కలిగించుటకై ముద్రితమైనచో బహు జనోపయుక్తము కాగలదు. దానికి వలయు సామగ్రిని భగవానుడు శ్రీకృష్ణ పరమాత్మ దోహదము చేయుగాక యని ప్రార్థించుచున్నాను.

ఇది హృద్యముగానున్న దనుటకు శ్రోతలే ప్రమాణము.

శుభం భూయాత్

ఇట్లు

విజయవాడ |
23–1–94 |

తర్కాచార్య, భాషాప్రవీణ, బ్రహ్మశ్రీ
(సం) శం. రామగోపాలకృష్ణమూర్తి
**M.A., Ph.D.**
రిటైర్డు తెలుగు లెక్చరర్, కృష్ణలంక,
విజయవాడ.

(వీరు 1996వ సంవత్సరమున పరమపదించినారు)

# ఆమోదము

"నిగమకల్పతరోర్గళితం ఫలం శుక ముఖాదమృత ద్రవసమ్మితం
పిబత! భాగవతం రసమాలయం ముహురహోరసికాభువిభావుకాః"

వేదమనెడి కల్పవృక్షమునుండి జారిపడిన పండు భాగవతము. ఇది శుకముఖ స్పర్శచే అమృతరసమును ప్రసరింపజేయుచున్నది. ఇట్టి భాగవత ఫలరసమును జీవితాంతము ఆస్వాదింపుడని వ్యాసమహర్షి స్వాత్వికభావులకు దివ్యసందేశ మందించినారు.

అష్టాదశ సహస్రశ్లోకసంఖ్యగల వ్యాసభాగవతమును పద్యరూపమున పోతన మహాకవి వివరించి ఆంధ్రులకు మహోపకారమొనర్చిరి. అటు పిమ్మట వచన రూపముగ పలువురు తెనుగున అనువదించిరి. అవి కొన్నిచోట్ల సంగ్రహింపబడుటయు, మరికొన్ని తావుల మూలాతిక్రమణముగ వివరణ గావించుటయు జరిగినది.

ప్రస్తుతము శ్రీ రాయసం వీరేశ్వరశర్మగారు వ్యాసభాగవతమును యథాతథముగ ఆంధ్రమున వచనములో అనువదించి ఇంతకుపూర్వముగల రచనలకంటె విలక్షణముగను విశిష్టముగను వెలువరించినారు.

భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్త్వ, ముక్తులను నిరూపించు భాగవతము.
"అర్థోయం బ్రహ్మసూత్రాణాం భావితార్థ వివిర్ణయః
గాయత్రీ భాష్యరూపోసౌ వేదార్థ పరిబృంహితః
పురాణానాం సారరూపః సాక్షాత్ భాగవతోదితః"

బ్రహ్మసూత్రములకు వివరణగా, గాయత్రీ భాష్యముగ, పురాణసారముగ పండితులచే ప్రశంసింపబడినది. ఇట్టి భాగవతమును అనువదించుట సులభసాధ్యముకాదు. అందుకే పోతన మహాకవి "భాగవతము తెలిసి పలుకుట చిత్రమ్ము, శూలికైతమ్మి చూలికైన" అని భాగవత విషయ వివరణలోని అసాధ్యత్వమును ప్రకటించినాడు.

వ్యాసహృదయమును యథారీతి ఆంధ్రులకందించవలయునను అభిలాషతో శ్రీ శర్మగారు రచించిన యీ అనువాదము అనితరసాధ్యము. దశమస్కంధముతో పఠనము ప్రారంభింపవలయునను సంప్రదాయానుగతముగ వీరు దశమస్కంధభాగమునే తొలుత యనువదించి ముద్రించుట జరిగినదనుకొందును.

ఈ దశమస్కంధములో దేవకీవసుదేవుల స్తోత్రము, బ్రహ్మస్తవము, కాళియపత్నీ స్తవము, ఇంద్రస్తవము, అక్రూరస్తుతి, గోపికాగీతలు, శ్రుతి గీతలువంటి ఘట్టములు ఉపనిషత్సారములు. వీటి యనువాదమునుపట్ల శర్మగారు సులభశైలి నవలంబించి భాగవత పరమార్థమునందరకు అవగతమగునట్లు ఉపకారమొనర్చినారు.

యశోద చిన్నికృష్ణుని త్రాటితో బంధించిన ఘట్టమున అనువాదముతోపాటు విడిగ వివరణ (63 పేజీలో) కూడచేసి శ్రీకృష్ణ బ్రహ్మతత్త్వమును విశదీకరిం

చిరి. ఇట్లు పలుతావున అనువాదము క్రింప అపసరమగు వివరణతో పరతత్త్వమును ప్రకటించిరి.

137 పేజీలో గోపికావస్త్రాపహరణ ఘట్టములోని మూలశ్లోకముల నుదహరించి ధనికుల మనస్సులలోని సందేహములను నివారించుచు వస్త్రాపహరణములోని ఆంతర్యమును విశదపరచినారు.

184 పుటలలో గోపికాగీతముల ఘట్టమును అనువదించుచోట్ల యదాతథముగ మూలమునెట్లు అనువాదములో చూపించిరో యొక శ్లోకమును పరికింతము. గోపికలు "నఖలుగోపికానందనోభవాన్। అఖిలదేహినామంతరాత్మదృగ్। విఖనసార్థితోవిశ్వగుప్తయే। సఖఉదేయివాన్ సాత్వతాంకులే" అనిన శ్లోకమునకు "ఓ సఖుడా! నీవు కేవలము యశోదాసుతుడవు మాత్రమేకావు. సమస్త శరీరధారుల హృదయములందుండు బుద్ధిసాక్షివి నీవు. అంతర్యామివి. విశ్వపాలనముకొరకై బ్రహ్మచే వేడబడినవాడవై నీవు యదువంశమందు అవతరించితివి" అని యథామూలము తెనిగించుట గమనార్హము.

రాసక్రీడా వర్ణన సన్నివేశమందు 208 పుటలో "రేమే రమేశః వ్రజసుందరీభిః యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః" అను మూలశ్లోకము నుదహరించుటయే గాక రాసలీలా విశేషమందలి అంతర్గత ఆత్మరహస్యమును పరిశీలనాత్మకముగ వివరించి పలువురి మనస్సులందుగల సంశయాలను నివారించిరి.

ఇట్టి మహోత్కృష్ట రచన గావించిన శ్రీశర్మగారు ధన్యజీవనులు. వీరిచే శ్రీకృష్ణపరమాత్మ సమగ్రముగ భాగవతమును ఆంధ్రీకరింపజేసి ఆంధ్రలోకానికందించే అదృష్టమును కలిగించాలని భగవంతుని ప్రార్థించుచూ శ్రీవీరేశ్వరశర్మగారిని అభినందించుచున్నాను.

ఈ రచనచదివే అవకాశము కల్పించిన శ్రీ శ్రీ శ్రీ చిదానంద బాలేంద్ర సరస్వతీ స్వామివారికి నా ప్రణామములర్పించుచున్నాడను.

ఓం తత్సత్

"శ్రీ శారదా సదనము"
సర్కిల్ పేట
మచిలీపట్టణము 521 001

"సాహిత్యవిద్యాప్రవీణ", "ఆర్షవిద్యాభూషణ"
భాగవతసుధాసింధు", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీరంగారావు

(పూజ్యులు సాహిత్యవిద్యా ప్రవీణులునైన శ్రీమల్లాప్రగడ శ్రీరంగారావు గారు పరిశీలనాత్మకముగ యిచ్చిన అభిప్రాయమునకత్యంత కృతజ్ఞుడను).

రచయిత

# శ్రీమద్భాగవత మహాపురాణము

## వి ష య సూ చి క

### దశమ స్కంధము

(పూర్వార్థము)

## దశమ స్కంధము

### ఉత్తరార్థము

—0—

## దశమ స్కంధమునకు అనుబంధములు

# గోపికా గీతలు

శ్లో॥ జయతితేఽధికం జన్మనా వ్రజః
శ్రయతి ఇందిరా శశ్వదత్రహి
దయిత దృశ్యతాం దిక్షుతావకాః
త్వయిధృతాసవః త్వాంవిచిన్వతే

శ్లో॥ శరదుదాశయే సాధజాతస
త్సరసి జోదర శ్రీముషాదృశా
సురతనాథతేఽశుల్క దాసికా
వరదనిఘ్నతో నేహ కిం వధః

శ్లో॥ విషజలాశయాద్వ్యాళరాక్షసాత్
వర్షమారుతాద్వైద్యుతా నలాత్
వృషమయాత్మజాత్ విశ్వతోభయాత్
ఋషభతేవయం రక్షితాముహుః

శ్లో॥ నఖలు గోపికానందనో భవాన్
అఖిల దేహినామం తరాత్మదృక్
విఖన సార్థితో విశ్వగుప్తయే
సఖ ఉదేయివాక్ సాత్వతాంకులే

శ్లో॥ విరచితాభయం వృష్ణివర్యతే
చరణమీ యుషాం సంసృతేర్భయాత్
కరసరోరుహం కాంతకామదం
శిరసిధేహినః శ్రీకరగ్రహం

శ్లో॥ వ్రజజనార్తిహన్ వీర యోషితాం
నిజజనస్మయ ధ్వంసనస్మిత
భజసఖే భవత్కింకరీస్సనో
జలరుహాననం చారు దర్శయ

శ్లో॥ ప్రణత దేహినాం పాపకర్శనం
తృణచరానుగం శ్రీనికేతనం

ఫణి ఫణార్పితం తేపదాంబుజం
కృణు కుచేషునః కృంధి హృచ్ఛయం

శ్లో॥ మధురయాగిరా వల్గు వాక్యయా
బుధమనోజ్ఞయా పుష్కరేక్షణ
విధికరీరిమా వీరముహ్యతే
రధరశీధునా ప్యాయయస్వనః

శ్లో॥ తవకథామృతం తప్తజీవనం
కవిభిరీడితం కల్మషాపహం
శ్రవణమంగళం శ్రీమదాతతం
భువిగృణన్తియే భూరిదాజనాః

శ్లో॥ ప్రహసితంప్రియే ప్రేమ వీక్షితం
విహరణంచతే ధ్యానమంగళం
రహసిసంవిదో యాహృది స్పృశః
కుహకనో మనఃక్షోభయంతిహి

శ్లో॥ చలసియద్వ్రజాచ్చారయన్ పశూన్
నళినసుందరం నాథతేపదం
శిలతృణాంకురై స్సీదతీసః
కలిలతాం మనః కాంత గచ్ఛతి

శ్లో॥ దినపరిక్షయే నీలకుంతలైః
వనరుహానవం బిభ్రదావృతం
ఘనరజస్వలం దర్శయన్ముహుః
మనసినః స్మరం వీరయచ్ఛసి

శ్లో॥ ప్రణతకామదం పద్మజార్చితం
ధరణిమండనం ధ్యేయమాపది
చరణపంకజం శంతమంచతే
రమణనః స్తనేష్వర్పయాధిహన్

శ్లో॥ సురతవర్థనం శోక నాశనం
స్వరితవేణునా సుష్ఠుచుంబితం
ఇతరరాగ విస్మారణం నృణాం
వితర వీరనః తేఒధరామృతం

శ్లో॥ అటతి యద్భవానహ్ని కాననం
త్రుటి ర్యుగాయతే త్వామపశ్యతాం
కుటిలకుంతలం శ్రీముఖంచతే
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశాం

శ్లో॥ పతిసుతాన్వయభ్రాతృ బాంధవా
నతివిలంఘ్యతే హ్యచ్యుతాగతాః
రతి విద స్తవోద్గీత మోహితాః
కి తవయోషితః క స్త్యజేన్నిశి

శ్లో॥ రహసి సంవిదం హృచ్ఛయోదయం
ప్రహసి తాననం ప్రేమ వీక్షణం
బృహదురః శ్రియోధామ వీక్ష్యతే
ముహురతి స్పృహా ముహ్యతే మనః

శ్లో॥ వ్రజజనౌకసాం వ్యక్తి రంగతే
వృజినహంత్ర్యలం విశ్వమంగళం
త్యజమనాక్చనః త్వత్స్పృహాత్మనాం
స్వజనహృద్రుజాం యన్నిషూదనం

శ్లో॥ యత్తే సుజాత చరణాంబురుహం స్తనేషు
భీతాశ్శనైః ప్రియదధీమహి కర్కశేషు
తేనాటవీమటసి తద్వ్యథతేన కిం స్విత్
కూర్పాదిభిర్భ్రమతి ధీర్భవదాయుషాం నః

పై శ్లోకముల యర్థములు 184—187 పేజీల యందు చూడసగును.

అనుబంధము -- 2

# రుక్మిణీ సందేశము

శ్లో॥ శ్రుత్వాగుణాన్ భువన సుందర శృణ్వతాంతే
నిర్విశ్యకర్ణ వివరైర్హరతో ఽంగతాపమ్
రూపం దృశాం దృశిమతామఖిలార్థలాభం
త్వయ్యచ్యుతావిశతి చిత్తమపత్రపంమే

శ్లో॥ కాత్వాముకుంద మహతీ కులరూపశీల
విద్యావయోద్రవిణధామభిరాత్మ తుల్యమ్
ధీరాపతిం కులవతీ నవృణీతకన్యా
కాలే నృసింహ నరలోక మనోభిరామమ్

శ్లో॥ తన్మేభవాన్ ఖలువృతః పతిరంగజాయా
మాత్మార్పితశ్చ భవతోఽత్రవిభో విధేహి
మా వీరభాగ మభిమర్శతు చైద్య ఆరా
ద్గోమాయువన్మృగ పతేర్బలి మంబుజాక్ష

శ్లో॥ పూర్తేష్టదత్తని యమవ్రత దేవ విప్ర
గుర్వర్చనాది భిరలం భగవాన్ పరేశః
ఆరాధితోయది గదాగ్రజ ఏత్యపాణిం
గృహ్ణాతుమే నదమ ఘోషసుతాదయోఽన్యే

శ్లో॥ శ్వోభావిని త్వమజితో ద్వహనే విదర్భాన్
గుప్తస్సమేత్య పృతనా పతిభిః పరీతః

నిర్మథ్య చైద్యమగధేశ బలంప్ర సహ్య
మాం రాక్షసేన విధినోద్వహ వీర్యశుల్కామ్

శ్లో॥ అంతఃపురచరా మనిహత్య బంధూ
త్వాముద్వహే కథమితి ప్రవదామ్యు పాయం
పూర్వేద్యుర స్తిమహతీ కులదేవ యాత్రా
యస్యాం బహిర్నవవ ధూర్గిరిజాముపేయాత్

శ్లో॥ యస్యాంఘ్రి పంకజ రజస్నపనం మహాంతో
వాంఛంత్యుమాపతి రివాత్మ తమోపహత్యై
యద్యంబుజాక్ష నలభేయ భవత్ప్రసాదం
జహ్యామ్యసూ వ్రతకృశాత్ శతజన్మ భిస్స్యాత్

(వివాహయోగ్యలగు కన్యలు,నిత్యము వీనిని పఠించిన, త్వరలో వివాహము జరుగునని పెద్దల విశ్వాసము)

సూచిక : పై శ్లోకముల యర్థము 314, 315 పేజీలలో చూడనగును

సీ॥ ఏనీ గుణములు కర్ణేంద్రియములు సోక
దేహతాపంబులు తీరిపోవు
నేనీ శుభాకార మీక్షింప గన్నుల
కఖిలార్థ లాభంబుల మరుచుండు
నేనీ చరణ సేవలే ప్రొద్దు జేసిన
భువనోన్నతత్వంబు బొందగలుగు
నేనీల సన్నామమే ప్రొద్దు భక్తితో
దలచిన బంధసంతతులు వాయు

నట్టి నీ యందు నా చిత్తమనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణజూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకారమాని నీ చిత్తచోర

కా॥ ధన్యుల్లోక మనోభిరాము గుల విద్యారూపతారుణ్యసౌ
జన్య శ్రీబలదాన శౌర్య కరుణాసంశోభితుఁ—నిన్నునే
కన్యల్గోరరు కోరదేమును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ నా వలననే జన్మించెనే మోహముల్

ఉ॥ శ్రీయుతమూ ర్తియో పురుష సింహమ! సింహము పాలి సొమ్ముగో
మాయువు గోరుచందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ
ధ్యాయినినైయెననన్ను వడిదాగొని పోయెదనంచునున్న వా
డాయధమాధ ముండెఁబగడద్భుతమైన భవత్పరితాపముల్

మ॥ వ్రతముల్ దేవగురుద్విజన్మబుధ సేవల్ దాన ధర్మాదులుఁ—
గతజన్మంబుల నీశ్వరుఁ— హరిజగత్కల్యాణు గాంక్షించి చే
సితినేనిఁ—వసుదేవ నందనుడు నా చిత్తేశుడౌగాక, ని
ర్జితులైపోదురుగాక సంగరములో చేదీశ ముఖ్యాధముల్

ఉ॥ అంకిలి చెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లియో
పంకజనాభ నీవు శిశుపాల జరాసుతుల న్జయించినా
వంకకు వచ్చి రాక్షస వివాహమునఁ— భవదీయశౌర్యమే
యుంకువ జేసి కృష్ణపురుషోత్తమ చేకొని పొమ్ము వచ్చెదఁ—

సీ॥ లోపలి సౌధంబులోన వర్తింపంగ
దేవచ్చునే నిన్ను నేదెత్తునేని
కావలివారల గల బంధువుల జంపి
కాని తేరాదని కమలనయన
భావించెదేని యుపాయంబు సెప్పెద
నాలింపు కులదేవ యాత్ర జేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క
పెండ్లికిమునుపడు పెండ్లి కూతు

నెలమిమావారు బంపెదరేనునట్ల
పురము వెలువడియేతెంచి భూతనాథు
సతికి మ్రొక్కంగ నీవు నా సమయమంద
వచ్చికొని పొమ్ము నన్ననవార్య చరిత

మ॥ ఘనులాత్మీయత మోని వృత్తి కొరకై
గౌరీశు మర్యాదనె
వ్వని పాదాంబుజతోయమందు మునుగఁ
వాంఛింతురేనట్టి నీ
యనుకంపఁ విలసింపనేని, వ్రతచర్యఁ
నూరు జన్మంబులఁ
నిను జింతించుచు బ్రాణముల్ విడిచెదఁ
నిక్కంబు ప్రాణేశ్వరా

# శ్రీమద్భాగవత మహా పురాణము

## దశమస్కంధము (పూర్వార్థము)

### ప్రథమాధ్యాయము

**శ్రీ భగవానుడు భూదేవి నోదార్చుట— దేవకీ వసుదేవుల వివాహము— కంసునిచే దేవకీ తనయులార్వుర వధ**

పరీక్షిన్మహారాజు శ్రీ శుకయోగితో నిట్లు పల్కె. "స్వామీ, చంద్రసూర్య వంశజులగు రాజులయొక్క వంశ విస్తారమును తమ రద్భుతముగా వర్ణించితిరి. స్వభావసిద్ధముగ ధర్మాత్ములగు యదువంశవీరుల యొక్క చరిత్రమునుగూడ చక్కగ వివరించితిరి. ఆ యదువంశమునందే బలరామ సహితముగ నవతరించిన శ్రీకృష్ణభగవానునియొక్క పరమ పవిత్రమగు చరిత్రనుగూడ దయచేసి మాకు వినిపింప గోరుచుంటిని. ఆ శ్రీకృష్ణ భగవానుడు సర్వజీవులకు జీవనదాతయు,సర్వాంతర్యామి నై యున్నాడు. ఆ మహాత్ముడు యదువంశమునం దవతరించి యేమేమి లీల లొనర్చెనో వానిని మాకు వివరింపుడు, లోకమునందు జీవన్ముక్తులు, ముముక్షువులు విషయలోలురునని, జనులు మూడు రకములుగా నుందురు. అట్టి ముగ్వురును భగవానుని గుణగానము చేయుచునే యుందురు. జీవన్ముక్తులు ప్రేమాతిశయముచేతను, ముముక్షువులు భవరోగమునకు మందుగాను, విషయైషులు మనోభిరామ మగుటచేతను భగవానుని గుణసంకీర్తనము చేయుచుందురు.పశుహంతయు,ఆత్మహంతయు నగువాడు తప్ప మరి యే యితరుడు ఆ పుణ్యశ్లోకుని గుణానుకీర్తనము నందు విముఖుడై యుండును? ఆ శ్రీకృష్ణ భగవానుడు మా కులదైవము. కురుక్షేత్ర మందు, దేవతలనుగూడ నిర్జింపజాలినట్టి భీష్మాది అతిరథులుగల్గిన కౌరవసేనతో మా పితామహులగు పాండవులకు జరిగిన మహాభారత యుద్ధకాలమున, అపారపారావారమువలె నున్న కౌరవసేనా సమూహమందు, భీష్మ ద్రోణాదులు మహా తిమింగిలములవలె భీతి గొల్పుచుండ, మా పితామహులు, శ్రీకృష్ణభగవానుడను కర్ణధారుని సాహాయ్యముచే—సముద్రమును గోష్పదమువలె తరింపగల్గిరి! స్వామీ! యిపుడు మీయెదుట నున్న యీ నా శరీరము కురుపాండవ వంశములకు రెంటికిని యేకమాత్రమగు ఆధారము (వంశాంకురము) అశ్వత్థామయొక్క బాణాగ్నికి దగ్ధమగుచుండగా, మా తల్లి భగవానుని శరణువేడినది. అప్పుడా మహానుభావుడు చక్రము చేబూని, సూక్ష్మరూపమున మా తల్లి గర్భమున ప్రవేశించి గర్భస్థుడనగు నన్ను కాపాడినాడు. ప్రాణులందరి శరీరములయందును అంతర్యామి రూపముననుండి

వారిని రక్షించుచు, వెలుపల కాలరూపుడై యుండి మృత్యువును కల్పించుచునుండు నట్టి యా మాయా మానవరూపుడగు మహాత్ముని, మాధుర్య పరిపూర్ణములగు లీల లను వర్ణింప వేడుచుంటి.

మహాత్మా, సంకర్షణుడగు రాముడు రోహిణీ తనయుడని మీరు వచించి యుంటిరి. దేవకీతనయుల గణనయందుగూడ నతని పేరుదహరించితిరి. శరీరాంత రము లేకుండ నతనికి దేవకీగర్భ సంబంధమెట్లు కల్గినది? ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డ డెట్లయ్యె? ముకుందుడేల తండ్రి ఇంటినుండి వ్రజభూమికి తరలినాడు? యదు వంశ శిరోమణియు భక్తవత్సలుడు నగు భగవానుడు నందాదులతో నేయే ప్రదేశము అందు వసించినాడు? వ్రజభూమియందు, మధురయందు నతడెట్టి లీలల ప్రదర్శించి నాడు? తన తల్లికి సోదరుడగుటచే కంసుడు చంపగూడని వాడుగదా! అట్టి యాతని నేల వధించె? యాదవ సహితుడై మాయామానవ రూపమున భగవానుడు ద్వారక యందెన్ని వత్సరములుండె? ఆతనికి భార్యలెందరు? నేను తమను ప్రశ్నించినవే గాక, ఇతరములగు (నేనడుగని) లీలలనుగూడ, వివరముగా తెలుపవేడుచున్నాడ. ఏలనన, తమరు వాటినన్నిటిని తెలిసినవారు. నేనత్యంత శ్రద్ధతో వానిని వినగోరు చుంటిని. గనుక తమ ముఖ కమలమునుండి స్రవించుచున్న హరికథామృతమును పానము చేయుచున్న నన్ను,దుస్సహములగు ఆకలిదప్పులేమియు బాధించుటలేదు!" అని పలికె.

సూతుడు శౌనకునితో నిట్లు పల్కె

"భృగునందనా! భక్తాగ్రగణ్యుడును సర్వజ్ఞుడునగు శ్రీ శుకుడు, విష్ణురాతుని యొక్క సాధువాదమును విని సంతసించినవాడై, యాతనిని ప్రశంసించి, కలిమల ముల దొలగించు కృష్ణలీలలను పలుక ప్రారంభించె"

శుకమహర్షి చెప్పుచుండె. "ఓ రాజర్షీ! వాసుదేవకథా శ్రవణమునందు నీకు గలిగిన నిశ్చయాత్మక బుద్ధి చాల సుందరము, ఆదరణీయమునైనది. భగవానుని కథా సంబంధమగు ప్రశ్న, ముప్పురిని—అనగా, ప్రశ్నించు వానిని, చెప్పువానిని, వినువానిని-పవిత్రుల నొనర్చును. హరిపాదోద్భవయగు గంగ సర్వజనులను పునీ తుల చేయుచున్నటులనే హరికథయును పవిత్రుల నొనర్చును

దైత్యసమూహములు గర్వితరాజరూపముల ధరించి భూమినంతయు నాక్ర మించి యుండగా, భూదేవి వారి భారమును భరింపలేక, రక్షణకొరకై బ్రహ్మను శరణు జొచ్చినది. గోరూపము దాల్చి, కనులనీరు నించుచు తనవద్దకు వచ్చి దీన ముగా విలపించుచున్న భూదేవి తన కష్టగాథను సకరుణముగ బ్రహ్మదేవునకు విన్నవించుకొనగా, నతడు సానుభూతితో నాలించిన పిమ్మట శంకరుని, యితర దేవతల కొందఱిని వెంటనిడుకొని, గోరూపధారిణియగు భూదేవితో గూడినవాడై,

క్షీరసాగర తీరమును జేరి యచట శేషశయ్యపై నివశించియున్న జగన్నాధుని పురుషసూక్తముచే స్తుతించె, పరమపురుషుని స్తుతించుచునే బ్రహ్మసమాధిలోనికి వెళ్ళినాడు. సమాధియందతనికి భగవద్వాణి వినిపించినది. అది విన్న వెంటనే సమాధినుండి లేచిన పరమేష్టి దేవతలను గాంచి యిటుల పల్కె.

"దేవతలారా, నాకు భగవద్వాణి వినిపించినది. దానిని నాద్వారా మీరాలించి, యాప్రకారము చేయుడు ఆలపించకుడు. విష్ణుభగవానునకు, ధరాదేవికి కలిగిన కష్టము పూర్వమే తెలిసియున్నది. ఆతడు దేవదేవుడు ఆ మహాత్ముడు తన కాల శక్తిద్వారా భూభారము హరించువరకు, మీరందరును మీ మీ యంశలతో యదు కులమునందు జన్మించి, యతని లీలలందతనితో సహకరించుడు. ఆ పరమ పురు షుడు వసుదేవుని గృహమందవతరించగలడు. వారిని పూజించి సేవించుటకై దేవతా స్త్రీలుగూడ భూలోకమున జన్మింతురుగాక. భగవదంశయుక్తస్వప్రకాశుడునగు అనం తుడు (ఆదిశేషుడు) గూడ, భగవానునికంటె ముందుగనే అతని యగ్రజుడుగ జన్మించగలడు,జగత్తునంతను మోహింపజేయునట్టి భగవతియగు విష్ణుమాయ(యోగ మాయ) భగవానునిచే నాదేశింపబడినదై లీలాకార్యసాధనకై జన్మించగలదు.''

శ్రీశుకుడు : ఈ విధముగా దేవతల నాదేశించి పితామహుడు, అనునయ వాక్యములచే ధరాదేవి నాశ్వాసించి,తన లోకమునకు వెడలిపోయెను.

పూర్వకాలమున యదువంశమునందు శూరసేనుడు ప్రభువుగనుండె. అతడు మధురానగరమునందుండి మధురా శూరసేనదేశముల పాలించుచుండె. ఆ సమయ మందు మధురయే యదువంశరాజులకు రాజధానిగనుండె.శ్రీహరి యా నగరమందు నిత్యము సన్నిహితుడై యుండును.

ఆ నగరమందొకప్పుడు శూరుని తనయుడగు వసుదేవునికి వివాహము జరిగి నది. నూతన వధువగు దేవకితో గూడి తన గృహమునకు వెళ్ళుటకై రథము నధి రోహించగా, ఉగ్రసేనుని తనయుడగు కంసుడు తన చెల్లెలగు (పినతండ్రి కుమార్తె దేవకికి ప్రీతిగలిగించువాడై, యా రథ పగ్గములను తాను స్వీకరించి సార థ్యము వహించెను. దేవకి తండ్రియగు దేవకుడు తన ప్రియ పుత్రిక నత్తవారింటి కనుపు సమయమున నామె కరణముగ, కనకహారాలంకృతములగు నాల్గు వందల కరులను, పదునైదువేల గుర్రములను, పదునెన్మిదివేల రథములను, సుందర వస్త్రభూషణాలంకృతలగు రెండువందలమంది సుకుమారులగు దాసీ జనమును సమ ర్పించినాడు. ప్రయాణ సమయమున మంగళతూర్య ధ్వనులు మార్మోగినవి.

వధూవరుల రథము సాగుతుండగా, పగ్గముల పట్టి రథము నడుపుచున్న కంసునుద్దేశించి, యశరీర వాణి యిట్లు పల్కినది.

"ఓరీ మూర్ఖా, నీవు యే చెల్లెలిని రథమునందు గూర్చుండబెట్టుకొని పోవుచుంటివో, ఆమె యష్టమ గర్భము నీకు మారకమగును" ఆ పలుకులు వినుటయే తడవుగ, దుష్టుడును, భోజకులపాంసనుడునగు కంసుడు కత్తిదూసి, దేవకిని జుట్టు బట్టుకొని వధింప నుద్యుక్తుడాయెను. వాడత్యంత క్రూరుడు. పాపకర్మలొనర్చుటకు సిగ్గిలడు.క్లిష్టపరిస్థితిని గమనించిక మహాత్ముడగు వసుదేవుడు, కంసుని శాంత పరచుటకై యిట్లు పల్కె.

"రాజకుమారా, భోజవంశ యశస్సు నినుమడింప జేయగల వంశోద్ధారకుడవగు నీవు క్రొత్త పెండ్లి కొమరితయగు నీ సోదరిని వధించి నీ కీర్తినేల కళంకిత మొనర్చుకొనియెదవు? పుట్టిన ప్రతి ప్రాణికిని మృత్యువుగూడ పుట్టుకతోడనే పుట్టుచున్నది. నేడో రేపో నూరేండ్ల పిమ్మటనో ప్రాణులకు మృత్యువు నిశ్చయమైయున్నది. శరీరము పడిపోవునప్పుడు జీవుడు తన కర్మానుసారము లభ్యమగు మరియొక శరీరమును స్వీకరించి పూర్వశరీరమును త్యాగమొనర్చును. అవశుడై యాతదట్లొనర్చును,మానవుడు నడచునపుడు ముందుపాదముతో నేలను నొక్కి పెట్టి వెనుకపాదమును లేపునట్లుగను, తృణజలూకము (గడ్డిపురుగు) తనముందుకాళ్ళతో ముందరనున్న ఆకును పట్టుకొని వెనుకకాళ్ళను లేపు విధముగను, జీవుడును తన కర్మ గతి ననుసరించి పయనించును. జాగ్రదవస్థలో మానవుడు భోగైశ్వర్యములను మనసా స్మరించుచు తన్మయత్వమునందును నిద్రలో నట్టి స్వప్నములచే గాంచుచు తన దరిద్రస్థితిని మరచుచుండును. ఒక్కొక్కప్పుడు మేల్కొనియున్నపుడే యట్టి స్వప్నముల గాంచుచు స్నేహమును మరచిపోవుచుండును.అటులనే జీవుడు కర్మకృతములగు కోరికలను 'కోరికల కనుగుణములగు కర్మలకును వశుడై మరియొక శరీరమును పొందినవాడై, తన పూర్వ శరీరమును మరచిపోవును. జీవుని మనస్సు అనేక వికారముల సముదాయము· దేహాంత సమయమందు జీవుడు తన యనేక జన్మ సంచితములైన కర్మలయొక్కయు, ప్రారబ్ధ కర్మలయొక్కయు వాసనలకు వశుడై, మాయాకల్పితములైన యనేక పాంచభౌతిక శరీరములందేదో యొక శరీరమును స్మరించుచు, తన్మయుడై పోయి, యట్టి శరీరముచే గ్రహించి జన్మించుట తటస్థించును. ఏ విధముగా సూర్యచంద్రాది జ్యోతిస్సులు, జలపాత్రలయందు ప్రతిబింబించి, వాయువశమున జలము కదలుచుండగా, ప్రతిబింబములును కదలుచున్నట్లు భ్రమ కలిగించునో, అటులనే తన స్వరూపమును తెలియకపోవుటద్వారా కలిగిన (మాయా) శరీరమందు రాగము పెంపొందించుకొని, భ్రాంతుడై, శరీరములు పుట్టుచు,గిట్టుచుండుటను, తన గమనాగమనములుగాభావించుకొనుచుండును. కావున శ్రేయోభిలాషియగు మానవుడు యెవరికిని ద్రోహము చేయరాదు. ఎందుకనగా, అట్టివాడు తాను జీవించియున్నప్పుడు శత్రుభయమును, మరణానంతరము

పరలోకభయమును పొందవలసివచ్చును. కంసా, యీ నీ చిన్నిచెల్లెలు యింకను పిన్న వయసున నున్నది. దీనురాలైయున్నది. పుత్రీసమానురాలు. అందునను క్రొత్తపెండ్లి కూతురు. వివాహమంగళ చిహ్నములింకను ఆమె శరీరమునుండి తొలగిపోలేదు. కాన యిట్టి దశలో దీనవత్సలుడగు నీవంటి పురుషుడీమెను వధించుట యుచితము గాదు."

"మహారాజా, యీ ప్రకారముగా వసుదేవుడు ప్రశంసాపూర్వకములును, సామనీతి భేదనీతియుతములునగు వాక్యములచే ననునయించినను, రాక్షసాంశా సంభూతుడగు కంసుడు తన క్రూర సంకల్పమును విడనాడడాయె. వానిమొండిపట్టు దలను కనిపెట్టిన వసుదేవు డప్పటి కేదోవిధముగ ముప్పుదప్పించుకొన నిశ్చయిం చిన వాడై యిట్లు తలచెను. "బుద్ధిమంతుడు తన బుద్ధిబలములకు సాధ్యమగునంత వరకు చావు తప్పనిచో, ప్రయత్నించువాని దోషముండదు. కావున ప్రస్తుతము మృత్యురూపముననున్న కంసునకు మా పుత్రుల నర్పించెదమని మాట యిచ్చి యీ దీనురాలగు దేవకిని బ్రతికించుకొనియెద. నాకు సుతులు జన్మించి, అప్పటివరకు మృత్యురూపియగు కంసుడు మరణింపకున్నచో నేమగును? ఏమో! ఏమగునో, నా కుమారుడే యతనిని చంపినను చంపవచ్చును. ఏలనన, ఈశ్వర సంకల్ప మెటులుండునో యెవ్వరెరుగుదురు? దగ్గరకు వచ్చిన మృత్యువుగూడ తప్పి పోవచ్చును. తప్పినదనుకొన్న మృత్యువుగూడ తిరిగి రావచ్చును. అడవియందగ్ని ప్రమాదము సంభవించినప్పుడు, అగ్నికి సమీపమునందున్న చెట్లు మండకుండ టయు, దూరముననున్న తరువులు దగ్ధమగుటయు సంభవించును. అంతయు నదృ ష్టముపై నాధారపడియున్నది. అటులనే జీవునకు శరీర సంయోగ వియోగములకు కారణము తెలియరాకుండును."

అని యీ విధముగ విచారించి, వసుదేవుడా పాపాత్ముని మిక్కిలి ప్రశం సించె. మనసునందు బాధపడుచుండియు వికసిత వదనుడై వసుదేవుడు కంసునితో నిట్లు పలికె.

"సౌమ్యుడా, నీకు దేవకివలన నెట్టి భయము లేనటుల ఆకాశవాణి మాటల వలన తేటతెల్ల మేగదా! ఆమె పుత్రులవల్లనే గదా నీకు భయము. ఆమెకు పుట్టిన బిడ్డలనందరను నేను నీకు సమర్పించెదను."

వసుదేవుడు సత్యప్రతిజ్ఞుడు, అను విషయము కంసునకు తెలియును. అంతియే గాక యతడాడిన పల్కులు యుక్తియుక్తములుగ నున్నవి. అందుచే కంసుడు భగినీ హత్యాప్రయత్నమును మానివెడలిపోయె. వసుదేవుడు కంసుని ప్రశం సించుచు నూతన వధూ సహితముగ తన గృహమును ప్రవేశించె.

దేవకీదేవి మహాపతివ్రత. సత్వదేవతామయురాలు కాలానుసారముగ నామె యెనిమిదిమంది పుత్రులను, కొమరితనొకదానిని, సంవత్సరమున కొక్కరి చొప్పున కన్నది. మొదటి పుత్రుని పేరు కీర్తిమంతుడు. అతడు పుట్టగనే వసుదేవుడాతని గొనివచ్చి కంసునకు సమర్పించె. అతనికది భరింపరానిదైయెనను, తన సత్య సంధతకు భంగము వాటిల్లుట కష్టతరముగాన కుమారుని కంసునకు సమర్పించినాడు. దుర్మార్గులెట్టి నీచకార్యమునైనను చేయుటకు వెనుకాడరు. జితేంద్రియులు, భగ వంతుని హృదయమునందు స్థిరముగ నిల్పుకొనిన మహాత్ములెట్టి త్యాగమునకైనను సిద్ధపడియెదరు, దేనియందును వారి కాసక్తి యుండదు. తన పుత్రుని జీవన్మరణ ముల యందు కల వసుదేవుని సమభావమును గమనించిన కంసుడు, అతని సత్య సంధతకు మెచ్చి, ప్రసన్నుడై మందహాసమొనర్చుచు "వసుదేవా, నీవీ సుకుమారుని గొని పొమ్ము, వీని వలన నాకెట్టి భయమును లేదు. దేవకి యొక్క యెనిమిదవ సంతానము వలన గదా నాకు మృత్యువు కల్గునని యాకాశవాణి పల్కినది!" అని వచించగా, వసుదేవుడు 'వల్లె' యని పుత్రునింటికి గొనిపోయెను. కాని, కంసుడు పరమ దుష్టుడనియు, అతని మనస్సతనికి వశమైయుండదనియు అది యే క్షణ మందైనను మారిపోవచ్చుననియు వసుదేవునకుతెలియును. అందుచే కంసుని పలుకుల నతడు విశ్వసించలేదు.

ఒకనాడు నారదుడు కంసుని వద్దకేతెంచి, కంసునితో "వ్రజమండలమందు వసించుచున్న నందుడు మొదలగు గోపాలకులును వారిస్త్రీలును, వృష్ణి వంశీయులగు వసుదేవాది యాదవులును, దేవకి మొదలగు యాదవవనితలు వారి బంధువులును అందరును దేవతలే. నిన్ను సేవించుచున్న బంధుసుహృదులు గూడ దేవతలే, భూమికి భారముగా నున్న దైత్యులందరిని సంహరించుటకు దేవతలు ప్రయత్నించు చున్నారు." అని చెప్పి వెడలిపోయె.

ఆ మాటలతో కంసునికి యాదవులందరు దేవతలేయనియు, దేవకీ గర్భ మందు తనను వధించుటకై విష్ణుభగవానుడే యవతరించుచున్నాడనియు నిశ్చయము కలిగినది. అందుచే నారదుడు వెళ్ళిన పిమ్మట దేవకీ వసుదేవులనాతడు శృంఖలా బద్ధుల గావించి కారాగారము నందుండినాడు. వారికి పుట్టిన బిడ్డలందరిని, విష్ణువే జనించి యుండునను శంకతో వధింప మొదలిడినాడు కంసుడు. తన ప్రాణములనే పోషింప జూచుకొనువాడు, యీ భూమియందు, స్వార్థమునకై తమ తల్లిదండ్రు లను బంధువర్గమును, ప్రియ మిత్రులను గూడ వధించుచుండుట తఱచుగా మనము చూచుచునే యున్నాము. తాను పూర్వము విష్ణు భగవానునిచే చంపబడిన కాలనేమి యను మహాసురుడనని యెఱిగియే, యాదవులందరితో తీవ్ర విరోధము గలిగి యుండె. కంసుడు మహాబలవంతుడు. తన తండ్రియగు ఉగ్రసేనుని చెరయందుంచి శూర సేనదేశముల తానే పరిపాలింప దొడగె.

# ద్వితీయాధ్యాయము

## భగవానుడు దేవకీ గర్భగతుడగుట—
## దేవతులందరు గర్భ స్తోత్రము చేయుట

శ్రీ శుకమహర్షి చెప్పుచున్నాడు:

"పరీక్షిన్మహారాజా, కంసుడు తాను స్వయంగా మహాబలవంతుడు. అతనికి, ప్రలంభాసుర, బకాసుర, చాణూర, తృణావర్త, అఘాసుర, ముష్టిక, అరిష్టాసుర, ద్వివిద, పూతన, కేశి, ధేనుకాది రాక్షసులును, బాణాసుర, నరకాసురాది రాక్షస రాజులు సహాయకులుగ నుండిరి. మగధరాజగు జరాసంధుని యండ గూడ నతనికి కలిగియుండె. అందుచే, మహాబలియగునతడు యదు వంశీయులతో కదన మాచరించుచుండె. అందుచే భయభీతులైన యాదవులు మగధ రాజ్యమును వదలి కురు, పాంచాల, కేకయ, శాల్వ, విదర్భ, నిషధ, విదేహ, కోసలాది దేశములకు పారిపోయి యచట వసించుచుండిరి. అటుల వెళ్ళలేని కొందరు, కంసుని యింగితము ననుసరించి ప్రవర్తించువారివలె నటించుచు, యతనికి సేవచేయుచు నుండిపోయిరి.

దేవకికి కలిగిన యార్గురు శిశువులను కంసుడు వధించినాడు. దేవకి యొక్క యేడవ గర్భమందు భగవదంశయేయగు అనంతుడు (ఆదిశేషుడు) ప్రవేశించినాడు. అది దేవకికి హర్షశోక వివర్ధన కారణమైనది. అనంతుడు ప్రవేశించినందున హర్షము, యీ శిశువు గూడ కంసునిచే వధింపబడునుగదా యని శోకము కల్గె.

విశ్వాత్ముడగు నిష్ణుభగవానుడీ విషయమును, అనగా తన భక్తులగు యాదవులకు కంసునివలన కలుగుచున్న భయమును గ్రహించినవాడై, తన యోగ మాయా దేవి నీ విధముగ నాదేశించినాడు.

"దేవీ, గోపగో బృందములచే విరాజమానమగు వ్రజమండలమునకు పొమ్ము నందగోకులమందు, వసుదేవుని భార్యయగు రోహిణీదేవి వసించుచున్నది. వసుదేవుని యితర భార్యలు గూడ నటులే కంసభీతిచే వేర్వేరు ప్రదేశములందు రహస్యముగ వసించుచున్నారు. ప్రస్తుతము దేవకీ గర్భమందు నాయంశయే యగు శేషుడు ప్రవేశించియున్నాడు. ఆ గర్భమును నీవు సంకర్షణ మొనర్చి రోహిణి యుదరమందు ప్రవేశపెట్టుము. పిమ్మట నేను నా శక్తులన్నిటితో గూడ పరిపూర్ణ రూపమున దేవకీ పుత్రుడుగా నవతరించెద. నీవు నందుని భార్యయగు యశోదాదేవి యందు జన్మింపుము. మనుజులందరు నిన్ను సర్వకామ ప్రదాయినివగు యీశ్వరిగా భావించి

తమ యభీష్టసిద్ధికై, ధూపదీప నైవేద్యాదులతో పూజింపగలరు. జనులు భూమియందు నీ కనేక ఆలయములు నిర్మించి, దుర్గా, భద్రకాళి, విజయా, వైష్ణవీ, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యా, మాయా, నారాయణీ, ఈశానీ, శారదా, అంబికా మొదలగు నామముల గల్పించి పూజించెదరు. గర్భము సంకర్షింపబడుటచే శేషునకు సంకర్షణుడనియు, లోకరంజకుడగుటచే రాముడనియూ, బలవంతులలో శ్రేష్ఠుడగుటచే బలుడనియు పేర్లు కల్గును.

భగవానుడారీతి యాదేశింపగా సతనీ యానతిని తలదాల్చి యోగ మాయాదేవి యాతనికి ప్రదక్షిణ గావించి, భూలోకముచేరి, యటులే నిర్వర్తించినది. ఆమె దేవకీ గర్భమును రోహిణీదేవియందు ప్రవేశపెట్టగా, దేవకీదేవికి గర్భస్రావమైనదని పురవాసులు దుఃఖించిరి.

భక్తులకభయ మొసంగునట్టియు, సర్వవ్యాపియునగు భగవానుడు తన సమస్త కళలతో వసుదేవుని మనమునందు ప్రవేశించె. దివ్యజ్యోతి ప్రవేశముచే వసుదేవుడు సూర్యతేజస్సుతో వెలుగొందసాగె. లోకులాతని తేజి చూడలేకుండిరి. తూర్పుదిక్కు చంద్రుని ధరించిన విధముగా, దేవకిదేవి జగన్మంగళకరమగు అమృతాంశమును మనసా వసుదేవుని వలన గ్రహించినది. శుద్ధసత్త్వగుణోపేతయగు దేవకి, సర్వాత్మయు, ఆత్మ స్వరూపుడునగు పరమాత్మను ధరించినది. భగవానుడు సర్వ జగత్తునకు నివాసస్థానము. అట్టి వానికి దేవకీదేవి నివాసస్థానమైనది. ఆ యానంద మామె యనుభవించుచున్నను, కంసకారాగారమందు బంధింపబడి యుండుటచేత నామె సర్వజనుల కాహ్లాదకారిణి కాలేకపోయినది. ఘటమందున్న దీపమువలెను, తన విద్యను యితరులకు పంచిపెట్టనట్టి జ్ఞానబాలుని శ్రేష్ఠ విద్య వలెను, దేవి యందున్న యా తేజస్సు యితరులకు ఆహ్లాదము కలిగించజాలక పోయినది. దేవకీ గర్భమందు వైకుంఠుడు విరాజమానుడగు చుండుటచే నామె ముఖమందు దివ్య తేజస్సు వెల్లివిరిసినది. దానిచే ఆ కారాగారము దేదీప్యమానముగ ప్రకాశించినది. అది గాంచిన కంసుడు తన మనమందిట్లు తలపోసినాడు. "ఈ మారు నా ప్రాణాంతకుడగు విష్ణువే యీమె గర్భమందు ప్రవేశించియుండుట నిక్కవము. ఏలననగా, యింతకు పూర్వమీమె యెప్పుడును యింతటి దీప్తితో నుండలేదు. ఇప్పుడు శీఘ్రముగా నేనేమి చేయవలయును! దేవకిని సంహరించుట యుచితముగాదు. ఎందుచేతననగా, వీరపురుషుడెన్నడును తన స్వార్థమునకై యొక వనితను వధించి తన పరాక్రమమునకే కళంక మాపాదించుకొనరాదు గనుక. ఈమె స్త్రీయేగాక నాకు సోదరి. మీదు మిక్కిలి గర్భవతి. అందుచే ఈమెను చంపినచో నా యశస్సు, ఐశ్వర్యము, ఆయువు సర్వము క్షీణించిపోవును. అట్టి మనుజుడు జీవించియున్నను చచ్చినవానితో సమానుడే యగును. వాడు మరణించిన పిదప వానిని జనులు మిక్కిలి నిందించెదరు. అంతియేగాడు అట్టి దేహాభిమాని యంతమున, అందతామిస్రమను నరకకుండమున

జకుట తథ్యము" అని యీప్రకార మాలోచించి కంసుడు, దేవకిని సంహరింప సమర్థుడయ్యు, తన క్రూరసంకల్పమును విరమించుకొనియె. ఇక, భగవానుడెప్పుడు జన్మించునాయని యెదురుజూచుచు, హరియందు బద్ధవైరుడైయుండె. కూర్చున్నను, తిరుగుచున్నను, భుజించుచున్నను, త్రాగుచున్నను, నిద్రాజాగ్రదవస్థలయందును, సర్వకాలసర్వావస్థలయందును, వానికి శ్రీకృష్ణుని గురించిన చింతన వీడకుండె, జగత్తంతయు నతనికి శ్రీకృష్ణమయమైనది.

కైలాసమునుండి శంకరుడును, సత్యలోకమునుండి బ్రహ్మయు, వారి ననుసరించి యనుచర సహితముగా సర్వదేవతలును, నారదాది మహర్షులును ఆ చెరసాలకేతెంచి, దేవకీ గర్భస్థుడగు శ్రీహరి నిట్లు స్తుతించ నారంభించిరి.

శ్లో. సత్యవ్రతం సత్యపరంత్రిసత్యం
సత్యస్యయోనిం నిహితంచసత్యే
సత్యస్యసత్యమృతసత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణంప్రపన్నాః

ప్రభూ! నీవు సత్యసంకల్పుడవు. సత్యమే నిన్ను పొందుటకు ఉత్తమమగు సాధనము. సృష్టికి పూర్వమందును, ప్రళయానంతరమందును, స్థితికాలమందును— యీ అసత్యదశల యందెప్పుడును నీవున్నావు. పృథివ్యాపస్తేజో వాయురాకాశములను పంచభూతముల సత్యత్వము (ఉనికి)నకు నీవేకారణము. వానియందు తర్యామి రూపమున ప్రకాశించుచున్నదియు నీవే. ఈ కనుపించుచున్న సమస్త జగత్తునకు పరమార్థ స్వరూపుడవు నీవే. సూనృతవాణి (ఋత) సమదర్శనముల ప్రవర్తింపజేయువాడవు నీవే. ఈ విధముగ సత్యాత్మకుడవగు నిన్ను మేము శరణువేడుతున్నాము.

ఈ ప్రపంచమనునది యొక సనాతనమగు మహావృక్షము. దీని కాధారము ప్రకృతి యొక్కటియే, సుఖదుఃఖములనునవి దీనికి రెండు ఫలములు. త్రిగుణములు దీనికి మూలములు (వ్రేళ్ళు) ధర్మార్థకామమోక్షములను నాల్గుపురుషార్థములు దీనికి రసములు. పంచజ్ఞానేంద్రియములు దీనిని తెలుసుకొను సాధనములు. దీనికి ఆరు స్వభావములు గలవు. అవి యేవనగా, పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, మార్పుచెందుట, తఱుగుట, నశించుట యనునవి (షడ్వికారములు). శోక మోహములు ఆకలిదప్పులు, జరామరణములు అను షడూర్ములు లేక ఆరు కోశములైనను గావచ్చును.

చర్మము సప్తధాతువులు. (త్వక్, రుధిర, మాంస, మేదో, అస్థి, మజ్జా, శుక్రములు). దీనికి కొమ్మలెనిమిది. అవి, పంచమహాభూతములు, మనస్సు బుద్ధి అహంకారములనునవి. దీనికి నవద్వారములు, అనగా తొమ్మిది రంధ్రములున్నవి.

ప్రాణాపానవ్యానోదాన సమానములను పంచప్రాణములు, నాగకూర్మకృకరదేవదత్త ధనంజయములను ఉపప్రాణములు నను నవి, యీ వృక్షమునకు పది పత్రములు. సంసారరూపమగు యీ వృక్షముపై జీవేశ్వరులను రెండుపక్షులున్నవి. ఈ సంసార వృక్షోత్పత్తికి యేకమాత్రమగు ఆధారము నీవేయైయున్నావు. నీయందే యిది లయించుచున్నది. మరియు నీ యనుగ్రహముచేతనే యిది రక్షింపబడుచున్నది. ఎవరి చిత్తములు నీ మాయచే మోహితములైయున్నవో, వారీ సత్యమును గ్రహింప లేక, యీ యుత్పత్తి స్థితిలయములగు బ్రహ్మాది దేవతలనేకులు కారణమని భావించు చున్నారు. తత్త్వజ్ఞాని యగువాడు సమస్తమునందును నిన్నే గాంచును. నీవు జ్ఞాన స్వరూపమగు ఆత్మవు. చరాచర జగత్తును సంరక్షించుటకై నీవనేక రూపములు ధరించుచుందువు. అట్టి నీ రూపములు అప్రాకృతములు విశుద్ధ సత్త్వమయములై యుండి సత్పురుషుల కత్యంత సుఖావహములై యుండును. దురాత్ముల కవి భయ ప్రదములై యుండును. పుండరీకాక్షా, కొద్దిమంది మహాత్ములు మాత్రమే, సమస్త జగత్తునకు ఆధారమగు నీ రూపమును యేకాగ్రచిత్తులై ధ్యానించుచు, నీ చరణ కమలరూపమగు నావ నాశ్రయించి, యీ సంసార సాగరము గోష్పదమువలె తరిం చెదరు. నీ భక్తజనులు సమస్త ప్రపంచమును నిష్కపటముగ ప్రేమించుచు హిత మును గల్గించువారలై యుందురు. వారు తాము స్వయముగ యీ భవార్ణవమును తరించుటయేగాక, యితరులనుగూడ తరింపజేయుటకై, యిచట నీ చరణ కమల ములను నావను స్థాపించి పోవుచుందురు. సత్పురుషులపై నీకుగల దయయపారము. కమలాక్షా, యెవరు నీ చరణకమలముల నాశ్రయింపకుందురో, భక్తి భావ శూన్యులై యున్నందున యెవరిబుద్ధి మలినమై యుండునో, వారు తాము ముక్తుల మని యసత్యభావన కల్గియుందురు, వారు యేదో తపస్సు నాచరించి కష్టము మీద యున్నతపదవి నందుకొన గల్గినను, అచటినుండి వారతి శీఘ్రముగనే పతనము చెందెదరు. కాని నీ నిజభక్తులు నీ పాదములందనవరత లగ్నమానసులైయుండు కారణముచే, జ్ఞానాభిమానులవలె తమ సాధనమార్గమునుండి పతితులుగారు. ఎట్టి విఘ్నములును వారి సాధన నడ్డగింపజాలవు. నీచే రక్షితులగుచు వారు నిర్భయ ముగా చరించెదరు.

ఈ సమస్త ప్రపంచము రక్షించుటకు (పాలించుటకు) దేహధారులందరికి శుభము కల్గించుటకునై, నీవు విశుద్ధసత్త్వమయము, సచ్చిదానందమయమునగు నీ దివ్యమంగళ విగ్రహమును వ్యక్తము చేయుచుందువు. అట్టి రూపమును ప్రకటించుట చేతనే, నీ భక్తులు, వేదోక్తకర్మలను, యోగము, తపస్సు, సమా ధులను ఆచరించుటద్వారా, నిన్నారాధించుచున్నారు. ఆలంబనా రహితమగు నారాధన వారెట్లు చేయగలరు? సర్వమునకు నీవు విధాతవు. నీయీ విశుద్ధ సత్త్వమయస్వరూపమే ప్రకటముగాకున్నచో, అజ్ఞానము, దాని కార్యమగు భేద

భావమును నశింపజేయునట్టి అపరోక్షజ్ఞాన మెవరికిని కలుగకనేయుండును. జగత్తు నందు కనుపడుచున్న త్రిగుణములును నివియే. అవి నీ వలననే ప్రకాశింపబడు చున్నవి. ఇది సత్యము. కాని యీ బుద్ధ్యాదిగుణ ప్రకాశకవృత్తులచేతనే నీ స్వరూప మనుమానింప (ఊహింప) బడుచున్నదేకాని నీ యధార్థ స్వరూప సాక్షాత్కారము లభించుటలేదు. నీ స్వరూప సాక్షాత్కారము, నీ విశుద్ధసత్త్వమయ స్వరూపము నారాధించి నీ యనుగ్రహము పొందిననేగాని కలుగదు. మనస్సు, వేదవాక్కుల ద్వారా నీ స్వరూపము అనుమానింప బడుచున్నది. ఏలననగా, నీవు వానిచే తెలియ బడువాడవుగావు. వానికి సాక్షివి. అందుచే నీ గుణ జన్మ కర్మాదుల ద్వారా నీ నామ రూప నిరూపణ చేయబడజాలదు. అయినను, నీ భక్తులు తమ ఉపాసన ద్వారా నీ సాక్షాత్కారమును పొందుచునే యున్నారు. ఏ మానవుడు నీ మంగళమయము లగు నామరూపములను, వినుట, కీర్తించుట, స్మరించుట, మరియు ధ్యానించుట చేయుచు, నీ పాదకమల సేవ యందే తన చిత్తమును లగ్నమొనర్చుచున్నాడో, వాడు మరణానంతరము తిరిగి జనన మరణ రూపమగు యీ సంసార చక్రమందు పడు నవసరముండదు. సమస్త దుఃఖములను హరించు సర్వేశ్వరుడవు నీవు. ఈ పృథివి నీ పాదము. నీవవతరించుటచే యీ భూమి యొక్క భారము దూర మైనది. ప్రభూ, నీ చరణ కమలముల యొక్క సుందర చిహ్నములచే విభూషిత మగు పృథివిని చూడ గలుగుదుము. ఇది మాయదృష్టము. నీ కృపచే స్వర్గలోకము గూడ కృతార్థము కాగలదు. ప్రభూ, నీవు జన్మలేని వాడవు. అట్టి నీవు పుట్టినట్లు కనుపించుట నీ లీలా వినోదమనియే మేమూహించుచున్నాము. నీవు సర్వాధిష్ఠాన రూపుడవు. జగదుత్పత్తి స్థితిలయములు అజ్ఞానముచే నీయందారోపింపబడినవేగాని వాస్తవముగ లేవు. మత్స్య, కూర్మ, హయగ్రీవ, వరాహ, నారసింహ, హంస, వామన, పరశురామ, రామాద్యనే కావతరముల దాల్చి, మమ్ములను, ముల్లోకములను యిదివరలో కాపాడి యుంటివి. అట్లే యిప్పుడును భూభారమును దీర్చుము, యదు నందనా నీకు వందనము" అని జగన్నాథుని నుతించిన యనంతరము, బ్రహ్మాది దేవతలు దేవకీదేవితో నిట్లు పల్కిరి.

"తల్లీ, మమ్ములనందరిని యుద్ధరించుటకై సాక్షాత్తు పరమ పురుషుడే తన సర్వశక్తులతో నీ కుక్షిగతుడై యుండుట యెంతయు సంతోషదాయకము. నీవి పుడు కంసుని గూర్చి లేశమాత్రమును భయపడనవసరములేదు. వాడిపుడు మృత్యు ముఖమందున్నాడు. నీబిడ్డడు యదువంశ రక్షకుడు కాగలడు" అని పల్కిరి.

పరీక్షన్మహారాజా, బ్రహ్మాదిదేవతలు, దేవకీ గర్భస్థుడగు పరమాత్ముని యిద మిత్థమని నిశ్చయింపరాని స్వరూపముగల వానిని తమకు తోచిన విధముగా స్తుతించి, తమతమ నెలవులకు వెడలిపోయిరి.

# మూడవ యధ్యాయము

## శ్రీ కృష్ణ భగవానుడవతరించుట

రాజా, సర్వశుభ గుణయుక్తమగు పరమశోభన ముహూర్త మాసన్నమైనది. రోహిణీ నక్షత్రము, ఆకాశము నందలి సర్వగ్రహ నక్షత్రములతో సౌమ్యముగా నున్నది.

---

**హిందీ వ్యాఖ్యలోని విశేషము :**

శుద్ధమైన యంతః కరణమందు భగవదావిర్భావము జరుగును. శ్రీ కృష్ణావతార సమయమందు అటులనే సమష్టి శుద్ధత్వము యొక్క వర్ణన చేయబడినది. ఇందు సాధకుని కొరకై, కాలము, దిశలు, పృథివి, జలము, అగ్ని, వాయువు ఆకాశము, మనస్సు, ఆత్మ అను తొమ్మిది ద్రవ్యములను వేర్వేరుగా పేర్కొనుచు మిక్కిలి యుపయుక్తమగు సాధన పద్ధతి యొక్క సంకేతమీయబడినది.

**కాలము :**

భగవానుడు కాలము కంటె పరుడు (అతీతుడు) శాస్త్రములు, సత్పురుషులు, ఈ విధమగు నిరూపణమును విని బహుశః కాలము కోపించి రౌద్రరూపముతో సర్వులను గ్రహించుచున్నట్లుండియుండె కానినేడాకాలము, తనయందే పరిపూర్ణతము డగు శ్రీకృష్ణుడు అవతరించ బోవుచుండెనని తెలియగనే, పరమానంద భరితమై, సమస్త సద్గుణముల దాల్చి శుభావహమగురూపముతో కనుపించినది.

**దిశలు :**

1. ప్రాచీన శాస్త్రములందు దిక్కులు దేవీ రూపముగా వర్ణింపబడినవి. వాటి కధిపతులును–ఇంద్రాదిదేవతలును–గలరు. కంస పరిపాలనయందాదిగ్దేవతలు పరాధీనములై యుండిపోయినని. ఇపుడు శ్రీకృష్ణ భగవానుడవతరింపబోవు చుండుటచే, దేవతామాన ప్రకారము పది పన్నెండు దినములలో తమకు ముక్తి లభించి, పతి సంగమ సౌభాగ్యము కలుగగలదను భావముతో దిక్కులు ప్రసన్నములైనవి. దిశాపరిచ్ఛేదము లేని పరమాత్మయే వ్రజమండలమందవతరింప బోవు చుండుటయే దిక్కులు ప్రసన్నములై యుండుటకు కారణము.

2. సంస్కృత సాహిత్యమందు దిక్కుకు 'ఆశా' యను పేరు గూడ గలదు. దిక్కులు ప్రసన్నముగా నున్నవనగా, యిపుడు సత్పురుషుల ఆశలు సిద్ధించగలవనియు మరియొక యర్థము.

3. విరాట్పురుషుని యవయవముల వర్ణించుటలో దిక్కులాతని చెవులుగా చెప్పబడినవి. శ్రీకృష్ణుని యవతార సమయమందు దిక్కులు ప్రసన్నముగా నుండుటకు కారణమేమనగా, – అసురులు, అసాధుపురుషులచే పీడింపబడుచున్న ప్రాణులయొక్క మొఱ నాలించుటకై భగవానుడు సావధానుడై యున్నందున,తాము ప్రశాంతముగా నున్నవని మరియొక భావము.

**పృథివి :**

1. పురాణములందు భగవానునకు శ్రీదేవి, భూదేవి యను యిరువురు భార్యలున్నట్లు చెప్పబడియున్నది. ఒకరు చరసంపత్తికి మఱి యొకరు స్థిర సంపత్తికి దేవతలు. శ్రీదేవికి నివాసస్థానమగు వైకుంఠమును వదలి, భగవానుడు భూదేవికి నివాసభూతమగు భూమికి తరలివచ్చు సమయమందు, పరదేశము నుండి వచ్చు పత్యాగమన సమాచారమును విని భార్య యేవిధముగ చక్కగా నలంకరించు కొని యెదురు జూచుచుండునో, యటులనే భూదేవియు మంగళ చిహ్నములదాల్చి, భగవానుని యాగమనమునకై యెదురు చూచుట సహజమే కదా!

2. భగవానుని శ్రీ చరణములు తన వక్ష స్థలము నలంకరించు నదృష్టము కలుగనున్నదిగదాయని భూదేవి యానందించినది.

3. "వామనుడు బ్రహ్మచారి, పరశురాముడు భూమిని బ్రాహ్మణులకు దాన మొసంగినాడు. శ్రీరామచంద్రుడు భూ పుత్రి యగు సీతాదేవిని వివాహమాడినాడు. అందుచే ఆ యవతారముల యందు తనకు లభించని సుఖము యీ శ్రీకృష్ణావతార మందు నేను పొందెదను" అని యాలోచించి పృథివి మంగళమయముగా నుండె.

4. తన పుత్రుడగు 'మంగళు'ని యొడి యందుంచుకొని భూదేవి పతిదేవు నకు స్వాగతమొసంగుటకై వెడలినది.

**జలము (నదులు) :**

1. శ్రీరామచంద్రుడు సేతు బంధమను నెపముతో మా తండ్రులగు పర్వత ములను మా యత్తవారిల్లగు సముద్రమునందు వేయించి మాకు పుట్టింటి సుఖమును గూడ కల్పించినాడు. ఆ మహానుభావుడే నేడు శ్రీ కృష్ణుడుగా నవతరించు శుభ సమయమున మనము ప్రసన్నులమై స్వామికి స్వాగతము చెప్పవలయునని నదులు ప్రసన్నములైనవి.

2. ఇంతవరకు నదులన్నియు గంగానదితో యిటులడుగు చుండినవి. "నీవు మా తండ్రియగు హిమవంతుని చూచి యుంటివి. నీ తండ్రియగు విష్ణు భగవానుని మాకు జూపవా" అని యడుగు చున్నను ఆమె వినివిననట్లుండిపోయినది. ఇపుడా విష్ణువే శ్రీకృష్ణుడుగా నవతరింపబోవు చున్నాడు గాన తమంతట తామే యాతని సందర్శనము చేయగలుగుదుము గదా యని నదులు సంతోష తరంగితములైనవి.

3. భగవానుడు సముద్రమునందు నిత్యనివాసము చేయుచున్నను, అది తమ యత్తవారిల్లగుటచే, స్వామిని తాము (నదులు) చూడలేక పోయిరి. నేడా భగవానుడు పూర్ణరూపమున వ్రజ భూమి యందవతరించ బోవుచున్నందున నిస్సంకోచముగా చూడగలము గదా యను సంతసమున నిర్మలములైనవి.

4. నిర్మల హృదయులనే భగవానుడు సమీపించునుగాన నదులు నిర్మలము లైనవి.

5. నదీ దేవతలకు, భగవానుని యితర యే యవతారములందును లభించని సౌభాగ్యము కృష్ణావతారమునందు లభింపబోవుచున్నది. శ్రీకృష్ణుని నాలుగవపట్టపు రాణి యమునాదేవి అవతరించినది మొదలు, భగవానుడు యమునా తటమున విహరించుట, గోపాలబాలురు, గోపికలతో జలక్రీడలాడుట, పిమ్మట ఆమెను తన పట్టపురాణి గావించుకొనుట మొదలగు విషయముల నూహించుకొని, నదీదేవతలానంద నిర్భరలైరి.

**హ్రదములు :**

కాళీయదమన మొనర్చి కాళీయహ్రదమును (మడుగును), శోధించియు బ్రహ్మహ్రదమునందక్రూరునికి నిజస్వరూప దర్శన మొసంగియు తన లీలలతో తమకు సంబంధము కలుగచేయగలడను సంతోషమును, తమయందు వికసించి యున్న పద్మములద్వారా తమ ప్రఫుల్ల హృదయములను శ్రీకృష్ణార్పితములు గావించినవి. "ప్రభూ, లోకులు మమ్ము జడపదార్థములుగా భావించెదరు. నీవు మమ్మెపుడు స్వీకరింతువో" యని తమ భావిసౌభాగ్యమును తలపోసి సుహృదయములు గలవై యున్నవి.

**అగ్ని :**

1. శ్రీకృష్ణావతారమందు ప్రభువు, వ్యోమాసుర తృణావార్త సంహారములచే ఆకాశవాయువులను, కాళీయదమనముచే జలమును, మృద్భక్షణచే పృథివిని, అగ్నిపానముచేతనగ్నిని, శుద్ధిగావించియున్నాడు. ముందు కలగబోవు సుఖమును అనుసంధానము గావించుకొని అగ్నిదేవుడు శాంతముగా ప్రజ్వరిల్లుచుండెను.

2. ప్రస్తుతము దేవతల కొసంగబడు యజ్ఞభాగములు లుప్తమైపోవుటచే దేవతలందరితోపాటు అగ్నిదేవుడును ఆకలిగొనియున్నాడు. శ్రీకృష్ణు డవతరించిన పిమ్మట తనకు భోజనము దొరుకునుగదా యను ఆశచే ప్రసన్నుడై యగ్ని వెలుగుచున్నాడు.

**ఆయువు :**

1. ఉదారశిరోమణియగు భగవంతుడు జన్మించు సమయమందు వాయువు వినయముగా మందముగా వీచుచుండెను. అది యేలనన ప్రభు సమీపమందు సేవకులు

గాని, ప్రజలుగాని, తమ వినయమును ప్రదర్శించి ప్రభువును తమయెడల ప్రసన్నుని గావించుకొనజూచుట సహజమేగదా!

2. "శ్రీకృష్ణుని ముఖారవిందమందు యెప్పుడు శ్రమ జనిత స్వేదబిందువు లంకురించునో, అప్పుడు నేను శీతల మందమలయ సుగంధ వాయువుల బఱపి యాతనిని సుఖపెట్టెదను" అను భావముతో, ఆసాధనను (సేవను)ముందునుండియే అభ్యాసము చేయుచున్నాడు.

3. విశ్వాత్ముడగు ప్రభుని చరణారవింద దర్శన భాగ్యమందగోరు మనుజుడు, విశ్వమును సేవించ వలయునను సూక్ష్మ ధర్మమును పాటించి వాయుదేవుడు చల్లని పిల్లవాయువులతో నెల్లరియల్లముల పల్లవింప జేయుచుండెనని భావము.

4. రామావతార కాలమందు భగవానుడు నా తనయుడగుహనుమంతునిసేవ లందుకొని యుండుటచే నేను కృతార్థుడనేయైతిని, కాని యీ యవతారమందు నేనే భగవానుని సేవింపవలయునను భావముతో వాయుదేవుడు లోకులను సుఖపెట్టసాగెనని భావము.

5. విశ్వమున కంతకును ముఖ్య ప్రాణము వాయుదేవుడు, కావున సంపూర్ణ విశ్వమునకు ప్రాతి నిధ్యము వహించి, వాయువు భగవానుడు స్వాగత సమారోహ మొనర్చుచుండె.

**ఆకాశము :**

1. ఆకాశము యొక్క యేకత్వము, సర్వాధారత్వము, విశాలత, సమానత్వములను భగవానునితో సాధారణమున పోల్చుచుందురు. ఇప్పుడు ఆకాశమందుండు మిథ్యానీలత్వము గూడ భగవానుని శరీర కాంతితో పోల్చబడుటచే చరితార్థము కాగలదను ఆనందోత్సవమును ప్రకటించుటకాయనునట్లు, నీలవితానమందు మణి సమానములగు తారల జాలరులను వ్రేలాడవైచి ప్రకాశించుచున్నది.

2. స్వామి వచ్చునట్టి శుభసమయమందు సేవకులేరీతి, శుభవస్త్రాభరణముల దాల్చి ప్రశాంతముగ నుండెదరో, అటులే ఆకాశమందలి సర్వ నక్షత్రగ్రహతారకలును శాంతముగను నిర్మలముగను ఉండి శ్రీకృష్ణునకు స్వాగతము పల్కుచున్నట్లుండి పోయినవి.

**నక్షత్రము :**

నేను దేవకీదేవి గర్భము నుండి జన్మించుట రోహిణీదేవి సంతోషము కొరకే గాన, నేను రోహిణీ నక్షత్రమందే జన్మించుట యుచితము. అథవా, నేను చంద్ర వంశమునందు పుట్టుచుంటిని. చంద్రుని ప్రియపత్ని రోహిణి యను భావముచే శ్రీకృష్ణుడు రోహిణీ నక్షత్రమందే యుదయించెను.

**మ న స్సు :**

1. యోగి మనస్సును నిరోధించును. ముముక్షువు మనస్సును నిర్విషయము గావించును. జిజ్ఞాసువు బాధించును. తత్త్వజ్ఞుడు (జ్ఞాని) మనస్సును సర్వనాశనము చేయును. "భగవానుడవతరించు యీ శుభసమయమున, యీ విరోధ, బాధలనుండి విముక్తుడనై, నా భార్యాపిల్లలందరితోగూడి భగవానునితో హాయిగా నాడుకొందును గాక" యని తలచి, మనస్సు ప్రసన్నముగా నుండె.

2. నిర్మలుడైన వానితోనే భగవంతుడు సాంగత్య మొనర్చునుగాన మనస్సు నిర్మలమై యుండినది.

3. అటులనే, శబ్దస్పర్శరూప రసగంధాది విషయ సుఖముల విసర్జించిననే గాని భగవానుడు లభింపడు. స్వయముగా భగవానుడే వాని యన్నిరూపముల దాల్చి యేతెంచుచున్నాడు. లౌకికానందముగూడ భగవానుని యందిప్పుడు లభింపగలదను నూహచే మనస్సు ప్రసన్నముగా నుండె.

4. వసుదేవుని మనస్సునందు నివసించి భగవానుడు వ్యక్తమగుచున్నాడు, ఆ మనస్సు మనజాతిదే యను భావముతో మనస్సు ప్రసన్నముగా నుండినది.

5. సుమనస్సులకు (శుద్ధమానసులు-దేవతలు) సుఖము కల్గించుటకై భగవంతుడవతరించుచున్నాడు, అని గ్రహించి సుమనస్సులు సంతసించినవి.

6. సుమనస్సులు, సత్పురుషులందును, స్వర్గము నందును, ఉపవనము లందును (మంచి మనస్సులు, దేవతలు, పుష్పములు) ఆనందభరితులై యున్నవి మాధవుని (విష్ణువు—వసంతుడు) యాగమనము సమీపించినది గదా,

**శ్రావణ మాసము :**

కల్యాణ ప్రదమగు కాలము. కృష్ణ పక్షము స్వయముగా కృష్ణ సంబంధమైనది. అష్టమీ తిథి పక్షమందలి తిథులకు సంధికాలము వంటిది. రాత్రి కాలము యోగిజనులకు ప్రియమైనట్టిది. నిశీథము యతీశ్వరులకు సంధ్యాకాలము. రాత్రి యందలి రెండు భాగములకది సంధి. అట్టి సమయమందు మాధవుడవతరించినాడు. దాని కర్థమేమనగా, అజ్ఞానమను చిమ్మచీకటి యందు దివ్యప్రకాశము కలిగినదని భావము. నిశానాథుడగు చంద్రుని వంశమందు జన్మించు మహానుభావుడు అర్థ రాత్రి యందవతరించుటయే యుచితముగదా! అష్టమీ చంద్రుడప్పుడే యుదయించును. మా తండ్రియగు వసుదేవుడు నాకు జాత కర్మ చేయ జాలకపోయి నను, మా వంశమున కాది పురుషుడగు చంద్రుడు సముద్రము నందు స్నానము చేసి, తన కిరణములను హస్తములచే అమృత దానము చేయునని భగవత్సంకల్పము.

దిక్కులన్నియు ప్రశాంతముగా నున్నవి. నిర్మలాకాశమునందు తారకలు ప్రకాశించుచున్నవి. పృథివి యందలి సమస్త నగరములు, పల్లెలు మంగళమయము లుగా నున్నవి. నదులు నిర్మల జలపూరితములై యున్నవి. రాత్రి సమయమందు కాసారములందలి కమలములు వికసించియున్నవి. వనమందలి వృక్షపంక్తులయందు చిత్రవిచిత్ర పుష్పగుచ్ఛములు వ్రేలాడుచున్నవి. పక్షులు కలకలారావములు చేయు చున్నవి. తుమ్మెదలు ఝుంకారము లొనర్చుచున్నవి. శీతలమందమలయపవన ములు లోకులకు సుఖ స్పర్శ కలిగించుచున్నవి. కంసుని యత్యాచారముచే విచ్ఛిన్న ములైన బ్రాహ్మణుల యగ్నిహోత్రములు యిప్పుడు తమంత తాము ప్రదీప్తములై నవి. సాధు, సత్పురుషుల మనస్సులు ప్రసన్నములైనవి. అజుడగు జనార్దనుడు జన్మించు శుభసమయమందు దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వ కిన్నరులు మధురముగ గానము చేయదొడగిరి. సిద్ధచారణులు భగవానుని మంగళమయమగు గుణములను స్తుతింపదొడగిరి. విద్యాధరస్త్రీలు, అప్సరసలతోగూడి నాట్యము చేయు చుండిరి.

దేవర్షి గణములానంద పారవశ్యమున పుష్పవృష్టి గురిపించుచుండిరి. జల పూరితములగు జలధరములు జలనిధిని సమీపించి జలనిధిననుసరించి మందమంద ముగ గర్జింప దొడగినవి. అదియెట్లున్నదనగా, "ఓ సముద్రుడా, నీ యుపదేశ ఫలితముగా మాయందు జలములు నిండియున్నవి. నీయందు భగవానుడెట్లు వసించుచుండునో అటులనే మాయందును నివసించి యుండునట్లుగా నేదేని యుప దేశ మొసంగుమా" యనునట్లుండినది. మఱియు, ఓ సముద్రుడా, నీయందు భగవానుడు వసించియుండునుగదా. ఆయన దర్శనమును ప్రేమను మాకుగూడ కలుగునట్లు చేయుము." అని మేఘములు వేడగా సముద్రుడు వారికి కొద్దిగా జలము నొసంగి, తన యుత్తుంగ తరంగములచే వారిని వెడలనడచి "పొండి, యిప్పుడే విశ్వమంతటికి సేవ గావించి మీ యంతఃకరణములను పరిశుద్ధ మొనర్చుకొనుడు. అపుడు మీకు భగవానుని దర్శనము లభించగలదు". భగవానుడు స్వయముగా మేఘశ్యామల రూపముతో సముద్రమునుండి వ్రజభూమి రానున్నాడు. కాన మన మాతనికి యెండలో ఛాయను కల్పించి సన్నని చినుకులను వర్షించుటద్వారా ఆత్మ సమర్పణ గావించుకొని యతని వీణానాదమున కనుగుణముగ తాళము వేయుదము గాక, అని యీ విధముగా తమకు కలుగబోవు సౌభాగ్యము నూహించుకొని మేఘ ములు సముద్రుని సమీపించి మందమందముగా గర్జించుచుండినవి.

జన్మ మృత్యు రూపమగు సంసార చక్రమునుండి విముక్తికలిగించు జనార్థను డవతరించు నిశీథ సమయమాసన్నమైనది. సర్వత్ర అంధకారము సామ్రాజ్యమేలు

చున్నది. సర్వగుహాశ్రయుడగు విష్ణువు, తూర్పుదిక్కున పదునార్లు కళలతో నుదయించు పూర్ణచంద్రునివలె, దేవరూపిణియగు దేవకియొక్క గర్భమునుండి యవతరించె.

శ్లో౹౹ తమద్భుతం బాలకమంబుజేక్షణం
చతుర్భుజం శంఖగదాద్యుదాయుధం
శ్రీవత్స లక్ష్మం గళశోభి కౌస్తుభం
పీతాంబరం సాంద్రపయోద సౌభగం
మహార్హ వైడూర్య కిరీట కుండల—
త్విషాపరిష్వ క్త సహస్రకుంతలం
ఉద్దామ కాంచ్యంగదకం కణాదిభి—
ర్విరోచమానం వసుదేవ ఐక్షత

వసుదేవుడు తన యెదుట నొక యద్భుత బాలకుని గాంచినాడు. అతని నేత్రములు కమలములవలె కోమలములుగను, విశాలముగను ఉన్నవి. నాలుగు భుజములు, వానియందు శంఖచక్రగదాకమలములు విరాజిల్లుచున్నవి. వక్షమందు శ్రీవత్సమను సుందరమగు రేఖ (పుట్టుమచ్చ) యున్నది. మెడలో కౌస్తుభమణి ధగద్ధగాయమానముగ వెలుగుచున్నది. పీతాంబరము ధరించి యున్నాడు. వర్షాకాల మందలి దట్టమగు మేఘమువంటి సుందరశ్యామల వర్ణముతో శరీరము శోభిల్లు చున్నది. అమూల్య వైఢూర్యములతో చేయబడిన కిరీట కుండలముల కాంతితో చెలువారుచున్న యలకలు సూర్యకిరణములవలె వింత సోయగమున కాంతులీను చున్నవి· కటిప్రదేశమున కాంచీదామము భుజములయందు కంకణాంగదములును మెరయుచున్నవి. ఇట్టి యపూర్వ శోభతో వెలుగొందుచున్న దివ్యస్వరూపమును గాంచిన వసుదేవునకు, భగవానుడే తనకు పుత్రరూపమున సాక్షాత్కరించెనని యర్థ మైనది. అత్యంతాశ్చర్యము కలిగినది. ఆనందముచే నతని నేత్రములు ప్రఫుల్లము లైనవి. రోమాంచితమైన దాతని శరీరము. పుత్రోత్సవము జరుపవలెనను నుత్సా హము జనించినది. స్నానముగూడ చేయుటకు వీలులేని పరిస్థితి యందాతడు దకము స్పృశించి, మనసా బ్రాహ్మణులకు పదివేల గోవులను దానమొసంగినాడు. శ్రీకృష్ణుని కాంతిని సూతికాగృహము ప్రకాశించుచున్నది. ఆ శిశువు పరమ పురుషుడేయను నిశ్చయము వసుదేవునకెప్పుడు గలిగినదో, అతని ప్రభావ పరి జ్ఞానము కల్గుటచే, సర్వభయములు నశించినవి. తన మనస్సు నేకాగ్రమొనర్చి, భగవానుని చరణములందు తన శిరముంచి, చేతులు జోడించి, యీ విధముగ స్తోత్రము చేయసాగినాడు.

శ్లో॥ విదితోఽసి భవాన్ సాక్షాత్
పురుషః ప్రకృతేః పరః
కేవలానుభవానంద–
స్వరూపః సర్వబుద్ధిదృక్

"దేవదేవా, నీవు ప్రకృతి కతీతుడవగు పురుషోత్తముడవని నేను గుర్తించితిని. అనుభూతికి మాత్రమే గోచరించు కేవలానంద స్వరూపుడవు. సర్వసాక్షివి. నీవే సృష్ట్యాదియందు నీ ప్రకృతిచే యీ త్రిగుణాత్మకమగు జగత్తును సృష్టించి దాని యందు ప్రవేశించిన వానివలె యగుపించుచున్నావు. మహత్తత్త్వము మొదలగు కారణతత్త్వములు వేరువేరుగానున్నంతవరకు వానిశక్తియు వేరువేరుగనేయుండును. ఎప్పుడవి యింద్రియములు మొదలగు పదునారు వికారములతో కలియునో, అపుడవి బ్రహ్మాండరచన గావించి యందు ప్రవేశించినటు భాసించును. కాని నిజమేమనగా అవి యే పదార్థమునందును ప్రవేశించవు. అట్లు భాసించుటకు కారణమేమనగా, వానిచే కల్పింపబడిన వస్తువునందలి యంతకుపూర్వము నుండియు నుండియే యున్నవి. సరిగా, ఆ ప్రకారమే, బుద్ధిద్వారా కేవలము గుణముల యొక్క లక్షణ ములు మాత్రమే యనుమానింపబడుచున్నవి. మరియు యింద్రియముల ద్వారా గుణ మయములగు విషయములు మాత్రమే గ్రహింపబడుచున్నవి. నీవా గుణములయందు వసించుచున్నను, గుణగ్రహణ సమయమందు నిన్నుగ్రహించుట జరుగుటలేదు. ఏలననగా, నీవు సర్వమయుడవు. సర్వాంతర్యామివి. పరమార్థ సత్యస్వరూపుడవు. ఆత్మస్వరూపుడవు. గుణముల యొక్క యావరణము నిన్ను కప్పివేయజాలదు. ఇందుచే నీకు లోపల వెలుపల యనునది వేరేలేదు. కావున నీవెందు ప్రవేశింతువు? ఈ దృశ్యగుణములను ఆత్మవ్యతిరిక్తముగా సత్యములని భావించువాడు అజ్ఞానియే. ఎందుకనగా దేహము మొదలుగాగల సర్వము అవాస్తవము. వాగ్విలాసము మాత్రమే యగుచున్నది. విచారించిన యెడల వాని యస్తిత్వ మేమాత్రము సిద్ధించక సర్వము బాధితమగుచున్నది. అట్టి దానిని సత్యమని భావించువాడు జ్ఞానియెట్లగును?

ప్రభూ, నీవు సమస్త గుణ, క్రియా, వికార రహితుడవని చెప్పుదురు. అయి నను సృష్టి స్థితిలయములు నీ వల్లనే జరుగుచున్నవి. ఈ చర్య, పరమ పురుషుడవు, పరమైశ్వర్యయుతుడవునగు నీ యెడల అసంగతములు కానేరవు. ఏలననగా, నీవే త్రిగుణములకు ఆధారుడవు. కావున ఆ గుణముల యొక్క కార్యాదులు నీ యందే ఆరోపించబడుచున్నవి.

నీవు ముల్లోకములను రక్షించుటకై, మాయ నాశ్రయించి, సత్త్వమయ శుక్ల వర్ణము దాల్చి (విష్ణు రూపమున) పోషణ భారమును వహించుచున్నావు. సృష్టి కార్యమునకై రజో రూపమగు రక్త వర్ణము దాల్చి (బ్రహ్మ) సృష్టించుచున్నావు.

ప్రళయకాలమందు తమః ప్రధానమగు కృష్ణ వర్ణముతో సంహారకారియగు రుద్ర రూపము దాల్చుచున్నావు. నీవు సర్వశక్తిమంతుడవు. జగన్నాధుడవు. ఈ జగత్తును రక్షించుట కొరకే నీ విపుడు నా గృహము నందవతరించితివి. నేడు కోట్ల కొలది రాక్షసాధిపతులు, రాజులుగా ప్రవర్తించుచు తమ యధీనమందు పెద్ద సేనలను కల్గి యున్నారు. నీవా రక్కసుల పీచ మడంచెదవు. దేవదేవా! ఈ కంసుడు పరమ దుర్మార్గుడు. నీవు మా గృహమందవతరింపగలవను విషయము తెలిసినవాడై నీకు ముందు జన్మించిన నీ యగ్రజుల నార్వురను నిష్కారణముగ వధించినాడు. ఇపుడు నీ వవతరించిన విషయము వాని సేవకుల వలన వినుటయే తడవుగ, వాడు ఖడ్గ హస్తుడై యిట కేతెంచగలడు" అని వసుదేవుడు పల్కె.

దేవకీదేవియు, తన పుత్రునియందు పరమాద్భుతముగ పరమ పురుషుని లక్ష ణము లన్నియు నుండుటను గాంచినది. మొదట కంసుని భయమామెకు కొంచెము కల్గినది. కాని యది వెంటనే పోవగా, పరమ పవిత్ర భావముతో చిరునగవునగుచు, భగవాను నీ రీతి స్తోత్ర మొనర్చినది.

"స్వామీ! వేదముల యందుయే నీ రూపము, అవ్యక్తము, సర్వకారణమునని చెప్పబడి యున్నదో, ఏది బ్రహ్మ, జ్యోతి స్స్వరూపము, గుణ రహితము, వికార హీనమో, దేనిని విశేష రహితముగను (నిర్విశేషము), అనిర్వచనీయము, నిష్క్రి యము, కేవల విశుద్ధ సత్తా రూపముగను చెప్పుదురో, బుద్ధివృత్తుల నన్నింటిని ప్రకా శింపజేయునట్టి విష్ణురూపుడవు నీవు. రెండు పరార్థ కాలములుగల బ్రహ్మయాయుః పూర్తియగునప్పుడు, కాలశక్తి ప్రభావముచే మహా ప్రళయము సంభవించి ప్రపంచము నశించును. పంచ మహాభూతము లహంకారమందున, అహంకారము మహత్తత్త్వ మందున, మహత్తు ప్రకృతి యందు నిలయమైన ఆ సమయమందు నీ వొక్కడవే శేషించి యుందువు. అందుకే నీకు 'శేష'డనియు నామము గలిగియున్నది. ప్రకృతికి యేక మాత్ర సహాయకుడవు నీవు. నిమేషము నుండి సంవత్సరము వరకు విభజించ బడియున్న యే కాలము గలదో, దేని ప్రవృత్తిచే యీ విశ్వమంతయు ప్రవర్తించు చున్నదో, దేనికి అంతమనునదియే లేదో, అట్టి కాలము నీ లీలా మాత్రమేయై యున్నది. నీవు పరమశక్తియుతుడవు. పరమ కళ్యాణ గుణాశ్రయుడవు. నేను నిన్ను శరణందుచుంటిని.

శ్లో॥ మర్త్యో మృత్యువ్యాళ భీతః పలాయన్
సర్వాన్లోకాన్నిర్భయం నాధ్యగచ్ఛత్
త్వత్పాదాబ్జం ప్రాప్యయదృచ్ఛయాద్య
స్వస్థః శేతే మృత్యురస్మాదపైతి

ఈ జీవుడు మృత్యుగ్రస్తుడగుచున్నాడు. మృత్యు రూపమగు కరాళ విషసర్ప ముచే భయభీతుడై లోకములు లోకాంతరములకు పరువెత్తుచు యెచటను భయ రాహిత్యమును పొందజాలక పోవుచున్నాడు. నేడదృష్టవశమున నీ చరణారవిందముల యాశ్రయము లభించినది. అందువలన స్వస్థుడై సుఖనిద్ర నొందగలిగినాడు. ఇతరుల విషయమేల? స్వయముగ మృత్యుదేవతయే భీతిల్లి పారిపోయినది.

స్వామీ, నీవు భక్తుల భయమును హరించువాడవు. మేమీదుర్మార్గుడగు కంసుని వలన మహాభీతినందియున్నాము. కావున నీవు మమ్ములను రక్షింపుము. నాలుగు భుజములు గలిగిన యీ నీ దివ్యరూపము ధ్యానయోగ్యమైనది. కేవల దేహాభిమానులగు మానవుల యెదుట ప్రదర్శించకుము. నీవు నాకు కుమారుడవుగా జన్మించిన విషయము యీ పాపియగు కంసునకు తెలియనీయకుము. నాకు ధైర్యము సన్నగిల్లుచున్నది. నీ విషయమై నేను కంసుని వలన మిక్కిలి భయపడుచున్నాను.

శ్లో॥ విశ్వంయదేతత్ స్వతనౌనిశాంతే
యథావకాశం పురుషః పరోభవాన్
బిభర్తిసోఽయం మమగర్భగోఽభూత్
అహోనృలోకస్య విడంబనంహితత్

విశ్వాత్మా, నీ యీ రూపమలౌకికము. ఈ నాల్గు భుజములు, శంఖచక్రగదాకమలధారణచే శోభిల్లుచున్న దివ్యరూపము నుపసంహరింపుము. ఏ విధముగా మానవుడు తన శరీరమందున్న ఛిద్రరూపమగు ఆకాశమును స్వాభావిక రూపమున ధరించుచున్నాడో అటులనే, నీవు ప్రళయకాలమునందు యీ సమస్త విశ్వమును నీ శరీరమునందు దాల్చుచున్నావు. అట్టి పరమపురుషుడవు, పరమాత్మవునైన నీవు నా గర్భమందు వసించినవాడవైనావు. ఆహా, యేమి యాశ్చర్యము! ఇది యద్భుతమైన నీ మాయామానవ లీలా వినోదముగానిచో మఱియేమగును?"

అని దేవకీదేవి స్తుతించిన పిమ్మట భగవానుడామెతో (దంపతులతో) నిట్లు పల్కెను.

"దేవీ, స్వాయంభువ మన్వంతర కాలమున నీకు మొదటి జన్మ కల్గినది. అప్పుడు నీ పేరు పృశ్ని అప్పుడీ వసుదేవుడు సుతపుడను ప్రజాపతియై యుండె, మీ యిరువురి హృదయములత్యంత పరిశుద్ధములై యుండినవి. ప్రజా సృష్టి గావింపుడని బ్రహ్మచే ఆదేశింపబడినవారలై మీరు, ఇంద్రియ నిగ్రహముతో గొప్ప తపస్సాచరించితిరి. వర్ష వాతాతప శీతోష్ణాది వివిధ కాల గుణముల సహించుచు ప్రాణాయామ ప్రక్రియ ద్వారా మీ మనో మాలిన్యమును క్షాళన మొనర్చుకొంటిరి. మీరిరువురు నొకప్పుడెండుటాకుల దినుచును, మరొకప్పుడు వాయు భక్షణ మాత్రమే జేయుచు

నుంటిరి. మీ చిత్తములు ప్రశాంతములై యుండె. ఈ విధముగ మీ యభీష్టసిద్ధికై మీరు నన్నారాధించి యుంటిరి. నాయందే చిత్తము నేకాగ్రమొనర్చి యీ విధముగ పండ్రెండువేల దివ్య వర్షములు తప మొనర్చగా నేను పరితుష్టుడనైతిని. ఏలననగా మీరిరువురును, శ్రద్ధ, తపస్సు, ప్రేమ, భక్తి గలవారలై మీ హృదయము అందు నిరంతరము నన్నే భావించి యుంటిరి. వరప్రదుడనగు నేనప్పుడు మీకి స్వరూపముతో ప్రత్యక్షమై మీ యిచ్చ వచ్చిన వరము కోరుకొనుడని" పలుకగా, మీరు నా వంటి పుత్రుడు గావలెనని కోరి యుంటిరి. అప్పటి వరకు మీరు ప్రాపంచిక విషయ భోగముల ననుభవించి యుండలేదు. మీకు సంతానము లేకుండినది. అందుచే నా మాయా మోహితులైన మీరు మోక్షమును గోరలేదు. మీకు వరమొసంగి నేను వెడలి పోతిని. సఫలమనోరధులై మీరు విషయ సుఖములనుభవించసాగినారు. ప్రపంచమందు శీలౌదార్య గుణములందు నాకు సమానుడగు వాడెవడును లేనందున, నేనే మీకు పుత్రుడుగా నవతరించితిని. ఆ జన్మయందు నేను 'పృశ్నిగర్భ'డను పేరుతో విఖ్యాతుడనైతిని.

మరుజన్మ యందు మీరు అదితికశ్యపులుగా జన్మించితిరి. అప్పుడు గూడ నేను మీకు తనయుడనై జన్మించితిని. అప్పుడు నా నామధేయము 'ఉపేంద్రుడు'. పొట్టిగా నుండుటచే వామనుడనియు నన్ను పిలిచినారు. తల్లీ, నీ యీ మూడవ జన్మ యందు గూడ అదే రూపముతో మీకు పుత్రుడనై యవతరించితిని. నామాట యెల్లప్పుడు నిజమైనట్టిది. మీ పూర్వజన్మముల స్ఫురణ మీకు గలుగుటకై నేను యీ రూపముతో మీకు దర్శనమొసగితిని. కేవలమానుష రూపముతోనే నేను మీకు కనుపించినచో, నా యవతార విషయము మీరు గుర్తింపజాలరు. మీరిరువురును, నా యందు పుత్ర భావమును, నిరంతర పరమాత్మ భావమును కల్గియుండి చింతన చేయుచుండుడు. తద్వారా మీకు నా పరమపద ప్రాప్తి కలుగగలదు."

భగవానుడిట్లు పల్కి యూరకుండె. తన మాయా ప్రభావముచే దేవకీ వసుదేవులు చూచుచుండగనే వెంటనే సాధారణ మానవ శిశురూపమును దాల్చినాడు.

ఎప్పుడు వసుదేవుడు భగవానుని ప్రేరణచే శిశువును గైకొని సూతికా గృహమునుండి యెప్పుడు బయల్వెడలదలచెనో, అదే సమయమున వ్రజభూమి యందు నందపత్నియగు యశోదకు యోగమాయాదేవి కొమరితగా జన్మించినది. ఆమె (భగవచ్ఛక్తియే యగుటచే భగవంతునివలెనే ఆమెకును పుట్టుట యనునది లేదు) ఆమె యొక్క అనంతశక్తిచే ద్వారపాలకులును, పురజనులందరును చైతన్యములుడిగినవారలై నిద్రించిరి. వసుదేవుడున్న కారాగారము యొక్క ద్వారము బంధింపబడియున్నది. ఇనుప గడియలు తాళములు వేయబడియున్నవి. బయటకు వెళ్ళుట యెంతమాత్రము సాధ్యముగాదు. కాని వసుదేవుడు శ్రీకృష్ణునెత్తుకొని

ద్వారము సమీపించగనే-ఆశ్చర్యము!-తలుపులు తమంత తామే తెఱచుకొనినవి. ఏ మహానుభావుని నామస్మరణమాత్రముచే అనేక జన్మార్జితములును అసంఖ్యాకములునగు కర్మబంధములే తెగిపోవుచున్నవో అట్టి స్వామి వసుదేవుని యొడిలో నుండగా నతని శృంఖలములుగాని, తలుపులు యినుపగడియలుగాని తెగిపోవుటలో నేమి యాశ్చర్యమున్నది? సూర్యోదయము కాగానే అంధకారము తొలగిపోవునట్లు, అడ్డంకులన్నియు తొలగిపోయినవి. మేఘములు మందమందముగా నినదించుచు సన్నగా చినుకులు రాల్చదొడగినవి. ఆ చినుకులు భగవానునిపై బడకుండ, తన పడగలను గొడుగువలెవిప్పి భగవానునిపై నావరించి, వెనువెంట పోవుచుండె.

నాదిశేషుడు బలరాముడీవిధముగా నాలోచించినాడు. నేను అగ్రజుడనైననేమి? భగవానుని సేవించుటయే నా ముఖ్యధర్మము. నేనుండగా భగవానునిపై వర్షము పడనిచ్చెదనా యని పడగలను ఛత్రమువలె పట్టినాడని భావము.

అది వర్షాకాలమగుటచే యమునా నది పరదలతో పొంగి ప్రవహించుచున్నది.

---

అది యెట్లుండెననగా :—

1. "ఆహా, యే మహానుభావుని చరణ ధూళి భక్తుల మానసములకు ధ్యాన విషయమగుచున్నదో, అట్టి స్వామి నా తీరమునకు వచ్చుచున్నాడు గదా యని ఆనంద పారవశ్యమున యమునా నది కార్చిన కన్నీరే పరదలై పారుచున్నట్లుండె.

2. నేను యముని సోదరిగా తలచి శ్రీకృష్ణు డెక్కడ తన యందు విముఖత్వ మును జూపునో యని యమున తని విశాల జీవనమును ప్రదర్శించుచున్నట్లుండెను.

3. స్వామి గోపరిపాలనార్థము గోకులమునకు విచ్చేయుచున్నాడు. నా యీ వేల కొలది తరంగములు గోవులే. అతడు వీనిని గూడ పరిపాలించునుగాక.

4. ఇంతకు పూర్వమే కాళీయ ఫణీంద్రుడొకడు నా యందు వసించుచున్నాడు. ఇప్పుడు ఆదిశేషుడు గూడ వచ్చుచున్నాడు, నా గతి యేమగునో యని వానిని నివారించుటకై (అలలతో) ఉప్పొంగి ప్రవహించుచున్నట్లుండె.

5. యమునా ప్రవాహమత్యంత గంభీరముగను వేగముతో గూడినదిగనుండెను. తరల తరంగముల కారణముచే నురుగులతో నిండియుండెను. వందల కొలది సుడిగుండము లేర్పడినవి. కాని భగవానుడు సమీపించగనే, రామావ

వసుదేవుడు శిశు సహితముగ నందుని గోకులమునుజేరి చూడగా నచట నందరును గాఢనిద్రయందుండిరి. తనచేతి యందున్న శిశువును యశోద ప్రక్కలో పడుకోబెట్టి యచటనున్న నవజాత శిశువు (ఆడపిల్ల) నెత్తుకొని తిరిగి తన కారా గృహమున కేతెంచినాడు. ఆ కన్యను దేవకి ప్రక్కయందుంచి తన పాదములకు సంకెళ్ళు దగిలించుకొనియె. యథా పూర్వకముగ కారాగారము బంధితమై పోయినది.

---

తార కాలమున రామునికి సముద్రుడు వినయము జూపినట్లు యమున స్వామికి దారి నొసంగినది.

అదియెట్లున్నదనగా :-

1. నా యీ భయంకర రూపమును గాంచి, భగవానుడు ఉత్తరోత్తరము నా యందాడుకొనుట యెటులా యని తలంచునేమో యను శంకతో ఒక్క సారిగా యమున, యొకచోకంఠదఘ్నముగను, మఱియొకచో నాభిదఘ్నము కను, కొండొకచో జానుదఘ్నమగు లోతుగలదిగను మారిపోయినట్లుండెను.
2. దుఃఖియగు మనుజుడు, దయగల పురుషుని ముందు తన హృదయమును విప్పి చెప్పినట్లు, కాళీయుని వలన బాధపడుచున్న తన హృదయమును భగ వానుని యందు తెఱచి యుంచినట్లుండినది యమున.
3. నాయుచ్ఛృంఖలత్వమునుగాంచి భగవానుడు తనను పట్టపురాణిగా స్వీకరించ డేమో యను శంఖచే, మహా వినయముతో సంకోచ సహితముగ తన రస స్వరూపమును యమున ప్రదర్శించునట్లుండె.
4. ఈ స్వామి రాముడుగా సూర్యవంశము నందవతరించినపుడు, చంద్రుని తండ్రియగు సముద్రుడాతనికి దారి యివ్వకున్నందున కోపించి యాతడు సేతుబంధనమొనర్చె.

   నే డీతడు చంద్రవంశమునందుదయించినాడు. సూర్యపుత్రినగు నే నీతనికి మార్గమొసంగనిచో నన్నెక్కడ బంధించునో యను భయముచేత గాబోలు తనను రెండుగా విభజించుకొని మార్గమొసంగినది.
5. హృదయమునందు భగవానుడు ప్రవేశించినచో అలౌకికానందము కలుగునని సత్పురుషులు పల్కెదరు. అట్టి యానందానుభూతిని పొందుటకై యమున స్వామికి తన యందు ప్రవేశమొసంగెనా యన్నట్లుండె.
6. నా పేరు కృష్ణా! నాయందలి జలము కృష్ణవర్ణము గలది. వెలుపల శ్రీకృష్ణుడు, నా హృదయము నందు మాత్రము శ్రీకృష్ణ స్ఫూర్తి యేల యుండరాదు? అని యాలోచించిన యమున, దారి యిచ్చుటయను నెపముతో శ్రీకృష్ణుని తన హృదయములోనికి దీసుకొనియెనాయన్నట్లుండె.

గోకులమందు నందపత్నియగు యశోదకు తాను ప్రసవించినట్లు తెలివి యుండినదిగాని పుట్టినది పుత్రుడా పుత్రికయాను విశేష జ్ఞానము లేకుండె. దానికి కారణమామె మిక్కిలి బడలి యుండుట యొకటి. అంతకు మించి యోగమాయా ప్రభావముచే చైతన్యము గోల్పోయి యుండుట యొకటి.

ఈ సందర్భమున భగవానుడీ విధమగు ప్రకటన యొనర్చినట్లున్నది. "నన్ను ప్రేమ పూర్వకముగ తమ హృదయము నందు ధరించు వానికి సర్వబంధములు సడలిపోవుననియు, కారాగార బంధము గూడ తొలగుననియు, కావలాదారులకు గూడ తెలియకుండుననియు, సంసార నదీ జలము యెండి పోవుననియు, గోకులము (యింద్రియ సముదాయము) యొక్క వృత్తులన్నియు లుప్తమగుననియు మాయాహస్త గతమగుననియు సూచించినట్లున్నది.

# నాలుగవ యధ్యాయము

## యోగమాయ కంసుని హస్తము నుండి విడివడి ఆకాశమున కెగిరి భవిష్యద్వాణి పలుకుట

శుకమహర్షి పరీక్షితునితో నిట్లనియె

"రాజా, వసుదేవుడు మధురయందలి కారాగృహమును తిరిగి ప్రవేశింపగనే, నగరమందలి లోపలి వెలుపల ద్వారములన్నియు పూర్వమువలె, తమంతతామే బంధితములైనవి. అనంతరము యోగమాయాదేవి యొక్క రోదన ధ్వని నాలించిన ద్వారపాలకులు నిద్దురనుండి మేల్కొని, శీఘ్రముగ కంసునిజేరి దేవకికి సంతానము గలిగిన వార్త నాతనికి నివేదించిరి. ఈ వార్తకొరకే యతడు వ్యాకులముతో నెదురు చూచుచుండినందున, ద్వారపాలకుల మాట వినగనే లేచి యతివేగమున సూతికా గృహమువైపు పరుగిడినాడు. ఈ మారు నన్ను వధించువాడే జన్మించియుండునను కలవరముచే విహ్వలుడై యుండుటచే నతడు తన కేశములు విడివడియుండుటను గూడ గమనించడాయె. మార్గమందు తొట్రుపాటుచే పడిలేచుచు నిలద్రొక్కుకొనుచు సూతికాగృహము చేరినాడు. దేవకీదేవి దుఃఖముతో దీనముగ విలపించుచు, "అన్నా, యీ శిశువు నీ మేనగోడలు. నీవంటి వీరుడు స్త్రీ హత్య చేయరాదు. దైవయోగముచే తేజస్వంతులగు నాపుత్రులార్వురు నీచే వధింపబడియున్నారు. ఇపుడీ కన్య యొక్కతయే మిగిలియున్నది. ఈ యాడుపిల్లనైనా నాకు దక్కనిమ్ము. బాహుపుత్ర

సంతానము గోల్పోయిన యభాగ్యురాలను. అత్యంత దీనురాలను. నీయనుంగు సోదరిని. మందభాగ్యనగు నాయందు దయయుంచి యీ చివరి సంతానమునైనను నాకు మిగుల్పుము."

అని దీనముగ విలపించుచున్న యామె విన్నపమును పెడచెవిన బెట్టి, కంసుడామె చేతి నుండి యా శిశువు నొడిసి పట్టి లాగికొనియె. ఆ శిశువు కాళ్ళు రెండును బట్టుకొని యొక బండరాయిపై విసిరి కొట్టినాడు. స్వార్థమనునది యాతని హృదయము నుండి సౌహార్దమును సమూలముగ బెఱికి వైచినది. కాని శ్రీకృష్ణుని యా చిట్టి చెల్లెలు సామాన్యురాలా! ఆమె మాయాదేవి గదా! కంసుని కరము వదలగనే యామె యంతరిక్షమున కెగసి దివ్యరూపము దాల్చినది. ఎనిమిది బాహువులతో సర్వాయుధములు దాల్చి దర్శన మొసంగినది. దివ్యములగు పుష్పమాలలు, చడిదనము, వస్త్రభూషణములతో నలంకృతయై విరాజిల్లుచున్నది. ఆమె హస్తములయందు, ధనస్సు, త్రిశూలము, బాణము, డాలు, కృపాణము, శంఖము, చక్రము, గదయను యెనిమిది యాయుధములున్నవి.సిద్ధ చారణ గంధర్వాప్సర నాగకిన్నెరాది గణములందరామెకు కాన్కల సమర్పించుచు స్తోత్రము లొనర్చుచుండిరి. ఆ దేవి కంసునుద్దేశించి గంభీరముగ నిట్లు పల్కినది.

"ఓరీ మూర్ఖా, నన్ను వధించినచో నీకు కలుగు ప్రయోజనమేమియున్నది? నిన్ను సంహరించుటకై నీ పూర్వజన్మ శత్రువెచ్చటనో జన్మించియేయున్నాడు. వ్యర్థముగ నిర్దోషులను హింసింపకుము" అని యా భగవతి కంసునితో బలికి యచట నుండి యంతర్ధానమైపోయి, భువియందలి వేర్వేరు ప్రదేశములందు విభిన్న నామములతో ప్రసిద్ధిగాంచినది.

భగవతి పలుకులు విని కంసు డత్యంత విస్మయాశ్చర్య చకిత మానసుడైనాడు. వెంటనే దేవకీ వసుదేవులను కారాగారము నుండి విడిపించి, వారితో మిక్కిలి వినయముగ నిట్లు పలికె. "నా ప్రియ సోదరీ, బావగారూ, నేను మహా పాపాత్ముడను. రాక్షసుని వలె మీ సుతుల నందరిని వధించితిని. ఇందుకు నాకు మహాఖేదము కలుగుచున్నది. నేనెంత దుష్టుడననగా, నా యందు దయ యనునది లేశమాత్రము గూడ లేదు. నా బంధువులను హితైషుల నందరను త్యాగమొనర్చితిని. నేనే నరకమునకు పోవలసి వచ్చునో తెలియరాకున్నది. బ్రహ్మ హత్య గావించిన వానివలె జీవన్మృతుడుగనే యున్నాను. కేవలము మనుజులు మాత్రమే యబద్ధమాడుటలేదు. దైవము గూడ నబద్ధమాడునని గ్రహింపలేకపోతిని. ఆకాశవాణి పలుకులు నమ్మిగదా నేను నా సోదరీ సంతానము నందరిని సంహరించితిని! అయ్యో! నేనెంత పాపిని! మీరిరువురు మహానుభావులు, మీ సంతానము కొరకు దుఃఖింపకుడు. వారు వారి కర్మఫలము ననుభవించినారు. ప్రాణులందరును ప్రారబ్ధకర్మమునకు వశులై యై

యుందురు. కావున అందరును యెల్లకాలము నొకే చోట యుండుట కుదరదు అంతయు దైవాధీనము.మట్టితో పదార్థములు తయారగుట పగిలిపోవుటకు జరిగినను మట్టియందు భేదముండదు. అటులనే శరీరములు పుట్టుట నశించుట జరిగినను ఆత్మపై దీని ప్రభావమేమియు నుండదు. ఈ యదార్థమును గుర్తింపనివారు, అనాత్మయగు శరీరమే ఆత్మయని భ్రాంతి చెందుతున్నారు. ఇదియే విపరీత బుద్ధి లేక యజ్ఞానము. ఇందుచేతనే జనన మరణములు సంభవించుచున్నవి. ఈ యజ్ఞానము నశించునంతవరకు సుఖ దుఃఖ రూపమగు సంసారము నుండి విముక్తి కలుగ నేరదు. అమ్మా, అందుచేత, నేను నీ పుత్రులనందరిని చంపినప్పటికిన్ని, నీవు వారికై శోకింపవలదు. ఏలననగా, ప్రాణులందరు వివశులై తమ కర్మ ఫలములు ననుభవింపనే వలయును గదా!తన స్వరూప జ్ఞానము లేక, జీవుడెంతకాలము తాను చంపువాడననియు లేక చంపబడువాడననియు భాసించుచుండునో అంతకాలము, శరీరముయొక్క జన్మ మృత్యువుల నభిమానించు అజ్ఞానియై బాధ్యబాధక భావమును పొందుచునే యుండును. అనగా యితరులకు దుఃఖములు కలిగించుచు, తాను దుఃఖించుచునే యుండును. నా దుర్మార్గమునుమీరిరువురు క్షమించుడు. ఏలననమీరు గొప్ప సాధు స్వభావము గలవారు. దీన రక్షకులు" అని పలుకుచు కంసుడు దేవకీ వసుదేవుల పాదములు పట్టుకొనియె. కనుక వెంట దుఃఖాశ్రువులు దొరలినవి. యోగ మాయాదేవి మాటలపై విశ్వాసముంచి, వారిరువురిని బంధ విముక్తులుగా వారియందపార ప్రేమను ప్రకటించినాడు కంసుడు. తన యన్న యొక్క పశ్చాత్తాపమును గమనించిన దేవకి యాతనిని క్షమించి, యతని పూర్వాపరాధములనన్నిటిని మరచినది.

వసుదేవుడు నవ్వుచూ "కంసా, నీవు చెప్పునది పరమసత్యము. జీవుడు తన యజ్ఞానకారణముచేతనే శరీరాదులయందు "నే" నను భ్రమతో, తనవారు పెడవారను భేదము కలిగినవాడగుచున్నాడు. ఈ భేదదృష్టికలిగి నందుచేతనే శోక, మోహ, భయ, ద్వేష, లోభ, హర్షములకు లోనగుచున్నాడు. అన్నిటికి ప్రేరకుడగు భగవానుడే, ఒక భావముచే మరియొక భావమును, ఒక వస్తువునే మరియొక వస్తువును నశింపజేయుచున్నాడను యధార్థమునే జీవుడు మరచిపోవుచున్నాడు" అని పలికె.

ఈ విధముగా నిష్కపటభావముతో దేవకీవసుదేవులు ప్రసన్నచిత్తులై మాటలాడగా, కంసుడు వారి యనుమతిగొని, తన సౌధమునకు వెడలిపోయినాడు. ఆ రాత్రి గడచిన పిదప, తన మంత్రులందరిని సమావేశపరచి యోగమాయ తనకు చెప్పిన మాటలను వారికి వినిపించినాడు. అతని మంత్రులందరును దైత్యులుగాన దేవతలయెడ వారికి సహజమగు శత్రుభావము కలిగియున్నది. కంసుని మాటలు

విన్నవారలకు దేవతలపై కోపమినుమడించినది. అందుచే వారు, "భోజరాజా, అట్లై నచో మేమీనాడే బయలుదేరి పెద్దపట్టణములు, పురములు, పల్లెలు మొదలగు స్థానములందు పుట్టిన పిల్లలను-పదిరోజులు పైబడిన లేక తక్కువ వయస్సుగల వారందరిని నేడే సంహరించెదము. పిరికిపందలగు దేవతలు యుద్ధప్రయత్న మొనర్చినను మననేమిచేయగలరు? వారు మీ ధనుష్టంకారము విన్నమాత్రముననే హడలిపోవుదురు? మీరిదివరలో దేవతలతో యుద్ధము గావించినపుడు మీ శరాఘాతములచే గాయపడి సమరాంగణమువీడి పారిపోయిరి గదా? కొందరు దేవతలు శస్త్రాస్త్రముల బాఱవైచి, చేతులు జోడించి మీ యెదుట తమదీనత్వమును ప్రకటించుకొనిరి. భయపడి శరణువేడిన వారిని, శస్త్రాస్త్రముల త్యజించినవారిని, రథభంగము ధనుర్భంగము జరిగినవారిని, యుద్ధమువీడి పలాయన మొనర్చినవారిని, మీరు చంపరుగదా! పోరులేని ప్రదేశములందు మాత్రమే దేవతలు వీరులుగానుందురు. ప్రధనభూమికి వెలుపల మాత్రమే వారు ప్రగల్భములు పలుకుచుందురు. ఏకాంతవాసియగు విష్ణువు వలనగాని వనవాసియగు శంకరుని వలనగాని, అల్పవీర్యుడగు ఇంద్రుని వలనగాని, తపస్వియగు చతుర్ముఖు వలనగాని మనకు గలుగు భయమేమియున్నది? అయినను దేవతలను మనముపేక్షింపరాదు. ఇది మా నిశ్చితాభిప్రాయము. ఏలననగా వారు మనకు సహజశత్రువులు గదా. కావున వారి మూలచ్ఛేదము గావింపనే వలయును. మావంటి విశ్వాసపాత్రులగు సేవకుల నాపనికై నియోగింపుడు. మానవుని శరీరమునందు రోగమేర్పడినపుడు, దానికి సరియగు చికిత్సగావింపక యుపేక్షించినచో, రోగము ముదిరి, చివరకసాధ్యముగా పరిణమించును. ఇంద్రియములనుపేక్షించినచో నవి బలవత్తరములై చివరకు వానిని నిగ్రహించుటకు యసాధ్యమగు విధమున, శత్రువునుపేక్షించినచో వాడు బలము పుంజుకొని, మనము జయించుట కష్టసాధ్యమగును. దేవతలకు మూలము విష్ణువు. సనాతన ధర్మమున్నచోట నతడుండును.

నూతన ధర్మమునకు మూలము, వేదములు, గోవులు, బ్రాహ్మణులు, తపస్సులు, యజ్ఞములు (దక్షిణాసహితములు), కావున మహారాజా, మేము, వేదవాదులగు బ్రాహ్మణులను, తాపసులను, యజ్ఞశీలురను, గోవులను, యజ్ఞసంభారములను నాశమొనర్చెదము. బ్రాహ్మణులు, గోవులు, వేదములు, తపస్సు, సత్యము, దమము, శమము, శ్రద్ధా, దయ, తితిక్ష, క్రతువులు, వారియొక్క శరీరము. ఆ హరియే దేవతలందరికి ప్రభువు. అందుచే మనకు ప్రధానద్వేషి, అతడే గుహయందునో దాగియుండును. అతడే దేవతలకు మూలాధారము." అని మంత్రులు పల్కిరి.

"రాజా, దుర్మార్గుడగు కంసుడీ విధముగ దుర్మంత్రులతో మంత్రాలోచన మొనర్చి, కాలపాశబద్ధుడగుటచే, వారు సూచించిన విధానమే తనకు హితమని భావించినాడు. హింసాప్రవృత్తిగల రాక్షసులకు, సత్పురుషులను హింసింపవలసినదిగా ఆదేశములిచ్చినాడు. వారందరును కామరూపులగుటచే, తన యిచ్ఛవచ్చిన రూపముల దాల్చి వెడలిపోవగనే, కంసుడు తన యంఃతపురమును ప్రవేశించె.

అసురుల ప్రకృతి రజోగుణాత్మకము. తమోగుణముచే మూఢులగు వారికి యుచితానుచితములు తెలియవు. వారి తలలపై మృత్యుదేవత నాట్యమొనర్చుచున్నది. ఆ కారణము చేతనే వారు సత్పురుషుల ద్వేషింపదొడగిరి. సత్పురుషుల నెవరు ద్వేషించెదరో, వారి యా పాపకర్మయే వారి యాయువును, సంపదను, కీర్తిని, ధర్మమును, యిహపరలోకములను, విషయభోగములను, సమస్త కల్యాణ సాధనములను నశింపజేయును" అని శుకమహర్షి పరీక్షిత్తుతో పలికె.

# పంచమాధ్యాయము

## గోకులమునందు భగవానుని జన్మమహోత్సవము

పుత్రుడు జన్మించినందున నందున కమందానందము కలిగినది. వేదవేత్తలగు విప్రులను రావించి, స్నానమొనర్చి యలంకృతుడై, పవిత్రుడై స్వస్తివాచన పూర్వకముగా పుత్రునకు జాతకర్మ మహోత్సవము జరిపించినాడు దేవతలకు, పితృదేవతలకు యధావిధిగ పూజలొనర్పబడినవి. వస్త్రాభూషణాలంకృతములైన రెండు లక్షల గోవులను బ్రాహ్మణోత్తములకు దానమొసంగె. రత్నములు బంగారువస్త్రములచే గప్పబడిన తిలపర్వతముల నేడింటిని గూడ దానమొనర్చినాడు (సంస్కారములచే గర్భశుద్ధి కలుగునని చెప్పుటకే అనేక దుష్టాంతములు చూపబడుచున్నవి). సమయముచే (నూతన జలము, అశుద్ధభూమి మొదలగునవి) స్నానముచే (శరీరాదులు), ప్రక్షాళనముచే (వస్త్రాదులు), సంస్కారముచే (గర్భాదులు), తపస్సుచే (యింద్రియాదులు), యజ్ఞముచే (బ్రాహ్మణాదులు), దానముచే (ధనధాన్యాదులు), సంతోషముచే (మనస్సు మొదలగునవి), ద్రవ్యశుద్ధి కలుగును కాని ఆత్మశుద్ధి ఆత్మజ్ఞానముచే మాత్రమే కలుగును.

శ్రీకృష్ణుని జాతకర్మ మహోత్సవ సందర్భమున బ్రాహ్మణులు, సూతులు (పౌరాణికులు), మాగధులు (వంశ వర్ణనము చేయువారు), వందులు (యుక్త

పూర్వక స్తుతి చేయువారు) మంగళమయాశీర్వాదములు చేయుచు స్తుతించుచుండిరి. గాయకులు గానము చేయుచుండిరి. భేరీమృదంగాది వాద్యములు మ్రోగుచున్నవి. వ్రజ మండలమందలి గృహములన్నియు పల్లవతోరణములతోడను చిత్రధ్వజ పతాకాదుల తోడను సుందరముగ నలంకరింపబడియున్నవి. సుగంధ జలముచే కలయంపి చల్ల బడినది. గోవులు, వృషభములు, దూడలు గూడ చిత్రధాతువులచే నలంకృతములు గావింపబడినవి. గోపాలురందరు అమూల్య వస్త్రాభరణాదులతోడను అలంకరించు కొని, హస్తములందనేక కానుక లుంచుకొని నందరాజ గృహమున కానందముతో బయలుదేరినారు. యశోదకు పుత్రుడుదయించుట గోపికలందరికి ఆనంద కారణ మైనది. వారందరు దివ్యవస్త్రాభరణములచే సింగారించుకొనిరి. అందుచే వారి సౌంద ర్యము రెట్టింపైనది. వారు పెట్టుకొనిన కుంకుమ బొట్టు పద్మమందలి కేసరమువలె గాన్పించినది. వారును తమకు తోచిన కాన్కలగొని యశోదాదేవిని సమీపించిరి. వారి చెవులయందలి మణికుండలములు జిగజిగ మెరయుచుండినవి. కంఠములందు స్వర్ణాభరణములు దాల్చి వారు మార్గమందు పోవుచున్నపుడు వారి శిఖలయందు ముడుచుకొనిన పూలు నేలరాలుచుండినవి. నందరాజగృహమున కేగుచున్న యా గోపాంగనల సౌందర్య మపూర్వశోభతో వెలుగొందినది.

నందరాజు గృహము ప్రవేశించి వారందరు శిశువును జూచి, నాయనా, చిరం జీవివగుము. భగవానుడా, యీ శిశువును కాపాడుము అని యాశీర్వదించుచు, సుగంధ జలములందరిపై జల్లుచు, బిగ్గరగా, మంగళగానము లొనర్చిరి.

శ్రీకృష్ణ భగవానుడు సర్వప్రపంచమునకు యేకమాత్ర సార్వభౌముడు. యైశ్వర్యము, మాధుర్యము, వాత్సల్యము లనంతములు. అట్టి మహాత్ముడు నందుని యింట నవతరించిన శుభసమయమందు జన్మోత్సవము మహావైభవముగా జరిగినది. చిత్రవిచిత్ర మంగళవాద్య ధ్వనులు చెలరేగినవి. ఆనందమగ్నులైన యాభీరు లొక రిపై నొకరు పెరుగు, పాలు, నేయి, నీరు క్రుమ్మరించుకొనసాగిరి. నవనీతమును ముఖములయందు మెత్తుచుండిరి. నందుడు ఉదార స్వభావము గలవాడు. ఈ యానంద సమయమందాతడు గోపాలకుల కనేక వస్త్రాభూషణాదులను గోవులను కాన్కలుగా నిచ్చినాడు. తమ విద్యలచే ప్రజలనలరింపుచు జీవించుచుండెడు సూత, మాగధ, వందీజనులు మొదలగు వారందరిని వారు కోరిన వస్తువుల నొసంగి సత్క రించినాడు. ఇట్లు చేయుటలో నాతని యుద్దేశమేమనగా, యిట్టి దానములచే సంప్రీతు డైన విష్ణుభగవానుడు, నా యీ చిన్న తనయుని సర్వదా, సర్వదా రక్షించుగాక యనియె. ఈ యానంద కోలాహలమందు నందగోపాభినందితయై, దివ్యముగా నలంకరించుకొని, వచ్చిపోవుచున్న స్త్రీ జనమున కందరికిని తగిన సత్కారము చేయుటలో గృహస్వామినివలె సహకరించినది రోహిణీదేవి.

ఆనాటినుండియు నందుని గోకులమంతయు సర్వసంపత్సమృద్ధమై యలరారి నది. శ్రీకృష్ణభగవానుని నివాసముచేతను అతని స్వాభావిక గుణముల కారణము చేతను వ్రజమండలము మహాలక్ష్మికి క్రీడాస్థలమైనది.

రాజా, కొలది దినముల యనంతరము నందుడు గోకులరక్షాభారము నితర గోపకుల కప్పగించి, కంసునకు వార్షికకరము చెల్లించుటకై మధురకేగినాడు. నందుడు మధుర కేతెంచిన వార్తవిని వసుదేవుడాతనివద్ద కేగినాడు. వసుదేవుని చూడగనే, మృతశరీరమునందు ప్రాణముచేరినంత మహదానందముతో నందుడు లేచి, రెండుచేతులతో నతని గ్రహించి, గాఢాలింగనము గావించినాడు. నందుడు ప్రేమచే విహ్వలుడైనాడు. గొప్పగా స్వాగత సత్కారము లొనర్చినాడు. వసు దేవుడు, విశ్రాంతితో నుపవిష్టుడైనాడు. అతని చిత్తమాసమయమందు తన కుమా రులయందు లగ్నమైయున్నది. కుశల ప్రశ్నానంతరమాతడు నందునితో నిట్లు బల్కదొడంగె.

"సోదరా, నందా, వయసుపైబడి నిస్సంతానుడవై యున్న నీకు, సంతాన మిక కలుగదను సంతాపముతో చింతించుచున్న సమయమున, అదృష్టవశమున పుత్రుడు జన్మించుట మహా సంతోష కారణము. నేడు మనము సమాగమగుటయు ముదావహము. ఈ సంసార చక్రమందు ప్రియమిత్రుల దర్శనము గూడ దుర్లభము. అట్టి ప్రియమిత్రుడవగు నిన్ను దర్శించగల్గినాడ, ఇది యొక పునర్జన్మగనే భావించవచ్చును. జనులందరును వారి వారి ప్రారబ్ధ కర్మల ననుసరించి చరించు చుందురు. ప్రియస్నేహితులైనను నొక్క చోట యుండుట సంభవింపదు. మహా ప్రవాహములో బోవుచున్న పడవలన్నియు నొకేచోట కలసి పోవుట సంభవము గానట్లు, ప్రారబ్ధ కర్మవశులమగు మనమందరమొకచోట నుండుట సంభవించదు గదా! ప్రస్తుతము నీవు నీ స్వజనులందరితో వసించుచున్న గోకులమందు నీటి సౌకర్యము, పశుగ్రాసము, ఫలపుష్పాదులు, బాగుగా లభించుచున్నవా?ఆ వనము మీ పశువుల కనుకూలముగా నున్నదా? రోగబాధ లేమియులేవు గదా! నా కుమారుడు తన తల్లి యగు రోహిణీదేవితో కూడి, నీ వ్రజమందే యున్నాడు. వాని పాలనా భారమంతయు, నీవు నీ భార్య యశోదయు వహించి యున్నారు. కాన యాతడు మిమ్ములనే తన తల్లి దండ్రులుగా భావించి యుండనోపు,వాడు క్షేమముగానున్నాడు గదా! దేనిచే మనుష్యునకు అతని స్వజనమునకు సుఖము కలుగునో అదియే శాస్త్ర విహితములు ధర్మార్థకామములు (త్రివర్గము). దేనిచే కేవలము తనకు మాత్రమే సుఖము కల్గి, తన స్వజనమునకు దుఃఖము కలుగునో అట్టి ధర్మార్థకామ ములు హితకరములు కాజాలవు."

అని వసుదేవుడు పలుకగా నందుడిట్లు పలికెను. "సోదరా, వసుదేవా' కంసుడు దేవకీ సంతానము నంతయు నంత మొందించె. చివరగా నొక యాడుపిల్ల కలుగగా నదియు స్వర్గమేగినది. కావున ప్రాణుల సుఖ దుఃఖములు వారి వారి యదృష్టముపై నాధారపడి యుండుననుటలో నెట్టి సందేహమును లేదు. ఆ యదృష్ట భాగ్యమే ప్రాణులకేక మాత్రమగు ఆశ్రయము. జీవుల జీవనమునందలి సుఖ దుఃఖములకు అదృష్టమే కారణమని గ్రహించువాడు మోహమునందడు".

అని పల్కిన నందునతో వసుదేవుడిట్లనియె. "సోదరా, నీవు కంసునకు వార్షిక శుల్కము చెల్లించితివి కదా! మనమిరువురము కలిసి మాట్లాడుకొనుట గూడ జరిగినది. నీ విచట నికనెక్కువ దినములుండుట యుచితముగాదు, యేలననగా గోకులమందనేక గొప్ప యుత్పాతములు సంభవించనున్నవి.

అని యెప్పుడు వసుదేవుడు రాబోయే అనర్థములను సూచించెనో, అప్పుడే నందాది గోపాలురందరును అతని యనుమతినంది, యెడ్లబండిపై నెక్కి గోకులము నకు వెడలిపోయిరి.

# ఆ ర వ య ధ్యా య ము

## పూ త నా మో క్ష ము

నందగోపుడు మధురనుండి బయలుదేరి నప్పటి నుండియు వసుదేవుని మాట లను గూర్చియే మార్గమందాలోచించుచుండె. వసుదేవుని మాట లెన్నడు నసత్య ములు కానేరవు. కావున యేమి యుత్పాతములు రానున్నవో యను శంక నందుని హృదయమును బాధింపదొడగినది. అపుడతడు తన మనమునందే "భగవానుడే శరణము అతడే మనల రక్షించగలడని" నిశ్చయ మొనర్చుకొనియె.

పూతన యను మహా క్రూర రాక్షసి యొకతె యుండెడిది. చిన్న పిల్లలను చంపుటయే దాని ప్రత్యేకత. కంసుడాదేశింపగా, ఆమె నగర, గ్రామములు, గొల్ల పల్లెలు మొదలగు చోట్ల తిరుగుచు పిల్లలను భక్షించుట మొదలిడినది. ఎక్కడ నిత్యము రక్షోఘ్నములగు భగవన్నామస్మరణ కీర్తన కర్మలు జరుగకుండునో, అచట మాత్రమే యిట్టి రాక్షస గణము యొక్క యాటలు సాగును. ఆ పూతన యాకాశగమనము చేయగలదు. కామరూపిణి. తన యిచ్చవచ్చిన రూపము దాల్చ గలదు.

ఆ పూతన యొకనాడు నందగోకులము సమీపించి,మాయాశక్తిచేనొకసుందర స్త్రీ రూపము దాల్చి నందగోకులములోనికి ప్రవేశించినది. ఆమె రూప మత్యంత సుందరముగ నున్నది. సుందరములగు వస్త్రాభరణములు ధరించియున్నది. కేశ బంధమందు మల్లికా దామములలంకరించుకొన్నది. కర్ణాభరణ కాంతి చేతను, వ్రేలాడు ముంగురుల తోడను ఆమె ముఖమత్యంత శోభాయమానముగ నున్నది. నితంబములు, కుచ కలశములు నత్యంతోన్నతములై నడుము చాలా సన్నముగా నున్నది. తన మధురమగు చిరునగవుచేతను, కటాక్ష వీక్షణములచేతను వ్రజ స్త్రీల చిత్తము లాకర్షించుచున్నది. చేతి యందు కమలము దాల్చి వచ్చుచున్నయీ రూప వతిని గాంచి గోపికలందరు తమ పతి దర్శనార్థమేతెంచుచున్న మహాలక్ష్మియేమో యని యూహింప జొచ్చిరి.

పూతన బాలకులకొక దుష్ట గ్రహము వంటిది. శిశువులకై యటు నిటు వెదకుచు నామె యనాయాసముగ నందుని యింట ప్రవేశించినది. అచట నామెకు శయ్యపై నిదురించుచున్న శ్రీకృష్ణుడగుపడినాడు. కాని శ్రీకృష్ణుడు దుష్టులకు కాలుడుగదా. నివురుగప్పిన నిప్పువలె నా సమయమందు భగవానుడు తనతేజమును మఱుగు పరచుకొని యుండె. అతడు సర్వచరాచర జగత్తునకు ఆత్మ స్వరూపుడు గావున యీ వచ్చుచున్న యాడుది బాలఘాతినియగు పూతనాగ్రహమని గ్రహించి తన నేత్రములను మూసుకొని, నిద్రను నటించుచుండె.

---

పూతనను జూచి భగవానుడు తన నేత్రములను మూసుకొనుటను, భక్త కవులు, టీకాకారులు ననేక రకములుగా నుత్ప్రేక్షించియున్నారు-వానిలో కొన్ని ఈ క్రింద తెలుపబడుచున్నవి.

1. శ్రీవల్లభాచార్యులు-సుబోధినియందు:- "అవిద్యయే పూతన." నా దృష్టి ముందు విద్యయెట్లుండగలదు? అట్టిచో లీలా ప్రదర్శన మెట్లు జరుగునను భావ ముతో భగవానుడు కనులు మూసుకొనియె నన్నారు.

2. ఈ పూతన బాలఘాతిని. "పూతాసపిన యతి" ఇది పవిత్ర బాలకులను గూడ గొంపోవును. ఇట్టి నీచకృత్యమొనర్చు దుష్టురాలి ముఖము జూడ రాదని కనులు మూసుకొనియె.

3. ఈ జన్మయందీమె యెట్టి సాధనముచేసి యుండలేదు. నన్ను కలుసు కొనుటకు యోగ్యమగు సాధననీమె పూర్వజన్మయందు చేసి యుండవచ్చును. ఆమె గత జన్మలయందొనర్చిన సాధనలను దివ్యదృష్టితో చూచుటకొరకే కనులు మూసు కొనెనేమో భగవానుడు.

4. భగవానుడీరీతిగా నాలోచించె. "నేను పాపిని యొక్క పాలింతవరకు

త్రాగలేదు. లోకులు, కనులు మూసుకొని నేలవేము కషాయమునెట్లు త్రాగెదరో నేనును అట్లే యీమె పాలు త్రాగెదనుగాక" యని కనులు మూసుకొనియెనేమో.

5. భగవానుని యుదరమందున్న యనేక కోటి బ్రహ్మాండముల యందలి జీవరాసులు, భగవానుడు హాలహల సదృశమగు పూతనాక్షీరమును గ్రోల నుండె నని మహాభీతినందినారు. వారి నోదార్చుటకే శ్రీకృష్ణుడు కనులు మూసు కొనియె.

6. "నేను నవనీతాదులు భుజించవచ్చును గదాయని యీ గోకులమందు జన్మించితిని. ఆరవ దినమందే ఈ విషపు పాలను త్రాగవలసిన పరిస్థితి దాపురించి నదే." యను చింతతో కనులు మూసుకొని, శంకరుని ధ్యానించుచు "స్వామీ, నీవు వచ్చి, నీ కలవాటయిన విషమును నీవు త్రాగుము. నేను పాలను త్రాగెదన"ని చెప్పుచున్నట్లున్నది.

7. శ్రీకృష్ణుని నేత్రము లీ విధముగా నాలోచించినవట. "ఈశ్వరుడు సర్వ స్వతంత్రుడు. ఈ దుష్టురాలికి మంచిగతియో, చెడుగతియో యేమి యిచ్చుకొనిన నిచ్చుకొననిమ్ము, కాని మేము మాత్ర మీ దుష్టురాలిని చంద్రమార్గమునగాని, సూర్యమార్గమునగాని పోనీయుము" అని తమ ద్వారములను మూసివైచినవి.

8. నేత్రములాలోచించినవి. "ఈ పూతన నేత్రములు గూడ మీకు సజా తీయములేయైనను, యివి ఈ రాక్షసి యందమును వృద్ధి గావించుచున్నవి. కావున మా జాతికి చెందినవైనను వానిని మేము చూడరాదను" భావముతో ఱెప్పలతో తమను మూసివైచినవి.

9. శ్రీకృష్ణుని నేత్రామందున్న 'నిమి' యను మహాత్ముడు ఆ దుష్టురాలిని భగవానుడు చూడరాదను భావముతో కనులను మూసివైచినాడు.

10. శ్రీకృష్ణుని నేత్రములు రాజహంసలు. 'బకి'యగు పూతనను చూచుట వానికెట్టి యాసక్తియు లేదు గావున మూసుకొనినవి.

11. ఈమె పైకి తల్లి రూపమును దాల్చివచ్చినది. కాని హృదయము క్రూరత్వముతో నిండియున్నది. కావున యిట్టి స్త్రీని చూడకుండుటయే యుచితమను భావనతో భగవానుడు కనులు మూసుకొనియె.

12. 'నా నిర్భయత్వమునుగాంచి ఈ పూతన తన ప్రభావము నాపై పని చేయదు అను భావముతో యెక్కడ తిరిగిపోవునో, యను శంకతో భగవానుడు కనులు మూసుకొనియె.

13. బాలలీలలు ప్రారంభించుట మొట్టమొదటగా స్త్రీ తగవుతో ప్రారంభ మెనదే యను చింతచే, విరక్తి పూర్వకముగా భగవానుడు కనులు మూసు కొనియె.

14. కరుణా దృష్టితో చూచినచో నేసీమెను చంపుట సంభవించదు. ఉగ్రదృష్టితో చూచిన వెంటనే భస్మమగును. లీలాసిద్ధి కలుగవలెనన్న కనులు మూసుకొనుటయే యుత్తమమని" కృష్ణుడు కనులు మూసుకొనియె.

15. "ఈమె ధాత్రీ (తల్లి) రూపమును దాల్చి వచ్చినది. కాన ఈమెను చంపుట యుచితముగాదు. కాని ఈమె యితర గొల్ల పిల్లలను గూడ చంపునుగదా. కావున ఈమె రూపమును చూడకుండ ఈమెను చంపనేవలయు"నని కనులు మూసుకొనియె.

16. గొప్పగొప్ప యాపదలు గూడ యోగముచే తొలగిపోవును. అందుచే భగవానుడు కనులు మూసుకొని యోగసాధన చేయుచున్నట్లుండె.

17. పూతన, వ్రజభూమి యందలి శిశువుల నందరిని చంపెదనను వ్రజ సంకల్పముతో వచ్చినది. కాని భక్తపరాయణుడగు భగవానుని కరుణచే నామె కచట శిశువొక్కడు గూడ కనుపించడాయె. బాలకుల వెదకుచు నామె లీలాశక్తి ప్రేరణచే సరిగా నందుని యింటికే చేరినది. "నా భక్తుడగువాని కపకారము చేయుటయటుండనిమ్ము. నా భక్తున కసకారము చేయదలచు దుష్టుని సఖులు, పరమ భక్తులు. పూతన వారందరిని చంపు నుద్దేశముతో నేతెంచినది. అందుచే నామె ముఖమును చూడదలచక, భగవానుడు కనులు మూసుకొనియె.

18. పూతన తన భయంకర రూపమును మఱుగుపరచి రాక్షసీ మాయచే దివ్యరమణీ రూపమును దాల్చి వచ్చినది. భగవానుని దృష్టి ప్రసరించినచో రాక్షసి మాయ నిలువలేదు. నిజస్వరూపము బయల్పడును. ఆ భీషణరూపమును తన సమీప మందు గాంచినచో యశోదామాత మిక్కిలి భీతిల్లగలదు. పైగా తన చిన్నారి పాప నికి ప్రాణభయము కల్గునేమో యను శంకచే హఠాత్తుగ ఆమె ప్రాణములే పోవు నేమో అను శంకచే భగవానుడు కనులు మూసుకొనియె.

19. పూతన హింసాపూర్ణమగు భావముతో వచ్చినది. ఆ హింసకు తగిన దండన మాత్రము విధించక, భగవానుడామె ప్రాణములను మాత్రము హరించి యామెకు పరమ సౌభాగ్యమును ప్రసాదించదలచినాడు అతడు సకల కళ్యాణ గుణములకు గనిగదా! అందు ధృష్టత మొదలగు దోషములు లేశమాత్రముగూడ లేవు. పూతనకు శుభము గల్గించుటకైనను ఆమె ప్రాణవధ చేయుటకు భగవానుడు సిగ్గుపడినాడు. ఆ లజ్జచేతనే అతడు నేత్రములు మూసుకొనియె.

20. భగవానుడు యీ జగత్తునకు తండ్రి దైత్య దానవ రాక్షసులందరు అతని సంతానమే. కాని వారెల్లపుడు విశృంఖల వృత్తితో చరించుచున్నారు. కావున వారిని దండించుట అవసరమైనది. ప్రేమగల తల్లిదండ్రులు సేచ్ఛాచారియగు పుత్రుని దండించు సమయమందు మిక్కిలి బాధపడెదరు. కాని వానిని భయపెట్టుట

ఏ మానవుడైనను భ్రాంతిచేత, మెట్టుల నిద్రించుచున్న పామును త్రాడని భావించి లేవనెత్తునో, అటులనే పూతన, తన పాలిటి మృత్యుదేవతయగు శ్రీకృష్ణుని సాధారణ మానవశిశువుగా భావించి, తన యొడిలోనికి తీసుకొనినది. సుందరకోశమందు దాగియున్న పదునుకత్తితో సమానమగు పూతనా హృదయ మత్యంతకుటిలము. కాని పైకి మిక్కిలి సుందరముగ గొప్పయింటి యాడపడుచు వలె కనుపించుచున్న యామె భద్రమూర్తిని గాంచిన రోహిణీ యశోదలామె నడ్డగించలేకపోయినారు. నిశ్చేష్టులై యుండిపోయిరి.

పూతన శిశువునొడి యందుంచుకొని, భయంకర విషపూరితమగు తన స్తనము నతని నోటి యందుంచినది. భగవానుడు రోషసహితుడై తన హస్తము లచే నామె స్తనములను గట్టిగా బట్టుకొని, యామె ప్రాణములతో కూడ పాలను త్రాగదొడగె. (అతడు పాలను త్రాగుచుండగా నతనికి సహకారిగానున్న క్రోధ క్రోధాధిష్టాన దేవతయగు రుద్రుడు ఆమె ప్రాణములను పానమొనర్చినది.) ప్రాణ ములకాశ్రయభూతములగు మర్మస్థానములు భగ్నమగుచుండగా పూతన, “ఇక చాలు, వదులుము, వదులుము”ని యాక్రోశించుచు నామె కాళ్ళు, చేతులు కొట్టుకొన సాగినది. ఏడ్చినది. కన్నులు వెళ్ళుకొచ్చినవి. శరీరము చెమటతో తడిసిపోయినది. ప్రాణోత్క్రమణ సమయమందామె యఆపతి భయంకరముగ నుండె. పర్వత సహితముగ పృథివియు, గ్రహసహితముగ నంతరిక్షమును చలించిపోయినవి. సప్త పాతాళములు, దిక్కులును ప్రతిధ్వనించినవి. అశనిపాతమను శంకతో ననేకులు భూమిపై చైతన్యరహితులై పడిపోయిరి. ఆ రాక్షసి స్తన పీడితయై ప్రాణములు వీడి వికీర్ణకేశయై, కాళ్ళు చేతులు చాచుకొని రాక్షసీ రూపమున వెల్లకిల పడిపోయి నది. ఇంద్రుని వజ్రాయుధముచే నిహతుడైన వృత్రాసురునివలె పూతన, గోష్ఠము నకు వెలుపల వికారరూపమున పడిపోయినది.

పూతన తనువు నేలపైపడుచు ఆరుక్రోసులమేరయున్న చెట్లనన్నిటిని చూర్ణ

---

కొరకు, తమ బాధను పైకి కనుపడనీయరు. ఈ ప్రకారమే భగవానుడు అసురులను వధించునప్పుడు, పితృసంబంధముచేత దుఃఖము కలిగినను వారికి భీతి కల్గించుటకై తన దుఃఖమును ప్రకటితముగానీయడు. శ్రీకృష్ణుడిపుడు పూతనను సంహరింప దలచినను, ఆమె మరణబాధను తన కనులతో చూడనిచ్ఛగించక నేత్రములు మూసుకొనియె.

21. చిన్నపిల్లలు తమ తల్లి సమీపమున బాగా ఆడుకొనుట వారి స్వభా వము. కాని యెవరైన క్రొత్తవారు వచ్చినపుడు కనులు మూసుకొనియెదరు. పూతన యపరిచిత గావున లీలావినోదియగు శ్రీకృష్ణుడు కనులు మూసినాడు. ఇది పూతని బాలలీలయొక్క మాధుర్యము.

మొనర్చినది. అది మహాద్భుతమనిపించినది. ఆమె శరీరమతి భయంకరముగనున్నది. నాగలిక్రరువంటి కోరలతో గూడిన నోరు, గిరిగుహవంటి నాసిక, గండ శైలముల వంటి స్తనములు, విరబోసుకొనియున్న యెర్రని వెంట్రుకలు, అంధ కూపముల వంటి కనుగుంటలు, నితంబము నదియందలి యిసుకతిన్నెలవలె చూపట్టుచుండె. భుజములు, జంఘలు సేతువులవలెను, ఉదరము యెండిపోయిన సరోవరము వలెను గాన్పించుచుండినవి.

♦ పూతనయొక్క భయంకరాకారమును గాంచిన యా గోపీగోపకులందరును భయాక్రాంతులైరి. దాని యరపుల కింతకు పూర్వమే వారి హృదయములు, కర్ణభేరులును భిన్నములై యుండినవి. కాని ఆశ్చర్యము! బాల కృష్ణుడు మాత్రము నిర్భీతితో నామె వక్షఃస్థలమందాడుకొనుచున్నాడు. ♦ ఆ దృశ్యమును గాంచి, కళవలపడుచు కొందరాబాలుని క్రిందకు దెచ్చిరి. రోహిణీ యశోదలతో పాటు కొందరు గోపికలు, ఆవుతోక త్రిప్పుట మొదలగు రక్షాక్రియలొనర్చినారు. బాలకృష్ణునకు, గోమూత్రముచే స్నానము చేయించినారు. గోధూళిని శరీరమందలదినారు. పిమ్మట నతని ద్వాదశాంగములందు కేశవాది ద్వాదశనామములతో గోమయముచే రక్షావిధి గావించినారు. అనంతరము వారాచమించి, 'అజా'ది పదునొకండు బీజ మంత్రములచే నా యాస్థానములందు—అంగన్యాసకరన్యాసములొనర్చి బీజన్యాస మొనర్చిరి.

"అజుడు (పుట్టుక లేనివాడు) నీ పాదములను రక్షించుగాక. మణిమంతుడు నీ జానువులను, యజ్ఞపురుషుడు నీ యూరువులను, అచ్యుతుడు నీ కటి తటమును,

---

♦ పూతన వక్షమందాడుకొనుచున్న శ్రీకృష్ణుడిట్లు తన మనమందుకొనుచున్నట్లుండె:-

"స్తనంధయస్య స్తనఏవజీవికాదత్తస్స్వయాస స్వయమాననేమమ
మాయాచపీతోమ్రియతే యదిత్వయాకిం వామమాగం స్వయమేవకథ్యతాం"

'నేను పాలుత్రాగు వయసునందున్న పాపడను స్తన్యపానమే నా జీవనాధారము. నీవే స్వయముగా నీ స్తనమును నా నోటియందుంచితివి. నేను త్రాగితిని. దానిచే నీవు మరణించినచో, యిందు నా దోషమేమున్నదో నీవే చెప్పుము.'

♦ పూతన పూర్వజన్మమందు బలి చక్రవర్తి కన్యయగు రత్నమాల. యజ్ఞశాలకు వామన రూపమున నేతెంచిన భగవానుని గాంచి, ఇట్టి తనయుడు నాకున్నచో నేనాతనికి స్తన్యమొసంగి యానందించగలను గదా యని పుత్రభావము కల్గినదామెకు, భగవానుడు తన భక్తుడగు బలియొక్క పుత్రిక యాంతర్యమును గ్రహించి, మనసునందే యామె మనోరథ మీడేరుగాక యని యనుగ్రహించె. ఆమెయే ద్వాపరమున పూతనగా జన్మించి, శ్రీకృష్ణ స్పర్శచే లబ్ధమనోరథయైనది. (గర్గ సంహిత)

హయగ్రీవుడు నీ జఠరమును, కేశవుడు నీ హృదయమును, ఈశ్వరుడు నీ యుదరమును, సూర్యుడు నీ కంఠమును, విష్ణువు బాహువులను, త్రివిక్రముడు ముఖమును, ఈశ్వరుడు నీ శిరమును రక్షించెదరుగాక" యనుచు బాలునకు రక్షాక్రియలు గావించిరి. చక్రహస్తుడగు భగవానుడు నీకు రక్షగా ముందువైపుండుగాక. గదాధారియగు శ్రీహరి నీ వెనుక యుండుగాక. ధనుర్ధారియగు మధుసూదనుడు, ఖడ్గ హస్తుడగు అజనుడు నీ యిరుప్రక్కల నుండి రక్షింతురుగాక. శంఖాధారి, ఉరుగాయుడు నాలుగు మూలల యందును, ఉపేంద్రుడూర్ధ్వమందున, హలధరుడు క్రింద భాగమందునను, శ్వేతదీపాధిపతి చిత్తమును, యోగీశ్వరుడు మనస్సును, పృశ్నిగర్భుడు నీ బుద్ధిని, పరమాత్మ నీ యహంకారమును రక్షింతురుగాక. ఆటలయందు నిన్ను గోవిందుడును, నిద్రించునపుడు మాధవుడును, నడుచుచుండునపుడు వైకుంఠుడను, కూర్చుండునపుడు శ్రీపతియు, భుజించునపుడు యజ్ఞభోక్తయు, సర్వగ్రహ భయంకరుడై నిన్ను రక్షించుగాక.

డాకినీ, రాక్షసీ, కూశ్మాండాది బాలగ్రహములు, భూతప్రేత, పిశాచ, యక్ష, రాక్షస, వినాయక, కోటరా, రేవతీ, జ్యేష్ఠా, పూతనా, మాతృకాదులును, శరీర, ప్రాణ, యింద్రియముల నాశమొనర్చునట్టి యున్మాద, అపస్మారాది రోగములు, స్వప్నమందగుపడు మహోత్పాతములు, వృద్ధగ్రహములు బాలగ్రహాది సమస్త అరిష్టములను, విష్ణుభగవానుని నామోచ్చారణచే నశించిపోవుగాక" యని యందరాశీస్సుల గురిపించిరి.

(ఈ ప్రసంగమును పఠించుచు భావుకుడగు భక్తుడీవిధముగ భగవానునితో పలికె. "భగవంతుడా, నీ కంటెను నీ నామశక్తియే గొప్పదని తెలియుచున్నది. ఏలననగా, నీవు ముల్లోకములను రక్షించుచుండగా నీ నామము నీకు రక్ష గావించుచున్నది గదా!

"పరీక్షన్మహారాజా, ప్రేమపాశముచే బద్ధులైన గోపికలందరు శ్రీకృష్ణ భగవానునికి రక్షాక్రియ లొనర్చిరి. యశోద శిశువుకు పాలిచ్చి ప్రక్కపై పరుండబెట్టి నిద్ర బుచ్చినది. ఇంతలో నందగోపుడు తన సహచరులతో గూడి మధురనుండి గోకులమును ప్రవేశించె. పూతనా శరీరమును గాంచి వారతి విస్మితులైనారు.

"అహో, యేమి యీ యాశ్చర్యము. నిజముగా యే ఋషియో వసుదేవుడుగా జన్మించి యుండునోపు"లేక పూర్వభవమందాతడే యోగియై యుండవచ్చు. ఏలననగా అతడు చెప్పినట్లే యిచ్చట నుత్పాతములు గానవచ్చుచున్నవి" యని నందుడు తలచెను. గోపకులందరు గొడ్డళ్ళతో పూతనా శరీరమును ముక్కలక్రింద నఱికి, గోకులమునకు దూరముగా గొంపోయి చితిపైనుంచి దహన మొనర్చిరి. దగ్ధమగుచున్న యా దేహమునుండి యగరుధూపమువంటి సుగంధయుక్తమగు ధూమము వెలువడినది. ఆశ్చర్యమేమున్నది! భగవానుడామె స్తన్యము గ్రోలుటతోడనే యామె

సర్వపాపములు నశించినవి. పూతన శిశువులను జంపునట్టి దుష్టరాక్షసియే గావచ్చు. రక్తపిపాసియే గావచ్చు. భగవానుని గూడ ఆమె చంపవలయుననియే స్తన్యమొసంగుట గూడ నిజమేయైనను ఆమెకు పరమపదము లభించినది. మహాత్ములకు గూడ దుర్లభమగునట్టి దాని నామె పొందగలిగినది. అట్టిచో, ఆ పరమపురుషుని భక్తిశ్రద్ధలతో తల్లివలె సేవించి ప్రేమ పూర్వకముగ తన కత్యంత ప్రియమగు వస్తువులను-భగవానునకు ప్రీతిపాత్రములగు వానిని—సమర్పించువాని విషయములో నిక చెప్పెడిదేమి! సర్వులకు వందనీయులగు బ్రహ్మేశానాది దేవతలందరు గూడ నారాయణుని చరణకమలములకు వందనము లొనర్తురు. అట్టి చరణకమలములచే పూతనా శరీరమును త్రొక్కుచు భగవానుడామె స్తన్యమును పానమునర్చినాడు. ఆమె రాక్షసియే యైనను, తల్లికి లభించునట్టి యుత్తమోత్తమ గతినామె పొందగల్గినది. అట్టిచో నతడు అత్యంత ప్రేమతో యే గోవుల, యే తల్లుల యొక్క పాలుద్రాగెనో వారికి లభించు పరమగతి నెవరూహింపగలరు. కైవల్యాదుల నన్నిటిని ప్రసాదించగల పరమాత్ముడతడు. అనవరతము కృష్ణుని యందలి ప్రేమచే స్రవించుచున్న యా గోవుల యొక్కయు, తల్లుల యొక్కయు పాలనాతడు గ్రోలె. ఆతనిని నిత్యము పుత్ర ప్రేమతో వీక్షించుచుండెడి యా గోపికలకు గోవులకు మరుజన్మ యుండునా!

(వత్సాపహార ఘట్టమందు బ్రహ్మచే నపహరింపబడిన దూడల, గోప బాలుర రూపములన్నియు తానే ధరించి యా తల్లుల పాలు ద్రావెగాన బహువచనము)

ఈ జనన మరణ రూపమగు సంసారమునకు కారణము అజ్ఞానము. భగవత్సాంగత్యముచే వారికా యజ్ఞానము తొలగిపోయినది గాన, తత్కార్యమగు సంసార బంధముండజాలదు.

చితిపై నుండి వచ్చుచున్న సుగంధ పరిమళము గాంచి నందాది గోపకులందరు ఆశ్చర్యపడిరి. తిరిగి వారు గోకులము ప్రవేశింపగా నచటి వారు జరిగిన పూతనా వృత్తాంతమంతయు వారికి వినిపించిరి. మహాశ్చర్యమైనది నందునకు. తన పిల్లవాడు మృత్యుముఖము నుండి తప్పించుకొన్నట్లు భావించి యాతడా పసివానిని యొడి యందుంచుకొని మరల మరల ముద్దాడినాడు. ఆనందించినాడు. ఈ పూతనా మోక్ష కథను శ్రద్ధతో విను వారలకు బాలకృష్ణుని యందు పరమ ప్రేమ లభించును. శ్రీధరీయం శ్లోకః :-

శ్లో॥ అత్తుం దైత్యకులానీశః పూతనాయాశ్శిశుశ్ఛలాత్
స్తన్యాపోశనతః ప్రాణైః ప్రాణాహుతిమకల్పయత్

దైత్యకులమును భుజించుటకై యీశ్వరుడు పూతనా స్తన్యము నాపోశనబట్టి పూతనా ప్రాణములనే ప్రాణాహుతులొనర్చెనని శ్రీధరస్వామి వచించిరి.

# సప్తమాధ్యాయము

## శకట భంజనము – తృణావర్త మోక్షము

"శ్రీ శుకదేవా, సర్వశక్తిమంతుడగు విష్ణుభగవానుడు అనేకావతారములు దాల్చి బహుసుందరములును శ్రవణపేయములునగు లీల లొనర్చుచుండును. అట్టి కథలను వినుచుండుటచే వానియందు రుచియు, విషయ సుఖములందాసక్తియు పారి పోవుచుండును. మానవుని యంతఃకరణము శీఘ్రముగ పరిశుద్ధమగును. భగవంతున యందు భక్తియు, నతని భక్తులయందు ప్రేమయు లభించును. అట్టి భగవత్కథా శ్రవణమునకు నేనర్హుడనని మీరు భావించినచో భగవానుని యా మనోహర లీలలను వర్ణింపుడు, మాయామానవుడుగా నవతరించిన యా కృష్ణ భగవానుని యద్భుతమగు బాల లీలలను వర్ణింపవేడెద" అని పరీక్షిన్మహారాజు అడుగగా, శుకయోగి యిట్లు చెప్పదొడంగె.

"రాజా, బాలకృష్ణుడు పెరుగుచున్నాడు. ప్రక్కలో బోర్ల పడుతుండగా, యింటియందు వేడుక జరుపుచున్నారు. ఆనాడతని మూడవనెల పుట్టినరోజు గూడ యైనది. ఇంటియందు పేరంట్రాండ్ర సమూహము చేరియున్నది, పాటలు పాడు చున్నారు. మేళతాళములు మ్రోగుచున్నవి. ఆ స్త్రీ సమూహ మధ్యమందుండిన యశోద తన తనయున కభిషేకము గావించినది. ఆ సమయమున బ్రాహ్మణులు మంత్రములు చదువుచు ఆశీస్సు లొసంగుచుండిరి. నందపత్నియు సుస్నాతయై బ్రాహ్మణులకు పూజగావించి సన్మానించినది. వారు స్వస్తివాచనము లొనర్చిరి. బాల కృష్ణుడు బడలియున్నట్లు, నిద్ర వచ్చుచున్నట్లు తోచగా, యశోదాదేవి యాతనిని పరుండబెట్టినది. శ్యామసుందరుడు కొద్దిసేపటిలోనే లేచి, పాలకొరకేడువదొడగె. ఆ సమయమందు యశోదాదేవి, ఉత్సవ సందర్భముగా వచ్చిన వ్రజవాసినుల స్వాగత సత్కారకార్యమందు మగ్నమై యుండుటచేత పిల్లవాని ఏడుపామెకు వినిపించదాయె. శ్రీకృష్ణుడేడ్చుచు కాళ్ళు ఝాడించుచుండె. ఆ సమయమందతడొక ♦ బండి క్రింద నుండి యున్నాడు. అతని మృదుపాదము తగిలినంతనే బండి తల్లక్రిందులు పడి పోయినది

---

♦ హిరణ్యాక్షుని పుత్రుడుత్కచుడను మహాబలవంతుడుండెడివాడు. ఒకనాతడు లోమశ మహర్షి యాశ్రమమందలి వృక్షములను పడగొట్టగా, ముని కోపించి, "ఓరీ దుష్టుడా నీవు విదేహుడవు గమ్మని శపించె. వెంటనే యాతడు లోమశుని పాదము లపై బడి క్షమాభిక్ష నర్థించి తనకు శరీర ప్రాప్తి కల్గించుమనివేడె. "స్వామీ, దయా మయా, తమ ప్రభావము నెరుగక యపరాధ మొనర్చితి" నన్నుచున యతని ప్రార్థననాలించి ముని ప్రసన్నుడై, "వైవస్వతమన్వంతరమున శ్రీకృష్ణ చరణ స్పర్శచే నీకు ముక్తి కలుగుగాక" యని పలికె. ఆ యసురుడే శకటమందావేశించి భగవానుని పాదస్పర్శచే ముక్తుడాయె. మహాత్ముల శాపములు గూడా వరములుగా పరిణమించును గదా! (శకటాసుర మోక్షము, గర్గ సంహిత)

ఆ శకటముపై దధిక్షీరాద్యనేక భాండములున్నవి. అవి యన్నియు, శకట సహితముగ చిన్నా భిన్నమై పోయినవి. ఔత్థానిక మహోత్సవమునకేతెంచిన స్త్రీ లందరును, యశోదా రోహిణీ సహితముగ నందుడును, గోపగణమంతయు యీ యుత్పాతమునకు తల్లడిల్లిపోయిరి. "అరే, యీ బండి తనంత తానెట్లు పడిపోయి నది?" అని అత్యంతాశ్చర్యమగ్న మానసులైరి. అందుకు వారికే కారణమును కనుపించలేదు. సమీపమందాడుకొనుచున్న గోపబాలురు పెద్ద వారితో, "యీ చిన్ని కృష్ణుడే యేడ్వుచూ తన పాదముతో బండిని తన్ని పడగొట్టినాడు. ఇందెట్టి సందే హము లేదని" చెప్పిరి. కాని యవి పిల్లల యజ్ఞాన వాక్యములని భావించి పెద్దలు విశ్వసింపరైరి. అది సహజమే కదా! ఆ మాయా శిశువు యొక్క యినంత శక్తి వారికేమి తెలియును?

శ్లో॥ బాలుండెక్కడబండి యెక్కడనభో భాగంబుపై జేద్పడన్
గాలందన్నుట లెక్కడాటపడుచుల్ గల్లాడి రీజడ్డువ
ల్కేలోకంబునసైన జెప్పబడునే యేచంద మోకాకయం
చాలాపించుచు వేల్పువ్రేతలు ప్రభూ తాశ్చర్య లైరంతటన్ (పోతన)

ఇది యేదో గ్రహ చేష్ట యని భావించిన యశోద వెంటనే యేడ్చుచున్న పిల్లవాని నెత్తుకొని బ్రాహ్మణులచే శాంతి పాఠములు చదివించి, ప్రేమతో పాలా సంగినది. బలవంతులగు గోపాలురాబండిని లేవనెత్తి యథా పూర్వకముగ నమర్చిరి. బ్రాహ్మణులు హోమములు సల్పి, మంగళ ద్రవ్యములతో భగవానునికి ఆ బండికి గూడ పూజ గావించిరి. "ఎవరితరుల దోషములు పరిగణింపక యుందురో, అసత్యములు పల్కకుందురో, దంభము, ఈర్ష్య, పరహింస గావింపక యుందురో, అభిమాన వర్జితులై, సత్యశీలురై యుండునట్టి బ్రాహ్మణోత్తముల యాశీర్వాద మెన్నటికిని విఫలము గాదు." అని భావించిన నందుడు, బాలుని తన యొడి లోనికి తీసుకొని నాలుగు వేదముల మంత్రముల ద్వారా పవిత్రము గావింప బడినట్టియు, పవిత్రౌషధులతో గూడినట్టియు జలముచే బాలునికి స్నానము చేయించి, బ్రాహ్మణోత్తములచే స్వస్తి వాచనము చేయించి, యిష్టమృష్టాన్నములచే వారిని సంతృప్తులగావించి, యనంతరము పుత్రునియభ్యున్నతి నాకాంక్షించినవాడై, సర్వలక్షణ లక్షితములగు గోవుల ననేకము వారికి దాన మొసంగినాడు. ఆ గోవులు వస్త్రాభూషణములచేతను పుష్పమాలల చేతను అలం కృతములైనట్టివి. వారును అత్యంత సంతృప్తులై హృదయపూర్వకముగ నాశీర్వ దించిరి. వేదవేత్తలు, సదాచారపరులు నగు విప్రోత్తముల యాశీస్సు లెన్నటికిని రిత్తబోవని స్పష్టమైనది.

ఒకానొక దినమందు యశోదాదేవి తన కన్నయ్య నొడియందుంచుకొని ముద్దాడుచున్నది. ఉన్నట్లుండి యతడామెకు మహాభారముగా భాసించినాడు. ఆమె భారపీడితయై శిశువును నేలపై నుంచినది. ఇది యామెకత్యంత విస్మయము కల్గించినది. భగవన్నామమును స్మరించుకొని, యామె తన గృహ కృత్యములందు లగ్నమైనది.

తృణావర్తుడను వాడొక రాక్షసుడు. వాడు కంసుని భృత్యుడు. కంసుడు పంపగా నతడు సుడిగాలి రూపమున గోకులమునకు వచ్చి యట నున్న బాలకృష్ణు నాకసమునకు గొంపోయెను. ఆ సుడిగాలితో లేచిన దుమ్ము గోకుల మంతయు వ్యాపించినది. అందరి కన్నులలోను దుమ్ము పడుటచే యెవ్వరును యేమియు చూడలేక పోయిరి. వాని భయంకర గర్జనచే దిశదిశలు మార్మ్రోగినవి. రెండు గడియకాలము గోకులమాకులమై గాఢాంధకారమున మునిగిపోయినది. యశోదాదేవి తాను పిల్లవానిని దించి వచ్చిన ప్రదేశమునకు బోయి చూడగా నచట బాలుడగుపడ లేదు. ఆమె యావేదన కంతులేక పోయినది. గోపాలురందరు గాలి దుమారముచే నిస్తేజులై యుండిరి. యశోద, కుమారుడగుపడనందుకు కుములుచు, దూడను బోగొట్టుకొనిన యావువలె, యుద్విగ్నమై యలమటించుచు చైతన్య రహితయై భూమిపై పడిపోయినది.

గాలి దుమారము శాంతించినది. యశోద యేడుపు వినిపించగా గోపికలామె వద్దకు పర్వెత్తిరి. నందనందనుడచట గానుపించనందున వారి కత్యంత సంతాపము కలిగినది. వెక్కి వెక్కి యేడువ దొడగినారు. వారి కనులవెంట దుఃఖాశ్రువులు కాల్వలై పారదొడగినవి.

అటతృణావర్తుడు భగవాను నాకసమునకు గొంపోయిన యనంతరమతని వేగము మందమైనది. బాలుడు మహాభారముగా పరిణమించుటచే రక్కసుడా భార మును భరింపలేక పోయినాడు. తనకంటెను భారమైన బాలుడతనికి నీల పర్వతము వలె స్ఫురించినాడు. ఇక ముందుకు సాగలేకపోయినాడు. ఆ యద్భుత బాలకు డాతని కంఠము నత్యంత గాఢముగ బట్టుటచే తృణావర్తుడాతని నుండి విడిపించు కొనలేక పోయినాడు. అసురుని చేష్టలుడిగినవి. కంఠము బిగియుటతో కనుగ్రుడ్లు వెలికి వచ్చినవి. మాట పడిపోయినది. చివరకు ప్రాణ వాయువులే యంతరించుటచే దైత్యుని మృతదేహము బాలునితో గూడ వ్రజ భూమి యందు పడిపోయినది. * తృణావర్త రాక్షసునకీవిధముగ ముక్తి లభించినది.

దైత్యుని శరీరమంతరిక్షమందుండి శిలపైనబడి పగిలి, అవయవములన్నియు

---

*** తృణావర్తుడు :**

పాండు దేశమందు సహస్రాక్షుడను నొక రాజుండెడువాడు. అతడు తన రాణులతో గూడి నర్మదా తీరమందు విహరించుచుండె. దుర్వాస మహాముని

చెల్లాచెదరైనవి. రుద్రుని బాణములచే తెగిపడిన త్రిపురాసుర శరీరశకలములవలె నున్న వానిని, అచట గుమిగూడి రోదించుచున్న గోపికలు చూచినారు. ఆ రక్కసుని వక్షస్థలమందు బాలకృష్ణుడు వ్రేలాడుచుండుట గాంచి వారత్యంత విస్మయావిష్టులైనారు. వెంటనే వారా బాలకుని గొనివచ్చి యశోద కందిచ్చినారు. బాలకుడు మృత్యుముఖమునుండి వెలువడినాడు. బాలకుడు రాక్షసునిచే నెత్తుకొని పోబడినను, బ్రతికి బయటపడినందుకు యశోదాది గోపికలును, నందాది గోపాలురునందర మందానంద కందళిత హృదయారవిందులైరి. "ఆహా. యేమాశ్చర్యము! ఎంతటి యద్భుత ఘటన! ఈ పసివాడు రాక్షసునిద్వారా మృత్యుముఖమందు పడవేయబడినాడు. కాని బ్రతికిబయటపడినాడు. ఆ దుష్టరాక్షసుని వాని పాపమే తినివేసినది. సాధుపురుషులు తమ సమత్వబుద్ధిచేతనే సమస్తభయములనుండి విడివడుదురు. మనము పూర్వజన్మ మందెట్టి తపము, భగవదర్చన, యిష్టాపూర్తములు, భూతతృప్తులు గావించు యుంటిమో తెలియదుగాని, వాటి ఫలితముగానే నేడీ బాలకుడు, మృత్యుముఖమున ప్రవేశించియు, మన నానందింపజేయుటకై మగిడివచ్చియున్నాడు! ఇది చాలా యదృష్టమే!" అని యటనున్న వారందరు చెప్పుకొని యానందించుచుండిరి. ఇట్టి మహోత్పాతములు గల్గుచుండుట గాంచిన సందునకు వసుదేవుని పలుకులపై మఱింత నమ్మకము కుదురజొచ్చినది.

ఒకనాడు యశోద తన ముద్దుబిడ్డని యక్కున జేర్చుకొని మక్కువతో పాలిచ్చుచున్నది. పాలుత్రాగుట దాదాపు పూర్తియగుచుండగా చిరునగవుతో ముద్దులొలుకుచున్న చిన్నికృష్ణుని ముఖారవిందమును, తల్లి తమకముతో ముద్దులాడ సాగినది. ♦ శ్రీకృష్ణు రొక్కపరి యావులించినాడు. ఆవలించిన యా బుడుతని నోటియందు, ఆకాశము, అంతరిక్షము, జ్యోతిర్మండలము. దిక్కులు, సూర్య చంద్రులు, అగ్ని, వాయువు, సముద్రము, ద్వీపములు, పర్వతములు, నదులు, వనములు, మరియు సమస్త చరాచరప్రాణిజాతము యశోదకు కనుపించినవి.

పరీక్షిన్మహారాజా, తన చిన్నికృష్ణుని నోటియందు విశ్వదర్శన మొనర్చిన యశోద శరీరము కంపింప దొడగినది. తన విశాలనయనము లొక్క యుదుటున మూసుకొనినది. ఆమె అత్యంత భయాశ్చర్యచకితయైనది.

---

యటువైపురాగా, కేళీ విలాసములందు మునిగియుండుటచే రాజాతని రాక గమనింపక, నమస్కరింపడాయె. కోపించినముని "నీవు రాక్షసుడవుగమ్మ"ని శపించె. ఆశాప వాక్యము చెవినిబడగనే రాజా పశ్చాత్తప్తుడై, యాతని పాదములపై బడి క్షమింపవేడె. దుర్వాసుడు కరుణించి, "శ్రీకృష్ణ భగవానుని శరీర స్పర్శ కలిగినంతనే నీవు ముక్తుడవు కాగలవు" అని పలికె. ఆ రాజే తృణావర్తుడుగా జన్మించి శ్రీకృష్ణాంగ స్పర్శచే ముక్తుడాయె.

♦ జనని స్నేహమయి ప్రేమతృష్ణాపూరితుడు తనయుడు. ఎన్నిపాలు త్రాగి

శ్లో. స్తన్యం కియత్ పిబసిభూర్యలమరక్ష్వేతి
వ ర్తిష్యమాణవచనాం జననీం విభావ్య
విశ్వంవిభాగి పయసోఽస్యనకేవలోఽహ
మస్మాద చర్శిహరిణాకిము విశ్వమాస్యే!

వాత్సల్యమయియగు యశోద తన కన్నయ్య నోటియందు విశ్వామునుగాంచి భయకంపితయైనది. వాత్సల్య ప్రేమరసభావిత యగుటచే దాని నామె విశ్వసింప జాలకపోయినది. ఈ విశ్వమీతని చిన్ననోటియందెటుల వచ్చినది? ఇది నా దృష్టి లోపము అను భావముచే గాబోలు ఆమె కనులు మూసుకొనినది.

# ఎనిమిదవ అధ్యాయము

## నామకరణ సంస్కారము-బాలలీల

"రాజా, యదువంశమునకు పురోహితుడు గర్గాచార్యుడు. అతడు మహా తపస్వి. వసుదేవుని ప్రేరణచే నొకనాడతడు నందుని వ్రేపల్లెకు విచ్చెసె. నందుడు మహానందముతో ప్రాంజలియై యతని పాదములకు ప్రణమిల్లి, భగవద్భావనతో నతనికి పూజ యొనర్చి, యతిథి సత్కారానంతరమతడు విశ్రాంతిగా నుపవిష్టుడై యున్న తజి, వినయముగా నందుడతనితో నిట్లు పలికె.

శ్లో. మహద్విచలనం నృణాం గృహిణాందీనచేతసాం
నిఃశ్రేయసాయభగవ- న్నాన్యథా కల్పతేక్వచిత్
జ్యోతిషామయనంసాక్షా- ద్యత్తజ్ఞానమతీంద్రియం
ప్రణీతంభవతాయేన పుమాన్వేదపరాపరం

"మహాత్మా, మీరు పూర్ణకాములు. నేను మీకేమి సేవ యొనర్పగలను? తమ వంటి మహానుభావులు మావంటి సామాన్యుల గృహస్థుల యిండ్లకు వచ్చుట మాకు మహద్భాగ్యము. మేము మా గృహకృత్యములందత్యంత నిమగ్నులమై యుండి,

---

నను భగవానునకు తనివితీరుటలేదు. తల్లికి కొంచెము సందేహము కలిగినది యెక్కువ త్రాగినచో అజీర్ణము చేయునేమోయని, అతి ప్రేమ యెప్పుడును అనిష్ట మునే శంకించుచుండునుగదా! శ్రీకృష్ణుడు తన ముఖమునందు విశ్వరూపమును జూపించి, "అమ్మా," నీ పాలు నేనొక్కడనే త్రాగుటలేదు. నా నోటియందున్న విశ్వమంతయు నీ పాలను త్రాగుచున్నది. ఎక్కువ త్రాగినచో అజీర్ణము చేయు నేమో యను భయము వదులుము.

తమవంటి వారి యాశ్రమములకుగూడా రాజాలని దయనీయస్థితి యందుండుము. అట్టి మాకు కల్యాణముల (శుభముల) గల్గించుటకే తమవంటివారు మా వద్దకు వచ్చుట స్వామీ, యే విషయము యింద్రియములకు గోచరించదో, లేక భూత భవిష్యద్గర్భమందు నిక్షిప్తమైయున్నదో అట్టి సర్వము జ్యోతిశ్శాస్త్రముద్వారా ప్రత్యక్షముగా తెలుసుకొనబడుచున్నది. అట్టి జ్యోతిశ్శాస్త్రమును తమరు రచించియుంటిరి. తమరు బ్రహ్మవిద్వరిష్ఠులు. బ్రాహ్మణులు జన్మచేతనే గురువులు. కావున మా పిల్లలిద్దరికి తమరు నామకరణాది సంస్కారములు జరుప వేడుచుంటి" నందుండు గర్గాచార్యునితో ననియె.

నందుని పలుకులకు సంతసించి గర్గాచార్యుడతనితో నిట్టులనియె. "నందా, నేను సర్వత్ర యాదవుల ఆచార్యుడనుగా ప్రసిద్ధి గాంచియున్నాను. నేను నీ పుత్రునకు నామకరణాది సంస్కారములొనర్చినచో, నతడు దేవకీ పుత్రుడేయను సందేహము జనులకు కలుగుట కవకాశమున్నది. కంసుడతి పాపాత్ముడు. నీకును వసుదేవునకునుగల గాఢస్నేహము నతడెఱుగును. దేవకియొక్క కూతురిద్వారా వానిని చంపువాడెచటనో పుట్టి యుండెనని విన్ననాటనుండియు దేవకియొక్క గర్భము కన్యయై యుండదని యతడు సంశయించుచున్నాడు. ఇపుడు నేను నీ పుత్రునకు సంస్కారమొనర్చినచో, యీ బాలకుని వసుదేవుని పుత్రుడని భావించి కంసుడీతని వధించుచో, మిక్కిలి యనర్థము వాటిల్లగలదు." అని పలికిన గర్గాచార్యునితో నందుడిట్లు పల్కె.

"ఆచార్యా, తమరతి రహస్యముగ యీ గోశాలయందు స్వస్తివాచన పూర్వకముగ, ద్విజాతికి సముచితమగు నామకరణ సంస్కార మాత్రమీ బాలకునకు గావింపుడు, ఇతరులెవరు చెప్పెదరు? నా దగ్గరి బంధువులకు గూడనిది తెలియనీయను" అని నందుడనియె.

గర్గాచార్యునకు నామకరణ సంస్కారము చేయవలయుననియే యున్నది. నందుడెప్పుడా విధముగ పల్కెనో అప్పుడాతడతి రహస్యముగ కుమారులిర్వురకు (రోహిణీ తనయుడు, యశోదా తనయుడు), యేకాంతస్థలమందు నామకరణ సంస్కారము గావించినాడు.

ఆ సమయమందు గర్గాచార్యు డీవిధముగ బల్కె. "ఇతడు రోహిణీ పుత్రుడు గావున 'రౌహిణే'యుడనబడును. తన బంధుమిత్రులందరిని తన కల్యాణ గుణములచే నానందింపజేయునుగాన "రాము"డనియు పిలువబడును. ఇతని బలమునను అంతముండదుగాన 'బలు'డనియు పేర్కొనబడును. ఇతడు యాదవులకు మీకుకు అభేద భావము కలిగి యుండును జనులయందు వివాదములు కల్గినచో అందరిని ఆకర్షించి వారికి మేలు గలుగజేయువాడు గావున 'సంకర్షణు'డనియునందురు.

ఇక రెండవ పిల్లవాడు ప్రతి యుగమునందు నొక్కొక్క వర్ణముగల శరీర మును ధరించుచుండువాడు. క్రిందటి యుగములందు శుక్ల, రక్త, పీతవర్ణ శరీర ధారియగుచు నేడీ కృష్ణవర్ణముతో జన్మించినాడు. కావున యితని పేరు 'కృష్ణుడు' ఇతడింతకు పూర్వమెపుడో వసుదేవుని యింటగూడ బుట్టియుండినందున యితనిని 'వాసుదేవు'డనియు నందురు, నీ పుత్రుని నామ రూపములనేకములున్నవి. ఇతని గుణములు, కర్మలు గూడ ననేకములు గావున, వానిననుసరించి యనేకములగు వేర్వేరు నామము లేర్పడినవి. నేనా నామములన్నియు నెఱుంగుదును. సామాన్య మానవులెఱుగ జాలరు. ఇతడు మీకు మిక్కిలి శుభదాయకుడగును. గోగోపకుల నందరిని నత్యంతానంద సాగరమున నోలలాడింపగలడు. ఇతని సహాయముచే మీరు గొప్ప యాపదలను గూడ సునాయాసముగ దాటగలిగెదరు:

నందరాజా, పూర్వయుగ సంబంధ విషయము చెప్పెద వినుము. ఒక పర్యా యము పృథివి యందు రాజెవ్వడును లేకుండెను. అందుచే దొంగలు చెలరేగి స్వైర విహారము చేయుచు సర్వత్రా సాధుజనులను దోచుకొనుచుండిరి. అప్పుడు ఈ నీ కుమారుడు వారికి రక్షకుడుగా నిలువబడగా, వారు బలోపేతులై దస్యులను తరిమి కొట్టిరి: ఈ శిశువును ప్రేమించువారు మహాభాగులయ్యెదరు. విష్ణు సంరక్షితులగు దేవతల నసురులెట్లు జయింపజాలరో, యటులనే ఈ నీ పుత్రుని ప్రేమించు వార లను, లోపల వెలుపల శత్రువులేమియు చేయజాలరు. గుణమునందు, సంపదయందు సౌందర్యమునందు, కీర్తియందు, ప్రభావమునందు, సర్వ విషయములందు నీ తన యుడు సాక్షాత్తు నారాయణునితో సమానుడగును. అత్యంత శ్రద్ధతోను జాగరూకత తోను నీవీబాలకుని రక్షించుము." అని ఈ విధముగా నందునకు వివరముగా బోధించి గర్గాచార్యుడు తన గృహమునకేగె. ఆచార్యుని మాటలచే నందుడు మహా నంద భరితుడైనాడు. తన యాశలన్నియు తీరినట్లును తాను కృతకృత్యుడైనట్లును నందుడు భావించె.

కొలది దినములలోనే రామ,కృష్ణులిర్వురు మోకాళ్ళతో,మోచేతులపై ప్రాకుచు గోకులమందాడు కొనసాగిరి. ఇరువురును గోకులమందలి బురదయందు పాదములు లాగుకొనుచు పోవుచుండ, వారి కాళ్ళయందలి గజ్జెలు, మొలత్రాటి యందలి చిరు గంటలు మధురముగ నినదించుచుండ, ఆ శబ్దమునకు వారానందించుచుండిరి.మరల భయపడినట్లు నటించుచు తల్లుల వద్దకు చేరుచుండిరి. ఈ యాటల గాంచుచు తల్లు లానందభరితలగుచుండిరి పయోధరములనుండి పాలు స్రవించెడివి. శిశువులు బుర దను పులుముకొని రాగా వారు మరింత సుందరముగా నగుపడుచుండిరి. వారు వచ్చి నదే తడువుగ తల్లులు వారిని హృదయమునకు హత్తుకొని ప్రేమతో స్తన్యమొసంగు చుండిరి. పిల్లలు పాలు త్రాగుచు, మధ్యమధ్య నవ్వుచూ తల్లులవంక జూచుచుండ,

వారి చిరునవ్వులు, తెల్లని పాలపండ్లు, అమాయకమగు మోములు చూచి, తల్లు లానంద సంభ్రమందు మునుకలు వేయుచుండిరి.

రామకేశవులు కొంచెము పెద్దవారై, యిల్లు వదలి గోకులమందు తిరుగు చుండ వారి బాలలీలల గాంచుచు గోపికలు ముగ్ధులై పోవుచుండిరి. ఆవు దూడల తోకలు బట్టుకొని వారు లాగగా, ఆ దూడలు భయముతో పరువెత్తుచు పిల్లలను గూడ లాగుకొని పరువెత్తెడివి. వీరి యాటల గాంచుచు తన్మయులైన గోపికలు యింటి పనులు వదలి నవ్వుచు వారినే చూచుచుండెడివారు. రామకృష్ణులు క్రీడా పరాయణులగుచు టక్కరి చేష్టలు చేసెడివారు. కొమ్ములున్న పశువుల వద్దకు పరు వెత్తుచు, మండుచున్న యగ్నితో నాడుకొనుటకై గంతులు వేయుచుండిరి. కుక్క లతో, నెమళ్ళ మొదలగు వాటితో నాడుచు నొక్కొక్కప్పుడు ముండ్ల పొదలవైపు పరువెత్తెడివారు. కనుగప్పి కత్తులతో నాడెడువారు. నూతులు గోతులు గూడ చూచు కొనకుండ నాడుచుండెడువారు. వారి నరికట్టుట తల్లుల కసాధ్యమగుచుండెడిది. వీరి చిలిపి యాటలచేత వారింటి పనులను సమర్థించుకొనుట చాల కష్టమగుచుండినది. ఉపద్రవము కలిగించు పనులనుండి పిల్లల నెట్లు కాపాడుటయాయను చింతతో సత మత మగుచున్న వారి మానసములు చంచలములై పోవుచుండెడివి.

కొద్ది రోజుల యనంతరము రామకేశవులు కాళ్ళపై నిలువబడి గోకులమందు బుడిబుడి నడకలు నడచుచుండిరి.

* వ్రజ వాసులకు కన్నయ్య స్వయముగా భగవానుడే. పరమ సుందరుడు పరమ ప్రేమాస్పదుడు.

---

* శ్యాము సుందరుడు మోకాళ్ళ సహాయము లేకుండ నడుచుచున్న సమయ మున గృహమందనేక మాధుర్య లీలలను ప్రదర్శించుచుండె.

శ్లో. శూన్యేచోరయతః స్వయంని జగృహేహయ్యంగ వీనలమణి
స్తంభేస్వ ప్రతిబింబ మీక్షిత వతస్తే నైవసార్థంభియా
భ్రాతర్మావద మాతరం మమసమో భాగస్త వాపీహితో
భుంక్ష్వే త్యాలపతోహరేః కలవచో మాత్రారహః శ్రూయతే

"శ్యాముడు శూన్య గృహమందు వెన్న దొంగిలించవచ్చినాడు. అచట మణి స్తంభమున తన ప్రతిబింబమును గాంచి భయపడినవాడై ఆ ప్రతిబింబముతో "ఓ సోదరా, మా అమ్మతో చెప్పకు. నాతో సమాన భాగమును నీ కొసంగెద. తీసుకో, తిను" అని పలుకుచుండగా, యీ ముద్దు పలుకులను యశోద వినుచు, ఆశ్చర్యపడి లోనికి వెళ్ళి చూచినది తల్లిని జూచి శ్యామసుందరుడు తన ప్రతిబింబము నామెకు జూపుచు మాట మార్చినాడు.

యొక్క, కర్మ, భావ, ధర్మ, సత్తారూపముల గుర్తించు సాక్షిస్వరూపుడవు నీవే. మనోవృత్తుల కందనివాడవు. స్థూల, సూక్ష్మ ఆవరణచే కప్పబడిన యే జీవుడు నిన్ను గుర్తింపసమర్థుడగును? ఏలననగా యీ సృష్టికి పూర్వమే యున్నవాడవు నీవు. అట్టి సమస్త ప్రపంచవిధాతయగు వాసుదేవునకు (నీకు) మేము నమస్కరించుచున్నాము. నీచే ప్రకాశింపజేయబడిన గుణములచేతనే నీ మహిమ కప్పబడి యున్నది. పరమాత్మా, నీకు నమస్కారము. శ్రీకృష్ణా నీవశరీరుడవు. కాని నీయవతారములయందు సాధారణ శరీరధారులకు శక్యముగాని పరాక్రమము ప్రకటించు చుందువు. అట్టి విశేషములచే నీ యవతారములు తెలియబడుచుండును. సర్వలోకములయొక్క అభ్యుదయ నిఃశ్రేయసములకొరకే యవతరించిన పరిపూర్ణావతారుడవు నీవు. పరమకళ్యాణగుణా, పరమ మంగళా, వాసుదేవా, యాదవపతీ, నీకు నమస్కారము. మేము నీ దాసానుదాసులముగా నుండునట్లనుగ్రహింపుము. నారద మహర్షి పరమానుగ్రహముతో, అపరాధులమగు మాకు నీ దర్శనభాగ్యము కలిగించి నాడు. మా వాక్కెపుడును నీ మంగళకరములగు గుణములను గానముచేయుచుండు గాక. మా శ్రవణములు రసమయమగు నీ కథలను వినుచుండుగాక. మా హస్తములు నీ పాదాబ్జ సేవయందును, మానసములు నీ చరణకమల ధ్యానమందు లగ్నమైయుండుగాక. నీ స్వరూపమగు జగత్తు నమస్కరించుటయందు మా శిరస్సులు వినయవినమితములై యుండుగాక సత్పురుషులు నీ స్వరూపములే. మా కన్నులట్టి సత్పురుషుల దర్శనము చేయుచుండుగాక"

నలకూబరమణిగ్రీవులచే నీవిధముగ స్తుతింపబడినవాడై శ్రీకృష్ణుడు లూఖలా బద్ధుడై యుండియే, నవ్వుచూ వారితో నిట్లుపల్కె. *

"నలకూబరమణిగ్రీవులారా, మీరైశ్వర్య మదముచే కన్నుగానక ప్రవర్తించు చుంటిరి. పరమకారుణికుడైన నారదమహర్షి మిమ్ములను శపించి, మీ ధన మదాంధత్వమును నాశనమొనర్చినట్లును, అటులనే మీకీ యనుగ్రహము ప్రసా

* నేను సర్వదాముక్తుడనైయుందును. బద్ధజీవులు నన్ను స్తుతించు చుందురు. నేనీనాడు బద్ధుడనుగా యుంటిని ముక్తజీవులు నన్ను స్తుతించుచున్నారు ఈ విపరీత స్థితినిగాంచిన భగవానునకు నవ్వు వచ్చినది.

యక్షులీ విధముగ తలచినారు. "శ్రీకృష్ణుడు సగుణుడై (త్రాటిచే బద్ధుడై) మనకితని దర్శనమగుచున్నది. నిర్గుణస్వరూపము మనస్సుచే నూహింపనుగూడ జాలము. అందుకని భగవానుడు బద్ధుడై యుండగనే వారు వెడలిపోయినారు.

"ఉలూఖల, స్వస్త్యస్తు సర్వదా శ్రీకృష్ణగుణశాలీ ఏవ భూయాః" ఉలూఖలమా నీవెప్పుడును శ్రీకృష్ణగుణశాలివిగనే యుండుము అని త్రోటి నాశీర్వదించి వారు వెడలిపోయిరి.

శ్లో. మాతః కపషనవనీత మిదంత్వదీయం
లోభేన చోరయితు మద్య గృహం ప్రవిష్టః
మద్వారణు సమనుతే మయిరోషభాజి
రోషంతనోతి నహిమే నవనీతలోభః

"అమ్మా, అమ్మా, చూడు వీడెవడో నీ వెన్న దొంగిలించుటకు యింటి యందు ప్రవేశించినాడు. నేను వద్దురా అన్నను వినుటలేదు. పైగా నేను కోప్పడితే వాడు కూడ నన్ను కోప్పడుతున్నాడు. అమ్మా నీవు వేరుగా తలచవలదు. నాకు వెన్న తిందామనే కోరిక కొంచెముగూడ లేదు." పాలుగారు తన ముద్దు బిడ్డని వాక్చాతుర్యమును గాంచి యా తల్లి, వాత్సల్య ప్రేమానంద మగ్నయైనది.

మరియొకనాడు తల్లి బయటకువెళ్ళియున్నపుడు, శ్యామసుందరుడు, ఇంటి యందు వెన్నదొంగిలించుచుండె.ఇంతలో యశోద ఇంటికితిరిగివచ్చిపిల్లవాడు కనపడ నందున, యెలుగెత్తి పిలువ దొడగినది.

శ్లో. కృష్ణ, క్వాసికరోషికింకరితి శ్రుత్వైవమాతుర్వచః
సాశంకం నవనీతచౌర్య విరతోవిశ్రమ్యతామబ్రవీత్
మాతఃకంకణపద్మరాతమహసాపాణిర్మమాతప్యతే
తేనాయం నవనీయభాండవివరే విన్యస్యనిర్వాపితః

"కృష్ణా, నాయనా, యెక్కడనున్నావురా, యేమిచేయుచుంటివి" అను తల్లి పిలుపు వినబడగానే వెన్నదొంగిలించుట మాని కన్నయ్య కొంచెము ఆగిన పిమ్మట "అమ్మా నీవు నా చేతికంకణమందు కూర్చించిన పద్మరాగమణులతో నాచేయి రాచు కొని మంట పెట్టుచున్నందున, ఆ చేతిని నవనీతభాండము నందుంచి యామంటను చల్లార్చుకొనుచుంటిని" అని పలికిన నందనందనుని మధురవాక్కులకు ముగ్ధురాలైన యశోద తనయుని అక్కున చేర్చుకొని మురియుచు ముద్దిడుకొనినది.

శ్లో. ఘృణ్ణాభ్యాంకర కుట్మలేన విగలద్బాష్పాంబు దృగ్భ్యాంరుదన్
హుంహుంహూమితి రుద్ధ కంఠ కుహరాద స్పష్ట వాగ్వి భ్రమః
మాత్రా సౌనవనీత చౌర్యకుతుకే ప్రాగ్భర్త్సితః స్వాంచలే
నామృజ్యాస్య ముఖంతమైత దఖిలం వత్సేతి కంఠేకృతః

ఒకనాడు వెన్న దొంగిలించిన శ్యాముని, తల్లి మందలించినది. బెదరించినది. కొట్టినంత పనిచేసినది. అంతే కన్నయ్య రెండు కనుల నుండి కన్నీరు జాలు వారినది. చేతులతో కనులు నులుముకొనుచు "ఉఉఊ" అనుచూ బుడిబుడి ఏడ్పులు పారంభించినాడు. గొంతు రుద్ధమైనది. మాట వచ్చుటలేదు. అంతే! అది గాంచి యశోదాదేవి ధైర్యము సడలిపోయినది. తన చీరచెఱగుతో ముద్దు బిడ్డని మొగము

తుడిచినది. మహా ప్రేమతో లాలించినది. "నాన్నా, ఇది అంతా నీదే గదా ! ఇందు దొంగతనమేమున్నది?" అని పలికినది.

మఱియొకనాటి విషయము:

"పూర్ణచంద్రుని కాంతి మణిమయ ప్రాంగణమందు ప్రకాశించుచున్నది. గోపికలందరు యశోదాదేవితో సల్లాపములాడుచుండిరి. ఆడుకొనుచున్న కృష్ణ చంద్రుని దృష్టి ఆకసమందలి చంద్రునిపై బడినది. తల్లివద్దకు జేరి యామె కొంగు లాగుచూ, ఆమె వీపుపై కొట్టుచూ "నేను తీసుకుంటా" ముద్దుగా పలుకుచు మారాము చేయదొడగినాడు. యశోద కర్థము గాలేదు. గోపికలవైపు జూచినది. గోపికలతనిని దగ్గరకు తీసుకుని "నాయనా, నీకేమి కావాలె? పాలుగావలెనా?" అని యడుగగా "కాద"ని తలయడ్డముగా ద్రిప్పినాడు. పెరుగా,మీగడా, నవనీతమా? యని యడుగనన్నిటికి"కాద"ని సైగచేసినాడు. "నాయనా, యేడువకు,కోపగించకు, యేదికావలెనో చెప్పు మిచ్చెద"మని వారనగా చంద్రుని వంక తన చేయి చూపి యది కావలెనని సంకేత మొనర్చినాడు·అదియేమి వెన్నముద్దయా తెచ్చియిచ్చుటకు? "నాయనా అది యాకాశ సరోవరమందు విహరించుచున్న హంస. దానిని మేమెట్లు తేగలమయ్యా!" యనిరి. "నేనాడుకొనుట కా హంసయే కావలె. అది వెళ్లి పోక మునుపే త్వరగా నాకు తెచ్చి యివ్వండి" అని అల్లరి చేయసాగినాడు శ్రీకృష్ణుడు కాళ్ళు నేలకేసి కొట్టుకొనుచు, బిగ్గరగా నేడ్వసాగినాడు. అప్పుడు మఱియొక గోక యతనిని దగ్గరకు దీసుకొని, "తండ్రీ, యిందాక వారు చెప్పినది యబద్దము. అది రాజహంస గాదు. అతడాకసమందు చరించు చంద్రుడు" అని పలుక, కృష్ణుడు. హఠముతో "నాకదే యివ్వు. నాకుదానితో ఆడుకోవాలనియున్నది. ఇప్పుడే యివ్వు ఇప్పుడే"యనుచూ యేడుపు నధికమొనర్చినాడు. అప్పుడు ప్రేమతో తనయుని యొడిలోనికి జేర్చుకొని, యశోద "కన్నయ్యా, అది రాజహంస గాదు. చంద్రుడు గాదు. అదే పెద్ద వెన్నముద్ద. కాని అది నీకివ్వటానికి యోగ్యమైనది గాదు. ఎందుకంటే. చూడు, దానియందు నల్లగా కనుపడుచున్నదే అది యంతా విషము. అందుచేతనే అది అంత పెద్దగా ఉన్నా దానినెవరును తినుటలేదు." అని పలికినది. అందుపై "అమ్మా, అంత విషమెట్లాపడింది?" అని అడుగుటతో మాటమాదినది. తల్లి, తనయునకు తియ్యతియ్యగా కథ చెప్పుట ప్రారంభించినది. వారిరువురి మధ్య ప్రశ్నోత్తరములీ రీతి జరిగినది.

యశోదాదేవి—నాయనా, ఒక క్షీరసముద్రము గలదు.

శ్రీకృష్ణుడు—అమ్మా, అదియెట్లుండును.

ఇప్పుడు బలరామకృష్ణులు తమ యీడు పిల్లలతో గూడి బయలుదేరి వ్రజ మండలమందాడుకొనుచుండిరి. అది యచటిగోపికలందరికిమోదముగలిగించుచుండె. ఆయాటలనేకవిధములు అపూర్వములు.గోపికలకు మాత్రమ విమహాసుందరముగను మాధుర్యముగ నుండినవి.

---

యశోద-నీవు పాలెరుగుదువుగదా. దానియొక్క సముద్రం.

శ్రీ-అమ్మా. ఆ సముద్రమగుటకు ఎన్నిఆవులు పాలిచ్చినవి?

య-నాయనా, అవి ఆవుపాలు గావు.

శ్రీ—అమ్మా, నన్ను మోసం చేస్తున్నావు ఆవు లేకుండా పాలెట్లువచ్చును?

య-వత్సా, యెవడు ఆవునందు పాలుకల్పించినాడో, అతడు ఆవు లేకుండా గూడా పాలు కల్పించగలడు.

శ్రీ-అమ్మా, ఆయన యెవరు?

య-ఆయన భగవంతుడు. కాని అగః ఆయన దగ్గరకు యెవరు వెళ్ళజాలరు. (గకారరహితుడనియు)

శ్రీ-సరే, ఇంకా చెప్పు.

య-ఒకప్పుడు దేవతలకు రాక్షసులకు యుద్ధము సంభవించినది. రాక్షసులను భ్రమపెట్టుటకై భగవానుడు సముద్రమథనమేర్పాటుగావించె. మందరపర్వతమును కవ్వమొనర్చె. వాసుకి యను సర్పమును కవ్వపు తాడుగా చేసె. ఒకవైపు దేవతలు మరొకవైపు రాక్షసులు పట్టి చిలుక సాగినారు.

శ్రీ-గోపికలు పెరుగును చిలికినట్లు, అంతేగదమ్మా

య-అంతే నాయనా. అప్పుడు కాలకూటమను మహా విషము పుట్టినది.

శ్రీ—అమ్మా, విషము పాములందుండె కాని పాలనుండెట్లు వచ్చినది?

య—ఆ విషమునెప్పుడు శంకర భగవానుడు మ్రింగెనో అప్పుడు జారిపడిన విషబిందువులను త్రాగుటచే పాములందు విషమేర్పడినది. అప్పటినుంచి అవి విషధరములైనవి. కాన, అనియంతయు భగవల్లీల- అందుచేతనే పాల నుండి విషము వెలువడినది.

శ్రీ—అవునమ్మా, అది అంతే.

య-తండ్రీ, (చంద్రుని వైపు జూపుచు) ఆ వెన్నయు ఆ సముద్రము నుండియే పుట్టినందున, కొంచెము విషము అందులో గూడ కలిసినది. చూడుము. దానినే జనులు మచ్చ (కళంకము) అనుచున్నారు.

కథను వినుచు వినుచునే శ్యామసుందరుని నేత్రములు ముకుళించినవి.నిదుర వచ్చినది. తల్లి యది గ్రహించి, ప్రక్కపై పరుండబెట్టి నిదురబుచ్చింది.

ఒకనాడు గోపికలందరు గుంపుగా, నందుని యింటికేతెంచి, నందనందనుని చిలిపిచేష్టలను యశోదకు వినిపింపదొడగినారు. "తల్లీ, నీ పిల్లడెంత యల్లరివాడై నాడో చూడుము. దూడలు విప్పు సమయము కాకుండగనే దూడలను విప్పి మేము మందలించితే నవ్వుతాడు. దొంగతనము చేయుటలో బహు నేర్పరి. ఏదోయొక యుపాయముతో పెరుగు పాలు దొంగతనముగా తింటున్నాడు. తానొక్కడే తినటం గాదు. వానినన్నిటిని వానరములకు గూడ పంచిపెడుతున్నాడు. తిన్నంతతిని యిక తినలేమని తోచినప్పుడు భాండములను పగులగొట్టి పోవుచున్నాడు. మేమాభాండము లను యెత్తుగా ఉట్లపైనుంచగా, బాలకృష్ణునకవి యందనందున, అప్పుడు క్రొత్త క్రొత్త యుపాయముల వెదకుచుండును. పీటల నొకదానిపై నొకటి పేర్చియు, రోళ్ళపై నెక్కియు, లేనిచో స్నేహితుల భుజములపై నెక్కియు యేదో విధమున గవ్యముల సాధించి భక్షించును. అప్పటికిని సాధ్యముగానిచో క్రిందినుంచి భాండము లకు రంధ్రములొనర్చును. ఏ యుట్టియందేవి యుంచబడినవో మీ పిల్లడికి బాగుగా తెలియును. ఆ రంధ్రములు వేయుటగూడ మహానేర్పుగా, మాకెవరికిని తెలియని విధముగా వేయగలడు. వస్తువు లెవరికి కనుపడకుండ నుండవలయునని మేము వానిని చీకటికొట్టులో నుంచితిమి. కాని, తల్లీ, నీవు వానికి మణిమయభూషణము లలంకరించితివి గదా! వాని వెలుతురులో నతడన్నియు చూడగలుగుచున్నాడు. మీ వాని శరీరమందు గూడ సర్వమును దర్శింపజేయు జ్యోతియేదియో యున్నది. మీ వాడెంత నేర్పరియనగా, యెవరే సమయములో నెక్కడ యుండునది బాగా కని పెట్టగలడు. మేమందరము యింటిపనులలో మునిగియున్నపుడాతడు తన పనులను చక్కబెట్టుకొనుచుండును. ఇటువంటి పనులు చేయుచుగూడ తానే యింటికధిపతియై నట్లు మమ్ములనే దొంగలనుచుండును. అంతేగాదు, శుభ్రమైన మా యిండ్లయందు మూత్రపురీషోత్సర్జనముల చేయుచుండును. చూడవమ్మా కొంచెమితనివంక! అక్కడ వివిధోపాయములతో దొంగతనములు చేయుచు, యిక్కడ యేమియు నెరుగని యమాయకునివలె శిలావిగ్రహమురీతి యెలా కూర్చున్నాడో! అహా యేమి సాధు పుంగవుడమ్మా! అని యీ విధముగా శ్రీకృష్ణునిపై కొండెములు చెప్పుచూ గోపికలు, బెదురుచూపులు చూచుచున్న యతని సుందర ముఖారవిందమునే వీక్షించుచుండిరి. వారి పలుకులన్నియు వినుచు వారి భావము గ్రహించిన యశోద హృదయమందా నందము పెల్లుబికినది. ఆమెకు యెంతగా నవ్వు వచ్చినదో కాని, పిల్లవానిని మంద లించుట యటుండ, మందలించుదమన్న భావమే యామెకు గలుగకుండె. *

---

* భగవానుని లీలలనుగూర్చి విచారించునపుడు, భగవానుని లీలాధామమును, లీలాపాత్రములను, లీలాశరీరమును, అతని లీలలును, ప్రాకృతములు కావను విష యమును మరువరాదు మహాభారతమందు:-

శ్లో॥ నభూతసంఘ సంసానోదేవస్య పరమాత్మనః
యోవేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః
"ససర్వస్మాత్ బహిష్కార్యః శ్రౌతస్మార్త విధానతః
ముఖంతస్యావలోక్యాపి సచైలః స్నానమాచరేత్"

"పరమాత్మ శరీరము పాంచభౌతికముగాదు. ఎవడు శ్రీకృష్ణుని శరీరము భౌతికమను భావముతో తెలియుచున్నాడో వానిని సమస్త శ్రౌతస్మార్త కర్మలనుండి బహిష్కరించ వలయును. అనగా వానికి కర్మాధికారములేదు. అంతేకాదు, అట్టి వానిని దర్శించినచో సచేలస్నాన మొనర్పవలయును.

శ్రీమద్భాగవతమునందే బ్రహ్మ శ్రీకృష్ణుని స్తోత్రము చేయుచు నిట్లు పల్కినాడు.

"అస్యాపిదేవవపుషోమదనుగ్రహస్య
స్వేచ్ఛామయస్యనతుభూతమయస్య కోఽపిః"

(స్వామీ, నీవు నన్నునుగ్రహించుట కొరకే యీ స్వేచ్ఛామయమగు సచ్చిదానంద రూపమును ప్రకటమొనర్చితివి. ఇది పాంచభౌతిక మెన్నటికిని కాదు.

అందుచే భగవానునికి సంబంధించిన సమస్తమునూ అప్రాకృతమనియే స్పష్టమగుచున్నది. అటులే యీ వెన్న దొంగిలించుట యను లీలయు దివ్యలీలయే గాని ప్రాకృత చేష్టగాదు.

భగవానుని యొక్క పరమధామమందు అభిన్నరూపముతో నిత్యనివాస మొనర్చు నిత్యసిద్ధులగు గోపికలదృష్టితో చూడక, కేవల సాధన సిద్ధులగు గోపికల దృష్టితో చూచినను, వారి తపస్సు మిక్కిలి కఠోరమైనది. వారి లాలసయనన్యము, వారి ప్రేమ వ్యాపకమైనది, వారి మనోనిశ్చలత్వము సత్యమైనది. అవియెంత గొప్పవనగా, భక్తులకు కల్పతరువు వంటివాడును, ప్రేమరసమయుడునునగు భగవానుడు, ఆ గోపికల కోర్కెననుసరించి వారికి సుఖము కల్గించుటకై వెన్న దొంగిలించుట యను లీలగావించి, వారికిష్టమగు పూజను గ్రహించినాడు. వస్త్రాపహరణ మను లీలతో వారి యజ్ఞానమను తెరసు తొలగించినాడు. రాసలీలయొనర్చి వారికి దివ్య సుఖానుభూతి కల్గించినాడు. ఇందాశ్చర్యమేమున్నది!

భగవానునియొక్క నిత్యసిద్ధ చిదానందమయలగు గోపికలేగాక, తమ మహా సాధనల యొక్క ఫలస్వరూపముగా, ముక్తజనవాంఛితమగు భగవత్సేవ గావించుట కొరకు, గోపికలుగా జన్మించిన యనేక గోపికలున్నారు. వారిలో కొందరు పూర్వ జన్మయందు దేవకన్యలు, వేదరూపులగు గోపికలు కొందరు—అనగా నేతి—నేతి—యను వాక్యములచే నిరంతరము పరమాత్మ విచారణ చేయుచుగూడ పరమాత్మ స్వరూప సాక్షాత్కారము నందలేక, గోపికలతోగూడి భగవానుడొనర్చు నిరంతర

రసమయ విహారవిషయము తెలుసుకొన్నవారై గోపికల నుపాసించుచూ తాముకూడ గోపికలుగా పరిణతిచెంది సాక్షాత్తుగా శ్రీకృష్ణుని ప్రియతమ రూపమున పొందిన వారు, కొందరు మహర్షులు, కొందరితరభక్తులు నుండిరి, వీరి కథలు యితర విభిన్న పురాణములందు లభించుచున్నవి. అందు, ముఖ్య శ్రుతులనామములు = ఉద్గీతా, సుగీతా, కాలగీతా, కలకంఠికా, మరియు విపంచి-మొదలగునవి—

భగవానుని రామావతార కాలమందాతని సౌందర్యమునకు ముగ్ధులైన వన వాసులైన మహర్షులు ఆలింగన సౌఖ్యమునపేక్షించగా, వారి నందరిని శ్రీరాముడు గోపికలుగా పుట్టుడనియు నపుడు వారి కోర్కె యీడేరగలదనియు వరమొసంగె. వారు గోపికలుగా నవతరించిరి. వారేకాక మిథిలాపురవాసినులు, కోసల వాసినులు, అయోధ్యా వాసినులు, పులింద కన్యలు, వైకుంఠ, శ్వేతదీపాది వాసినులు గూడ శ్రీకష్ణ ప్రేమాస్వాదన కొరకై గోపికలుగా నవతరించిరి. ఇట్టి గోపికాయూథము లనేకములు. మహాతపస్సాచరించి గోపికలుగా జన్మించు సౌభాగ్యమును పొంది యుండిరి. పద్మ పురాణమందలి పాతాళఖండమందిట్టి మహర్షుల వర్ణనలనేకమున్నవి అట్టి మహర్షుల నామములు కొన్ని యీ దిగువ నీయబడుచున్నవి.

**ఉగ్రతపుడు**

అతడు నిత్యాగ్నిహోత్రి. నిష్ఠాగరిష్ఠుడు. అద్భుతతపశ్శాలి. అతడు పంచ దశాక్షర మంత్రము జపించె. మరియు రాసోన్మత్తుడు నవకిశోర శ్యామసుందరుడగు శ్రీకృష్ణుని ధ్యానమొనర్చె. నూరు కల్పముల యనంతరమతడు సునందుడను గోప కునకు 'సునందా' యను పేరుగల కన్యకగా జన్మించె.

**సత్యతపుడు**

అతడు యెండుటాకుల దినుచు తపమొనర్చి, రాధాదేవి యొక్క రెండు చేతు లను బట్టుకొని నృత్యము చేయు శ్రీకృష్ణుని ధ్యానమొనర్చుచుండెడివాడు. పది కల్ప ములయనంతరమతడు సుభద్రుడను గోపునికి "సుభద్ర" యను కన్యకగా జన్మించె.

**హరిధాముడు**

అతడు నిరాహారుడై "క్లీం" అను కామబీజముతో గూడిన వింశాక్షరీ మహా మంత్రమును జపించుచు, మాధవీ మంటపమందు ప్రవాళశయ్యపై జంటగాశయనించి యుండు భగవానుని ధ్యానించె. మూడు యుగములనంతరము సారంగుడను గోపకు నకు. "రంగవేణి"యను పేరుగల కన్యకగా నతడు జన్మించె.

**జాబాలి**

ఇతడొక బ్రహ్మజ్ఞాని. అతడొక నాడు విశాల వనమందు పరిభ్రమించుచు లోతైన యొక్క చిన్న చెఱువును గాంచె. దాని పడమటి గట్టున నున్న మఱ్ఱిచెట్టు

క్రింద నొక తేజస్వినియగు యువతి తపస్సాచరించుచుండినది. ఆమె సౌందర్యము వర్ణనాతీతముగ నున్నది. చంద్రకాంతివలె నామె ప్రకాశము నలుదిక్కుల వెలుగు నిచ్చుచుండె. ఎడమచేయి కటి ప్రదేశమందుంచుకొని, కుడిచేతియందు జ్ఞానముద్ర దాల్చియున్నది. జాబాలి యామె వద్ద కేగి వినయ పూర్వకముగ ప్రశ్నించిన మీదట నామె యిట్లు వచించినది.

శ్లో॥ బ్రహ్మ విద్యాహమతులా యోగీంద్రైర్యాచమృగ్యతే
సాహం హరిపదాంభోజ కామ్యయాసుచిరంతపః
బ్రహ్మానందేన పూర్ణాహం తేనానందేనతృప్తధీః
చరామ్యస్మిన్వనే ఘోరేధ్యాయ స్తీ పురుషోత్తమం
తథాపిశూన్యమాత్మానం మన్యే కృష్ణ రతిం వినా.

నేను, గొప్ప గొప్ప యోగులెల్లప్పుడును వెదకుచుండెడు బ్రహ్మవిద్యను. శ్రీకృష్ణుని చరణ కమల ప్రాప్తికై యీ ఘోరవనమందాతని గూర్చి చాలాకాలము నుండి తపమొనర్చుచుంటిని నేను పూర్ణ బ్రహ్మానంద స్వరూపిణిని. నా బుద్ధి ఆ యానందముచే తృప్తి చెందినది కాని శ్రీకృష్ణుని ప్రేమ నా కింతవరకు లభించ లేదు. అందుచే నా కంతయు శూన్యముగనే గోచరించుచున్నది." అని పలికినది. బ్రహ్మజ్ఞానియగు జాబాలి యామె పాదములకు ప్రణమిల్లి, దీక్షను పొందినవాడై వ్రజ వీధి యందు చరించు గోపాలమూర్తిని ధ్యానించుచు నొంటి కాలిపై నిలబడి కఠోర తపస్సాచరించినాడు. తొమ్మిది కల్పముల యనంతరమతడు ప్రచండుడను గోపకుని యింటి యందు 'చిత్రగంధ' యను కన్యగా జన్మించె.

**శుచిశ్రవుడు—సువర్ణుడు :**

వీరిరువురు బ్రహ్మర్షియగు కుశధ్వజుని పుత్రులు. వారు శీర్షాసనము వేసి 'హ్రీం' అను హంస మంత్రమును జపించుచు సుందరకందర్పతుల్యుడగు పది వర్ష ముల వయసు గల్గిన గోపాల బాలుని ధ్యానించుచు ఘోర తపస్సాచరించిరి. ఒక కల్పము తరువాత సుధీరుడను గోపకుని యింటి యందు వారు పుట్టిరి.

ఇట్లనేక గోపికల పూర్వజన్మ కథలు లభించుచున్నవి. గ్రంథ విస్తరభీతిచే నిట చెప్పుట లేదు.

తనను గూర్చి యింతటి కఠోర తపస్సు కల్పముల పర్యంతము యేకాగ్ర తతో సాధన చేసియున్న భక్తులు గోపికలుగా జన్మించగా, వారి మనోరథముల దీర్చుటకై, వారి కానందమందించుటకై, భగవానుడు వారి కిష్టమగు లీలల నొనర్చి నచో, యందు ఆశ్చర్యముగాని, అనాచార విషయముగాని యేమి యున్నది. రాస లీలా ప్రసంగమందు స్వయముగ భగవానుడే గోపికలతో నిట్లు పలికినాడు.

శ్లో॥ నపారయేఽ హంనిరవద్య సంయుజాం
స్వసాధుకృత్యం విబుధాయుషాపివః
యామా భజన్ దుర్జర గేహశ్శృంఖలాః
సంవృశ్చ్యతద్వః ప్రతియాతు సాధునా. (10–32–22)

'గోపికలారా, మీరు యిహలోకపరములకు సంబంధించిన సమస్త బంధములను త్రెంచుకొని నన్ను నిష్కపటముగ ప్రేమించినారు. నేను మీలో ప్రతి గోపికకు నొక్కొక్క రూపము దాల్చి అనంతకాలము మీ ప్రేమకు ప్రత్యుపకార మొనర్చినను, నేను మీ ఋణము తీర్చుకొనజాలను. నేను మీకు యెల్లప్పుడు ఋణపడియే యుందును. మీ సాధు స్వరూపముచే మీరు నన్ను ఋణములేనివానిగా తలచుట చేత, మరింత ఋణగ్రస్తునిగా చేయుడు, ఇదియే యుత్తమము" అని సర్వలోకేశ్వరుడగు భగవానుడు మహాభాగలగు యేగోపికలకు సర్వదా ఋణగ్రస్తుడుగా నుండుటకు వాంఛించెనో, అట్టి గోపికల కోరికలను వారు కోరక పూర్వమే తీర్చుట యనునది భగవానునికి స్వాభావికమే!

అది యటుండనిండు. శ్రీకృష్ణగత ప్రాణలై, శ్రీకృష్ణ రసభావితమతులగు గోపికల మనస్థితి కొంచెము విచారింతము. గోపికల తను, మన, ధనములన్నియు ప్రాణప్రియుడగు శ్రీకృష్ణునికే చెందియుండినవి. వారు సంసారమును జయించినారు. వారు గృహమందున్నది శ్రీకృష్ణుని కోసమే. గృహము వెలువడినది శ్రీకృష్ణుని కొరకే. యోగీంద్రులకుగూడ దుర్లభమగు వారి నిర్మల పవిత్రమానసములందు శ్రీకృష్ణుడుతప్ప – వారి దనునది యేదియులేకుండె. శ్రీకృష్ణునికొరకే, అతనిని సుఖింప చేయుటకు మాత్రమే, శ్రీకృష్ణుని నిజసామగ్రిచేతనే యతనిని పూజించి, శ్రీకృష్ణుడు సుఖముగా నుండుటజూచి వారు సుఖమును పొందుచుండిరి. ప్రాతఃకాలమందు నిదుర మేల్కొనినది మొదలు రాత్రిమరల నిదురించువరకు వారేమిచేసినను అదియంతయు భగవానుని ప్రీతికొరకే చేయుచుండిరి. అంతేకాదు. వారి నిద్రయు శ్రీకృష్ణుని యందే జరుగుచుండినది. స్వప్నసుషుప్తులు రెంటియందుగూడ వారు శ్రీనాధుని శాంతమదుర లీలలనే గాంచుచు, వానినే యనుభవించుచుండిరి. రాత్రియందు పాలుతోడు బెట్టుచున్నపుడుగూడ, ప్రేమమయియగు ప్రతి గోపికయు శ్యామసుందరుని మాధుర్యరూపమునే మనమునందు ధ్యానించుచు, "యీ పెరుగు బాగుగా తోడుకొనుగాక, బాగా పరీక్షించి నేను దానినుండి యెక్కువ వెన్నను తీసెదను. శ్రీకృష్ణునికి అందునంత యెత్తున ఉట్టిపై పెట్టెదను. నా ప్రాణమగు శ్రీకృష్ణుడు తన స్నేహితులతోను, వానరములతోను వచ్చి యీ వెన్నను దొంగిలించి తినుచు, నవ్వుచు నా యింటియందు నవ్వుచు క్రీడించుగాక. నా ప్రాంగణమందా నందనందను డానంద నాట్యమొనర్చుగాక. అప్పుడు నేనే మూలనోదాగి యా

బాలలీలను నాయీ కన్నులతో గాంచి నా జీవితమును సఫలమొనర్చుకొందుగాక. ఆకస్మాత్తుగా కృష్ణుని బట్టుకొని నా హృదయమునకు హత్తుకొందునుగాక" యని తలచుచుండెడిది.

సూరదాస మహాకవి యొక భావన చెప్పినాడు.

"ఒకనాడు శ్యామసుందరుడు తల్లితో, "అమ్మా, నాకు వెన్న చాల యిష్టము నీవేమో పండ్లు పక్వాన్నము తినుమనెదవు. కాని నాకవి సయించవు." అని పలుకుచుండగా, అక్కడనే వెనుక వైపునున్న యొక గోపిక యా పలుకులు విన్నది. ఆమె తన మనమందు యిట్లు తలచినది. "ఈ శ్యామసుందరుడు మా యింటియందు వెన్న తినుట నేనెప్పుడు జూతునోగదా! ఆయన కవ్వము వద్దకు వెళ్ళునప్పుడు నేనాతనికి కనుపడకుండ దాగెదను."సర్వాంతర్యామియగు భగవానుడామెయాంతర్యమును గ్రహింపకుండునా? గ్రహించి, ఆమె యింటికేగి యచట వెన్ననుతిని యామె మనోరథమును దీర్చి యామెకు సుఖము కల్గించె.

ఆమె హృదయము ఆనంద తరంగితమైనది. ఆనందోన్మాదియై గర్వముగా తిరుగసాగినది. ఆమె చిన్ని హృదయమందా యానందమిమడ లేకపోయినది. చెలికత్తెలామె నాటబట్టించుచు, "ఏమే, మహాధనమేమైన నీకు దొరికెనా?" యడుగ, ఆమె యింకను ప్రేమ విహ్వలయైనది. రోమాంచితయైనది. కంఠము గద్గదమైనది. మాటాడలేకపోయినది. చెలులు మరల, "అసలు విషయమేమి? నీ రహస్యము మాకేల తెలుపవు? మన శరీరములు మాత్రమే వేరుగాని, మనమందరమొకే ప్రాణము, రూపముగలవారము గదా! మానుండి నీవు దాచునంత గొప్ప విషయమేమి?" అని యడుగ, ఆమె నోటినుండి, "నేనీనాడు అపూర్వ రూపమును తిలకించితిని" అను మాటలు మాత్రము వెలువడి, యంతతో మాటలుడిగిపోయి కనుల వెంట ప్రేమాశ్రువులు ప్రవహింపసాగినవి. గోపికలందరి పరిస్థితియు నిటులే యుండినది.

రాత్రులందు గోపికలు మేల్కొనియుండి, ఎప్పుడు తెల్లవారునాయని యెదురు చూచుచుందురు. వారి మనస్సులు శ్రీకృష్ణునియందు లగ్నమై యున్నవి. ప్రాతఃకాలమునందు తొందరగా పెరుగు చిలికి వెన్నతీసి యుట్టిపై పెట్టి యుంచుదురు. తమ ప్రాణస్వరూపుడగు పరమాత్మ, యెక్కడవచ్చి వెన్నలేదని తిరిగిపోవునో యను భయముచే వారు వెన్నతీయు పనిని త్వరగా పూర్తిచేయుచుందురు. అన్ని పనులకంటె ముందీపని పూర్తిచేసి, శ్యామసుందరుని ప్రతీక్షించుటలో వ్యాకులత నందినవారలై మనములందు, "అయ్యో, మన ప్రాణప్రియతముడు నేడింతవరకు రాలేదే! ఇంత యాలస్యమేల జరిగినదో? నేడీదాసి గృహము నతడు పవిత్ర మొనర్పడా! నేను సమర్పించు యీ తుచ్ఛనవనీతమును భుజించి, తాను తృప్తి

చెంది నాకు తృప్తి కలుగనీయడా? యశోదాదేవి యాతనిని రాకుండ నిర్బంధించ లేదుగదా! వారి యింటియందు తొమ్మిది లక్షల గోవులున్నవి! వారికి వెన్న కరువా? నాయందనుగ్రహముతోడనే శ్రీకృష్ణుడు మా యింటి కేతెంచును" అని విచారించుచు, కనులవెంట దుఃఖాశ్రువులు ప్రసరించుచుండ ప్రతిక్షణము వీధివాకిలి వరకు వెళ్ళి, సిగ్గువీడి మార్గమువైపు జూచుచు, స్నేహితురాండ్ర నడుగుచుందురు. వారికపుడు ప్రతిక్షణమొక యుగముగా దోచుచుండును. ఇట్టి భక్తిభావన గలిగిన గోపికలయొక్క మనఃకామనలను భగవానుడు వారి యిండ్లకేగి తీర్చుచుండును.

సూరదాసింకను యిట్లు కీర్తించినాడు.

"తన స్వజనులగు వ్రజవాసులను సుఖింపజేయుటకే గోవిందుడు గోకులము నందవతరించె. కావుననే యతడందరి గృహములందు తిరుగుచుండును. నందరాజు నకు లక్షలాది గోవులున్నవి. వారి యింటియందు వెన్నకు కఱువేమున్నది? ఎంత తిన్నను తినవచ్చును. కాని యా గోవిందుడందరి వాడు కదా! అందుచే నందరికి ఆనందమందీయ వలయుననిగదా గోవిందుని సంకల్పము. గోపికలయొక్క మనో రథములీడేర్పవలయుననియే యాతడు వారియిండ్లకేగి వెన్న దొంగిలించి యార గించుచుండును. యథార్థముగా నిది దొంగిలించుటగాదు. గోపికల పూజాపద్ధతిని భగవానుడు స్వీకరించుటయే. భక్తవత్సలుడగు భగవానుడు భక్తుని పూజనెట్లు స్వీకరింపకుండును?

భగవానుని యీ నవనీత చౌర్యమునందలి రహస్యమును గ్రహింపజాలని కారణముచేతనే కొందరిది ఆదర్శ విరుద్ధమని పల్కుచుందురు. వారు ముందుగా యీ విషయము గ్రహింపవలసియున్నది. ఏమనగా! చౌర్యమనునది యొక వస్తువా? అది యెవనికి జరుగును? ఎవరు దానిని చేయుదురు? ఇతరుని వస్తువును దేనినైనను అతని యిష్టమునకు వ్యతిరేకముగా అతనికి తెలియకుండా, తరువాత గూడ నతనికి తెలియని విధముగా, తీసుకొనినచో దానిని చౌర్యము (దొంగతనము) అనెదరు. గోపాలదేవుడు గోపికల యిండ్లనుండి వెన్న తీసుకొనుట యనునది—గోపికల యిచ్ఛానుసారమే—గోపికలు చూడకుండనుకాదు వారు చూచుచుండగనే—వారిముందు గనే పరుగెత్తిపోవుచుండెడువాడు.

మఱియొక విశేషమేమనగా, యీ ప్రపంచము నందుగాని, ప్రపంచమునకు వెలుపలగాని ఆయనది కానివస్తువేమున్నది? దేనినాతడు దొంగిలించవలె? గోపికల సర్వస్వము గోవిందుడే! సమస్త జగత్తుగూడ భగవానునిదేకదా! అట్టిచో దేనినాతడు దొంగిలించును? ఇక దొంగలన నెవరో విచారించుడు. భగవానుని వస్తువులను తమ వని భావించి మమతానురాగ బద్ధులై ప్రవర్తించుదురో వారు వాస్తవముగ చోరులు.

ఒకనాడు బలరామాది గోపబాలురందరు ఆడుకొనుచుండిరి. వారు వచ్చి యశోదతో "అమ్మా, కృష్ణుడు మన్నుతిన్నా"డని చెప్పిరి." *

---

వారు దండనీయులు. కావున యే విధముగ చూచినను వెన్న దొంగిలించుట యను నది దొంగతనమేకాదు. అది భగవానుని దివ్యలీల! యథార్థమేమనగా గోపికలు భగవానుని యందు తమకుగల ప్రేమాధిక్యతచే అతనికి ముద్దుగా 'చోరు' (దొంగ)డని పేరు పెట్టినారు. అతడు వారి మానసముల హరించిన 'చిత్తచోరుడు' కదా!

వారు భగవానుడగు శ్రీకృష్ణుడని భావించనేలేదు. శ్రీమద్భాగవతమందు వర్ణింపబడిన భగవానుని లీలలపై విమర్శించుటకు (విచారణ చేయుటకు) వారి కధికారము లేకపోయినను, వారికి ప్రసంగమునందు బాధాకరమగు విషయమేమియు లేకుండె. ఏలననగా, శ్రీకృష్ణుడా సమయమందు దాదాపు రెండుమూడు సంవత్సరముల వయసుగల పసివాడు. గోపికలకతనియందున్న అత్యధిక ప్రేమవలన, మాధుర్య యుక్తములగు నతని బాల్యక్రీడల గాంచుట వాంఛించుచుండిరి. కావున వీనిని శంకించువారలు విషయమును సరిగా నర్థమొనర్చుకొని సంతసించెదరు గాక.

(హనుమాన్ ప్రసాద్ పోద్దార్)

*** మృద్భక్షణమునకు కారణము లెవ్వియనగా :**

1. భగవానుడు తనయందు శుద్ధసత్త్వగుణము మాత్రమే యున్నందున, మున్ముందు రజోగుణాత్మకములగు పనులెన్నియో తాను చేయవలసి యుండుట చేతను, కొంచెము 'రజస్సు' (మట్టి) గ్రహించినాడు.

2. సంస్కృత భాషలో భూమికి 'క్షమా' అనియు పేరున్నది. శ్రీకృష్ణుడు, "తనతో నలమటికలు లేకుండ ఆడు గొల్లపిల్లలు తన నప్పుడప్పుడు అవమానించు నుందురు. అట్టివారితో నాడునప్పుడు క్షమాంశ ధరించి యాడవలసియున్నది. లేనిచో విఘ్నము కల్గునని మట్టి తినెను.

3. భూమిని 'రసా'యనియు సంస్కృతమున పలికెదరు. 'రస'మును నేనిది వరకే గ్రహించితిని. ఇపుడు 'రసా' దేవిరసము గ్రహించెదనని భగవానుడు తలచి నాడు.

4. ఈ యవతారమున నేను పృథివికి హితమొనర్పవలసి యున్నది. కావున యామె యంశమును కొద్దిగా ద్విజులకు (దంతములకు) దానమొనర్చెదగాక యని భగవానుడు మృద్భక్షణ గావించె.

5. బ్రాహ్మణులు శుద్ధసాత్త్విక కర్మలనే యాచరించుదురు. ఇపుడు రాక్షస సంహారార్థము వారు రాజస కర్మలను చేయవలసియున్నది! అని సూచించుటకా యనునట్లు, తన ముఖమందలి ద్విజులను రజోయుక్తుల గావించినాడు భగవానుడు.

యశోద శ్రీకృష్ణుని హితము కోరునది గాన యతనిని చేతితో బట్టుకొనినది. (ఈ చేయి యతనికి మన్ను దినుటలో సహాయము చేసినదిగాన యిదియుదొంగయే).

శ్రీకృష్ణుడు బెదురుచూపులు జూచుచు భయము నటించుచున్నాడు. "ఒరే, అల్లరి పిల్లవాడా, రహస్యముగ మన్నేలదింటివ"ని యశోద యదలించినది.

(భగవానుని నేత్రములందు సూర్యచంద్రులు వసించుచున్నారు. వారు కర్మ సాక్షులు. భగవానుడు తాను మన్ను దిన్నట్లు అంగీకరించునేమో వారికి తెలియదు. అందుచే తామిప్పుడేమి చేయవలయునో తెలియక బెదరుచుండిరి)

"చూడు నీ స్నేహితులందరేమి చెప్పుచున్నారో! నీ యన్న బలరాముడు గూడ నీవు మన్ను దిన్నట్లు సాక్ష్యము చెప్పుచున్నాడు!"అని యశోద మందలించగా గోపాల బాలుడిట్లనియె.

"అమ్మా, నేను మట్టిని తిననేలేదు. వీరందరు నీతో నబద్ధములు చెప్పు చున్నారు. వారి మాటలు నీవు నిజమని నమ్మే యెడల నా నోటిని నీ కండ్లతోనే చూడుము." అని పలుక యశోద "అట్లగుచో నీ నోరు తెరువు"మని పలికినది. భగవానుడు నోరు తెరచినాడు. (నేను తిన్నచో నే నొక్కడనేగాదు విశ్వమంతయు తిన్నట్లే. నా నోటియందు విశ్వమును చూడుమని నోరు చూపెనట).

"రాజా, భగవానుని ఐశ్వర్యమనంతము. కేవలము లీలార్థమే యతడు మానవ బాలకుడుగా నవతరించినాడు. ఆ బాలకృష్ణుని నోటి యందు యశోదాదేవి యీ చరాచర విశ్వమునంతయు గాంచినది. ఆకాశము, దిక్కులు,పర్వతములు, ద్వీపములు, సముద్ర సహితమగు భూమండలము, వాయువు, విద్యుత్తు, అగ్ని, చంద్రుడు, తారకాసహితమగు సమస్త జ్యోతిర్మండలము అహంకార కార్యములగు

---

6. మొదట విషభక్షణ యొనర్చినాడు గావున దానికిమందుగా యిప్పుడు మన్ను దినియె.

7. మొదట గోపికల యిండ్లయందలి వెన్న దిన్న భగవానుడా దోషము పోవుటకై మట్టిదినియె.

8. భగవానుని యుదరమందున్న యనేక కోటి బ్రహ్మాండముల యందలి జీవులు- వ్రజధూళిని— గోపికల చరణరజమును - పొందుటకై తహతహలాడు చుండిరి. వారి యభిలాషను దీర్చుటకై భగవానుడు మన్ను దినియె.

9. భగవానుడు స్వయముగనే తన భక్తులయొక్క పాదధూళిని తన నోటి ద్వారా, హృదయమునందు ధరించుచుండును. కావున మన్నుతినుటలో నున్న యభిప్రాయమదియే.

10. సామాన్యముగ చిన్నపిల్లలు మన్నుతిందురు. మాయామానుష బాల రూపమున నున్న భగవానుడు చిన్నపిల్లల మనః ప్రవృత్తి ననుసరించినాడు.

దేవతలు, మనుస్సు-ఇంద్రియములు, పంచతన్మాత్రలు-మొదలగు సమస్తము తల్లికి దృగ్గోచరమైనవి.

జీవులు, కాలస్వభావములు, కర్మలు, వాసనలు, శరీరాదుల ద్వారా విభిన్న రూపముల యందు కనుపడు యీ సమస్త ప్రపంచమును, వ్రజ మండలమును, అందున్న తనను గూడ యశోద యాబుల్లి నోటి యందు చూచినది. ఆమె సంశ యాందోళితమానసయైనది.

"ఇది యేమైనా స్వప్నమా? లేక భగవన్మాయయా? నా బుద్ధి చలించుట లేదు కదా? కాదు. ఈ బాలకుని యందు పుట్టుకతోనే సంభవించిన యోగసిద్ధి యేదో యున్నది. మనస్సు, బుద్ధి, కర్మ, వాక్కుల ద్వారా,సుగమముగా దేనిని యూహింప జాలమో, యీ సమస్త విశ్వము దేని నాశ్రయించి యున్నదో, యెవడు దీనికి ప్రేరకుడో, దేని సత్తవలన యీ జగత్తున్నట్లుగా తోచుచున్నదో, దేని స్వరూపము తెలియబడకుండునో, అట్టియా పరమాత్మ తత్త్వమునకు నమస్కారము. నేను నా భర్త, నా కుమారుడు, యీ సమస్త వ్రజ మండల సంపత్తికి నేను యజమాను రాలను, యీ గోపగోపీ జనము గోధనము నాయధీనమందున్నారు అని ఎవని మాయచే నా కిట్టి దురభిమాన మావరించినదో, ఆ భగవంతుడే నాకు శరణ్యుడు. నేనతనినే శరణందు చున్నాను."

అని యీ విధముగా యెప్పుడు యశోద శ్రీకృష్ణతత్త్వమును గ్రహించినదో, అప్పుడు సర్వశక్తి మంతుడగు భగవానుడు, తనమాయను పుత్రస్నేహమయియగు ఆమె యందు ప్రవేశపెట్టినాడు. వెంటనే యశోద సర్వము మరచిపోయినది. తన ముద్దుల బిడ్డడిని యొడిలోనికి తీసుకొనినది. పూర్వమువలెనే పుత్ర ప్రేమ యామె యందు పెల్లుబికినది. సమస్త వేదములు, ఉపనిషత్తులు, సాంఖ్య, యోగములు, భక్తులు యే హరియొక్కమాహాత్మ్యమును గానమొనర్చు చున్నవో అట్టి భగవానుని, తన కుమారుడనియే భావించినది యశోద."

అది విని పరీక్షిత్తు శుకయోగి నిట్లు ప్రశ్నించె. "మహాత్మా, భగవానుని తన యునిగా బడయుటకు నందుడెట్టి గొప్ప సాధనచేసి యుండె? పరమ సౌభాగ్యవతి యగు యశోదాదేవి, స్వయముగా భగవానునకు స్తన్యమొసగు మహద్భాగ్యము కలుగుటకెట్టి సాధన యొనర్చి యుండెనో గదా! తన మాహాత్మ్యమును మఱుగు పరచి,గోపబాలురతో గూడి భగవానుడు ప్రదర్శించిన బాలలీలలు యెంత పవిత్రము లనగా, వాని శ్రవణము, కీర్తనము చేయువారల సమస్త పాపములను నశింపజేసి, తాపశాంతిని కలిగించుటకు సమర్థములైనవి- త్రికాలజ్ఞులు, జ్ఞానులు నగు పురుషులు నేడు గూడ వానిని గానము చేయుచునే యున్నారు. అట్టి లీలలు కన్న తల్లిదండ్రు

అగు దేవకీ వసుదేవులకు గూడ లభ్యము కాలేదుగదా! వారి యపార సుఖమును నందయశోదలే దోచుకొనిరి. ఇందుకు కారణమేమి?"

అని ప్రశ్నించిన మహారాజుతో శ్రీశుకుడిట్లనియె. రాజా, నందరాజు పూర్వ జన్మయందు 'ద్రోణుడ'ను వసువు. అతని భార్య పేరు 'ధరా'. వారు బ్రహ్మ యొక్క యాజ్ఞను పాలించు తలంపుతో బ్రహ్మతో నిట్లు పల్కిరి.

"స్వామీ, మేము భూమి యందు, మీరు చెప్పినట్లు, జన్మించు నెడల మాకా శ్రీకృష్ణుని యందనన్య భక్తి యుండునట్లను గ్రహింప వేడుచున్నాము. అట్టి భక్తి చేతనే గదా సంసార మందలి జనులును అనాయాసముగ సర్వదుర్గతులను దాటగల్గు చున్నారు" అని వేడిన యా దంపతులకు బ్రహ్మ "తథాస్తు"ని పలికె. ఆ ద్రోణుడే వ్రజ భూమి యందు నందుడగును, ధరాదేవి యే యశోదగను జన్మించి దంపతు లైరి. సంసార చక్రము నుండి రక్షించు చక్రియే వారికి పుత్రుడై గోపికల కంటె వారి యందత్యంత ప్రేమగల వాడాయె. బ్రహ్మ మాటలు సత్య మొనర్చుటకై శ్రీ కృష్ణుడు బలరామ సహితముగ గోకుల మందుండి సర్వ వ్రజవాసులను తన బాల లీలలచే నానందాబ్ధి నోలలాడించుచుండె" నని శుక యోగి పరీక్షిత్తుతో ననియె.

# తొమ్మిదవ యధ్యాయము

## శ్రీకృష్ణుని ఱోటి కికట్టి వేయుట

శుక మహర్షి మరల యిటుల చెప్పుచున్నాడు. "రాజా ఒకనాడు నందరాణి యగు యశోద యింటి సేవకురాండ్రనందరిని యితర పనులందు నియోగించి, కుమారునకు వెన్న బెట్టుటకుగాను తానే పెరుగు చిలుక దొడగినది. పెరుగు చిలుకు చున్నపుడా తల్లి శ్రీకృష్ణుడంతవరకు చేసిన బాల్య క్రీడలనే స్మరించుకొనుచు వానినే గానము చేయుచుండినది. *తన స్థూల కటి భాగమందు సూత్రబద్ధమైన పట్టు వస్త్రములను ధరించి యున్నది యశోదాదేవి. పుత్ర స్నేహముచే పాలు చేపుకు వచ్చుచున్నవి శరీరమందు కంపము కలుగుచున్నది. కవ్వపు త్రాడు లాగుటచే బాహువులలసిపోయినవి. చేతియందలి గాజులు, కర్ణముల యందలి కుండలములు చలించుచున్నవి. మోముపై స్వేదమంకురించినది. కొప్పునందు ముడిచిన మాలతీ దామము జారిపోవుచున్నది.

---

*ఈ సమయము కార్తీకమాసము. పురాణములందు దీనిని దామోదర మాస మందురు. ఇంద్రయాగ సందర్భమున దాసీజనమంతయు యితర పనులయందు నిమగ్నులై యుండుట స్వాభావికము 'నియుక్తాస్తు' అనుటలో, కావలయుననియే

అంతటి తన్మయతతో పెరుగు చిలుకుచున్న యశోద వద్దకు, స్తన్యపానము చేయు తలంపుతో బాలకృష్ణుడు వచ్చినాడు. తన తల్లి యొక్క హృదయమందు ప్రేమ, ఆనందముల నినుమడింపచేయుచు, కవ్వపు త్రాడను బట్టుకొని పెరుగు చిలుకుట నాపినాడు. తల్లి యొడిలోని కెగబ్రాకినాడు. వాత్సల్య ప్రేమాధిక్యతచే తల్లికి స్వయముగనే పాలు స్రవించదొడగినవి. ఆమె బాలునికి పాలనిచ్చుచు, మందస్మిత యుక్తమగునతని వదనారవిందము నభుందానందమున తిలకించుచున్నది. ఇంతలో వేరొక ప్రక్కన పొయ్యిపై నుంచిన పాలు పొంగిపోవుచుండుటగాంచి తొందరగా పిల్లవానిని దించి యాపాలవద్దకు పోయినది శ్రీకృష్ణుడు పాలు త్రాగుట పూర్తి కాలేదు*

---

యశోద నియోగించినట్లు ధ్వనించుచున్నది. యశోద యను పదమును చెప్పుటలో అభిప్రాయమేమనగా:- తన విశుద్ధ వాత్సల్య ప్రేమ వ్యవహారముచే షడ్గుణైశ్వర్య సంపన్నుడగు భగవానుని గూడ ప్రేమాధీనత భక్తవశ్యతా కారణములచే తన భక్తుల హస్తములందు బందీ చేయునట్టి 'యశ'స్సును కలిగించునది- అని. నందుని యొక్క వాత్సల్య ప్రేమకు ఆకర్షితుడై, సచ్చిదానంద—పరమానంద స్వరూపుడగు భగవానుడు నందనందన రూపమున జగత్తు నందవతరించి, లోకుల కందరకు నానందము కల్గించె. ఇట్టి యుప్రాకృత పరమానంద రసాస్వాదన కలిగించుటకు నందుడు కారణమైనాడు. ఆనందగేహిని"స్వయము"గా అనుటలో పెరుగు చిలుకుట ఆమెకు చేయవలసిన పనిగాకున్నను, పుత్రప్రేమాధిక్యతచే, తన బిడ్డనికి తాను స్వయముగా తీసిన వెన్న బెట్టదలచి-చిలుకుచున్నదని భావము.

ఇక్కడ భక్తుని స్వరూపము నిరూపింపబడినది. శరీరముచేత దధిమంథన రూపమగు సేవాకర్మ జరుగుచున్నది. హృదయమందు స్మరణమును సంతత ధార ప్రవహించుచున్నది. వాక్కుచే బాలక్రీడలు గానము చేయబడుచున్నవి. భక్తుని త్రికరణములు-అనగా శరీరము, మనస్సు, వాక్కు-తన ప్రేమామృతమూర్తియొక్క సేవయందే లగ్నమై యున్నవి. స్నేహమనునది అమూర్త పదార్థము. అది సేవా రూపముననే వ్యక్తమగును. నృత్య సంగీతములు గూడ ఆ ప్రేమయొక్క విలాస విశేషములే. యశోదామాత యొక్క జీవితమందీ సమయమున రాగ, భోగములు రెండును ప్రకటితములగుచున్నవి.

* కటి యందు పట్టు వస్త్రమును సూత్రబద్ధ మొనర్చుట-ప్రమాదము, అల సత్వము, తొట్రుపాటు లేకుండుటను జూపుచున్నది. పట్టు వస్త్రము పవిత్రతను సూచించును అపవిత్రతయున్నచో, తన కన్నయ్య కేమగునో యని ఆమె భయము.

శ్లో. సజాతకోపస్ఫురితారుణాధరం సందశ్యదద్భిః దధిమంథభాజనం
చిత్వామృషాశ్రుర్ద్రుషదశ్మనారహో జహారహయ్యంగవమంతరంగతః

---

* త్రికరణ శుద్ధిగా యశోదాదేవి భగవంతునియందు తన్మయత్వము చెందుట తోడనే శ్రీకృష్ణుడు లేచి "అమ్మా"యని పిలువసాగినాడు. అంతవరకతడు నిద్రించు చున్నట్లుండె. తల్లియొక్క ప్రేమ సాధన యతనిని మేల్కొల్పినది. నిర్గుణుడు సగుణుడైనాడు. అచలుడు చలుడైనాడు. నిష్కాముడు సకాముడైనాడు. ప్రేమ యొక్క ఆకలి దప్పికలు కలిగియున్న తల్లి చెంత చేరినాడు. ఆప్తకాముడు సకాముడైనాడు. (స్తన్యకాముడైనాడు) ఆమె పెరుగు చిలుకుచుండగా వచ్చినాడు.

భగవంతుడు సర్వత్రా సాధనయొక్క ప్రేరణ కలిగించుచునే యుండును. తనవైపునకు లాగుకొనును. కవ్వము బట్టి చిలుకుట నాపినాడు. 'అమ్మా, నీ సాధన పూర్తియైనది. ఇంకను 'పిష్టపేషణ' మెందులకు? ఇంతకు మించి నీ సాధనయొక్క భారమును నేను మోయలేను." అని పలుకగా యశోదాదేవి ప్రేమతో నిండిపోయినది. పిల్లవాడు తననింతగా కోరుచుండెనని మురిసిపోయినది.

తల్లి "నాయనా, వెన్న సరిగా తీయనిమ్ము" అనుచు అతనిని వారించినది. 'ఊఊఊ నేను పాలు త్రాగెదను' అని మారాము చేయుచు రెండు చేతులతో తల్లి నడుము బట్టుకొని యొడిలోనికెగబ్రాకినాడు చిలిపికృష్ణుడు. తల్లికి పాలు స్రవింప జొచ్చినవి. పాలు త్రాగుచున్నాడు. చిరునవ్వు నవ్వుచున్నాడు. ఆమె కన్నులా చిరునవ్వు మోమునందు లగ్నమైనది. ఆ యానందము వర్ణనాతీతము.

సమీపమందు పాలు కుంపటిపై మఱుగుచున్నవి. అవి పద్మగంధా యను ఆవుయొక్క పాలు. ప్రేమమయియగు యశోదామాతయొక్క పాలెన్నటికిని తఱిగి పోవు. శ్యామసుందరుని ఆకలి యెప్పటికిని తీరునదియుగాదు. అవి రెండును పోటీ పడుచుండును. నేను యుగయుగముల నుండియు యీ గోపాలబాలుని యధర స్పర్శకై తపించి తపించి చచ్చిపోవుచుంటిని శ్రీకృష్ణునికి ఉపయోగించని నా యీ జీవనమువలన ప్రయోజనమేమి? ఇంతకంటె ఆయన చూచుచుండగా అగ్నిలో బడుటమేల"ని పాలు పొంగినవి. అది తల్లి చూచినది. దయగల తల్లిగాన, శ్రీకృష్ణునిగూడ వదలి, దుఃఖితను రక్షించుటకై పరువెత్తినది. భగవానుడు అతృప్తుడుగనే యుండె. భక్తుల హృదయ రసముచే— ప్రేమచే— భగవంతున కెన్నటికైన తృప్తి కలుగునా? ఆనాటినుండి అతనికి అతృప్తుడని క్రొత్త పేరు వచ్చినది.

శ్రీకృష్ణునకు కోపము వచ్చినది. ఎర్రని పెదవులదర జొచ్చినవి. పండ్లు కొరికినాడు. సమీపమందున్న ఱాతిలో, చిలుకుచున్న కుండను పగులగొట్టి, కల్లబొల్లి యేడ్పులేడ్చుచు వేఱొక గదిలోనికిబోయి వెన్నతిన సాగినాడు.*

---

*శ్రీకృష్ణుని పెదవులదరినవి. క్రోధము ఆ పెదవుల స్పర్శనంది కృతార్థమైనది. ఎర్రని పెదవులు, తెల్లని పాలపండ్లచే నొక్కబడినవి. అది, సత్త్వగుణము రజోగుణమును శాసించుచున్నట్లున్నది. బ్రాహ్మణుడు క్షత్రియుని శిక్షించుచున్నట్లున్నది. ఆ కోపము కుండపై ప్రసరించినది. దానియందొక యసురుడు ప్రవేశించినాడు. దంభుడు, "కామము, క్రోధము, అతృప్తుల పిమ్మట నావంతు వచ్చినది." అని తలచి అశ్రురూపము దాల్చి కంటియందు మెరిసినాడు. తన భక్త జనులయందు మమతానురాగములుప్పొంగ జేయుటకై భగవానుడు సమస్త భావములను తన యందు కలుగచేయుచుండును. ఈ కామ క్రోధ లోభ దంభములు నేడు బ్రహ్మ సంస్పర్శను పొంది ధన్యములైనవి. వేఱొక గదిలోనికిబోయి నవనీత భక్షణ యొనర్చుట, తానెంత యాకలిగొనుయున్నాడో తల్లికి తెలియజెప్పుటకా యను నట్లుండె.

ప్రేమభక్తులయొక్క లక్ష్యము భగవానుడుకాదు. భగవంతుని సేవించుటయే. అట్టి సేవకొరకువారు భగవానునిగూడ త్యాగము చేయగలరువారు. తల్లి స్వహస్తములచే పిదికిన పద్మగంధా గోవులపాలు శ్రీకృష్ణుని కొఱకే కాచబడుచున్నవి. కొంచెమాగిన పిదప వానినాతడారగింపవలసి యుండె. "పాలు పొంగిపోయినచో పిల్ల డాకలితో నుండిపోవును. ఏడ్చును" అను భావముతోనే యశోద పాలు పొయ్యిపైనుండి దించుటకు పరువెత్తినది.

యశోద పాలవద్దకు చేరినది. అది యొక ప్రేమయొక్క అద్భుతదృశ్యము! పుత్రుని యొడినుంచి దించి, అతను త్రాగవలసిన పాల కొరకింత ప్రీతి యేల? తన వక్షమందలి పాలు తన వద్దనే యుండును. అవి యెక్కడకును పోవు. కాని వేల కొలది యావుల పాలచే పోషింపబడిన యీ పద్మ గంధా గోవు పాలు మరల యెక్కడ లభించును? బృందావనమందలి పాలు అప్రాకృతములు. చిన్మయములు. అవి ప్రేమ ప్రపంచమునకు సంబంధించినవి. యశోద తమ వద్దకు వచ్చుట జూచి యాక్షీరములు సిగ్గు పడినవి. "అయ్యో, అగ్నిలో దుముకుదమను నా సంకల్పము చేత, తల్లి యొక్క ప్రేమానందమున కెట్టి విఘ్నము గల్గించితిని? తన యానందమును వదలి తల్లి నన్ను రక్షించుటకై పరుగెత్తుకొని వచ్చినది గదా! ఛీ" యనుకొనుచు పాలు తత్కాలమునకుపశమనము పొంది యథా పూర్వముగా నుండిపోయినవి.

యశోద, పొయ్యి మీది పాలు దించి మరల పెరుగు చిలుకుచున్న చోటికి చేరినది. ఏమి యచటి దృశ్యము! దధి భాండము ముక్కలు ముక్కలై యున్నది. ఇది యంతయు తన ముద్దు కుమారుని ఘనకార్యమే యని యామె గ్రహించినది. ఆ బుడుత యచట కనుపింపలేదు. ఆమె నవ్వుకున్నది. అటు నిటు వెదకినది. వెదుకగా వెదుకగా నొకచోట తిరుగబడిపోయిన రోటిపై నిల్చుండి యుట్టిపై బెట్టిన నిలువ వెన్నను మర్కట (ఇచట మర్కట శబ్దము మార్జారాదులకు పలక్షకము, శ్రీధర వ్యాఖ్య) ములకు బెట్టుచు, మాధవుడగుపించినాడు. అమ్మ యెక్కడ చూచునో, తన దొంగతన మెక్కడ బయల్పడునో యను భయముతో బెదరు చూపులతో నలవైపుల జూచుచున్న గోవిందుని గాంచి యశోద, మెల్ల మెల్లగా వెనుక నుండి యతనిని సమీపించినది.

శ్లో. తామాత్తయష్టిం ప్రసమీక్ష్యసత్వరః తతోఽవరుహ్యా పససార భీతవత్
గోప్యన్వధావన్నయ మాపయోగినాం క్షమం ప్రవేష్టుం తపసేరితం మనః

తన తల్లి తనను గొట్టుటకై బెత్తము పుచ్చుకొని వచ్చుచున్నదని గుర్తించిన శ్యామసుందరుడొక్క యుదుటున రోటిపై నుండి దుమికి, భయపడిన వానివలె పరుగిడ జొచ్చినాడు. మహా యోగీశ్వరులు గూడ తపస్సుల ద్వారా తమ మానసముల నత్యంత శుద్ధము లొనర్చుకొనియు యెవనిని పట్టుకొనుటయటుంచి యేవని యందు ప్రవేశింపజేయజాలకయే యుందురో అట్టి భగవానుని పట్టుకొనుటకై వెంట పరుగెత్తినది యశోదాదేవి! *

---

* "అమ్మా, నీవు నన్ను నీ యొడిలో నుంచుకొననిచో నేనే ఖలుని యొడియందో కూర్చుండెదనన్నట్లుగా శ్రీకృష్ణుడు ఉలూఖల"ముపై గూర్చుండె. ఉదార పురుషులెట్టి ఖలుల సాంగత్య మందుండినను వారి శీల స్వభావములుమారవు. రోటిపై గూర్చుండియు భగవానుడు వానరములకు వెన్న దినిపించు భూత తృప్తి గావించుచుండె. బహుశః, రామావతారమందు కోతులు తనకొనర్చిన సాహాయ్యమునకు కృతజ్ఞతారూపమైన గావచ్చును, లేక యిప్పుడిప్పుడే వచ్చిన కోపమునకు ప్రాయశ్చిత్త రూపమైన గావచ్చును.

* భగవానుడు భీతితో పరుగెత్తుటయా? ఏమి యపూర్వ ప్రదర్శనము? తన యైశ్వర్యమును తన తల్లి యొక్క వాత్సల్య ప్రేమ కర్పణ యొనర్చినాడు. అసురు డెవడైన వచ్చిన సుదర్శన చక్రమును స్మరించును. కాని తల్లి బెత్తమును వారించుటకా తనవద్ద యట్టి శస్త్రాస్త్రములును లేవు! భగవానుని యీ భయ భీత మూర్తి యెంత మధురము! ఆ భయమెంత ధన్యమైనది!

శ్రీకృష్ణుని వెంట నీవిధముగ పరువిడుచున్న యశోద శ్రోణీభారముచే నిక పరుగెత్త జాలకపోయినది. వేగము మందగించినది. జుట్టు ముడివీడిపోయి యందు మర్చుకొనియున్న పూలు నేలరాలసాగినవి. అతి కష్టముతో తనయుని చేజిక్కించుకొని, యాతనిని బెదిరింపసాగినది. అప్పుడు శ్రీకృష్ణుని దృశ్యము చాల విలక్షణముగనున్నది! అపరాధముచేసి యున్నాడుగదా! ఏడుపు ఆపుకొందమన్నను ఆగుట లేదు. చేతులతో కన్నులు నులుముకొనసాగినాడు. అందుచే కాటుకయంతయు కఱిగి మోమున వ్యాపించినది. ఎక్కడ తల్లికొట్టునో యను భయముతో పైచూపులు చూచుచుండె. వ్యాకులత యగుపించుచుండె.*

తన బిడ్డడు భయపడెనని యశోదయెప్పుడు పరికించినదో అప్పుడామె హృదయమునందు వాత్సల్యప్రేమ యుప్పొంగినది. చేతిలోని బెత్తమావల బారవైచినది. ఇతడెక్కడికి పారిపోకుండునట్లీతని కట్టివైచుట యుక్తమని యామె భావించినది. నిజము చెప్పవలెనన్నచో, యశోదకు తన పుత్రుని ప్రభావము తెలియదు. *

---

*విశ్వముయొక్క చరిత్రయందు, భగవానుని సంపూర్ణ జీవనమందు మొదటిసారిగా, విశ్వేశ్వరుడు తల్లియెదుట అపరాధియై నిలబడిన ఘట్టమిది. తానే యపరాధియైనట్లు సత్యమును ప్రకటించినాడు. ఎడమచేతితో కన్నులనులుముకొనుచు వానిచేత "మేమేపనియు చేయలేదని చెప్పించు"చున్నట్లు, ప్రదర్శించినాడు. పైకెంటుకు చూచినాడనగా "తల్లియేనన్ను కొట్టుటకు తయారైనపుడు నాకింకెవరు సహాయము చేయగలుగుదురు?" అనిభావము. నేత్రములు భయముచే విహ్వలములైనవి. నేనేమియు చేయలేదని అవి యింకనెట్లు చెప్పగలవు. అట్లు చెప్పినచో యీ లీలయే ముగిసిపోవునుగదా! తల్లి బెదిరించినది. "ఓరీ చపలచిత్తుడా! వానరబంధూ, అల్లరివాడా, ఇపుడు నీకు వెన్న యెక్కడనుండి వచ్చునురా? నిన్నీవేళ యెటుల కట్టివేయుదుననగా, నీవు గొల్లపిల్లలతో నేవిధముగను ఆడుకొనలేవు. వెన్న దొంగిలించుట మొదలగు కొంటెపనులు చేయనుకూడలేవు. అట్లు బంధించెదను నిన్ను" అని పలికినది.

శ్రీకృష్ణుడుః- 'ప్రియమైన తల్లీ' నన్నుకొట్టకుము.

తల్లి:- దెబ్బలంటే అంత భయమున్నవాడవు దధిభాండమునేల పగులగొట్టితివి?

శ్రీకృష్ణుడు:- అమ్మా, యికనెప్పుడటుల చేయను. నీ చేతిలోని బెత్తమునావల బారవేయుము.

శ్రీకృష్ణుని యమాయకత్వమున కామె హృదయము ద్రవించినది. వాత్సల్యప్రేమయను సముద్రము పొంగినది. "కన్నయ్య చాల భయపడిపోయినాడు. వీనిని వదలి పెట్టినచో పారిపోయి యే వనములందో తిరుగును. ఆకలిదప్పులెఱుగడు. కావున కొంచెము సేపు వీనిని బంధించియే యుంచెద. పెరుగు వెన్న తయారైన

శ్లో॥ నచాంతర్న బహిర్యస్య న పూర్వం నాపిచాపరం
పూర్వాపరం బహిశ్చాంత-జగతో యోజగచ్ఛయః

ఆ యైశ్వర్యమునకు ఆద్యంతములు లేవు. లోపల వెలుపల యను పరిచ్ఛిన్న త్వము లేదు. సృష్టికి పూర్వము, అనంతరము గూడ నుండునట్టిది. జగద్రూపముగా భాసించుచున్నది గూడ ఆ పరమాత్మయే. * ఇంద్రియాతీతమై యవ్యక్త రూపముగా నున్న పరమాత్మ సాధారణ మానవ శిశువుగా నున్న కారణముచే పుత్రుడని తలచి యశోద యాతని కట్టి వేయ దలచినది. సామాన్య బాలుని వలె యామె

---

'పిదప వీనికి బుద్ధి చెప్పెద"నని తలచి యశోద, కన్నయ్యను కట్టి వేయుటకే నిశ్చయించినది. కట్టి వేయుటకు కారణము ఆ తల్లికి గల వాత్సల్య ప్రేమయేగాని వేఱొండుకాదు.

భగవదైశ్వర్యమును తెలియని యజ్ఞానము రెండు విధములుగ నుండును. ప్రాకృత జీవుల యొక్క అజ్ఞానము. భగవత్ప్రీతియందు సిద్ధులైన వారి యజ్ఞానము. యశోద మొదలగు వారు రెండవ తరగతికి చెందినవారు. భగవానుని యెడల వాత్సల్య భావము, గాఢమగు పుత్రప్రేమ యనునవి, భగదైశ్వర్యమును ఆవరించి యనుభవించకుండ నడ్డుపడుచున్నవి. కానిచో వారి యందజ్ఞానముండుటకే యవకాశము లేదు. వీరిది తురీయావస్థ. సమాధి స్థితిని గూడ అతిక్రమించి సహజ ప్రేమ యందున్న స్థితి వారిది. వారియందు ప్రాకృత, అజ్ఞానమోహములు, రజస్తమోగుణములన నేల, ప్రాకృత సత్త్వగుణము గూడ లేదు. కావున వీరి యజ్ఞానము గూడ భగవానుని లీలా సిద్ధికై కల్పించిన, భగవానుని లీలాశక్తి యొక్క చమత్కార విశేషమేగాని వేరు గాదు.

హృదయ మందు చైతన్య స్ఫురణ కలుగనంతవరకు జడత్వముండును. శ్రీకృష్ణుడు చేజిక్కిన యనంతరము యశోద తన చేతి యందలి పేము బెత్తము నావల బారవైచినది! ఇది సర్వదా స్వాభావికమే!

'నాకు తృప్తి కలిగించు ప్రయత్నములు చేయక చిన్న, పెద్ద వస్తువులపై దృష్టి కలిగియుండుట కేవలము అర్థ శూన్యములగుటయేగాక, నన్ను గూడ వారికి కనుపింపకుండునట్లు చేయును. కాని సర్వ త్యాగమొనర్చి నా వెంట పరుగెత్తుటయే నన్ను పొందుటకు కారణమగును. తల్లి యొక్క చరిత్రచే ఈ విషయము ధ్రువమగుట లేదా!" అని భగవానుని భావము.

యోగుల యొక్క బుద్ధి గూడ నన్ను గ్రహింపజాలదు. కాని యెవరిబుద్ధి ప్రాపంచిక విషయములన్నిటి నుండి విముఖత్వమును పొంది నాకభిముఖముగా ప్రసరించునో నేనట్టివాని గుప్పిట జిక్కెదను" అని యాలోచించియే భగవానుడు తల్లికి చిక్కినాడు.

కన్నయ్యను త్రాటితో రోటికి కట్ట జూచినది. * చిల్లరివాడు, కొంటెవాడునగు కుమారుని త్రాటితో కట్ట దొడగినది. త్రాడు రెండంగుళములు తక్కువైనది. ఇంకొక త్రాడు తెచ్చి దానికి సంధించినది అదియు రెండంగుళములు తగ్గినది.

అది గాంచిన యశోద దానికింకొక త్రాటిని జతచేసినది. ఈ ప్రకారముగా మెయొకటి వెనుక మఱియొక తాళ్ళను కూర్చినప్పటికిని రెండంగుళములే తక్కువగుచుండె. *

---

* ఈ శ్లోకము నందు శ్రీకృష్ణుని బ్రహ్మత్వము నిరూపింపబడినది. ఉపనిషత్తులందు చెప్పబడిన అపూర్వ, అనపర, అనంత అబాహ్యత్వములు మొదలగునవి. సర్వరూపుడగు బ్రహ్మ ప్రేమవశుడై, యశోదచే కట్టుబడినాడు. బంధనరూపుడు గూడ అతడేగాన యిందు సంగతేమియు లేదు. * అతడు మళ్ళీ యెన్నడు గూడ రోటిపై కూర్చుండకుండనట్లు, దానికే కట్టివేయుట యుచితము. ఖలునితో యెక్కువ సంగము కలిగినచో మనస్సునందు తడనిన యుద్వేగము కలుగును. ఈ ఉలూఖలము గూడ, కృష్ణునకు దొంగతనములో సాయపడినందున, దొంగయే. ఇద్దరును బంధన యోగ్యులగుటచే వారిద్దరిని తల్లి బంధించినది. * యశోద, తన ప్రేమ, మమకారములను గుణముల (త్రాళ్ళ)చే కన్నయ్య పొట్ట నింపసాగినది. నిండిన కొద్దియు, తన నిత్య ముక్తత్వము, స్వతంత్రతయను సద్గుణములను భగవానుడు ప్రకట మొనర్పసాగినాడు.

* 1. సంస్కృతమందు గుణమనగా, సద్గుణము, సత్త్వాదిగుణములు, త్రాడు అనియు అర్థములున్నవి. అఖిలబ్రహ్మాండ నాయకుడగు భగవానుడు త్రిగుణాతీతుడు. ఆ గుణము లతనిని స్పృశింపజాలవు. ఈ సాధారణగుణము (తాళ్ళు) లతనిని బంధింపగలవా?

2. ప్రాపంచిక విషయములు యింద్రియములను మాత్రమే బంధింపజాలియుండును. కాని హృదయ మందంతర్యామియై సాక్షిరూపముననున్న పరమాత్మను బంధింపగలవా? గోబంధకములను (యింద్రియములు లేక గోవులు) బంధించునట్టి త్రాళ్ళు, గోపతినెట్లు బంధింపగలవు?

3. వేదాంత సిద్ధాంతానుసారము అధ్యస్తమైన దానియందే బంధముండును గాని, అధిష్ఠానమునందు బంధముండదు. శ్రీకృష్ణుని యుదరము అనంతకోటి బ్రహ్మాండములకు అధిష్ఠానము, దానియందు బంధనమెట్లు కలుగును?

4. భగవానుడు యెవనిని తన దయాదృష్టిచే వీక్షించునో, వాడు సర్వదా బంధవిముక్తుడగును. యశోద చేతియందున్న త్రాటిపై శ్రీకృష్ణుని కృపాదృష్టి ప్రసరించినది. అది బంధవిముక్తమైనది కావున ముడియెట్లు పడును?

5. ఏ సాధకుడైనను తన గుణముచేత భగవానుని ప్రసన్నుని గావింప దలచినచో నది సాధ్యముగాదు, అని సూచించుటకేగాబోలు యేగుణమును (త్రాడును) భగవానుని యుదరమును పూర్తిగా చుట్టుటకు సమర్థము కాలేకపోయినది.

త్రాడు రెండంగుళములు మాత్రమే యేల తక్కువైనది?

1. "నేను విశుద్ధహృదయులగు భక్తజనులకు దర్శన మొసంగునపుడు నాతో నొక్క సత్త్వగుణమునకు సంబంధించిన స్ఫూర్తియే యుండును. రజోగుణ తమోగుణ సంబంధముండదు" అని తలచిన భగవానుడు త్రాడునకు రెండంగుళ ముల లోపముకల్గించి తన భావమును ప్రకటించె.

2. నామరూపములున్నచోటనే బంధనముగూడ నుండును. పరమాత్మనగు నాయందు బంధనయనునది యెట్లుకలుగును? అచట యీ రెండును లేవుకదా. రెండంగుళములు తక్కువయగుటలో రహస్యమిదియే.

3. రెండు వృక్షముల నుద్ధరించవలసియున్నదను క్రియను సూచించుచు త్రాడు రెండంగుళములు తక్కువైనది.

4. భగవదనుగ్రహముచేత ద్వైతమందు అనురాగము కలవాడుగూడ ముక్తుడగుననియు, అసంగుడుగూడ ప్రేమచే బంధితుడగుననియు; యీ రెండు భావములు సూచించుటకుగాను త్రాడు రెండంగుళములు తక్కువైనది.

5. చిన్న-పెద్ద త్రాళ్ళను వేరువేరుగను, మరియు కలిపియు భగవానుని యుదరము కట్టుటకు ప్రయత్నించినది యశోద. కాని ఫలితములేకపోయినది. ఏల ననగా, నతనికి చిన్న-పెద్దయను తారతమ్యములేదుగాన. "భగవంతునితో సమాన మగు అనంతత్వము, అనాదిత్వము, విభుత్వము మాయందులేదుగాన నీవాతని కట్టి వేయు ప్రయత్నము మానుము లేక-నదులన్నియు సముద్రమును ప్రవేశించి తమ గుణములన్నియు (త్రాళ్ళు) కోల్పోవునట్లు, అనంతగుణుడగు భగవానునందుమేము లీనమై నామరూపముల గోల్పోతిమనీ సూచించుచు త్రాళ్ళు రెండంగుళములు తక్కువాయె, యశోద తనమనమందిట్లు తలచినది.

"ఈ పిల్లవాని నడుము పిడికెడు మాత్రమున్నది. వందల కొలది బారల పొడవుగల త్రాళ్ళు గూడ యీ నడుము చుట్టి రాకున్నవే. వీని నడుము లావెక్క లేదు. త్రాటి పొడుగు తగ్గలేదు! అయినను కట్టుబడుటలేదు! ఏమి యీ ఆశ్చ ర్యము! ప్రతిసారియు రెండంగుళములే తగ్గుచున్నవి. మూడుగాదు, నాలుగుగాదు. ఏమి, యీ యలౌకిక చమత్కారము!

1. భగవానుడాలోచించినాడు, "తల్లియొక్క హృదయము నుండి ద్వైత భావన దూరమగుటలేదు. వ్యర్థముగా నా యొక్క అసంగత్యమునేల ప్రదర్శింప వలె. ఆమె నన్ను బద్ధునిగ భావించుచున్నది గాన, నేను బద్ధుడనగుటయే భావ్య మని భావించి బద్ధుడాయె.

ఈ ప్రకారమామె యింటియందున్న త్రాళ్ళనన్నింటిని చేర్చినప్పటికిని, ఆమె భగవానుని కట్టివేయలేకపోయె. ఆమె చేతగానితనమును జూచి యితర గోపికలు నవ్వుచుండిరి. కాని స్వయముగ వారుగూడ ఆశ్చర్యచకితులైపోయినారు. ♦

---

2. "నా భక్తుని యొక్క కొద్ది గుణమును గూడ నేను పూర్ణ మొనర్చెదను" అని తలచి భగవానుడు తల్లియగు యశోద గుణమును (త్రాటిని) తనను బంధించుటకు యోగ్యమగు దానినిగా చేసినాడు.

3. "నా యందు అనంతములు, అచింత్యములునగు కళ్యాణ గుణములున్నను, భక్తు లెంతవరకు వానిపై తమ గుణముల యొక్క ముద్ర వేయకుందురో అంతవరకు అవి అసంపూర్తిగనే యుండును." అని యాలోచించి భగవానుడు తన తల్లి యొక్క ప్రేమ-వాత్సల్యాది గుణముల (త్రాళ్ళ)చే పూర్ణోదరుడు—దామోదరుడుగా విలసిల్లినాడు.

4. శ్రీకృష్ణుడెంతటి కోమలహృదయుడనగా, తన భక్తునియొక్క ప్రేమ పుష్టికై యాతడా (భక్తుడు) నర్చు పరిశ్రమనుగూడ సహించజాలనంతటి కృపాసింధువు. అందుచే భక్తుని పరిశ్రమనుండి ముక్తిపొందించుటకై తాను బంధనమును స్వీకరించె.

5. భగవానుడు తన శరీర మధ్యభాగమందు (నడుము) బంధనమును స్వీకరించి సూచించినదేమనగా:- పరమార్థ దృష్టిచే నాయందు బంధనమనునదియే లేదు. ఏలనన, యేవస్తువుపైన-క్రింద, ముందు-వెనుక ఉండదో కేవలము మధ్యభాగమున్నటుల కనిపించునో, అది మిథ్యయే. ఆ ప్రకారమే యీ బంధముగూడ మిథ్యయే" అని సూచించినాడు.

6. భగవంతుడెవరి శక్తికిగాని, సాధన సామగ్రులకుగాని బద్ధుడగువాడు కాడు. యశోద తన చేతులతో శ్యామసుందరుని బంధింపలేకపోవుటను గాంచిన యిరుగు పొరుగు గోపికలామెతో "అమ్మా, కన్నయ్య నడుము పిడికెడుగూడలేదు గదా. ఇన్ని త్రాళ్ళతోగూడ నతడు కట్టుబడకుండుట జూడగా, బ్రహ్మ యితని నుదుటిపై బద్ధుడగునట్లు వ్రాయలేదనిపించుచున్నది. కావున నీవతనిని బంధించు ప్రయత్నమిక మాను" మనిరి.

యశోద యిట్లు పల్కినది. "నేడు సాయంత్రమైనా సరే, గ్రామమందలి త్రాళ్ళన్నియు తేవలసి వచ్చినను సరియే వీనిని తప్పక బంధించియె తీరెదను." ఆమె పట్టుదలనుజూచి భగవానుడు తన హఠమును సడలించినాడు. ఏలననగా భక్తుని పట్టుదలకు భగవానుని పట్టుదలకు పోటీ యేర్పడినప్పుడు భక్తుని పట్టుదలయే నెగ్గుచుండును. భక్తుడు పరిశ్రాంతుడైనప్పుడు అతని యలసటను గాంచి భగవానుడు దయాపరవశుడై తానతనికి చిక్కును. భగవానుని దయయందలి లోపము, భక్తుని శ్రమయందలి లోపము అను రెండే, త్రాడు రెండంగుళములు

శ్లో. సమాతుఃస్విన్న గాత్రాయా విస్రస్త కబరస్రజః
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయా సీత్స్వ బంధనే.
ఏవం సందర్శి తాహ్యంగ హరిణాభక్తవశ్యతా
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరంవశే

భగవానుడు తన తల్లి శరీరమంతయు చెమటతో తడిసిపోయి యుండుటను గాంచినాడు. కొప్పునందలి పూలమాలలన్నియు క్రిందరాలిపోయినవి. ఆమె మిక్కిలి యలసిపోయినది. అందుచే దయామయుడు స్వయముగ తన తల్లి బంధనము సంగీకరించి బద్ధుడాయె.

"రాజా శ్రీకృష్ణ భగవానుడు సర్వస్వతంత్రుడు. బ్రహ్మేంద్రాది దేవతలతో గూడిన విశ్వమంతయు నతని వశమందే యుండును. అట్లైనను, యీ విధముగా తానుబద్ధుడై– "నన్ను ప్రేమించు భక్తులకు నేను సర్వదా వశుడనై యుందునను విషయమును భగవానుడు లోకమునకు సూచించినాడు.

---

తక్కువగుటలో సూచించబడినవి. లేక, భక్తుడు తాను భగవానుని బంధించెదనని యెప్పుడహంకరించునో అప్పుడొక యంగుళము, భక్తుని యనుకరించుటలో తానొక యంగుళము, మొత్తము రెండంగుళముల యంతర మిరువురకు నేర్పడును. ఎప్పుడు తల్లి యలసిపోయెనో, ఆమె శరీరమంతయు చెమటచే తడిసిపోయెనో, అప్పుడు భగవతియగు కృపాశక్తి భగవానుని హృదయమును వెన్నవలె ద్రవింపజేసి, తాను వ్యక్తమై భగవానుని విభుత్వమును మఱుగుపడచేయును. అందుచే భగవానుడు యశోదాదేవికి బద్ధుడాయె.

శ్రీకృష్ణుడు తాను స్వయముగా పరమేశ్వరుడైనను, ప్రేమ పరవశుడై బద్ధుడగుట పరమ చమత్కారము. అందుచే అది భగవానునకు భూషణమేగాని దూషణముగాదు.

ఆత్మారాముడైనను ఆకలిగొని యుండుట, పూర్ణకాముడయ్యు అతృప్తుడై యుండుట, శుద్ధసత్త్వ స్వరూపుడయ్యు కోపించుట, స్వారాజ్యలక్ష్మి యుక్తుడయ్యు చౌర్యమొనర్చుట, యముడు మొదలగు వారికిగూడ భయముగలిగించువాడు భయపడి పరువెత్తుట, మనోవేగమును గూడ నతిక్రమించి పోగలవాడు తల్లి చేతికి చిక్కుట, ఆనందమయుడయ్యు దుఃఖించుట- యేడ్చుట, సర్వవ్యాపకుడయ్యు బద్ధుడగుట,- యిది యంతయు భగవానునికి స్వాభావికమగు- భక్తవశ్యతయే- భగవత్తత్వము తెలియని వారలకు యిది యుపయోగించదు. కాని, శ్రీకృష్ణుని భగవానుడని గుర్తించిన వారలకు, ఇది అత్యంత చమత్కార విషయము. వారిదిగాంచి– భగవత్తత్వము గ్రహించి- వారి హృదయము ద్రవించును, ప్రేమభక్తిచే ప్లావితమగును. ఆహా! విశ్వేశ్వరుడగు ప్రభువు తన భక్తునిచే నులూఖలమందు బంధితుడాయెగదా! 'ఉపనిషదర్థం ఉలూఖలేనిబద్ధం'

శ్లో. నేమం విరించోనభవో నశ్రీరప్యంగసంశ్రయా
ప్రసాదం లేభిరే గోపీ యంత్రం ప్రాపవిముక్తిదాత్
నాయంసుబోధో భగవాన్ దేహినాం గోపికాసుతః
జ్ఞానినాంచాత్మ భూతానాం యధాభక్తిమతామిహ

గొల్లపడతియగు యశోద, ముక్తిదాతయగు ముకుందునివలన, యే యని ర్వచనీయమగు కృపాప్రసాదమును పొందగలిగెనో, దానిని, పుత్రుడగు బ్రహ్మగాని, శంకరుడుగాని, వక్షఃస్థలమందు విరాజమానయగు లక్ష్మి అర్ధాంగినియైనప్పటికిన్ని, పొందజాలకపోయినారు గదా, గోపికానందనుడగు భగవానుడు భక్తజనులకు సులభుడైనట్లు, దేహాభిమానులకుగాని, కర్మాసక్తులకుగాని, తాపసులకుగాని, స్వరూప భూతులగు జ్ఞానులకుగాని, అంత సులభుడుగాడు.

జ్ఞానులుగూడ భక్తి కలిగియున్నచో భగవానుని సగుణ సాక్షాత్కార ప్రాప్తి కల్గును. కాని చాల కష్టసాధ్యము. ఱోటియందు కట్టబడినది సగుణరూపము. అది నిర్గుణారాధకున కెట్లు ప్రాప్తించును? *

గోపాలబాలుని బంధించిన యనంతరము, యశోదాదేవి యింటిపనుల యందు మునిగిపోయినది. ఱోటికి కట్టబడిన భగవానుడు మాత్రము శాపగ్రస్తులై మద్దిచెట్ల రూపమునబడియున్న కుబేరతనయులకు ముక్తి గల్గించు విషయమాలోచించుచుండె. వారి నామములు నలకూబరమణిగ్రీవులు. వారికి ధనమున్నది. సౌందర్యమున్నది. సకలైశ్వర్యములున్నవి. అందుచే గర్వించియున్న వారిని నారదుడు వృక్షములుగా జన్మించుడని శపించియుండె.

---

* స్వయముగా బద్ధుడయ్యు, బంధనమందు పడియున్న యక్షులను ముక్తుల చేయుట కాలోచించుచుండె. అది సత్పురుషుల లక్షణము·

యశోదయొక్క దృష్టి యెప్పుడు కృష్ణునిపై నుండి మరియొకవైపునకు ప్రసరించినదో, ఆమె యితర విషయముల చూచుటయు అందరి దృష్టియు అమెవైపే అకర్షితములగుచుండును. (పూతనా, శకటాసుర ప్రసంగములలందు వలె,

నలకూబరమణిగ్రీవులు కుబేరుని కుమారులు. కుబేరుడు తన భక్తుడు· అందు వారు అర్జున నామదేయులు, వారు నారదునిచే శపింపబడిరి గాన అశాపావధి సమయమున వారిని ముక్తుల గావింపవలసి యున్నది. అందుచే భగవానుడు వారి వైపు తన దృష్టి మరల్చినాడు. ఎవనికి ముందు భగద్భక్తుని సాంగత్యము లభించునో, వానిపై దయ జూపుటకు గాను భగవంతుడే స్వయముగా నతనివద్ద కేగును·

# పదియవ యధ్యాయము

## యమళార్జున మోక్షము

"మహాత్మా, తాము దయయుంచి, నలకూబరమణిగ్రీవులకు శాపమేలకల్గెనో తెలుపుడు. పరమశాంతుడు, దేవర్షియునగు నారదుడే వారిని శపించునంతటి పాప కార్యమేమి యొనర్చినారు" అని పరీక్షిత్తుడడుగగా, శ్రీ శుకమహర్షి యిటుల చెప్ప దొడగె.

"రాజా, నలకూబరమణిగ్రీవు లిరువురును ధనాధ్యక్షుడగు కుబేరుని కూరిమి తనయులు. శంకరుని యనుచరులలో గణనీయులు. అందుచే వారి గర్వమఖర్వమై యుండె. ఒకనాడు వారిరువురు మందాకినీ తీరమందలి యొక యుపవనమందు (కైలాస పర్వతముపై) మదిరాపానమత్తులై, స్త్రీలతో గూడి కేళీ విలాసము లొనర్చు చుండిరి. గంగయందు పద్మములు వికసించియుండినవి. మగ యేనుగులు ఆడ యేనుగులతో గూడి జలక్రీడలాడునట్లు వారానదియందు వివిధములగు క్రీడ లొనర్చు చుండిరి. ఆ సమయమందు దైవయోగమున నారదుడచటికి వచ్చుట తటస్థించినది. దిగంబరులై యున్న స్త్రీలు నారదునిగాంచి సిగ్గుతో వస్త్రముల ధరించిరి. కాని నల కూబరమణిగ్రీవులు మాత్రము మత్తులై యున్నందున దిగంబరముగనే యుండి పోయిరి. దేవతా పుత్రులయ్యు, శ్రీమదముచే నంధులైయున్న వారి ననుగ్రహింప దలచియే నారదుడు వారికి శాపమొసగె. ♦

"విషయవాంఛాలోలురై ప్రవర్తించువారినన్నిటికంటె నష్టపరచునది వారి యైశ్వర్యమదము, రజోగుణ ప్రవృత్తి, వంశగౌరవాద్యభిమానము మొదలగునవి గూడ దానియంత హానికరములు గావు. ఏలననగా, శ్రీమదముననుసరించియే స్త్రీలోలత, జూదము, త్రాగుడు మొదలగు వ్యసనములు గూడ నుండును. శ్రీమదాం ధులై యింద్రియవశులై యుండు క్రూర పురుషులు, నశ్వరమగు తమ శరీరములే శాశ్వతములని భావించుచుందురు. తమవలెనే శరీరముల ధరించియున్న పశు పక్ష్యాదులను హింసించుచుందురు. "భూదేవుడు, నరదేవుడు, దేవుడు" అని వివిధ

---

♦ నారదుడు శాపమొసగుటకు కారణములు రెండున్నవి. ఒకటి వారిననుగ్ర హించుట. అనగా వారి మదమును పోగొట్టుట. రెండవది-శ్రీకృష్ణప్రాప్తి.

త్రికాలవేదియగు నారదునకు దివ్యదృష్టిచే "వీరిపై భగవానుని యనుగ్ర హము ప్రసరించనున్నద"ను విషయము గోచరమైనది. అది తెలిసియే వారికి శాప మొసంగె.

నామములచే పిలువబడునట్టి వాని శరీరము చచ్చిపోయినప్పుడు—దాని గతియేమి? దానియందు పురుగులు ప్రవేశించును, పక్షులు దానిని తిని మలమొనర్చును. లేక దహింపబడి భస్మరాశియైపోవును. అట్టి హేయమై నశ్వరమగు శరీరము కొరకై యితర ప్రాణుల హింసించుటలో నరుడెట్టి స్వార్థమును సాధించుచున్నాడు? అట్లు చేసినందువలన వానికి నరకము ప్రాప్తించుచున్నది.

అసలీశరీరమెవ్వరిది? అన్నమిచ్చి పోషించినవానిదా? లేక గర్భదానమొనర్చిన తండ్రిదా? లేక తొమ్మిది మాసములు మోసిన కన్నతల్లిదా? లేక ఆ తల్లిని కన్న తాతదా? లేక బలవంతముగా యీ శరీరముచే పని చేయించు బలవంతునిదా? లేక డబ్బిచ్చి క్రయము పొందినవానిదా? లేక చితియందలి అగ్నిదా? లేక దీనిని పీకి తినుటకై వేచియుండు కుక్క, నక్కలదా?

ఈ శరీరమొక సాధారణ వస్తువు. ప్రకృతి నుండి యుద్భవించి ప్రకృతి యందే లీనమగునట్టిది. అట్టి స్థితిలో, జ్ఞానము లేని పశువులు తప్ప, బుద్ధిమంతుడగు వాడెవ్వడు యీ శరీరమునే ఆత్మగా భావించి యితర ప్రాణులకు హాని తలపెట్టును? శ్రీమదముచే గ్రుడ్డివాడైన వానికి దారిద్ర్యమే అన్నిటిని మించిన అంజనము (కాటుక). ఏలననగా దరిద్రుడు మాత్రమే యితర జీవులు గూడ తనవంటి బాధితులేయని గ్రహింపగలడు. తన శరీరమునందు ముల్లు గ్రుచ్చుకొని బాధ యనుభవించినవాడు యితర ప్రాణులకట్టి బాధ కలుగకుండుగాక యని తలచును. కాని యెన్నడును ముల్లు గ్రుచ్చుకొనుటచే కల్గు బాధ ననుభవింపని వాడు ఆ బాధ యెట్లుండునో యూహింపలేడు కదా. దరిద్రునకు పొగరు, గర్వము వుండవు. అన్ని విధములగు మదముల నుండి ముక్తుడుగా నుండును. దైవయోగముచే సతతమనుభవించు కష్టమే యతనికి తపస్సుగా పరిణమించును. యెవనికి నిత్యము తిండి కొరకు ప్రయత్నమవసరమో, ఆకలిచే యెవని శరీరము శుష్కించిపోవునో, అట్టి దరిద్రుని యింద్రియములు గూడ విషయవాంఛలకు దూరమై శుష్కించిపోవును. అట్టి వాడితరుల హింసింపడు. సాధువులందరి యందును సమదృష్టి కలవారేయై యున్నను, వారి సమాగమము దరిద్రులకే సులభముగా లభించును. ఏలననగా వారిదివరకే విషయ వాంఛాదూరులై యుందురు గదా! అట్టి సత్పురుషుల సాంగత్యము నిస్సంగత్వమునకు దారి తీయును. శీఘ్రముగనే ఆ దరిద్రుని యంతఃకరణము పరిశుద్ధమగును.

సర్వుల యందు సమాన భావము కలవారై, ముకుంద చరణారవింద మకరంద రసాస్వాదన తత్పరులై యుండెడు సాదు పుంగవులకు, దుర్గుణ రాసులు, దురాచారములచే జీవయాత్ర చేయువారు, ధన మదోన్మత్తులు, దుష్టులు మొదలగు వారితో పనియేముండును? అట్టి వారిని వారు పేక్షించుదురు.

ఈ యక్షులిర్వురు వారుణీ మదమత్తులై, శ్రీమదాంధులై యున్నవారు.

ఇంద్రియములకు వశులై, స్త్రీలంపటులై యున్న వీరి యజ్ఞానజనితమగు మదమును చూర్ణమొనర్చెద. లోకపాలకుడగు కుబేరుని పుత్రులై యుండియు, మదోన్మత్తులై యొడలు దెలియక తాము దిగంబరులమై యుంటిమను తెలివియు లేకుండియున్నారు. అందుచే వీరు స్థావరత్వము గల వృక్షజన్మ యెత్తుటకు యోగ్యులు. అపుడు వీరి యభిమానము నశించును, ఆ వృక్ష జన్మయందు వీరికి నా యనుగ్రహముచే పూర్వ జన్మస్మృతి యుండును. మరియు దేవమానముచే నూరు సంవత్సరములు గడచిన పిదప వీరికి శ్రీకృష్ణ భగవానుని, భక్తి, సాన్నిధ్యము లభించుటచేత, శాపాంతమై, వారు తిరిగి తమలోకముల కేగెదరు గాక."

అని, దేవర్షియగు నారదుడు వారికి శాప మొసంగి, నరనారాయణాశ్రమమున కేగినాడు. నలకూబరమణిగ్రీవులిద్దరు జంట మద్ది వృక్షములుగా జన్మించి 'యమళార్జున' నామముచే ప్రసిద్ధి గాంచిరి. తన భక్తుడగు నారదుని వాక్యములు సత్యము గావింపదలచిన భగవానుడు, తాను బద్ధుడైయున్న రోటిని మెలమెల్లగా యీడ్చుకొనుచు, యమళార్జున వృక్షములున్న ప్రదేశమునకు వచ్చినాడు. భగవానుడీవిధముగా తలచినాడు. "దేవర్షియగు నారదుడు నా కత్యంత ప్రియ భక్తుడు. నలకూబర మణిగ్రీవులు నా భక్తుడగు కుబేరుని కుమారులు. కావున నారదుడు వీరి విషయమై పలికిన పలుకులు సత్యమొనర్చెద ♦ అని తలచినవాడై భగవానుడు రెండు (జంట) మద్ది చెట్లమధ్య దూరినాడు. తానవతలికి చేరగలిగినాడు. రోలు అడ్డము తిరుగుటచే పోలేకపోయినది. అది దామోదరుని యుదరమునకు కట్టబడి యున్నది గదా. రోటిని కొంచెము గట్టిగా లాగినాడు బాలుడు. దానితో ఆ రెండు చెట్లను సమూలముగా పెళ్ళగిలి క్రింద పడిపోయినవి. * సమస్త బలవిక్రమములకు కేంద్రమగు భగవానుని శక్తికావృక్షములు తట్టుకొనగలవా? మహాశబ్దముతో క్రింద పడిపోయినవి.

ఆ రెండు వృక్షములనుండి అగ్నితో సమాన తేజస్సుగల యిరువురు సిద్ధ పురుషులు వెలువడిరి. వారి సౌందర్యముచే దిక్కులు వెలిగిపోవుచున్నవి. వారిరువురును జగన్నాథుడగు శ్రీకృష్ణుని పాదములపై తమ శిరములుంచి మ్రొక్కి ప్రాంజలులై శుద్ధ హృదయములతో నీ విధముగ స్తుతించిరి.

---

♦ ధనవంతుని యందు మూడు దోషములుండును. ధనము, ధనముయొక్క అభిమానము యింకను ధనము సంపాదించవలెననెడు ఆశ, దరిద్రుని యందు మొదటి రెండు దోషములు లేకపోయినను, మూడవ దోషముండును. అందుచే సత్సాంగత్యముచే ధన తృష్ణ నశించి పోవును గాన ధనికులకంటె దరిద్రునకు శీఘ్రముగ కల్యాణము కల్గును.

*ధనము స్వయముగా నొక దోషము. ఉదర పోషణకు వలయు ధానికంటె

శ్లో॥ కృష్ణ కృష్ణ మహాయోగిన్ త్వమాద్యః పురుషః పరః
వ్యక్తావ్యక్త మిదం విశ్వం రూపంతే బ్రాహ్మణావిదుః

"సచ్చిదానందరూపా, సర్వులను ఆకర్షించు శ్రీకృష్ణా పరమయోగీశ్వరా, నీవాది పురుషుడవు,ప్రకృతికంటె పరుడవు. వేదజ్ఞులగు బ్రాహ్మణులు, వ్యక్తావ్యక్తముగ నున్న విశ్వమంతయు నీ రూపమేయని గ్రహించుచున్నారు. సర్వప్రాణుల యొక్క శరీరప్రాణ, అంతఃకరణ, యింద్రియములకు నీవే ప్రభువైయున్నావు. నీవే సర్వశక్తిమంతమగు కాలస్వరూపుడవు. సర్వవ్యాపకుడవు. అవ్యయుడవు, మహత్తు ప్రకృతి, సూక్ష్మగుణములు అన్నియు నీవే. స్థూల సూక్ష్మశరీరముల

---

నధికమగు దానిని తనదిగా భావించువాడు చోరుడు. కావున దండింపదగినవాడు, అని యేడవ స్కంధమందు చెప్పబడినది. (సస్తేనో దండ మర్హతి) ఎవనిపై నా యనుగ్రహము ప్రసరించునో, వాని ధనమును నేను హరించెదను" అని భగవానుడు పలికి యున్నాడు. ఇందుచేతనే సత్పురుషులు సాధారణముగా ధనవంతుల నుపేక్షించుదురు.

♦"శాపములు, వరములు యిచ్చుటచేత తపస్సు క్షీణించును. నలకూబరమణి గ్రీవులకు శాపమిచ్చిన యనంతరము నారదుడు నరనారాయణాశ్రమమునకేగుట, మరల తపస్సుచేసి తపోధనమును మరల సమకూర్చుకొనుటకే.

2. నేను యక్షులకు చూపిన యనుగ్రహము తపస్సు చేయనిదే పూర్ణము కాదనియు నారదుని భావము.

3. తన గురుదేవుడగు నారాయణునకు తాను చేసినపని విన్నవించుటకు శ్రీకృష్ణుడు తన కృపాదృష్టిచే వారలకు ముక్తి కల్గింప సమర్థుడే, కాని, 'వృక్ష రూపమున నన్ను మీకు శ్రీకృష్ణ సాన్నిధ్యము కలుగు'నని నారదుడు పల్కియున్నందున, భగవానుడు రోటినీడ్చుకొనుచు నక్కడికేగినాడు.

భగవానుడా వృక్షముల మధ్య దూరుటలో భావమేమనగా,తానెవరి యంతర్దేశమందు (హృదయమునందు) ప్రవేశించునో యతనికి క్లేశ లేశము గూడ నుండదని భావము. రెంటి మధ్య దూరుటలో యిద్దరికి నొకేమారు ముక్తి గల్గించుటయే యుద్దేశము.

♦ ఏ గుణముచే (భక్త వాత్సల్యాది సద్గుణములు లేక త్రాడు) భగవంతుడు బద్ధుడాయెనో, ఆ గుణము తిర్యక్ (పశుపక్షులు లేక కుటిలుడు) గతి గల వారలను గూడ ఉద్ధరింప సమర్థమగును.

తన ననుసరించువారు చేయు పనులు యెంత యశస్కరములగునో,అంతగా తాను స్వయముగా చేయునవి గూడ కావని - తలచి కాబోలు భగవానుడు — తన వెంట వచ్చుచున్న ఉలూఖలము ద్వారా యక్షుల నుద్ధరించినాడు.

యొక్క, కర్మ, భావ, ధర్మ, సత్తారూపముల గుర్తించు సాక్షిస్వరూపుడవు నీవే. మనోవృత్తుల కందనివాడవు. స్థూల, సూక్ష్మ ఆవరణచే కప్పబడిన యే జీవుడు నిన్ను గుర్తింపసమర్థుడగును? ఏలననగా యీ సృష్టికి పూర్వమే యున్నవాడవు నీవు. అట్టి సమస్త ప్రపంచవిధాతయగు వాసుదేవునకు (నీకు) మేము నమస్కరించుచున్నాము. నీచే ప్రకాశింపజేయబడిన గుణములచేతనే నీ మహిమ కప్పబడి యున్నది. పరమాత్మా, నీకు నమస్కారము. శ్రీకృష్ణా నీవశరీరుడవు. కాని నీయవతారములయందు సాధారణ శరీరధారులకు శక్యముగాని పరాక్రమము ప్రకటించు చుందువు. అట్టి విశేషములచే నీ యవతారములు తెలియబడుచుండును. సర్వలోకములయొక్క అభ్యుదయ నిఃశ్రేయసములకొరకే యవతరించిన పరిపూర్ణావతారుడవు నీవు. పరమకళ్యాణగుణా, పరమ మంగళా, వాసుదేవా, యాదవపతీ, నీకు నమస్కారము. మేము నీ దాసానుదాసులముగా నుండునట్లనుగ్రహింపుము. నారద మహర్షి పరమానుగ్రహముతో, అపరాధులమగు మాకు నీ దర్శనభాగ్యము కలిగించినాడు. మా వాక్కెపుడును నీ మంగళకరములగు గుణములను గానముచేయుచుండు గాక. మా శ్రవణములు రసమయమగు నీ కథలను వినుచుండుగాక. మా హస్తములు నీ పాదాబ్జ సేవయందును, మానసములు నీ చరణకమల ధ్యానమందు లగ్నమైయుండుగాక. నీ స్వరూపమగు జగత్తు నమస్కరించుటయందు మా శిరస్సులు వినయవినమితములై యుండుగాక సత్పురుషులు నీ స్వరూపములే. మా కన్నులట్టి సత్పురుషుల దర్శనము చేయుచుండుగాక"

నలకూబరమణిగ్రీవులచే నీవిధముగ స్తుతింపబడినవాడై శ్రీకృష్ణుడు ఉలూఖలాబద్ధుడై యుండియే, నవ్వుచూ వారితో నిట్లుపల్కె. *

"నలకూబరమణిగ్రీవులారా, మీరైశ్వర్య మదముచే కన్నుగానక ప్రవర్తించు చుంటిరి. పరమకారుణికుడైన నారదమహర్షి మిమ్ములను శపించి, మీ ధన మదాంధత్వమును నాశనమొనర్చినట్లును, అటులనే మీకీ యనుగ్రహము ప్రసా

* నేను సర్వదాముక్తుడనైయుందును. బద్ధజీవులు నన్ను స్తుతించు చుందురు. నేనీనాడు బద్ధుడనుగా యుంటిని ముక్తజీవులు నన్ను స్తుతించుచున్నారు ఈ విపరీత స్థితినిగాంచిన భగవానునకు నవ్వు వచ్చినది.

యక్షులీ విధముగ తలచినారు. "శ్రీకృష్ణుడు స-గుణుడై (త్రాటిచే బద్ధుడై) మనకితని దర్శనమగుచున్నది. నిర్గుణస్వరూపము మనస్సుచే నూహింపనుగూడ జాలము. అందుకని భగవానుడు బద్ధుడై యుండగనే వారు వెడలిపోయినారు.

"ఉలూఖల, స్వస్త్యస్తు సర్వదా శ్రీకృష్ణగుణశాలీ ఏవ భూయాః" ఉలూఖలమా నీవెప్పుడును శ్రీకృష్ణగుణశాలివిగనే యుండుము అని జోటి నాశీర్వదించి వారు వెడలిపోయిరి.

దించినట్లును నాకిదివరకే తెలియును. సమదర్శనులును మరియు హృదయము పరిపూర్ణముగ నాకే సమర్పించిన వారునగు సాధుపురుషుల సందర్శనముచే బంధనములు కల్గుట యుచితముగాదు. సూర్యోదయానంతరము చీకటి యుండుట సంభవమా? కావున చో యక్షులారా! మీరు మత్పరాయణులై మీ యిండ్లకు వెళ్ళుడు. మీరు కోరిన, సంసారచక్ర విమోచనమగు, అనన్య భక్తిభావము మీకు చేకూరినది."

అని భగవానుడు పలుకగా, వారిరువురు నాతనికి ప్రదక్షిణ మొనర్చి పునః పునః ప్రణామము లాచరించి, యలూఖలా బద్ధుడగు సర్వేశ్వరుని యనుజ్ఞబొంది యుత్తర దిక్కుగా వెడలిపోయిరి.

# ఏకాదశాధ్యాయము

## గోకులమునుండి బృందావనగమనము
## వత్సాసుర బకాసురుల మోక్షము

శ్రీ శుకమహర్షి మరల ఈ విధముగా చెప్పదొడంగె.

రాజా, యమళార్జున వృక్షములు పడినప్పుడు కల్గిన మహాశబ్దమును నందాది గోపాలురందరు వినిరి. పిడుగేమైన పడినదాయను శంక గల్గినది వారికి. అందరును భయభీతులై యా శబ్దము వచ్చిన దిశగా బయలుదేరి, వృక్షమున్న చోటికి చేరిరి. పడిపోయి యున్న రెండు వృక్షములును అవి పడుటకు కారణమును స్పష్టముగా కనుపించుచున్నను-రోటికి గట్టబడి యీడ్చుచున్న బాలుడు కనుపించుచున్నను - వారు వృక్షపతన కారణమును గ్రహింపజాలకుండిరి. "ఎవరిపని యిది? ఆశ్చర్యజనకమైన యీ దుర్ఘటనయెట్లు జరిగినది?" అని యాలోచించువారు మహాభయమునందిరి. భ్రాంతులైపోయిరి.

సమీపమందు కొందరు పిల్లలాడుకొనుచుండిరి. వారు వచ్చి, యిది ఈ చిన్నికృష్ణుని ఘనకార్యమే! ఇతడు యీ రెండు వృక్షముల మధ్య దూరి రోటిని లాగగా రోలడ్డము దిరిగినది. అతడు గట్టిగా లాగినందున చెట్లు పడిపోయినవి. ఇందులోనుండి యిద్దరు పురుషులు వచ్చుటనుగూడ మేము చూచితిమి" అని చెప్పిరి.

కాని గోపాలురు ఆ బాలుర మాటలను విశ్వసింపరైరి. "ఇంత చిన్నపిల్లవాడింతటి మహావృక్షములను పడగొట్టుటయా? ఇది యెచటనైనా సంభవమా?"యని వారు పలుకుచుండిరి. కాని కొందరు చిత్తములందు శ్రీకృష్ణు డిదివరలో నొనర్చిన యద్భుత లీలలను స్మరించుకొని సందేహించుచుండిరి.

నందరాజు తన యనుంగు తనయుడు ఱూఖలాబద్ధుడై యుండుట జూచి నవ్వుచూ వెంటనే యాతని కట్టు విప్పినాడు.*

సర్వశక్తిమంతుడగు భగవానుడప్పుడప్పుడు గోపికలు బుజ్జగించగా, సాధారణ బాలకులతో సమానముగ నాట్యమొనర్చుచుండువాడు. అమాయక బాలునివలె నప్పుడప్పుడు గానము చేయుచుండును. వారి చేతియందలి కొయ్యబొమ్మవలె వారాడించినట్లాడుచు వారి కానందము గల్గించుచుండువాడు. వారి యాజ్ఞల ననుసరించి పీటలు తెచ్చుట, తూనికరాళ్ళు తెచ్చుట, పాదుకలు తెచ్చుట వస్త్రాదులవలె భుజాస్ఫాలనము చేయుచు తన ప్రియశక్తులనానంద పరచుచుండును. ఈ విధముగాసర్వశక్తిశాలియగుగోపాలదేవుడు తనబాలలీలలచే వ్రజవాసులనందరిని నానందపరచుచు, ప్రపంచమందు తన రహస్యమును గుర్తించనివారలకు, తాను తన సేవకుల వశమందుండెదనని, నిరూపించుచుండె.

ఒకనాడు పండ్ల నమ్ముకొను పడతియొకతె కేక వినిపించగా సమస్త కర్మలకు- ఉపాసనలకు ఫలమునొసంగెను. (ఫల ప్రదాత పరమాత్మ పండ్లు కొనుటకై తన బుల్లి చేతులందు ధాన్యముంచుకొని, వీధిలోనికి పరుగెత్తినాడు. ఆ చేతులందలి ధాన్యము యీ లోపలనే క్రింద రాలిపోయినది. కాని యా పండ్లమ్మి యాతని దోసిలిని ఫలములతో నింపినది. ఫలప్రదాతయగు భగవానుడామె పండ్లగంపను రత్నములతో నింపినాడు.

అనంతరమొకనాడు రామకృష్ణులిర్వురు తోటి బాలకులతో యమునా తీరమందాడుకొనుచుండగా, రోహిణీదేవి వారిని తొందరగా రమ్మని పిలచినది. కాని యాటల సందడిలోనున్న వారా పిలుపు నాలకించరైరి. వారెంతకు రానందున రోహిణీదేవి, ప్రేమమయియగు యశోదను వారికొరకు పంపినది. ఆమె పోయి పిలిచినది. ప్రేమచే నామెకు పాలు చేపుకు వచ్చినవి. "నాన్నా, కమలనయనా, శ్యామసుందరా, కృష్ణా, త్వరగా వచ్చి పాలు త్రాగిపోరా, ఆడియాడి యలసిపోతివిరా ఇక చాలు నాయనా, ఆకలితో చిక్కిపోయెదవురా, రాపూ, చిన్నితమ్ముని తీసుకుని తొందరగా రా నాన్నా, యెప్పుడో చలిదియన్నము భుజించి వెళ్ళియుంటిరి· ఇప్పుడు మీరేదైనా తినవలె. నందరాజుగారు మీ కొరకై భోజనము చేయకుండ వేచి

---

* నందుడేల నవ్వెననగా :- అమ్మ కోపముతో నన్ను కట్టివేసినది-నాయన వచ్చి దెబ్బలు వేయునని—యెక్కడ పిల్లవాడు భయపడునో- అని నవ్వినాడు.

తల్లి కట్టివేసినది. తండ్రి కట్లూడదీసినాడు. ఈ లీలచే సిద్ధమైనదేమనగా—ఆత్మ స్వరూపుడగు నతనికి బంధమోక్షము లాపాదించువారు ఇతరులు. భగవానుడు స్వయముగా బద్ధుడూ గాడు- ముక్తుడూ గాడు.

యున్నారు. రండి. వచ్చి మమ్మానందింప చేయండి. ఒరే పిల్లలారా, మీరందరు మీ యిండ్లకు పొండి. నాయనా, కృష్ణా, చూడు నీ వళ్ళంతా యెంత దుమ్ము కొట్టుకొని పోయిందో! స్నానము చేతువుగాని, తొందరగారా. నేడు నీ జన్మనక్షత్రము. పవిత్రుడవై బ్రాహ్మణులకు గోదానము చేయవలె. చూడు. నీ తోటి వారందరు చక్కగా స్నానమొనర్చి యలంకరించుకొని భుజించినారు. నీవు గూడ స్నాన భోజనములు పూర్తిచేసుకొని, చక్కగా ముస్తాబై, అప్పుడు మరల ఆడుకుందువు గాని, రా నాయనా!" అని యీ విధముగా, ప్రేమపరవశమై యశోదాదేవి యెలుగెత్తి పిలువదొడగినది.

యశోదయొక్క మనఃప్రాణములన్నియు ప్రేమపాశబద్ధములై యుండినవి. చరాచర జగత్తునకు శిరోమణియగు భగవానుని తన పుత్రునిగా భావించి, పిలుచుచూ, నొక చేతితో రాముని, మఱియొక చేతితో శ్రీ కృష్ణుని పట్టుకొనివచ్చినది. పుత్రుని యభివృద్ధికై చేయవలసిన మంగళకృత్యములనామె యత్యంత ప్రీతితో చేసినది.

వారు నివసించుచున్న మహద్వనమందు జరుగుచున్న మహోత్పాతములకు కలతజెందిన నందాది గోపవృద్ధులకదరొకచోట సమావేశమై "మనమిప్పుడేమి చేయవలయు" నని యాలోచన చేయసాగినారు. వారిలో ఉపనందుడనునాతడు, వయస్సునందున, జ్ఞానమందున గూడ పెద్దవాడు. ఏ సమయమందు, యే ప్రదేశమున యే విషయమందెట్లు మెలగవలయునో తెలిసిన వ్యవహార జ్ఞానము గలవాడతడు. అంతేగాక, రామునకు శ్యామునకు యెటువంటి యాపదయురాకుండ సుఖముగ నుండవలయుననునదియే యతని యాశయము. అతడిట్లు వచించె.

"సోదరులారా, యిచట గొప్ప గొప్ప యుత్పాతములు జరుగుచుండుట మీరందరును చూచుచునే యున్నారుగదా. అవి పిల్లలకెంత యనిష్టదాయకములో మీకు తెలియును. కావున, మనము మన గోకులమునకు గోకులవాసులకును క్షేమము కలుగవలయునని వాంఛించిన యెడల, మన మూట ముల్లె సర్దుకొని యిచటనుండి తరలిపోవుట యుత్తమము. మన నందరాజకుమారుడు — యీ చిన్నారికృష్ణుడు— మృత్యురూపిణియై వచ్చిన పూతన పట్టునుండి యెట్లు బయటపడెనో చూచితిరిగదా. సుడిగాలి రూపమున వచ్చిన రాక్షసుడు యీ యర్భకునాకాశమున కెత్తుకొనిపోయి, వాడు శిలయందు పడిచచ్చునపుడు, దైవకృపవలన పిల్లవానికెంత గండము గడచినదో మీరెఱుంగుదురుగదా? శకటము పడినప్పుడు గూడ బాలుడు సురక్షితుడై యుండుట, దేవతానుగ్రహమే కదా! జంట మద్దిచెట్లు పడినప్పుడుగూడ వాటి రెంటి మధ్య యందుండిన యితడుగాని, మఱియె యితర బాలుడుగాని మృతి చెందలేదు. దీనివలన గూడ, దయాసముద్రుడగు భగవానుడే మనలనన్ని యాపదల నుండి రక్షించుచుండెనను విషయము మనము గ్రహింపవలసి యున్నది. కావున

యింతకన్న గొప్ప యుపద్రవములు సంభవించి, మనను మన గోకులమును సర్వ నాశనము చేయక మునుపే, మనము మన పిల్లలను పరివారమునంతను వెంటబెట్టు కొని వేఱొక ప్రదేశము జేరి యచట నివసించుట యుక్తము.

"బృందావనమను నొక యడవి యున్నది. దానియందు చిన్నచిన్న నూతన యుపవనములు గూడ నున్నవి. పవిత్ర పర్వతము, పచ్చని మైదానములు, లతలు, ఫలవృక్షములు సమృద్ధిగా నున్నవి కావున పశువులకు చాల అనుకూలముగా నుండును. అంతేగాక మనకందరికి అది నివాసయోగ్యముగా నుండును. మీకందరికి నా యభిప్రాయము సమంజసమని తోచినచో, వెంటనే బయలుదేరుడు. మన వస్తు సామగ్రినంతను బండ్లపైకెత్తించి, మన ముఖ్య సంపదయగు గోధనమును ముందుంచుకొని ప్రయాణమగుడు. ఆలస్యము చేయరాదు.

ఉపనందుని వాక్యములాకర్ణించిన గోవరులందరేకస్వరమున, "బాగున్నది చాలా బాగున్నది" అని యామోదించిరి. ఈ విషయమందు వారందరును యెట్టి మతభేదము లేనివారై యేకాభిప్రాయము వెల్లడించిరి.

గోపాలురందరు తమ సర్వవస్తు సామగ్రులను బండ్లపై నెక్కించినారు. ముసలివారిని, పిల్లలను, స్త్రీలను బండ్లపైనెక్కించి, వయసులోనున్నవారు ధనుష్పాణులై వారివెంట జాగరూకతతో పోవుచుండిరి. అందరికన్న ముందు గోధనము నుంచుకొని, శృంగనాదము లొనర్చుచు సాగుచుండిరి. వారితోపాటు పురోహితులు గూడ వెడలిరి. తూర్యఘోషములు మ్రోగుచుండినవి. గోపికలందరు నూత్న వస్త్రాభరణాలంకృతలై యుండిరి. మహదానందముతో శ్రీకృష్ణలీలలను గాన మొనర్చుచుండిరి. యశోదారోహిణులు సర్వాలంకార శోభితలై శ్యామ, రాములతో సహా నొకశకటముపై నధిరోహించి పోవుచుండిరి. వారిరువురకు తమబిడ్డల ముద్దు పలుకుల వినుటలో తృప్తిదీరుటలేదు.

బృందావనము మహాసుందరవనము. సర్వ ఋతువులయందును అచట సుఖముగనేయుండును. అచటకు చేరిన గోపకులందరు తమ శకటములనన్నిటిని అర్థచంద్రాకారమండలముగా బంధించి, తమ గోధనము విశ్రమించుటకు వీలుగల్పించిరి. బృందావనమందలి శాద్వలప్రదేశము, గోవర్ధన పర్వతము, యమునాసైకత ప్రదేశములు మొదలగు సుందరదృశ్యముల గాంచిన, రామకృష్ణుల మానసము లానంద కందళితములైనవి.

రామకృష్ణులిర్వురును తమ ముద్దులొలుకు చేష్టలతోను, మాటలతోను వ్రజవాసుల చిత్తము లాకర్షించుచు వారి నానందింపజేయుచుండిరి. కొన్ని దినములయనంతరము వారిని ఆవు దూడల మేపుటకై, వత్సపాలకులుగా నియమించిరి. తమ ఈడు

వారగు యితర గోప కుమారులతో గూడి వారు, రకరకములైన తినుబండారములు నిండ్ల నుండి గైకొని, బయలుదేరి, వ్రజభూమి కెక్కువ దూరముగాని ప్రదేశమున నకు దూడలు దోలుకొని పోయి మేపు చుండిరి. వేణునాద మొనర్చుచును, బిల్వామల కాదుల విసురుచును, వడిసెలలు విసురుచును, గోలీలాడుచును, గంతులు వేయు చును, కృత్రిమ గో వృషభములవలె యాటలాడుచును, గోపాలబాలురాడుకొనుచుం డిరి. జంతువులను, పక్షులను అనుకరించుచూ కూయుచుందురు. ఈ రీతిగా సర్వశక్తి మంతుడగు భగవానుడు గూడ సాధారణ మానవ బాలునివలె వారితో నాడుచుండె.

ఒకనాడు రామకృష్ణులిద్దరు తమ ప్రియ స్నేహితులతో గూడిన వారై యమునా తీరమందు దూడలను మేపుచుండిరి. రామకృష్ణుల సంహరించు తలంపుతో నొక్క రక్కసుడు వచ్చి, యొక దూడ రూపమున * మందలో ప్రవేశించె. ఇది గ్రహించిన శ్యామ సుందరుడు, బలరామునకు కనుసైగ చేసి, తానా మాయావత్స సమీపమునకు చేరినాడు. అతడు మాయా రూపుడని తెలియకయే, దాని సుందర రూపమునకు ముగ్ధుడైనట్లు శ్రీకృష్ణుడు నటించినాడు. దాని తోకను రెండు వెనుక కాళ్ళను బట్టి యాకసమున గిరగిర త్రిప్పి యొక వెలగ చెట్టు కేసి కొట్టగా వాడు మృతిచెంది భీకరాకారముతోనే నేలకూలె. చెట్లన్నియు పడిపోయినవి. అది గాంచిన గోప బాలురందరాశ్చర్యముతో శ్రీకృష్ణుని ప్రశంసించిరి. దేవతలు సంతోషించి, శ్రీకృష్ణునిపై పుష్పవృష్టి గురిపించిరి.

సమస్తలోకములకు రక్షకులగు రామకృష్ణులు, నేడు వత్సలను పాలించు చుండిరి. వారు ప్రాతఃకాలమునందే లేచి, కార్యములదీర్చి, చలిదియన్నపుమూటలు దీసుకొని, దూడలదోలుకొని పోవుచుండిరి. ఒకనాడటులనే తమ వారందరితో గూడి దూడల దోలుకొనిపోయి, జలాశయమునందు దూడలను నీరుద్రావించి, తాము దప్పిక దీర్చుకొనిరి. అప్పుడు వారికచట కొంగరూపముతో భీకరముగా నున్న * బకాసురుడగుపడియె. గొల్లపిల్లలందరు భీతిల్లినారు. వాడు వేగముగావచ్చి తన వాడి

---

* వత్సాసురుడు : పూర్వ జన్మమందితడు మురాసురుని కుమారుడగు ప్రమీలుడను వాడు. ఒకనాడతడు వసిష్ఠాశ్రమమందలి నందినీ ధేనువు నపహరించు తలంపుతో, బ్రాహ్మణ రూపమున వసిష్టు నొద్దకు వచ్చి యావునిమ్మని యాచించి నాడు. వసిష్టుడేమియు బదులు పలుక లేదు. కాని నందినీ ధేనువే "మునీశ్వరుని యావు నపహరించుటకై యిట్టి కపట వేషముతో వచ్చిన మురాసురుని కుమారుడా, నీవు దూడవై పొమ్మ"ని పలికినది. వాడా ధేనువును ప్రార్థింపగా, "ద్వాపరాంతము నందు నీకు భగవానుని వలన ముక్తి లభించుగాక" యని యనుగ్రహించినది.

(గర్గ సంహిత)

* బకాసురుడు : ఇతడు పూర్వజన్మమందు హయగ్రీవాసురుని కుమారుడగు ఉత్కలుడు. మహాభయంకరుడై యాతడింద్రునిపైగూడ ఆధిపత్యమును

ముక్కుతో కృష్ణుని పట్టుకొనియె. వాడు మహాబలవంతుడు. కావున శ్రీ కృష్ణుని మింగుచుండె. అది చూచిన రామాది బాలకులందరు హాహాకారము లొనర్చుచు తమ ప్రాణములు పోయినట్లు తల్లడిల్లుచుండిరి. రాజా, శ్రీకృష్ణుడు లోకపితామహుడగు బ్రహ్మకుకూడ తండ్రికదా. లీలామానుష బాలకుడైయున్న శ్యాముని మింగ జూచి నాడు బకుడు. అతనినోరు మండజొచ్చినది. కృష్ణుని క్రిందబడవైచి ముక్కుతో పొడవతలచినాడు. కాని శ్రీకృష్ణుడు వాని రెండుదవడలను రెండుచేతులతో బట్టు కొని, కంససఖుడగు బకాసురుని, గడ్డినిచీల్చినట్లు చీల్చివైచినాడు. దేవతలు మహదా నందభరితులై నందనవనమందలి మల్లికాదికుసుమముల నందనందనునిపై గురియిం చిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఇది గాంచిన గోపబాలుర యాశ్చర్యమునకంతు లేకుండె. కొంగనోటినుండి విడివడి, తమవద్దకు వచ్చిన శ్రీకృష్ణుని గాంచిన బలరా మాది బాలకులకు, ప్రాణసంచారముచే చైతన్యమునొంది యానందించిన యింద్రియ ములవలె నానందించిరి. అందరును వేర్వేరుగా శ్రీకృష్ణ నాలింగనమొనర్చుకొనిరి. అందరును తమతమ దూడలదోలుకొని వ్రజమును ప్రవేశించి, యిండ్లవద్ద తమవారి కానాడు జరిగిన విషయముల నెఱింగించిరి.

బకాసురవధ వృత్తాంతమాకర్ణించి, గోపీగోపకులందరు ఆశ్చర్యమగ్నులైరి. కన్నయ్య సాక్షాత్తు మృత్యుముఖమునుండి తప్పించుకొని వచ్చినటులే వారు భావిం చిరి. అందరు నత్యంత వాత్సల్యపూరిత ప్రేమదృక్కులతో శ్రీకృష్ణుని వీక్షించు చుండిరి. వారి నేత్రదాహము తీరకుండె. మహాశ్చర్యముతో వారిట్లు అనుకొను చుండిరి.

"ఆహా, ఎంత యాశ్చర్యము. ఈ చిన్నారి బాలున కెన్ని గండములు గడచి నవి! కాని యెవరెవరు యితని కపాయము గల్గింపదలచి వచ్చియుండిరో, వారికే యనిష్టములు వాటిల్లినవి! ఏలననగా వారిదివరకే యితరుల హింసించియున్నవారు గావున వారి పాపమే వారి నంతముందించినది. మహా భయంకరులగు రాక్షసులు గూడ ఈ పిల్లవానినేమియు చేయజాలక పోయిరి. అగ్నియందుబడు మిడుతలవలె నాశనమై పోయినారు. బ్రహ్మవేత్త యొక్క పల్కులెన్నటికిని అబద్ధము గావు. నిజమే కదా! మహాత్ముడగు గర్గాచార్యుడు చెప్పిన విషయములన్నియు జరుగుచునే యున్నవి." అని నందుడు మొదలగు గోపాలురందరు, మహానందముతో రామ

---

సంపాదించినాడు ఒకనాడతడు సింధు-సాగర సంగమమందు, జాజలియను మునీశ్వ రుని యాశ్రమ సమీపమున చేపలుబట్టుచుండె. 'వలదని' ముని యాతనినెంత వారిం చినను విననందున, కోపించిన ముని, "ఓరీ, కొంగవలె నీవు చేపలుబట్టుచుంటివి గాన, బకమై (కొంగవై) పొమ్మని శపించె. దీనుడై ప్రార్థించిన యుత్కలుని కరుణించి, జాజలి "వైవస్వతమన్వంతరమున ద్వాపరాంతమునందు శ్రీకృష్ణాను గ్రహముచే నీకు సాయుజ్యముక్తి గలుగగలదని" యనుగ్రహించె.

కృష్ణుల గూర్చి చెప్పుకొనుచుండిరి. అట్లు చెప్పుకొనుటలో వారికి - సంసారమందలి సర్వసంకటములను మఱచిపోవునంతటి తన్మయత్వము గలుగుచుండె.

ఈ ప్రకారము గొల్ల పిల్లలతో గూడి, రామకృష్ణులు, దాగుడుమూతలాట లాడుచుండిరి. ఇంకొకప్పుడు సేతువులు గట్టుచుండిరి. మఱొకప్పుడు కోతికొమ్మచ్చు లాడుచుండిరి. వింతయాటలాడుచుండిరి. ఇట్టి బాల్య క్రీడ లాడుచూ వారు తమ బాల్యావస్థను గడిపిరి.

# పన్నెండవ యధ్యాయము

## అఘాసుర మోక్షము

శ్రీశుకులు మరల నిట్లు పల్కిరి.

"రాజా, ఒకనాడు నందనందనుడు, వనమునందే ప్రాతఃకాల భోజనము చేయదలచినవాడై, శృంగనాదముచే తన వయస్యులందరిని ప్రబోధించినాడు. అందరును దూడలు దోలుకొనుచు బయలుదేరినారు. గొల్లపిల్లలందరును తమ తమ చలిది యన్నపు మూటలను, కొమ్ము బూరలను, వేణువులను, బెత్తములను చేబూని, వేల కొలదియున్న యావు దూడలను తోలుకొనుచు నడవికి బయలుదేరినారు. మార్గ మధ్యమందు గూడ వారు బాల్య క్రీడలొనర్చుచునే పోవుచుండిరి. బయలుదేరినప్పుడే వారి తల్లులు వారిని బాగుగా నలంకరించి యున్నను, ఆ బాలురు వనమందలి రంగు రంగుల పత్రపుష్పములచే తమ్మలంకరించుకొనుచుండిరి. ఒకరి చిక్కములనొకరు దొంగిలించుచుండిరి. నవ్వుకొనుచు మరల యెవరిది వారికిచ్చుచుండిరి. వనశోభను తిలకించుచు శ్యామసుందరుడు ముందరి కేగగా, నేతనిని ముందుగా తాకెద– నేను ముందు–అనుచు వంతులు వేసుకొని మిగిలినవారతని వైపునకు పరువెత్తుచు నతనిని స్పృశించి యానందించుచుండిరి. కొందరు వేణువు నూదుచుండిరి. కొందరు కొమ్ము బూరలూదుచుండిరి. కొందరు తుమ్మెదలవలె ఝుంకారములొనర్చుచుండిరి.కొందరు కోకిలలననుకరించుచు మధురముగ కూయుచుండిరి. కొందరు బాలురాకాశమందు విహరించుచున్న పక్షుల నీడ ననుసరించి పరువెత్తుచుండిరి. కొందరు హంస గమనముననుకరించుచు మందగమనము చేయుచుండిరి. కొందరు కొంగలవలె కొంగ జపము నటించుచుండిరి. మరికొందరు మయూరములవలె నాట్య మొనర్చుచుండిరి. కొందరు కోతుల తోకల బట్టి లాగుచుండిరి. కొందరు వానివలె చెట్లపై నొకకొమ్మ నుండి మఱి యొక దాని పైకి దూకుచుండిరి. కోతులవలె వెక్కిరించుకొనుచుండిరి. నదిలోని నీళ్ళయందు కప్పలవలె గంతులు వేయుచు నాడుకొనిరి. నీళ్ళయందు తమ ప్రతిబింబముల గాంచుచు వెక్కిరించుచుండిరి,

శ్రీకృష్ణుడు, జ్ఞానులగు మహాత్ములకు మూర్తీభవించిన బ్రహ్మానందాను భవము. దాస్యభావముతో సేవించు భక్తులకతడారాధ్య దైవము. పరమైశ్వర్య శాలి యగు పరమేశ్వరుడు. మాయామోహితులు, విషయాంధులునగు సామాన్య మానవుల కతడు సాధారణమనుష్య బాలకుడు. అట్టి మహానుభావునితో, మహాపుణ్యాత్ములగు గోపాలబాలురు రకరకములగు నాటలనాడుకొనుచుండిరి. అనేక జన్మలందు, వివిధ శ్రమలకోర్చి తమ యింద్రియములను అంతఃకరణమును నిగ్రహించుకొని, తపస్సాచరించిన యోగులకు గూడ శ్రీకృష్ణుని పాదకమల రజము దుర్లభము. అట్టి భగవానుడు, స్వయముగా, గొల్లపిల్లల కనుసన్నలయందు మెలగుచు, వారాడించినట్లల్లా ఆడుచున్నాడు. వారి సౌభాగ్యమహిమ యింతకంటె యేమని వర్ణింపతరమగును రాజా, యీ సమయమందే * అఘాసురుడను రాక్షసుడచటికేతెంచినాడు. వాడీ గొల్లపిల్లల యాటలను చూడజాలకపోయినాడు. వాని హృదయము భగ్గుమన్నది. వాడెంత భయంకరుడనగా, అమృతపానము చేసిన దేవతలుగూడ వాని బారినుండి తమను రక్షించుకొనుట యెట్లాయని యెల్లప్పుడు చింతించుచు, యేదేని యొక యుపాయముచే యతనికి చావువచ్చిన బాగుండునని యాలోచించుచుందురు. యీయఘాసురుడు, పూతన, బకాసురుల యనుంగుతమ్ముడు. "ఈ గొల్లపిల్లలే నా సోదరీసోదరుల మృత్యువుకు కారణమైనారు గాన, నేడు వీరందరిని నేను పరిమార్చెదను. అట్లు చేసిన నా సోదరీసోదరులకు తిలతర్పణమగుటయేగాక, వ్రజవాసులందరును మృత తుల్యులగుదురు. జీవులకు తమ సంతానమే ప్రాణము. అట్టి ప్రాణము లేనిచో శరీర మెట్లు నిలబడును? వీరు చచ్చినచో వ్రజవాసులందరు మరణించెదరు."

అని యీ విధముగ నిశ్చయించి యా దుష్టుడు కొండచిలువ రూపము దాల్చి గోపబాలుర మార్గమునందు విశ్రమించె. వాని యజగర శరీరమొక యోజనము పొడవుండి, యొక పర్వతమువలె నుండినది. గోపబాలురనందరి నొకేమారు మ్రింగ దలచినాడుగాన, తన నోటినొక పర్వత గుహయంత సమానముగ తెఱచి యుంచి నాడు. ఆ నోటియొక్క క్రింది దవడ భూమిపై నానియుండ వానిపై దౌడ మేఘ మండలమును దాకుచుండె. నోటియందలి కోరలు పర్వత శిఖరములవలె నుండి

---

*అఘాసురుడు : ఇతడు పూర్వము శంఖాసురుని కుమారుడు. అత్యంత సుందరుడు. మహాబలవంతుడు. మలయపర్వతము నందొకనాడు అష్టావక్రమహా మునినిగాంచి, సౌందర్యగర్వముచేత పరిహసింపగా కోపించినముని "సర్పము గమ్మ"ని శపించె. పశ్చాత్తాపముతో పాదములపైబడిన యసురునిగాంచి జాలినొందిన ముని, "కోటిమన్మథాకారుడగు శ్రీకృష్ణుడెప్పుడు నీ యుదరమును ప్రవేశించునో, అప్పుడు నీకు శాపమోక్షము కలుగగలద"ని యనుగ్రహించినాడు.

(గర్గ సంహిత)

నవి. నోటియందు గాఢాంధకారము వ్యాపించి యున్నది. వాని నాలుక యెఱ్ఱని మార్గమువలె గానుపించుచుండె. కన్నులు దావాగ్నివలె నుండగా, ఉచ్ఛ్వాస నిశ్వాసములు వేడి తుపాను గాలులవలె దోచుచుండె.

గోపబాలురు దానిని గాంచి యది బృందావనమందలి యొక వింత శోభయని భావించిరి. ఆటలాడుకొనుచు వారిది యొక యజగరము యొక్క ముఖ ద్వారమై యుండనోపునని యుత్ప్రేక్షించిరి. అందులో నొకడు "మిత్రులారా, మన నందరిని మ్రింగుటకై నోరు దెరచి యున్న కొండచిలువలాగా తోచుటలేదా?" యని పలికె. మరియొకడు, "సూర్యకిరణములు పడుటచే నెఱ్ఱనైన మేఘములు దీనిపై పెదవిగను, యీ యెఱ్ఱగా నున్నది క్రింది పెదవిగను కనుపడుచున్న" దనియె మూడవ వాడు, "అవును, నిజమే, యీ దవడల రెండువైపుల గిరి శృంగములవలె నున్నవి యీ యజగరము యొక్క కోరలవలె నుండలేదా?" యనియె. నాల్గవవాడు, "యీ పొడవుగా-వెడల్పుగా నున్న ఈ యెఱ్ఱని మార్గము దాని నాలుకవలె దోచుచున్నది. ఈ గిరిశృంగముల మధ్యనున్న యంధకారము, దాని(గుహ) లోపలి భాగమందున్న చీకటిని గూడ పరాజిత మొనర్చుచున్నది. అని పలికె." ఇంకొక బాలుడు, "చూడండి. ఈ యడవియందెచటనో అగ్ని వ్యాపించినట్లున్నది. దాని నుండే ఈ తీక్షణమగు వేడిగాలులు వచ్చుచున్నట్లున్నవి. ఇది యజగరము యొక్క వేడి నిట్టూర్పులై యుండనోపు. దావాగ్నియందు దగ్ధమైన జంతువుల యొక్క దుర్గంధమువలెనే, ఈ యజగర యుదరమునందు మరణించిన జీవుల మాంసము యొక్క దుర్గంధము వచ్చుచున్నది." అని పలికె. వేఱొకడు "మనము ఈ గుహయందు ప్రవేశించిన యెడల ఈ యజగరము మనను మ్రింగివేయునా? దానికెంత ధైర్యమెక్కడిది? అట్లొనర్చినచో మన కన్నయ్య దానినొక్క క్షణములో బకాసురునివలెనే చంపి వేయడా?" అని ఈ ప్రకారము తమలో తాము మాట్లాడుకొనుచు, శ్రీకృష్ణుని సుందరముఖము చూచుచు, నవ్వుకొనుచు, అఘాసురుని ముఖమునందు ప్రవేశించి నారు, గోపబాలురు.

భగవానుడా గోపబాలురమాయకముగా ననుకొనుచున్న మాటలన్నియు నాలించినాడు. "అరే, వీళ్ళకు నిజమైన సర్పము గూడ అబద్ధముగా కనుపించు చున్నదే! (సర్పరజ్జుభ్రాంతి)." అని తలచినాడు. శ్రీకృష్ణునకతడు రాక్షసుడని తెలిసినది. అతడు సర్వప్రాణుల హృదయమందు వసించు పరమాత్మ గదా! అతనికి తెలియనిదేముండును? తన వారందరిని రక్షించవలయునని యాతడు తలచి నాడు. అతడిట్లాలోచించుచుండగనే, గోపబాలురంచరు దూడలతో సహా రాక్షసుని వదన గహ్వరమందు ప్రవేశించిరి. కాని యాతడు వారిని మ్రింగలేదు. తన సోదరుల జంపిన శ్రీకృష్ణుని రాకకై వేచియున్నాడు. తన వారందరు రాక్షసుని జఠరాగ్ని కాహుతి గాబోవుచున్న విషయము గ్రహించి, వారికందరికి నేకమాత్ర

రక్షకుడు తానే గనుక, విచిత్రమగు విధిలీలకు విస్మితుడగుచు, భగవానుడు,వారిపై దయ తలచినాడు. వారిని రక్షించుటకును, అదే సమయమున రక్కసునుక్కడం చుటకును, శ్రీకృష్ణుడుపాయమాలోచించుచుండె. ఈ రెండు పనులొకేసారి సిద్ధించు టెట్లా? యని యతని యాలోచన. భూతభవిష్యద్వర్తమాన విషయములన్నియు భగ వానునకు ప్రత్యక్షములేగదా! అట్టివానికి ఉపాయము తెలియకుండునా? కర్తవ్య నిశ్చయమొనర్చుకొని, తాను గూడ అఘాసురుని నోటియందు ప్రవేశించినాడు. ఆ సమయమందు మేఘముల చాటునుండి ఈ దృశ్యమునుగాంచి దేవతల హాహాకారము లొనర్చిరి. కంసాది రాక్షసులు హర్షించిరి.

అఘాసురుడు తన దంతములతో, గోపబాలురందరితో గూడ శ్రీకృష్ణుని నమిలి మింగదలచుచుండె. దేవతల హాహాకారములాలించిన యవ్యయుడగు శ్యామ సుందరుడు, రాక్షసుని వదనమందున్న తన శరీరమును విపరీతముగ పెంచినాడు. రాక్షసునికి శ్వాసనిరోధమైనది. గ్రుడ్లు వెళ్ళుకొచ్చినవి. వ్యాకులుడై యాతడు కొట్టు కొనజొచ్చె. ఊపిరి యాడనందున యాతని ప్రాణవాయువులు బ్రహ్మ రంధ్రమును భేదించుకొని నిర్గమించినవి. అతని సర్వేంద్రియములును ప్రాణముతోడనే బహి ర్గతములైనవి. భగవానుడు తన యమృత దృష్టిని ప్రసరింప జేసి, మృతప్రాయులై యున్న తనవారందరిని చైతన్యవంతుల గావించె. వారందరిని తీసుకొని అఘాసురుని శరీరము నుండి గోవిందుడు వెలుపలికేతెంచినాడు.

అఘాసురుని స్థూల శరీరమునుండి యొక యద్భుత జ్యోతి వెడలి దశదిశల ప్రకాశింపజేయుచు, భగవానుడా శరీరమునుండి వెడలువరకు ఆకసమందువేచియుండి, యతడు వెలుపలికి వచ్చిన వెంటనే యతని శరీరమందు లీనమైనది. దేవతలు పూల వాన గురిపించిరి. అప్సరసలు నాట్యమొనర్చిరి. గంధర్వులు గానమొనర్చిరి. విద్యా ధరులు వాద్యములొనర్చిరి. బ్రాహ్మణులు స్తుతియొనర్చిరి. పార్షదులు జయజయ ధ్వానములగావించిరి. అఘాసురునంతమొందించి యందరకు గొప్పమేలు గావించిన భగవానుని సర్వులు సభినందించిరి. ఆయానంద కోలాహలము బ్రహ్మలోకము వరకు వ్యాపించినది. వెంటనే బ్రహ్మ హంస వాహనారూఢుడై బృందావనమునకేతెంచి శ్రీకృష్ణుని మహిమను గాంచి యాశ్చర్య చకితుడాయె.

బృందావనమందలి యా యజగర దేహము చర్మ మంతయు నెండిపోగా, వ్రజ బాలకులకు ఆడుకొనుటకు చాలకాలమది యొక గుహగా నుండి పోయినది. ఈ యఘాసుర సంహారము – గొల్ల పిల్లల రక్షించుట యను శ్రీకృష్ణుని బాలలీల యతని కుమార ప్రాయమందు అనగా నైదు వత్సరముల వయస్సు నందు జరిగి నది. ఆ గొల్ల పిల్లలు గూడ ఆ లీలనప్పుడే జూచి యుండిరి. కాని వారందరు ఆ

లీలను తమ పౌగండ వయసు (ఆరు సంవత్సరములు)నందు జరిగినట్లు యిండ్ల వద్ద చెప్పుకొనిరి.

అఘాసురుడు మూర్తీభవించిన యఘము (పాపము) భగవంతుని యంగ స్పర్శచే నతని పాపములన్నియు క్షాళితములైనవి. అందుచే పాపాత్ములకు దుర్లభ మగు ముక్తి యాతనికి లభించినది. కాన యిందాశ్చర్య పడవలసినదేదియు లేదు. మనుష్య బాలుని రూపమున దివ్య లీలల ప్రదర్శించుచున్నది పరపురుషుడగు పర మాత్మయే గదా! కార్యకారణ రూపమగు వ్యక్తావ్యక్త సమస్త జగత్తునకు విధాత యతడే గదా! అట్టి శ్రీకృష్ణ భగవానుని యొక్క భావ నిర్మితమగు ప్రతిమను ధ్యానించుట ద్వారా ఒక్కమాత్రెనను హృదయమందు ప్రతిష్ఠించు కొన్నచో, ఆ భగవానుడు సాలోక్య సామీప్యాది ముక్తుల ప్రసాదించును. భగవానుడు ఆత్మా నందము యొక్క నిత్య సాక్షాత్కార స్వరూపుడు. మాయ యతని దరిచేరజాలదు. అట్టి మహాత్ముడే స్వయముగా నఘాసురుని శరీరమందు ప్రవేశించినాడు. అతనికి సద్గతి కలిగెనను విషయమందింకను సందియముండునా?

"శౌనకాది మహర్షులారా, యదువంశ శిరోమణియగు శ్రీకృష్ణ భగవానుడే పరీక్షిన్మహారాజునకు జీవనదాన మొనర్చి యుండె. తన జీవన సర్వస్వము, రక్షకుడు నైన యా మహాత్ముని చరిత్ర వినగనే రాజు మరల శ్రీశుకునిట్లు ప్రశ్నించె. కారణ మేమన, అమృతమయములగు దివ్య లీలలు అతని మనస్సును వశ పరచు కొన్నవి.

"మహాత్మా గొల్లపిల్లలు తమయైదవ సంవత్సర విషయమును ఆరవ సంవ త్సర మందు జరిగినట్లుగా తమవారికి చెప్పిరని మీరు వచించితిరి. ఒక సమయ మందు జరిగిన విషయము, మరియొక నమయమందు జరిగినట్లుగా చెప్పుట యెట్లు సంభవించినది? ఆశ్చర్యకరమగు యీవిషయమును తెలుసుకొన కుతూహలము కలుగు చున్నది గావున దయయుంచి, మీరు నాకు వివరింప వేడుచుంటి. ఇందులో భగ వానుని యఘటన ఘటనా పటీయసి యగు మాయా సంబంధమేదో యున్నటుల తోచుచున్నది, లేనిచో నట్లు జరుగుట యసంభవము. నేను క్షత్రియ ధర్మమందు న్నను, బ్రాహ్మణ సేవావిముఖుడనైన కారణముచే అపరాధిని, కావున నామమాత్ర క్షత్రియుడను. అయినప్పటికిని, మీ ముఖారవిందము నుండి స్రవించుచున్న శ్రీకృష్ణ కథామృతము పానము చేయు నదృష్టము నాకు లభించినది."

అని పలికిన పరీక్షిత్తుతో శ్రీశుకుడు మరల చెప్పబోవుచు ముందుగా శ్రీకృ ష్ణుని దివ్యలీలలను మనసా స్మరించుకొనియె. అతని సమస్త యింద్రియములు, అంతఃకరణముగూడ వివశములైనవి. భగవానుడు దివ్యలీలానుభూతి యందు కొంత కాలముండి, యతి కష్టముమీద బాహ్య జ్ఞానము పొందినవాడై, రాజుతో, భగవల్లీలా వర్ణనము చేయదొడగె.

# పదమూడవ యధ్యాయము

## బ్రహ్మ గర్వభంగము- బ్రహ్మ యాలోచన

“పరీక్షిన్మహారాజా, నీవు భాగవతోత్తముడవు. భగవానుని ప్రేమ భక్తులలో నీ స్థానమగ్రగణ్యము. కావుననే నిట్టి సుందరమగు ప్రశ్న యొనర్చితివి. నీవట్లు ప్రశ్నించుటచే భగవలీలా కథలు నిత్యనూతనములు గావింపబడుచున్నవి. విటులకు స్త్రీ సంబంధ విషయములు నిత్యనూతనములుగా దోచునట్లే, రసికులగు సత్పురుషుల మానసములు భగవల్లీలా కథా శ్రవణముచే, నిత్యనూతనానుభవము పొందుచుండును. రాజా, నీవు సావధానుడవై శ్రవణమొనర్పుము. భగవానుని లీలలు **అత్యంత** రహస్యములయినను వానిని నీకు వినిపించెదను. ఏలననగా కృపాసింధువు అగు గురూత్తములు తమ ప్రియశిష్యులకు అతి రహస్యములగు విషయములను గూడ బోధించెదరు.

“మృత్యురూపమగు అఘాసురుని ముఖము నుండి గోపబాలురనందరిని రక్షించెనని చెప్పి యుంటినిగదా! అటు పిమ్మట వారినందరిని యమునానదీ సైకత స్థలమునకు గొనిపోయి భగవానుడు వారితో నిట్లు పల్కె:“స్నేహితులారా!యమునా నది యందలి యీ యిసుక తిన్నెలత్యంత రమణీయములుగానున్నవి. చూడండి, యీ యిసుక యెంత కోమలముగను స్వచ్ఛముగ నున్నదో! మనమందరము హాయిగా నాడుకొనుటకు యిచట సర్వము ననుకూలముగ నున్నది. ఒకవైపు రంగు రంగుల కమలములు వికసించి యున్నవి. వాని సుగంధమున కాకర్షితములయిన మధుకరములు ఝుంకారములు చేయుచున్నవి. ఇంకొకప్రక్క సుందరములగు పక్షులు మధురముగ కూయుచున్నవి.వాని ప్రతిధ్వనులచే సుశోభితములగు వృక్షములీ ప్రాంతమును మఱింత శోభాయమాన మొనర్చుచున్నవి. ఇక మనమిక్కడ చలిది యన్నముల భుజింతము. చాల ప్రొద్దెక్కినది. ఆకలి కరకర లాడుచున్నది. దూడలు నీరు త్రాగి ఈ సమీపమందలి పచ్చికను మేయుచు, తిరుగుచుండుగాక.”

అని శ్రీకృష్ణుడు పలుకగా, సహచరులందరతని సూచన నామోదించిరి. దూడలను నీళ్ళు త్రాగించి పచ్చిక మైదానమందు వదలి, తమ తమ చలిది మూటల విప్పి గోపబాలురు భోజనముకుపక్రమించిరి. అందరి మధ్యమందు శ్రీకృష్ణుడు పవిష్టుడాయె. అతనిచుట్టూ మండలాకారముగ పంక్తులు దీర్చి గోపబాలురు కూర్చుండిరి. అందరి మొగములు శ్రీకృష్ణుని జూచుచును, అందరి కన్నులానందజ్యోత్స్నల్లి ములుగను నుండి పోయినవి.

శ్లో॥ కృష్ణస్యవిష్వక్ పురురాజిమండలై -రభ్యాననాః పుల్లదృశోవ్రజార్భకాః
సహోపవిష్టా విపినేవిరేజుః ఛదాయథాంభోరుహ కర్ణికాయాః

ఆ వనభోజనమునకు గూర్చున్న గొల్లపిల్లలు కమలమునందలి రేకులవలె, మండలాకారముగను, కర్ణికగానున్న శ్రీకృష్ణుని చుట్టియున్నట్లులగుపించిరి. కొందరు పుష్పములను, కొందరు పల్లవములను, కొందరు ఆకులను, కొందరు రాళ్ళను కంచములుగా నేర్పరచుకొని భుజింపసాగిరి. ఒకరి చిక్కములలోనివి మరియొకరు దీసుకొనుచు, హాస్యోక్తులాడుచు, కృష్ణసహితులైన వారందరు చల్దులారగింప సాగినారు.

శ్లో॥ బిభ్రద్వేణుం జఠరపటయోః శృంగవేత్రేచకక్షే
వామేపాణౌ మసృణకబళం తత్ఫలాన్యంగుళీషు
తిష్ఠన్మధ్యేస్వపరిసుహృదో హాసయన్ నర్మభిఃస్వైః
స్వర్గేలోకేమిషతిబుభుజే యజ్ఞభుగ్బాలకేళిః

అ సమయమందు శ్రీకృష్ణుని యందము అందరికంటె విలక్షణముగనున్నది. వేణువును మొలయందుదోపి, శృంగమును బెత్తమును చంకయందిరికించుకొని యుండె. ఎడమ చేతియందు మధురఘృతమిశ్రితమగు దధ్యన్న కబళముంచు కొనియె. వ్రేళ్ళ సందులయందు నంజుకొనుటకై యూరగాయ ముక్కలను బెట్టు కొని, తనచుట్టూ కూర్చొనియున్న స్నేహితులను తన సహజ హాస్యోక్తులచే నవ్వించుచు ఆనందింపజేయుచుండె. సమస్త యజ్ఞములందలి హవిర్భాగములకు యేకైక భోక్తయగు మహాత్ముడు, గొల్లపిల్లలతో గూడి ఈ విధముగ భుజించుచు బాలలీలను ప్రదర్శించుచుండుటను, స్వర్గమందలి దేవతలందరు ఆశ్చర్యముగ జూచుచు చకితులై పోవుచుండిరి.

రాజా, ఈ విధముగ భోజనము చేయుచున్న గొల్లపిల్లలు, భగవానుని రసమయమగు లీలయందు తన్మయులై యుండిరి. ఆ సమయమున, గడ్డిమేయుచున్న గోవత్సములు తృణాశచే చాల దూరమేగినవి. అప్పుడు గోపబాలురు చూచినారు. దూడల జాడ తెలియకుండె. దానితో వారందరు భయభీతులైనారు. తన భక్తుల భయమును పోగొట్టి యభయ మొసంగు భగవానుడయిన శ్రీకృష్ణుడు వారితో నిట్లు పల్కె. "నా ప్రియమిత్రులారా, మీరు భోజనము చేయుచుండుడు. నేను దూడల వెదకి తెచ్చెదను." అని పల్కి, భగవానుడు చేతియందు పెరుగన్నపు కబళము నుంచుకొనియే, ఆ ప్రాంతమంతయు వెదకినాడు. కొండలు, కోనలు, వృక్షములు పొదరిండ్లు మొదలగు స్థానములందటను వెదుకసాగినాడు.

అఘాసుర సంహారముచే నాశ్చర్యచకితుడైన బ్రహ్మ, యంతకు ముందే వచ్చి యాకాశమందుండె కదా! మాయామానుష బాలకుడై మసలుచున్న మధుసూదనుని మనోహర మహిమాన్విత లీలను గాంచవలయునను తలంపాతానికి కలిగినది.

అందుచే నాతడు మొదట దూడల నదృశ్యమొనర్చె. పిమ్మట శ్యాముడు వానిని వెదకుటకై వెళ్ళగా గోపబాలురను గూడ నదృశ్యమొనర్చినాడు. అందరిని వేరొక చోట దాచినాడు. జలమగుకమలము నందావిర్భవించినవాడు గదా, బ్రహ్మ!

ఎంత వెదకినను దూడలను గాంచజాలక శ్రీకృష్ణుడు తిరిగి యమునాతీరమునకు రాగా నచట తన స్నేహితులు కనబడక పోయిరి. అప్పుడాతడిది యంతయు బ్రహ్మ చేసిన పనియేనని గ్రహించినాడు. ఆతడు సర్వజ్ఞుడు గదా. దూడల తల్లులకు, గొల్లపిల్లల తల్లులకు, బ్రహ్మకు గూడ నమందానందము కల్గింపదలచినవాడై భగవానుడు తానే, దూడల రూపములను, గొల్లపిల్లల రూపములను దాల్చినాడు. సంపూర్ణ విశ్వమునకు అతడే కర్తయు సర్వశక్తి మంతుడగు ఈశ్వరుడు గదా * ఆ దూడలెన్ని యున్నవో గొల్లపిల్లలెందరుండిరో వారే యే వస్త్రముల ధరించి యుండిరో, యేయే వస్తువులు కల్గియుండిరో యేయే శీలస్వభావములు కల్గియుండిరో, నామ రూపవయోగుణము లన్నింటి యందును కొంచెమైనను భేదము లేకుండునట్లు అన్ని రూపులు తానేయైనాడు భగవానుడు. వారి చేష్టలయందు గూడ భేదమెంత మాత్రము లేకుండె.

సర్వస్వరూపుడగు భగవానుడా విధముగ తన మహిమను ప్రకటించగా, 'సర్వం విష్ణు మయం జగత్' (జగత్తంతయు విష్ణుమయమే) అను వేదవాక్యము మూర్తీభవించినట్లు దోచినది. తన యాత్మ స్వరూపములగు దూడలతోను, తన యాత్మ స్వరూపులగు పిల్లలతోను చుట్టబడినవాడై శ్రీకృష్ణుడు, తనలో తానే మాటలాడుకొనుచు, వ్రజమును ప్రవేశించినాడు ఎవరి గోష్ఠమునకు వెళ్ళవలసిన దూడలనాయా గోప బాలకులు ఆ ప్రదేశములకు జేర్చిరి.

గోపబాలకుల తల్లులు తమ పిల్లల వేణునాదమూలకించుటయే తడవుగ పరుగెత్తుచూ వారి కెదురేగినారు. పిల్లవాని రూపమున నున్న పరమాత్ముడగు శ్రీకృష్ణుని తమ పిల్లడే యను భావముతో నెత్తుకొని హృదయమునకు హత్తుకొనిరి. వాత్సల్య ప్రేమాతిశయముచే, సుధ కంటెను మధురములగు తమ స్తన్యములను వారికి త్రాగించిరి. ఈ విధముగ ప్రతి దినము సాయం సమయమందు, గొల్లపిల్లల రూపమున వనము నుండి తిరిగి వచ్చుచు, బాల సులభములగు లీలలచే తల్లుల నానందపరచుచుండె. ఆ తల్లులును మిక్కిలి ప్రేమతో పిల్లలను బాగుగ నలంకరించుచుండిరి.

---

* భగవానుడు సర్వసమర్థుడు. బ్రహ్మ యపహరించిన దూడలను, పిల్లలను తిరిగి తెచ్చుట కాతనికి సామర్థ్యము గలదు. కాని దానిచే బ్రహ్మయొక్క యజ్ఞానము తొలగిపోదు. అతనికి భగవానుని దివ్యమాయా ప్రభావము గోచరించదు. తాను విశ్వకర్తనన్న యభిమానమతనకి నశింపవలసి యున్నందున, భగవానుడే యన్ని రూపములు ధరించినాడు.

అదే విధమున, గోవులు గూడ సాయం సమయమందు వనము నుండి తిరిగి వచ్చు తమ దూడల "యంభా"రవమును విని వానివద్దకు పరుగెత్తుచుండెడివి. తమ నాలుకలచే మాటిమాటికి దూడల శరీరములు నాకుచు పాలునిచ్చుచుండెడివి. ప్రేమాధిక్యత చేత పొదుగు నుండి పాలధార ప్రవహించుచుండెడిది. గోవులకు గోపికలకు గూడ తమ పిల్లల యందు గల మాతృభావమిదివరకున్నటులే యున్నను ప్రేమ మాత్రమధికమైనది. తమ నిజపుత్రులకంటె, పరమాత్మ రూపులైయున్న యాబిడ్డల యందు ప్రేమాధిక్యము కల్గినది. ఆ ప్రేమ దినదినాభివృద్ధి గాంచుచుండె.పూర్వము శ్రీకృష్ణుని యందెట్టి ప్రేమాతిశయముండెడిదో, అట్టి ప్రేమాతిశయము నేడు తమ బిడ్డలయెడ గల్గుచుండె. ఈ విధముగ సర్వాత్ముడగు శ్రీకృష్ణుడు సర్వరూపములను దాల్చి, వనమునందు, గోష్ఠమునందు నొక సంవత్సరకాలము క్రీడించినాడు.

సంవత్సరము పూర్తియగుట కింకొక యైదారు దినములు శేషించియుండగా, నొకనాడు బలరామ సహితముగ శ్రీకృష్ణుడు దూడల దోలుకొనుచు నడవికిపోయినాడు. ఆ సమయమందు గోవులు దూరముగా గోవర్ధన పర్వతముపై మేయుచుండినవి.ఆ గోవులకు యీ దూడలగుపడుటచే వాటి కవ్యాజమగు వాత్సల్య ప్రేమ పెల్లుబికినది. ఆ యావులు పరవశములై గోపాలకులు వారించినను నిలువక,హుంకారము లొనర్చుచు దూడలవద్దకు పరువెత్తివచ్చినవి. వాని పొదుగుల నుండి పాలు కారజొచ్చినవి.తోకలను, శిరములను పైకెత్తి మహావేగముతో, తమకు రెండే కాళ్ళున్నట్లు పరువెత్తినవి. ఈ దూడల తరువాత దూడలు కలిగియున్న యావులు యీ తమ మొదటి సంతానములకు ప్రేమవశమున పాలనీయ దొడగినవి. ఆ దూడలను తమ పొట్టలోనే యుంచుకొన్నట్లు వానిని పొదివి వాని శరీరము నత్యంత ప్రేమతో నాకమొదలిడినవి. గోపాలురు వానినాపుటకు చేసిన ప్రయత్నము విఫలమగుటకు సిగ్గుపడినవారై, గోవులపై కోపగించి, యతికష్టముతో వానిని వెంబడించి క్రిందికి వచ్చిరి. అక్కడ దూడలతోపాటున్న తమ బిడ్డలను గాంచుట తోడనే వారి హృదయములు ప్రేమ తరంగితములై పోయినవి. పిల్లలపై కలిగిన యనురాగమను వరదలో వారి కోపము కొట్టుకొని పోయినది. ఆ పిల్లల నెత్తుకొని హృదయములకు హత్తుకొనిరి. వారి మూర్ధముల నాఘ్రాణించి పరమానంద భరితులైరి. ముసలి గోపాలురు పిల్లలను ఆలింగన మొనర్చుటచే మహదానందము లభించినది. అతి కష్టముమీద వారిని వదలి వారావలకు వెళ్ళగల్గిరి. వెళ్ళిన పిమ్మట గూడ వారికాయాలింగన స్మరణచే కనుల వెంబడి ప్రేమాశ్రువులు ప్రవహింప జొచ్చినవి.

వ్రజవాసులగు గోపీగోపకులకును గోవులకును తమ యెడ పిల్లలపై గూడ యిట్టి ప్రేమాధిక్యత గల్గుటను గాంచిన బలరాముడు ఆలోచనామగ్న మానసుడై

నాడు. అతనికింతవరకు కారణము తెలియకున్నందున, "యీ చిత్రమునకు కారణ మేమి? యీ మాయ యెట్టిది ? యెక్కడనుంచి వచ్చినది! మనుష్యుని మాయయా లేక యసురుల మాయయా? ఇది సంభవమా? కాదు. ఇది తప్పక నా ప్రభువు యొక్క మాయయే.సందేహములేదు. ఇతర మాయలకు నన్నుగూడ మోహింప జేయునట్టి యింతశక్తి యెక్కడ నుండును?" అని యాలోచించి, బలరాముడు తన జ్ఞాన దృష్టితో పరికించగా, దూడల రూపముగాను గోపబాలుర రూపముతోను శ్రీకృష్ణుడొక్కడే యుండెనను విషయము గోచరించినది. అప్పుడు శ్రీకృష్ణునితో నతడు,స్వామీ, యీ దూడలు గోపబాలురు దేవతలుగారు, మహర్షులునుగారు. ఈ భిన్న రూపములు దాల్చినను వీని యన్నిటి యందును నీవొక్కడవే ప్రకాశించు చున్నావు. నాయందు దయ యుంచి యీ వివిధ రూపములయందు వేర్వేరుగా నేల ప్రకాశించుచుంటివో వివరింప వేడెద." అని బలరాముడు వేడగా, శ్రీకృష్ణుడాతనికి బ్రహ్మ గావించిన ఘనకార్యమును వివరించె.

ఇంతలో బ్రహ్మ తన లోకమునుండి వ్రజభూమికేతెంచె బ్రహ్మలోకమందలి కాలమాన ప్రకారము త్రుటి (అనగా పదునుగల సూది కమలపత్రమును గ్రుచ్చు టకు పట్టు సమయము) కాలము గతించినది. చూడగా భూలోకమందొక సంవత్సర కాలము భగవానుడగు కృష్ణుడు యథాప్రకారము, గొల్లపిల్లలతో, దూడలతో, విహరించుచునే యున్నాడు. అంతయు, తాను వారినదృశ్యము చేయక పూర్వమున్న రీతిగనే జరుగుచున్నది.

బ్రహ్మ యాలోచనలో పడినాడు. "గోకులమందున్న గోపబాలురను, దూడ లను నామాయాశయ్యపై నే నిదురించుచున్నారు. నేను వారి నచేతనులుగా నొనర్చి యుంచితిని. వారిప్పటికిని సచేతనులు గాలేదు. వారికంటె భిన్నముగ యీ బాలురు దూడలు యెచటనుండి వచ్చినారు? ఒక సంవత్సరకాలమునుండియు శ్రీకృష్ణునితో తిరుగుచున్న వీరందరెవ్వరు?" అని యాలోచించి చూడగా, తన మాయలోనున్న వారచటనే యున్నారు. గోకులమందును వారు గాన్పించుచున్నారు. తనజ్ఞానదృష్టిచే యీ రహస్యమును తెలుసుకొనదలచినాడు బ్రహ్మ. కాని యెంత యాలోచించినను, యిందులో నిజరూపము లెవ్వియో, పిమ్మట కల్పితములైన యసత్య రూపము లేవియో యాతని కంతుబట్టలేదు. భగవానుని మాయయందు సర్వులు మోహితు లయ్యెదరు. కాని యా మాయ భగవానుని స్పృశింపజాలదు· పితామహుడు తన మాయచే శ్రీకృష్ణుని మోహింపజేయుటకు ప్రయత్నించి, యతనిని మోహింపజాలక పోగా, తన మాయయందు తానే పడిపోయినాడు. రాత్రియొక్క ఘోరాంధకారము నందు నీహారాంధకారము విలీనమగునట్లును, సూర్య ప్రకాశములో ఖద్యోత (మిణుగురు పురుగు) కాంతి మఱుగున బడినట్లును, తక్కువ ప్రభావము గలవారు మహా

పురుషులపై తన మాయను ప్రయోగించినచో, ఆ మాయ వారనేమియు చేయజాలక పోగా, నతడు తన ప్రభావమునే గోల్పోవును.

బ్రహ్మ విచారణ చేయుచుండగనే ఆ గోపబాలురు, దూడలు అన్నియు సత నికి శ్రీకృష్ణరూపముగనే గోచరించినది. అందరును నీలమేఘశ్యాములు పీతాంబర ధారులు, శంఖచక్ర గదా పద్మములు ధరించిన చతుర్భుజులై యుండిరి. అందరి శిరస్సులపై నను కిరీటము లున్నవి. చెవులకు కుండలములు, కంఠములందు మణి హారములతోపాటు వనమాలలు శోభాయమానములుగ నున్నవి. వక్షమందు శ్రీవత్సలాంఛనము, భుజములయందంగదములు, పాదములయందు నూపురములు, వ్రేళ్ళకు ఉంగరములు మొదలగు సర్వాలంకారములు సర్వులందు గన్పట్టినవి. భక్తులర్పించిన తులసీ నవపల్లవ మాలలు ఆపాదాంతము వ్రేలాడుచున్నవి. వారి చిరునవ్వు వెన్నెలవలె యుజ్జ్వలముగ ప్రకాశించుచున్నది. అందరి కృపాపాంగ వీక్షణము లత్యంత మధురములుగనున్నవి. సత్త్వ, రజోగుణముల స్వీకరించిభక్తుల హృదయములందు శుద్ధమగు కోరికలను కలిగించి, యా కోర్కెలను తీర్చుచున్నట్లు లుండెను. తనకంటె బ్రహ్మ మొదలు తృణపర్యంతముగల చరాచర జీవులంద రును రూపముదాల్చి ప్రతి కృష్ణుని,వేర్వేరు పూజాసంబరములతో పూజించుచున్నట్లు, బ్రహ్మదేవుడు చూచినాడు. అణిమాద్యష్ట సిద్ధులు, మాయవిద్య మొదలగు విభూ తులు, మహత్త్వాది చతుర్వింశతితత్త్వములు నాల్గువైపులచుట్టి యున్నవి. ప్రకృతి యందు క్షోభముకల్గించుకాలము, దాని పరిణామమునకు కారణమగు స్వభావము' వాసనలను ప్రచోదనచేయు సంస్కారములు, కామనలు, కర్మలు, విషయములు, ఫలములు మొదలగునవన్నియు రూపములుదాల్చి భగవానుని ప్రతియొక్క రూప మును ఆరాధించుచున్నది. అన్ని రూపములును సత్యజ్ఞానానన్తానన్దైక రసమాత్రము లై యున్నవి. ఉపనిషత్తత్త్వ జ్ఞానముగల్గిన మహాత్ములకుగూడ దుర్లభమగు అనంత మహిమ ప్రకటితమగుచున్నది.

ఈ ప్రకారము అందరును పరమాత్మయగు శ్రీకృష్ణుని స్వరూపములుగనే బ్రహ్మ దర్శించినాడు.

ఈ యత్యంతాశ్చర్య దృశ్యమును గాంచిన బ్రహ్మ చకితుడైనాడు. అతని యేకాదశేంద్రియములు మొద్దుబారినవి. భగవానుని తేజస్సునందవి నిస్తేజములైనవి వ్రజమండలమున నధిష్ఠానదేవత ముందొక బొమ్మవలె, బ్రహ్మ నిశ్చేష్టుడై నిలబడి పోయినాడు. భగవానుని స్వరూపము తర్కమున కందనట్టిది. అతని మహిమ యసాధారణము. అతడు స్వయంప్రకాశకుడు, ఆనందస్వరూపుడు, మాయాతీతుడు. వేదాంతములుగూడ పరమాత్మ స్వరూపమును "ఇదమిత్థమ"ని నిర్ణయింపజాలక 'నేతి నేతి' (ఇదికాదు-ఇదికాదు) వాక్యములచే యితరమునంతయు నిషేధించుట

ద్వారా ఆనందస్వరూపమగు పరమాత్మ తత్త్వమును యేదోయొక విధముగ సంకేతముచే తెల్పుచున్నవి. బ్రహ్మ సర్వవిద్యలకు నధిపతియైనను, భగవానునియొక్క యీ దివ్యస్వరూపమును లేశమాత్రమైనను గ్రహింపజాలకుండె. మహిమాన్వితములగు భగవానుని యీ దివ్యరూపములను చూచుటగూడ సమర్థతలేనివాడాయె.అందుచే నతడు కన్నులు మూసుకొనియె.

శ్రీకృష్ణభగవానుడు, బ్రహ్మయొక్క భ్రాంతిని, యజ్ఞానమును గుర్తించినవాడై, తన మాయ యను తెరను తొలగించగా, బ్రహ్మకు బ్రహ్మజ్ఞానము కల్గినది. అతని పరిస్థితి చచ్చి బ్రతికినట్లున్నది. సచేతనుడై యతడతికష్టముతో కనులు దెరవగా, నతనికప్పుడు తన శరీరము, ప్రపంచము కనుపించినవి. బ్రహ్మ నాలుగు వైపుల తనదృష్టిని ప్రసరింపజేసినాడు. అతనిముందు బృందావనమగుపించినది. ప్రకృతిశోభతో నలరారుచున్న బృందావనమందరికిని ప్రీతిని కల్గించుచున్నది. భగవానుడగు శ్రీకృష్ణుని లీలా ప్రదర్శనకు రంగస్థలమగుటచే, నచట క్రోధము, తృష్ణ మొదలగు దోషములు ప్రవేశింపవు. సహజవైరములుగల మనుజులు, పశుపక్ష్యాదులు సైతము అత్యంత సన్నిహితమగు ప్రేమతో మిత్రులవలె మెలగుచుండిరి. అట్టి బృందావనమును దర్శించిన పిమ్మట, అద్వితీయ పరబ్రహ్మయే యచట గోపబాలక రూపమున నాట్యముచేయుచుండుటను గాంచినాడు. ఒక్కడైనప్పటికిని అతని స్నేహితులతో ద్వితీయుడుగను, అనంతుడై యుండియు యిటునటు తిరుగుచుండుటను, అపారజ్ఞానముగలవాడైనప్పటికిని, తన మిత్రులను, దూడలను వెదకుచున్నట్లును, బ్రహ్మకు విభిన్న ప్రవృత్తులుగలవాడుగా గోచరించె. తాను గోవత్సముల నదృశ్యము చేయకమునుపు, వామహస్తమునందు పెరుగన్నము పెట్టుకొనియున్న శ్రీకృష్ణుడే మరల యిప్పుడు బ్రహ్మకు గనుపించినాడు. అప్పటివలెనే యిప్పుడును గోవత్సములను, వత్సపాలకులను వెదకుచున్నట్లే యగుపించినాడు. ఆ శ్రీకృష్ణ భగవానుని గాంచగనే పితామహుడొక్క యుదుటున తన వాహనమైన హంసపై నుండి దుమికి బంగారమువలె మెఱయుచున్న తన శరీరముతో భూమిపై దండాకారమున బడిపోయినాడు. తన కిరీటాగ్రభాగములు భగవానుని చరణకమలములు సోకునట్లు నమస్కరించి, ఆనందాశ్రువులచే యాతని పాదములనభిషేకించె. తాను దర్శించిన భగవానుని మహిమను మాటిమాటికి స్మరించుకొనుచు, మరల మరల నమస్కరించుచు, పడుచు లేచుచు నుండె. ఈ ప్రకారమాతడనేక ప్రకారముల భగవానుని పాదములపై పడుచునే యుండెను. పిమ్మట నెమ్మదిగా లేచి కన్నీరు తుడుచుకొని, ముక్తి ప్రదాతయగు ముకుందుని జూచుచు, తలవంచి, కృతాంజలియై, యేకాగ్రమగు చిత్తముతో గద్గదకంఠుడై, భగవాను నీవిధముగ స్తోత్రము చేయ దొడగినాడు, పితామహుడు.

# పదునాల్గవ యధ్యాయము

## బ్రహ్మకృత స్తోత్రము

"ఏక మాత్రస్తుతి పాత్రుడవగు నీకు నమస్కరించుచున్నాను. నీ యీ శరీరము వర్షాకాలమందలి మేఘము వలె శ్యామలముగా నున్నది. దానిపై విద్యుల్లత వలె పీతాంబరము శోభిల్లుచున్నది. నీ కంఠమునందు గురివింద పూసల హారము, కర్ణములందు మకరకుండలములు, శిరమందు నెమలి ఫించ కిరీటము మొదలగు నలంకారముల కాంతితో నీ ముఖమండల మపూర్వకాంతితో ప్రకాశించు చున్నది. వక్షస్థలమందు వనమాల విరాజిల్లు చున్నది చేతి యందు దధ్యన్న కబళము, చంకయందు వేత్ర, శృంగములు, మొలయందు వేణువు, మహాశోభ నందుచున్నవి. కమలముల కంటె సుకుమారములగు నీ చరణ కమలములు, యీ గోపాల బాలక రూపము యెంతమనోహరములుగా నున్నవి! (ఇంతకంటె నాకేమియు తెలియదు. ఈ చరణ కమలములనే ఆశ్ర యించుచుంటి). స్వప్రకాశుడవగు పరమాత్మా, ఈనీ రూపము భక్తజనుల మనో రథముల నీడేర్చునదై యున్నది. స్వేచ్ఛా మయుడవగు నీయొక్క యీ చిన్మయ స్వరూపం నాపై నీకు గల యనుగ్రహము చేతనే నాకు చూపించితివి. ఇది పంచ భూతాత్మకమని యెవరన గలరు? ఇది అప్రాకృతము, శుద్ధసత్త్వమయము. నేను గాని మరియే యితరులైనను, సమాధి స్థితి యందు గూడ నీ సచ్చిదానంద విగ్రహము యొక్క మహిమను తెలియ జాలము. కేవలము ఆత్మసుఖానుభవ మాత్రుడవును, గుణాతీతుడవునగు నీ మహిమను, యేకాగ్రమనస్కులైనను యెవరు తెలియగలరు?

జ్ఞానము కొరకై కొంచెమైనను ప్రయత్న మొనర్పక, తమ స్థానములందే యుండి సత్సంగమూ చేయుచు, నీ ప్రేమ భక్తి గల సత్పురుషులు గానము చేయు నీ లీలా కథాశ్రవణ మొనర్చుచు, త్రికరణ శుద్ధిగాని నయావనతులై నిన్నే సేవించుచు ఆ సేవయే తమ జీవనముగా గడపునట్టి మహానుభావులు, మాత్రము నీపై విజయము సాధించెదరు. అది అనితర సాధ్యము, నీవు వారి ప్రేమకు వశుడవైయుండెదవు.

స్వామీ, నీ యందలి భక్తియే సమస్త కల్యాణములకు మూలము. ఎవరట్టి భక్తిని వదలి కేవల జ్ఞాన ప్రాప్తికై శ్రమపడెదరో వారికి క్లేశము మాత్రమే మిగు లును. అది కేవలము ఊకదంపుడు వంటిది. ఊకను దంచినచో శ్రమ కలుగుటయే గాని బియ్యము లభించవు గదా!

అచ్యుతా, అనంతా, ఈ లోకమందు పూర్వమనేక యోగులు, యోగ ప్రక్రియల ద్వారా నిన్ను పొందజాలక. తమ సమస్త లౌకిక వైదిక కర్మలను

నీచరణకమలములయందు సమర్పణ గావించినారు. అట్లు సమర్పించినందు వల్లను, నీ లీలా కథాశ్రవణము వల్లను, వారలకు నీ భక్తి లభించినది. ఆ భక్తిచే నీ స్వరూపజ్ఞానము కల్గినవారై వారు నీ యొక్క పరమపదమును పొందగలిగినారు.

ఓ అనంతా, నీయొక్క సగుణ నిర్గుణ స్వరూపములు రెండును గ్రహించుటకు సాధ్యముకానివే యైనను, నీ నిర్గుణ స్వరూప జ్ఞానము, యింద్రియ నిగ్రహము చేసి, శుద్ధాంతః కరణము గల వారికి ప్రాప్తించుచున్నది. (దానికి ఉపాయమేమనగా) ఆత్మాకారాంతః కరణ వృత్తి సాక్షాత్కారముచే నది సాధ్యమగును. "ఆత్మాకారత" యనగా విశేషాకార పరిత్యాగమే. ఆ విషయమగుటచే, వృత్తి విషయత్వమే గాని ఫల విషయత్వ ముండదు. అనుభవైక వేద్యము.

కాని ప్రభూ, అనేక జన్మలందు పరిశ్రమ యొనర్చిన సమర్థులు గూడ, యీ పృథివి యందలి పరమాణువులను, ఆకాశమందలి హిమకణములను నక్షత్రములను గూడ లెక్కింప గలరేమోగాని, వారిలో నొక్కడైనను నీ సగుణ స్వరూపము యొక్క గుణములను లెక్కింపజాలడు. ఈ పృథివి యొక్క హితము కొరకే నీవవతరించినాడవు. నీ మహిమ నెఱుంగుట మహాకష్టము.

కావున, యే పురుషుడు క్షణ క్షణము సమధికోత్సాహముతో నీ దయననుభవించు చుండునో, మఱియు పారబ్ధానుసారము కలుగు సుఖ దుఃఖములను నిర్వికారమగు మనస్సుతో ననుభవించుచుండునో, ప్రేమపూరిత హృదయముతో, గద్గద స్వరముతో, పులకిత తనువుతో తన సర్వస్వము నీ చరణ నీరజములందర్పణ యొనర్చునో అటుల తన జీవనమును గడుపు పురుషుడు మాత్రమే తండ్రి యొక్క సంపత్తికి తనయుడర్హుడైనట్లు, నీపరమపద ప్రాప్తి కర్హుడగును.

ప్రభూ, నా మూర్ఖత్వమును పరికించుము. నీవు అనంతుడవు. ఆదిపురుషుడవునగు పరమాత్మవు. నా వంటి మాయావులందరు నీ మాయా చక్రమందే యున్నారు. అయినను నీపై నామాయను ప్రయోగించి నా గొప్పతనము చూపించ దలచితిని. నేను నీ ముందెంత వాడను? అగ్ని ముందు జ్వాల లొక లెక్కలో నుండునా?

స్వామీ, నేను రజోగుణ సంభూతుడను. నీ యథార్థ తత్త్వము నాకు సరిగా తెలియదు. అందుచే నీ కంటె వేరుగా, నేనీ ప్రపంచమునకు ప్రభువు నను యభిమానముతో నుంటిని. "నేనజుడను జగత్కర్తను" అను అభిమానముచే మాయా మోహితుడనై అజ్ఞానాంధకారమున మునిగి యుంటిని. కావున, "ఇతడు నా యధీనుడే, నా భృత్యుడే ఇతనిపై దయ జూపవలయు"నను భావముతో నా యపరాధమును క్షమింప వేడుచున్నాను.

స్వామీ ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, పృథివీ రూపములగు ఆవరణలతో చుట్టబడి యున్న యీ బ్రహ్మాండ మేనా శరీరము! నీ యొక్కొక్క రోమ రూపమందిట్టి బ్రహ్మాండములనేకములు, జాలరంధ్రమందలి సూర్యరశ్మిలో పరిభ్రమించు పరమాణువులవలె పుట్టుచు-గిట్టుచు పరిభ్రమించుచున్నవి. సప్త వితస్తి పరిమాణ శరీరముగల క్షుద్ర జీవినగు నేనెక్కడ? నీ యనంత మహిమ యెక్కడ? దానిని నేను తెలుసుకొనుట సాధ్యమా?

అధోక్షజా, శిశువు తల్లి గర్భమందున్నప్పుడు అజ్ఞాన వశమున కాళ్ళతో చేతులతో కొట్టుచుండును. ఆ యపరాధములను తల్లి పాటించునా? ఆమె కవి యపరాధములగునా? "ఉన్నది" "లేదు" అను శబ్దములచే చెప్పబడు యే వస్తువైనను నీ కుక్షి యందున్నదే కాని వేరు కాదు.

"ముల్లోకములును ప్రళయకాలమందు జలము నందు మునిగి యున్నపుడు, ఆ జలమందు శయనించి యున్న నారాయణుని నాభి కమలము నుండి బ్రహ్మ యుద్భవించినాడు" అని శ్రుతులు చెప్పుచున్న విషయమసత్యముగాదు. కాన ప్రభూ! నీవే చెప్పుము నేను నీ కుమారుడను గానా?

"స్వామీ, నీవు సర్వజీవులకు ఆత్మ స్వరూపుడవు కావున నారాయణుడవు. (నారములనగా జీవులు-అయన మనగా ఆశ్రయము అని యర్థము). నీవుసర్వ లోకములకు లోకులకు అధీశ్వరుడవు. అందుచే గూడ నారాయణుడవు. (అయన మన ప్రవర్తకుడవు) నీవు సర్వలోక సాక్షివి (జీవులను తెలుసుకొనువాడవు) నారములనగా జలములు. అందు వసించుటచేగూడ నారాయణుడవు. (అయనమనగా నివాస స్థానము)

శ్లో॥ నరాజ్జాతాని తత్త్వాని నారాణీతి విదుర్బుధాః
తస్యతాన్యయనం ప్రోక్తం తేన నారాయణః స్మృతిః

సర్వము నీ యంశయే. అంశ రూపముగా దర్శించుట గూడ సత్యముగాదు. మిధ్యయే.

ఆ జలమందున్న నీ విరాట్స్వరూపము సత్యమేయగుచో, కమల నాళ మార్గమున నేను నూరు సంవత్సరములు వెదకినను కనుపడకుండుటకు కారణమేమి? అనంతరము నేను తపము చేయగా నా హృదయమందు నీ రూపమగుపడుటకు కారణమేమి?

మాయను నశింపజేయు స్వామీ, యెప్పటి విషయములో యెందుకు? ఈ యవతారమందుగూడ, నీ తల్లియగు యశోదకు సర్వ విశ్వమును నీ నోటియందే చూపించితివి గదా! ఆమె యాశ్చర్య చకితయాయె గదా! కావున దీనిచే, విశ్వమంతయు కేవలము నీ మాయా మాత్రమనియే సిద్ధమగుచున్నది.

నీతో గూడ బయట కనపడుచున్న ఈ విశ్వమంతయు నీ యుదరమందు గనుపించుట నీ మాయ లేకుండనే జరిగినదా? అది తప్పక నీ లీలయే గాని వేఱు గాదు.

ఆనాటి మాటయటుండనిమ్ము. నేటి విషయము జూతము. నాకు, నీ కంటె భిన్నముగా నున్న సమస్తము నీ మాయా కార్యమేయను లీలను ప్రదర్శించితివి గదా! మొదట నీవొక్కడవే యుంటివి. పిమ్మట సమస్త గోవత్స, గోప బాలుర రూపమును దాల్చితివి. అనంతరమన్నియు చతుర్భుజ నారాయణ రూపములగుటయు నాతో కూడ సమస్త తత్త్వములు వారిని సేవించుచుండుటను గూడ చూచితినిగదా! సమస్త బ్రహ్మాండ రూపములను దాల్చియు, అద్వితీయ పరబ్రహ్మ రూపముగనే శేషించి యుంటివి గదా!

అజ్ఞాన వశమున నీ స్వరూపము తెలియని వారలకు నీవు ప్రకృతియందున్న జీవుని వలెనే భాసించెదవు. వారిపై నీ మాయయను తెరను గప్పి, సృష్టికాలమందు నా (బ్రహ్మ) రూపముతో పాలించునప్పుడు నీ (విష్ణు) రూపముతోను, సంహార కాలమందు రుద్ర రూపముననను ప్రకటితమగుచుందువు.

"స్వామీ, సర్వ జగత్తునకు నీవే విధాతవు. పుట్టుకలేని వాడవయ్యు, దేవ, ఋషి, మనుష్య, పశు, పక్షి జలచరాది యోనుల యందవతరించుచుందువు.ఆ యవ తారములన్నియు, దుష్టుల శిక్షించి వారి గర్వమును పోగొట్టుటకును, సత్పురుషుల రక్షించుటకును, దాల్చుచుందువు.

నీవు పరమాత్మవు. యోగీశ్వరుడవు. నీవు నీ యోగమాయను విస్తరింపజేసి లీలను ప్రదర్శించు సమయమందు, నీవు యెక్కడ యెందుకు యెప్పుడు యే విధ ముగా నెన్ని లీలల ప్రదర్శించెదవో, ముల్లోకములందు యెవ్వడు సమర్థుడగును?

కావున యీ జగత్తంతయు స్వప్నము వలె మిథ్యయే. అజ్ఞానకార్యము మరియు దుఃఖము వెంట దుఃఖము కలిగించునట్టిదే! నీవు పరమానంద జ్ఞానస్వరూ పుడవు. అనంతుడవు. ఈ సమస్త జగత్తు మాయచే గల్పింపబడి విలీనమొనర్ప బడిన యనంతరము గూడ, నీయందే నీవు సద్రూపుడవుగా నుండెదవు.

అందరికి ఆత్మ స్వరూపుడవుగా నున్న నీ వొక్కడవే సత్యము. పురాణ పురుషుడవగుటచే జన్మాది వికారము లెవ్వియు లేనివాడవు. స్వయం ప్రకాశుడవు. దేశ కాల వస్తు పరిచ్ఛేదము లేనివాడవు. వానినన్నిటిని నీవు ప్రకాశింపజేసెదవు.అవి నాశివగుటచే నిత్యుడవు. ఆనంద ఘనుడవు. నిరంజనుడవు. ఎట్టి మాలిన్యములుగాని అభావముగాని లేని వాడవు. పూర్ణుడవు. అద్వితీయుడవు. ఉపాధుల నుండి ముక్తుడై యుండు అమృత స్వరూపుడవు.

అట్టి నీ పరమాత్మ స్వరూపము జీవులందరికి ఆత్మస్వరూపమే. ఎవడు, గురురూప సూర్యుని వలన, తత్త్వ జ్ఞానమును దివ్యదృష్టిని పొందినవాడై, దానిచే

నిన్ను తన యాత్మ స్వరూపునిగా సాక్షాత్కరించుకొనునో, వాడు యీ మిథ్యా సంసార సాగరమును తరించగల్గును. (సంసార సాగరము మిథ్యయేగాన, దానిని తరించుట యనునది గూడ మిథ్యయే గదా. కాన తరించుట గూడ అజ్ఞాన దృష్టి చేతనే చెప్పబడుచున్నది)

ఎవడట్టి పరమాత్మను తన యాత్మగా తెలియడో, వానికా యజ్ఞాన కారణము చేతనే యీ నామ రూపాత్మక ప్రపంచమంతయు పుట్టినట్లు భ్రమ కలుగుచున్నది. కాని యదార్ధ జ్ఞానము కలుగుట తోడనే, అజ్ఞానము దాని కార్యమగు భ్రమయు లయించి పోవుచున్నవి. త్రాటియందు భ్రమవలన సర్పమున్నటుల తోచినను, త్రాడను జ్ఞానము కల్గిన వెంటనే-భ్రమ తొలగిపోగా, సర్ప ప్రతీతియు తొలగి పోవునుగదా!

సంసార సంబంధమగు బంధము, దాని నుండి మోక్షము అను పేర్లురెండును అజ్ఞాన కల్పితములే. అజ్ఞానము యొక్క రెండు పేర్లు మాత్రమే. వాటికి జ్ఞాన స్వరూపుడగు పరమాత్మకంటె భిన్నముగా అస్తిత్వమే లేదు. సూర్యునియందు పగలు, రాత్రి యను భేదము లేకుండునట్లు, విచారణయొనర్చినచో, అఖండ చిత్స్వరూపమగు కేవల శుద్ధ ఆత్మ తత్త్వమందు, బంధనములేదు. అందుచే మోక్షమును లేదు.

నీవు ప్రతియొక్కరికిని ఆత్మవై యుండగా నది తెలియక నిన్ను పరాయి వానినిగా లోకులు భావించుట యెంత హాస్యాస్పదము! తమకు భిన్నమై (పరాయివి) నట్టి దేహాదులను తమయాత్మగా భావించుచున్నారు. పైపెచ్చు, నీ కొఱకు యితరత్ర వెదకుచుందురు. ఈ యజ్ఞాన జీవుల యొక్క యజ్ఞానమెంత గొప్పది?

"ఓ అనంతా, నీవు సర్వుల యతఃకరణములందు వెలుగుచున్నావు. కావుననే సత్పురుషులు నీకంటే భిన్నముగా కనుపడు సమస్తమును పరిత్యాగమొనర్చి, తమ హృదయములందే నిన్ను వెదకుచుందురు. త్రాటియందు నిజముగా పాము లేకపోయినను ప్రతీయమానమగుచుండు (ఆరోపిత) సర్పమును మిథ్యయను నిశ్చయము చేసుకొనకుండ, యే సత్పురుషుడైనను నిజమగు త్రాటినెట్లు తెలుసుకొనగలుగును?

నీ జ్ఞానముయొక్క స్వరూప మహిమ లెట్టివనగా—వానిచే అజ్ఞాన కల్పితమగు జగత్తు నశించిపోవును. నీ చరణాంబుజ ప్రసాదమును లేశమైనను పొందినవారు మాత్రమే నీ సచ్చిదానందమయమగు మహిమయొక్క తత్త్వమును తెలుసుకొనగలుగును. ఇతరుడెవడైనను, జ్ఞానవైరాగ్యాది సాధన రూపములగు ప్రయత్నములచే చాలకాలమెంతయను సంధాన మొనర్చినను, నీ మహిమయొక్క యధార్ధ జ్ఞానమును పొందలేకుండును.

కావున స్వామీ, నాకు యీ జన్మమందుగాని, లేక మఱియొక జన్మయందు

గాని, లేక పశుపక్ష్యాది జన్మలందైననుగాని, నీ దాసులలో నొకడనై, నీ చరణ కమలముల సేవించుకొనుచుండెడి సౌభాగ్యమును నాకు ప్రసాదించుము.

ప్రభూ, సృష్ట్యాదినుండి నేటివరకు చేయబడిన యజ్ఞయాగాదులన్నియు నీకు పూర్ణమగు తృప్తిని కలిగించలేకపోయినవి. కాని నీవు వ్రజమందు గోవత్స, గోప బాలక రూపములు దాల్చి యా తల్లుల యొక్క అమృతమయమగు స్తన్యమును పరమ తృప్తితో పానమొనర్చితివి! నిజముగా ఆ తల్లుల జీవితములే సఫలములు! వారే అత్యంత ధన్యులు.

ఆహా! యేమి! నందాది వ్రజవాసులగు గోపాలుర యొక్క మహాభాగ్యము! పరమానంద స్వరూపుడు, సనాతనుడు, పరిపూర్ణ బ్రహ్మమునగు నీవు వారికి సుహృన్మిత్రుడవై యున్నావు! నిజముగా వారు మహాధన్యులు!

అచ్యుతా! ఈ వ్రజవాసుల మహాభాగ్యమటుండ నిమ్ము. మనస్సు మొదలగు పదునొకండగు యింద్రియముల కధిష్ఠాన దేవతలుగానుండు, మహాదేవుడు మొదలు గాగల దేవతలమగు మేమందరము మహా ధన్యులము. ఏలననగా, మేము యీ వ్రజ వాసులయొక్క యేకాదశేంద్రియములను పాత్రలుగా నొనర్చి, నీ చరణ కమలముల యొక్క— అమృతముకంటె మధురమగునట్టియు, మదిరకంటె మాదకమగునట్టియు- మధుర మకరందరసమును పానమొనర్చుచుంటిమి. వ్రజవాసులయొక్క యొక్కొక్క యింద్రియముతో పానము చేయుచు మేమింత ధన్యులమగుచుండగా, తమ సమస్తేంద్రియములతో నిన్ను సేవించు వ్రజవాసుల మహద్భాగ్యము వర్ణనాతీతము గదా.

ప్రభూ, మేము యీ వ్రజభూమియందే వనమందైనగాని, విశేషించి గోకులమునందెచ్చటనైనను, యే ప్రాణిగానైన జన్మించినచో నది మాకు మహాసౌభాగ్య దాయకము కాగలదు. ఏలననగా, నట్లు జన్మించినచో నీ ప్రియభక్తులయొక్క పాద రజస్సు కొంచెము మాపై పడునదృష్టము లభించును. నీ ప్రియభక్తుల జీవితము నీ జీవితమే గదా! వారికి నీవే సర్వస్వము. కావున వారి పాదధూళి లభించుటయన నీ పాదధూళి లభించుటయే. నీ పాదధూళినైతే, శ్రుతులు అనాదికాలమునుండి నేటివరకు వెదకుచునే యున్నవి.

దేవాధిదేవా, యీ వ్రజవాసులు నీకు చేసిన సేవకు ప్రతిఫలముగా నీవు వారికేమొసంగెదవు? సంపూర్ణ ఫలములకు ఫలస్వరూపుడవు. నీకంటె గొప్పదగు ఫలమే మఱియొకటి లేదు. నీవు వారికి నీ స్వరూపము నొసంగి ఋణవిముక్తుడవు గాలేవు. ఏలననగా, నీ స్వరూపమును ఆ పూతన, తనవారగు బకాసురాదులతో, యిదివరకే పొందియున్నది. ఆ పూతన పైకి మాత్రమే సాధు స్త్రీ వేషమును దాల్చి యున్నది హృదయమందు మహా క్రూరురాలు. తమ సర్వస్వమును, అనగా

తను, మన, ధన, గృహ, సంతాన, మానసాదులనన్నిటిని, నీ చరణములందే సమర్పించి, నిన్నే సర్వస్వముగా భావించి సేవించుచున్న యీ వ్రజవాసులకుగూడ పూతన కిచ్చినటువంటి ఫలమునే యొసంగినచో వారి ఋణమునుండి నీవెట్లు ముక్తుడవయ్యెదవు?

సచ్చిదానంద రూపా, యెంతవరకు జీవులు నీవారుగాకుందురో (అనగా నీకు ఆత్మ సమర్పణ గావించకుందురో) అంతవరకు రాగద్వేషాది దోషములు దొంగలవలె వారి సర్వస్వము నపహరించుచుండును. గృహము కారాగృహమే యగును, మోహము శృంఖలమువలె బంధించి యుంచును.

నీవు నిష్ప్రపంచుడవైనను, ప్రపంచమందు నిన్ను శరణుజొచ్చిన భక్తజనుల కానంద సందోహమును సమకూర్చుటకై, పృథివి యందవతరించి, నీ లీలా విలాసమును విస్తరించుచుందువు.

వేయేల? యెవరు నీ మహిమను గుర్తించెదరో వారు గుర్తించెదరుగాక. నా మనోవాక్శరీరములు మాత్రము నీ మహిమ తెలుసుకొనుటకు అన్ని విధముల అసమర్థములుగ నున్నవి.

శ్రీకృష్ణా, నీవు సర్వసాక్షివి కాన సర్వమెఱుంగుదువు. సమస్త ప్రపంచమునకు నీవు భర్తవు. ఈ ప్రపంచమంతయు నీయందే యున్నది. నీతో నేనింతకంటె యేమి చెప్పగలను? నీవు నన్ను స్వీకరించుము. నా లోకమున కేగుట కనుజ్ఞ నిమ్ము.

సర్వుల మనః ప్రాణముల నాకర్షించు శ్యామసుందరా, యదువంశమును కమలమును వికసింపజేయు భాస్కరా, పృథివిని, దేవతా బ్రాహ్మణులను, పశురూపమగు సముద్రమును ఉప్పొంగజేయు చంద్రుడవు గూడ నీవే. పాషండులను రాత్రియొక్క ఘోరాంధకారమును నశింపజేయుటలో నీవు చంద్ర, సూర్యులతో సమానుడవు. పృథివి యందలి రాక్షసులను నశింపజేయు నీవు, చంద్ర సూర్యాది సమస్త దేవతలకును పూజనీయుడవు. నేను జీవించి యుండుసంతవరకు మహా కల్పాంతమువరకు, నీకు నమస్కరించుచునే యుండెదను."

"రాజా, సృష్టికర్తయగు బ్రహ్మ, యీ ప్రకారము శ్రీకృష్ణ భగవానుని స్తుతించి, ముమ్మారు ప్రదక్షిణ యొనర్చి, యాతని చరణములకు సాష్టాంగ నమస్కారమొనర్చి తన నివాసమగు సత్యలోకమునకేగె. అంతకుమును పేతానదృశ్యము గావించిన దూడలను గోపబాలురను యథాస్థానమునకు చేర్చియుండె. శ్రీకృష్ణుడు బ్రహ్మకు వీడ్కోలొసంగి, దూడలను తోలుకొని యమునా తీరపులినముల కేతెంచె. తన స్నేహితులందరచట యున్నారు గదా!

రాజా, తమ జీవన సర్వస్వము ప్రాణవల్లభుడునగు శ్రీకృష్ణుని వియోగము గొల్లపిల్లలకొక సంవత్సరకాలము జరిగినను, విశ్వమోహినియగు భగవానుని యోగ మాయా ప్రభావమువలన నదియొక క్షణార్థమువలె వారికి భాసించినది. ప్రపంచ మందలి సర్వప్రాణులును ఆ మాయచేతనే మోహింపబడినవారై, శాస్త్రములు ఆచా ర్యులు యెంతగా బోధించినను గూడ, తమ యాత్మను నిరంతరము మఱచియే పోవుచున్నారు. వాస్తవమునకు- ఆ మాయా ప్రభావ మట్టిది.

శ్రీకృష్ణుని జూడగనే గోపబాలురత్యంతోత్సాహముతో నతనికి స్వాగతము పలికిరి. మిత్రమా, నీవు వచ్చితివి సంతోషము. నీవు లేకుండ మేమొక్క ముద్ద గూడ తినలేదు. ఇక్కడకు వచ్చి ఆనందముగా భుజించుము అని పలికిరి. హృషీ కేశుడు హసించుచు వారితో భుజించి, వారి కజగర శరీరమును జూపుచు సాయం సమయమునకు వారందరితో వ్రజమునకు తిరిగి వచ్చె.

శ్రీకృష్ణుని శిరముపై నెమలిపించకిరీటము చేన్నొందుచున్నవి. మొగముపై మనోహరములగు ముంగురు లల్లాడుచున్నవి. శిఖయందు రంగురంగుల పుష్ప ములు కూర్చబడియున్నవి. ఈ సమస్తాలంకారముచే నతని నీల శరీరము వింత శోభతో వెలుగొందుచున్నది. గోకులమునకు తిరిగివచ్చు సమయమందాతడొకప్పుడు వేణుగానము చేయును మఱొకప్పుడు పత్రములను, శృంగముల నూదుచు వాద్యో త్సవమందు మగ్నుడై యుండును. అతని వెనుక గోపబాలురు, లోకపావనములగు నతని లీలలను గానము చేయుచు వచ్చుచుందురు. దూడల నదలించి పిలుచు చుందురు. వీరి రాకకై గోపికలెదురుచూచుచుందురు. భగవానుని చూపులు వారి చూపులతో కలియగనే వారానందమగ్నులగుచుండిరి. ఈ విధముగ కృష్ణుడు వ్రజ మును ప్రవేశించె. ఆనాడా గోపబాలురు తమ తల్లులతో "అమ్మా యివ్వాళ మన నంద యశోదానందనుడు వనమందొక పెద్ద కొండచిలువను సంహరించి మమ్మంద రిని రక్షించినాడని", చెప్పిరి.

అని చెప్పిన శ్రీశుకునితో పరీక్షిత్తు "మహాత్మా, వ్రజవాసులకు శ్రీకృష్ణుడు తమ బిడ్డ గాకపోయినను, అతని యందింత గొప్ప ప్రేమ యెట్లేర్పడినది? అట్టి ప్రేమ, వారికింతకు పూర్వము తమ పిల్లలయందు గూడ కలిగి యుండలేదు గదా! ఇందుకు కారణమేమో మీరు నాయందు దయయుంచి వివరింపవేడెద" ననియనగా, శ్రీశుకుడతనితో నిట్లులనియె.

"రాజా, సంసారమందు సమస్తప్రాణులుగూడ నన్నిటికంటె యధికముగ తమ యాత్మనే ప్రేమించుచుండెదరు. పుత్రులయందు గాని, ధనము నందుగాని మఱియే యితర వస్తువు నందైనను ప్రేమ కలిగియుండుట యనునది, ఆ వస్తు వులు తమ యాత్మకు ప్రియము గావుననే సంభవించుచున్నది. అందుచల్లనే ప్రాణు

లందరికిని తమయందు తమకు గలుగు ప్రేమ తమకు సంబంధించినవని చెప్పబడు దారాపుత్ర ధనాగారములందు కలుగదు. ఎవరు దేహమునే యాత్మగా భావించు చున్నారో, వారు గూడ తమ శరీరముపై జూపించు ప్రేమవంటి ప్రేమను, తమ శరీర సంబంధీకులగు పుత్ర మిత్రాదులపై కలిగియుండరు. వేదాంత విచారణ మొన ర్చిన పిమ్మట యెప్పుడీశరీరము తాను గాదను జ్ఞానము కలుగునో అప్పుడీ శరీర ముపై గూడ, ఆత్మతో సమానమగు ప్రేమను వారు చూపించరు. ఆ కారణము చేతనే శరీరము జీర్ణించిన పిమ్మట గూడ, జీవించవలయునను నాశ ప్రబల రూప ముగ నుండును. కావున తేలినదేమనగా, ప్రాణులందరును ఆత్మయందే మిగిలిన వాటియందు కంటె నధికముగ, ప్రేమ కలిగియుందురు. తమ యాత్మకొరకే మిగి లిన చరాచర ప్రపంచమునంతను గూడ వారు ప్రేమించుచుందురు. ఈ శ్రీకృష్ణు డందరికి ఆత్మస్వరూపుడని తెలుసుకొనుము. ఈ ప్రపంచమునకు శుభము చేకూ ర్చుట కొరకే భగవానుడు తన యోగమాయ నాశ్రయించి వ్రజమందు దేహధారి వలె చరించుచున్నాడు. శ్రీకృష్ణుని వాస్తవిక స్వరూపము నెరిగినవారికి, యీ జగత్తు నందలి చరాచర పదార్థములన్నియును,వీనికంటె శ్రేష్ఠములగు బ్రహ్మాది భగవత్స్వ రూపములు గూడ, అన్నియు శ్రీకృష్ణ స్వరూపములేయై యుండును. శ్రీకృష్ణుని కంటె భిన్నమగు ప్రాకృతము లేక అప్రాకృతమునగు పదార్థమే లేదు. సర్వ వస్తు వుల యునికియు వాని కారణమందే యుండును. అట్టి కారణములన్నిటికిని పరమ కారణము శ్రీకృష్ణ భగవానుడు. కావున శ్రీకృష్ణునికంటె భిన్నమగు వస్తువే మున్నదో చెప్పుము. సత్పురుషులందరికి సర్వస్వమగునట్టి యీ ముకుందుని పద పల్లవమను పడవ నాశ్రయించిన వారలకే సంసారసాగరము, గోష్పదము వంటి దగును. వారికి పరమపద ప్రాప్తి కలుగును. ఆపదల కాలవాలమగు ఈ సంసారము వారికుండదు.

రాజా, నీవు భగవానుని పంచవర్ష ప్రాయమందు జరిగిన లీల నారు సంవ త్సరముల వయసునందు జరిగినట్లు గోపాలబాలురెట్లు చెప్పిరని యడిగి యుంటివి. దాని రహస్యము చెప్పితిని. గోపబాలురందరితో కూడి భగవానుడొనర్చిన వనక్రీడ అఘాసుర సంహారము, శాద్వల ప్రదేశమందు వారు చల్దులు భుజించుట, అప్రా కృత గోవత్స గోపబాల ప్రదర్శనము, బ్రహ్మ యొనర్చిన శ్రీకృష్ణస్తవమును శ్రవణమొనర్చిన వారలకు వినిపించిన వారలకు, చెప్పిన వారలకు, అందరికిని, ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములు లభించును.

పరీక్షిన్మహారాజా, యీ విధముగ బలరామకృష్ణులు కౌమారావస్థకు సంబం ధించిన—దాగుడుమూతలు, సేతుబంధనములు, కోతికొమ్మచ్చులు-మొదలగు వివిధ ములైన లీలలొనర్చుచు, తమ కౌమారావస్థను బృందావనమందు గడిపిరి.

# పదునేనవ యధ్యాయము

## ధేనుకాసుర మోక్షము-కాళీయ విషవిమోచనము

"పరీక్షిన్మహారాజా, బలరామకృష్ణులిపుడు పౌగండ వయస్సుకు చేరినారు. (6 సంవత్సరములు). ఇపుడు వారు ఆవులను మేపుటకు అర్హతగలిగినవారైనారు. వారు తమ సహచరులతో నావుల దోలుకొనుచు బృందావనమందు తిరుగుచు తమ పాదములచే వనమును పవిత్రము చేయుచుండిరి. ఆ వనము ఆవులకు కావలసిన పచ్చిమేతతోను, రంగు రంగుల పుష్పజాతులతోను సమృద్ధమైయుండెను. ముందు గోవులు, వానివెంట వేణునాదము చేయుచూ శ్యామసుందరుడు, అతని ననుసరించి బలరాముడు, వారి వెంట శ్రీకృష్ణుని యశోగానము చేయుచు గోపబాలురు, వారందరును విహరించుటకై బృందావనమును ప్రవేశించిరి. ఆ వనమందొకవైపు మధుకరములు మధురముగ ఝంకారము లొనర్చుచున్నవి. వేరొకప్రక్క హరిణములు గుంపులు గుంపులుగా గంతులు వేయుచున్నవి. సుందరములగు పక్షులు మనోహరముగ కూయుచున్నవి. సజ్జన చిత్తమువలె నిర్మలమగు జలములు గల్గిన సరోవరములా వనమందున్నవి. ఆ సరోవరములందు బాగుగా వికసించియున్న పద్మముల యొక్క సువాసనచే నిండియున్న మందశీతల సుగంధ వాయువులు ఆ వనమును సేవించుచున్నవి. అట్టి మనోహరమగు బృందావన దృశ్యమును తిలకించిన శ్రీకృష్ణుడు ఆ వనమందు విహరించుటకు సంకల్పించె. పెద్ద పెద్ద వృక్షములు ఫల పుష్ప సంభరితములై వాని కొమ్మలు వంగి యుండుటను భగవానుడు చూచినాడు. ఆ కొమ్మలు తమ నూతన పల్లవకాంతిచే భగవానుని చరణ కమలములను స్పృశించుచున్నట్లుండినవి. చిరునవ్వు నవ్వుచు శ్యామసుందరుడు తన యన్నయగు బలరామునితో నిట్లుపలికె.

"దేవ శిరోమణీ, గొప్ప గొప్ప దేవతలచే పూజలందుకొనెడు నీ పాదంబుజములను, యీ వృక్షములు గూడ పూజించుటకై తమ శాఖలతో ఫల పుష్ప సామగ్రిని గాని, నీ చరణ కమలములపై వంగియున్నవి చూడుము. ఈ మహద్భాగ్యము కొరకే యివి యీ బృందావనమందు వృక్షరూపముతో నవతరించి తమ దర్శన శ్రవణాదులచేయువారి యజ్ఞానమును పోగొట్టుచున్నవి. వీని జీవనము నిజముగా ధన్యము.

ఆది పురుషా, నీవు నీ యైశ్వర్యమును మఱుగుపరచి సామాన్య బాలునివలె లీల లొనర్చుచున్నను, నీయొక్క భక్తవరేణ్యులగు మునీశ్వరులు తమ యిష్ట

దేవతను (నిన్ను) గుర్తించినవారై, బహుశః తుమ్మెదల రూపములను దాల్చి, భువన పావనమగు నీ యశోగానమును నిరంతరము గానము చేయుచు నిన్ను సేవించుచున్నట్లు తోచుచున్నది. వారొక్క క్షణకాలము గూడ నిన్ను వదలి యుండ గోరరు. సోదరా, నీవు నిజముగా స్తుతింపదగినవాడవు. చూడుము. నీవు తమ యింటికి వచ్చుట గాంచిన యీ మయూరములెంత తన్మయములై యానంద నృత్యము చేయుచున్నవో చూడుము. మృగనయనలగు గోపికలవంటి యీ హరిణ ములు తమ క్రీగంటి చూపులతో నీపై తమకుగల ప్రేమను ప్రకటించుచు నిన్ను ప్రసన్నుని గావించుకొనుచున్నవి ఈ కోకిలలు తమ కోమల కలరవములతో నీకు సుందర స్వాగత మొసంగుచున్నవి. ఇవి వనమందు నివసించువైనప్పటికిని ధన్యత గాంచుచున్నవి. ఏలననగా సత్పురుషుల స్వభావమే యట్టిది. తమ యింటి కేతెంచిన యతిథులకు తమ ప్రియాతి ప్రియమైన వస్తువులను కాన్కలుగా సమర్పిం చెదరు. నేడు యిచటి భూమి తన పచ్చని గడ్డితో మెత్తగా నీ పాదములను స్పృశిం చుచు ధన్యమగుచున్నది. ఇచటి వృక్షములు లతలు, పొదరిండ్లు, నీకరాంగుళి స్పర్శను పొంది, యది తమ మహద్భాగ్యమని తలంచుచున్నవి. నీకృపా కటాక్ష వీక్షణములచే, యీ నదీ, పర్వతములు, పశుపక్ష్యాదులన్నియు కృతార్థములైనవి. వ్రజమందలి గోపికలు నీ వక్షఃస్థల స్పర్శను పొంది ధన్యులగుచున్నారు."

ఈ విధముగ పరమసుందరమగు బృందావనమును గాంచి శ్రీకృష్ణ భగ వానుడు మహదానందభరితుడైనాడు. తన సహచరులగు గొల్లపిల్లలతో గూడి గిరి సానువులయందు, యమునా కూలములందు గోవులను మేపుకొనుచు ననేక ప్రకారము లగు లీలలను గావించుచుండె. ఒక ప్రక్క గోపబాలురు శ్రీకృష్ణ చరిత్రను గానము చేయుచుండ వేరొకప్రక్క బలరామ సహితుడైన శ్రీకృష్ణుడు మత్త మధుకర ఝుంకారము ననుకరించుచుండును. ఒక్కొక్క సమయమున శ్రీకృష్ణుడు కల హంసలననుసరించి కూయుచుండును. నాట్యమొనర్చు నెమళ్ళననుకరించుచు, నవ్వుచు నవ్వించుచు నాట్యమొనరించును. మేఘ గంభీర ధ్వనితో దూరముగానేగిన పశువులను వాని పేర్లతో బిలచుచుండును. ఆ మధుర కంఠధ్వని నాలించిన గోప బాలురు, గోవులుగూడ పరవశించుచుందురు చకోరక్రౌంచ చక్రవాక, మయూరాది పక్షులననుకరించి కూయుటయేగాక, వ్యాఘ్ర, సింహాది క్రూరమృగముల గర్జనలకు భీతిల్లినట్లు గూడ నటించుచుందురు. బలరాముడెప్పుడైనా అలసిపోయి యొక గొల్ల పిల్లని యొడియందు తన తలనుంచి విశ్రమించి యున్నచో శ్రీకృష్ణుడు తానాతని పాదసంవాహనాది సేవలుచేయుచుండును. గోపబాలురు తమలో తాము మాటలాడుచు గాని, నృత్యము చేయుచు గాన మొనర్చుటగాని, లేక కుస్తీలు మొదలగునవి చేయుచున్నచో, బలరామునితో గలసి భగవానుడు తానువారి నభినందించుచుండును. ఒక్కొక్కప్పుడు తాను గూడ గొల్లపిల్లలతో కుస్తీ పట్లుపట్టి, యలసి, వృక్షచ్ఛాయ

ఖుండొకని యొడిఖందు తన తలయుంచి, పల్లవ పానువుపై పండుకొనుచుండును. ఆ సమయమందు పుణ్యాత్ముడగు గోపబాలుడెవరో యతని పాదసంవాహనము చేయుచుండ, మఱికొందరు పాపరహితులు కమలపత్రములతో వీచుచుందురు. మఱికొందరు పుణ్యతములు దాని కనుగుణముగ మనోజ్ఞములగు గానములను గానము చేయుచుందురు.

భగవానుడీ విధముగ తన యైశ్వర్యమును మాయచే మఱుగుపరచి, గోపబాలురవలెనే లీల లొనర్చుచు క్రీడించుచుండె. అట్లున్నను అప్పుడప్పుడతని దివ్యలీలా వైభవములు ప్రకటితమగుచునే యుండినవి.

రామకృష్ణుల సహచరులలో సుదాముడను వాడొక ముఖ్యుడు. ఒకనాడతడు, సుబలుడు, తోకకృష్ణుడు (చిన్నకృష్ణుడు) మొదలగు గోపబాలురందరు, రామకృష్ణులతో నిట్లు పల్కిరి. 'రామా, కృష్ణా, ఇచటికి కొంచెము దూరమునందే, గొప్ప తాలవన మొకటి యున్నది. తాటిచెట్లనేకము దాని యందున్నవి. వాటినుండి బాగా మగ్గిన తాటిపండ్లు కొన్ని యిదివరకే రాలిపోగా యింకను కొన్ని రాలిపడుచున్నవి. కాని యా వనమందు ♦ ధేనుకుడను దుష్ట దైత్యుడొకడు వసించుచుండుటచే, వాడెవరిని యా తోటలోనికి రానిచ్చుట లేదు. వాడు ఖరాకారమున నుండును. వాడు చాల బలవంతుడు. వానితో సమాన బలముగల యనేకులగూడ నదేరూపమున వానికి సహాయులై యచట నివసించుచున్నారు. వారింతవరకెంత మంది నరులనాపహరించిరో లెక్కలేదు. ఆ కారణముచేతనే మనుజులెవ్వరు నా తాటితోపువైపు పోయి యా ఫలముల నాస్వాదించుట లేదు. చివరకు పశుపక్షులు గూడ నటుపోవుట లేదు. కాని యా తాటిపండ్లు మాత్రము మహా సువాసనలీనుచున్నవి. మేమింత వరకు వానిని రుచి చూచు భాగ్యమునకు నోచుకొనలేదు. ఆ సువాసన నాల్గువైపుల మనల నాక్రమించుచున్నది చూడుము. కృష్ణా, ఆ వాసనచే,

---

♦ ధేనుకాసురుడు ఇతడు పూర్వము బలిచక్రవర్తి యొక్క కుమారుడు. సాహసికుడను పేరు గలవాడు. బలగర్వితుడు దశసహస్ర నారీగణయుతుడై యతడొకనాడు గంధమాదన పర్వతముపై విహరించుచుండగా, యతనికోలాహలము వలన నచటి యొక గుహయందు తపమాచరించుచున్న దుర్వాసమహామునికి తపోభంగము కలిగినది. కోపముతో నతడు గుహనుండి వెలుపలి కేతెంచి, "యోరీ, గర్దభమువలె గోలచేయుచు నాకు ధ్యానభంగము గావించితివి గాన నీవు గాడిదవై జన్మించుమ'ని శాపమొసంగె. అతడు ప్రార్థించగా, ముని, "నాల్గు లక్షల సంవత్సరముల యనంతరము ద్వాపరాంతమునందు మధురామండల మందలి తాలవనమున, బలరామ దేవుని చేతిలో మృతినందుటచే నీకు శాపవిముక్తి కలుగగలద"ని యనుగ్రహించె. (గర్గ సంహిత)

పండ్లను తినవలయునని యువ్విళ్ళూరుచున్న మా కవి లభించునట్లు చేయుము. రామా, నీకు యిష్టమగుచో నచటికి పోవుదము." ఈ విధముగ పలికిన స్నేహితుల మాటలవిని, వారికోర్కెల దీర్పదలచినవారై బలరామ కృష్ణులు, వారందరితో తాల వనమున కేగిరి.

వనమును ప్రవేశించగానే బలరాముడు, మదగజమువలె, తాటిచెట్ల నూపి,తాటి పండ్లను రాల్చినాడు. ఫలములు పడుటచే గల్గిన శబ్దమును వినగానే ఖరరాక్షసుడు, పర్వత సహితమగు భూమి కంపించునంత వేగమున నచటికి పరువెత్తుకొని వచ్చె. గాడిద రూపమున నున్న యాధేనుకుడు తన రెండు వెనుక కాళ్ళతో బలుని బలముగ వక్షః స్థలమందు తన్నినాడు. భీకరముగ ఓండ్ర పెట్టుచు నావలకేగి మరల వచ్చి బలరాముని తన్నబోవను, బలరాముడు వాని రెండు వెనుక కాళ్ళను నేర్పుగానొడిసి పట్టి, యాకసమందు గిర గిర వానిని త్రిప్పి తాటిచెట్టునకేసి కొట్టె. అ రాక్షసుని పాటున కా మహాతాల వృక్షము విరిగి ప్రక్కనున్న తాటిచెట్టుపై పడినది. ఆ చెట్టు విరిగి ప్రక్కనున్న చెట్టుపై పడగా నది విరిగి యావలనున్న దానిపై పడినది. ఇట్లొకదానిపైనొకటి పడుచు నావనమందలి యనేక వృక్షములు నేలమట్టమై పోయి నవి.బలరాముడు లీలగా విసరిన ఖర దేహముచేననేక వృక్షములు నశించిపోయినవి. తుపాను గాలి తాకిడికి కంపించినట్లు, మిగిలిన చెట్లు గూడ కంపించి పోయినవి. భగవానుడగు బలరాముడు జగదీశ్వరుడు. వస్త్రము నందు దారముల వలె, యీ ప్రపంచమంతయు నతని యందు ఓతప్రోతమై యున్నది. అతనికి యిది యొక వింతయా! ధేనుకాసురుడంత మొందుట గాంచిన యాతని సహచరులందరు కోప ముతో మండిపడుచు పైకి రాగా, రామకృష్ణు లిర్వురు నవలీలగా వారిని హత మార్చిరి. వారందరు ఖరరూపులే గాన వారివెనుక కాళ్ళనుబట్టి తాడిచెట్లకేసి కొట్టు టచే మిగిలిన తాటిచెట్లు గూడ పడిపోయినవి. ఆ వనమంతయు తాటిపండ్లతోను, మరణించిన రాక్షస శరీరములతోను నిండిపోయినది. మేఘములచే నాకసము నిండి నట్లున్నది ఆ ప్రదేశము. రామకృష్ణుల యీ మహత్కార్యమును గాంచిన యమ రులు వారిపై పూలవాన గురియించిరి. ధేనుకాసురుడు మరణించిన నాటినుండి ప్రజలావనమును ప్రవేశించుచు నందలి ఫలముల ననుభవించుచుండిరి. ఆ విధము గనే పశువులు గూడ నా వనమందలి పచ్చికను స్వేచ్ఛగా మేయసాగినవి.

ఆ సాయంత్రము, పుండరీకాక్షుడు బలరామ సహితముగ వ్రజమునకు వచ్చు చుండ గోప బాలురందరు వారి ననుసరించి వచ్చుచు వారిని స్తుతించుచుండిరి. భగవ ల్లీలల కీర్తించుట, శ్రవణ మొనర్చుట యనునవి, మిగిలినయన్ని కృత్యముల కంటె పరమ పవిత్రములు గదా! ఆ సమయమందు గోవిందుని సుందరవదనారవిందము పై, గోధూళి ధూసరితములైన యలకలు, శిరమందు శిఖిపింఛము, కేశములందు

సుందర వన్య పుష్పములు, వింత శోభను వెలార్చుచున్నవి. నేత్రములందు సుందరకాంతి, పెదవులపై మనోహర దరహాసము కలిగి, మధుర మధురముగ మాధవుడు మురళి మ్రోగించుచుండ, గోపబాలలు రాతని కీర్తి గానము చేయు చుండిరి. వేణు నాదము చెవిని బడగనే, యనేక గోపికలు వ్రజము నుండి యొక్క మారు వెలుపలికి వచ్చిరి. వారి నేత్రము లెంత సేపటి నుండి శ్రీకృష్ణ దర్శనమునకై తహ తహ లాడుచున్నవో యెఱుగరాదు! ఆ గోపికలు తమ నేత్రములను మధు కరములచే మధుసూదనుని ముఖారవింద మందలి మకరంద రసమును పానమొనర్చి, పగలంతయు కృష్ణ విరహముచే కల్గిన తమతాపమును వశమింప జేసుకొనిరి. భగవానుడు గూడ సిగ్గుతో గూడిన వారి చిరునవ్వుతో, వినయయుక్తమగు ప్రేమ పూరిత కటాక్ష వీక్షణములతో, వారొనర్చిన సత్కారమును స్వీకరించుచు, వ్రజ మందు ప్రవేశ మొనర్చినాడు.

అచట యశోదా రోహిణులు గూడ, శ్యామ, రాము లిరువురు యింటికి చేర గనే, స్నేహ వాత్సల్యములుప్పొంగుచుండ, వారి కిష్టమైనట్టియు, సమయమునకను రూపమైనట్టియు, తాము చేసి యుంచిన పదార్థములను త్రాగించియు, తినిపించియు పిమ్మట వారిని చక్కగా నలంకరించిరి. వారిని చక్కగా స్నానము చేయించుటచే పగలంతయు వారు పడిన శ్రమయంతయు పోయినది. దివ్య వస్త్రముల దాల్చి, దివ్య గంధాను లేపముల నందుకొని, యా పైన తల్లులు వడ్డించిన స్వాదిష్టాన్నమును తృప్తిగా భుజించిరి. ఆ పైన తల్లులు వారిని బుజ్జగించుచు మెత్తని శయ్యలపై వారిని పరుండబెట్టి జోలపాడగా రామకృష్ణు లిర్వురు సుఖముగా నిదురించిరి.

శ్రీకృష్ణ భగవాను డీవిధముగ బృందావనమందనేక లీలలొనర్చు చుండె. ఒకనాడతడు తన సహచరులతో యమునా తటమునకేగె. ఆనాడు బలరాముడు వారితో వెళ్ళక యింటి యొద్దనే యుండె. అది గ్రీష్మ ఋతువగుటచే గోప బాలు రందరు సూర్య తాపమునకు తాళలేకుండిరి. దాహముచే గొంతు లార్చుకొనిపోవు చుండె. అందుచే వారాయమునా హ్రదము నందలి విషపూరితములగు జలములను త్రావిరి. దైవోపహతులగుటచే, ఆ జలములు విషయుక్తములను మాట వారు మఱచి పోయిరి. నీరు త్రాగిన వెంటనే వారును, గోవులు గూడ, యమునా తీరమునందు మృతులై పడిపోయిరి. అది గాంచిన మాధవుడు తన యమృత దృక్కులు వారిపై ప్రసరింపజేసి వారిని జీవితులగావించె. ఆ ప్రాణుల సర్వస్వము శ్రీకృష్ణుడే కదా! లేచి, వారు తాము విషాక్త జలమును గ్రోలి మరణించితిమనియు, కన్నయ్యయే తమను బ్రతికించెననియు గుర్తించిరి. వారానందాశ్చర్యములతో నొకరినొకరు చూచుకొనసాగిరి.

# పదునారవ యధ్యాయము

## కాళీయునిపై యనుగ్రహము

"రాజా, మహావిషధరుడగు * కాళీయసర్పము యమునానదీ జలములను విషదూషిత మొనర్చెనను విషయము గ్రహించిన శ్రీకృష్ణభగవానుడు, ఆ జలమును పరిశుద్ధ మొనర్చుటకై, యా కృష్ణసర్పము నచటి నుండి వెడలనడచెను" అని పలికిన శుకమహర్షితో పరీక్షిన్మహారాజిట్లు వచించె.

"యమునా నదీయగాధ జలములందున్న యా కాళియాహినెట్లు భగవానుడు శిక్షించె? కాళియసర్పము జలచరముకాదు. అట్టిదశలో ననేకయుగపర్యంత మాతడా జలములందేల నెట్లు వసింపగల్గె? మహాత్మా, భగవానుడనంతుడు. తన లీలల ప్రదర్శించుచు నతడు స్వచ్ఛంద విహారము చేయుచుండును. గోపాలరూపమున నతడొనర్చిన యుదారలీల యమృతప్రాయము. ఆ యమృతము నెంత త్రావినను తృప్తి యుండునా?" యని పలికిన రాజునకు శ్రీకృష్ణ డిట్లనియె.

"రాజా, కాళీయ సర్పము వసించుచున్నది యమునానది యందలి యొక మడుగు. అందలి జలము విషాగ్నిచేవనుడుకుచుండును. ఆ విషాగ్ని ప్రభావముచే యా మడుగుపై యాకసమందు విహరించు విహంగములుగూడ విగతాసువులై యందు బడుచుండును. ఆ మడుగునంచలి నీటితుంపరులు వాయువశమున పైకెగిరి తీరముందున్న వృక్షము , పశుపక్ష్యాదులపై బడిననవియు మండిపోవుచుండినవి. దుష్టుల శిక్షించుట కొరకేగదా భగవానుడవతరించినది. అందుచే కాళీయుని విష

---

* కాళీయుడు :— స్వాయంభువమన్వంతర కాలమున భృగువంశజుడగు వేదశిరుడను ముని వింధ్యపర్వతము నందాశ్రమము నిర్మించుకొని తపమొనర్చుచుండెను. అచటికి యశ్వశిరుడను మరియొక మునిరాగా, వేదశిరు డతనినిగాంచి "నాయనా, నా యాశ్రమమందు నీవు తపమొనర్చుటకు వీలులేదు. అది సుఖకరముగాదని" నివారింపగా, ఆగ్రహించిన యశ్వశిరుడు "ఈ భూమండలమంతయు శ్రీమన్నారాయణునిది. నీవు రోషముతో నన్ను వారించుచు బుసగొట్టుచుంటివిగాన సర్పజన్మమునందుము. గరుడుని వలన నీకు భయము కలుగుచుండుగాక" యని వేదశిరుని శపించె. అతడే కాళియుడుగా జన్మించె.

వేదశిరుడును, "నీవు కాకివై జన్మించుమ"ని యశ్వశిరునకు ప్రతి శాపము నొసంగగా, నతడు కాక భుశుండిగా జన్మించె. ముకుందుడు వారిర్వురిని యనుగ్రహించె. (గర్గ సంహిత)

మత్యంత భయంకరమై, తన విహార స్థానమైన యమునయొక్క జలములను విష కలుషితము లొనర్చెనని గ్రహించగనే, భగవానుడు తన కటివస్త్రమును బాగుగా బిగించి, తీరమందున్న కడిమిచెట్టు నధిరోహించి, భుజాస్ఫాలన మొనర్చి యచటి నుండి తటాలున మడుగునందు దుమికె. అంతకుముందే విషాగ్ని కీలలచే నుడుకు చున్న యా మడుగునందలి జలములు, శ్రీకృష్ణుడందు దుముకుటచే మరింత సంక్షుభితములై యువ్వెత్తున నెగసిపడినవి. అనంత బలవంతుడగు ననంతుని విషయమున నదియేమంత వింత? భగవానుడా జలములందు గజరాజువలె విహరించు చుండగా నాతని భుజతాడనములచే గొప్ప శబ్ద ముప్పొంగినది. ఆ శబ్దమునువిన్న కాళీయుడు, తన ధిక్కారమును సైపజాలక, కోపముతో శ్రీకృష్ణుని సమీపించె.

అతని యెదుట కనుపించినదొక శ్యామసుందర శరీరము గలిగిన బాలకుడు. వక్షఃస్థలమందు శ్రీవత్సలక్ష్మము. పీతవసనము, మధుర మనోహరమగు మోము నందు సుందరమందహాసములతో నత్యంతాకర్షణీయముగా నున్నదా రూపము. చరణములత్యంత కోమలములుగా నున్నవి. కొంచెమైనను భయములేక ఆ విషజలము లందు విహరించుచున్న యా బాలకుని గాంచిన కాళీయుని కోపమింకను పెచ్చరిల్లినది. అతని మర్మస్థానములందు కసిదీర కాటువేయుచు కాళీయ విషధరుడాతని నాగ పాశ బద్ధుని గావించినాడు. దానితో కన్నయ్య చేష్టలుడిగినట్లైపోయినాడు. అదిగాంచి తీరమందున్న గోపబాలురు మహాదుఃఖాక్రాంతులై, దుఃఖ, పశ్చాత్తాప భయములచే మూర్ఛితులై పృధివిపై పడిపోయిరి. ఏలననగా, శ్రీకృష్ణుడే వారి సర్వస్వము. ఆవులు, యెద్దులు, కోడెలు, పెయ్యలుగూడ దుఃఖముచే నరవసాగినవి. ఏడ్చు చున్నట్లే యుండినవి. వాని శరీరములుగూడ నిశ్చేష్టితములైపోయినవి.

అచట వ్రజమందుగూడ, భూమ్యాకాశ శరీరములందు మూడురకములైన భయంకరోత్పాతములుగల్గి, కన్నయ్యకు వచ్చిన విపత్తును సూచించినవి. ఏదోయొక యశుభము కల్గునని వారూహించుచుండ. నింతలో నందాదులు, బలరాముడులేకుండ శ్రీకృష్ణుడొక్కడే సహచరులతో గోవుల దోలుకొనిపోయెనని, యప్పుడు గ్రహించిరి. భయముచే వారు వ్యాకులము నందిరి. వారు భగవానుని ప్రభావము నెఱుగరు గదా! అందుచే వారాదుర్నిమిత్తములు శ్రీకృష్ణుని మృత్యుసూచకములుగా భావించిరి. శ్రీకృష్ణుడే వారికి ప్రాణము, మనస్సు సర్వస్వముగూడ నగుటచే వారు దుఃఖ, శోక, భయాక్రాంతులైపోయిరి. వ్రజమందలి బాలురు, వృద్ధులు, స్త్రీలు, సర్వులు గూడ గోవులవలె, వాత్సల్యపూరిత, సాధుస్వభావము గలవారు కృష్ణునకు విపత్తు కల్గియుండునను నాలోచన రాగానే, కన్నయ్యను చూడవలయునను నాతురతచే వారిండ్లు వాకిళ్ళనన్నిటిని వదలి, బయలుదేరిరి. బలరాముడు స్వయముగా భగవత్స్వరూపుడు, సర్వశక్తియుతుడు కాతరులై యాతురతతో నేగుచున్న వ్రజవాసుల

గాంచి యాతనికి నవ్వువచ్చినది. కాని యాతదేమియు పలుకక మౌనముగానుండె. ఏలననగా, నాతనికి శ్రీకృష్ణుని ప్రభావము బాగుగా దెలియును.

వ్రజవాసులందరు ముద్దు కృష్ణుని వెదకుచు పోవుచుండిరి. భగవానుని పాద చిహ్నములు నేలపై కనుపడుచుండినందున సులభముగనే మార్గమును కనుగొనుచు వారు యమునా తటమునకు చేరగలిగిరి. దూరము నుండియే వారికి కాళీయ సర్ప ముచే చుట్టబడి నిశ్చేష్టునివలెనున్న శ్రీకృష్ణుడగుపించినాడు. మడుగు తీరమందు గోప బాలురు చైతన్య రహితులై పడి యుండుటను, పశువులు గూడ నార్త స్వర మున నాక్రందనము చేయుట గూడ గానుపించినది. ఇంకేమున్నది? గోపాలురంద రత్యంత వ్యాకుల చిత్తులై మూర్ఛిల్లిరి. గోపికల హృదయములా భగవానుని యంద త్యంతానురిక్తములు. కన్నయ్య యొక్క నిత్య నిరంతర సౌహార్దము, మధుర మందహాసము, ప్రేమ భరితములగు చూపులు, తీయని పలుకులు, వారు స్మరించు కొనుచుండిరి. అట్టి తమ ప్రియతమ శ్యామసుందరుడు నాగపాశబద్ధుడై యుండుటను గాంచిన వారి హృదయములు దుఃఖతీప్తములైనవి తమ జీవన సర్వస్వమగు శ్రీకృష్ణుడు లేని ముల్లోకములు వారికి శూన్యములుగా గోచరించినవి. తల్లియగు యశోద తన తనయునితో పాటు తాను గూడ కాళియహ్రదయమందు దుమికెదనని బయలుదేర, గోపిక లామెను గట్టిగా పట్టుకొనిరి. వారి హృదయములందు గూడ నట్టి వేదనయే బాధించుచున్నది. అందరి కన్నుల నుండియు కన్నీటి వరదలు పారు చున్నవి. అందరి చూపులు శ్రీకృష్ణుని ముఖ కమలమునందే లగ్నమైయున్నవి. మూర్ఛనొందక చైతన్యముతో నున్నవారు, యశోద దగ్గర గూర్చుండి, శ్రీకృష్ణుని యైశ్వర్యలీలలగు పూతనా సంహారాది కథలను వర్ణించుచు నామె నోదార్చుచుండిరి. ధైర్యము కల్గించుచుండిరి. తమ ప్రాణమగు శ్రీకృష్ణుని కొరకు మడుగునందు దిగ బోవుచున్న నందాది గోపాలురను, శ్రీకృష్ణ ప్రభావము నెఱిగియున్న బలరాముడు సర్వవిధముల వారించుచుండె.

రాజా, సర్ప శరీరముచే బద్ధుడగుట గూడ భగవానుని యొక్క లీలయేగాని వేరు గాదు. వ్రజమండలి యాబాల గోపాలము తన కొఱకై యత్యంత దుఃఖితులై యుండుటను, తనకంటె వారికి వేఱుగతి లేకుండుటను గుర్తించగనే, భగవానుడు ముహూర్తకాలము మాత్రము సర్పబంధమందున్నవాడై, యనంతరము బంధము నుండి విడివడియె....శ్యాముడు తన శరీరమును స్థూల తరముచేయుటచే, సర్పరాజ శరీరము విరగజొచ్చినది. అందుచే నతడు బంధమును వదలి దూరము తొలగె. కాని క్రోధ వశమున సమయము దొఱకగనే కొట్టుటకై పడగలెత్తి సంసిద్ధుడై యుండె. ఆ సమయమందతని నోళ్ళనుండి విషజ్వాలలు వెడలుచుండినవి. అతని నేత్రములు కొఱకంపులవలె నెట్టగా కణకణలాడుచుండినవి. నాలుకలతో తన దౌడల నాకుచు విషము గ్రక్కుచు శ్రీకృష్ణుని కాటు వేయుటకై చూచుచున్న కాళీయునితో,

తన వాహనమగు గరుడుని వలె భగవానుకాడుచుండె. సర్పము గూడ నతనిని దెబ్బ గొట్టుటకై కదము ద్రొక్కుచుండె. సర్పము యొక్క బలము క్షీణ దశకు వచ్చినది. భగవానుడు సర్పఫణాగ్రములపై లంఘించినాడు. ఆ ఫణాగ్రములందున్న మణి కాంతుల స్పర్శచే, సహజమణి కాంతులు గల్గిన భగవానుని పాద తలములు మఱింత యరుణ కాంతిని సంతరించుకొనినవి. నృత్యగానాది సమస్త కళలకాది ప్రవర్తకుడైన శ్రీకృష్ణ భగవానుడా కాళీయుని శిరస్సులపై కళాపూర్ణమగు నృత్యం చేయనారంభించె. ఆ నృత్యమున కాకర్షితులైన భగవానుని భక్తులగు సిద్ధచారణ గంధర్వాది దేవతలు, దేవాంగనలును, మహా ప్రేమతో, మృదంగ పణవానకాది వాద్య విశేషములతో నంద నందనుని నాట్యమున కనుగుణముగ వాయించజొచ్చిరి. సుందర గీతముల గానము చేసిరి. పుష్పోపహారములర్పించుకొని భగవానుని సేవించుచుండిరి.

రాజా, కాళీయునికి నూటొక్క శిరములుండినవి. అందే శిరము తలయెత్తిన (తలవంచదో) ఆ శిరమును భగవానుడు తన నాట్య ప్రక్రియయందు ద్రొక్కుచుండె. దానిచే కాళీయుని జీవితాశ యడుగంటినది. ముక్కు రంధ్రముల నుండి నోటినుండి రుధిరము కార జొచ్చినది. తల దిరుగ జొచ్చినది. చైతన్య విహీనుడైనాడు. తల యెత్తిన ప్రతి శిరము నణగద్రొక్కుచు భగవానుడు నాట్యము చేయుచుండగా, కాళీయుని ముఖమునుండి వెలువడిన రక్తబిందువు లాతని పాదములపై బడినవి. అవి కాళీయుడు భగవానుని పాదములను రక్త పుష్పములతో పూజించినట్లుండె. భగవానుని యీ తాండవ నృత్యముచే కాళీయుని పడగల రూపముతో నున్న ఛత్రము చిన్నాభిన్నమైనది. అతని సర్వావయవములు శిథిలములైనవి. నోటి నుండి రక్తము స్రవించుచుండె. సమస్త చరాచర గురువును పురాణపురుషుడునగు నారాయణుని స్మృతి కలిగినది. మనము నందే కాళియు డాతని శరణు జొచ్చినాడు.

రాజా, భగవానుని యుదరమందు విశ్వమంతయు నుండుటచేత ఆ మహా భారముచే నాతని ఫణాతపత్రము చిన్నాభిన్నమగుటను గాంచిన కాళీయుని భార్యలు, భగవానుని శరణు వేడిరి. తమ పతి యొక్క దీనావస్థను గాంచి వారమిత భయము చెందిరి. ఆ వ్యాకులతచే వారి వస్త్రాభరణముల స్తవ్యస్తములై పోయినవి. కేశబంధము లూడి పోయినవి. తమ పిల్లలను ముందుంచుకొని, తమ శరీరములను భూమిపైబడవైచి, చేతులు జోడించి సర్వభూతపతియగు పరాత్పరునకు వారు వందన మాచరించిరి. శ్రీకృష్ణ భగవానుడు శరణాగత వత్సలుడని తెలుసుకొని, యతని కపరాధ మొనర్చిన తమ ప్రాణపతిని విడిపించుకొనదలచినవారై, నాగపత్నులు భగవానునీ రీతి వినుతించిరి.

"ప్రభూ, నీయీ యవతారము దుష్టుల శిక్షించుటకొఱకేగాన, యీయపరాధిని దండించుట సర్వధాయుచితమే యగును. నీ దృష్టిలో శత్రువులు, పుత్రులునను బేద భావమేమియు లేదు. కావున నీ వెవరినైన దండించినచో నది వారి పాపములకు ప్రాయశ్చిత్తము గావించి వారిని పునీతులగావించుట కొరకే యగును. నీవు మాపై పరమానుగ్రహము జూపినావు. దుష్టులను దండించుటచే వారి పాపములు నశించి పోవునుగాన అది నీయనుగ్రహమే యగును. ఈ నాగరాజపరాధి యనుటలో నెట్టి సందేహమును లేదు. అతడపరాధియే గానిచో ఈ సర్పజన్మ యతని కేల కలుగును? కాన నీవాతనిపై జూపిన కోపము నీయనుగ్రహమేయని మేము నిండు హృదయముతో నంగీకరించుచున్నాము.

పూర్వజన్మ యందీతడు నిరభిమానియై యితరుల సమ్మానించుచు మహా తపస్సేదియో తప్పక చేసి యుండియుండును. లేక సర్వభూతములయందు దయగలవాడై గొప్ప ధర్మమేదియో చేసి యుండును. అందుచే నీవాతనిపై సంతుష్టి చెంది యుందువు. ఏలననగా సర్వజీవ స్వరూపుడవగు నీ యనుగ్రహము సంపాదించు సాధనమదియేగదా!

నీ పాదరజస్పర్శ కలుగు యోగ్యత ఈతనికే సాధనయొక్క ఫలముగా లభించినదో మాకంతుపట్టుటలేదు. నీ పాద కమల పరాగము లభించుట యెంత దుర్లభమనగా, దానికొఱకై, నీ యర్ధాంగి యగు లక్ష్మీదేవి గూడ సర్వభోగముల త్యజించి, నియమముల పాలించుచు ననేక దినములు కఠిన తపస్సాచరింపవలసి వచ్చినది.

ప్రభూ, నీ చరణ ధూళిని శరణొందిన భక్తులు, స్వర్గరాజ్యపదవినిగాని, భూమి సామ్రాజ్య పదవిని గాని వాంఛించరు. రసాతలాధి పత్యమును గాని బ్రహ్మ పదవి పొందుటగాని వాంఛించరు. అణిమాద్యష్ట సిద్ధులు వారికక్కరలేదు. అంతే గాదు, జన్మమృత్యు జరారూప సంసార నివర్తకమగు మోక్షమును గూడ వారు నిరాకరించెదరు!

స్వామీ, ఈ నాగరాజు జన్మ తమోగుణము నుండి పుట్టినది. అత్యంత క్రోధమతని స్వభావము. అయినప్పటికిని, అన్యదుర్లభమగు నీ పాదధూళి యాతనికి లభ్యమైనది. ఆ నీ పాదరజమును పొందవలెనను యిచ్ఛ కలిగినంత మాత్రము చేతనే, సంసార చక్రమందు పరిభ్రమించుచుండు జీవులు సంసార భోగములనుభవించుటయేగాదు, మోక్షమును గూడ పొందెదరు.

ప్రభూ, మేము నీకు ప్రణమిల్లుచున్నాము. నీవందరి యంతః కరణములందున్నను అనంతుడవు. అనంతైశ్వర్యములకు నిత్యనిధివి. సమస్త భూతాశ్రయుడవు. పరాత్పరుడవు. పరమాత్మవు.

జ్ఞాన విజ్ఞానములకు నిధివి నీవు. నీ మహిమ, శక్తి యనంతములు. నిర్గుణుడవు. నిర్వికారుడవు. అప్రాకృతమగు దివ్య చిన్మయ స్వరూపము నీది. అట్టి నీకు నమస్కారము

నీవు కాలస్వరూపుడవు. కాలశక్తి కాశ్రయుడవు. కాలావయవములకు సాక్షివి నీవు. విశ్వము నీ రూపమేయైనను విశ్వమునకు సాక్షివియు నీవే. విశ్వమునకు నిమిత్తోపాదాన కారణములు రెండును నీవే.

పంచభూతములు, తన్మాత్రలు, యింద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధి, చిత్తములు సర్వము నీవే. త్రిగుణములు, వాని కార్యములందలి యభిమానము ద్వారా నీవు నీ సాక్షాత్కారమును దాచియుంచితివి.

నీవు దేశకాల వస్తుపరిచ్ఛిన్నత లేని యనంతుడవు. సూక్ష్మాతి సూక్ష్ముడవు. వికారరహితుడవు. (కూటస్థుడవు) సర్వజ్ఞుడవు. వివిధ వాదముల కనుకూలముగ దర్శనమొసంగువాడవు. శబ్దార్థ స్వరూపుడవు నీవే. వాటి సమన్వయ శక్తియు నీవే. అట్టి నీకు నమస్కరించుచుంటిమి.

ప్రత్యక్ష, అనుమానాది సర్వ ప్రమాణములకు మూలము నీవే. సమస్త శాస్త్రములు నీనుండియే వెడలినవి. నీ జ్ఞానము స్వతస్సిద్ధము ప్రవృత్తి, నివృత్తి మార్గములు రెండును నీవే. వాటికి మూలమగు వేదములుగూడ నీ స్వరూపములే. నీకు పునఃపునః ప్రణామములు.

వసుదేవతనయుడగు వాసుదేవుడవు నీవే సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధ స్వరూపములన్నియు నీవే. ఈ చతుర్వ్యూహ రూపమున భక్తులకు, యాదవులకు స్వామివై యున్న నీకు నమస్కారము.

అంతఃకరణమును. దాని వృత్తులను ప్రకాశింపజేయువాడవు నీవు. వాని ద్వారానే నిన్ను నీవు గోప్యముగా నుంచుకొందువు. ఆయంతఃకరణవృత్తుల చేతనే యుపలక్షింపబడుచుందువు. నీవాగుణములకు సాక్షివిగను, స్వయంప్రకాశుడవుగను యుందువు. నీకు నమస్కారము.

నీవు మూలప్రకృతి యందు విహరించుచుందువు. సమస్త వ్యాకృతియు (స్థూల సూక్ష్మజగత్తంతయు) నీనుండే కలుగుచున్నది. నీవు మునివి. (మనన శీలుడవు)। మౌనివి. నీకు మా నమస్కారములు.

నీవు స్థూల సూక్ష్మగతులన్నియు తెలిసినవాడవు. సాక్షివి. ఈ నామ రూపాత్మకమగు విశ్వప్రపంచ నిషేధమున కవధివి. అధిష్ఠానమగుటచే విశ్వరూపుడవు గూడ నీవే. అధ్యాసకు, అపవాదమునకు గూడ సాక్షివి నీవే. అధ్యాసయనగా అజ్ఞానముచే ప్రపంచ సత్యత్వభ్రాంతి కలుగుటకును, స్వరూప జ్ఞానముచే ఆభ్రాంతి పోవుటకును కారణము నీవే యగుచున్నావు. నీకు నమస్కారము.

కర్తృత్వము లేనందున నీవు నిష్క్రియుడవైనను, అనాదియగు కాలశక్తిని స్వీకరించి, ప్రకృతి యొక్క గుణముల ద్వారా నీవు ఈ విశ్వమును సృజించుట, లయింపజేయుటయను లీలను చేయుచుందువు. నీ లీలల మోఘములు నీవు సత్య సంకల్పుడవు. అందుచే జీవులయందు సంస్కార రూపమున దాగియున్న స్వభావములను నీ దృష్టిచే ప్రచోదన చేయుచుందువు.

ముల్లోకముల యందును, మూడు రకములైన రూపములున్నవి. సత్త్వ గుణప్రధానములైన శాంత స్వరూపములు, రజోగుణ ప్రధానములైన యశాంత స్వరూపములు, తమోగుణ ప్రధానములైన మూఢ రూపములు. అవి యన్నియు నీ లీలరూపములే. అయినను ఈ సమయమందు సత్త్వగుణ ప్రధానులగు శాంత మూర్తులే నీకు ప్రియులు ఏలననగా ఈ నీ యవతారము లీలలు అన్నియు సాధు జనులను ధర్మమును రక్షించుటకును, విస్తరించుటకే గదా! ప్రభువగువాడు తన ప్రజలయొక్క యపరాధమును సహించవలయును. ఇతడు మూఢుడు నీ ప్రభావము నెఱుగడు. కావున యితనిని క్షమింపుము దయాసాగరా, యితనిపై దయజూపుము. ఇతడు మరణాసన్నుడై యున్నాడు. సాధు పురుషులెప్పుడును మావంటి యబలలపై దయ జూపుచుందురు. కావున. మాకు ప్రాణస్వరూపుడగు పతిదేవుని మాకు ప్రసాదింపుము. మేము నీ దాసీలము మేము నీకేమి సేవచేయవలయునో మమ్మాజ్ఞాపింపుము. ఎందుకనగా, యెవరు శ్రద్ధతో నీయాజ్ఞలను పాలించుచు నీ సేవగావించెదరో వారు, సర్వభయములనుండియు విముక్తులయ్యెదరు." అని నాగపత్నులు వినుతించిరి.

"రాజా, భగవానుని పదాఘాతములచే కాళీయుని పడగలు శిథిలములైపోయినవి. అతనికి స్మృతి దప్పుచున్నది. నాగపత్ను ప్రార్థనకు సంతుష్టుడైన భగవానుడు దయతలచి, నాగరాజును వదలినాడు. నెమ్మదిగా నతని యింద్రియములు ప్రాణములు చేతసత్వమునందినవి. మహాకష్టముతో నూపిరిపీల్చుచు, కొంతసేపయిన పిమ్మట చేతులు జోడించి, దీనముగా భగవానునితో నిట్లు పలికె."

"ప్రభూ, మేము జన్మచేతనే దుష్టులము. తమోగుణము గలవారము. చాల దినములు గతించిన పిమ్మట గూడ పగదీర్చుకొను స్వభావము గలవారము జీవులకు తమ స్వభావములను విడచుట మహాకష్టము. ఆ కారణముచేతనే లోకమందు జనులనేక విధములగు దురాగ్రహములందుచగుల్కొనియుందురు. విశ్వవిధాతా, నీ గుణములయందలి భేదముననుసరించియే యీ జగత్తునందు నానాప్రకారములగు, స్వభావ, వీర్య, బల, యోని, బీజ, చిత్త, ఆకారముల నిర్మాణము జరుగుచున్నది. అట్టి నీ సృష్టియందలిదే మా సర్పజాతిగూడ జన్మచేతనే మేము క్రోధస్వభావము గలిగియుందుము. ఈమాయ నమ్ము చాల మోహింపజేయుచుందును. అదిదుస్త్యజము

దానిని మేమెట్లతిక్రమింప గల్గుదుము? నీవు సర్వజ్ఞుడవు సర్వజగత్తునకు స్వామివి. ఈమాయకు, మా స్వభావమునకు కారణము నీవేగదా! అనుగ్రహించెదవో, నిగ్రహించెదవో, నీ యిచ్ఛవచ్చినట్లు, యేదియుక్తమని తోచిన నట్లుచేయుము."

అని కాళీయుడు వచించిన దానికి, భగవానుడిట్లు సమాధానమొసంగె. "ఓ సర్పమా! ఇక నీవిచట నుండరాదు. నీ భార్యలు పుత్రులు, బంధు బలగములందరిని వెంట బెట్టుకొని, యిచటి నుండి సముద్రమునకు వెడలి పొమ్ము. ఇకనుంచి యీ యమునా హ్రదమునందలి జలమును, మనుజులు, ఆవులు మొదలగు పశువులు అనుభవించెదరుగాక. నీకు నేనిచ్చిన యీ యాజ్ఞను స్మరించినను, కీర్తించినను జనులకు సర్ప భయముండకుండుగాక! నేనీ కాళీయ మడుగునందు క్రీడించితినిగాన, యే మానవుడు యీ జలమునందు స్నానమొనర్చి దేవపితరులకు తర్పణమొనర్చి నన్ను స్మరించుచు నన్నారాధించునో, వాడు సర్వ పాపముల నుండియు విముక్తుడగును. నీవు గరుడుని భయము చేత రమణక ద్వీపము వదలి ఈ మడుగునందు తలదాచుకొంటివని నేనెఱుగుదును. నేడు నీ పడగలపై నా పాద చిహ్నములేర్పడి యుండుటచే, సువర్ణుడు నిన్ను భక్షించకుండును" అని భగవానుడనియె.

"రాజా, శ్రీకృష్ణుని ప్రతి యొక్క లీలయు అద్భుతముగనే యుండును. గోవిందుని యాజ్ఞానుసారము, కాళీయుడు తన దార పుత్రాదుల నందరి వెంట నిడుకొని మహానందముతో నత్యాదరముగ భగవానుని పూజించినాడు. దివ్యవస్త్రములు, పుష్ప మాలలు, మణులు, దివ్యాభరణములు, గంధాదులచే నర్చించి, అత్యుత్తమమగు పద్మమాలను సమర్పించి స్వామి యనుగ్రహమును పొందినవాడై, యతనికి ముమ్మారు ప్రదక్షిణ గావించి నమస్కరించి. యతని యనుమతి బడసినాడు. అటు పిమ్మట, తన వారందరితో గూడ, సముద్రమందు సర్పములకావాస స్థానమగు రమణక ద్వీపమునకు వెడలి పోయినాడు.

లీలా మానవ బాలకుడైన గోపాలదేవుని కృప వలన యమునాహ్రదమునందలి జలములు, విషహీనములగుటయే గాదు, అమృతముతో సమానమగు మాధుర్యముగలవిగా గూడ నైనవి.

# పదునేడవ యధ్యాయము

## కాళీయుడు కాళియహ్రదమునకు వచ్చిన కారణము
## భగవానుడు వ్రజవాసులను దావాగ్ని నుండి కాపాడుట

పరీక్షిన్మహారాజు శ్రీ శుకయోగితో నిట్లు పల్కె. "మహాత్మా, నాగుల నివాసమగు రమణక ద్వీపమును వదలి కాళీయుడు యమున యందలి మడుగున కేల వచ్చె? అతడొక్కనిచేతనే గరుడునకేమి యపరాధ మొనర్పబడినది?" అని యడిగిన రాజుతో శుక యోగి యిట్లు వచించె.

"పూర్వకాలమందు గరుడున కాహార రూపములగు సర్పములన్నియు సమావేశమై, ప్రతి మాసమునందును, నొక నిర్దిష్ట వృక్షము క్రింద వంతుల ప్రకారము గరుడునకు సర్పోపహారము సమర్పింపబడునని యొక యొడంబడిక గరుడునితో జేసుకున్నవి. ఆ ప్రకారమే తమ రక్షణకై ప్రతి యమావాస్యనాడు తమ భాగము నా గరుడునికవి సమర్పించుకొనుచుండె. * ఆ సర్పములలో నొకడగు కద్రూపుత్రుడగు కాళీయుడా నియమము నుల్లంఘించి, తన విష బలాధిక్యతచే గర్వించినవాడై, గరుడునకు తనవంతు సర్ప బలి నీయకపోగా, అతని కుద్దేశించిన నైవేద్యములను తానే భక్షించె. ఇది విని, భగవానుని ప్రియపార్షదుడగు గరుడునికి మహా క్రోధము కల్గినది. అతడు మహాశక్తి శాలి. కాళీయుని కడతేర్చుటకై యతడు మహా వేగముగ నతనిపై దాడి యొనర్చినాడు. కాళీయుడును తన నూటొక్క పడగలను విప్పి గరుడుని కాటు వేయుటకై విరుచుకు పడినాడు. అతని ముఖ్యాయుధములతని కోరలేగదా అందుచేత నా కోరలచే గరుడుని కాటు వేసినాడు. నాలుక జాచుచు, విషాగ్ని నిశ్వాసములు వదలుచు అగ్ని గోళముల వంటి కన్నులు గలిగిన కాళీయుని యాకారమప్పుడు మహా భయంకరముగ నున్నది. విష్ణు భగవానుని వాహనమగు గరుడుని వేగము, పరాక్రమములు అతులితములు. కాళీయుని మొండితన మతని క్రోధము నినుమడింపజేసినది కాళీయుని విదిలించి తన ఱెక్కచే నతనిని గాయపరిచినాడు గరుడుడు. ఆ దెబ్బకు భీతిల్లిన కాళీయుడు డచటి నుండి పరుగెత్తి యీ యమునా కుండమందు తలదాచుకొనియె. ఇచటికి గరుడుడు రాజాలడు. పైగా యిది

---

* గరుడుని తల్లి వినతకు సర్ప మాతయగు కద్రువకు వైరము. ఆ వైరమును పురస్కరించుకొని, చిక్కిన పాము నెల్ల గరుడుడు భక్షించుచుండె అందుచే వ్యాకులమందిన సర్పములు బ్రహ్మను శరణు వేడినవి. అప్పుడు బ్రహ్మయే, ప్రతి యమావాస్యనాడు ఒక్కొక్క సర్ప కుటుంబము వారు (వంతులవారీగా) గరుడున కొక సర్పమును బలిగా యిచ్చు నట్లొక నియమమేర్పరచియుండె.

చాల లోతైన మడుగగుటచే యితరులెవరును, నచటికి పోజాలరు. ఇచట నొకనాడు క్షుధాతురుడైన గరుడుడు, సౌభరి మహాముని వారించుచున్నను లక్ష్యపెట్టక, యా మడుగునందలి మత్స్యములను భక్షించివైచె అచటి మీనముల కధిపతియైన మత్స్య రాజు గరుడునిచే భక్షింపబడుటచే, మీనములన్నియు మిక్కిలి కష్టపడినవి. వాని దుఃఖమును గాంచిన, దయాపరుడగు సౌభరి మహర్షికి జాలి కలిగి, యా మడుగు నందున్న జలచరములన్నిటి క్షేమమును కోరినవాడై. "యిక ముందెప్పుడైనను గరుడుడీ మడుగునందలి మత్స్యముల భక్షించినచో, నతని ప్రాణము పోవును. ఇది సత్యమ"ని. గరుడునకు శాపమొసంగెను. ఆ మహర్షి యొక్క ఈ శాపమొక్క కాళీయునకే తెలియునుగాని యితర సర్పములకు దెలియదు. అందుచే, గరుడునికి భీతిల్లిన కాళీయుడిందు వసించుచుండె. నేడు శ్రీకృష్ణుడాతని భయము పోగొట్టి, యతనిని మరల రమణక ద్వీపమునకు బంపె.

"రాజా, కాళీయహ్రదమునుండి, శ్రీకృష్ణుడు దివ్యమాల్యాంబరధారియై, అమూల్యాభరణములదాల్చి, దివ్యసౌందర్యముతో నొప్పారుచు, వెలుపలకు వచ్చి నాడు. అతనిని గాంచుటతోడనే, తీరమందు వ్రజవాసులందరును, నొక్కమారుగా, ప్రాణములు తిరిగిరాగా యింద్రియములు చైతన్యవంతములైనను, లేచి నిలబడి నారు. వారి యందరి హృదయములానంద పరిపూరితములైనవి. ప్రేమానందభరి తులై వారాకన్నయ్య నాలింగన మొనర్చుకొనిరి. నందయశోదలు, రోహిణీదేవి, గోపీగోపకులందరును శ్రీకృష్ణునిపొంది చైతన్యముగలవారైరి. వారి మనోరథము సఫలమైనది. బలరామునికి భగవానుని ప్రభావము తెలిసియేయున్నదిగాన, యతడు సోదరునాలింగనమొనర్చి నవ్వుదొడగినాడు. పర్వతములు, వృక్షములు, పశువులు మొదలగునవన్నియు నానంద సంభరితములైనవి. గోపాలుర కులగురువులగు బ్రాహ్మణులు సపత్నీకముగావచ్చి నందరాజుతో, "నందరాజా, నీ పిల్లవాడు కాళీయ సర్పముచే చుట్టబడినవాడై, యదృష్టవశమున సజీవముగా తిరిగివచ్చినాడు. అతడు మృత్యుముఖమునుండి క్షేమముగా తిరిగివచ్చిన యీ శుభసమయమున బ్రాహ్మణులకు దానములు చేయుము" అని పలికిరి. వారి మాటలకు సంతసించిన

---

* అగ్నిపానము :

1. నేను సర్వులదాహమును దూరమొనర్చుటకై యవతరించినాడను. కావున యీ దాహమును దూరమొనర్చుటయు నా కర్తవ్యమే.

2. రామావతారమందగ్ని దేవుడు నా భార్యయగు జానకిని రక్షించి నాకుప కార మొనర్చియుండె. ఇప్పుడు నేనాతనిని నా ముఖమందుంచుకొని యతనికి సత్కార మొనర్చుట నా కర్తవ్యము.

నందరాజు అటులనే యనేక గోవులను, సువర్ణములను దాన మొసంగినాడు. పరమ సౌభాగ్యవతియగు యశోదాదేవియు, మృత్యుగ్రస్తుడై తిరిగి క్షేమముగ వచ్చిన తన యుని యొడిలోనుంచుకొని, హృదయమునకు హత్తుకొన్నది. ఆమె నేత్రములనుండి యానందాశ్రువులు మాటిమాటికి రాలజొచ్చినవి.

రాజా, యీ సంఘటనలో, పశువులు, వ్రతవాసులందరును, శారీరకముగను మానసికముగగూడ చాల నలసియుండిరి. పైగా క్షుత్పిపాసార్తులై యుండిరి. అందుచే వారు తమ యిండ్లకేగు శక్తిలేక, యా తీరమందే నిదురించిరి.

అది యెండాకాలము. ఆ సమీపమందలి ముంజవనముబాగుగానెండియున్నది. అర్ధరాత్రి సమయమందావనము నందగ్ని యంటుకొన్నది ఆ యగ్ని నిదురించు చున్న వ్రజవాసులను నాల్గువైపులనుండి చుట్టుముట్టినది. ఆ వేడిమికి వ్రజవాసులంద రులికిపడిలేచిరి. ఎటుపోవుటకును దిక్కుతోచక, శ్రీకృష్ణభగవానుని శరణుజొచ్చిరి.

"కృష్ణా, కృష్ణా, శ్యామసుందరా, బలరామా, మీరిరువురి బలవిక్రమముల నంతములు చూడుడు. ఈ భయంకర దావాగ్ని మీ వారమగు మమ్మందరిని రక్ష శింపజూచుచున్నది. మీరు సర్వసమర్థులు. మేము మీ వారము కావున యీ కాలాగ్నినుండి కరుణించి మమ్ముగాపాడుడు. ప్రభూ, మేము చావునకు భయపడుట లేదు. కాని భయరహితములగు నీ చరణ కమలముల వీడుటకశక్తులమైయున్నాము" అని దీనముగ విన్నవించుకొనిరి. తమవారందరా విధముగా వ్యాకులపడుచుండుటను గాంచిన నందనందనుడగు గోవిందుడు, ఆ భయంకరాగ్నినంతను త్రాగివైచినాడు.*

# పదునేనిమిదవ యధ్యాయము

## ప్రలంబాసుర మోక్షము

"దావాగ్ని మోచనానంతరము, తనవారందరితో గలసి గోవిందుడు గోకుల మును జేరినాడు. అందరును శ్రీకృష్ణుని కీర్తిని గానముచేయుచుండిరి. ఈ ప్రకా రము, యోగమాయచే గోపాలబాలరూపమున రామ, శ్యాములిరువురును గోకుల మందు క్రీడించుచుండిరి. అది గ్రీష్మఋతువు సాధారణముగ శరీరధారులకా ఋతు వంతప్రియకరముగా నుండదు. కాని బృందావనమందలి స్వాభావిక గుణములచేనది యచట వసంతఋతుశోభతో విరాజిల్లుచున్నది. దానికి కారణము, పరమ మాధుర్య స్వరూపులగు బలరామకృష్ణ భగవాను లిర్వురచట వసించుటయే. గిరినిర్ఝరముల శబ్దములలో కీచురాళ్ళధ్వనులణగిపోయి యుండును. ఆ ప్రవాహములనుండి లేచిన తుంపురులచే సిక్తములై వృక్షములు పచ్చగాచూచుట కందముగా నున్నవి. ఎచ్చట జూచినను పచ్చని పచ్చికచే పృథివి పచ్చగానున్నది. చల్లని పిల్లవాయువులు వీచు చున్నవి. చక్కగా వికసించిన పద్మపరాగముచే వాయువు సువాసన వెదజల్లుచున్నవి.

అందుచే నచట గ్రీష్మ తాపముచే బాధపడు నవసరమే లేకుండె దావాగ్ని తాపము గాని సూర్య తాపముగాని యచట లేవు నదుల యందు జలము సమృద్ధిగా నున్నది. నదీతీర పులినములు స్వచ్ఛముగను, నదీ తరంగ శీకరములచే చల్లగను నుండి, ఆనందమును గల్గించుచుండినవి. వనమందలి వృక్షములన్నియు పుష్ప సంభరిత ములై యుండి సౌందర్య చిహ్నితములై యుండినవి. రంగు రంగుల పక్షులు, రకరకముల హరిణములు గంతులు వేయుచున్నవి. మయూరములొకచో నృత్యము చేయుచుండ, మధుకరములు వేఱొకచో మధురమంజుల నినాదములు చేయుచున్నవి. కోకిలలొకచో కలనాదము లొనర్చుచుండ, సారసము లొకచో నాలపించుచున్నవి. అట్టి సుందరవనమందు శ్యామసుందర, గౌరసుందరులిర్వురును విహరించవలయునని వాంఛించిరి. గోవులు ముందేగుచుండ వెనుక గోపబాలురను గమనించుచుండ మధ్య భాగమందగ్రజ సహితుడై శ్రీకృష్ణుడు మధురముగ వేణు నాదమొనర్చుచు పోవుచుండె.

రామకృష్ణులు, గోపబాలురు నవపల్లవ గుచ్ఛములతోనూ, నెమలి పింఛముల తోను, రంగు రంగుల ధాతువులతో చిత్రముగ నలంకరించుకొని యుండిరి. ఆనంద మగ్నులై కొందరు నాట్యమొనర్చుచుండిరి. కొందరు దానికనుగుణముగ తాళము వేయుచుండిరి. కొందరు కుస్తీలు పట్టుచుండిరి. కొందరు రాగాలాపన చేయు చుండిరి. శ్రీకృష్ణుడు నాట్యము ప్రారంభించినప్పుడు, కొందరు వేణువును, కొందరు కొమ్ము బూరల నూదుచుండిరి. కొందరు చేతులతో తాళము వేయుచుండ కొందరు ప్రశంసావాక్యములు పల్కుచుండిరి. నటులు తమ నాయకుని ప్రశం సించు విధమున గోపాల బాల రూపమున ప్రతిచ్ఛన్నులై దేవతలు రామ కృష్ణులను ప్రశంసించుచుండిరి. అలకసుందరులైన యా రామకృష్ణు లొకప్పుడొకరి చేతులొకరు బట్టుకొని కుమ్మరి సారెవలె గిరగిర దిరుగుచుండిరి. రెండుదళములుగా నేర్పడి త్రాడులాగుట (Tuy of war)కు స్తీలు పట్టుట, మొదలగు వివిధ రకములగు నాటలను, గోపబాలురందరు నాడుచుండిరి. గోపబాలురు నాట్య మొనర్చునపుడు రామకృష్ణులు వేణువు మొదలగునవివాయించుచు ప్రశంసలు పల్కుచుండిరి. ఒకప్పుడు బిల్వ ఫలములు మొదలగు వానిని విసరుచు బంతులాడుచుండిరి. దాగుడు మూతలాడుచుండిరి. పశు పక్షుల చేష్టల ననుక రించుచుండిరి. కప్పదాట్లు వేయుచుండిరి. చెట్లకు తాళ్ళు గట్టిఊయల లూగుచుండిరి. బలరామకృష్ణు లీవిధముగ గోపబాలురతో వివిధములగు బాల్య వినోద క్రీడ లొనర్చుచుండిరి.

ఒకనాడు రామకృష్ణులు తమ సహచరులతో గలసి గోవులగాచుచుండగా, ప్రలంబుడను పేరుగల రక్కసుడొకడు గొల్లపిల్లవాని రూపమున వారిలో చేరినాడు. వాని యుద్దేశము బలరామ కృష్ణుల నపహరించుకొని పోవుటయే. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు గదా! వానిని చూడగనే వాని సంకల్పము గ్రహించినాడు. అయినను వాని మిత్రత్వమును స్వీకరించినాడు. వీనినే యుపాయముతో వధించుటయా యని యాలోచించుచుండె. గొల్లపిల్లలలో ఆటల యందు నేర్పరియు, ఆటలకాచార్యుడును శ్రీకృష్ణుడే కావున పిల్లలందరి నొక చోటికి బిలిచి వారితో నిట్లు పలికె "మిత్రులారా, మనమీనాటి యాటలో రెండు వర్గములుగా విడి పోవుదము. ఒకదానికి నేను, రెండవ దానికి మా అన్న బలరాముడు నాయకులుగ నుండెదము.ఆనందముగా నాడుకొందము. ఆటలయందోడినవారు గెల్చిన వారిని తమ భుజములపై కెత్తుకొని నిర్దిష్ట స్థానమునకు మోసుకొని పోవలయును." అని యీ విధమగు వాహ్యావాహక లక్షణములు గల యాటల నాడుకొనుచు భాండీరకమను వటవృక్షము దరికి జేరినారందరు. ఒకమారు, బలరాముని దళమందలి సుదాముడు వృషభుడు మొదలగు వారందరును గెలువగా, శ్రీకృష్ణ వర్గమువారు వారిని మోయుచుండిరి. ఓడిపోయిన శ్రీకృష్ణుని సుదాముడు తన మూపుపైనను, భద్రసేనుడు వృషభుని మోయుచుండగా ప్రలంబుడు బలరాముని తనపై కెత్తుకొని వేగముగా పరుగెత్తె వాడెక్కువ దూరము పరుగెత్తకముందే వాని వేగము మందగించినది. అందుచే వాడు తన దైత్య రూపము దాల్చినాడు. వాని నల్లని శరీరముపై బంగారు భూషణములు ప్రకాశించుచుండె. బలరాముడాతనిపై నుండుట చేత, నల్లని మేఘము చంద్రుని ధరించి యున్నట్టి వింత శోభ వెలుగుచుండె. అతని నిడుపగు కోరలు, అగ్ని

---

*** ప్రలంబాసురుడు :**

ఇతడు హూహూ నామ గంధర్వుని తనయుడు. పేరు విజయుడు. కుబేరుడు శివ పూజకు కావలసిన పుష్పముల కొరకై పుష్పవాటికల నేర్పరచి, వాటి రక్షణకై కాపలావారి నుంచినాడు, అట్లొనర్చినను గూడ పుష్పవనములందలి పూలు మాయమగుచుండుటచేత కుబేరుడు, తన యనుమతి లేనిదే పూవులు దొంగిలించువారు వెంటనే భూలోకమున రాక్షసులై జన్మించెదరని శాప మొసంగె. ఈ శాప విషయము తెలియని విజయుడు, దైవ సంకీర్తన చేయుచు వనమునకు వచ్చి పూవు కోయగా నతనికి రాక్షసత్వము సంప్రాప్తించినది. అతడు కుబేరుని శరణు వేడగా నతడు, "వత్సా, నీవు విష్ణు భక్తుడవు. చింతింపవలదు. ద్వాపరాంతమున యమునా తీరమందలి భాండీర వనమున, శ్రీబలరాముని చేతిలో నీకు ముక్తి లభించగలద"ని నుడివినాడు. అతడె ప్రలంబాసురుడు.

(గర్గ సంహిత)

శిఖలవలె నున్న వెంట్రుకలు భయము గలిగించుచుండె. అట్టి భయంకర రూపు డైన దైత్యుడమిత వేగమున నాకాశ మార్గమున తనను గొని పోవుచుండగా, బల రాముడు కొంచెము వ్యాకుల పడినట్లుండిపోయె. దొంగవలె తనను వాడెత్తుకొని పోవుచుండినట్లు బలరాముడు గ్రహించినాడు. బలరామునకు కోపము వచ్చినది. ఇంద్రుడు పూర్వము పర్వతములపై వజ్రాయుధమును ప్రయోగించినట్లు, పిడికిలి బిగించి వాని శిరముపై నొక గ్రుద్దు గుద్దినాడు. దానితో వాని శిరము భగ్నము కాగా, నెత్తురు గ్రక్కుకొనుచు, యింద్రుని వజ్రఘాతముచే క్రిందపడిన పర్వతము వలె నేలపైబడియె.

బలరాముడు మహాబలవంతుడు. అతడు ప్రలంబాసురుని వధించుట గాంచిన గోపబాలురు మహాశ్చర్య చకితులయినారు. వారతని ననేక విధముల ప్రశంసించిరి. గొల్లపిల్లల యుల్లములు ప్రేమ విహ్వలములైనవి. రాముడు మృత్యు ముఖము నుండి తప్పించుకొని వచ్చినట్లు భావించి వారందరతనికి శుభకామానలందిచ్చిరి. ఆలింగనము లొనర్చిరి. వాస్తవమునకు బలరాముడట్టి ప్రశంసల కర్హుడే గదా! ప్రలంబాసురుడు మూర్తీభవించిన పాపము. వాడు చచ్చుటచే దేవతలు గూడ మహానంద భరితులైరి. బలరామునిపై పుష్పవృష్టి గురిపించుచు, దేవతలు సాధు వాక్యములు పల్కుచు నతనిని సంమానించిరి.

# పందొమ్మిదవ యధ్యాయము

## గోగోపులను దావాగ్ని నుండి రక్షించుట

గోపబాలకులాటలయందు మునిగిపోయి యుండగా, వారి యావులు యెట్టి యాటంకము లేకుండ స్వేచ్ఛగా పచ్చిక మేయుచు, గడ్డియందలి యాశచే, కీకా రణ్యమును ప్రవేశించినవి. వారి మేకలు, ఆవులు, మహిషములు నన్నియు నొక వనము నుండి మరియొక వనమునకు బోవుచు చాలదూరమేగినవి. ఎండాకాల మగుటచే తాపముకల్గి, గొంతులార్చుకొనిపోవ నఱచుచు, నంతమందు ముంజాటవిని ప్రవేశించినవి. తమ పశువులన్నియు కనుపడకుండపోవుట నప్పుడు గ్రహించిన రామకృష్ణాదులు తమ యాటలపై పశ్చాత్తాపము గల్గినవారై, యటునిటు పశువులకై వెదుకసాగిరి. కాని వాని జాడ దెలియరాలేదు. వ్రజవాసులకు గోవులే జీవనా ధారము. అట్టి గోవులు కనపడకపోవుటచే వార చేతనులవలె నైపోయిరి. గోవుల యడుగుజాడలను, అవి కొరికిన పచ్చిక గుర్తులను బట్టి వెదకుచు గోపబాలురు ముందుకు సాగినారు. చివరకు, తమ పశువులన్నియు ముంజాట విని ప్రవేశించి, దారితప్పి యఱచుచున్నట్లు కనుగొనినారు. వారందు ప్రవేశించి, పశువులను మర లించు ప్రయత్నము చేయదొడగిరి. ఆ సమయమందందరు నలసిపోయియుండిరి. మహాదాహమగుచుండినది వ్యాకులపాటు కలిగినది. వారి యీ దురవస్థ గాంచిన

దామోదరుడు, పేరుపేరున నెలుగెత్తి పశువుల బిలువసాగినాడు. తమ నామములు వినుటతోడనే వానికి మహానందము కలిగినది. ప్రత్యుత్తర మిచ్చుచున్న విధమున నవియును హుంకారములు, అంభారవములు చేయదొడగినవి.

భగవానుడిట్లు తమ పశువులను బిలచుచున్న సమయమందే యకస్మాత్తుగ దావాగ్ని దరికొనినది. వన్యప్రాణులకది కాలాగ్నివంటిది. దానికితోడు గాలి చుమారము చెలరేగినది. అనిలుని సాయముచే ననలుడు విజృంభించి నలుదిక్కుల చెలరేగినాడు. జ్వాలలాకసమంటుచుండె. చరాచర జీవరాసులన్నియు ప్రచండాగ్నియందు భస్మీభూతములగుచున్నవి. అన్ని వైపులనుండియు తమ నాక్రమించిన దావాగ్నిని గాంచిన, పశువులు పశుపాలకులు నత్యంత భయభీతులయిరి మరణ భయగ్రస్తుడైనవాడు మధుసూదనుని స్మరించునట్లు, గోపబాలురందరు రామకృష్ణులకు శరణాగతులై వారిని పిలచుచు నిట్లరవసాగిరి. "మహావిక్రమా, బలరామా మహావీరా శ్రీకృష్ణా, మేము మీకు శరణాగతులము ఈ దావానలము మమ్ము దహింపదలచుచున్నది చూడుడు. మమ్మందరిని దీనినుండి రక్షించుడు. కృష్ణా, మేము నీవారము. నీవే మా సర్వస్వము. అట్టిమేమిట్లు న్యాయముగ నగ్ని కాహుతి యగుట యుక్తముగాదు. శ్యామసుందరా, నీవు సర్వ ధర్మములు తెలిసినవాడవు. మాకేకైక రక్షకుడవు నీవు. నీవే మాకు పరమగతి" అని యాక్రోశించుచున్న గోపబాలుర యాక్రందనల విన్న భగవానుడు వారితో నిట్లు పల్కె.

"భయపడవలదు. మీరందరొక్క పర్యాయము కనులు మూసుకొనుడ"ని పలుకగా, తమ ప్రభువాజ్ఞను పాటించి వారందరు కనులు మూసుకొనిరి. మహా యోగేశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుడు అభయంకరాగ్నిని త్రాగివైచె *

---

* 1. శ్రీకృష్ణ భగవానుడు భక్తులు తన కర్పించు ప్రేమ-భక్తియను సుధారసమును పానము చేయును. అగ్నిదేవుడా సుధారసమును రుచిచూడవలయునను కోరికతో స్వయముగ భగవానుని ముఖమును ప్రవేశించినాడు.

2. విషాగ్ని, ముంజాగ్ని, దావాగ్ని యను మూడగ్నులను పానమొనర్చి, భగవానుడు, తాపత్రయమును శాంతింపజేయునట్టి తన శక్తిని వ్యక్తమొనర్చె.

3. మొదటిసారి రాత్రి యందగ్నిపానమొనర్చినాడు రెండవ పర్యాయము పగటి యందు చేసినాడు. తన భక్తుల తాపమును పోగొట్టుటకు భగవానుడెప్పుడును సిద్ధముగనే యుండును.

4. మొదటిమారు అందరు చూచుచుండగనే శ్రీకృష్ణుడగ్నిని పానమొనర్చినాడు. రెండవమారు అందరును కనులు మూసుకొనిన పిదప పానము చేసినాడు. దీని భావమేమనగా, భగవానుడు (పరోక్ష, అపరోక్ష) రెండు విధములుగను భక్తులకు హితము కల్గించునని యర్థము.

ఆ విధముగా భగవానుడు వారందరిని యగ్ని సంకటము నుండి సంరక్షించె. గోపబాలురు కన్నులు దెఱచి చూడగా తామందరు భాండీరవట సమీపమందుండిరి. తమకు, తమ పశువులకు నెట్టి యాపదయు గలుగకుండ, దావానలము నుండి రక్షించిన యా దామోదరుని దివ్యశక్తికి వారు మిక్కిలి యక్కజపడిరి. శ్రీకృష్ణుని, దేవతా స్వరూపునిగ వారు భావించిరి.

సాయంకాలము కాగానే బలరామ సహితముగ శ్రీకృష్ణుడు వేణుగానము చేయుచు, గోవుల దోలుకొని వ్రజమును ప్రవేశించినాడు. ఆ సమయమందు గోప బాలురందరు నతనిని నుతించుచు వచ్చుచుండిరి అక్కడ వ్రజమందు గోపికలు శ్రీకృష్ణుడు లేని యొక్కొక్క క్షణము నూరు యుగములతో సమానముగ దోచు చుండెడిది. భగవానుడెప్పుడు వనము నుండి తిరిగి వచ్చునో యప్పుడు వారు పరమానంద మగ్నులగుచుండెడివారు.

# ఇరువదియవ యధ్యాయము

## వర్ష, శరదృతు-వర్ణనము

గోపబాలురు తమ యిండ్లకు చేరిన పిదప, తమ తమ తల్లులు, సోదరీలు మొదలగు స్త్రీలతో, రామకృష్ణులొనర్చిన ప్రలంబాసురవధ, దావాగ్నిపానము మొద లగు నద్భుత లీలలను వర్ణించుచు చెప్పిరి. అయలౌకిక లీలలను విని గోపీగోపకు లందరత్యంత విస్మితులైరి. రామకృష్ణులు సామాన్యులు గారనియు, యెవరో గొప్ప దేవతలే యా రూపములలో వ్రజమునకు వేంచేసి యుందురని, వారనుకొనజొచ్చిరి.

వర్షఋతువు ప్రారంభమైనది. ఈ ఋతువునందు సమస్తప్రాణుల యభివృద్ధి జరుగుచుండును. చంద్ర సూర్యమండలములకు పరివేషణము (వరదగూడు) లేర్పడు చుండును. మేఘములు, ఉరుములు, మెఱుపులు మొదలగువానిచే నాకసముక్షుభితమైనట్లు గాన్పించుచుండును. చంద్ర, సూర్య మండలములు మేఘాచ్ఛాదితములగుచుండును. అప్పుడాకాశము, తాను బ్రహ్మ స్వరూపమేయైనను, గుణములచే చెప్పబడిన జీవుని వలెనుండును. సూర్యభగవానుడు రాజువలె పృథివీ రూపమగు ప్రజలనుండి యెనిమిది నెలల పర్యంతము జలరూపమగు పన్నును వసూలుజేసి, యిపుడు సమయమురాగా, తన కిరణములను కరముల ద్వారా ఆ జలమును ప్రజలకు పంచుచున్నట్లుండినది. దయాస్వభావముగల పురుషుడు, ప్రజలు దుఃఖపీడితులుగా గన్పించినప్పుడు, వారి కొరకై తన జీవన ప్రాణములను సైతము త్యాగము చేయు విధముగా, విద్యుత్తుచే ప్రకాశించు నీలమేఘములు, తీవ్రవాయువుచే ప్రేరితములై, ప్రాణులకు శుభము

కల్గించుటకై జీవన స్వరూపములగు జలములను వర్షించుచున్నవి. జ్యేష్ఠాషాఢ మాసములందలి వేడిచే భూమియంతయు నెండిపోయి యున్నది. ఇప్పుడు వర్షములు పడుటచే మరల పచ్చదనమును సంతరించుకొన్నది. అది యెట్లున్నదనగా, సకామముగ తపస్సు చేయుటచే మొదట శుష్కించిపోయిన శరీరము. ఆ తపస్సుకు ఫలము సిద్ధించిన యనంతరము పుష్టిని పొందినట్లున్నది. సాయంకాల మందాకాశము మేఘావృతముకాగా చంద్ర నక్షత్రములయొక్క ప్రకాశమంతరించి యంధకారమలముకొనినను, ఖద్యోతములు మాత్రము మెరయుచున్నవి. అది యెట్లుండెననగా, కలియుగమందు పాపము ప్రబలినందున, పాషండ మతములకు బహుళ ప్రచారము లభించి, వైదిక సంప్రదాయములు లుప్తమైనట్లు గాన్పించుచుండె. ఇంతవరకు మౌనముగానున్న కప్పలు. మేఘగర్జనములు వినిపించగనే బెకబెకలాడుచుండుట నిత్యనియమానుష్ఠానముల పూర్తి గావించుకొనిన బ్రహ్మచారులు, గుర్వాదేశానుసారము స్వరయుక్తముగ వేదము పఠించుచున్నట్లున్నది. జ్యేష్ఠాషాఢ మాసములయందు పూర్తిగా నెండిపోయిన చిన్న చిన్న నదులు, యిపుడు వరదలతో పొంగిపొరలుచు తమ పరిధుల నతిక్రమించి ప్రవహించుట జూడగా, యింద్రియ నిగ్రహములేని పురుషుడు, తన యైశ్వర్యమును, శరీరమును, చెడు మార్గములందు ప్రవర్తింపజేయునట్లుండె పచ్చని పచ్చికతో భూమి యొకప్రక్క పచ్చగానుండగా, యింద్రగోపపురుగులచే రక్తకాంతితోను, పుట్టగొడుగులతో తెలుపుగను, పృథివి రంగు రంగుల కాంతితో ప్రకాశించుచున్నది. అవి మహారాజు నొద్దనుండు వివిధ రంగుల సైన్యమువలె శోభాయమానముగ నున్నవి. క్షేత్రము లన్నియు సస్య సమృద్ధములై కృషీవలులకు ముదము చేకూర్చుచున్నవి. సర్వము దైవాధీనమును జ్ఞానములేని ధనికులకది యుపతాపము కల్గించుచున్నది. (వీరెట్లు మనకు వశులగుదురాయని) తొలకరి వర్షసేవనముచేత జలచర స్థలచర ప్రాణుల యొక్క సౌందర్యము వృద్ధి చెందినది. అది, భగవానుని సేవించుటచే గల్గు బాహ్యాభ్యంతర సౌందర్యములు వృద్ధి బొందునటుల యున్నది. వర్షాకాలమందు గాలి తాకిడిచే నువ్వెత్తుగ లేచు తరంగములు గల్గియున్న సముద్రము వరదలతో హద్దులు మీరి ప్రవహించుచు తనలో లీనమగుచున్న నదులచే మఱింత క్షుబ్ధమగుచున్నది. అది యెట్లున్నదనగా, వాసనా మయమగు యోగి [అపక్వచిత్తముగల] యొక్క చిత్తము, విషయ సంపర్కము కలిగినచో కామనలచే మరింత కలత చెందునట్లున్నది. అధోక్షజుని యందే తమ చిత్తమును లగ్నమొనర్చిన వారెట్టి దుఃఖములు వచ్చినను చలింపకుండునట్లు, మూసల ధారలతో గురియుచున్న వర్షములకు పర్వతలేమియు చలించుటలేదు. బ్రాహ్మణులు వేదములనభ్యసింపక యుండుచో కాలక్రమమునవారు వానిని మరచిపోవునట్లు, యెన్నడును శుభ్రము చేయకున్న యట్టిబాటలు గడ్డిచే గప్పబడిపోయి, గుర్తుపట్టుటకు గూడ వీలులేకుండా

పోయినవి. చపల చిత్తముగల కాముకురాలగు స్త్రీ గుణవంతుడగు పురుషుని సమీప మందు గూడ స్థిరభావముతో నుండని విధమున, వర్జన్యుడు లోకమునకు మహోప కారియైనను చపలలగు విద్యుత్కాంత అతనివద్ద స్థిరముగా నుండుటలేదు. ఆకాశము మేఘగర్జనలతో నిండియున్నది. అట్టి గుణసహితమైన యాకాశమునందు, గుణ (అల్లెత్రాడు) రహితమైనయింద్రధనుస్సు, సత్త్వరజస్తమో గుణములచే క్షోభిల్లు విశ్వమందు నిర్గుణ బ్రహ్మవలె, గుణము కలబానివలె శోభిల్లుచున్నది. పురుషా భావముచే భాసితమగు అహంకారమే పురుషుని కప్పివైచి, ప్రకాశింపకుండ చేయు విధమున, చంద్రకాంతిచేతనే తెలియబడుచున్న మేఘములే చంద్రుని గప్పివైచి, యతనిని శోభావిహీనునిగ చేయుచున్నవి. గృహ సంబంధమగు జంజాటములో చిక్కుబడియున్న జనులు, తాపత్రయములచే పీడితులగుచు నుండి, భగవద్భక్తుల యాగమనముచే వానంద మగ్నులైనట్లు, మేఘముల శుభాగమనముచే నెమళ్ళయొక్క రోమ రోమములు ప్రఫుల్లములై పోవనవి పురివిప్పి యాడుటద్వారా తను యానం దోత్సవమును సల్పుకొనుచున్నవి. మనసునందు కోరికలుంచుకొని తపస్సులు చేయు వారు మొదట బలము క్షీణించినవారై పోయినను, పిమ్మట తమ తపఃఫలములు లభించగా బలము పుంజుకున్నట్లు, జ్యేష్ఠాషాఢ మాసములందు యెండిపోయిన తరుగుల్మలతాదులు, తమ పాదముల(వ్రేళ్ళ) చే నీటిని పీల్చుకొని, పత్ర పుష్పా దులచే నిపుడలంకృతములగుచున్నవి.

అపరిశుద్ధమనస్కులగు విషయలోలురగు పురుషులేవిధమున గృహసంబంధ విషయములందశాంతితో బాధపడుచుండియు గృహములందే పడియుందురో, ఆ విధ ముగనే, చెఱువుల తీరములు బురద, కంటకములతో నిండియున్నను, ప్రవాహ జలముచే కల్లోలితములై యున్నను, సారసములు (బెగ్గురుపక్షులు) సరస్సులను వదలి వెళ్ళుటలేదు.

కలియుగమందు పాషండమతస్థుల యొక్క రకరకములగు మిథ్యావాదము లచే వైదికమార్గమర్యాద లతిక్రమింపబడినట్లు, యింద్రప్రేరణచే కుంభవృష్టి గురి యగా, నదులయొక్కయు పొలములయొక్కయు గట్లు తెగిపోయినవి.

బ్రాహ్మణుల యొక్క ప్రేరణచే ధనవంతులు దానములొసంగుట ద్వారా ప్రజల కోరికల దీర్చుచుండునట్లు, వాయుప్రేరణచే మేఘములు ప్రాణులకొరకై యమృతమయమగు జలమును వర్షించుచు ప్రజలకభీష్ట సిద్ధికల్గించుచున్నవి.

వర్షఋతువునందు బృందావన మీ విధముగ శోభాయమానమై యున్నది. పండిన ఖర్జూరములు, నేరేడు పండ్లతో వనము నిండియున్నది. అట్టి యా సుందర బృందావనమందు విహరించుటకై, బలరామకృష్ణులు తమ సహచరులందరితో నా వనమందు ప్రవేశించిరి. ధేనువులు తమ పొదుగుల బృహద్భారముచే మందమంద ముగ నడచుచున్నవి. భగవానుడు తనను పేర్లు బెట్టి పిలిచినపుడవి వేగమును

పెంచుచున్నవి. అప్పుడు వాటి పొదుగుల నుండి పాలు స్రవింపదొడగినవి. అడవి యందలి భిల్లదంపతులానందమున్ముగ్ధులగుచున్నారు. వృక్ష పంక్తులు మధుధారల స్రవించుచున్నవి. పర్వతములపై నుండి సెలయేరులు గంగల ప్రవహించుచున్నవి. వాని శబ్దము మధురముగ నున్నది.వర్షము వచ్చినప్పుడు తలదాచు కొనుటకు పర్వతముల యందు గుహలు గూడ నున్నవి. వర్షము గురియునప్పుడు భగవానుడు, వృక్షముల క్రిందనో చెట్టు తొర్రలలోనో, లేక గుహలయందో కూర్చుండి కంద మూల ఫలాదుల తినుచుండును ఒక్కొక్కపుడు జలాశయముల ప్రక్క శిలలపై గూర్చుండి తన వారందరితో గూడి, యిండ్ల వద్దనుండి తెచ్చుకున్న దధ్యన్నాదుల నాహరించుచుండును. పశువులన్నియు తృప్తిగా పచ్చిక మేసి, శాద్వల ప్రదేశము లందు విశ్రమించి, యర్ధనిమీలిత నేత్రములతో, నెమరువేయుచున్నవి. అట్టి వర్షఋతు సౌందర్య మపారము ప్రాణులందరికి సుఖము చేకూరుచుండును. అది యంతయు భగవానుని లీలా విలాసమేయైనను, భగవానుడు దానిని గాంచుచు ప్రసన్నుడై, మాటి మాటికి ప్రశంసించుచుండె.

ఈ విధముగా, రామకృష్ణులు మహానందముతో బృందావన వ్రజభూమి యందు సుఖముగ నివసించుచుండిరి వర్షఋతువు గతించి శరదృతువు ప్రారంభ మైనది. ఆకసమందు మేఘములు తొలగిపోయినవి. జలాశయములందలి నీరు పరిశుభ్రమైనవి. వాయువుమందముగ వీచుచున్నది. నీరజోత్పత్తిచే నీరములు తమ సహజస్వచ్ఛతనుపొందెనవి. అది యెట్లున్నదనగా, యోగభ్రష్టులైనవారి చిత్తములు మరల యోగసాధనలు చేయుటచే నిర్మలత్వమును పొందినట్లున్నది. వ్యోమాదులు యందలిమలమును శరదృతువు. భగవానుని భక్తి నాలుగాశ్రమముల వారి కష్టము లను, అశుభములను హరించునట్లు, అపహరించినది. గుర్వర్థమై బ్రహ్మచారులు చేయు కుంభములతో నీటినిమోయుటయను శ్రమను భక్తి హరించినట్లు (నీరు సమృద్ధిగానుండుటచేత) ఆకసమందలి మేఘమునుమలమును శరత్తు హరించినది. గృహస్థులకుగల యపత్యాది సాంకర్యమును భక్తిహరించునట్లు, వర్షాకాలమందలి మాతసాంకర్యమును శరత్తు హరించినవి. వానప్రస్థుల మలధార క్లేశమును భక్తి హరించునట్లు భూమియందలి పంకమును శరత్తు హరించినది. యతీశ్వరులయందు కామాదివాసనలను శ్రీకృష్ణ భక్తిహరించునట్లు, నీటియందలి మలమును శరత్తు హరించినది. ఇహలోక పరలోకములయొక్కయు, స్త్రీ పుత్ర ధన సంపత్తులకు సంబంధించినట్టియు చింతలను, కోరికలను పరిత్యాగ మొనర్చుటచేత, సంసార బంధనములన్నిటిని వదల్చుకొని పరమశాంతుడైన సన్యాసివలె, తనసర్వస్వ జల మును దానమొనర్చిన మేఘముడుజ్జ్వలకాంతితో శోభాయమానముగ ప్రకాశించుచున్నాడు.

జ్ఞానులైన పురుషులు కొన్ని సమయములందు యోగ్యులైనవారికి తను యమృతమయమగు జ్ఞానమునుపదేశించుచు, కొందరు కుపదేశింపక నుండునట్లు,

పర్వతములయందలి వాగులు కొన్నిచోట్ల తమ నీటిని ప్రవహింపజేయుచు మరి కొన్నిచోట్ల ప్రవహింపజేయకయునున్నవి.

కుటుంబపోషణయందు మునిగి మూఢుడైయున్న మానవుడు, తనయాయుర్దాయము క్షణక్షణము తఱిగిపోవుచున్నదను విషయము మరచినవాడై యుండునట్లు, చిన్నచిన్న నీటిగుంటలయందున్న జలచరములు, ఆ గుంటలయందలి నీరు దినదిన మెండిపోవుచున్నదను విషయమును గుర్తించుటలేదు.

తన యింద్రియములకు వశుడైయుండు లోభి అటులే దరిద్రుడగు కుటుంబినులను, రకరకములైన తాపములు తపింపచేయుచుండునట్లు, కొద్దినీరుగల మడుగులందున్న ప్రాణులును శరత్కాలమందలి సూర్యకిరణములు తపింపజేయుచున్నవి.

వివేకము పొందిన సాధకుడు అనాత్మ పదార్థములగు శరీరాదులయందు అహంకార మమకారములను వదలివేయునట్లు, భూమి తన బురదను, ఆకులలము తమ యపరిశుభ్రతను వదలివేయుచున్నది.

మనస్సు సంకల్ప రహితమైన పిమ్మట, ఆత్మారాముడగు పురుషుడు కర్మకాండను వదలి శాంతుడై యుండునట్లు, శరదృతువునందు సముద్రము నందలి జలము, స్థిరముగా శాంత గంభీరముగా నున్నది.

కృషీవలులు తమ పొలములందు నీరావలకు పోకుండునట్లు గట్లను గట్టి చేయుచుండిరి. అది యెట్లుండినన, యోగి జనులు తమ యింద్రియములను విషయములపై పోకుండునట్లొనర్చి, ప్రత్యాహారము గావించి, వాటి ద్వారా క్షీణించిపోవునట్టి జ్ఞానమును రక్షించుకొనుచున్నట్లున్నది.

శరత్కాలమందు పగటి వేళ యెండ యెక్కువగా నుండి జీవులకు కష్టము కలిగినను, రాత్రులందు చంద్రుడు వారి తాపమును హరించుచుండును. అది,దేహాభిమానముచే కలుగు దుఃఖమును, భగవద్విరహముచే గోపికలు కలుగు సుఖమును శ్రీకృష్ణ చంద్రుడు పోగొట్టుచున్నట్లున్నది.

వేదముల యర్థమును స్పష్టముగా గుర్తించిన సత్త్వగుణ యుక్తచిత్తము అత్యంత శోభాయమానమై యుండునట్లు, శరత్కాల మందలి రాత్రులందు, మేఘ నిర్ముక్తమైన యాకాశము నక్షత్ర కాంతిచే ప్రకాశమానముగ నున్నది. యాదవ వంశమందు యదుపతియగు నందనందనుడు భూతలమున ప్రకాశించుచున్నట్లే, యాకసమందు తారకల నడుమ చంద్రుడు విరాజిల్లుచుండె. పుష్ప సుగంధసంభరితమగు సమశీతోష్ణ వాయువులు, మందమందముగా వీచుచుండినవి. ఆ వాయు స్పర్శచే ప్రాణుల తాపములన్నియు నుపశమించుచున్నవి గాని గోపికల తాపములు మాత్రముపశమించుట లేదు. ఏలననగా వారి చిత్తములు శ్రీకృష్ణుడపహరించి

యుండెగాన. వారి తాపము వృద్ధి చెందుచుండె. శరత్కాలమందు గోవులు, హరిణములు, పక్షులు, ఋతుమతులగు స్త్రీలు, సంతాన కాంక్ష గలవారై యుండుటచే గావున ఆయా జాతులయందలి మగవారు వారి ననుసరించుచుండిరి. అది యే విధముగా నుండెననగా, సమర్థులగు పురుషుల ద్వారా చేయబడు క్రియల యొక్క యనుసరణము వాటి ఫలితము లొసంగునట్లుండినది. రాజు వచ్చుటచే దొంగలు తప్ప మిగిలిన జనులందరు నిర్భయులై యుండునట్లు, సూర్యోదయము కాగానే, కలువలు తప్ప మిగిలిన యన్ని రకములైన కమలములు వికసించినవి. పట్టణమునందు పల్లెలందు గూడ, నవాన్నప్రాశన (ఆగ్రయణ) సంబంధమగులగు వైదిక కర్మలకు, యింద్రియ సంబంధములగు లౌకిక కర్మలకు సంబంధించిన మహోత్సవములు మొదలైనవి (ప్రారంభమైనవి) సాధనయందు సిద్ధిగాంచిన పురుషుడు, యథాకాలమందు దేవతాది శరీరములను పొందినట్లు వర్షాకాలమంతయు కదలకుండనుండిన, వ్యాపారులు, సన్యాసులు, రాజులు, స్నాతకులు, అందరు తమ యభీష్ట కార్యము లందు ప్రవర్తిల్లిరి.

# ఇరువదియొకటవ యధ్యాయము

## వేణు గీతము

శ్రీశుకయోగి పరీక్షన్మహారాజుతో నిట్లు చెప్పదొడగె.

"రాజా, శరదృతువు వచ్చుటచే బృందావనశోభ యినుమడించినది. జలము నిర్మలమైనది. జలాశయములందు వికసించియున్న కమలముల సుగంధముచే నిండిన శీతలవాయువులు మందమందముగా వీచుచుండినవి. గోపాలురతోడ గోవిందుడు విహరించుటకై బృందావనమును ప్రవేశించినాడు. సుందరపుష్పములచే నిండియున్న పచ్చని వృక్షపంక్తుల యందచ్చటచ్చట మధుపములు మధురముగా ఝుంకారము లొనర్చుచున్నవి. వివిధరకములగు విహంగములు కలకలధ్వనులు చేయుచున్నవి. ఆ ధ్వనులచేత నా వనమందలి సరోవరములు, నదులు, పర్వతములన్నియు ప్రతిధ్వనించుచున్నవి.

అట్టి మనోహర బృందావనమును, బలరామునితోను, గోపబాలురతోను ప్రవేశించిన గోవిందుడు గోవులమేపుచు, నత్యంత మధురముగ వేణుగాన మొనర్చినాడు. శ్రీకృష్ణుని యావేణుగీతము, భగవానునిపై ప్రేమ భావమును, భగవానుని కలుసుకొనవలయునను కోరికను, పెంపొందించునదిగ నుండె. (ఆ వేణుగీతమాలించియే గోపికల హృదయములు, ప్రేమసంభరితములై పోయినవి) గోపికలందరొకచోటచేరి యేకాంతమునందు తమచెలులతో, రామకృష్ణుల రూపగుణములను, వేణునాద

ప్రభావమును వర్ణించుచుండిరి. గోపికలు తమలోతాము వంశీధ్వనియొక్క మాధు ర్యమును వర్ణింపగోరుటయే తడవుగ, వంశీస్మరణముచేతనే, వారికి గోవిందుని చేష్టలయొక్కయు, ప్రేమాపాంగ వీక్షణములయొక్కయు, కనుసైగలు మధుర మందహాసాదులయొక్కయు జ్ఞాపకములు స్మృతిపథమందు కదలాడినవి. భగవా నుని కలుసుకొనవలయుననెడి యాకాంక్ష మఱింతవృద్ధియైనది. మనసు వశము తప్పినది. మనసునందే వారు శ్రీకృష్ణుని చేరిరి. ఇకవారి మాటలాగిపోయినవి. వర్ణించు సమర్థతలేకుండ బోయినది. (మనసునందే వారు శ్రీకృష్ణుని గాంచు చుండిరి)

శ్లో॥ బర్హాపీడం నట వరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీంచ మాలాం
రంధ్రాన్వేణోరధర సుధయా పూరయన్ గోప బృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీత కీర్తిః

శ్రీకృష్ణుడు గోపబాల సహితముగ బృందావనమందు ప్రవేశించుచున్నాడు. శిరమందు నెమలి పించము, కర్ణములందు కర్ణికార (కొండగోగు) పుష్పములు శరీరముపై బంగారు వర్ణముగల పీతాంబరము, కంఠము నందు పంచవిధ సుగంధ పుష్పములతో గూర్చిన వైజయంతీమాల. రంగస్థలముపై యభినయ మొనర్చు చున్న నట శ్రేష్ఠునివలెనున్న యా సుందర వేష మెంత యద్భుతముగా నున్నది! తన యధరామృతముచే వేణు రంధ్రములను పూరించుచున్నాడు. అతని వెనుక గోప బాలురు, లోక పావనమగు నతని కీర్తిని గానమొనర్చుచుండిరి. ఈ ప్రకారముగ వైకుంఠముకంటెను శ్రేష్ఠమగు బృందావనము అతని (భగవానుని) చరణ చిహ్న ములచే నింకను రమణీయాకృతిని దాల్చిన ఈ వేణునాదము సమస్త భూతముల మానసములను హరించినది. గోపికలా వేణుగీతము నాలించినారు. విని, యింకను వర్ణింపసాగినారు. వర్ణించుచు,వర్ణించుచు తన్మయత్వము నందినారు. మనసునందే శ్రీకృష్ణు నాలింగనము చేసుకొనిరి.

గోపికలు తమలో తామిట్లు మాట్లాడుకొనుచుండిరి. "చెలి. మనము కన్నులు గలవారము. కన్నులున్నందుకు యింతకంటె ఫలము మనకేమియు తెలియదు. ఆ లాభమెట్టిది? అది యిదియే. శ్యామసుందరుడగు శ్రీకృష్ణుడును, గౌరసుందరు డగు బలరాముడును, గోవులను దోలుకొనుచు నడవికి బోవునపుడును, మరల వానిని వ్రజమునకు తీసుకొని వచ్చునపుడును, తమ యధరములపై మధురముగ మురళిని మ్రోగించుచు, క్రీగంటి చూపులు మనపై ప్రసరించు చున్నపుడు, వారి ముగ్ధమనోహర ముఖ మాధుర్యమును పానమొనర్చుటయే కనులున్నందుకు ప్రయో జనము! నవదూత పల్లవములు (మామిడి చిగురులు) నెమలి పించములు, పుష్ప

గుచ్ఛములు, రంగురంగుల కమలములు, కలువలు ధరించియున్నారు. శ్రీకృష్ణుని నీలశ్యామల దేహముపై పీతాంబరము, బలరాముని గౌర సుందర శరీరముపై నీలాంబరము ప్రకాశించుచుండ, వారి వేషము అత్యంత విచిత్రములుగ నుండును. నటశ్రేష్ఠులిరువురు నాట్యరంగ స్థలముపై నభినయ మొనర్చుచున్నట్లుండును. వారు గోపబాలుర మధ్య యందు గూర్చుండి మధురముగ గానము చేయునప్పుడు, చెలులారా, యీ వేణువు పురుష జాతికి చెందినదైనను పూర్వజన్మయందెట్టి గొప్ప సాధన యొనర్చెనో గదా! నేడు గోపికల సంపత్తియైన దామోదరుని యధరామృతము నంతయును—మనకు కొంచెమైనను మిగల్చకుండ-తానే ఈ ప్రకారము సమస్తము త్రాగి వైచుచున్నది! ఆ వేణువును తమ జలములతో పోషించిన హ్రదములు, తమయందు వికసించియున్న కమలముల మిషతో, రోమాంచితములైనట్లు హర్షమును ప్రకటించుచున్నవి. తమ వంశమందు భగవత్ప్రేమ యుక్తులగు సంతానమును గాంచిన మహాత్ములవలె, వృక్షములు గూడ వేణువుతో తమకు గల సంబంధమును పురస్కరించుకొని, మధు వారల నెపముగ ఆనందాశ్రువుల రాల్చుచున్నవి.

చెలీ, యీ బృందావనము, పృథివియొక్క కీర్తిని వైకుంఠము వరకు వ్యాపింపజేసినది. దానికి కారణము నందనందనుని మృదుపద చిహ్నములందు చిహ్నితములగుటయే. మురళీధరుడు మునిజన సమ్మోహనమగు మురళిని ప్రయోగించగనే పరవశించిన వనమ యూరములు దానికనుగుణముగ నృత్యమొనర్చుచుండును. అది గాంచి పర్వత సానువులయందు విహరించు పశుపక్షులన్నియు మౌనము వహించి, శాంతముగా నుండిపోవును. తమ ప్రాణవల్లభుడగు శ్రీకృష్ణుడు విచిత్ర వేషము దాల్చి వేణునాదము చేయగనే మూఢబుద్ధులగు హరిణములు ఆ శబ్దము విని, తమ భర్తలగు కృష్ణసారమృగ సహితముగ నందనందనుని పాలికి జని, తమ ప్రేమ పూరితములగు విశాల నయనములతో నతనిని పరికించుచుండెను. పరికించుట యననేల? కనుల సమానములగు తమ కన్నులను కమలాక్షుని చరణ కమలములయందు సమర్పణ జేయుచు, శ్రీకృష్ణుడు ప్రేమ సంభరితములగు కటాక్ష వీక్షణములచే తమకు చేయుచున్న సత్కారమును గూడ స్వీకరించుచున్నవి. ఆహా, వాని జీవితమే ధన్యము! (మనము బృందావనమందు నివసించు గోపికలమేమైనను, ఈ ప్రకారమాత్మ సమర్పణ గావింపలేకున్నాము. మనవారు కోపించు చున్నారు. ఎంతటి సిగ్గో?)

హరిణము లేయననేల? యువతి జనుల కాహ్లాదము గలుగజేయు శీల సౌందర్యములకు గనియగు శ్రీకృష్ణుని సుందర రూపమునుగాంచుచు, వేణువుపై నతడు చిత్రవిచిత్రముగ గానము చేయు మధుర సంగీతమును వినుచున్న దేవతా స్త్రీలు ఆకసము నందలి తమ విమానములందే తన్మయత్వమునంది మూర్ఛిల్లు

చున్నారు. అదెట్లు తెలిసినది? చెప్పెద వినుము. ఆ దేవతా స్త్రీల హృదయమందు శ్రీకృష్ణుని కలుసుకొనవలయునను తీవ్రాకాంక్ష గలిగినప్పుడు వారు ధైర్యమును గోల్పోయినవారై మూర్ఛిల్లి తమ కేశపాశముల నుండి విడిపోయి. నేల రాలుచున్న పూలను గూడ వారు గుర్తింపలేని స్థితియందుండెదరు. చీరల ముడులు వీడి జారి పోవుటయు తెలుసుకొనలేని యట్లుందురు.

సఖీ, నీవు దేవతా స్త్రీల సంగతి యేల చెప్పెదవు? ఇచట నున్న యీ యావుల జూడుము. మన కన్నయ్య వేణువునందు నాదమును పూరించగా, అవి విన్న గోవులు చెవులు టిక్కించి నిలబడి యుండుట జూడగా, నవి తమ చెవులను దొప్ప లతో భగవద్గీతామృత రసమును తనివితీర త్రాగుచున్నట్లునవి! అదెలా సంభవించు చున్నది? తమ నేత్రముల ద్వారా శ్యామసుందరుని తమ హృదయములందు జేర్చు కొని, యచటనే యతనిని ప్రకాశింపజేసుకొనుచు, మనసునందే యతని నాలింగనము జేసుకొనునట్లున్నవి. వాని నేత్రముల నుండి యానంద బాష్పములు రాలుచున్నవి చూడుము? గోవత్సముల స్థితియున పూర్వముగ నున్నది! అవి తమ తల్లుల పొదుగు లలో మూతులుపెట్టి పాలు త్రాగునప్పుడు వేణునాదము వినపడినచో, నవి నోటి యందు చేరిన పాలను మింగలేక కక్కలేక నిశ్చేష్టములై పోవుచున్నవి. వాని నేత్రములందు ఆనంద బాష్పములు, హృదయమునందు భగవంతుని సంస్పర్శ కలిగియుండుటచే గాబోలునవి యథాతథముగ నుండి పోవుచున్నవి!

చెలీ, ఆ యావులు, దూడలు, మన యింటి వస్తువులు. వాని మాటయటుండ నిమ్ము. బృందావనమందలి పక్షులను గాంచుము! వానిని పక్షులని యనుటయు పొరపాటే! వాస్తవమేమన, వానియందధికాంశము, మునిపుంగవులే! వారందరు సుందరతరమగు బృందావనమందలి నవపల్లవ యుక్తవృక్షశాఖాగ్రములపై నెక్కి, కన్నులు మూయకుండ, నిర్నిమేషదృక్కులతో, మౌనముగ, భగవానుని దివ్య సుందర మూర్తిని, ప్రేమవీక్షణముల కన్నులార గాంచుచు తన్మయత్వము నందు చున్నారు. అటులనే చెవులతో, మిగిలిన యన్ని శబ్దములను వదలి, భగవానుని మోహనకరమగు వాక్కులను, మధుర మురళీనినాదమును వినుచున్నారు. 'హా వారి జీవితము లెంత ధన్యములు!

చెలీ, ఆ దేవతలు, గోవులు, పక్షుల సంగతి యటునిండనిమ్ము. అవి చేతన ములు. జడములగు ఈ నదుల గాంచుము. వీనియందున్న యాసుడుల వలన వాని హృదయమందు గల, శ్యామసుందరుని దర్శింపవలయునను తీవ్రాభిలాష, వ్యక్త మగుచున్నది. ఆ మనోరథముచేత మందగించిన వేగము గలవైనవి. భగవానుని పదకంజములపై తమ హృదయముల నర్పణ చేయుచున్నవా యనునట్లు, తమ తరంగములను బాహువులచే నదులు, భగవానుని పాదమును పట్టుకొని, కమలోప హారములను సమర్పించి, యాలింగనము చేయుచున్నవి!

చెలీ, ఈ నదులు మన పృథివికి, అందునను ముఖ్యముగ మన బృందా వనమునకు చెందిన వస్తువులు. ఆకసమందున్న యా మేఘముల వంక కొంచెము చూడుము! వ్రజబాలక సహితులై బలరామకృష్ణులు నడియెండలో గోవులను మేపు కొనుచు, వేణునాదమును గూడ చేయుచుండుటను గాంచిన యా మేఘములకు వారిపై ప్రేమ యుప్పొంగిపోవుచున్నది. వారిపైననే తమ ఛాయ పడునట్లు పరిభ్ర మించుచు నామేఘములు, ఘనశ్యామునికి యెండ తగులకుండ గొడుగువలె సేవించు చున్నవి. వారిపై సన్నని చినుకులు వర్షించుట చూడగా, నవి యా పరమ పురుషు లను శ్వేత కుసుమములచే నర్చించుచున్నట్లున్నది! కాదు కాదు. ఆ నెపమున తమ జీవనమునే వారికి సమర్పించుచున్నట్లున్నది.

చెలీ, మన మీ బృందావనమందలి భిల్లు వనితలను ధన్యురాండ్రుగా భావించు చుంటిమి. ఎందుచేత? వారి హృదయము అందున్న ప్రేమాధిక్యత చేత. వారు మన కన్నయ్యను గాంచగనే, వారి హృదయములందు గూడ నతనిని కలుసుకొనవలయు నను తీవ్రాకాంక్ష యుదయించును. ప్రేమయను వ్యాధి యంకురించును. ఆ వ్యాధి పోగొట్టుకొనుటకై వారేమి యుపాయము చేయుదురో తెలియునా? దానిని గూడ విను. శ్రీకృష్ణుని ప్రేమ పాత్రులగు మన గోపికలు తమ వక్షః స్థలములందు పూసు కొన్న శ్రీకుంకుమము, కన్నయ్య చరణ కమలముల కంటుకొనును గదా. (యెత్తు కున్నప్పుడు అలింగనమునందు) బృందావనమందలి శాద్వల ప్రదేశములందు భగ వానుడు తిరుగుచుండునపుడు ఆ శ్రీకుంకుమము అందలి గడ్డిపరకల కంటుకొనును గదా. వనమందలి భిల్లవనితలా శ్రీకుంకుమము నెమ్మదిగా గడ్డిపరకల నుండి తుడిచి, తమ వక్షఃస్థలములయందు రాచుకొని, తమ హృద్రోగమును పోగొట్టుకొను చుందురు. ఆహా, యేమి వారి భాగ్యము!

గోపికలారా, గిరిరాజగు యీ గోవర్ధనుడు హరిభక్తులలో గొప్పవాడు. చూడండి. మన ప్రాణవల్లభుడైన శ్యామసుందరుని యొక్కయు, నయనాభిరాము డైన బలరాముని యొక్కయు, పాదకముల స్పర్శ ప్రాప్తినంది యీతడెంత యానందించుచున్నాడో చూడుడు. ఇతని యదృష్టమనుకొని యాడుట యెవరికి తరమగును? గోగోపబాల సహితముగ నా మహాత్ములకితడు గొప్ప సత్కారము చేయుచున్నాడు. వారి స్నానపానములకు కావలసిన సలిలములను తనపైనున్న సెలయేరులద్వారా సమర్పించుచున్నాడు. పశువులకు వలయు పచ్చికను సమకూర్చు చున్నాడు. వారు విశ్రమించుటకు గిరికందరములను, కడుపు నిండ భుజించుటకు కందమూల ఫలాదుల నమర్చినాడు. నిజముగా నితడెంతయో ధన్యుడు!

చెలీ, యీ బలరామకృష్ణుల నడివడియే యపూర్వము! పశుబంధన రజ్జువు లను భుజములపై నుంచుకొని, గోవుల నొక వనమునుండి మఱియొక వనమునకు

తోలుకొని పోవుచు, వెంట గోపబాలురు వచ్చుచుండ మధురముగ సలలిత మురళీ నినాదమొనర్చుచుండు సమయమందు, మనుష్యులే యననేల! యితర శరీరధారు లందుగూడ-అనగా-చేతనములగు పశుపక్ష్యాదులును, జడములగు నదులు మొదలగునవియు, స్థిరత్వమును పొందుచున్నవి. అచరములగు వృక్షములుగూడ రోమాంచమును పొందుచున్నవి. భువన మోహనమగు మురళియొక్క చమత్కారమునేమని, యెంతని వర్ణింపనే చెలీ"యని గోపికలు తమలో తాము రామకృష్ణుల లీలలను వర్ణించి చెప్పుకొనుచుండిరి.

బృందావనమందు విహరించునట్టి గోవిందుని యిట్టి లీలలొక్కటిగాదు. అనేకములున్నవి. గోపికలు ప్రతిదినము ఆ లీలలనే చెప్పుకొనుచు తన్మయులై పోవుచుందురు. భగవానుని లీలలు వారి హృదయములందు స్ఫూర్తిని కల్గించు చుండును.

# ఇరువదిరెండవ యధ్యాయము

## గోపికావస్త్రాపహరణము

హేమంత ఋతువునందలి మొదటిమాసమందు అనగా మార్గశిరమాస మందు, నందగోపుని వ్రజమండలమందలి కన్నియలు, కాత్యాయనీదేవి పూజా సంబంధమగు వ్రతమును ప్రారంభించిరి. ఆ వ్రతకాలమునందు వారు కేవలము హవిష్యాన్నమునే భుజించుచుండిరి వారందరు వివాహముకాని చిఱుతప్రాయ మందున్న కన్నియలు వారందరరుణోదయ కాలమందే మేల్కాంచి యమునా జలములందు పవిత్ర స్నానమొనర్చి, తీరమందు యిసుకతో దేవీమూర్తిని గావించి యర్చించుచుండిరి. సుగంధితములగు చందనము, పుష్పహారములు, పల్లవములు, ఫలములు, తండులములు, ధూపదీపాదులచే దేవిని ప్రతిదినము పూజించుచుండిరి.

"హే కాత్యాయనీదేవీ, మహామాయా, మహాయోగనీ, అధీశ్వరీ, నీవు, నందనందనుడగు గోవిందుని మాకు భర్తయగునట్లు చేయుము. దేవీ, మేము నీ పాదకమలములకు ప్రణమిల్లుచుంటిమి."

శ్లో. "కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి
నందగోపసుతందేవి పతింమేకురుతేనమః"

అను మంత్రమును జపించుచు నా కన్యకలు దేవి నారాధించుచుండిరి. ఈ ప్రకారము, తమ మనముల శ్రీకృష్ణున కర్పించియున్న కన్యకలొక మాసమువరకు మహాభక్తితో భద్రకాళిని సేవించిరి. ఉషఃకాలమందే లేచి, వారొకరినొకరు బిలుచు కొనుచు, పరస్పరము చేతిలో చేతినుంచుకొని, ఉచ్చైఃస్వరముతో భగవానుని లీల

లను నామమును గానము చేయుచు యమునానదీ జలములందు గ్రుంకులిడుటకై యేగుచుండిరి.

ప్రతిదినమందు వలెనే, వారొకనాడు యమునా తీరమును జేరి, తమ వస్త్రము లన్నియు దీసి తీరమందుంచి, శ్రీకృష్ణుని గుణగానము చేయుచు పరమానందముతో జలక్రీడ గావింపసాగిరి. యోగీశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుడు వారి యభిప్రాయము నెఱిగినవాడై, సహచరసహితుడై, వారి యభీష్టమును సిద్ధింపజేయదలచినవాడై యమునాతీరమును జేరినాడు. చేరిన వెంటనే కన్యకల వస్త్రములన్నియు గైకొని వేగముగ నొక కదంబవృక్షము నెక్కినాడు. గోపబాలురందరు పగలబడి నవ్వు చుండ, గోపాలదేవుడుగూడ నవ్వుచు నా కన్యకలతో నిట్లు పల్కె. "ఓ కన్యక లారా, మీకు వస్త్రములు గావలెనన్నచో నిచటికి వచ్చి మీ మీ వస్త్రముల దీసు కొనుడు. నేను నిజమునే పలుకుచున్నాను వేళాకోళము చేయుటలేదు. మీరందరు వ్రతము చేయుచు చాల చిక్కిపోయి యున్నారు. నేనెన్నడు నబద్ధమాడువాడను గానను విషయము నా సఖులగు యీ గోపబాలకులెఱుగుదురు. సౌందర్యవతులారా, మీరొక్కొక్కరుగా వచ్చియైనను, లేక సమిష్టిగా వచ్చియైనను, మీ మీ వస్త్రము లను దీసుకొని పోవచ్చును" అని పల్కె. భగవానుని పరిహాస వచనములకు గోపికల హృదయము ప్రేమ సంభరితములైపోయినవి. కొంచెము లజ్జించినవారై, యొకరి మొగమొకరు చూచుకొనుచు ముసిముసి నవ్వులు నవ్వుకొనుచుండిరి. భగ వానుని పరిహాసవచనములచేగల్గిన వినోదముచేత కుమారికల చిత్తములింకను అతని వైపాకర్షింపబడినవి. చన్నీటిలో కంఠమువరకు మునిగియున్న వారి శరీరములు చలిచే గడగడ వణకజొచ్చినవి. వారు శ్రీకృష్ణునుద్దేశించి యిట్లు వచించిరి.

"శ్రీకృష్ణా, నీవిట్టి యవినీతి పని చేయకుము. నీవు నందరాజు యొక్క ముద్దు బిడ్డడవని మేమెఱుగుదుము. మాకు ప్రీతి పాత్రుడవు గూడ. వ్రజవాను లందరు నిన్ను ప్రశంసించుచుందురు. మేము చలిచే గడ్డకట్టిపోవుచుంటిమి. మా వస్త్రములు మా కొసంగుము. శ్యామసుందరా! మేము నీ సేవకురాండ్రము. నీవే పని చెప్పినను చేయుటకు సిద్ధముగ నున్నాము. నీవు ధర్మ సూక్ష్మములన్నియు చక్కగా తెలిసినవాడవు. మమ్మారడి బెట్టకుము. మా వస్త్రములు మాకిమ్ము. లేనిచో మేము వెళ్ళి నంద రాజునకు చెప్పెదము" అని బెదరించిరి.

శ్రీకృష్ణుడు వారితో "మీ చిరునగవులు పవిత్రములు మరియు ప్రేమ పూరిత ములునై యున్నవి. మీరు నాకు దాసీలైనచో, నేను చెప్పిన పని చేయువారలే యైనచో, యిచటికి వచ్చి మీమీ వస్త్రముల గొనిపొండు" అని సమాధానమిచ్చె.

ఆ గోపికలు చలిచే గడగడ లాడుచు బాధపడుటచే, భగవానుని మాటల ప్రకారము, తమ చేతులచే మర్మాంగములను దాచుకొని యమునానదీజలముల నుండి బయటకు వచ్చిరి. అపుడు చలి వారి నింకను బాధపెట్టసాగినది. వారి యీ పవి

శుద్ధ భావనకు భగవానుడు ప్రసన్నుడాయె. వారు తను గూర్చున్న చెట్టు వద్దకు వచ్చుటను గాంచిన గోవిందుడు వారి వస్త్రములను స్కంధముపై నుంచుకొని మిక్కిలి ప్రసన్నతతో నిట్లు పలికె.

“గోపికలారా, మీరు వ్రతమును భక్తిశ్రద్ధలతో చక్కగానే నెరవేర్చినారు. అందులో సందేహములేదు. కాని వ్రతకాల మందు మీరు వస్త్ర హీనలై నీటి యందు స్నాన మొనర్చితిరి. అందుచే మీరు జలాధిష్ఠాన దేవతయగు వరుణున కును, యమునా దేవికి గూడ నపరాధము గావించిన వారైతిరి. కావున యీ దోష శాంతికై మీరు చేతులు జోడించి శిరముపై నుంచుకొని వంగి నమస్కారము చేసి, పిమ్మట మీమీ వస్త్రముల గైకొని పొండు.”

తెలుగు లిపిలో నున్న అధిక శ్లోకములు

శ్లో. ఇత్యేతద్వచనం శ్రుత్వాధర్మ యుక్తం మహాత్మనః
ఏకేన పాణినానేము రేకేనాచ్ఛాద్య చాంగనాః

శ్లో. తావీ క్ష్యోవాచ భగవాన్ భూయోధర్మ్యా మిదంవచః
ఏకేన పాణినాయోనై ప్రణమేద్దేవమచ్యుతం

శ్లో. తస్య దండః కరచ్ఛేదః ఇతి ధర్మ విదో విదుః
తస్మాదు భాభ్యాం పాణిభ్యాం ప్రణమేత్స్వామినం సమః

శ్లో. తధాచ యూయం కురుత తన్మే ప్రియ తరంభవేత్
అహం స్తూభయమే తత్తు పరిమార్జయతుం యది
ఇచ్ఛావః పాణియుగళైః నమస్కృత్య ప్రగృహ్యతాం

భగవానుని ధర్మయుక్తములగు పలుకు లాలించిన గోపకన్య లొక చేతితో మర్మ స్థానము నాచ్ఛాధనమొనర్చుకొని మరియొక చేతితో శ్యామసుందరునికి నమ స్కరించిరి.

వారల గాంచి యాతడు మరల ధర్మసహితముగ నిట్లు పల్కె. “ఒంటి చేతితో భగవంతునికి నమస్కరించరాదు. అట్లొనర్చిన వాని చేయి నరకుటయే యందుకు ప్రాయశ్చిత్తమని ధర్మవేత్తలు వచించుచున్నారు. కావున స్వామికి రెండు చేతులు జోడించి ప్రణామ మొనర్ప వలయును. మీరట్లాచరించుడు. అది నాకు ప్రియతరమగును. మీరొనర్చిన రెండపరాధములను పోగొట్టుకొను తలంపు మీ కున్న యెడల రెండు చేతులతో నమస్కరించి మీ వస్త్రములగోని పొండు” అని గోప కన్యకలతో ననియె.

భగవానుని మాటలు విని, వస్త్రహీనులై స్నానము చేయుటచేత త ్రవత మందు నిజముగనే లోపము జరిగినదని వారు గ్రహించిరి. అందుచే తమ వ్రతము నిర్విఘ్నముగ పూర్తి ఫల ప్రదమగుటకై సమస్త కర్మలకు సాక్షియగు శ్రీకృష్ణున కాతడు సూచించి నటులనే, వారు చేతులు జోడించి నమస్కార మొనర్చిరి. ఏల ననగా భగవానునికి నమస్కారము చేయుటచే వ్రతలోపములు, అపరాధములన్నియు తొలగి పోవును గదా!

తాను చెప్పిన ప్రకారము గోపికలందరు ప్రణామము చేయుటచే భగవాను డత్యంత ప్రీతుడై, వారి వస్త్రములు వారి కొసంగినాడు.

రాజా, శ్రీకృష్ణుడు గోపికలతో వ్యంగ్యముగ మాటలాడి,వారి లజ్జా సంకోచ ములను పారద్రోలి, హాస్యమొనర్చి, వారిని చెక్క బొమ్మల వలె నాడించినాడు. వారి వస్త్రములనే హరించినాడు. అయినను గోపికలాతనిపై కోపము జూపలేదు. అట్టి చేష్టలను దోషములుగా పరిగణించక పోగా, తమ ప్రియతమ సమాగమముచే నితోధికముగు ప్రసన్నతను పొందిరి. గోపికలు తమ తమ వస్త్రముల ధరించిరి. కాని శ్రీకృష్ణుడు వారి చిత్తముల నెంత గొప్పగా వశపరచుకొనెననగా, వారచటి నుండి యొక యడుగైన నావలకు వేయలేకపోయిరి. తమ ప్రియతముని సమాగ మమునకై చక్కగా నలంకరించుకొని యాతనిపై క్రీగంటి చూపులు బఱపు చుండిరి.

ఆ కన్యకలు, తన చరణ కమల స్పర్శ కొరకే వ్రతముగావించురనియు, వారి యేకైక లక్ష్యమదియే ననియు భగవానుడు గ్రహించియే యున్నాడు. గోపికల ప్రేమకు వశుడైన దామోదరుడు వారితో నిట్లనియె. "నా ప్రియతమ గోపికలారా, మీరు నన్ను పూజింపదలచుచుంటిరని, మీ సంకల్పమును గ్రహించితిని. మీ యభి లాషను నే ననుమోదించుచుంటిని (అంగీకరించుచుంటి) మీ సంకల్పము తప్పక నెరవేర గలదు. మీరు నా పూజ చేయగలరు. తమ మనః ప్రాణములను నా కర్పించిన వారి కోరికలు, వారిని సాంసారిక భోగములవైపున కీడ్చుకొని పోవుటకు సమర్థములు గాకుండును. అగ్ని తప్తములగు బీజములు మరల మొలకెత్తుటకు సమర్థములుగానట్లే యవియుండును. కావున గోపికలారా. యిపుడు మీరు మీ మీ గృహముల కేగుడు. మీ సాధన ఫలించినది. రాబోవు శరద్రాత్రుల యందు మీరు నాతో విహరించగలరు. ఈ యుద్దేశముతోనే గదా మీరు వ్రతమును పూని కాత్యాయనీదేవి నారాధించినది." అని పలికె. *

---

## విశేష వివరణము

* ఈ వస్త్రాపహరణ ప్రసంగమునందనేక శంకలు చేయబడుచున్నవి. అందుచే యీ విషయమందు కొంచెము విచారణచేయవలసిన యవసరమున్నది.

వాస్తవమందు, సచ్చిదానంద ఘనస్వరూపుడగు భగవానుని మధురరసమయములగు దివ్యలీలలయొక్క రహస్యము దెలియగలుగు నదృష్టము యే కొద్దిమందికి మాత్రమే ప్రాప్తించును. భగవానుడు చిన్మయుడైనట్లే యతని లీలలును చిన్మయములుగ నుండును. సచ్చిదానంద రసమయ సామ్రాజ్యముయొక్క లీలయెంతటి యున్నత స్థాయిలో ప్రదర్శితమగుననగా, అట్టి విలక్షణత, జ్ఞానవిజ్ఞాన స్వరూపమగు విశుద్ధ చైతన్య పరబ్రహ్మమునందు గూడ నొక్కొక్కప్పుడది ప్రకటితము గాకుండును. అందుచేతనే బ్రహ్మ సాక్షాత్కారమునందిన మహాత్ములుగూడ యీ (సగుణ) లీలా రససమాస్వాదనము చేయలేకుందురు. ఈ పరమోజ్జ్వలమగు దివ్య రసలీలయొక్క యదార్థప్రకాశము. భగవత్స్వరూపభూతమగు హ్లాదినీశక్తియు, నిత్యకుంజేశ్వరియు, శ్రీవృషభానుతనయయునగు శ్రీరాధాదేవి మఱియు ఆమె యంశములేయగు ప్రేమ మూర్తులైన గోపికల హృదయములందే కలుగును. వారు మాత్రమే యెట్టి యావరణము లేకుండ, భగవానుని యీ పరమాంతరంగిక లీల యొక్క రసాస్వాదన చేయుదురు.

భగవానుని లీలలన్నియును దివ్యములేయైనను, వ్రజమందు ప్రదర్శించిన లీలలు, నికుంజములందొనర్చినలీలలు, అందును ముఖ్యముగా గోపికలతో జరుపబోవు రసమయలీల (రాసలీల) దివ్యాతిదివ్యము గుహ్యాతిగుహ్యమునైయున్నవి. ఆ లీల యందరియెదుట ప్రదర్శితముకాదు. అది అంతరంగలీల. అందు ప్రవేశించు నధికారమొక్క గోపికలకు మాత్రమే కలదు.

దశమస్కంధమందలి యిరువదియొకటవ యధ్యాయమందు యిటువంటి వర్ణనయేవచ్చినది. భగవానుని రూపసౌందర్యమును, మధురమురళీనాదము, ప్రేమ మయములగు లీలలను చూచి, విని, గోపికలు ముగ్ధులైనట్లు చెప్పబడినది. ఈ యధ్యాయము (౨౨) నందు, ఆ ప్రేమ పూర్ణత్వము చెందుటకు సాధనము తెలుపబడినది ఇదేయధ్యాయమునందు భగవానుడువచ్చి యా సాధనను పరిపూర్ణము గావించినాడు. ఇదియే వస్త్రాపహరణమందలి యుద్దేశము.

గోపికల కోరిక ఏదో, వారి సాధన వలన స్పష్టమైనది. వారు పూర్ణముగా శ్రీకృష్ణునకాత్మ సమర్పణ చేయగోరుచుండిరి. వారి ప్రతి రోమము - మనస్సు ప్రాణము, సంపూర్ణమగు ఆత్మ, సర్వము శ్రీకృష్ణమయము గావలయుననునదియే గోపికల తీవ్రవాంఛ. శరత్కాలమునందు వారు తమలో తాము శ్రీకృష్ణుని వేణు గీత చర్చ గావించియుండిరి. హేమలత ఋతువుసంపలి ప్రథమ మాసమునందు, అనగా భగవానుని విభూతి స్వరూపమగు మార్గ శీర్షమందు (మాసానాంమార్గశీర్షో ఒహం) వారి సాధన ప్రారంభమైనది. ఆలస్యమెంతమాత్రము వారు సహించలేకుండిరి. శీతకాలమందు ప్రాతఃకాలముననే యమునానది యందు స్నానమొనర్చుటకై వెళ్ళుచుండిరి. శరీరమేమగునో యను చింతవారికి లేకుండె. అనేక గొల్ల కన్నియలు

గుంపుగా వెళ్ళుచున్నను వారి యందీర్ష్యాద్వేషములు లేకుండె. వారు బిగ్గరగా శ్రీకృష్ణుని నామ సంకీర్తనము చేయుచు బోవుచుండిరి. వారికి తమ పల్లెవారి వలనగాని, కులమువారి వలనగాని యెట్టి భయము లేదు. వారింటి యందు కేవలము హవిష్యాన్నమునే భుజించుచుండిరి. వారు శ్రీకృష్ణుని కొఱకై యెంత వ్యాకుల పడుచుండిరనగా-వారికి తల్లిదండ్రుల యెడలగూడ యెట్టి సంకోచము లేకుండె వారు విధి పూర్వకముగా వాలుకామయమగు దేవీ మూర్తిని గావించి పూజ చేయుచు, మంత్రమును జపించుచుండిరి. తాను చేయుచున్న పని యోగ్యమైనదనియు,సర్వథా ప్రశస్తమనియు వారు భావించుచుండిరి. ఒక్క మాటలో చెప్పవలయునన్నచో:- వారు తమ సర్వస్వమును, అనగా కులమును, పరివారమును, ధర్మమును, సంకోచమును, వ్యక్తిత్వమును—భగవానుని పాద పద్మములయందు సర్వదా సమర్పించినారు."నంద నందనుడే తమకు ప్రాణపతియగుగాక" యనియే వారు జపించుచుండిరి. వాస్తవముగా శ్రీకృష్ణుడు వారి ప్రాణపతియైయే యున్నాడు. కాని లీలా దృష్టిలో వారి సమర్పణ యందు కొంచెము కొఱత యున్నది. వారు నిరావరణ రూపముతో శ్రీకృష్ణుని యెదుట కింతవరకు వెళ్ళుట జరుగలేదు. వారియందు కొంచెము సంకోచమున్నది. ఆ సంకోచమును దూరమొనర్చుటకే-వారి సాధన సమర్పణలను సంపూర్ణము గావించుట కొరకే—ఆవరణభంగము కలిగించుట యావశ్యకమైనది అందుకై, వారికావరణరూపముగనున్న చీరల నపహరించుట యవసరమైనది. ఇపుడు భగవానుడా పనియే చేసినాడు. అందుకొరకే యోగేశ్వరేశ్వరుడు శ్యామసుందరుడు తన సహచర బృందముతో గూడ యమునా తటము చేరినాడు.

సాధకుడు తనశక్తిచే, తన బల సంకల్పముచే, కేవలము తననిశ్చయ మాత్రముచేతనే పూర్ణసమర్పణము చేయజాలడు. సమర్పణయనునదియు నొక క్రియయే. దానిని చేయువాడు అ సమర్పితుడై యే యుండును అట్టి స్థితియందు,భగవానుడే స్వయముగానేతెంచి, సాధకుని సంకల్పమును స్వీకరించి, సంకల్పము చేసిన వానినిగూడ స్వీకరించినప్పుడు, అంతరాత్మయొక్క పూర్ణసమర్పణ జరుగును. సాధకుని కర్తవ్యము పూర్ణసమర్పణకు సిద్ధముగా నుండుటయే. దానిని పూర్ణము గావించుట భగవానుడు చేయును.

శ్రీకృష్ణ భగవానుడు లీలాపురుషోత్తముడేయైనను, తన లీలలను ప్రకట మొనర్చునపుడు ధర్మమర్యాదనుల్లంఘింపడు. దానిని (ధర్మమును) సంస్థాపనమొనర్చును. శాస్త్రము నతిక్రమించినచో యెవ్వడును తన సాధనామార్గమందు అభివృద్ధి సాధింపజాలడు. కాని, హృదయమందలి నిష్కపటత్వము, ఋజుత్వము, నిజమగు ప్రేమయనునవి, విధ్యతిక్రమణనుగూడ శిథిలమొనర్చును. గోపికలు శ్రీకృష్ణుని పొందుటకై జేసిన సాధనయందొక పొరపాటు జరిగినది. వారు శాస్త్రమర్యాదను, పరంపరగావచ్చుచున్న సనాతన ధర్మసంప్రదాయమును ఉల్లంఘించి, నగ్నముగా

స్నానమొనర్చుచుండిరి. ఆ తప్పిదము వారి యజ్ఞానము వలన కలిగినదేయైనను' భగవానునిచే యా తప్పిదము పరిహారము చేయబడవలసిన యవసరమేర్పడినది. అందుచే భగవానుడు గోపికలచే సందుకు ప్రాయశ్చిత్తము చేయించినాడు. భగవానునిపై ప్రేమయను పేరుతో శాస్త్రమర్యాదనుల్లంఘించువారు, యీ ప్రసంగమును సావధానముగ పఠించి, భగవానుడు శాస్త్రవిధినెంత యాదర భావముతో గౌరవించెనో గ్రహించవలసియున్నది.

శాస్త్రీయ భక్తికి పర్యవసానము రాగాత్మికమగు భక్తి. రాగాత్మికమగు భక్తి పూర్ణసమర్పణ రూపముగా పరిణతి చెందును. గోపికలు శాస్త్రీయభక్తి ననుష్ఠించిరి. వారి హృదయములు రాగాత్మికమగు భక్తిచే నిండియుండినవి. ఇక పూర్ణ సమర్పణ జరుగవలసి యున్నది. చీరల యపహరణ ద్వారా ఆ పని సంపన్నమైనది.

ఇహలోక పరలోకముల యొక్కయు, స్వార్థ పరమార్థముల యొక్కయు జాతి కులముల యొక్కయు, పురజన-పరిజన-గురుజనముల యొక్కయు చింత లేనట్టి గోపికలు, యెవని ప్రాప్తికై తామింతటి గొప్ప యనుష్ఠానము గావించి యుండిరో, యెవని చరణ కమలములయందు తమ సర్వస్వమును సమర్పించుకొని యుండిరో, యెవనితో నిరావరణ రూపమున కలియుటయే తమ యేకమాత్రాభీష్టమో అట్టి నిరావరణ, రసమయ, మూర్తియగు శ్రీకృష్ణ భగవానుని సామీప్యమునకు గోపికలు నిరావరణ భావముతో చేరజాలక పోయినారు. ఇది వారి సాధన యొక్క యపరిపూర్ణతకాదా? అది యపరిపూర్ణతయే! ఈ విషయము గుర్తించియే గోపికలు నిరావరణ రూపమున భగవానుని సామీప్యమునకేగిరి.

శ్రీకృష్ణుడీ సమస్త చరాచర ప్రపంచమునకేకైక ప్రభువు, సర్వకర్మలకు కర్తయు, భోక్తయు, సాక్షియు గూడ నతడే. అతనికి తెలియనట్టి వ్యక్తావ్యక్త పదార్థమొక్కటియు లేదు. అంతర్యామిగా సర్వభూతముల యందున్నవాడతడే. సర్వవ్యాపకుడు నతడే. గోపి గోపికలకు సమస్త విశ్వమునతడేయాత్మ. ప్రభువు, గురువు, తల్లి, తండ్రి, సఖుడు, పతి మొదలగు వివిధ రూపములతో, ప్రజలా యాత్మ స్వరూపునే యుపాసించుచున్నారు. గోపకన్యలు, ఆ భగవానుని-భగవానుడనియు, యోగీశ్వరేశ్వరుడనియు, క్షరాక్షరాతీత పురుషోత్తము డనియు, బాగుగా గుర్తించియే, యాతనిని తమ పతిగా పొందవలయునని వాంఛించిరి. శ్రీమద్భాగవత మందలి దశమస్కంధమును శ్రద్ధాభక్తులతో పఠించిన పిమ్మట, గోపికలు శ్రీకృష్ణుని యొక్క పరమాత్మ స్వరూపమునులెస్సగా గుర్తించి యుండిరను విషయము మనకు స్పష్టముగా గోచరమగును. వేణు గీతము, గోపీ గీతము, యుగల గీతము, శ్రీకృష్ణుడంతర్హితుడైనప్పుడు గోపికలాతని కొరకై చేసిన యన్వేషణములందీ విషయము

నెవ్వడైనను-కన-విన-తెలుసుకొనగలరు. ఏ మానవులు, శ్రీకృష్ణ భగవానుని భగవానుడని భావించెదరో, అట్టి భగవానునితో సంబంధము పెట్టుకొని యెదలో, అతనిని తన స్వామిగను, స్నేహితునిగను భావించెదరో అట్టివారి హృదయమందు, గోపికల యీ లోకోత్తరమగు మాధుర్య సంబంధము, వారి సాధనల గురించిన శంకయెట్లు బొడసూపును?

గోపికల యొక్క యీ దివ్య లీలాజీవనము ఉత్తమ తరగతికి చెందిన సాధకునకు ఆదర్శజీవన మగుచున్నది జీవునకు యేకైక లక్ష్యమగు పరమాత్మయే శ్రీకృష్ణుడు. మనబుద్ధి దృష్టి, దేహము వరకే పరిమితిమైయున్నవి అందుచేత మనము, శ్రీకృష్ణుడు గోపికల మధ్యనున్న ప్రేమనుగూడ, కేవలము దైహికముగను, కామ వాసనాకలుషితమైన దానినిగనే భావించుచున్నాము. అలౌకికము, అప్రాకృతమునగునట్టి యీ దివ్యలీలను, యీ లౌకిక రాజ్యమునకు దిగలాగుట, మన స్థూల వాసనలయొక్క ప్రమాదకరమగు పరిణామము. జీవుని యొక్క మనస్సు విషయవాసనలచే, తమోగుణ ప్రవృత్తులచే నభిభూతమైయుండును. విషయభోగానుభవము కొరకే యటునిటు పరిభ్రమించుచు, వివిధములగు ఆధివ్యాధులతో సలమటించుచుండును. ఎప్పుడో యొకప్పుడేదో యొక పుణ్యఫలోదయ సమయమందు భగవంతుని యవ్యాజమగు దయకలిగినప్పుడు, జీవునికి విచారణయుదయించును. అప్పుడు యీ దుఃఖ జ్వాలనుండి రక్షించుకొనుటకును, తన ప్రాణములను శాంతి ధామమునకు చేర్చుకొనుటకును, అతడు ఆరాటపడును, అప్పడతడు భగవానుని లీలాధామములకు (పుణ్యక్షేత్రములకు) యాత్రలు సల్పును సజ్జనులతో సాంగత్యము చేయును. అతని హృదయమునందలి యాతురత, యింతకాలమునతని హృదయమునందు నిద్రాణమైయున్న భగవద్విషయికమైన యాకాంక్షను మేల్కొలిపి, యతివేగముతో పరమాత్మవైపుకు పయనింపజేయును. చిరకాలమునుండియు నలవాటు పడియుండిన కారణముచేత, మధ్యమధ్య విషయవాసన లతనిని బాధించుచు నంతరాయము కల్గించుచుండుటచే నతడనేక నిక్షేపముల నెదుర్కొనవలసి వచ్చుచుండును. కాని, భగవానుని ప్రార్థించుట, నామసంకీర్తన, స్మరణ, చింతనములు చేయుచుండుట మూలముగా, చిత్తము రసవంతమగుచు, నెమ్మదినెమ్మదిగా భగవత్సాన్నిధ్యానుభవము కల్గుచుండును. ఆ రసానుభూతి కొంచెము కలుగగనే, చిత్తము మహావేగముతో అంతర్దేశమునందు ప్రవేశించును. అప్పుడు భగవానుడు మార్గదర్శకుని రూపమున, సంసారసాగరమును తరింపజేయు నావపై కర్ణధారుని రూపముననో, లేక సాక్షాత్ చిత్స్వరూపుడగు గురుదేవుని రూపముననో, సాక్షాత్కరించును. సరిగా ఆ క్షణమందే, సాధకుని అపూర్ణత పరిచ్ఛిన్నత్వము మొదలగు బంధములన్నియు నశించిపోయి, విశుద్ధమగు ఆనందము-విశుద్ధమగు జ్ఞానములయొక్క అనుభూతి కలుగుట ప్రారంభించును.

ఇప్పుడిప్పుడే తమ సాధనమందు సిద్ధిగాంచిన గోపికలు భగవానుని యాంతరంగిక లీలయందు ప్రవేశింపబోవుచున్నారు. చిరకాలమునుండి, శ్రీకృష్ణుని ప్రాణములందు తమ ప్రాణములను చేర్చుటకై యుత్కంఠితులై యున్న వారు యిప్పుడు తమ సాధనసిద్ధియొక్క లాభమునకు చేరువగా రాగలిగినారు. లేక—వారు నిత్యసిద్ధులేయై యున్నను భగవానుని యిచ్ఛానుసారము అతని దివ్య యోగలీలయందు సహకరించుచున్నారు. వారి హృదయములందలి సమస్తభావముల నెఱిగియున్న శ్రీకృష్ణుడు, మధురముగ వేణునాదమొనర్చి వారినందరినాకర్షించి, వారి హృదయములందింకను మిగిలియున్న పూర్వసంస్కారములను నిశ్శేషముగా కడిగివేయుటకా యనునట్లు, వారిని సాధనయందు లగ్నముగావించుచున్నాడు భగవానుడెంతటి దయగలవాడో, తనను ప్రేమించు భక్తులనాతడెంతగా ప్రేమించునోయను విషయమూలోచించినకొలది, చిత్తము ముగ్ధమగుచుండును. కంఠము గద్గదికమగును.

శ్రీకృష్ణుడు, గోపికల వస్త్రరూపమున, వారిసమస్త సంస్కారములయొక్క యావరణను తనచేతిలోనికి దీసుకొని, సమీపమందేయున్న కదంబవృక్ష మెక్కినాడు. గోపికలు జలమందున్నారు. సర్వవ్యాపియు సర్వదర్శియునగు భగవానుని నుండి తమను తాము గుప్తముగా నుంచుకొనినట్లు వారు భావించుచుండిరి. శ్రీకృష్ణుడు జలములందుండుటయేగాక, జలస్వరూపముగనున్నదియు నతడేయను భగవత్తత్వమును, గోపికలాసమయమందు మఱచినట్లున్నది. వారి పూర్వసంస్కారములు, శ్రీకృష్ణుని సమ్ముఖమునకు పోవుటకు ప్రతిబంధకములగుచున్నవి. శ్రీకృష్ణుని కొరకైవారు సర్వము మఱచియుండిరిగాని, తమను తామింతవరకు మఱచియుండలేదు. వారు కోరునది కేవలము శ్రీకృష్ణునే. కాని వారి సంస్కారములు వారికిని శ్రీకృష్ణునకు మధ్యనొకతెరను దించుచున్నవి. ప్రేమించినవారలకు-వారి ప్రియతమునికి మధ్యనొక పువ్వుగూడ అడ్డుండగూడదు. ప్రేమయొక్క స్వభావము, సర్వథాయెట్టియంతరాయము లేకుండుట, యెట్టి యాటంకములేకుండుట. అంతయులేనియైక్యత ఎంతదాక తన సర్వస్వము (అది యెంత విస్తారమైనను) ప్రేమయను అగ్నిజ్వాలయందు భస్మముచేయబడకుండునో, అంతవరకు ప్రేమ సమర్పణయను రెండును అసంపూర్ణముగనేయుండును. ఈ యసంపూర్ణతను దూరముగావించుచు, శుద్ధభావముచే ప్రసన్నుడైన [శుద్ధభావప్రసాదితః] శ్రీకృష్ణుడు, గోపికలతోనిట్లు పలికినాడు. "నాపైయనన్యప్రేమగల యో గోపికలారా, ఒక్కసారి, కేవలమొక్కసారి, మీ సర్వస్వమును, మిమ్ములనుగూడ మరచి నన్ను చేరిన జాలును. మీయందవ్యక్తముగనున్న త్యాగమునొక్కపర్యాయము వ్యక్తముగావింపుడు. మీరు నాకొఱకై యీ మాత్రముగూడ చేయజాలరా?" అని యాతడు పలుకగా గోపికలు "శ్రీకృష్ణా, మేము మమ్మెట్టుల మఱువగలము? మా జన్మజన్మల ధారణలను మఱచిపోనిమ్ము. మేము సంసారమను అగాధసాగరమునందు ఆ కంఠ

ముగ మునిగియున్నాము· చలిచేగూడ కష్టపడుచున్నాము. మేము రావలయునని యనుకొనుచున్నను రాలేకపోవుచుంటిమి. శ్యామసుందరా, మా ప్రాణములకు ప్రాణమా" మా హృదయములు నీయెదుట ఉన్మత్తములైయున్నవి. మేము నీ దాసీలము నీ యాజ్ఞలను, తు, చ, తప్పక పాటించెదము. కాని మమ్ము నిరావరణ రూపముతో నీ దగ్గరకు పిలువకుము" అని చెప్పినట్లున్నది.

సాధకునియొక్క యీస్థితి, ద్వైదీభావస్థితి. భగవంతుడు కావలెను కాని సంసారముకూడ వదలకుండ నుండవలె. విషయవాసనలయందు చిక్కుపడియుండ వలె. మాయాయవనికాచ్ఛన్నులై యుండనేవలయు ననునట్లున్నది.

భగవానుడు నేర్పినదేమనగా:- "సంస్కార శూన్యులై (అనగా విషయ వాసనలనువదలి), నిరావరణులై మాయయనుతెరను తొలగించుకొని, నావద్దకు రండి మీ మోహ మనుతెరను నేనే లాగుకొంటిని. ఇపుడు మీరీయవనిక పై యింకను మోహము పెట్టుకొందురేల ? ఈ తెరయనునదియే జీవాత్మ పరమాత్మల నడుమ నున్న పెద్దయాటంకము, అది తొలగినది. పరమకల్యాణము చేకూరినది ఇప్పుడు మీరు నావద్దకురండు. అప్పుడే మీ చిరకాలవాంఛితము లీడేరగలవు." అను శ్రీకృష్ణుని యీ యాహ్వానము, జీవాత్మ పరమాత్మల సంయోగముయొక్క యీ మధురమగు ఆ మంత్రణము (ఆహ్వానము), భగవానుని కృపవలన యెవని హృద యాంతరమందు ప్రకటితమగునో, వాడు ప్రేమయందు నిమగ్నుడై, సమస్తమును త్యాగమొనర్చి, త్యాగమొనర్చుటగూడ మరచినవాడై ప్రియతముడగు శ్రీకృష్ణుని చరణకమలముల వద్దకు పరువిడివచ్చును. వానికి వస్త్రముల యాలోచనయుండదు. లోకుల ధ్యాసయునుండదు! వాడు ప్రపంచమును చూడడు. తనను తానే చూచు కొనడు. ఇదియే భగవత్ప్రేమయందలి పరమరహస్యము. విశుద్ధము అనన్యమునగు భగవత్ప్రేమ యిట్లుండును.

గోపికలు వచ్చినారు. శ్రీకృష్ణ చరణ సమీపమందు మూకీభావముతో నిలబడి యుండిపోయినారు. మొగములులజ్జావనతములై యుండిపోయినవి. ఇంకను మిగిలి యున్న కించిత్సంస్కార శేషమేదో భగవానుని పూర్ణముగా చూచుటకు ప్రతిబంధ కముగానున్నది. శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వినాడు. సైగచేయుచు నతడిట్లు పలికి నాడు. "మీరు గావించిన యీ గొప్పత్యాగమందీ సంకోచము కలంకముగానున్నది. మీరెల్లపుడును కళంకము తేనట్టివారు. మీరీ సంకోచత్యాగమును, త్యాగముచేయు చుంటిమను భావనాత్యాగమును, త్యాగముయొక్క స్మృతినికూడ త్యాగము చేయ వలయును." అని పల్క గోపికలు తలలెత్తినారు. వారి చూపు ముకుందుని ముఖ కమలమునందు నిల్చినది. తమంతటతామే వారిచేతులు రెండును ముకుళితములైనవి. సూర్యమండలాంతర్వర్తియై భ్రాజమానుడగుచున్న తమ ప్రియతముడగు

శ్రీకృష్ణునే వారు ప్రేమభిక్ష యొసంగుమని ప్రార్థించినారు. గోపికల యొక్క యీ పరమత్యాగము, యీ సంపూర్ణ సమర్పణము, యీ యుత్తమమగు ఆత్మ విస్మృతి, వారిని శ్రీకృష్ణ భక్తి సంభరితము గావించినది. వారు, దివ్యరసము యొక్క, అలౌకికము అప్రాకృతమునగు, అనంత సుధాసాగరమునందు మునుకలిడుచుండిరి. వారు సమస్తమును మఱచిపోయిరి. మఱచిన వారినిగూడ (అనగాతమను) మఱచిరి. అప్పుడు వారి దృష్టియందున్నది శ్యామసుందరుడొక్కడే. కేవలము శ్యామసుందరుడు మాత్రమే.

ప్రేమభక్తుడెప్పుడు ఆత్మ విస్మృతి చెందునో, అప్పుడతనిని కాపాడుభారము భగవానునిపై నుండును. ఇప్పుడు మర్యాదా రక్షణకై గోపికలకు వస్త్రముల యావశ్యకత లేకుండె. ఎందువల్ల? వారికేది యవసరమో అది వారికి లభించినది! కాని భగవానుడు తనను ప్రేమించు భక్తుల మర్యాదను తొలగిపోనీయడు. స్వయముగా వారికి వస్త్రములొసంగి, తన యమృతమయమగు మాటల ద్వారా వారి విస్మృతిని పోగొట్టి, మరల ప్రపంచములోనికి తెచ్చినాడు. "గోపికలారా, మీరు సాధ్వీమతల్లులు! మీయొక్క ప్రేమ, మీ సాధన నాకు తెలియనివి గావు. మీ సంకల్పము తప్పక నెరవేరును. మీ యీ సంకల్పము- మీ యీ కోరిక, సంకల్ప రాహిత్యము, నిష్కామత్వములకు లభించు ఉత్తమ స్థానముపై మిమ్ములను చేర్చును మీ యుద్దేశ్యము ఫలించినది. మీ సమర్పణ సంపూర్తియైనది. ముందు రాబోవు శరద్రాత్రుల యందు మన క్రీడ పూర్ణము కాగలదు. భగవానుడు వారి సాధన సఫలమగు సమయము స్థిరపరచినాడు. భగవానుడెట్టి విధమగు కామవికార సంకల్పనయు చేయలేదని దీనివలన స్పష్టమగుచున్నది. కాముకుడగు పురుషుని చిత్తము, వస్త్రవిహీనమగు స్త్రీలనుగాంచి, యొక్క క్షణమైనను వశమందుండగలదా?

ఇంకొక విషయ మత్యంత విలక్షణమైనది. భగవానుని యెదుటకు వెళ్ళుటకు ముందు, యే వస్త్రసమర్పణ పూర్ణత్వమునకు బాధకమైనదో, విక్షేపము గల్గించినదో, అది, యనంతరము భగవత్కృప, ప్రేమ, సాన్నిధ్యము, మఱియు వరదానములను పొందిన పిమ్మట, ప్రసాద రూపమున పరిణమించినది. దానికి కారణమేమి? భగవానునితో గలిగిన సంబంధమే దానికి కారణము. భగవానుడు వారి వస్త్రములను తన చేతులతో దీసుకొని తన యుత్తమాంగమగు స్కంధముపై నుంచుకొనియె గదా! శరీరముయొక్క క్రింది భాగమందు ధరించు చీరలు- భగవానుని భుజస్కంధముల నధిరోహించి, అతని సంస్పర్శచే నెట్టి యప్రాకృత రసాత్మకములైనవి! ఎంత పవిత్రములైనవి! అవి కృష్ణమయములేయైనవి. ఇది యెవని యూహకందును?

ఊహాతీతము! భగవానుని సంబంధము కలుగునంతవరకు, భగవదనుగ్రహము ప్రసరించనంతవరకు మాత్రమే, యీ సంసారము బాధకరముగను, విక్షేపజనకము గను చూపట్టుచున్నది. భగవానుని యనుగ్రహము లభించిన యనంతరము యీ బంధనమే ముక్తి స్వరూపముగ భాసిల్లుచున్నది. భగవానుని సంపర్కమందు మాయ శుద్ధ విద్యయగుచున్నది. సంసారము, సంసారమందలి సమస్త కర్మలు అమృత మయమగు ఆనందరసముచే పరిపూర్ణములగుచున్నవి. అప్పుడు బంధనము యొక్క భయమేమియు నుండదు. భగవానుని దర్శనముచే నెట్టి యావణరలును వంచిత ములుగా నుండనేరవు. నరకము నరకముగా నుండజాలదు. భగవానుని దర్శన మగు చుండుటచేత నదియే వైకుంఠముగ భాసించును. ఈ స్థితియందు చేరిన గొప్ప గొప్ప సాధకులు, ప్రాకృతీ పురుషులతో సమానముగ ఆచరించు చున్నట్లు మాత్రమే కనుపడుచుందురు. శ్రీకృష్ణునివారలై పోయిన గోపికలు మరల వస్త్రములను ధరించిరో, లేక శ్రీకృష్ణుడే వారిచే వస్త్రముల ధరింపజేసెనో, కాని, గోపికలదృష్టిలో యీ వస్త్రములు వెనుకటి వస్త్రములు గావు. నిజముగానవి కానేకావు. ఇపుడవి మఱియొక వస్తువులైపోయినవి. ఇపుడవి భగవానుని పరమ పవిత్రమగు ప్రసాదము. క్షణక్షణము భగవానుని గుర్తుకు తెచ్చునట్టి, పరమ సుందరమగు భగవత్ప్రతీకలు. అందుచేతనే వాటిని వారు స్వీకరించిరి. వారి ప్రేమమయ స్థితి లోకమర్యాద కతీ తముగ నున్నది. అయినను భగవానుని కోరిక ననుసరించి వారు లోక మర్యాదను స్వీకరించిరి. ఈ దృష్టితో విచారణ యొనర్చినచో, యీ వస్త్రాపహరణ లీలగూడ భగవానుని యితర లీలలవలెనే, ఉత్తమ ధర్మ పరిపూర్ణముగా, తెలియబడును.

శ్రీకృష్ణ భగవానుని లీలలకు సంబంధించినంత వరకు, ఆ లీలలను వర్ణించి నట్టి ప్రాచీన ఆర్షగ్రంథములే ప్రమాణము. ఆ గ్రంథములలో, శ్రీకృష్ణుని భగవ త్తత్వమును వర్ణించని గ్రంథ మొక్కటియు లేదు. "కృష్ణస్తు భగవాన్ స్వయం" శ్రీకృష్ణుడు స్వయముగా భగవానుడే యని సర్వత్ర చెప్పబడియున్నదా గ్రంథము లందు, శ్రీకృష్ణుని భగవానునిగా భావించని వారికా గ్రంథములయందును గౌరవ ముండదు. ఆ గ్రంథములయందు ప్రమాణబుద్ధి లేనివారికి, వానియందు వర్ణింపబడిన లీలల నాధారము చేసుకొని శ్రీకృష్ణుని చరిత్రను సమీక్ష (విమర్శ) చేయు నధికా రము లేదు. భగవానుని లీలలను మానవ చరిత్రతో సమానముగా పరిగణించుట, శాస్త్ర దృష్టిలో నొక మహాపరాధము. వాని ననుకరించుట సర్వథా నిషిద్ధము. మానవబుద్ధి స్థూలత్వముచే పరివేష్టితమై యున్నది. జడసంబంధమగు వానిని గూర్చి మాత్రమే యాలోచించగలుగును. చిన్మయములగు భగవానుని లీలలకు సంబంధిం చిన విషయము నూహించుటకు గూడ సమర్థము గాకుండును. ఆ బుద్ధి తనను తానే పరిహసించుకొనును. అందరి బుద్ధులను ప్రచోదన చేయునట్టియు, బుద్ధుల

కతీతుడై యుండునట్టియు పరమాత్ముని దివ్యలీలలను తన పరిధిలో పరిశీలించు చుండును.

హృదయము, బుద్ధియు విపరీత భావన కలిగి యున్నవైనను,—వాటన కొరకై కొద్దిసేపు శ్రీకృష్ణుడు భగవానుడు కాడనియు, అతని యీ లీల మానవ సంబంధమైనదేయని యనుకొందము. అయినను అతని చరిత్రయందలి విషయము లేవియు, తర్కమునకు యుక్తికి అందునట్టివిగావు. వ్రజమునందు శ్రీకృష్ణుడు కేవలము పదనొకండు వత్సరముల వయస్సువరకే వసించి యుండెనని భాగవతము పఠించు వారలందరెఱుగుదురు. రాసలీల యొనర్చిన సమయమందతనికి పది సంవత్సరముల వయసుండి యుండునని భావించినచో, తొమ్మిది వత్సరముల ప్రాయమందీ వస్త్రాపహరణ లీల జరిగియుండును. ఎనిమిది తొమ్మిది సంవత్సరముల ప్రాయముగల బాలునియందు కామోద్దీపనము కలుగగలదనునది యూహకుగూడ నందని విషయము వర్తమాన నాగరిక ప్రపంచముయొక్క మనఃప్రవృత్తియొక్క వాసన యంటనట్టి పల్లెలందు వసించుచున్న యమాయక స్వభావముగల గొల్లబాలికలు, యెనిమిది, తొమ్మిది సంవత్సరముల వయసుగల బాలునితో నశాస్త్రీయ సంబంధము వాంఛించి యందుకై కఠోర సాధన గావించి యుండిరనుట, యెన్నడును సంభవముగా గాన్పించదు. ఆ గోపకన్యకల మనసునందు కలుషిత వృత్తి యుండెననునది నేటి నాగరికుల కలుషిత మనోవృత్తియొక్క కల్పన (ఊహ) మాత్రమే. నేడు పల్లెలందు చిన్న చిన్న కన్నియలు, రామునివంటి భర్తయు, లక్ష్మణునివంటి మఱదియు లభించుటకొరకై దేవదేవతల పూజ యొనర్చుచున్నట్లే, ఆ గోపకన్నియలుగూడ మాధుర్య సుందర మనోహరమూర్తియగు మాధవుని మగనిగా పొందుటకై దేవీ పూజావ్రతములు చేసి యుండిరి. ఇందులో దోషమేమున్నది?

నేటి విషయము వేరు. భోగప్రధానమగు దేశమందు, నగ్న సంప్రదాయములు, నగ్నస్నానములు చేయు సంఘములు విహారస్థలములు నేర్పడియున్నవి. వాని దృష్టి యింద్రియ తృప్తివరకే పరిమితమైయున్నది. భారతీయ మనోవృత్తి యీ యుత్తేజకరమగు మలిన వ్యాపారమునకు విరుద్ధము. నగ్నముగా (దిగంబరముగా) స్నానము చేయుట దోషములలో నొకటి. అది పశుత్వము ప్రబల మొనర్చును. శాస్త్రములయందు యిది నిషేధింపబడియున్నది. (ననగ్నః స్నాయాత్.) ఇది శాస్త్రము యొక్క ఆదేశము. గోపకన్నియలు శాస్త్రమునకు విరుద్ధముగా నాచరించుట శ్రీకృష్ణున కభిమతము గాదు. ఇది కేవలము లౌకికానర్థమేగాదు. ప్రత్యేక వస్తువునకు నొక యధిష్ఠాన దేవత యుండునని తలచుట భారతీయ ఆర్షీ సిద్ధాంతము ఈ నగ్నస్నానము చేయుట దేవతలనవమానించుటయేనని ఈ సిద్ధాంతము తెలుపు

చున్నది. ఇది జలాధిష్ఠాన దేవత యగు వరుణుని యవమానించుట యని శ్రీకృష్ణు డెరుగును. గోపికలు తమ మనోరథసిద్ధికి యొనర్చుచున్న తపస్సునకు, యీ నగ్నస్నానమొనర్చుట యనిష్టఫల మొసంగునది యగును. మఱియు, యీ యల వాటు మొగ్గలోనే త్రుంచివేయకున్నచో ముందుమందది విస్తరించి, మాన్పుటకు శక్యము గాక పోవును. అందుచే శ్రీకృష్ణు డపూర్వమగు రీతితో నా దురాచారమును నిషేధించినాడు.

పల్లెలందలి గోపికలకీ యలవాటు నందున్న దోషమును యెట్లు తెలియజెప్పుటయా యని యాలోచించి, శ్రీకృష్ణుడందుకు మౌలికమగు నొక యుపాయమును కనిపెట్టినాడు. అతడు గోపికల వద్దకేగి వారలకు దేవతావాద సిద్ధాంతమునుపన్యసించినచో, సరళ స్వభావులగు వారు దానినర్థము చేసుకొన జాలకుందురు. కావున యీ దురాచారముచే కలుగు విపత్తిని వారికి ప్రత్యక్షముగా ననుభవింప జేయవలసి యున్నది. విపత్తియొక్క యనుభూతిని వారికి కల్గించిన పిమ్మట, భగవానుడు వారికి దేవతావమాన విషయము గూడ వివరించి, యంజలి బద్ధులై వారు క్షమా-ప్రార్థనా రూపమగు ప్రాయశ్చిత్తమును గూడ చేసుకొనునట్లు గావించినాడు. మహా పురుషుల యొక్క బాల్యావస్థయందు గూడ, యిట్టి ప్రతిభ మనకు గనుపడుచునే యుండును.

శ్రీకృష్ణుడా సమయమందెనిమిది-తొమ్మిది సంవత్సరముల ప్రాయమువాడు. ఆ వయసునందు కామోత్తేజనమనునది కలుగదు. అను సమాధానము సంభవమై నప్పటికిని, మూలమందలి "కామ" "రమణ" శబ్దములచే కొందరు భ్రమపడు చున్నారు. అది కేవలము శబ్ద సౌష్ఠవమే (మాటల యందలి పట్టు)గాని వేరుగాదు. మహాత్ములు దాని నెక్కువగా పట్టించుకొనరు. శ్రుతులయందును, భగవద్గీతయందు గూడ ననేక సందర్భములలో యీ "కామ, రమణ, రతి" మొదలగు శబ్దములు ప్రయోగింపబడియున్నవి. కాని యచట నాయా శబ్దములకెట్టి యశ్లీలార్థము చెప్ప బడుటలేదు. గీతయందు భగవానుడు "ధర్మా విరుద్ధోకామోఽస్మి" (ధర్మమునకు వ్యతిరేకముగాని కామము తన స్వరూపం) యని చెప్పియున్నాడు. మహాపురుషుల యొక్క "ఆత్మరమణము", "ఆత్మమిధునము", "ఆత్మరతి"యనునవి ప్రసిద్ధములై యున్నవి. అట్టి స్థితిలో కేవలము కొన్ని శబ్దప్రయోగములను గాంచి భ్రమపడి వాదించుట, విచారశీలురగు విజ్ఞుల పనిగాదు. శ్రీకృష్ణుని కేవలము మానవమాత్రుని గనే భావించువారలకు మాత్రమే యీ "రమణ-రతి" శబ్దములు కేవలము క్రీడగను లేక ఆటకాయ తనముగ గోచరించును అది వ్యాకరణ శాస్త్ర ప్రకారము ["రము క్రీడాయాం"] అది యుక్తమే.

దృష్టి భేదముచేత శ్రీకృష్ణుని లీల, భిన్న భిన్నముగా గోచరించు చుండును. అధ్యాత్మ వాదులు శ్రీకృష్ణుని ఆత్మ స్వరూపునిగా దర్శించెదరు. గోపికలను మనో

శ్రీ శుకమహర్షి పరీక్షిత్తుతో నిట్లనియె :

"రాజా, భగవానుని యాదేశమును పొందినవారై, ఆ గోపకన్నియలు అచటి నుండి వెళ్ళుటకు మనస్సులు రాకున్నను, శ్రీకృష్ణ చరణ కమలములనే ధ్యానించుచు నతి కష్టము మీద, వ్రజ మండలి తమ యిండ్లకేగిరి. ఇప్పుడు వారి కోరికలు పూర్ణముగా సిద్ధించినవి గదా!

మరి యొకప్పుడు, తమ సహచరులగు గోప బాలురతో గూడినవారై, బలరామ కృష్ణులు పశువుల దోలుకొనుచు, బృందావనము నుండి చాల దూరము వెళ్ళిరి. అది గ్రీష్మ ఋతువు. సూర్యకిరణములు దుస్సహములుగా నున్నవి. కాని, పెద్ద పెద్ద వృక్షములు భగవానునిపై గొడుగువలె నీడను గల్పించుచున్నవి. అది గాంచిన శ్రీకృష్ణుడు, తోకకృష్ణ, అంశు, శ్రీదామ, సుబల, అర్జున, విశాల, ఋషభ, తేజస్వి, దేవప్రస్థ, వరూథపాది తన మిత్రుల సంబోధించుచు నిట్లు పల్కె. "మిత్రులారా, యీ వృక్షముల యౌదార్యమును గాంచుడు. వీని జీవిత మంతయు యితరులకు మేలు కలిగించుట యందే గడచు చున్నవి. ఇవి, గాలి తాకుడులను, వర్షమును, యెండను, మంచును—సమస్తమును తాము సహించుచు, వాని నుండి మనలను కాపాడుచున్నవి. ఈ వృక్షముల వలన సర్వప్రాణులకు సహాయము లభించుచున్నది. వీని వలన వారి జీవ యాత్ర

---

వృత్తి రూపములుగా దర్శించెదరు. అట్టి వృత్తుల యొక్క యావరణ నశించుటయే వస్త్రాపహరణలీల. ఆ వృత్తులాత్మయందు రమించుటయే "రాసక్రీడ". ఈ దృష్టితో గూడ భగవానుని లీలలు సమంజసములుగ దోచును.

ఇది, భక్తులయొక్క దృష్టి యందు, గోలోకాధిపతియు పూర్ణతమ పురుషోత్తముడునగు శ్రీకృష్ణ భగవానుని యొక్క నిత్య లీలా విలాసమే. ఈ లీల యనాది నుండి యనంతకాలము దనుక జరుగుచునే యుండును. అప్పుడప్పుడు భక్తుల యందలి దయచేత, భగవానుడు, తన పరంధామమును, తన సహచరులతో గూడ లీలాధామమందు ప్రకటితము గావించి లీలలను ప్రదర్శించుచుండును. భక్తులకు, స్మరణ-చింతన-ఆనంద సామగ్రిని ప్రకట మొనర్చి, మరల నంతర్ధాన మగుచుండును. సాధకుల ననుగ్రహించుటకై, దయతో భగవానుడు యే ప్రకారము వారి యంతర్మలమును, మరియు అనాది కాలము నుండి వారు సంపాదించు కొన్న సంస్కార రూపపటమును శుభ్రపరచునో యనునదియే, యీ చీర- హరణ రూపమగు లీల యందు ప్రకటితమైనది. భగవానుని లీల అతి రహస్యము. అది యాతనికే తెలియును. అతని దయచేత ఆ లీల యందు ప్రవేశించిన భక్తులు కొద్దిగా తెలుసుగుదురు. శాస్త్రముల యొక్కయు-సత్పురుషుల వాక్కుల యొక్కయు ఆధారముచే కొంచెము వ్రాయు సాహసము చేయబడినది. (హనూమాన్ పోద్దార్)

కొనసాగుచున్నది. అందుచే నివి సర్వ శ్రేష్ఠములని నా యభిప్రాయము. సత్పురుషుని యింటి నుండియే యాచకుడును రిక్త హస్తములతో నెట్లుతిరిగి వెళ్ళకుండునో, అటులనే యీ వృక్షములు గూడ తమ నాశ్రయించిన వారి నేదో యొక విధమున సత్కరించుచునే యుండును. అవి తమ పత్రములు, పుష్పములు, ఫలములు, నీడ, వేరు, చర్మము, కొయ్య, గంధము, జిగురు, మసి, బొగ్గు, అంకురములు, చిగురులు మొదలగు వానిచే గూడ, ప్రజల యభీష్టములను తీర్చుచున్నవి. మిత్రులారా, ప్రపంచమందు జీవులెందరో యున్నారు. కాని, చేతనైనంతవరకు తమ ధనము, వివేకము, విచారము, వాక్కు, ప్రాణములతో యితరులకు మేలు కలుగ చేయు పనులొనర్చుటలోనే వారి జీవిత సాఫల్యత సిద్ధించును."

అని యుపన్యసించుచు, శ్రీకృష్ణుడు యిరువైపుల, ఫల పుష్ప ప్రవాళ సంభరితములై నేలను దాకుచున్న కొమ్మలు గల వృక్ష పంక్తులు గల మార్గము గుండా, యమునా తీరమునకు చేరినాడు. యమునా జలము స్వచ్ఛముగా చల్లని మధుర జలములు కలిగి యున్నది. అందరును గోవుల ముందు నీరు త్రాగించి పిమ్మట తాము తృప్తిగ నీటిని త్రాగిరి. యమునాతట మందలి యుపవనమందు గల పచ్చిక మైదానమందు స్వేచ్ఛగా గోవులను మేపుకొనుచు గోపబాలురు తిరుగుచుండిరి. ఆ సమయమందు గోపబాలురు కొందరు ఆకలిగొన్నవారై, రామ కృష్ణులను దగ్గరి యిట్లు పలికిరి.

# ఇరువది మూడవ యధ్యాయము

## విప్రపత్నుల ననుగ్రహించుట

"నయనాభిరామా, రామా, దుష్ట నిబర్హణా శ్రీకృష్ణా, ఆకలి మమ్ము కలవర పరచుచున్నది. మీరు మా యాకలిని శాంతింప జేయుడ"ని గోప బాలురు విన్నవించుకొనగా, భక్తురాండ్రగు విప్ర భార్యల ననుగ్రహింప దలచినవాడై దేవకి నందనుడు, వారితో నిట్లనియె.

"నా ప్రియ మిత్రులారా, యిచటికి సమీపముననందే వేదవాదులగు బ్రాహ్మణులు, స్వర్గకాములై, ఆంగిరసమను పేరుగల యజ్ఞమును చేయుచున్నారు. మీరా యజ్ఞ శాలకు వెళ్ళి, మా పేర్లు చెప్పి కొంచెమన్నమును యాచించి తీసుకురండు" అని యాదేశింపబడినవారై యా గోప బాలురా యజ్ఞ శాలకు వెళ్ళి, విప్రులనుగాంచి, సాష్టాంగ దండ ప్రణామము లాచరించి. "ఓ భూ సురోత్తములారా, మా విన్నప మాలించుడు. మేము వ్రజ భూమికి చెందిన గొల్ల పిల్లలము. బలరామకృష్ణులు పంపగా మీ వద్దకు వచ్చినారము. వారు గోవుల దోలుచు యిచటకి సమీప

మందున్న ప్రదేశమునకు వచ్చి యున్నారు. ఇప్పుడు చాల యాకలిగొని యున్నారు. క్షున్నివారణకై వారు కొంచెమాహారమును మీనుండి కోరుచున్నారు. బ్రాహ్మణు లారా, మీరు ధర్మ సూక్ష్మము నెఱిగిన మహానుభావులు. మీకు శ్రద్ధ యున్నచో భోజనార్థులై యున్న వారలకు కొంచెమన్న మొసంగుడు. పశుబలి యందు యజ్ఞ మందు దీక్షితుడైన వాని యొక్క సౌత్రామణీ యజ్ఞ దీక్షితుడైన పురుషునియొక్క యన్నమును భుజింపరాదనియు, యితర యజ్ఞము లందే సమయమందైనను దీక్షి తుడై యుండు వాని యన్నమునైనను భుజించిన దోషము లేదని చెప్పుదురు." అని పలికిరి.

ఈః ప్రకారము భగవానునికై యన్నమును యాచించుచున్న గొల్లలపలుకులు వినియు, ఆ బ్రాహ్మణులు వారిని పట్టించుకొన లేదు. వారు స్వర్గాది తుచ్ఛ ఫల ముల గోరువారై, వానికి చేయవలసిన గొప్ప కర్మల యందు నిమగ్నులై యున్నారు. నిజము చెప్పవలసినచో, ఆ బ్రాహ్మణులు జ్ఞాన దృష్టిలో బాలకులే. కాని వారు తాము గొప్ప జ్ఞాన వృద్ధులమని భావించుకొనుచున్నారు. దేశము, కాలము, వివిధములగు యజ్ఞ సంభారములు, వివిధ కర్మల యందు విని యుక్తము లగు మంత్రములు, అనుష్ఠాన పద్ధతులు, యజ్ఞము చేయించు ఋత్విక్కులు మొద లగువారు, అగ్నులు, దేవతలు, యజమాని, యజ్ఞము ధర్మము - మొదలగు సమస్త రూపముల యందును భగవానుడొక్కడే ప్రకటితముగు చున్నాడు. అట్టి యింద్రియాతీత పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీకృష్ణ భగవానుడే, వ్రజ బాలుర ద్వారా అన్నము నర్థించినాడు. కాని, దేహాత్మ భ్రాంతి కలిగి యున్న యీ మూర్ఖ బ్రాహ్మణులు, భగవానుని గూడ సాధారణ మానవునిగా భావించి యాతని సమ్మా నించరైరి! వారింత సేపటికిని "అవున"ని కాని "కాదని" కాని ప్రత్యుత్తర మీయ కుండుటచే గొల్ల పిల్లల యాశ సన్నగిల్లినది. వెంటనే వారు తిరిగి వచ్చి రామ కృష్ణులకు యావద్వృత్తాంతము విన్నవించిరి. వారిని విన్నపమాలించి, సర్వ జగన్నాథుడగు శ్రీకృష్ణుడు నవ్వ దొడగినాడు. గొల్ల పిల్లలతో "మిత్రులారా, సంసార మందు అసఫలత యనునది యప్పుడప్పుడు సంభవించుచునే యుండును. వాటిచే మనము నిరాశ చెందరాదు. మరల మరల ప్రయత్నము చేయుచున్నచో తప్పక సఫలీకృతులమయ్యెదము." అని వారిని సమాధానపరచి, మరల వారితో నిట్లు పల్కె.

"నా ప్రియమిత్రులారా, యీ పర్యాయము మీరా విప్రుల భార్యలవద్ద కేగుడు. రామకృష్ణులు యీ సమీపమందే యున్నారు. ఆకలిగొని యున్నారు. అని చెప్పినం తనే వారు మీకు కావలసినంతయన్న మొసంగెదరు. వారు నన్ను చాల ప్రేమించు నట్టివారు. వారి మనస్సెపుడును నా యందు లగ్నమై యుండు" నని పలుక 'గోప బాలురీమారు పత్నీశాలకేగిరి.

అక్కడ చక్కగా నలంకరించుకొని, సుందర లక్ష్మీ స్వరూపులుగా కూర్చునియున్న బ్రాహ్మణపత్నులగాంచి, యా గోపబాలురు, వారికి సాగిలపడి మ్రొక్కి, వినయముతో నిట్లు విన్నవించిరి. "అమ్మలారా, మీకు నమస్కారము దయతో మా పలుకులాలించండి. శ్రీకృష్ణ భగవానుడీ సమీపమునకు వచ్చియుండి, మమ్ము మీ దగ్గరకు పంపినాడు. అతడు తన యన్నయగు బలరామునితోను, సహచరులగు గొల్లపిల్లలతోను చాలదూరము గోవుల మేపుకొనుచు నిచటికి వచ్చియున్నాడు. అందరును బాగా ఆకలితో నున్నారు. వారికొరకు మీరు కొంచె మన్నము పెట్టుడు" అని వేడినారు.

పరీక్షిన్మహారాజా, ఆ బ్రాహ్మణపత్నులు చాలదినములనుండి కర్ణాకర్ణిగ భగవానుని బాలలీలల నాలించుచున్నారు. మనోహరములగు ఆ లీలలయందు వారి మానసములు లగ్నమై యున్నవి. అట్టి శ్రీకృష్ణునెప్పుడు దర్శింపగలమా యని వారు మహా కుతూహలముతో నున్నారు. శ్రీకృష్ణుడే వారున్న ప్రదేశ సమీపమునకు వచ్చియుండెనని వినగానే వారిలో సంభ్రమము గలిగినది. వెంటనే వారు పాత్రలయందు భక్ష్య, భోజ్య, భోష్య, లేహ్యములను చతుర్విధాహారములను, స్వాదిష్టములు హితకరములునగు వానిని, గిన్నెలయందు నింపుకొని, తమ పతి పుత్ర బాంధవులెంత యడ్డగింప ప్రయత్నించినను సరకుసేయక, తమ ప్రియతమ భగవానుడగు శ్రీకృష్ణుని వద్దకేగుటకై, యజ్ఞశాలనుండి వెలువడిరి. నదులన్నియు తమ లక్ష్యమగు సముద్రుని చేరునట్లున్నది వారి ప్రయత్నము. ఎందుకుండదు ? శ్రీకృష్ణుని సౌందర్య మాధుర్యాదులను, గుణములను, లీలలను విని, విని వారెన్ని దినములనుండి భగవానుని చరణ కమలములయందు తమ మనములను సమర్పించి యుండిరోగదా! బ్రాహ్మణపత్నులచటికేగి దర్శించినారు. యమునా తటమందు నవ పల్లవశోభాయమానమగు నశోకవనమందు, పల్లవ బాలుర సమూహముచే పరివృత్తులై యున్న, రామకృష్ణులటునిటు నడయాడుచుండిరి శ్రీకృష్ణుని నీలమేఘ శరీరమునందు పీతాంబరము మెరయుచున్నది. కంఠమునందు వనమాలయు, మస్తకమందు శిఖిపించము, గాత్రమందుంతటను ధాతుచిత్రములు, మొదలగు నలంకారములతో నటునివలె గాన్పించుచున్నాడు. ఒక చేతిని తన "స్నేహితుని భుజముపైనుంచి రెండవచేతితో కమలము నాడించుచున్నాడు. కర్ణములయందు కమలకుండలములు, కపోలములయందలకలు వ్రేలాడుచున్నవి. ముఖకమలము మందహాస రేఖతో వికసించి యున్నది. విప్రపత్నులింతవరకు తమ ప్రియతముడగు శ్యామసుందరుని కల్యాణగుణములను, మాధుర్య లీలలను విని విని, తమ మనములతని ప్రేమయందు లగ్నమొనర్చుకొని యుండిరి. ఇప్పుడు తమ నేత్ర రంధ్రములద్వారా ఆ శ్యామసుందరుని తమలోనికి ప్రవేశింప జేసుకొని యచట నాలింగనమొనర్చి, హృదయ తాపమును శాంతింప జేసుకొనుచుండిరి. అదియే

విధముగ నున్నదనగా :- జాగ్రత్స్వప్నావస్థలయందు "నేను - నాది" యను భావముతో, మనోవృత్తులు తాపము నొందుచుండును. కాని సుషుప్తి దశయందు సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుని పొంది, యతనియందు లీనమై పోవుటచే, యంతకు ముందున్న తాపమంతయు శాంతించి పోవునట్లున్నది.

అందరి హృదయములందుండు విషయములు భగవానునకు తెలియును. అందరిబుద్ధివృత్తులకు అతడు సాక్షిగనుండును. ఆ బ్రాహ్మణవనితలు తమ పతి పుత్రాదులనందరిని వదలి కేవలము తన దర్శనముకై యేతెంచిరను విషయము గుర్తించినవాడై వారితోనిట్లు వచించినాడు. ఆ సమయమందతని ముఖారవిందముపై హాస్యతరంగములు వినోదముగ చిందులాడుచున్నవి.

"సౌభాగ్యవతులారా, మీకు సుస్వాగతము. రండు. కూర్చొనుడు. మేము మీకేమి సత్కారమొనర్పగలము? మీరందరు మమ్ముదర్శించుటకై వచ్చియున్నారు. ఇది మీవంటి ప్రేమపూర్ణ హృదయులకుచితమే. సంసారమందు తమ యథార్థహిత మును గుర్తించునట్టి బుద్ధిమంతులగు పురుషులందరు, తమ ప్రియతమునితో సమా నముగనే నన్ను ప్రేమించుచున్నారనుటలో నెట్టి సందేహమునులేదు. ఆ ప్రేమలో గూడ, యేప్రకారమగు కోరికయులేనట్టి, యెట్టి వ్యవధానము, సంకోచము, కపటము, ద్వైధీభావము, లేనట్టి ప్రేమను నాయందు చూపుచున్నారు. ప్రాణము, బుద్ధి,మనస్సు, శరీరము స్వజనము, పతి, పత్ని, పుత్ర, ధనాదులైన సంసారమందలి సమస్త వస్తు వులు దేనికొఱకై, దేనిసన్నిధి యందు ప్రియములగుచున్నవో, అట్టి యాత్మ, పర మాత్మ స్వరూపుడనగు నాకంటె (కృష్ణుని) ప్రియతరమగునదేది యుండును? (ఉండదు అని భావము). కావున మీరిచటికి వచ్చుట యుచితముగాదు. మీ ప్రేమను నేనభినందించుచున్నాను. కాని, మీరిపుడు నన్ను దర్శించియుంటిరి కావున తిరిగి యజ్ఞశాలకు వెళ్ళుడు. మీ పతులు బ్రాహ్మణగృహస్థులు. మీ సహకారముతోనే వారు తమ యజ్ఞమును పూర్తిగావింపగలరు" అని పలికె.

అందుకు బ్రాహ్మణపత్నులిట్లు వచించిరి. "సర్వాంతర్యామివగు శ్యామ సుందరా! నీ యీ పలుకులు నిష్ఠురతాపూర్ణములై యున్నవి. ఇట్లు నీవు పలుకుట యుచితముగాదు. ఒకమారు భగవంతుని పొందినవారికి, తిరిగి సంసారమందు జన్మించవలసిన యవసరముండదని శ్రుతులు వచించుచున్నవి. నీవు యీ వేద వాక్కును సత్యముగావించుము. మేము మా సమస్తబంధువుల యాజ్ఞలనుల్లంఘించి, నీ చరణములయందు పడియున్న తులసీమాలను మా కేశములయందు దాల్చవలయు నను సంకల్పముతో, నీ చరణముల చేరియుంటిమి. ఇపుడు, మా పతి పుత్రులు, మాతాపితరులు, బంధుబలగము లెవ్వరును మమ్ము స్వీకరింపరు. ఇక యితరుల

మాట చెప్పనేల? వీరశిరోమణీ! నీ చరణములందే వచ్చిపడియుంటిమి. మాకు వేరు గతిలేదు. కావున మేమితరులను శరణుపొందవలసిన యవసరమురానట్టి వ్యవస్థను మాకు కల్పింపుము" అని వేడుకొనిరి.

భగవానుడు వారితో, దేవీమణులారా, మీ పతి పుత్రులు, తల్లిదండ్రులు, స్వజనులందెవ్వరును మిమ్ము తిరస్కరింపరు. వారిమాట యెందుకు? సమస్త ప్రపంచము మిమ్ము గౌరవింపగలదు. దానికి కారణమున్నది. ఇపుడు మీరు నావారైనారు. నాతోకూడిన వారైనారు. దేవతలుగూడ నా యీ మాటల కామోదము తెల్పుచున్నారు. ఈ ప్రపంచమందు నాయంగసంగమనునదే మనుజులయందు నా ప్రీతి యనురాగమునకు కారణముగాదు? కాన మీరు వెళ్ళండి. మీ మానసములను నా యందు లగ్నము గావించండి. మీరచిరకాలమందే నన్ను పొందగలరు"

అని భగవానుడభయప్రధానము చేయగనే బ్రాహ్మణవనితలు తిరిగి యజ్ఞశాల కేగిరి. ఆ బ్రాహ్మణులు తమ స్త్రీలను కొంచెముగూడ తప్పుపట్టలేదు. వారితో గూడి తమ యజ్ఞమును నిర్విఘ్నముగ నెరవేర్చుకొనిరి.

బ్రాహ్మణ స్త్రీలలో నొకతెను ఆమె భర్త బలవంతముగా నిర్బంధించి శ్రీకృష్ణుని వద్దకు బోకుండ జేసినాడు. ఆమె తానిన్ని రోజులనుండి వినుచున్న భగవానుని రూపమునే మనసునందేకాగ్రతతో ధ్యానించుచు నుండిపోయినది. ధ్యానము సిద్ధించినది. హృదయమునందే భగవానుని యాలింగన భాగ్యమునంది, కర్మోపార్జితమైన తన స్థూలదేహమును వదలినది. (శుద్ధసత్త్వమయమగు దివ్య దేహముతో నామెకు భగవత్సాన్నిధ్యము లభించినది.)

అచట వనమందు, బ్రాహ్మణవనితలు తెచ్చిన చతుర్విధాన్నములను శ్రీకృష్ణుడు, ముందుగా తన సహచరులందరకుబెట్టి యనంతరము తానును భుజించినాడు. ఈ ప్రకారము, భగవానుడగు శ్రీకృష్ణుడుగూడ, సాధారణ మానవునివలెనే లీలయొనర్చుచు, తన సౌందర్యముచేత, మాధుర్యములగు వాక్కులు, కర్మలచేత, గోవులను, గోపబాలురను, గోపీగోపకులను ఆనందపరచుచు, స్వయముగా తాను వారి యలౌకికమగు ప్రేమరసము నాస్వాదించుచు నానంద భరితుడగుచుండె.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుడేయను విషయము బోధపడగనే, బ్రాహ్మణులకు మహాపశ్చాత్తాపము గల్గినది. జగదీశ్వరులగు బలరామకృష్ణుల యాజ్ఞనుల్లంఘించి తాము మహాపరాధముచేసి యుంటిమని విచారము కలిగినది. మానవులవలె లీలలొనర్చుచున్నను పరమేశ్వరులే వారు. తమ భార్యల హృదయములందు పరమేశ్వరుని యలౌకిక ప్రేమ నిండియున్నదనియు, తామందుకు పూర్తిగ భిన్నముగ, ప్రేమవిరహితులమై యుంటిమనియు గుర్తించుటతోడనే, బ్రాహ్మణులు, మహాపశ్చాత్తాపముతో తమను తాము నిందించుకొనసాగిరి.

"అయ్యో, మేము భగవానుని యెడల విముఖులమైతిమే! ఉత్తమ కులమందు జన్మించితిమి. గాయత్రీ మంత్రోపదేశమును పొంది, ద్విజులమైతిమి. వేదాధ్యయన మొనర్చి యనేక వేదోక్తములైన యజ్ఞములాచరించితిమి. కాని యవియన్నియు దేని కొఱకు? ఛీ, ఛీ, మా చదువులు వ్యర్థము. మా వ్రతములు నిష్ఫలములైనవి. మా పాండిత్యము వలన ప్రయోజనమేమి? మా వంశోన్నతి కర్మకాండయందలి కౌశలములు మొదలగునవెందుకును పనికిరాకుండబోయినవి. నిశ్చయముగా భగవానుని మాయ మహామహాయోగులను గూడ మోహింప జేయుచున్నది. మేము మానవులకు గురువులగు బ్రాహ్మణులముగా చెప్పబడుచుంటిమి. కాని మాకుపకరించు సత్యమైన స్వార్థ పరమార్థ విషయమును బొత్తుగా మఱచిపోయితిమి. ఎంతటి యాశ్చర్యకరమగు విషయము? స్త్రీలైనప్పటికిని వారికి, జగద్గురుడు, భగవానుడునగు శ్రీకృష్ణుని యందు యెంతటి యగాధ ప్రేమ భక్తులు గలవు? వారు సమస్త గృహ బంధములను త్రెంచుకొనిరి. మరణముచే గూడ విడివడని యా దృఢ బంధములను వారెంత సులభముగ ఛేదించుకొనగలిగిరి? వారికి ద్విజాతి యోగ్యమగు నుపనయనము మొదలగు సంస్కారములు లేవు. గురుకులవాసమూ చేయలేదు. తపస్సాచరింపలేదు. అత్మజ్ఞానమును గూర్చి విచారణయు చేయలేదు. వాటి యన్నిటి విషయమటుండనిచ్చి, వారి యందు పూర్ణ పవిత్రత, శుభకర్మలు గూడలేవు. అయినప్పటికిని యోగేశ్వరేశ్వరుడగు భగవానుని యందు వారి కెంతటి దృఢమగు ప్రేమ భక్తి యేర్పడినది! మనమెంతటి సంస్కారవంతులమైనను, వేదవేదాంగము లభ్యసించి, తపస్సులొనర్చి యాత్మను సంధానమొనర్చినను, పవిత్ర కర్మలెన్ని యొనర్చియున్నను, వాస్తవమేమనగా, భగవానుని పాదపద్మములపై మనకు ప్రేమలేదు. గృహస్థ ధర్మముల యందు తలమునకలగుచుంటిమి. మన మంచిచెడుల గురించిన యాలోచనే మఱచియున్నాము. ఆహా! యేమి! భగవానుని కృప! భక్త వత్సలుడగు ప్రభువు గొల్లపిల్లల ద్వారా తన సందేశమును పంపి, మనకు తన స్మరణ కలుగునట్లు చేసినాడు భగవానుడు పూర్ణకాముడు. కేవల్య మోక్ష పర్యంతము గల సమస్త కోరికలను పూర్ణము గావింపగల మహానుభావుడు. మనను చైతన్యవంతుల చేయుటకు గానిచో, మనవంటి క్షుద్రజీవులవలన నతనికి గలుగు ప్రయోజమేమున్నది? తప్పక మనకు బోధించుట కొరకే యాతడు ఆహారమును యాచించుట యను నెపమును పన్నియుండె. కానిచో నతనికి యాచింపవలసిన యగత్యమేమున్నది? సాక్షాత్తు లక్ష్మీదేవి, స్వయముగా నితర దేవతలనందరిని వదలి తన చంచలత్వ, గర్వాది దోషములను పరిత్యాగమొనర్చి, కేవల మొక మారు భగవానుని చరణ కమల స్పర్శనందుటకై, యతనిని సేవించుచుండును. అట్టి లక్ష్మీపతి, యితరులను భోజనము కొరకై యాచించుట, ప్రజలను భ్రాంతింపజేయుటగానిచో మరి

యేమి? దేశము, కాలము, వివిధ వస్తువులు, కర్మలయందు వినియుక్తములగు మంత్రములు, అనుష్ఠాన పద్ధతులు, ఋత్విజులు, అగ్ని, దేవతలు, యజమానుడు, యజ్ఞము, ధర్మము—అన్నియు భగవానుని స్వరూపములే. యోగేశ్వరేశ్వరుడగు విష్ణు భగవానుడే స్వయముగ శ్రీకృష్ణ రూపమున యదువంశమందవతరించియున్నాడు. ఈ విషయము మనమిదివరలో విని యున్నాము. కాని యతనిని గుర్తించలేనంత మహా మూఢులమైపోతిమి. ఇంత జరిగినను మనము ధన్యాతిధన్యులమే. మనకు, మహా కృష్ణ భక్తి గలిగిన మగువలు భార్యలుగా లభించుట మహాభాగ్యము. వారి భక్తి కారణముగనే మనయందు గూడ నిశ్చలమగు కృష్ణ భక్తి యేర్పడినది.స్వామీ! నిరతిశయానంద స్వరూపడవు. నీ జ్ఞాన మనంతము. నీ మాయ చేతనే మా బుద్ధి మోహితమై, మేము ఈ కర్మలయందు మగ్నులమై యుండిపోవుట సంభవించినది. నీకు నమస్కారము. ఆది పురుషోత్తముడగు శ్రీకృష్ణ భగవానుడు, మా యీ యపరాధమును మన్నించుగాక! ఏలననగా, మేమాతని మాయలో బడిపోయి యతని ప్రభావమును గుర్తించలేని యజ్ఞానులమై పోయితిమి గదా.”

శ్లో॥ నమస్తుభ్యం భగవతే కృష్ణా యాకుంఠ మేధసే
యన్మాయా మోహితధి యో భ్రమామః కర్మ వర్త్మసు

రాజా, ఆ బ్రాహ్మణులు శ్రీకృష్ణుని యాదేశమును తిరస్కరించి యుండిరి. అందుచే తమ యపరాధమును తలచుకొనుటచే వారికి మహా పశ్చాత్తాపము గల్గినది వారి హృదయమందు బలరామకృష్ణుల దర్శించవలయుననెడి తీవ్ర వాంఛయుదయించినది. కాని కంసుని భయముచే వారు భగవానుని దర్శింప సాహసించలేకపోయిరి” అని శ్రీశుకుడనియె.

# ఇరువది నాల్గవ యధ్యాయము

## ఇంద్రయాగ నివారణము

శ్రీకృష్ణ భగవానుడు బలరామ సహితముగ బృందావనమందే వసించుచు ననేక లీలలొనర్చుచునుండె. ఒకనాడతడు, అచటనున్న గోపాలురందరు యింద్ర యాగము సలుపు ప్రయత్నములు చేయుచుండుటనుగాంచె గోవిందుడు సర్వాంతర్యామి. సర్వజ్ఞుడు కావున నతనికి తెలియని రహస్యములేవియు నుండవు. అంతయు అతనికి తెలియును. అయినను తెలియని వానివలె వినయముతో నందుడు మొదలగు వారందరున్న సమయమందాతడు నందునితోనిట్లు ప్రశ్నించె. “నాయనా, మీరందరు నేదియోయుత్సవము చేయదలపెట్టినట్లున్నది. ఏమిటది? దానివలన ప్రయోజనమేమిః ఏ యుద్దేశ్యముతో యేసాధనములద్వారా యీ యజ్ఞము చేయబడు

చున్నది? ఆ వివరమంతయు నాకు చెప్పుడు. నేను మీ కుమారుడను. మీరు నాకు తండ్రి. ఈ విషయములన్నియు తెలుసుకొనవలయునని నాకు చాల కుతూహలముగా నున్నది. సర్వులను తమ ఆత్మస్వరూపులుగా భావించునట్టియు, తమవారు యితరులు నను భేదములేనట్టియు, శత్రు, మిత్ర, ఉదాసీనభావము లేవియులేనట్టి సత్పురుషులకు రహస్యములను నట్టివేవియునుండవు. కాని యట్లు కానిచో, రహస్య విషయము శత్రువుకువలెనే యుదాసీనునకు గూడ చెప్పరాదు మిత్రుడు తనతో సమానుడనియే చెప్పబడినందుచేత,అతనితో నే విషయము రహస్యముగ నుంచుటయే సంభవించదు ప్రపంచమందలి మానవులు, తెలిసియు, తెలియకయు గూడ ననేక కర్మలననుష్ఠించు చుందురు. వారిలో బాగుగా తెలిసి యనుష్ఠింపబడునట్టి కర్మలొసంగునట్టి ఫలితము లను, తెలియక యనుష్ఠింపబడునట్టి కర్మలు యివ్వవు. అందుచే, మీరిపుడాచరించ బోవునట్టి కర్మ, శాస్త్రీయమా? లేక లౌకికమా, యనునది తెలుసుకొన గోరుచుంటిని. నాపై దయయుంచి చెప్ప వేడుచున్నాడ"నని వినయముగ ప్రశ్నించిన తనయునితో నందగోపుడిట్లు వచించె.

"తండ్రీ, మనకు వర్షము లొసంగునట్టి మేఘములకు యింద్రుడధిపతి. ఆ మేఘములతని స్వరూపములే సమస్త ప్రాణులకు తృప్తి నొసంగి జీవనదానము చేయునట్టి జలమును అవి వర్షించుచున్నవి. అట్టి మేఘాధిపతియగు యింద్రుని గూర్చి మేము యజ్ఞము చేయదలపెట్టుచుంటిమి. ఏ సంభారములతో మనము యజ్ఞము చేయ దలచుచుంటిమో, అవి యన్నియు నింద్రుడు వర్షించిన శక్తివంతములగు జలము నుండి యుద్భవించినవే గదా. ఆ యజ్ఞము చేసిన పిదప, మిగిలిన పదార్థములచే మనుష్యులందరు త్రివర్గ ఫలములను (అనగా ధర్మార్థ కామములను) సాధించుచు జీవయాత్ర సాగించుచుందురు. మనుష్యులుచేయు కృషికి ఫలితము నిచ్చువాడు యింద్రుడే గదా! ఈ యాగము మన వంశమునందు పరంపరగా జరుగుచున్నది. కామమువల్లగాని, లోభముచేగాని, భయముచేగాని, ద్వేషముచేగాని, పరంపరాగత ధర్మమును విడనాడు వాని కెన్నడును శుభము కలుగనేరదు." అని పలికె.

శివ బ్రహ్మలను గూడ శాసించునట్టి కేశవుడు, నందుడు మొదలగువారి పలుకులను విని, యింద్రునకు కోపము తెప్పించుటకై, నందునితో నిట్లనియె.

శ్లో॥ కర్మణా జాయతే జంతుః కర్మణైవ ప్రలీయతే
సుఖదుఃఖం భయం క్షేమం కర్మణైవ ప్రపద్యతే
"అస్తిచే దీశ్వరఃకశ్చి త్ఫలరూప్యన్య కర్మణాం
కర్తారం భజతే సోఽపి నహ్యకర్తుః ప్రభుర్హిసః"

"తండ్రీ, జీవులు తమ కర్మానుసారముగ పుట్టుచు, గిట్టుచునుందురు. ఆ కర్మలననుసరించియే సుఖదుఃఖములను, భయమును మంగళమును పొందుచుందురు.

కర్మలే యన్నింటికి కారణమని భావించక, వానికి భిన్నముగా కర్మలకు ఫలము లొసగునట్టి యీశ్వరుడొకడున్నాడని భావించిన యెడల, అట్టి యీశ్వరుడు కర్మల నాచరించువారికే వారి కర్మలననుసరించి ఫలమీయగలడుగాని, కర్మలనాచరించని వారిపై నతనికి ప్రభుత్వమేమియు నుండజాలదు. కావున జీవులందరును తమ తమ కర్మ ఫలములనే యనుభవించుచున్నపుడు, మన క్రిందునితో పనియేమున్నది? పూర్వ సంస్కారముల ననుసరించి ప్రాప్తమగు మనుష్యుల కర్మఫలములను మార్చునట్టి శక్తిగూడ లేనట్టి యింద్రునిచే మనకు గలుగు ప్రయోజనమేమున్నది? మనుష్యుడు తన స్వభావము (పూర్వసంస్కారములు)న కధీనుడై యున్నాడు. దాని కనుగుణము గనే నడుచుకొనును. దేవాసుర మానవాదులందరితో గూడిన యీ జగత్తంతయు తన స్వభావాధీనమేయై యున్నది. జీవుడు తన కర్మానుసారము ఉత్తమాధమ శరీర ములనందుచున్నాడు. మరల వానిని విడుచుచున్నాడు. ఆ కర్మానుసారముగనే "వీడు శత్రువు, వీడు మిత్రుడు, వీడు ఉదాసీనుడు" అను భావములతో వ్యవహ రించుచున్నాడు. కావున నేను చెప్పునదేమనగా, కర్మయే గురువు. కర్మయే యీశ్వరుడు. కావున తండ్రీ, మానవుడు పూర్వ సంస్కారానుసారముగ, తన వర్ణా శ్రమోచితములగు ధర్మముల పాటించుచు, కర్మకే గౌరవ మీయవలయును. ఏ కర్మ ద్వారా మనుష్యుని జీవయాత్ర సుగమముగా సాగిపోవునో, ఆ కర్మయే యతని యిష్టదేవతయగును. ఏ విధముగా నొకపడతి తాను వివాహమొనర్చుకొనిన భర్తను వదలి, వ్యభిచారిణియై జారుని సేవించుచున్నచో శాంతి లాభమును పొందజాల కుండునో, ఆ విధముగనే మనుజుడు, తన జీవయాత్రను నడుపునట్టి దేవతను వదలి, యితరుని యుపాసించుచున్న యెడల, నెన్నటికిని సుఖమును బడయజాలడు. బ్రాహ్మణుడు వేదాధ్యయన, అధ్యాపనముల చేతను, క్షత్రియుడు పృథ్వీపాలనము చేతను, వైశ్యుడు తన వృత్తిచేతను, శూద్రుడు ద్విజసేవచేతను, జీవయాత్ర సాగించ వలయును. వైశ్యులవృత్తి నాలుగు విధములుగ నున్నది. వ్యవసాయము, వాణిజ్యము, గోరక్ష, కుసీదము (అనగా వడ్డీవ్యాపారము). ఆ నాలుగింటిలో మనము యెప్పుడూ గోపాలనమే చేయుచు వచ్చుచున్నారము. తండ్రీ యీ సంసారము యొక్క స్థితి, ఉత్పత్తి అంతములకు క్రమముగ సత్త్వ, రజ, స్తమోగుణము కారణములై యున్నవి. వివిధ ప్రకారమగు యీ విశ్వమంతయు, స్త్రీ పురుష సంయోగముచే రజోగుణము ద్వారా ఉత్పన్నమగుచున్నది. ఆ రజోగుణ ప్రేరణచేతనే మేఘమన్ని ప్రదేశము లందునుజలమును వర్షించుచున్నవి. ఆ వర్షముచే నన్నముత్పత్తి యగుచున్నది. ఆ యన్నముచే ప్రాణుల జీవయాత్ర జరుగుచున్నది. ఇందుతో నింద్రుడు చేయునదే మున్నది?

తండ్రీ, మనవద్ద రాజ్యములుగాని నగరములుగాని, గ్రామములుగాని,

గొప్ప భవనములుగాని లేవు. మనము యెల్లప్పుడును వనవాసులము. వనములు, పర్వతములే మన గృహములు. కావున మనము గోవులను, బ్రాహ్మణులను, గిరి రాజును పూజించు ప్రయత్నము చేయుదము. ఇంద్రయజ్ఞమునకై సేకరించిన సంభారములతో, మనమీ యజ్ఞమును చేయుదము. సర్వవిధములైన పక్వాన్నములు, సూపములు, పాయసాన్నములు, భక్ష్యములు మొదలగునవన్నియు తయారు చేయబడుగాక. వేదవేత్తలగు బ్రాహ్మణులద్వారా హోమాదులు నిర్వర్తింపబడుగాక. వారికి అన్న సంతర్పణతోబాటు గో, ధనాదులు దక్షిణగా సీయబడుగాక. ఇంకను చండాలురు, పతితులు, కుక్కలు మొదలగు జంతువులకుగూడ యథా యోగ్యముగ నాహార మొసగుదము. గోవులను చక్కగా మేపుదము. గిరిరాజునకు బలి యొసంగుదము. అనంతరము తృప్తిగా భుజించి చక్కగా నలంకరించుకొని, గోవులకు, విప్రులకు అగ్నికి, గోవర్ధన పర్వతమునకు గూడ ప్రదక్షిణ మాచరింతము. తండ్రీ, యీ ప్రకారము చేయుట నాకు సమ్మతము. ఇది మీకు రుచించినచో యీ ప్రకారము చేయుడు. ఇట్టి యజ్ఞము గో బ్రాహ్మణులకు, గిరిరాజునకు తప్పక ప్రీతికరమగును. నాకు గూడ యిది చాల యిష్టము" అని పలికె.

కాలాత్మకుడగు భగవానుడు, యింద్రుని గర్వమును భంగమొనర్ప దలచి

---

* గోవర్ధనగిరి :

శ్రీకృష్ణుడు భూలోక మందవతరింప సంకల్పించిన సమయము నందతని ప్రాణాధి దేవతయగు రాధాదేవి, గోలోకమందు గల గోవరనగిరి, యమునానది, బృందావనములేని భూలోకమందు తానవతరించ జాలనని వచింపగా, భగవానుడు వానిని భూలోకమందు ప్రవేశబెట్టినాడు. శాల్మలీ ద్వీపమందలి ద్రోణాచలునికి కుమారుడ గోవర్ధనుడు జన్మించినాడు. కాశీ క్షేత్రమునుండు పులస్త్యుడను మహర్షి ద్రోణాచలుని దర్శించి, కాశీ క్షేత్రమందు ప్రతిష్ఠించుటకై గోవర్ధనుని తన కిమ్మని యాచించగా, షపభీతుడైన ద్రోణాచలుడాతని నిచ్చె. ఎనిమిదియోజనముల పొడవు, నైదు యోజనముల వెడల్పు, రెండు యోజనముల యెత్తు గల గోవర్ధనుడు మహర్షితో "నన్ను నీ వెట్లు గొంపోవగలవు." అని పలుక, "నీవు నా చేతి యందు గూర్చొనుము. సుఖముగా తీసుకొని పోయెద"నని యాతడనియె. "నీవెచటనైన నన్ను భూమియందుంచినచో నేనచట నుండి కదలనని గోవర్ధనుడ"న, సమ్మతించి ముని యాతని గొని పోవుచుండె. వ్రజ మండలమునకు వచ్చు సరికి భగవత్సంకల్పముచే గోవర్ధనుడు మునికి భారమగుటచే, శ్రాంతుడైన ముని యాతనిని క్రింద నుంచి, కార్యముల నెరవేర్చుకొని రాగా, నతడచటనుండి కదలలేదు. తన కోరిక తీరలేదుగాన నిత్యము తిల మాత్రము క్రుంగుచుండుమని పల్కి ముని వెడలిపోయె.

(గర్గ సంహిత)

నాడు. నందాది గోపాలురందరు భగవానుని సూచనను మహానందముతో స్వీకరించినారు. అతడు సూచించిన ప్రకారమే యజ్ఞము నారంభించినారు. ముందుగా బ్రాహ్మణులచే స్వస్తి వాచనము చేయించి, యా సామగ్రులచే బ్రాహ్మణులకు, గిరిరాజునకు కాన్కలు సమర్పించినారు. గోవులకు మంచి పచ్చిక మేత నొసంగినారు. అనంతరము గోవులను ముందుంచుకొని, నందాదులందరు గోవర్ధన గిరికి ప్రదక్షిణించినారు. బ్రాహ్మణాశీర్వాదముల నంది వారందరు, చక్కగా నలంకరించుకొనిన గోపికలు శ్రీకృష్ణుని లీలలను గానము చేయుచు నెడ్లబండ్లపై యనుసరించగా, గిరిప్రదక్షిణ చేయసాగినారు శ్రీకృష్ణ భగవానుడు వ్రజవాసులందరికి విశ్వాసము కలుగ చేయుటకై* గోవర్థన గిరిపై మరియొక విశాల శరీరమును ధరించి దర్శన మొసంగి, "నేను గిరిరాజు"నని పలుకుచు వారొసంగిన బలుల భక్షించి వైచినాడు. తన వారందరితో పాటు శ్రీకృష్ణభగవానుడు తాను గూడ ఆ గిరిరాజ స్వరూపునకు నమస్కరించినాడు. మఱియు నతడు తనవారితో, "చూచితిరా యీ యాశ్చర్యము! సాక్షాత్తుగా గిరిరాజు ప్రత్యక్షమై మనపై యనుగ్రహము ప్రకటించినాడు! ఇతడే రూపమునైనను ధరించగలడు, కామరూపి. ఇతని నాదరించని వనవాసుల నితడు సర్వనాశనము చేయును. రండు, మన యొక్కయు, మన గోప సంపద యొక్కయు క్షేమము కొఱకై మన మీ గిరిరాజునకు నమస్కరింతము." అని భగవానుడు ప్రేరేపించగా, నందాది గోపాలు రందరును, గిరిరాజునకు, గోబ్రాహ్మణులను విధి పూర్వకముగ పూజించి, నమస్కరించి, శ్రీకృష్ణ సహితముగ, వ్రజ మందలి తమ గృహములకు తిరిగి వచ్చిరి.

# ఇరువది యైదవ యధ్యాయము

## గో వ ర్ధ నో ద్ధా ర ణ ము

మహారాజా, తన పూజను మానిన విషయము తెలియగనే యింద్రునకు, నందాది గోపాలురపై తీవ్ర కోపము కలిగినది. కాని, భగవానుడగు శ్రీకృష్ణుడు వారికి రక్షకుడై యుండగా, యింద్రుని కోపము వారినేమి జేయగలదు! ఇంద్రునికధికారగర్వమున్నది. తానే ముల్లోకముల కధిపతినని యాతడు భావించుచుండె. ప్రళయ కాలమందు మాత్రమే ప్రకటితమగు నట్టి సాంవర్తక మేఘములను బిలచి, వ్రజ మండలము నాక్రమింప బంపు నిట్లు వారితో పల్కె.

"ఏమి యీ వనవాసులగు గోపాలుర గర్వము! నిజముగా వీరికి ధనమదము నెత్తికెక్కినది. సామాన్య మానవ బాలకుడైన కృష్ణుని మాట విని వారు దేవరాజు నగు నాకవమానము సల్పినారు. పృథివి యందు మందబుద్ధులగువారు, భవసాగర

మును తరింప జేయునట్టి సరియైన సాధనమగు బ్రహ్మ విద్యను వదలి, నామ మాత్ర నౌకలగు (పేరుకు మాత్రమే) కర్మమయములగు యజ్ఞములచే యీ ఘోర సంసార సాగరమును తరింప జూచుచుందురు. కృష్ణుడు వ్యర్థ ప్రలాపములు చేయునట్టివాడు. అజ్ఞుడు. అభిమాని, మూర్ఖుడు, తాను గొప్ప జ్ఞానినను అహంభావము గలవాడు. మర్త్యుడు. అయనను అతనియండ జూచుకొని యీయాభీరులు నన్నవమానించినారు. వారసలేధనమదముచే మత్తులై యున్నారు. కృష్ణుడింకను దానిని పెంపొందించి నాడు. మీరు వెళ్ళి వారి ధనమదమును, పొగరును నేలమట్టము గావించుము. వారి పశుసంపదను సర్వనాశనమొనర్చుడు. మీ వెనుకనే నేనును ఐరావతమునెక్కి, నందవ్రజమును సర్వనాశము చేయుటకై, మహావీర్యులగు మరుద్గణములను వెంటబెట్టు కొని వచ్చెదను."

ఈ విధముగా నాజ్ఞాపించి యింద్రుడు ప్రళయ మేఘములను వ్రజమండలము పైకి వదలినాడు. అవి మహావేగముతో వచ్చి వ్రజమండలముపై మూసలధారలతో వర్షింపసాగినవి. నాల్గుదిక్కులయందు విద్యుత్కాంతులు వ్యాపించినవి. తీవ్రమరుద్గణ ప్రేరితములై, గర్జించుచు వడగండ్లను కురియుచున్నవి. వ్రజ భూమియంతయు జల మయమై పోయినది. మిట్ట పల్లముల జాడ తెలియకుండె. ఝుం ఝూవాతము, మూసలధారావర్షముతో, పశువులన్నియు చలికి కొంకరులు పోవుచున్నవి. శీతార్తు లైన గోపకులు గోపికలు గూడా గోవిందుని శరణు జొచ్చిరి. తమ పిల్లలను, తమ శిరములను గూడ తమ శరీరములందుముడుచుకొని, చలికి గడగడవణకుచు, భగవానుని చరణ కమలముల దరికిజేరి, "కృష్ణా, మహాభాగా, కేవలము నీవే మాకిపుడు రక్షకుడవు. గోకులమునకేకమాత్ర రక్షకుడవు నీవేగదా! భక్తవత్సలా, ఇంద్రుని కోపము నుండి మమ్ము నీవే యిపుడు రక్షించవలయును." అని ప్రార్థిం చిరి. భగవానుడు చూచినాడు. వర్షము, వడగండ్ల దెబ్బలచేత పీడితులైన వ్రజ వాసులు స్పృహ దప్పినట్లున్నారు. ఇది యంతయు యింద్రుని దుష్కృత్యమేయని గ్రహించినాడు. "మనము యింద్ర యజ్ఞమును భంగమొనర్చితిమి. అందుచే వ్రజ మును నాశమొనర్పదలచి యింద్రుడు అకాలమందు ప్రచండవాయువు, వడగండ్లతో గూడిన ఘోరవర్షమును గురిపించుచున్నాడు. మంచిది. నేనిపుడు నాయోగమాయా ప్రభావముచేత నతనికి తగురీతిగా సమాధానమొసంగెదను. మూర్ఖత్వముచే తాను లోకపాలకుడనని గర్వించుచున్నాడింద్రుడు. అతని యైశ్వర్యగర్వమును, అజ్ఞాన మును చూర్ణము గావించెదను. దేవతలు సత్త్వప్రధానులు. అందుచే నితనియందు పదవి, యైశ్వర్యముల యభిమానమేమాత్రము నుండరాదు. అందుచే సత్త్వ గుణము నుండి చ్యుతులైన దేవతలకు నేను మానభంగము చేయుట యుచితమే

యగును. దానిచే చివరకతనికి శాంతి లభింపగలదు. ఈ వ్రజవాసులందరు నాయా శ్రితులు. నన్నే నమ్ముకొనినవారు. నేనేవీరికేకమాత్ర రక్షకుడను. నాయోగమాయా ప్రభావముచే వీరికి రక్ష కల్పించెదను. సత్పురుషులరక్షించుటయేగదా నా వ్రతము. ఆవ్రతా చరణమునకు సమయమిపుడు వచ్చినది. *

అని తలచినవాడై శ్రీకృష్ణుడొక్క చేతితో లీలగా గోవర్ధన పర్వతమునెత్తి ఛత్రమువలె దాల్చినాడు. చిన్నపిల్లలు పుష్పములను దాల్చినంత తేలికగా పర్వత మును దాల్చినాడు. అనంతరము గోవిందుడు వ్రజవాసుల నుద్దేశించి, "అమ్మా, అయ్యా! వ్రజవాసులారా, మీ రందరును మీ గోవులు మొదలగు సమస్త సంపద లతో వచ్చి యీ పర్వతగర్తమందు ప్రవేశించుడు. ఈ పర్వత మెక్కడ నా చేతి నుండి జారి క్రిందపడునోయని శంకింపవలదు. మీకే మాత్రము భయపడవలసిన యవసరము లేదు. ఈ తుఫాను వర్ష భీభత్సము నుండి మిమ్ము కాపాడుటకే నేనీ యుపాయమూలోచించితిని" అని భగవానుడందరికి విశ్వాసము గల్పింపగా నందరును తమతమ సమస్త వస్తుజాలములతోను, గోధనము శకటములతో సహా కొండ క్రిందకు జేరిరి. ఆకలిదప్పుల బాధ, విశ్రాంతియనునవి పరిగణింపక గోపాలురందరు చూచుచుండ, యేడు దినములు నిర్విరామముగ శ్రీకృష్ణుడు కొండను తన చేతిపై వహించి యుండె. ఒక్కయడుగు గూడ నటు నిటు కదల్చలేదు. శ్రీకృష్ణుని యీ దివ్య యోగమాయా ప్రభావమును గాంచిన పాకశాసనుని యాశ్చర్యమునకు మేరయే లేకపోయినది. తన సంకల్పము వ్యర్థమగుటచే నతని గర్వమణగిపోయి నిశ్చేష్టు డైనాడు. తసంతట తానే మేఘములను వెనుకకు బంపి వైచినాడు. మేఘము లన్నియు తొలగిపోయి వర్షము వెలిసిపోవుట గాంచిన గోవర్ధన గిరిధారి గోపాలు రతో నిట్లు పలికె. "నా ప్రియ గోపాలులారా, ఇక మీరు నిర్భయముగా, మీ సమస్త వస్తు జాలములతోను, బంధు బలగములతోను, పర్వతము క్రింది నుండి వెలుపలకు రండు. వర్షమాగిపోయినది. నదియందలి నీరు గూడ తగ్గిపోయినది" భగవానుని యాజ్ఞ ననుసరించి గోపాలురందరు తమ వస్తు సామాగ్రులను శకటములపై సర్దు కొని, తమ వారందరితో, నెమ్మది నెమ్మదిగా వెలుపల కేతెంచిరి. సర్వశక్తిమంతు డగు శ్రీకృష్ణ భగవానుడు, ప్రాణులందరు కనులార చూచుచుండగనే, లీలగా పర్వ తమును, పూర్వమువలెనే యథాస్థానమందుంచినాడు.

---

* సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే!
అభయం సర్వ భూతేభ్యోదదామ్యేతద్వ్రతం మమః

"ఒక్కమారైనను" స్వామీ, నేను నీవాడని నశరణందిన వానిని సర్వదా, సర్వథా రక్షింతును. ఇది నావ్రతము" అని భగవానుడు రామావతారమున విభీషణ శరణాగతి సమయమందు పల్కియున్నాడు.

వ్రజవాసుల హృదయములు ప్రేమోద్వేగముచే నిండిపోయినవి. పర్వతమును క్రిందికి దించగనే వారు గోవిందుని వద్దకు పరుగిడిరి కొందరాతని నాలింగనము చేసుకొనిరి. కొందరు ముద్దుల వర్షము గురిపించిరి. అందరు నతనినెంతయో సత్కరించిరి. వృద్ధ గోపికలు మహానందముతో దధితండుల జలాదులతో, నిండు హృదయమున నతడికి శుభాశీస్సుల నొసంగిరి. యశోదా రాణి, రోహిణీదేవి, నంద రాజు, బలరాముడు స్నేహాతురులై కన్నయ్యను గాఢాలింగనము గావించిరి. ఆకాశమందుండి దేవతలు, సిద్ధ సాధ్య, గంధర్వ, చారణాదులందరు ఆనందభరితులై,భగవానుని స్తుతించుచు పుష్ప వృష్టి గురిపించిరి. స్వర్గమందు దేవతలు శంఖ దుందుభులు మ్రోగించిరి. తుంబురుడు మొదలగు గంధర్వ పతులు, భగవానుని మధుర లీలలను శ్రవణ పేయముగ గానము గావించిరి. అనంతరము భగవానుడు వ్రజమునకు బయలుదేరినాడు. అతని ప్రక్కన బలరాముడున్నాడు. అతనిని ప్రేమించు గోపబాలుదందరతనిని సేవించుచననుసరించిరి. వారివెంట ప్రేమమయులగు గోపికలు, తమ హృదయముల నాకర్షించునట్టియు, తమయందు ప్రేమను రగిలించునట్టి వాడునగు భగవానుని, గోవర్ధనోద్ధారణాది లీలలను మహానందముతో గానము చేయుచు వచ్చుచుండ నందరు, తిరిగి వ్రజమును ప్రవేశించిరి.

# ఇరువదియారవ యధ్యాయము

## నందునితో గోపాలురు శ్రీకృష్ణ ప్రభావ విషయమై సంభాషించుట

వ్రజవాసులందరును శ్రీకృష్ణునియొక్క యిట్టి యలౌకిక కర్మలనుగాంచి మహాశ్చర్యపడుచుండిరి. భగవానుని యనంతశక్తి ప్రభావములు వారికంతుబట్టుట లేదు. గోపాలురందరు నొకచోటచేరి తమలోతామీ విధముగ ప్రసంగించుకొనుచుండిరి.

"ఈ బాలుడు చేయుపనులన్నియు నలౌకికములుగనున్నవి. ఇట్టి మహానుభావుడు, మనవంటి మూర్ఖగ్రామీణులమధ్య జన్మించుట, యతనికి చాల నింద్యమగు విషయము అది యుచితమెట్లగును? ఏడేండ్లపిల్లవాడేకధాటిగా నేడు రోజులు గోవర్ధన గిరిరాజమును, ఏనుగు తన తొండముతో కమలములను దాల్చినట్లు సునాయాసముగా నొక్కచేతిపై ధరించినాడే! ఇది సాధారణమానవునకెక్కడైనా సంభవమగునా? ఇదెట్లు సంభవమైనది? పసివాడై యున్నప్పుడే, భయంకర రాక్షసియగు పూతన వచ్చినది. ఇతడు కనులు మూసుకొనియేస్తనమును చప్పరించెనోలేదో, దాని ప్రాణములే త్రాగివైచినాడు. అది సరిగా మరణసమయమున యముడు ప్రాణవాయువుల లాగినట్లేయున్నది. ఇతడు కేవలము మూడునెలల ప్రాయమువాడైయున్నపుడు,

శకటము క్రింప నిదురబోవుచు, నిదురలోలేచి యేడ్చుచు కాలు ఘాడించగా, అంత పెద్దశకటము తలక్రిందులుగా బడిపోయినది! ఒక సంవత్సరమువాడై యున్నపుడు సుడిగాలి రూపమునవచ్చిన రక్కసుడొకడీ చిన్నివానిని యాకసమునకెగురవైచు కొనిపోవగా, నితడాతృణావర్త రాక్షసుని గొంతుపిసికి యంతమొందించినాడు. మీరందరు చూచితిరిగదా! ఆనాడు వెన్నదొంగిలించెనని కోపముతో యశోదాదేవి యీతనిని రోటికిగట్టివైచిన విషయము! మోకాళ్ళపై చేతులపై ప్రాకుచు నితడా రోటిని లాగుకొనుచు రెండు విశాలములైన సాలవృక్షముల మధ్యనుండి పోయి, యారెంటిని కూకటివ్రేళ్ళతో కూలద్రోసినాడు. గొల్లపిల్లలతో నావుదూడల దోలు కొనుచు వనమునకు పోయినపుడు, కొంగరూపముతో వచ్చిన దైత్యుని రెండు చేతు లతో నాతనిదౌడలు చీల్చి సంహరించినాడు. ఇతనిని చంపునుద్దేశ్యముతో మరియొక నాడొకదైత్యుడు గోవత్సరూపమున నేతెంచగా, నతనిని లీలగా సంహరించి వెలగ చెట్లకేసి కొట్టినాడు ఆ చెట్లు పడిపోయినవి. బలరామ సహితుడైన యితడు గాడిద రూపముననున్న ధేనుకాసురుని, సబంధుమిత్రపరివారముగా సంహరించి, తాటి పండ్లతో నిండియున్న తాలవనము మనయందరికి నుపయోగపడునట్లొనర్చినాడు. బలరామునిద్వారా క్రూరుడగు ప్రలంబాసురుని సంహరింపజేసినాడు. దావానలము నుండి యావులను గోపబాలురను కాపాడినాడు. యమునా హ్రదమందుండిన యా కాళియసర్పమెంత విషపూరితమో మీకు తెలియునుగదా! అట్టి భయంకరసర్పమును గూడ మర్ధించి, బలవంతముగా నతని నావలకుబంపి, యా జలమును విషరహితము గావించి, యమృతమయము గావించినాడు. నందరాజా, మీ యీ నల్లపిల్లవానిపై వ్రజవాసులమగు మేమందర మెంతటి యనంత ప్రేమ గల్గియున్నదియు, నీవెఱుగు దువు గదా. దీనికి కారణమేమో నీవు చెప్పగలవా? ఏడు సంవత్సరముల బాలుడె క్కడ! ఇంతటి గోవర్ధన పర్వతరాజము నేడుదినములేకధాటిగా, నెత్తిపట్టుకొని యుండుటెక్కడ! నందరాజా, యీ యన్నికారణములచేత, మాకు నీ కుమారునిపై సందేహము కల్గుచున్నది" అని పలికిరి.

వారి మాటలు విని నందుడు వారితో నిట్లు పలికె. "గోపాలకులారా, నా మాటలు శ్రద్ధగా వినుడు. నా కుమారుని విషయములో మీ యపోహలన్నియు తొలగిపోగలవు. గర్గమహాముని యీ పిల్లవాని విషయములో యిట్లు చెప్పియున్నాడు. నీ యీ పిల్లవాడు ప్రతియుగమందును జన్మించుచుండును. వేర్వేరు యుగములలో నితడు భిన్న భిన్న రంగులు కల్గియుండును. ఇదివరలో శ్వేత, రక్త, పీత వర్ణములు కల్గియుండి నేడు కృష్ణవర్ణముతో జన్మించినాడు. ఈ నీ పుత్రుడు యిది వరలో నొకప్పుడు వసుదేవుని గృహమందుగు డ జన్మించియున్నాడు. అందుచేతనే యీ రహస్యమును తెలిసినవారు యితనిని "శ్రీమాన్ వాసుదేవః" అనియు చెప్పుచుందురు. నీ పుత్రుని గుణములను కర్మలను అనుసరించి యితని కనేక నామ

రూపములుగలవు. ఆ నామములన్నియు నాకు తెలియును. కాని ప్రపంచమందలి సాధారణ మానవులు వాని నెఱుగరు. ఇతడు మీకు పరమ శుభదాయకుడగును. సమస్త గో, గోపసంఘము నానందపరచగలడు. ఇతని సహాయముచే మీరు గొప్ప గొప్ప యాపదలను సునాయాసముగా దాటగలిగెదరు. నందరాజా, పూర్వకాల మందొకప్పుడీ పుడమియందు రాజనువాడు లేకుండె. దొంగలు నలువైపులనుంచి ప్రజలను దోచుకొనసాగిరి. అప్పుడు నీ యీ కుమారుడు సజ్జనులను రక్షింపగా, వారు బలము పుంజుకొని దోపిడీగాండ్రపై విజయము సాధించగలిగిరి. ఈః నీల శరీర శిశువుపై ప్రేమగల్గియుండు మహాభాగులను శత్రువులేమియు చేయజాలరు. విష్ణుభగవానుని కరకమలములను ఛత్రచ్ఛాయయందుడు దేవతల నసురులేవిధ మున జయింప జాలకుందురో, నీ కుమారుని ప్రేమించు వారు గూడ నటులే యజేయులై యుండెదరు. ఏ కోణము నుంచి జూచినను, గుణములలోగాని, సౌందర్యమందుగాని, యైశ్వర్యమందుగాని, కీర్తిప్రభావములయందుగాని, నీ పుత్రుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణునితో సమానుడు. కావున యీ బాలుడొనర్చు నట్టి యలౌకిక కార్యములను గాంచి, మీరెట్టి యాశ్చర్యమును చెందరాదు." అని గర్గాచార్యుడు చెప్పి తన యాశ్రమమున కేగినాడు. అప్పటినుండియు, అమానుష ములు పరమసుఖదములునగు కర్మలను చేయుచున్న యీ నా కుమారుడు నారా యణాంశ సంభవుడనియే భావించుచుంటిని" అనియె. నందుని నోటినుండి గర్గా చార్యుని మాటలను విన్న గోపాలుర సందేహములన్నియు పటాపంచలైనవి. ఏలననగా, అమిత తేజస్వంతుడగు శ్రీకృష్ణునియొక్క ప్రభావమును పూర్తిగా చూచి, వినియుండిరిగదా! పరమానంద సంభరితులై వారు నందుని, నంద నందనుని పలువిధముల శ్లాఘించిరి.

యజ్ఞభంగముచే కలిగిన కోపముతో యింద్రుడు, ప్రచండవాతయుతమగు వజ్రాశ్మములతో గూడిన వర్షమును గురిపించిన సమయమందు తనను శరణు జొచ్చిన వ్రజవాసులందరిని గాంచి, భగవంతుని హృదయము కరుణారసార్ద్రమైనది. కాని నూతన లీల యొనర్పదలచి యతడు వెంటనే యొక చిరునవ్వు నవ్వినాడు. చిన్నపిల్లవాడు పుట్టగొడుగునెత్తి ఛత్రముగాబట్టిన చందమున గోవర్ధన పర్వతము నవలీలగా నెత్తి ఛత్రమువలె బట్టి, వ్రజవాసులనందరిని రక్షించినాడు. ఇంద్రుని గర్వమణచిన గోవిందుడు మనలనందర రక్షించుగాక.

---

శ్రీధరీయ శ్లోకః

శ్లో॥ షడ్వింశేదశమే వ్యక్తః షడ్వింశోదశ మోహరిః
వ్యనక్తు పంచవింశస్తూం చతుర్వింశతితః పృథక్.
(షడ్వింశతి తత్త్వాత్మకః దశలక్షణ లక్షితః హరిం చతుర్వింశతి
తత్త్వాపేక్షయా పృథక్ జీవ సంజ్ఞం మాంవ్యనక్తు)

# ఇరువదియేడవ యధ్యాయము

## గోవింద పట్టాభిషేకము

భగవానుడు గోవర్ధనగిరిని ధరించి, వ్రజవాసులందరిని రక్షించిన సందర్భములో నతని నభినందించుటకై భూలోకమునుండి కామధేనువును, తానుచేసిన యపరాధమునకు క్షమాభిక్ష నర్థించుటకై స్వర్గలోకమునుండి దేవేంద్రుడును భూలోకమునకు వచ్చినారు. భగవానున కవహేలన మొనర్చినందుకు యింద్రుడు మహాలజ్జితుడై యున్నాడు. అందువలన నతడు భగవానుని యేకాంత స్థానమందు కలుసుకొని, సూర్యకాంతితో వెలుగుచున్న నతని కిరీటమతని పాదములకు తగులునట్లు ననుస్కరించె. పరమతేజస్వియగు భగవానుని ప్రభావము చూచుటచేత, వినుటచేత యింద్రునకు, తాను ముల్లోకాధిపతినను గర్వము తొలగిపోయినది. చేతులు జోడించి శ్రీకృష్ణునిట్లు స్తుతింపసాగినాడు.

ప్రభూ, నీ స్వరూపము పరమశాంతము, జ్ఞానమయము. రజస్తమోగుణ రహితమైనది. విశుద్ధము అప్రాకృతమునగు సత్త్వమయమైనది. త్రిగుణాత్మక ప్రవాహరూపమున వ్యక్తమగుచున్న యీ ప్రపంచమంతయు కేవలము మాయామయము. నీ యథార్థ స్వరూపము నెఱుగకున్న కారణముచేతనే యీ ప్రపంచము ప్రతీతమగుచున్నది.

అజ్ఞానము, ఆదికారణముగా ప్రతీతమగు దేహాదులచే, నీ సంబంధము కలుగనే కలుగనప్పుడు, ఆ దేహాదులకు కారణమును, ఆ దేహాదులచే కలుగునట్టి లోభ క్రోధాది దోషములు నీయందెట్లు కలుగగలవు? ఈ దోషములు కలుగుట అజ్ఞానలక్షణము. ఈ ప్రకారము అజ్ఞానము, అజ్ఞానకార్యమగు జగత్తుతోను నీకెట్టి సంబంధము లేకపోయినను, ధర్మమును రక్షించుటకును, దుష్టులశిక్షించుటకును, నీవవతరించుచుందువు. విగ్రహానుగ్రహములు గూడ నెఱపుచుందువు.

నీవు జగత్తునకు తండ్రివి. గురుడవు. అధీశ్వరుడవు. జగత్తును నియంత్రణ మొనర్చుటకై దండమును ధరించియుండు దుస్తరమగు కాలస్వరూపుడవు నీవు. నీభక్తుల యభీష్టముల దీర్చుటకై, స్వచ్ఛందముగ లీలాశరీరములదాల్చి వ్యక్తమగుచుందువు. నావలెనే యెవరు తమను తాము లోకేశ్వరులమని గర్వించుచుందురో, అట్టివారి గర్వమును పరిహారమొనర్చు ననేకలీలలొనర్చు చుందువు.

ప్రభూ, నావంటి లోకేశ్వరులమని భావించునట్టి యజ్ఞానులు, భయపడునట్టి యవసరములందుగూడ నీవు నిర్భయుడవుగా నుండుట గాంచినప్పుడు తన మదము తొలగిపోగా, గర్వరహితులై, సత్పురుషులు సేవించు భక్తిమార్గము నాశ్రయించి, నిన్ను భజించుచుందురు. నీ ప్రతిచేష్టయు దుష్టులకు దండవిధానమే యగుచున్నది.

నేనైశ్వర్య మదమత్తుడనై నీ కపరాధము గావించితిని. దానికి కారణము నీ శక్తి ప్రభావములను తెలియకుండుటయే పరమేశ్వరా, నీవు నాపై దయయుంచి, మూర్ఖుడనగు నాయీ యపరాధమును క్షమించి, మరల యిటువంటి యజ్ఞానమునందు బడకుండునట్లను గ్రహించుము.

స్వయం ప్రకాశుడవును, యింద్రియాతీతుడవునగు నో పరమాత్మా, పృధివికి భార భూతులైన యసుర సేనాపతుల వధించి వారికి మోక్షమొసంగుటయు, నీ చరణ సేవకులు నీ అజ్ఞాను వర్తులునగు భక్తుల కభ్యుదయము కల్గించి రక్షించుటయునే నీ యవతార ముఖ్యోద్దేశములు.

పురుషోత్తముడవు, సర్వాంతర్యామియునగు నీకు నమస్కారము. యదు వంశమునకేకైకాధిపతియు, భక్తవత్సలుడవును, అందరి చిత్తముల నాకర్షించు వాడవునగు నీకు పునః పునః ప్రణామములు. జీవులవలె కర్మ వశముచేగాక స్వేచ్ఛగా, నీ యొక్కయు నీ భక్తుల యొక్కయు యిచ్ఛ ననుసరించి శరీరధారణ చేయుచుందువు. నీయా శరీరము గూడ విశుద్ధ జ్ఞాన స్వరూపము. సర్వము నీవే. సర్వమునకు కారణము నీవే. సర్వాత్ముడవు నీవే. నేను నీకు మరల మరల నమస్కరించుచున్నాను. నా యభిమానమున కంతములేదు నా క్రోధము గూడ తీవ్రమైనదే. వాటిని నిగ్రహించుట నాకు వశము గాలేదు. నా యజ్ఞమాపివై చిరసు కోపముతో యేనుగు తొండములవంటి ధారలతో తుఫాను వర్షము గురిపించి, వ్రజమండలమును సర్వనాశనమొనర్పదలచితివి. కాని ప్రభూ, నీవు నాపై పరమానుగ్రహము చూపితివి నా ప్రయత్నము వ్యర్థమగుటచే నా గర్వము సమూలముగా నశించినది. నీవు నా స్వామివి. గురుడవు. నా యాత్మవు.

దేవరాజగు యింద్రుడీ ప్రకారము భగవానుని స్తుతించగా నతడు చిరునవ్వు నవ్వుచు, మేఘ గంభీరములగు వాక్కులతో నతనితో నిట్లు పలికె.

"ఇంద్రా, నీవు శ్రీమదాంధుడవై కన్నుగానక యుంటివి. అందుచే నిన్నను గ్రహింపదలచియే నీ యజ్ఞము జరుగకుండ చేసితిని. దానిచే నీవు నిరంతరము నన్ను స్మరించుచుండగలవు. ఐశ్వర్య మదమత్తులైన వారంధులై, కాలరూపుడగు పరమేశ్వరుడు దండధారియై మన శిరసులపై తాండవించుచున్నాడను విషయమును గాంచకుందురు. నేనెవరినను గ్రహింపదలచెదనో, వారి సర్వ సంపదలను హరించెదను. ఇంద్రా, నీకు శుభము కలుగుగాక, ఇక నీవు నీ రాజధానియగు అమరావతికి వెళ్ళిపొమ్ము. నా యాజ్ఞను పాలించుము. ఇక నెప్పుడును గర్వించకుము. నిరంతరము నా సాన్నిధ్యము యొక్కయు సంయోగము యొక్కయు అనుభవమును స్మరించుకొనుచు నీ యధికారానుసారముగ మర్యాదాపాలనము చేయుచుండుము.

భగవానుడు యీ ప్రకారమాజ్ఞాపించుచుండగనే కామధేనువు తన సంతాన సమేతముగ గోపవేషధారియగు శ్రీకృష్ణునకు వందనమొనర్చి యతనితో నిట్లు పల్కెఁ.

శ్లో. కృష్ణకృష్ణ మహాయోగిన్ విశ్వాత్మ న్విశ్వభావన
భవతాలోకనాథేన సనాథావయమచ్యుత

"సచ్చిదానంద స్వరూపా, మహాయోగేశ్వరేశ్వరా, నీవు స్వయముగా విశ్వరూపుడవు.విశ్వమునకు కారణుడవు. అచ్యుతుడవు. సంపూర్ణవిశ్వమునకు స్వామివి. నిన్ను మా రక్షకుడవుగా పొందిన మేము సనాథలమైతిమి. నీవు జగత్తునకు ప్రభుడవు. కాని మాకు మాత్రము పరమ పూజనీయుడవగు ఆరాధ్యదేవుడవు. ఇంద్రుడు ముల్లోకములకు ప్రభువైన నగుగాక. కాని మాకు మాత్రము నీవే యింద్రుడవు అందుచేత, నీవే, గోబ్రాహ్మణ, సాధుజనులకును దేవతలకును యింద్రుడవగుము. గోవులమగు మేము, బ్రహ్మగారి ప్రేరణచే నిన్నుమాకు ప్రభువుగా నభిషేకించెదము. విశ్వాత్మా, పృధ్వీభారమును తీర్చుటకొరకే యవతరించిన మహానుభావుడవు."

శ్రీకృష్ణభగవానునితో నా విధముగ బలికి, కామధేనువు తనపాలతోను, దేవమాతచే ప్రేరితుడైన యింద్రుడు తన యైరావతముచే తెప్పించిన దివిజ గంగా జలముతోడను, దేవర్షి గణసహితముగ, గోవిందునభిషేకించిరి. ఆనాటి నుండియే గోవిందుడను నామము భగవానునకు కలిగినది.

ఆ సమయమందు దేవర్షులగు తంబురు నారదాదులు, విద్యాధరులు, సిద్ధ చారణాదిదేవ సంఘములందరచటకు విచ్చేసి, లోకుల పాపముల పరిహారము చేయునట్టి భగవానుని యశోగానమొనర్చిరి. అప్సరసలు నాట్యమొనర్చిరి. నందనవనమందలి దివ్య పుష్పముల వర్షించిరి. ముల్లోకములయందు పరమానందము పొంగి పొరలినది. గోవుల పొదుగులయందు పాలు ప్రవహింపజొచ్చినవి. దానిచే భూమి తడిసినది. నదులు నవరసముల ప్రవహింపజొచ్చినవి. వృక్షములు మధురధారల స్రవించినవి. దున్నకయే పృథివి సకల సస్యములనొసగుచున్నది. పర్వతములయందు మణిమాణిక్యములు తమంతట తామే వెలువడ సాగినవి. ఆ పట్టాభిషేకము కాగానే, సహజవైరము గల క్రూరజంతువులుగూడ వైరహీనములై పరమమిత్రములైనవి. పట్టాభిషేకముకాగానే, గోవిందుని యనుమతి గైకొని, దేవతలు, మొదలగు వారందరు తమతమ నెలవులకేగిరి.

# ఇరువది యొనిమిదవ యధ్యాయము

## వరుణలోకమునుండి నందుని విడిపించుట

కార్తిక శుద్ధయేకాదశినాడు నందరాజు, జనార్దనుని పూజించి యుపవసించి యారాత్రి తెల్లవారు ఝామున ద్వాదశి ఘడియలలో స్నానము చేయుటకై యమునా జలమునందు ప్రవేశించినాడు. అది యసుర సమయమని నందుడెఱుగడు. అందుచే రాత్రి యుండగనే జలమునందు దిగినాడు. జలాధిపతి యగు వరుణుని సేవకుడైన యసురుడొకడు నందుని బట్టుకొని వరుణలోకమునకు గొంపోయినాడు. నందుడెంత కుని యింటికి తిరిగిరానందున గోపాలురందరు విలపించుచు, రామకృష్ణులనాశ్ర యించిరి. భగవానుడదియాలకించి, తనతండ్రి వరుణలోకమునకు గొంపోవబడి నాడని విషయ మెఱింగి, వెంటనే వరుణలోకమునకేగినాడు. సమస్త జగత్తునకును బాహ్యాభ్యంతరేంద్రియములకును ప్రభువగు శ్రీకృష్ణభగవానుడే స్వయముగా తన లోకమున కేతెంచుటనుగాంచిన, పశ్చిమ దిక్పాలకుడగు వరణుడు, మహాభక్తి ప్రపత్తులతో నతనికతిథిసత్కారములొనర్చినాడు. ఆనందపులకాంకితుడైన వరణుడు, భగవానునితోనిట్లు విన్నవించుకొనియె.

"ప్రభూ, నేడు నాజన్మసఫలమైనది. సంపూర్ణపురుషార్థములు సిద్ధించినవి. ఏలనన, నేడు నాకు మీ శుభచరణములు సేవించు మహద్భాగ్యము చేకూరినది, మీ పాదసేవా భాగ్యమెవరికిలభించునో వారలు భవసాగరమున తరించిన వారేమయ్యె దరు. నీవు భక్తుల పాలిటికి భగవానుడు. వేదాంతులకు పరబ్రహ్మవు. యోగులకు పరమాత్మవు. "నీ స్వరూపమందు, విభిన్నలోకములను కల్పించునట్టి మాయ యుండదు" అనిశ్రుతి చెప్పుచున్నది. నేను నీకు సమస్కరించుచుంటిని. అజ్ఞాని యగునా సేవకుడొకడు, తన కర్తవ్యమును గూడ సరిగా తెలియక మీ తండ్రిగారిని మాలోకమునకుగొనివచ్చినాడు. దయతోవాని యపరాధమును క్షమింపవేడుచున్నాను. నీకు మీ తండ్రిపై మిక్కిలి ప్రేమగలదని నాకు తెలియును. మీ తండ్రి గారిని నీకు సమర్పించుచుంటిని. తీసుకొని వెళ్ళుము. నీవు సర్వసాక్షివి భువన మోహనా, గోవిందా, యీ దాసునిపైగూడ దయయుంచుము" అని వినీతుడై వేడు కొనియె.

లోకపాలుడగు వరుణదేవునిస్తుతికి దేవాధిదేవుడగు గోవిందుడు ప్రసన్నుడై నాడు. అనంతరము, తన జనకుని వ్రజమునకుగొంపోయి, వ్రజవాసులందరికానం దము గలిగించినాడు. నందుడు వరుణలోకమందలి, మహైశ్వర్యమును, అచటి వారందరు తన కుమారుని పాదములందు ప్రణమిల్లి భక్తియుక్తులై సేవించుటను

కనులారగాంచియున్నాడు. అతని కత్యంత విస్మయము కల్గినది. అతడు వ్రజ వాసులకు వరుణలోకమందలి విశేషములనశేషముగ వర్ణించినాడు. ఈశ్వర ప్రేమి కులగు గోపాలురందరు నది విని, కృష్ణుడు సాక్షాత్తు భగవానుడనియే భావించిరి. అపుడువారి మనములందొక కుతూహలము గల్గినది. జగదీశ్వరుడగు గోవిందుడు మనకు గూడ తన స్వధామమును—యెచటకేవలము తన భక్తులు మాత్రమే నివ సించుచుందురో—అట్టి వైకుంఠమును చూపించగలడా, యని వారు తలచుచుండిరి. భగవానుడు సర్వదర్శిగదా! అతనికి తెలియని దేముండును? తన యాత్మీయులగు గోపాలురయొక్క యాంతర్యమునాతడు గ్రహించినాడు. వారిమనోరథమును సిద్ధింపజేయవలయునను నను గ్రహము కల్గి యిట్లాలోచించినాడు. "ఈ ప్రపంచ మందు జీవుడజ్ఞానవశుడై శరీరమందాత్మబుద్ధి గలిగి, రకరకములగు కోరికలను గోరుచు,వాటిని సిద్ధింపజేసుకొనుటకై నానాప్రకారములగు కర్మలుగావించుచుండును. అట్టికర్మల ఫలస్వరూపముగా, దేవ, మానవ, పశు, పక్ష్యాది, యుచ్చ నీచజన్మ లెత్తుచు, సంసారమందు పరిభ్రమించుచుండునేగాని, వాస్తవికమగు తన యాత్మ స్వరూపము నెఱుంగజాలకుండును." పరమదయాళుడగు భగవానుడీ విధముగనాలో చించి, యాగోపాలురకు, మాయాంధకారమున కతీతమగు తన పరంధామమును దర్శింపజేసినాడు. మొదట, గుహాతీతులై సమాధినిష్ఠులగు మునీశ్వరులు దర్శించు నట్టి, సత్యజ్ఞానానంతానందలక్షణ లక్షితమగు పరబ్రహ్మ సాక్షాత్కారమును వారికి గల్గించినాడు. అక్రూరునకు బ్రహ్మ సాక్షాత్కారానుభవమును గల్గింపజేసిన బ్రహ్మ హ్రదమునకు వారినందరిని గొనిపోయినాడు. వారందరు బ్రహ్మహ్రదము నందు మునిగినారు. భగవానుడు వారినందరిని యుద్ధరించిపరంధామదర్శనము కల్గించినాడు. (బ్రహ్మ యే హ్రదము) భగవత్స్వరూపమేయగు నట్టి యాదివ్య లోకమునుగాంచి, నందాది గోపకులందరు, తన్మయులై, పరమానంద సాగరమున నోలలాడినారు. అచటవారు, వేదములన్నియు రూపములు దాల్చి శ్రీకృష్ణ భగ వానుని స్తోత్రము చేయుచుండుటను గాంచినారు. అదిగాంచి వారికి పరమ విస్మయముగలిగినది.

# ఇరువది తొమ్మిదవ యధ్యాయము

## రాసలీలా ప్రారంభము

శుకమహర్షి పరీక్షిత్తుతో చెప్పుచున్నాడు. "రాజా, శరదృతువు ప్రారంభమై నది. మల్లెలు, మొల్లలు మొదలగు సురభిత పుష్పములన్నియు వికసించి, సౌరభ మును వెదజల్లుచున్నవి. వస్త్రాపహరణ ఘట్టమునందు భగవానుడు గోపికల కేశర

ద్రాతులను సూచించియుండెనో, అవియన్నియు పుంజీభూతములై యొకరాత్రి రూపమున ప్రకటితమైనవి. భగవానుడు దానిని దివ్యముగావించినాడు. గోపికలు గూడ వాంచించుచునేయున్నారు గదా.తన యచింత్యమగు మాయాశక్తి నాశ్రయించినవాడై, గోపికలను నిమిత్తముగాగైకొని, రసమయమగు రాసక్రీడయొనర్ప సంకల్పించినాడు. అమనస్కుడైనను భగవానుడు, తనను ప్రేమించువారలయొక్క మనోభీష్టమును నెరవేర్చుటకుగాను, మనస్సును స్వీకరించినాడు.

శ్లో॥ తదోడు రాజః కకుభః కరైర్ముఖం ప్రాచ్యాది లింపన్నరుణేనశంతమైః
సచర్షణీనాముదగాచ్ఛుచోమృజన్ ప్రియః ప్రియాయాఇవ దీర్ఘ దర్శనః

భగవానుడటుల సంకల్పించగనే,బహుకాలానంతరము తిరిగివచ్చినప్రియతముడగుపతి తన ప్రియతమపత్ని నానందింపజేయునట్లు, చంద్రుడు ప్రాచీదిశాంగనయొక్క ముఖమండలముపైనరుణకాంతిని,సుఖప్రదములగు తన శీతల కిరణములను కరములచేత, రంజిల్లచేయుచుండెను. చంద్రుడావిధముగనుదయించి, కేవలము పూర్వదిశయొక్క సంతాపమునేగాక, పగలంతయు సూర్యకిరణ సంతాపముచే తపించియున్న, చరాచరజంతుజాలముయొక్క సంతాపము నంతయు హరించినాడు. ఆ రాత్రియందు చంద్రమండలమఖండముగా నున్నది. కార్తిక పూర్ణిమారాత్రి. నవకుంకుమారుణమై, లక్ష్మీదేవి ముఖమండలమువలెనున్న యా చంద్రమండలము, తమ కోమలకిరణ సముదాయముచే, ఆ బృందావనమునంతటిని యనురాగ రంజితముగావించుచున్నది. ఆ వనమంతయు నమృతసముద్రమువలె గాన్పించుచున్నది. అట్టి ప్రకృతిశోభనుగాంచి భగవానుడు తన మురళిపై, వ్రజకాంతల మానసముల హరించునట్టి కామబీజమగు "క్లీం" అను బీజాక్షరమును, అస్పష్ట మధురముగ గానమొనర్చినాడు. మాధవుని యా మోహన మురళీనినాదము, భగవత్ప్రేమను, భగవత్సమాగమలాలసను పెంపొందించునదై యుండినది. శ్యామసుందరుడు వ్రజమండలి వామాక్షుల మానసముల నింతకుమును పే తనవశము గావించుకొనియుండె. ఇపుడు వారి మానసములకు సంబంధించిన సమస్త వస్తువులను-అనగా, భయము, సంకోచము, ధైర్యము మర్యాద మొదలగు వృత్తులనన్నిటిని-లాగివైచినాడు. వంశీధ్వనిని వినగనే వారందరొక వింతదశకులోనైనారు. శ్రీకృష్ణుని పతిగాపొందుటకై వారొక సంఘముగా నేర్పడి కాత్యాయనీవ్రతము నాచరించియుండిరిగదా. అట్టివారిపుడొకరిలొకరు చెప్పనుగూడ చెప్పక, తమ చేష్టలను దాచుకొనుచు నొకరికొకరు తెలియకుండ,వంశీధ్వని వినిపించినవైపునకు,తమ కర్ణకుండలములూగుచుండ, నతివేగముగ కదలినారు.

వంశీధ్వని నాలించగనే పాలుపిదుకుచున్న గోపికలుత్సాహవశముచేత పాలు పితుకుటమానియే పయనించినారు. పాలను పొయ్యిపైనుంచి కాచుచున్నవారు పాలు

పొంగుటనుగూడ గమనించక బయలుదేరినారు, హల్వాను తయారుచేయుచున్నవారు దానిని పొయ్యిపైనుండి దించకయు, యింటిలోని వారికి భోజనము వడ్డించుచున్న వారు ఆ పనిమానియు, పసిపిల్లలకు పాలనిచ్చుచున్నవారు పాలనిచ్చుటమానియు, పతిశుశ్రూషగావించుచున్న వారా సేవ వదలియు, భోజనము చేయుచున్నవారు భుజించుటమానియు, నెట్టులయున్న వారటులనే, తమ ప్రియతముడగు నందయశోదానంద వర్ధనుని కడకు నడకసాగించినారు. కొందరు గోపికలు అంగరాగములు, చందనము పూసుకొనుచును, నలుగుపెట్టుకొనుచునుండిరి. కొందరుకన్నులకు కాటుక పెట్టుకొనుచుండిరి. వారా పనులన్నియు మధ్యలోనే వదలిపెట్టి,యటులనే అస్తవ్యస్తముగ వస్త్రములధరించి, శ్రీకృష్ణుని కలయవలయునను నాతురతతో వెడలిరి.తల్లిదండ్రులు భర్తలు, బంధువులు, మొదలగువారు మంగళమయమగు వారిప్రేమ యాత్రనడ్డగింపజూచిరిగాని, గోపికలు మహితులైయుండుటచేత, వారాగజాలకపోయిరి. వారెట్లాగ గలరు? విశ్వవిమోహనుడగు గోవిందుడు, వారి ప్రాణములను మనములను,ఆత్మను, సమస్తమును హరించియున్నాడు.

వేణునాదము వినిపించిన సమయమందు కొందరు గోపికలు గృహాంతర్భాగములందుండి పోవుటచే వారు వెలుపలికి వచ్చునవకాశము లేకుండబోయినది. అప్పుడువారు తమ కనులుమూసుకొని తన్మయతతో, శ్రీకృష్ణుని సౌందర్యమును, మాధుర్యమును, లీలలను ధ్యానించసాగిరి. శ్రీకృష్ణవిరహముయొక్క తీవ్రవేదనచే వారి హృదయములందెంత వ్యథకలిగినదనగా, ఆ వ్యధాగ్నిచే వారియందు మిగిలియున్న యశుభసంస్కారము (వాసన) లన్నియు నిశ్శేషముగా భస్మమైపోయినవి. ధ్యానస్థితి కల్గినది. ఆ స్థితియందు వారియెదుట శ్రీకృష్ణుడు సాక్షాత్కరించినాడు. మనసునందేవారు ప్రేమోద్వేగముచే భగవానుని యాలింగమొనర్చుకొనిరి.ఆ సమయమందు వారికి లభించిన సుఖశాంతులచే, వారి పుణ్యసంస్కారములన్నియు నిశ్శేషముగా క్షీణించిపోయినవి. ఆ సమయమందు వారిలో శ్రీకృష్ణునయందు జారభావము గూడ యున్నప్పటికిని, యెచటనైనను సద్వస్తువుగూడ భావాపేక్షగల్గియుండునా ? గోపికలే భావముతో నాలింగన మొనర్చుకొనినను, కౌగలించుకొనబడనవాడు స్వయముగా పరమాత్మయేగదా! అందుచే పాపపుణ్య రూపకర్మలయొక్క పరిణామముగా నేర్పడిన తమ గుణమయదేహములను పరిత్యజించిరి. (భగవానుని లీలయందు పాల్గొనుటకు యోగ్యమగు దివ్య-అప్రాకృత శరీరములు వారికి లభించినవి.)ఈ ప్రాకృత శరీరములతో ననుభవింపబడునట్టి కర్మబంధములన్నియు వారి ధ్యానస్థితియందే చిన్నాభిన్నములై నిశ్శేషముగా నశించిపోయినవి గదా!

పరీక్షితునకు సందేహము కలిగి శ్రీశుకునితో నిట్లు పల్కె.

"స్వామీ, గోపికలు శ్రీకృష్ణుని కేవలము తమ ప్రియతమ కాంతుడని మాత్రమే భావించి యుండిరి. వారి కాతని యందు బ్రహ్మ భావన యుండలేదు. ఆ

విధముగా వారి దృష్టి ప్రాకృత గుణములందే సక్తమై యున్నటుల గాన్పించు చున్నది. ఇట్టి స్థితిలో వారికి, యీ గుణ ప్రవాహ రూపమగు సంసారము నుండి నివృత్తి యెట్లు కల్గె."

అని ప్రశ్నించిన పరీక్షితునతో శ్రీశుకుడిట్లనియె. "రాజా, చేదిరాజగు శిశుపాలుడు భగవంతుని యెడల ద్వేషభావము గల్గియుండినప్పటికిని, తన ప్రాకృత శరీరమును వదలి యప్రాకృత శరీరము దాల్చి, విష్ణు పార్షదుడాయెనని, నీకిది వరకే చెప్పియుంటిని. అట్టి స్థితిలో, యీ ప్రకృతికి-ప్రకృతి గుణములకు నతీతుడగు శ్రీకృష్ణునకి ప్రియతమలై, అతనియందనన్య ప్రేమ గలిగి యున్న గోపికలతనిని పొందుటలో నాశ్చర్యమేమున్నది? వాస్తవములో, భగవానునకు, ప్రకృతి సంబంధములగు వృద్ధి వినాశములుగాని, ప్రమాణ ప్రమేయములుగాని గుణగుణీభావములుగాని లేవు. అతడచింత్యుడు. అనంతుడు అప్రాకృతుడు. పరమకల్యాణ స్వరూపుడు. కల్యాణ గుణాశ్రయుడు. భగవానుడు, తనను తన లీలలను ప్రకట మొనర్చుటలోగల ముఖ్యోద్దేశము, జీవులు దాని సహాయముతో, తమ పరమకల్యాణమును-(అనగా-మోక్షము) సాధించుకొందురని మాత్రమే గాని వేరు గాదు. కావున భగవానునితో కేవలము సంబంధము గలిగియుండుట యవసరము. ఆ సంబంధమెట్టిదైనను గావచ్చును. కామ సంబంధముగాని, క్రోధము లేక భయము, స్నేహము, ప్రేమ లేక బంధుత్వము గాని, యెట్టిదైనను గావచ్చును. ఏ భావముచేనైనను తమ మనోవృత్తుల నన్నిటిని నిరంతరము భగవానుని యందు లగ్న మొనర్చిన వారు, భగవన్మయులయ్యెదరు. అట్టి జీవులు భగవత్ప్రాప్తినే పొందెదరు.

రాజా, నీవంటి పరమ భాగవతునకు, భగవద్రహస్యముల గుర్తింపజాలునట్టి భక్తునకు, శ్రీకృష్ణుని విషయములో నిట్టి సందేహము కలుగరాదు. యోగీశ్వరేశ్వరుడు, అజుడునైన భగవానుని విషయములో నిదేమంత యాశ్చర్య విషయము? సంకల్ప మాత్రము చేతనే, కనుబొమ్మల కదలిక మాత్రము చేతనే సమస్త జగత్తునకు పరమకల్యాణమును ప్రసాదించగల సమర్థుడాతడు. ప్రతిమండలి యనుపమ విభూతిరూపలగు గోపికలందరు తన సమీపమునకు వచ్చియుండుటను గాంచి గోవిందుడు, తన వినోదభరితమగు వాక్చాతుర్యముచే వారిని మోహింపజేయుచు వారితో నీ క్రింది విధముగ పల్కినాడు. భూత, భవిష్యద్వర్తమాన కాలములందలి వక్తలందరిలో, సర్వశ్రేష్ఠుడు గదా యతడు.

"సౌభాగ్యవతులైన గోపికలారా, మీకు స్వాగతము. మీకు సంతోషము కల్గించుటకై నేనేమి చేయవలయునో తెలుపుడు. వ్రజమందందరును సుఖముగా నున్నారు గదా? ఈ సమయమందు మీరిచ్చటికి వచ్చు నవసరమేమి కల్గెనో చెప్పుడు. సుందరీమణులారా, యిది సహజముగా భయము గల్గించునట్టి రాత్రి సమయము, దానికి తోడు యీ వనమందు క్రూరమృగములక్కడక్కడ తిరుగుచుం

డును. కావున మీరు శీఘ్రముగ వ్రజమునకు తిరిగి వెళ్ళుడు. రాత్రి సమయమందడవిలో స్త్రీ జనము లుండరాదు. మీరు కనుపడక, మీ తలిదండ్రులు, పతిపుత్రులు, బంధుబలగములు, మీ కొరకై వెదకుచుందురు. వారికి భీతి కల్గించకుడు. ఫలపుష్ప సంభరితమైన యీ వన శోభను కరువు దీర గాంచితిరి. పూర్ణిమాచంద్రుని కోమల కిరణములచే, తాను తన చేతులతో చిత్రీకరించిన విధముగా, యీ వనమంతయు రాగరంజితమై యున్నది. యమునా నదీ జల శీతల శీకర స్పర్శచే గూడిన మంద మలయానిలములచే కదులుచున్న వృక్షములందలి యాకులే వనశోభనినుమడింప జేయుచున్నది. కాని, ప్రకృతి రామణీయకతను తిలకించిన మీరెంత మాత్రమిచట తడయరాదు. శీఘ్రాతి శీఘ్రముగ తిరిగి వెళ్ళుడు. మీరు పెద్ద యింటి యాడుపడుచులు. సతీమణులు. వెళ్ళి మీ పతిపుత్రుల సేవా శుశ్రూషల గావింపుడు. మీ యిండ్లయందలి పసిపిల్లలేడ్చుచుందురు. లేగదూడలంభారవములు చేయుచుండును. ఆ పిల్లలకు పాలనిచ్చుట, గోదోహన క్రియ లొనర్చుట చేయవలయునుగదా. నా యందలి ప్రేమచే పరవశులై మీరందరిచటికి వచ్చి యున్నచో నందనుచితమేమియు లేదు. అది మీ వంటి వారికి తగిన పనియే. ఎందుకనగా జగత్తునందు పశు-పక్షుల వరకు గల ప్రాణులందరు నన్ను ప్రేమించుచుందురు. నన్నుగాంచి యానందించుచుందురు. సాధ్వీమణులారా, పతులను, పతిబంధువులను సేవించుటయే స్త్రీలకు పరమధర్మము. అటులనే సంతానమునుగూడ పోషించవలయును. ఉత్తమ లోకప్రాప్తి గలుగ వలయునని యాశించు స్త్రీలందరును (కులటలు మినహా) పతులను పరిత్యాగము చేయరాదు. మంచివాడుగాని, దుశ్శీలుడుగాని, దరిద్రుడుగాని, వృద్ధుడుగాని, రోగియైనను భర్తను పరిత్యాగము చేయరాదు. కులీనలగు స్త్రీలకు జారపురుష సేవ సర్వథా నిందనీయము. దానిచే వారికి పరలోకగతులు చెడిపోవును. స్వర్గప్రాప్తి కలుగదు. ఇహలోకమందపయశము లభించును. ఈ కుకర్మ అత్యంతతుచ్ఛము, క్షణికము. దీనియందు ప్రత్యక్షముగా, వర్తమాన ఫలమత్యంత కష్టముగ నుండును. పరోక్షములగు మోక్షాదుల విషయము చెప్పనేల? ఇది సాక్షాత్తుగ నరక హేతువగును. గోపికలారా, నా లీలలను, కళ్యాణగుణములను శ్రవణము చేయుటచేతను, రూపమును సందర్శించుటచేతను, వానిని కీర్తించుచుండుటచేతను, ధ్యానము చేయుచుండుటచేతను, యెట్టి యనన్య ప్రేమ నాపైగల్గునో, అట్టి ప్రేమ ప్రాప్తి నా సమీపమందుండుటవలన కలుగదు. కావున మీరందరు వెంటనే మీ మీ యిండ్లకరుగుడు." అని పలికె.

శ్రీకృష్ణుని యీ ప్రియసంభాషణమును విని గోపికలందరు ఖిన్నులైనారు. వారి యాశ విఫలమైనది. చింతాసముద్రమునందు మునిగిపోయిరి. పండిన దొండ పండువర్ణము గలిగిన వారి యధరములు, శోకముచే గలిగిన వేడి నిట్టూర్పులచే

నెండిపోయినవి. తలలు వ్రేలాడ వైచుకొని, కాలిగోటితో నేలను రాయుచుండిరి. నేత్రములనుండి దుఃఖాశ్రువులు ప్రవహించుచు కాటుకతోగూడి వక్షఃస్థలముపై బడుచు నచటనున్న కుంకుమాంకితములను తుడిచి వైచుచుండినవి. వారి హృదయములు దుఃఖముచే నిండిపోవుటవలన వారేమియు మాట్లాడలేక, మౌనముగ నిలబడి పోయిరి.

గోపికలు తమ ప్రియతముడగు శ్యామసుందరుని కొరకు, తమ సర్వ కామనలను, సమస్త భోగములను వదలి వచ్చియున్నారు. శ్రీకృష్ణుని యందు వారి కనన్యమైన పరమ ప్రేమానురాగములు కల్గియున్నవి. అట్టి కృష్ణుని సుఖము నుండి యట్టి నిష్ఠురభాషణమును వినుటతో, తామొనర్చిన పని యాతని కప్రియమైన దనుభావము కలిగి, వారి హృదయములందు దుఃఖము పెల్లుబికినది. రోదించుటచే కన్నులెఱ్ఱబారినవి. దుఃఖాశ్రువులచే చూపు మందగించినది. పిమ్మట కొంచెము ధైర్యము వహించి, కన్నులు తుడుచుకొని, ప్రణయకోపముచే కంఠము బొంగురు బోవుచుండ, గోవిందునితో నిటుల వచింపసాగిరి.

"కృష్ణా, నీవు సర్వాంతర్యామివి, మా హృదయములందలి భావమును తెలిసినవాడవు. నీవిటుల నిష్ఠురముగ మాటలాడుట భావ్యముగాదు. మేము సర్వమును త్యజించి, మీ చరణములనే ప్రేమించుచున్నాము. నీవు స్వతంత్రుడవని యును, మహాపట్టుదల గలవాడవనియును మాకు తెలియును. నీపై మాకేమియు నధికారములేదు. అయినప్పటికిని, ఆదిపురుషుడగు నారాయణుడు ముముక్షువులగు తన భక్తులపై ప్రేమ జూపునటుల నీవును నిన్ను ప్రేమించుచున్న మాపై దయ యుంచి, అట్టి ప్రేమను జూపి మమ్ము స్వీకరించుము. మమ్ములను త్యాగము చేయకుము. ప్రియశ్యామసుందరా, నీవు సర్వధర్మ సూక్ష్మములను బాగుగా నెరిగిన వాడవు. అట్టి నీవు మాతో, "పతి పుత్ర భ్రాతృబంధువుల సేవించుటయే స్త్రీలకు పరమధర్మమని వక్కాణించుట సముచితమే. కాని సర్వోపదుపదేశములకును చరమ లక్ష్యము నీవే యగుటచేత, నీ యుపదేశమునారము మేము నిన్నే సేవింపవలసి యున్నది. నీవు సాక్షాద్భగవంతుడవు. సర్వజగద్బాంధవుడవు. ఆత్మ స్వరూపుడ వగుటచేత పరమప్రియతముడవు నీవే యగుచున్నావు. ఆత్మ జ్ఞానముగల మహాత్ములు నిన్నే ప్రేమించుచుందురు. యేలననగా నిత్యప్రియుడవగు నీవు వారి యాత్మ స్వరూపుడవేగాన, అనిత్యములు, దుఃఖదములువగు పతిపుత్రాదులవలన ప్రయోజనమేమి యున్నది? కావున, పరమేశ్వరా మాపై ప్రసన్నుడ వగుము దయచూపుము కమలనయనా, చిరకాలమునుండియు నీపై మేము పెంచుచున్నట్టి నవనవలాడుచున్న మా యాశాలతను త్రెంపబోకుము. మోహనాకారా, ఇప్పటివరకును మా చిత్తములు గృహకార్యములందు హత్తుకొని యుండుటచే మాకరములా

పనులనే చేయుచుండినవి. కాని చూచుచుండగనే నీవు చిత్తముల నపహరించితివి. నీవు సుఖస్వరూపుడవగుటచే, చిత్త చౌర్యమందు నీకెట్టి కష్టమును గలుగలేదు. కాని యిపుడు మా గతులయందు మతులయందు పై లక్షణ్య మేర్పడినది. ఇపుడు మా పాదములు, నీ చరణకమలముల వీడి యొక యడుగైనను ముందుకు వేయ నిరాకరించుచున్నవి. కావున మేము వ్రజమునకెట్లేగగలము ? లేక వ్రజమునకు వెళ్ళి మాత్రము మేమేమి చేయగలము? ప్రాణవల్లభా, మా ప్రియమిత్రమా! నీ మధుర మందహాసము, ప్రేమభరితములగు కటాక్ష వీక్షణములు, మనోహర సంగీతము, మా హృదయములందు నీ ప్రేమ, నిన్ను కలియవలయునను నిప్పును జ్వలింప జేయుచున్నవి. ఆ యగ్నిని నీవు నీ మధురాధర సుధారసముచే శమింప జేయుము. అట్లు గానిచో, నిజము చెప్పుచున్నాము! నీ విరహ వ్యథాగ్నిలో మేము మా శరీరముల దహింపజేసుకొని, ధ్యానముద్వారా, నీ చరణకమలములను పొందెదము.

నీరజాక్షా, నీవు వనవాసుల కత్యంత ప్రియుడవు. వారును నిన్నుగాఢముగ ప్రేమించుచుందురు. అందుచేతనే గాబోలు నీవెప్పుడు వారివద్దనే వసించుచుందువు. లక్ష్మీదేవికిగూడ నప్పుడప్పుడు మాత్రమే లభించునట్టి నీ చరణ కమలసేవా భాగ్యము మాకు లభించినది. ఏనాడట్టి సౌభాగ్యము మాకు లభించినదో, యేనాడు నీవు మమ్ము స్వీకరించి మమ్మానందపరచితివో, ఆనాటినుండి మేమింకెవరి యొద్దనైనను క్షణకాలముగూడ వసించుటకు అసమర్థులముగా నున్నాము. పతిపుత్రాదుల సేవ యేమి చేయగలము?

ప్రభూ, ఏ లక్ష్మీదేవియొక్క కృపాకటాక్షవీక్షణ ప్రాప్తికొరకై గొప్ప గొప్ప దేవతలుగూడ తపస్సులాచరించుచుందురో, అట్టి లక్ష్మీదేవి, యనితర సాధ్యమగు నీ వక్షస్థలమందు స్థిరమగు స్థానము పొందియున్నప్పటికిని, తన సవతియగు తులసీదేవితోపాటు నీ పాదరజప్రాప్తి పొందుటకై నిత్యమభిలషించి చుండును. ఇంతవరకు భక్తులందరును నీ చరణరజమునే సేవించుచున్నారు. వారివలెనే, మేముగూడ అ చరణ రజమునే శరణుజొచ్చితిమి. నీ చరణములను శరణుజొచ్చినవారి కష్టములనన్నిటిని నీవింతవరకు పోగొట్టియుంటివి, అట్టి నీవు మాపై దయజూపుము. మమ్ములను గూడ నీ యనుగ్రహమునకు పాత్రుల గావింపుము. మేమందరము నిన్ను సేవించవలయుననెడి తీవ్రాభిలాషచేత, యిళ్ళు, వాకిళ్ళు, కుటుంబములు, సమస్తము త్యజించి, నీ చరణయుగళమును శరణుజొచ్చితిమి. అచట నిన్నారాధించు నవకాశమే కలుగకుండ నున్నది. పురుషోత్తమా, నీ మధుర మందహాసము, చారువీక్షణము మా హృదయములందు ప్రేమ, ఏ సమాగమాభిలాషలను అగ్నిని రగుల్కొల్పినవి. రోమరోమములందును ఆ యగ్ని జ్వాలలు వ్యాపించి మమ్ముల దహించుచున్నవి. నీవు మమ్ము దాసీలుగా స్వీకరించి

నీకు దాస్యముచేయు, సదవకాశము మాకు కల్పింపుము. ప్రియతమా, నీ సుందర ముఖకమలము, కమనీయ కపోలములు, అధరసుధ, నీ మృదుమధుర మందహాస వీక్షణములు, శరణాగతభయప్రదములగు నీ కమనీయ భుజాదండములు, లక్ష్మీ దేవికి నిత్యక్రీడాస్థలమగు నీ విశాల వక్షఃస్థలము. యిట్టి సర్వసులక్షణ లక్షితమగు, నీ సుందర రూపముగాంచి మేమందరము నీకు దాసీభూతలమైతిమి.

శ్యామసుందరా, మధురమధురపదయుక్తమై ఆరోహావరోహణ క్రమమున వివిధ మూర్ఛనాయుక్తమగు నీ మధుర మోహన మురళీనినాదమును వినియు, అటు లనే తన సౌందర్యమునందలి యొక బిందువుతో ముల్లోకవాసులకు సౌందర్యప్రధాన మొనర్చుచున్నట్టియు, యే సౌందర్య దర్శనముచే పశు, పక్షి, మృగ, వృక్షజాతు లన్నియు పులకితమగుచుండునో, అట్టి నీ మోహినీమూర్తిని గాంచియు, విచలితు రాలుగాకుండ, కులమర్యాదను లోకలజ్జనువీడి నీయందనురక్తురాలుగాకుండ, యే స్త్రీ యుండగలదు ?

నారాయణుడు దేవతల నందరిని రక్షించుచుండునట్లు, ప్రజమండలమునకు భయదుఃఖములు కలుగకుండ కాపాడుటకొరకే నీవతరించితివను విషయము మాకు తెలియనిది గాదు దీనులు, దుఃఖితులునగు వారిపై నీవు పరమప్రేమ, దయ కలిగి యుండుటయు స్పష్టమే. ప్రియతమా, మేము మహాదుఃఖము కలిగియున్నారము. నిన్ను కలియవలెనను కోరికయను నగ్ని మాహృదయముల దహించుచున్నది. ఈ దాసీలపై కరుణించి, మా వక్షఃస్థలములపై, మా శిరములపై, నీ కోమలకర కమల ముల నుంచి, శాంతింపజేసి, మమ్ము నీలో జేర్చుకొనుము. మాకు జీవన దానము చేయుము" అని గోపికలు మహా వ్యధతో, వ్యాకులమైన వాక్కులతో, తమ యావేద నను భగవానునకు విన్నవించుకొనిరి.

శ్రీకృష్ణుడు, సనకాది యోగులకును, శివాది యోగీశ్వరులకు గూడ ఈశ్వ రుడు. గోపికల యార్తి యాతని హృదయమును దయచే ద్రవింపచేసినది. అతడా త్మారాముడైనను, అతడు రమించుటకు వేరొక వస్తువు యొక్క యావశ్యకత లేక పోయినను, అతడు సప్రేమా, గోపికలతో క్రీడించుట ప్రారంభించినాడు. భగవా నుడు తన భావభంగిమలను, చేష్టలను గోపికల కనుకూలముగ మలచినాడు. అయి

నను యేక రసమగు తన స్వరూపమందే యతడుండిపోయినాడు. అతడచ్యుతుడు గదా !

అతడు బాగా నవ్వినప్పుడు, అతని యుజ్జ్వలదంతములు కుందకుట్మలముల వలె భాసించుచున్నవి. అతని ప్రేమ భరితములగు వీక్షణముల చేతను, అతనిని దర్శింపగల్గితిమను ఆనందముచేతను గోపికల ముఖపద్మములు బాగుగా వికసించి నవి. వారతని కన్నివైపుల చుట్టుముట్టి నిల్చునియుండిరి. శ్రీకృష్ణుడపుడు, తారకల మధ్యయందున్న చంద్రునివలె శోభిల్లినాడు. గోపీశతయూధపుడైన స్వామి, వైజ యన్తీమాలను దాల్చి, బృందావన శోభను దేదీప్యమానము గావించుచు చరించినాడు. ఒకప్పుడు గోపికలు శ్రీకృష్ణుని గుణగణములను, లీలలను గానము చేయుచుండిరి. వేరొకప్పుడు శ్రీకృష్ణుడు గోపికల ప్రేమను, సౌందర్యమును కీర్తించుచుండె.

ఆ విధముగ క్రీడించిన పిమ్మట, గోపికాసహితుడై శ్రీకృష్ణుడు యమునా నది యొక్క పావనసైకత స్థలమునందు-కర్పూరముతో సమానముగ ప్రకాశించు చున్న యిసుకరేణువులు గల యిసుకతిన్నెలపై, పదార్పణము గావించినాడు. ఆ ప్రదేశము యమునాతరంగ స్పర్శచే శీతలముగా నున్నది. కుముదినీ సుగంధముచే సువాసితమైన మందవాయువులచే సేవింపబడుచున్నది. ఆనందప్రదమై నయాసైకత స్థలములందు గోపికలతో గూడి గోవిందుడు రాసక్రీడ యొనర్చినాడు.

చేతులు జాచుట, ఆలింగనము లొనర్చుట, వారి చేతులణచుట, వారి కొప్పుల యందు జంఘలు, ఊరువులు, నీవీబంధములయందు, స్తనములు మొదలగు ప్రదే శములందు స్పృశించుట, హాస్యము చేయుట, నఖక్షతములొనర్చుట, వినోదముగ క్రీగంటి చూపులు చూచుట, మందహాస మొనర్చుట మొదలగు క్రియల ద్వారా, గోపికల యొక్క దివ్యకామ రసమును, పరమోజ్జ్వల ప్రేమ భావము నుత్తేజిత మొనర్చుచు, శ్రీకృష్ణ భగవానుడు క్రీడద్వారా గోపికల నానందపరచసాగినాడు. ఉదార శిరోమణియు, సర్వవ్యాపకుడు నగు శ్రీకృష్ణు డీ విధముగ గోపికలను సమ్మానించగా, గోపికల హృదయములందు ప్రపంచమందలి స్త్రీలందరికంటె తాము శ్రేష్ఠలమనియు, తమతో సమానులగు వారు మరెవ్వరును లేరనునొక యహం భావ ముదయించినది. వారు కొంచెము అభిమానవతులైనారు. అది గాంచిన గోవిం దుడు వారి గర్వశాంతి గావించుటకై, వారి మధ్య మందచదృశ్యుడై పోయినాడు.

# ముప్పదియవ యధ్యాయము

## గోపికా విరహ దశ

శ్రీకృష్ణుడున్నట్లుండి యంతర్హితుడు కాగానే, యూధపతియగు గజరాజులేని కరిణి సంఘమునకు కలుగునట్టి దశ, గోపికలకు కలిగినది. వారి హృదయములు విరహజ్వాలచే వేగిపోసాగినవి. శ్రీకృష్ణ భగవానుని యొక్క మంద గజయానము ప్రేమభరితమగు మందహాసము, విలాస విలపితములగు కటాక్ష వీక్షణములు, ఆహ్లాదకరములగు ప్రేమాలాపములు, వివిధ లీలావిలాసములు, శృంగార రస భావ భంగిమలు, మొదలగునవన్నియు గోపికల చిత్తముల నపహరించినవి. ప్రేమోన్మత్తలైన గోపికలు, శ్రీకృష్ణమయలైపోయి, శ్రీకృష్ణలీలల ననుకరింపసాగిరి. నడక హాస విలాసములు, కటాక్షవీక్షణ సంభాషణాదుల యందు అతనితో సమానులై పోయినారు. వారి మతి, గతి, భావభంగిమలన్నియు శ్రీకృష్ణమయములేయై పోయినవి. తమను తాము పూర్తిగా మరచిపోయి, శ్రీకృష్ణ స్వరూపుడై, యతని లీలావిలాసముల ననుకరించుచు "నేను శ్రీకృష్ణుడనే" యని పలుక దొడగిరి. అందరును చేరి బిగ్గరగా, శ్రీకృష్ణ గుణగానము చేయుచు, మత్తెక్కినవారై యొక వనము నుండి మరియొక వనమునకును, ఒక పొదరింటి నుండి మరియొక నికుంజమునకు బోవుచు శ్రీకృష్ణు నన్వేషించుచుండిరి.

శ్రీకృష్ణ భగవానుడు దూరమెక్కడ వెళ్ళినాడు? సమస్త జడ-చేతన పదార్థముల యందును, వాటికి వెలుపలను గూడ యుండనేయున్నాడు గదా! ఆకాశము వలె సర్వవ్యాపి, అతడక్కడే యున్నాడు. వారి యందే (గోపికలయందే) యున్నాడు. అది తెలుసుకొనలేక గోపికలు, వనస్పతులను, చెట్లు చేమలను శ్రీకృష్ణుని జాడలను గూర్చి యడుగుచుండిరి.

(వారు మొదట పెద్ద పెద్ద వృక్షముల వద్దకేగియడిగి) "ఓ రావివృక్షమా, ప్లక్ష వృక్షమా, వటవృక్షమా నందనందనుడగు శ్యామసుందరుడు తన ప్రేమపూరితము అగు మందహాసముల చేతను, కటాక్ష వీక్షణముల చేతను మా మానసములు దొంగిలించి పారిపోయినాడు. మీరేమైన అతనిని చూచితిరా? కురవకమా, అశోకమా, నాగ కేసరమా, పున్నాగమా, చంపకమా, బలరాముని యనుంగు సోదరుడు, యెవని చిఱునగవు చేతనే గొప్ప గొప్ప మానవతులకు గూడ మానమర్దనమగుచుండునో యట్టి గోపాలుడు యీ వైపు వచ్చెనా? యని యడుగుచుంటిరి.

(ఇక స్త్రీజాతికి చెందిన మొక్కలనడుగుచుండిరి). చెలీ, తులసీ, నీ హృదయము మహాకోమలము. నీవు సర్వజనుల శుభమును కోరుదానవు. భగవానుని చరణములయందు నీకు ప్రేమయుండనేయున్నది. అతడు గూడ నిన్నెంతయో

ప్రేమించుచుండును. తుమ్మెదలు మూగుచున్నను, నీమాలనాతడు తన కంఠము నుండి యెప్పుడును తీసివేయడు సర్వదా ధరించియే యుండును. నీకు ప్రియతము డగు ఆ శ్యామసుందరునేమైనా నీవు చూచితివా? మాలతీ మల్లికలారా. జాజి, మొల్లలారా, మా మాధవుని మీరెప్పుడైన చూచియుండవచ్చును. అతడు తన కోమలకర స్పర్శచేయుచు మిమ్మానందపరచుచు నిటువైపేమైన వచ్చెనా? చూత, ప్రియాల, పనసా, సనకోవిదార, జంబ్వర్క బిల్వవకుళామ్రకబంధ నీప వృక్షములారా, పరోపకారపారీణులగుచు యమునాతటమందు విరాజమానులగుచున్న యితర తరువరులారా, మీ జీవితలక్ష్య మితరులకుపకారము చేయుటయేగదా, శ్రీకృష్ణుడులేని మా జీవనము శూన్యమైపోవుచున్నది! అతనిని కనుగొనుమార్గము తెలిపిపుణ్యము గట్టుకొనుడు. భగవంతునికి ప్రీతిపాత్రురాలవగు నో భూదేవతా, భగవానుని చరణ కమలస్పర్శచే నానందమనుభవించుచు, తృణలతాది రూపమున రోమాంచితమును ప్రకటించుచున్నావు! ఈ మహద్భాగ్యము నీకే తపఃఫలముగా లభించినదో తెలుపుము. నీయీ యుల్లాసవిలాసములకు శ్రీకృష్ణ చరణస్పర్శయే కారణమా, లేకవామనావతారకాలమందు భగవానుడు విశ్వరూపమును దాల్చి తనపాదముతో నిన్ను కొలిచియుండుట కారణమా ? లేక వరాహావతార కాలమందు నీకు భగవానుని పరిరంభణము లభించినందున నీకిట్టిదశ సిద్ధించినదా? ప్రియహరిణములారా, శ్యామసుందరుని యంగసంగముచే కలుగునట్టి సౌందర్యకాంతి మీ యందు ప్రవహించుచున్నది. తన ప్రియురాలితోకూడి గోవిందుడిటువైపునకు వచ్చి మీ కనుదమ్ములకు పరమానందమును ప్రసాదించుచు పయనించలేదుగదా! చూడుడు యిచట గోకులపతి ధరించిన కుందమాలయొక్క మనోహర సుగంధమువచ్చుచున్నది. ఆ మాలయతని పరమప్రేయసియొక్క కుచకుంకుమముచే ననురంజితమై యుండును. భూమిజములారా, అతడు ధరించినమాల యందలి తులసియొక్క సుగంధమున కాకర్షితములై, యాసౌగంధ్యము నాఘ్రాణించుటచే మత్తెక్కిన మధుపములు క్షణక్షణము ఆ మాల చుట్టు పరిభ్రమించుచుండును. అతని యొకచేతియందు లీలాకమలముండును. రెండవ చేయి తన ప్రేయసియొక్క భుజస్కంధము పైనుంచి యుండవచ్చును. మాశ్యామ సుందరుడు యిటువైపు చరించుచునే తప్పక వెళ్ళియుండవచ్చును. అతనికి నమస్కరించుటకొరకే మీరు క్రిందికి వంగియున్నట్లు కనపడుచున్నది. కాని యా నంద నందనుడు కటాక్షవీక్షణములచే మీరొనర్చిన వందనముల కభినందించెనా లేదా? చెలియా యీలతలనడుగుము. ఇవి తమపతులగు వృక్షములను తమ భుజపాశములచే బంధించి యాలింగన మొనర్చుకొనియేయున్నవి. అయిననేమాయె? వీని శరీరమందు గాన్పించుచున్న యాపులకలు, రోమాంచములు మాత్రము భగవానుని నఖ స్పర్శచే మాత్రమే కలిగినవి. ఆహా యేమి వీని మహద్భాగ్యము !

పరీక్షిన్మహారాజా, ప్రేమోన్మాదినులైన గోపికలీవిధముగ ప్రలపించుచు, శ్రీకృష్ణాన్వేషణమందు కాతరలైరి. తన్మయలైయున్న గోపికల కావేశముద్ధృతమైనది. అందుచే వారు శ్రీకృష్ణుడొనర్చియున్న లీలలనభినయింపసాగిరి. ఒక గోపిక పూతనయైనది. మరొక గోపిక శ్రీకృష్ణుడై పూతనా స్తన్యపానము చేసినది. ఒకతె శకటత్వము నభినయించగా, వేరొకతె శ్రీకృష్ణమూర్తియై యేడ్చుచు తన కాలి తాపుతో నాశకటమును తలక్రిందులొనర్చినది. ఒక సఖి బాలకృష్ణుడుగా కూర్చొనియుండ వేరొకతె తృణావర్తునివలె యామెనెత్తుకొని పోయినది. ఒక గోపిక బాల కృష్ణునివలె మోకాళ్ళపై ప్రాకుచుండ నామె కాలియందెలు, గజ్జెలు, ఘల్లు ఘల్లు మని మ్రోగుచుండినవి. ఒక గోపిక కృష్ణుడుగను మరియొకతె బలరామునిగను మారగా, మిగిలిన యనేకులు గోపబాలురైరి. ఒక గోపికవత్సాసురుడుగను, మఱియొకతె బకాసురుడుగను మారగా రామకృష్ణులు వారిని గొట్టసాగిరి. శ్రీకృష్ణుడు బృందావనమందు చేయువిధముగ, నొకతె వేణునాదము ననుకరించుచు దూరమునకు బోయి యున్న పశువుల పిలుచు లీలననుకరించినది. మిగిలిన గోపికలామెను ప్రశంసింపసాగినారు. ఒక గోపిక శ్రీకృష్ణుడై మఱియొక గోపిక భుజముపై చేయి వైచి నడచుచు మిగిలిన గోపికలను గోపాలురుగా భావించి, "మిత్రులారా, నేను శ్రీకృష్ణుడను. మీరందరు నాయీ మనోహర మందగమనమును తిలకించుడు." అని పలుకసాగినది. ఇంకొకతె శ్రీకృష్ణుననుకరించుచు, "ఓ వ్రజవాసులారా, గాలి వానకు మీరు భీతిచెందవలదు. దానినుండి మిమ్ము రక్షించునుపాయము కనుగొంటిని." అని పలుకుచు, గోవర్ధన పర్వతధారణ లీలననుకరించుచు తనపైట చెంగు నెత్తిపట్టుకొనియె. ఒక గోపిక కాళియసర్పముకాగా, మఱియొకతె శ్రీకృష్ణునివలె యామె శిరసుపై పాదమునుంచి, "ఓరీ, దుష్టసర్పమా. నీ విచటినుండి తొలగి పొమ్ము దుష్టుల శిక్షించుట కొరకే నేనవతరించితిని," అనియె. ఇంతలో మఱియొక గోపిక "గోపకులారా, వనమందు భయంకర దావాగ్ని చెలరేగినది. మీరందరు వెంటనే కనులు మూసుకొనుడు. నేను సునాయాసముగ మీకు రక్షకల్పించెదను" అని యఱచినది. ఒక గోపిక యశోదగను మఱియొకతె కృష్ణునిగను నటించుచు, యశోద పుష్పమాలతో శ్రీకృష్ణుని రోటికి బంధించినది. శ్రీకృష్ణభావితయగు గోపిక కనులు చేతితో గప్పుకొని భయమును నటించినది.

ఈ ప్రకారము వివిధ లీలలనభినయించుచు గోపికలు, మరల బృందావనమందలి వృక్షలతాదులను శ్రీకృష్ణుని జాడను గూర్చి యడుగదొడగిరి. ఈ యన్వేషణలో నొకచోట వారికి శ్రీకృష్ణుని యడుగుజాడలగుపడినవి. వారొకరితోనొకరు చెప్పుకొనసాగిరి. హల, కులిశాంకుశ పద్మ చిహ్నములుగల యీ యడుగుజాడలు తప్పక యుదార శిరోమణియగు నందనందనునివే, ఆ చరణ చిహ్నముల ద్వారా భగవానుని వెదకుచు వారు ముందుకు సాగిరి. అప్పుడు వారికి భగవానుని పాదచిహ్నముల

ప్రక్కనే యువతీ పాద చిహ్నములు గూడ గోచరించినవి. అవి గాంచిన తోడనే వారికి వ్యాకులమతిశయించినది. వారు మరల తమలో తామిట్లు చెప్పుకొనసాగిరి. ఆడ యేనుగు మగ యేనుగు ననుసరించిపోవునట్లు, మన శ్యామసుందరుని వెంటయాతని భుజములపై చేయి వైచుకొని నడచుచున్నట్టియే సౌభాగ్యవతి యొక్క పాద చిహ్నములో యివి? ఈమె తప్పక సర్వశక్తి మంతుడగు శ్రీకృష్ణ భగవాను "నారాధించు" నదై యుండును. కావుననే, యీామె ననుగ్రహింపదలచియే మన ప్రియతమ శ్యామ సుందరుడు మనలనందరిని వదలి యీామె నేకాంతమునకు గొంపోయినాడు. ప్రియ సఖులారా, గోవింద పాదాబ్జ రజః కణములెంత ధన్యములు! బ్రహ్మ, శంకరుడు, రమాదేవి మొదలగు వారందరా రజః కణములను తమ శిరములందు దాల్తురు. ఆ కణములను ధరించువారు ధన్యులగుదురు. ఏమైన గానిమ్ము. కృష్ణుని వెన్నంటి వెళ్ళిన యీ సఖి, మన సర్వస్వమగు శ్రీకృష్ణుని యేకాంతమునకు గొంపోయి, అతని యధరసుధను తానొక్కతేయే పానము చేయుచున్నది. ఆమె చరణ చిహ్నములు మన హృదయములందు మహాక్షోభను కల్గించుచున్నవి. చూడండి. ఇచట నామె పద చిహ్నములు గాన్పించుట లేదు. బహుశ, యిచట తన ప్రియురాలి మృదుపదములు గడ్డి పరకలు గ్రుచ్చుకొని బాధింపబడుటను శ్యామసుందరుడుచూచి యా బాధ తప్పించుటకై యామెను భుజములపై యెత్తుకొని యుండును. ఆభారము చేత నతని యడుగుజాడలింతకు ముందు కంటె భూమి యందెక్కువ దిగబడియున్నవి. చూడుడు. తప్పక యాతడామెనిచట నెత్తుకొనియే యుండును. ఇక్కడ చూడండి. తన ప్రియురాలి నలంకరించుట కొరకు పుష్పములు గోయదలచిగోవిందుడామెను క్రిందకు దించి, పుష్పాపచయ మొనర్చినట్లు దోచుచున్నది. పాదములు పైకెత్తి పూలు గోయుటచే, పాదముల ముందు భాగములు భూమి యందు దిగబడి యున్నవి. మడమల జాడ లేకున్నవి. ప్రేమ మూర్తియగు శ్రీకృష్ణుడు కాముకుని వలె, యిచట తన ప్రేయసికి కేశ సంస్కార మొనర్చినట్లగుపించుచున్నది. తాను కోసిన పూలను ప్రియురాలి కొప్పునందలంకరించుటకై యాతడిక్కడ తప్పక కూర్చొని యుండును." అని మాటలాడుకొనజొచ్చిరి.

రాజా, శ్రీకృష్ణుడాత్మారాయుడు అత్మతృప్తుడు. పరిపూర్ణుడు. అతడు పరిచ్ఛిన్నము లేని వాడైనపుడు అతని యందు రెండవది యగు వస్తువే మఱియొకటి లేనప్పుడు, అతని యందు కామ సంకల్పమెటుల గల్గును? అయినప్పటికిని, కాముకల యొక్క దీనత్వమును-స్త్రీ పరవశత్వమును, మఱియు స్త్రీల యొక్క కుటిలతను నిరూపించుచు, భగవానుడచట నొక గోపికతో నేకాంతక్రీడ యొనర్చి, యొక లీలను ప్రదర్శించినాడు.

ఈ ప్రకారము గోపికలున్మాదినులవలెనైపోయి, మతులు పోగొట్టుకొని భగవానుని పాద చిహ్నములొకరికొకరు చూపుచును, ప్రతి వనమునందును పరిభ్రమించుచుండిరి. అచట భగవానుడే గోపికను—మిగిలిన వారందరిని విడిచిపెట్టి

తన వెంట గొనిపోయెనో-ఆమె "నేను గోపిక లందరిలో గొప్పదానను. అందు కనియే గోవిందుడు వారందరిని వదలి కేవలము నన్నే గౌరవించుచున్నాడు" అని యహంకరించినది. వనమందేగి, యామె తన ప్రేమ, సౌభాగ్య మదముచే మత్తె క్కినదై, శ్రీకృష్ణునితో, "ప్రియా, ఇక ముందుకు నడచుట నా వశము గాకున్నది నా సుకుమార పాదములు నొచ్చుచున్నవి. అలసిపోయితిని. నీవెచటికి పోదలచిన నచటికి, నన్ను నీ భుజస్కంధములపై గొని పొమ్ము" అని పలికినది. "అటులనే నాపై నెక్కుమ"ని భగవానుడనగానే యామె యందుకు సిద్ధపడినది. సిద్ధపడుటయే తడవుగ గోవిందుడంతర్ధానమైనాడు. వెంటనే యా గోపికకనంతమైన పశ్చాత్తాపము గలిగి యేడువదొడిగినది.

"హా నాథా, రమణా, మహాభుజా, నీవెక్కడనుంటివి? ఎక్కడకేగితివి? నేను దీనురాలినగు నీ దాసిని. నీ సాన్నిధ్యానుభవమును నాకు శీఘ్రముగా గల్పింపుము." నాకు దర్శన మొసంగుమనుచు రోదించసాగినది. మూర్ఛిల్లినది.

గోపికలు భగవానుని యడుగుజాడల సాయమున, సతడేగిన మార్గమును వెదకుకొనుచు పై చెప్పిన గోపిక రోదించుచున్న చోటికి చేరినారు కొంచెము దూర మందుండగనే, యా గోపిక తమ ప్రియతమ వియోగముచే దుఃఖితురాలై యవశయై యున్నట్టు వారికి గోచరించినది. వారామెను సేదదీర్చిరి. ఆమె వారికి, శ్రీకృష్ణుడు తననెంత సమ్మానించినదియు కుటిల భావముతో తానాతని నెట్లవమానించినదియు తెలిపి, యందువల్లనే భగవానుడంతర్హితుడాయెనని పలికినది. ఆమె మాటలు విన్న గోపికల యాశ్చర్యమునకు పారము లేకపోయినది.

అనంతరము వారందరు వనమున వెన్నెల బాగా వ్యాపించియున్నంత వరకు భగవంతుని యన్వేషించుచునే యుండిరి. కాని యింక ముందంధకారము బాగా వ్యాపించిన ఘోరకాంతారమున్నది. మనము వెదకుచుపోవుచున్న కొలదియు నా నల్లనయ్య యా యంధకారమున నింకను నిలీనుడగునని భావించి, వారందరు వెను దిరిగిరి.

గోపికల మనములు శ్రీకృష్ణమయములై పోయినవి. వారి మాటలయందు శ్రీకృష్ణుని గూర్చిన చర్చయే తప్ప వేరొక విషయము లేకుండె. వారి శరీరములు కేవలము శ్రీకృష్ణార్పితములై, శ్రీకృష్ణ చేష్టలనే యొనర్చుచుండినవి. ఎంతని చెప్పను? రోమరోమములు శ్రీకృష్ణమయములై పోయినవి! కేవలమాతని గుణగణ ములను లీలలనే గానము చేయుచుండిరి. వారికి శరీర భ్రాంతియే నశించిపోయినది. ఇక ఇంటి ధ్యాస యెవరికుండును? శ్రీకృష్ణుడత్యంత శీఘ్రముగ తమ వద్దకు రావల యునని యాకాంక్షించుచు, వారాతనికై ప్రతీక్షించుచుండిరి. శ్రీకృష్ణ భావనయందే మునిగిపోయినవారై వారందరు, రమ్యమగు నా యమునానదీ సైకత స్థలమును జేరి, యచట శ్రీకృష్ణ గుణగానము చేయదొడగిరి.

౧

# ముప్పదియొకటవ యధ్యాయము

## గోపికా గీతము

విరహావేశ పరవశలై గోపికలీ విధముగ గానము చేయుచుండిరి.

"ఓ దయితా, నీవు జన్మించిన కారణముచేత యీ వ్రజమండలము, వైకుంఠాది లోకములకంటెను మహామహిమాన్వితమైనది. అప్పటినుండియే సౌందర్యదేవతయైన లక్ష్మీదేవి తన నివాసస్థానమగు వైకుంఠమును వీడి యిచట నిత్యనివాసము చేయుచున్నది. ఈ భూమిని సేవించుచున్నది. కాని ప్రియతమా, నీ చరణములందే తమ ప్రాణముల నర్పించియున్న నీ గోపికలు, ప్రతివనమందును నిన్ను వెదకుచు పరిభ్రమించుచున్నారు— చూడుము.

హృదయాధినాథా, మేము నీకు, మూల్యమొసగకనే దొరికిన దాసీలము. శరత్కాలమందు జలాశయములందు వికసించియుండు సుందర సరసీరుహాశోభను దొంగిలించునట్టి నీ నేత్రములచేత (చూపులచేత) మమ్ములను నీవు గాయపరచితివి. వరదా, మా మనోరథముల సఫలీకృతము చేయు ప్రాణేశ్వరా, నేత్రములతో వధించుట వధ గాదా? శస్త్రాస్త్రములచే వధించుట మాత్రమే వధయగునా?

పురుషర్షభా, యమునానదియొక్క విషజలములనుండియు, అజగరరూపియైన యఘాసురిని బారినుండియు, వర్షవాతములనుండియు ఆశనిపాతములనుండియు, వృషభరూపియగు అరిష్టాసురునివలనను, వ్యోమాసురు (మయాత్మజుడు) నుండియు, దావానలాదులనుండియు, యింకను వివిధములగు ఆపదలనుండి మమ్ము రక్షించితివి· (ఇపుడెందుకు మమ్ము పేక్షించుచుంటివని భావము)

(విశ్వపాలనమునకై యవతరించిన నీవు భక్తుల నుపేక్షించుట యత్యంత మనుచితమను భావనలో ననుట)

"ఓ సఖుడా, నీవు కేవలము యశోదా సుతుడవు మాత్రమే కావు. సమస్త శరీరధారుల హృదయముల యందుండు బుద్ధిసాక్షివి నీవు. అంతర్యామివి. (అట్టివాడు దృశ్యుడగునా?) విశ్వపాలనముకొరకై బ్రహ్మచే వేడబడినవాడవై నీవు యదువంశమందవతరించితివి.

తమను ప్రేమించు వారలయభీష్టముల పూర్తిగావించు వారిలో నగ్రగణ్యుడవగు నో యదుశ్రేష్ఠా! జన్మమృత్యురూపమగు యీ సంసారచక్రమునకు భయపడి నీ చరణగ్రహణ మొనర్చినవారలను, నీ కరకమలములు తమ ఛత్రచ్ఛాయలోనికి తీసుకొనిపోయి, వారిని భయరహితులను గావించును. సర్వుల యభిలాషలను సఫలము చేయునట్టియు, లక్ష్మీదేవి పాణిని గ్రహించినట్టి యా కరకమలమును, నీవు మా శిరములపై నుంచుము.

వ్రజవాసుల దుఃఖములను దూరమొనర్చునట్టి వీరశిరోమణీ, శ్యామసుందరా, మందమందమగు నీ చిఱుదరహాసముయొక్క రేఖయే, నీ ప్రియభక్తులయొక్క సర్వ గర్వమును చూర్ణమొనరింప సమర్థమగును. మాపై కోపగించకుము. మమ్ముల ప్రేమించుము. మేము నీ చరణ దాసీలము. అబలలమగు మాపై కరుణించి, పరమ సుందరమగు నీ ముఖారవిందమును మాకు దర్శింపజేయుము.

నీ చరణ కమలములు శరణాగత ప్రాణులయొక్క సర్వపాపములను నశింప చేయునట్టివి. సౌందర్య మాధుర్యములకవి నిధానములు. స్వయముగా లక్ష్మీదేవియే వానిని సేవించుచుండును. అట్టి చరణములతో నీవు మా గోవులవెంట దిరుగుచు, మా క్షేమముకొరకు వానిని భయంకరసర్ప ఫణాగ్రములపై నుంచుటకుగూడ వెను కాడకుంటివి. మా హృదయములు నీ విరహాగ్నిచే దహించుకొని పోవుచున్నవి. నీ సమాగమాకాంక్ష మమ్ము వేధించుచున్నది. ఆ నీ చరణములను మా హృదయముల పైనుంచి, మా హృదయ సంతాపాగ్నిని శాంతింపజేయుము.

కమలనయనా, నీ వాణి యెంత మధురము! దాని యొక్కొక్క పదము, ఒక్కొక్క శబ్దము, ఒక్కొక్క యక్షరముగూడ మధురాతిమధురము. గొప్పగొప్ప విద్వాంసులకుగూడ నవి మనోజ్ఞములుగా నుండును. వారి సర్వస్వము నీవాణి కర్ప ణము చేయుచుందురు. అట్టి నీ వాణీరసాస్వాదన మొనర్చి నీ యాజ్ఞాకారిణులమగు మేము మోహితులమై యుంటిమి. దానవీరా, అమృతముకంటెగూడ దివ్యమగు నీ యధర సుధారసమును మాచే త్రాగించి నీవు మాకు జీవనదానముచేయుము.

ప్రభూ, నీ లీలాకథలుగూడ అమృతమయములే. విరహవేదనాదోదూయమాను లగు జనులకు అవి జీవన సర్వస్వములు. జ్ఞానులగు మహాత్ములు, భక్త కవులు వానిని గానము చేయుచుందురు. అవి సమస్త పాపతాపములను శాంతింపజేయునట్టివి. శ్రవణమాత్రముచేతనే శుభముల గల్పించునట్టివి. పరమకల్యాణదాయకములు. అవి పరమ సుందరములు. పరమ మధురములు. బహువిస్తృతములు.అట్టి నీ కథామృత మును గానముచేయువారే భూలోకమందు గొప్ప దాతలు. (ఇదివరలో భూరిదాతలై యున్నవారే నీ కథామృతగానము చేయుదురు.)కేవలము నీ కథాగానము చేయువారే యంతటి ధన్యాత్ములగుచుండ, యిక నీ దర్శన ప్రాప్తినందినవారి మాట చెప్పనేల! కావున మాకు దర్శన మొసంగుమని ప్రార్థించుచున్నాము.

ప్రేమభరితమగు నీ చూపు, చిరునవ్వు, రకరకములైన క్రీడలు మొదలగు వాటిని తలచుకొనుచు నానంద మగ్నులమై గడిపిన దినమే మాకు దినము. ఏకాంత మందు హృదయమును స్పృశించు చేష్టలొనర్చుచు ప్రేమ పల్కులు పల్కి

యుంటివి. కపట స్నేహితుడా, ఆ మాటలన్నియు మాకు జ్ఞాపకమునకు వచ్చి మా మానసములను సంక్షోభ పెట్టుచున్నవి.

మా ప్రియస్వామీ, నీ చరణములు కమలములకంటె కోమలములైనవి.సుందరములైనవి.నీవు ఆవుల దోలుకొనుచు వనములకేగుచున్నపుడు,నీ చరణకమలములు శిలతృణాంకురములు గ్రుచ్చుకొని బాధపడుచుండునని మా హృదయములు తల్లడిల్లుచుండును. మాకు మహాబాధ కలుగుచుండును.

సాయం సమయమందు నీవు వనమునుండి తిరిగివచ్చునపుడు,నీముఖకమలమందు ముంగురులు వ్రేలాడుచూ, గోధూలిధూసరితమై యుండుట మేము గాంచుచుందుము. ప్రియతమా, నీయాసౌందర్యమును మాకు దర్శింపజేసి మాకు శాంతిని గల్పింపుము. ప్రేమనుత్పన్నము చేయుము.

ప్రియతమా,మాసమస్త దుఃఖములను పోగొట్టుటకు నీవొక్కడవే సమర్థుడవు. నీ చరణ కమలముల నాశ్రయించువారల సర్వాభీష్టముల సఫలమొనర్చువాడవునీవే. అట్టి నీచరణకమలము సర్వదా రమాదేవిచే సేవింపబడుచుండును. అవి భూమికి భూషణములే యగుచున్నవి విపత్సమయములలో వాటినే చింతనచేయ వలయును. దానిచే సర్వయాపదలు తొలగి పోగలవు. అట్టి నీచరణ పంకజములను మావక్షః స్థలములయందుంచి మాహృదయ వ్యథను శాంతింప జేయుము.

వీరశిరోమణీ, నీ యధరామృతము, సంగమసుఖమును,ఆకాంక్షలను అభివృద్ధి పరచునట్టిది. అది విరహజన్యములగు సకల శోకసంతాపములను పోగొట్టునట్టిది. గానము చేయు మురళియాయధరమునెప్పుడు ముద్దాడు చుండును. ఆ నీయధరామృతము నొక్కపర్యాయము త్రాగినవారలకు, యితరాసక్తులస్మరణము కలుగకుండును. దానిని మాకు దానము చేయుము. మాచే త్రాగించుము.

పగటియందు నీవు వనమందు తిరుగుచున్న సమయమందు, నిన్నుచూడనట్టి యొక్కొక్క క్షణమొక్కొక్క యుగముగా మాకు దోచుచుండును.మరల సాయంత్రమందు నీవు వనము నుండి తిరిగి వచ్చునప్పుడు, కుటిలాలక సంయుక్తమగు నీ పరమ సుందర ముఖారవిందమును గాంచుచున్నపుడు,రెప్పలు వాల్చుటగూడ మాకు కష్టమగుచుండును. కంటికి రెప్పల నేర్పరచిన విధాత మూర్ఖుడని మేము భావించుచుందుము.

శ్యామసుందరా, మేము మా పతిపుత్రులను, బంధుమిత్రులను, కుల-పరివారములను, అందరిని వదలి నీయొద్దకు వచ్చితిమి.నీ నడకలన్నియు మాకు తెలియును. నీ సంకేతముల నెఱుంగుదుము. నీ మధుర సంగీతగతులను బాగుగా నవగతము గావించుకొని, వానిచే మోహితల మగుటచేతనే యిచటికి వచ్చియుంటిమి. నయవంచకుడా, యీ విధముగా రాత్రియందు వచ్చియున్న యువతులను, నీవు తప్ప మఱి యొకడెవడు నిరాకరించును ?

ప్రియుడా, నీవు యేకాంతమందు కలియవలయునను కోరికను, ప్రేమభావోద్దీపనకరములగు మాటలను పలుకుచుండెడివాడవు. ప్రేమ భరితములగు చూపులతో మమ్ము జూచుచు, ముసిముసి నవ్వులు నవ్వుచుండునట్టి నీవంక జూచుచు మేము, లక్ష్మీదేవికి నిత్య నివాస స్థానమగు నీ విశాలవక్షఃస్థలమును గాంచు చుండెడివారము. అప్పటి నుండి నేటివరకు, నిరంతరము మాలాలసయభివృద్ధి యగుచునే యుండినది. మా మానసములత్యంత మోహితములగు చున్నవి.

నీయవతారము (అభివ్యక్తి) వ్రజనివాసులయొక్క సమస్త దుఃఖములను తొలగించునట్టిదేగాక, సమస్త విశ్వమునకు శుభము చేకూర్చునట్టిది. మా హృదయములు నీ మీది కోరికతో నిండియున్నవి. బాధపడుచున్నవి. నీవారమగు మా యొక్క హృదయ రోగమును సర్వథా నిర్మూల మొనర్చునట్టి యౌషధమేదేవి కొంచెము మాకు ప్రసాదించుము!

నీ చరణములు కమలములకంటె కోమలములై నట్టివి. మహాసుకుమారములు. వానికెక్కడ గాయము కలుగునోయని భయపడుచు, వానిని కఠినమగు మా స్తనములపై, నెమ్మది నెమ్మదిగా నుంచుకొనుచుందుము. అట్టి మృదుపదపల్లవములతో నీవు ఘోరకాంతారములందు రాత్రి యనక పగలనక, దాగి దాగి సంచరించుచుందువు. రాళ్ళు, అప్పలు, కంటకములు మొదలగునవి గ్రుచ్చుకొనుటచే నీ సుకుమార పాదముల కెంత బాధ కలుగుచుండునో గదా యను భావనామాత్రము చేతనే మాకు మతిభ్రమణము కల్గుచుండును. మేము నిశ్చేతనులమగుచుందుము. శ్రీకృష్ణా, ప్రాణనాథా, శ్యామసుందరా, మాజీవనములు నీ కొరకే. మేము నీ కొరకే జీవించుచుంటిమి. మేము నీ వారమే స్వామీ, యనుచు గోపికలు, భగవానుని గూర్చి గానమొనర్చిరి.

గోపికాగీతము—భక్తుల హృదయధనము.
గోపికాగీతము—భక్తుల కంఠాభరణము.
గోపికాగీతము—భాగవతుల హృదయహారము.
గోపికాగీతము—భాగవతుల సర్వస్వము.

# ముప్పది రెండవ యధ్యాయము

## గోపికా సాంత్వనము

శ్లో॥ ఇతిగోప్యః ప్రగాయంత్యః ప్రలపంత్యశ్చచిత్రధా
రురుదుఃఖుస్స్వరం రాజన్ కృష్ణ దర్శనలాలసాః
శ్లో॥ తాసామావి రభూచ్ఛౌరిః స్మయమాన ముఖాంబుజః
పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథ మన్మథః

ఈ విధముగా గోపికలు విరహావేశముచే రకరకములుగా గానము చేయుచు చిత్రచిత్ర ప్రలాపములు చేయుచుండరి. కృష్ణ దర్శన లాలసలై కరుణా జనకమగు సుమధుర స్వరముతో వెక్కి వెక్కి యేడువదొడగిరి. అకస్మాత్తుగ వారి మధ్య, చిరునవ్వులు నవ్వుచు శ్రీకృష్ణ భగవానుడా విర్భవించినాడు. పీతాంబరము ధరించి, మెడయందు వనమాల దాల్చి, సాక్షాత్తు మన్మథునకు గూడ మన్మథుడై యున్నాడు. కోటి కందర్పలావణ్యముతో నొప్పారుచు పరమ మనోహర ప్రాణ వల్లభుడగు శ్యామ సుందరుడు తమ మధ్య ప్రత్యక్షమగుట గాంచిన గోపికలు హర్షాతిరేకముతో వికసి తనయనలైనారు. ప్రాణ హీనమగు శరీరమందు దివ్యప్రాణసంచారము కలిగినట్లు వారందరొక్కయుదుటన లేచి నిలువబడినారు. శరీరమందలి ప్రతి యవయవమునందును నూతన చైతన్యము, స్ఫూర్తి విలసిల్లినది. ఒక గోపిక శ్రీకృష్ణ కరాంబుజము నానందముతో తన యంజలి యందు పట్టుకొన్నది. రెండవయామె, చందన చర్చిత మగు భగవానుని బాహుదండమును తన భుజముపై దాల్చినది. ఇంకొక గోపిక యతడు నమలిన తాంబూలమును తన చేతితో గ్రహించినది. విరహవేదనాగ్నిచే వేగి పోవుచున్న నాల్గవ గోపిక క్రింద కూర్చుండి, భగవానుని పాదాబ్జమును తన వక్షముపై దాల్చినది. మరియొక గోపిక ప్రణయకోపముచే, భ్రుకుటిముడిచి, పెదవి కొరుకుచు కటాక్షబాణములచే నతనిని గ్రుచ్చుచున్నట్లు చూచినది. ఇంకొక యామె నిర్నిమేషనయనములతో నతని ముఖకమలమందలి మకరంద రసాస్వాదనము చేయ సాగినది. సజ్జనులు భగవానుని చరణములనెంత సేవించినను తృప్తిచెందనటులనే, యామె యాతని ముఖమాధుర్యమునెంత పాన మొనర్చినను తృప్తి గాంచలేకున్నది. మరియొక మానిని, నేత్రమార్గముద్వారా భగవానుని తన హృదయములోనికి గొని పోయి, కనులు మూసుకొనుట ద్వారా అతనినక్కడ బంధించి యాలింగన సౌఖ్యము ననుభవించుటచే నామె తనువు పులకాంకితమైనది. రోమరోమములు వికసించినవి. సిద్ధయోగివలె నామె పరమానంద మగ్నయైనది. మోక్షకాములగువారు, జ్ఞానులను, సద్భక్తులను పొందినప్పుడు, సాంసారిక దుఃఖముల నుండి విముక్తులైనట్లు, గోపిక లందరును శ్రీకృష్ణదర్శనముచే పరమానంద ప్రాప్తినందిరి. విరహముచే గలిగిన వేదన నుండి వారు విముక్తులైరి. శాంతి సముద్రమునందు మునకలు వేయసాగిరి. శ్రీకృష్ణుడ ఖండానందరసైక స్వరూపుడు. అతని సౌందర్య, మాధుర్యములు నిరతిశయములు. అయినప్పటికిని, విరహవ్యథావిముక్తలైన పల్లవీ జనమధ్యమందాతని శోభ మఱింత వృద్ధి చెందినది. పరమేశ్వరుడు, తన నిత్య జ్ఞానబలాది శక్తులతో గూడియుండునప్పుడధిక శోభాయమానుడై యుండునట్లు గోపికల మధ్యనున్న గోవిందుడధిక శోభాయమానుడై యుండె.

అనంతరమా గోపసుందరుల నందరిని వెంటనిడుకొని, యమునాతీరపులినము ను ప్రవేశించినాడు. వికసిత కుంద మందార పుష్ప సౌగంధ్యము గలిగిన శీతం మందవాయువుల మందానందమును కలిగించుచున్నవి. తుమ్మెదలు ఝుంకారము లొనర్చుచున్నవి. శరచ్చంద్రచంద్రిక యపూర్వమగు కాంతిని విరజిమ్ముచుండుటచే రాత్రియందలి యంధకార మెచటను గానుపించకుండ బోయినది. సర్వత్ర ఆనంద మంగళమే సామ్రాజ్య మేలుచున్నది. ఆ యమునా తీరమందలి యా యిసుక ప్రదేశ మెటువంటిది? స్వయముగా యమునాదేవియే తన తరంగ హస్తములతో, భగవానుని లీలాప్రదర్శనార్థమై సుకోమలమగు వాలుకారంగస్థలమును తయారు గావించినది! భగవానుని సందర్శనముచే గోపికలకెంత గొప్ప యానందము లభించినదనగా, దానిచే వారి హృదయముల యొక్క ఆధివ్యాధులన్నియు హరించి పోయినవి. కర్మకాండను చెప్పునట్టి శ్రుతులు వానిని వర్ణించుచూ వర్ణించుచూ చివరకు జ్ఞానకాండను ప్రతిపాదించునవై, మనోరథముల నతిక్రమించి కృత కృత్యములైనట్లు, గోపికలుకూడ పూర్ణకాములై పోయినారు. కుచకుంకుమాంకితము లైన తమ పయ్యెదలనుతీసి, తమ యాత్మబాంధవుడగు మాధవుడు కూర్చుండుటకై యిసుకతిన్నెపై పరచినారు. గొప్ప గొప్ప యోగీశ్వరులు, తమ యోగసాధనలచే పవిత్రము గావింపబడిన హృదయములందు యే భగవానునకు ఆసనము కల్పించి నను తమ హృదయ సింహాసనమునందు కూర్చుండ బెట్టుకొన జాలకుందురో అట్టి సర్వశక్తిమంతుడగు భగవానుడు, యమునా సైకతస్థలమునందు గోపికలు పరచిన యుపవస్త్రములపై నుపవిష్టుడాయె. వేలాది గోపికల మధ్య వారిచే పూజింప బడుచు శ్యామసుందరుడు విరాజమానుడైనాడు. మూడులోకములయందును, మూడు కాలములందును, యెంత సౌందర్యము ప్రకాశించుచుండునో, అదియంతయు భగ వానుని సౌందర్యము నందొక బిందుమాత్రాభాసమే యగును. అట్టి సౌందర్యముతో భగవానుడచట ప్రకాశించుచుండె. ఇట్టి యలౌకిక సౌందర్యముద్వారా, వారి ప్రేమను ఆకాంక్షలను మఱింత వృద్ధి పొందించుచుండె. గోపికలు తమ మృదుమందహాసము లచే, విలాసపూర్ణ వీక్షణములచేతను, క్రీగంటి చూపుల చేతను తమ ప్రియతముని సన్మానించుచుండిరి. గోపిక యొకతె భగవానుని చరణకమలములను తన యొడి యందుంచుకొనగా, మఱియొకతె యాతని కరకమలముల నుంచుకొనినది వారా స్పర్శానంద మనుభవించుచునప్పుడప్పు డిట్లనుచుండిరి "ఆహా, యివి యెంత సుకుమారములుగ నున్నవి. ఎంత మధురములు!" అనంతరము శ్రీకృష్ణుడంతర్ధా నుడై నందులను, మనసునందు కొంచెము కినుక వహించినవారై యతని తప్పిదము నతనిచేత స్వీకరింపజేయదలచినవారై గోపికలతనితో నిట్లు వచించిరి.

"నటశిఖామణీ, లోకమందు కొందరు, తమను ప్రేమించినవారినే తాము ప్రేమించుచుందురు. కొందరు తమను ప్రేమించని వారినిగూడ ప్రేమించుచుందురు.

కొందరు, రెండు రకములైన వారిని గూడ ప్రేమించకుందురు. ఈ మూడు రకములలోనేది నీకు మంచిదని తోచుచున్నదో తెలుపుము"ని గోపికలు శ్రీకృష్ణుని ప్రశ్నించిరి.

వారికి భగవాను, డీవిధముగ చెప్పసాగినాడు. "ప్రియసఖీమణులారా, ప్రేమించినవారినే ప్రేమించువారి ప్రేమ స్వార్థపూరితము. ఇచ్చి పుచ్చుకొనుటలాంటిది. అందు సౌహార్దముగాని ధర్మముగాని యుండవు. వారి ప్రేమ కేవలము స్వార్థమే గాని యంతకుమించిన ప్రయోజనమేమియు నుండదు.

ప్రేమించని వారిని గూడ ప్రేమించువారల- అనగా స్వభావసిద్ధముగ కరుణార్ద్రచిత్తులగు సజ్జనుల, (తల్లిదండ్రులవలె)- హృదయములు సౌహార్దముచేతను, హితము కల్గించు భావముతోను నిండియుండును. వారి వ్యవహారములు ధర్మబద్ధముగా నుండును.

కొందరు తమను ప్రేమించువారలనుగూడ ప్రేమించకుందురు. అట్టివారు తమను ప్రేమించనివారిని ప్రేమించుటయను ప్రశ్నయే యుదయించదుగదా! అట్టివారు నాలుగు విధములుగనుందురు. ఒకరు-ఆత్మారాములు అనగా తమ స్వరూపమందే మునిగియుందురు. వారికి ద్వైతభావనయే యుండదు.

రెండవరకము: వీరికి ద్వైతభావన యుండును కాని వారు కృతకృత్యులై పోయినవారు ఆప్తకాములు, వారికి దేనితోను ప్రయోజనముండదు.

మూడవరకము : వీరికి తమనెవరు ప్రేమించుచున్నదియు గూడ తెలియకుండును.

నాల్గవరకము : తెలిసి–తెలిసి, తమకు హితముచేయువారలకును, గురుతుల్యులగువారికి గూడ, ద్రోహము తలపెట్టుచుందురు. వారిని బాధింపదలతురు.

గోపికలారా, నేను మాత్రము ప్రేమించువారలతోగూడ ప్రేమవ్యవహారము నెటుల చేయవలయునో అటులచేయను. నన్ను ప్రేమించువారి చిత్తవృత్తి నాయందు మరింత దృఢముగ నిరంతరము లగ్నమైయుండుటకు మాత్రమే ప్రయత్నింతును. దరిద్రునకు యెప్పుడైనను ధనములభించి, మరల నా ధనమును గోల్పోయినచో, వాని హృదయము, యెటుల పోగొట్టుకొనిన ధనము మీది చింతతోనే నిండియుండునో, అటుల చేయుటకే నేను నన్ను ప్రేమించువారితో నున్నట్లేయుండి మధ్య మధ్య మాయమగుచుందురు. మీరు నా కొఱకై, లోకమర్యాదను, వేదమార్గమును, సమస్తబంధు బలగములను త్యజించి వచ్చితిరనుటలో నెట్టిసందియములేదు. ఇట్టి స్థితిలో మీ మనోవృత్తులు మరెచ్చటికిని ప్రసరించక యుండుటకును, మీ సౌందర్య సౌభాగ్యములగూర్చిన యాలోచన మీకు కలుగకుండుటకును, మీ చిత్తవృత్తులన్నియు నాయందే లగ్నమైయుండుటకును, పరోక్ష రూపముతో మిమ్ము

ప్రేమించుచునే, నేనదృశ్యుడనైతిని. కావున మీరు నా ప్రేమయందు దోషారోపణ చేయవలదు. మీరందరు నా ప్రియురాండ్రు. నేను మీ ప్రియుడను. నా ప్రియగోపిక లారా, మీరు మీ గృహస్థశృంఖలములను-గొప్పయోగులు, యతులుగూడ విడలేనట్టి వానిని—వదుల్చుకొని వచ్చినారు. నాతో మీకు కలిగిన యీ సమాగమము, ఆత్మ సంయోగము, సర్వథా నిర్మలము, దోషరహితమునై యుండును. నేను దివ్య శరీర ముతో, దివ్య జీవనముచే అనంతకాలమువరకు, మీ ప్రేమ-సేవ-త్యాగముల ఋణము తీర్చుకొనగోరినను గూడ తీర్చుకొనజాలను. జన్మజన్మలకును నేను మీకు ఋణగ్రస్తుడనైయే యుందును. మీరు, మీ సౌమ్యస్వభావముచేతను ప్రేమచేత మాత్రమే నన్ను ఋణవిముక్తుని చేయగలరేతప్ప, మీకు ప్రత్యుపకారము గావించి నేను ఋణవిముక్తుడనుగాలేను" అని భగవానుడు గోపికలతోననియె.

# ముప్పది మూడవ యధ్యాయము

## రాసక్రీడా ఘట్టము (మహారాసము)

భగవానుని మృదుమధురములగు వాక్కులను విని గోపికలు, యింకను శేషించియున్న విరహ జన్య దుఃఖము నుండి గూడ విముక్తినందిరి. సౌందర్య మాధుర్య నిధియగు ప్రాణప్రియుని యంగసంగముచే వారు సఫలమనోరథలైరి. శ్రీకృష్ణుని ప్రియసేవికలగు గోపికలు ఒకరి బాహువులపై మఱియొకరు బాహువులు లుంచుకొని నిలబడిరి. ఆ స్త్రీ రత్నములతో గూడి, శ్రీకృష్ణ భగవానుడు యమునా తీర పులినమందు రసమయమగు రాసక్రీడ నారంభించినాడు.

శ్లో. రాసోత్సవః సంప్రవృత్తః గోపీమండల మండితః
యోగీశ్వరేణకృష్ణేన తాసాంమధ్యేద్వయోర్ద్వయోః

యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడిద్దరిద్దరు గోపికలమధ్య ప్రకటితుడై, వారి కంఠ ములపై తన బాహువులుంచినాడు. ఒక గోపిక, కృష్ణుడు, మఱియొక గోపిక, కృష్ణుడు, యీ ప్రకారము వర్తులాకార మండల మేర్పడినది. గోపికలందరికిని శ్రీకృష్ణుడు, తన వద్దనే యున్నాడను వ్యక్తిగతానుభవము కల్గినది. ఈ ప్రకారము వేలకొలది గోపికలతో శోభాయమానుడగుచు, మురళీ మోహనుడు దివ్య రాసోత్స వము ప్రారంభించినాడు.

---

లీలాశుకయోగీంద్ర విరచిత శ్రీకృష్ణకర్ణామృతము నందలి శ్లోకములు.

శ్లో. అంగనామంగనా మంతరేమాధవో మాధవం మాధవం చాంత రేణాంగనా
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః సంజగౌవేణునాదేవకీనందనః

శ్లో. కేకికేకాద్భుతానేక పంకేరుహా లీనహంం సావళీ హృద్యతా హృద్యతా
కంసవంశాటవీ దాహ దావానలః సంజగౌ వేణు నా దేవకీ నందనః

శ్లో. క్వాపి వీణాభిరారాపిణా కంపితః క్వాపివీణాభిరా కింకిణీ నర్తితః
క్వాపివీణాభి రామాంతరం గాపితః సంజగౌ వేణు నా దేవకీనందనః.

శ్లో. చారు చంద్రావళీ లోచనై శ్చుంబితో గోపగో బృంద గోపాలికా వల్లభః
వల్లవీ బృంద బృందారకః కాముకః సంజగౌ వేణు నా దేవకీ నందనః

శ్లో. మౌళిమాలామిళన్మత్త భృంగీలతా భీతభీత ప్రియావిభ్రమాలింగితః
స్రస్త గోపీకుచా భోగ సమ్మేళితః సంజగౌ వేణు నా దేవకీ నందనః

శ్లో. చారుచామీ కరా భాసభామా విభుః వైజయన్తీ లతావాసి తోరః స్థలః
నన్ద బృందావనే వాసితా మధ్యగః సంజగౌ వేణు నా దేవకీ నందనః

శ్లో. బాలికా తాళికా, తాళలీలాలయా సంగ సందర్శిత భ్రూలతా విభ్రమః
గోపికాగీతదత్తావ ధానస్స్వయం సంజగౌ వేణు నా దేవకీ నందనః

శ్లో. పారిజాతం సముద్ధృత్య రాధావరో రోపయామాస భామా గృహస్యాంగణే
శీతశీతేవటే యామునీయేతటే సంజగౌ వేణు నా దేవకీ నందనః

(శ్రీకృష్ణకర్ణామృతములోని రాస క్రీడాష్టకము)

ఆ సమయమందాకసము, దివ్య విమానములచే నిండిపోయినది. దేవతలందరును తమ భార్యలతో గూడ, రాసోత్సవ దర్శనోత్సుకులై యచటి కేతెంచి యుండిరి. వారి మానసములానంద పారవశ్యము చెందియుండినవి. స్వర్గమందలి దివ్య దుందుభులు తమంతట తామే మ్రోగసాగినవి. దివ్య కుసుమ వర్షము కురియసాగినది. గంధర్వగణములు పత్నీ సహితముగ, భగవానుని యశోగానము చేయుచుండిరి. రాసమండలమందు, గోపికలందరును, తమ ప్రియతమ శ్యామసుందర సహితముగ, నృత్యము చేయ దొడగిరి. వారి ముంజేతి కంకణములు పాదములందలి యందియలు, వడ్డాణములందలి చిరుగజ్జెలు. లయబద్ధముగ మ్రోగసాగినవి. అసంఖ్యాకముగ గోపికలుండుటచే, ఆ మధుర ధ్వనియు తీవ్రముగనే యుండె. యమునా తీరమందలి రమణీయవాలుకా స్థలముసందు భగవానుడు గోపికా మధ్యమునంద పూర్వ శోభతో వెలుగొందుచుండె. అనేక సౌవర్ణ—మణుల మధ్య జ్యోతిర్మయమగు నీల మణి వలె భగవానుడుండె. నృత్య సమయమందు వివిధములగు పాదన్యాసములచే గోపికలు ముందుకువెనుకకుకదలుచు, నృత్యగతి ననుసరించి మందముగను,వేగముగను, కుమ్మరిసారెవలెను తిరుగుచును, చేతులెత్తి భావ ప్రకటనము చేయుచును, విభిన్న రీతులతో మెఱయుచుండిరి. అప్పుడప్పుడు కళాస్ఫోరకముగ మునిముసి నవ్వులు నవ్వుచుండిరి. నాట్యము చేయుచు చేయుచు వారి నడుము లెక్కడ విరిగి

పోయెనోయనునట్లు వంగిపోవుచున్నవి. వంగుట, కూర్చొనుట, లేచుట, తిరుగుట అలోగల వేగమునకు వారి స్తనములు చలించుచు, వస్త్రములెగురుచుండినవి. కర్ణ కుండలములు కదలి కపోలముల మీదకు జారుచుండె. నాట్యమందలి శ్రమచే కలిగిన స్వేదబిందువులు మొగములపై తళతళలాడుచు మెఱయుచుండె. కొప్పుల ముడులు వీడిపోయినవి. నీవీ బంధములు గూడ సడలిపోవుచుండినవి.

ఈ ప్రకారము నట వరుడగు నందనందనున కనుగుణముగ సతని ప్రియతమలగు గోపికలు నాట్యము చేయుచుండిరి. ఆ సమయమందనేక మంది శ్రీకృష్ణులు మేఘమండలములవలెను, ఆ మేఘముల మధ్య మధ్య పచ్చని మేనికాంతులతో ప్రకాశించుచున్న గోపికలు విద్యుల్లతలవలెను జూపట్టిరి. ఆశోభ వర్ణనాతీతము. గోపికల జీవనము భగవానునిరతి-ప్రేమయే. వారు భగవానునిస్త్రీయంటుకొనినృత్యము చేయుచు చేయుచునుచ్చైః స్వరమున మధురముగా గానము చేయుచుండిరి. శ్రీకృష్ణ సంస్పర్శమును పొంది వారు మహానంద నిమగ్నలైరి. రాగరంజితమైన భారి గానముచే ప్రపంచ మంతయు నిప్పటికిని ప్రతిధ్వనించు చుండును. ఒకానొకగోపిక భగవానుని స్వరముతో తన స్వరము జోడించి పాడుచు, సతని కంటె బిగ్గరగా గానము చేయదొడగినది ఆమె యొక్క విలక్షణమైన యుత్తమ గానమును విని భగవానుడు మిక్కిలి ప్రసన్నుడై యామెను ప్రశంసించినాడు. ఆ రాగమునే మరియొక గోపిక ధ్రుపదమందు గాన మొనర్పగా, భగవానుడామెనుగూడ బహుమానించె. ఒక గోపిక నృత్యము చేయుచు నలసిపోయినది. ఆమె మణి కట్టునుండి కంకణములును కొప్పునుండి పూలును జారిపోసాగినవి. అప్పుడామె ప్రక్కనే యున్న శ్యామసుందరుని భుజస్కంధమును తన బాహువులచే గట్టిగా పట్టుకొనినది. మురళీధరుడు తన చేతిని మరియొక గోపికపై నుంచి యుండె గదా! ఆ చేయి సహజ సిద్ధముగా కమల సుగంధ యుక్తమై యుండినది. దానిపై సుగంధ చందన లేపనము గూడ నలదబడియుండె. ఆ సుగంధముచే నామె పులకించినది. ఆమె రోమ కూపములు వికసించినవి. ఆనందము పట్టలేక వెంటనే యామె యా హస్తమును చుంబించినది. ఇంకొక గోపిక నృత్యము చేయుచుండగా నామె కుండలములు చలించుటచే, ఆ కుండలకాంతిచే నామె కపోలములు మఱింత కాంతివంతములై ప్రకాశించుచుండినవి. ఆమె తన కపోలమును భగవానుని కపోలమునకు తాకించినది. భగవానుడు తాను నమలిన తాంబూలము నామె నోటి యందుంచినాడు. ఇంకొక గోపిక తననూపురముల యొక్కయు, వడ్డాణముయొక్కయు చిరుగజ్జియలు ప్రమోగించుచు నాట్యము చేయుచు, గానము చేయుచుండె. ఆమె బాగుగా నలసి

పోయినపుడు, తన ప్రక్కనే యున్న గోపాలదేవుని కరకమలమును తన స్తనముల పైనుంచు కొనియె.

పరీక్షిన్మహారాజా, గోపికల సౌభాగ్యము, లక్ష్మీదేవి కంటె మిన్నయైనది. లక్ష్మీదేవికి పరమ ప్రేమాస్పదుడును, యేకాంత వల్లభుడునగు శ్రీకృష్ణ భగవానుని, తమ ప్రియతముని రూపముగాపొంది, యాతనితో విహరించును, గోపికలు గానము చేయుచుండిరి. భగవానుడు వారి కంఠములను, తన భుజములను పాశములచే బంధించియున్నాడు. ఆ సమయమందు గోపికల శోభయపూర్వముగనున్నది. వారి కర్ణముల యందు కమల కుండలములు కమనీయముగ నున్నవి. కుటిలాలకములు కపోలములపై చిందులు త్రొక్కుచున్నవి. శ్రమతోయ బిందువులు తళ తళ మెర యుచు ముఖమునకపూర్వ శోభను సంతరించుచున్నవి. వారు రాసమండలమందు భగవానునితో గూడి నృత్యమొనర్చుచుండిరి. వారి నూపురములు కంకణములు వాద్యముచేయుచుండె. భ్రమరములు వారి స్వరమునందు మేళవించుచు ఝుం కారము చేయుచుండినవి. వారి కొప్పులయందు గూర్చబడిన పూవులు జారిపోవు చుండినవి.

పసిపిల్లవాడు నిర్వికారభావముతో తన ప్రతిబింబములతోనాడుకొనువిధమున, రమారమణుడొ కప్పుడు గోపికలను తన హృదయమునకు హత్తుకొనుచు, మరొ కప్పుడు తనచేతితో వారి యవయముల స్పృశించుచును, యింకొకప్పుడు ప్రేమభరిత దృక్కులతో చూచుచును, లీలగా పరిహసించుచును వారితో నాడు కొనుచుండె. భగవానుని యాగ సంస్పర్శముచే గోపికల యింద్రియములు, ప్రేమానంద విహ్వ లములై పోయినవి. వారికేశములు చెదరి పోయినవి. పుష్పహారములు తెగిపోయి నవి. గహనముల స్తవ్యస్తమైనవి. వారు, తమకేశములను, కటివస్త్రములను, కంచు కములను గూడ చక్కబరచుకొనుట కసమర్థులైయుండిరి.

భగవానుని యీదివ్య రాసక్రీడను తిలకించుచున్న విమానస్థులైన దేవాంగ నలుగూడ శ్రీకృష్ణుని చేరవలయునను కుతూహలమునకు లోనైరి. గ్రహ తారక లతో గూడ రాకాశశాంకుడత్యంత చకితుడాయె. విస్మయాశ్చర్యములకు లోనైనాడు.

ఆత్మారాముడగు భగవానునకు, తనకంటె వేరగువస్తువుయొక్క యావశ్య కత లేకపోయినను, యెంతమంది గోపికలచట నుండిరో, అన్ని రూపములు తాను ధరించి, ప్రతియాటయందు వారితో నాడుచు, నిట్లు విహరించినాడు. చాలసేపిటుల నృత్యాది విహారములొనర్చి గోపికలలసటచెందగా కరుణామయుడగు శ్రీకృష్ణ భగ వానుడు స్వయముగా తన చేతులతో వారి మొగములతుడుచుచు సేదతీర్చినాడు. భగ వానుని కరకమలస్పర్శ, సుఖస్పర్శలచే గోపికలకు మహానందము కలిగినది. వారు, కర్ణకుండలములచే కాంతులీనుచున్న కపోలములతోడను, ప్రేమదృక్కులచేతను

శ్రీకృష్ణుని యాదరించి, ప్రభునియొక్క పరమ పవిత్రములగు లీలలను గానము చేయసాగిరి. అలసట చెందెనమీదట, నాడుయేనుగులతో గూడిన గజరాజు, జలము లందుజొచ్చి, హద్దుమీరి క్రీడించునట్లు, లోకమర్యాద —వేదమర్యాద నతిక్రమించి యుండు భగవానుడు, తనయలసటను పోగొట్టుకొనుటకై, గోపికాసహితముగ జల క్రీడయొనర్చు నుద్దేశ్యముతో, యమునానదీజలములందు దిగియె. ఆ సమయమందు భగవానుని వనమాల, గోపికల యంగసంగముచే కొంచెము నలిగి, వారివృక్షము లందలి కుంకుమలచే రంజితమైయుండినది. ఆ మాల నలువైపుల తుమ్మెదలు ఝుంకారము లొనర్చుచుండినవి. ఆ దృశ్యము గంధర్వులు కీర్తిని గానముచేయుచు వెంట వెంట తిరుగుచున్నట్లుండినది.

జలములందు గోపికలు, భగవానునిపై ప్రేమ వీక్షణములబరపుచు, నవ్వుచూ, నన్నివైపులనుండి యాతనిపై నీటిని చల్లుచుండిరి. నీటినల్లకల్లోలము చేయుచు వారు జలక్రీడలాడిరి. విమానములపైనున్న దేవతలు పుష్పవృష్టి గురియించిరి. స్తోత్రములొనర్చిరి. ఈ ప్రకారము ఆత్మారాముడగు భగవానుడు, గజరాజువలె జలవిహారము చేసినాడు.

అనంతరము, వ్రజనాధుడు వ్రజయువతీ సమేతుడై, యమునాతటమందలి యుపవనమును ప్రవేశించె. ఆ వనము చాల రమణీయముగనున్నది. అందు నాల్గు వైపుల, జల-స్థలములందు సువాసనా భరితములగు సుందరపుష్పములు వికసించి యున్నవి. వాని సౌగంధ్యముతో గూడిన వాయువు మందమందముగ వీచుచున్నది. మదగజము తన కరిణీసంఘముతోడ చరించునట్లు, భగవానుడా యుపవనమందు, గోపీజన పరివృతుడై వనవిహారము సలిపినాడు.

భగవానుడు రాసక్రీడగావించిన యా శరద్రాత్రి రూపమున, ననేకరాత్రులు పుంజీభూతమైనట్లుండినది. అన్నివైపుల శరచ్చంద్రుని కిరణములు వెన్నెలను వెద జల్లుచున్నవి. కావ్యములందుశరదృతు వర్ణనమునందేయే రససామగ్రులు వర్ణింపబడి యుండునో అవియన్నియు నచట నా రాత్రియందు సమృద్ధిగనుండినవి. అట్టి రాత్రి యందు, భగవానుడగు శ్రీకృష్ణుడు, తన ప్రియురాండ్రగు గోపికలతోగూడి, యమునా నదీజలమునందును పులినమందును, ఉపవనమందునగూడ విహరించి నాడు. భగవానుడు సత్యసంకల్పుడను మాట మరువరాదు. ఇదియంతయు నాతని చిన్మయసంకల్పముయొక్క చిన్మయలీలయేగాని వేరొండుగాదు, ఈ లీలయందు కామభావనను, దాని చేష్టలను, దాని క్రియలను సర్వధా తనయధీనమందుంచుకొని నాడు భగవానుడు.

"శ్రీకృష్ణ భగవానుడు ప్రపంచమునకేకైక ప్రభువు, అతడు, తన యంశ యగు బలరామసహితముగ, పూర్ణరూపుడై యవతరించి యున్నాడు. ధర్మస్థాపన, అధర్మనాశనము అనునవియే భగవంతుని యవతారముయొక్క ముఖ్యోద్దేశములు.

స్వామీ, అట్టిచో, ధర్మసేతుకర్తయు, ధర్మోపదేష్టయు, ధర్మ-రక్షకుడునైన భగవానుడు, ధర్మవిరుద్ధముగా పరస్త్రీల నేల స్పృశించె? శ్రీకృష్ణుడు పూర్ణకాముడనియు, అతనికే వస్తువుపైనను కోరికలేదనియు నాకు తెలియును. అతడిట్టి నింద్యమగు పనినేల యొనర్చె? ఈ నా సందేహమును తొలగింప వేడుచుంటినని పరీక్షిత్తుడడుగగా, శ్రీ శుకమహర్షి యిట్లు సమాధానమొసగె.

శ్లో. ధర్మవ్యతి క్రమోదృష్టః ఈశ్వరాణాంచ సాహసం
తేజీయసాంనదోషాయ వహ్నేః సర్వభుజోయథా

"సూర్యుడు, అగ్ని మొదలగు యీశ్వరులు (సమర్థులు) గూడ అప్పుడప్పుడు ధర్మోల్లంఘనము చేయుచు సాహసకృత్యము లొనర్చుచుండుటను చూచుచుందుము. కాని యట్టి పనులచే, తేజస్వంతులగు పురుషులకు దోషమేమియు కలుగదు. అగ్ని తనయందుబడిన సమస్తమును దహించును. కాని యా పదార్థముల యందుండిన దోషమేమియు నాతనికంటదు. సమర్థతలేనివారు, అట్టిపనులను శరీరముతో చేయుమాట యటుంచి, మనమునందుకూడ నట్టియాలోచన చేయరాదు. మూర్ఖత్వముతో నట్టి పనులాచరించిన వానికి సర్వనాశము సంభవించును శంకర భగవానుడు హాలహల విషమును పానము చేసినాడు. మఱియొకడెవడైన త్రాగినచో మాడిమసియైపోవును. అందుచే యీశ్వరకోటిలోని వారగు శంకరాదుల వాక్యములను సత్యములుగా భావించి, తమ యధికారము శక్తిననుసరించి, వారుపదేశించిన విధముగా నాచరించుటకు ప్రయత్నించవలయును (అంతేగాని వారు చేసినట్లు చేయరాదు) వారి యాచరణలనుగూడ నప్పుడప్పుడు వీలయినచోట్ల ననుసరించవచ్చును. కావున బుద్ధిమంతుడగువాడు, యే యాచరణలు వారి యుపదేశముల కనుకూలములుగనుండునో, వానినే తన జీవితము సందనుకరించవలయును. పై జెప్పిన సమర్థులవంటి పురుషులు అహంకారరహితులుగ నుందురు. శుభకర్మలు చేయుటయందు వారికెట్టి సాంసారిక స్వార్థమునుండదు. అశుభకర్మ లొనర్చుటయందెట్టి యనర్థము (కష్టము) గూడ నుండదు. వారు స్వార్థానర్థములకతీతులై యుందురు. వారి విషయమందే యిట్టి పరిస్థితి యుండగా, పశు పక్షి, మనుష్య, దేవతాది సమస్త చరాచర ప్రపంచమునకేకమాత్ర ప్రభువు, సర్వేశ్వరుడునైన భగవంతుని విషయములో మానవీయములగు శుభాశుభ సంబంధములెట్లు జోడింప వీలగును? ఎవని చరణకమల రజఃకణము సేవించిన భక్తజనులు సంతృప్తి గాంచుచుందురో, యెవనియొక్క యోగప్రాప్తిని పొందిన యోగిజనములు తమ సమస్త కర్మబంధములను త్రెంచుకొనగలుగుదురో, విచారణశీలురగు జ్ఞానులే భగవతత్త్వమును విచారణ యొనర్చి, తత్సారూప్యమునంది, సమస్త కర్మబంధ విముక్తులై, స్వచ్ఛందముగ విహరించుచుందురో, ఆ భగవానుడే తన భక్తుల యిచ్ఛననుసరించి వారికి

తన చిన్మయ శ్రీవిగ్రహమును ప్రకట మొనర్చుచుండును. అటువంటప్పుడు, ఆతని యందు కర్మబంధముయొక్క కల్పనయే యెట్లుచేయ వీలగును? గోపికలయొక్క, వారిపతులయొక్క, అటులే సర్వశరీరధారులయొక్క యంతఃకరణములయందే మహాత్ముడాత్మరూపముగ విరాజమానుడగుచుండునో, సమస్తమునకు నెవడు సాక్షియో, పరమపతియో, అతడే తన దివ్య చిన్మయ శ్రీవిగ్రహమును ప్రకట మొనర్చి యీ లీలను ప్రదర్శించుచుండె. భగవంతుడు జీవులననుగ్రహించుటకొరకే మానవ రూపమున నవతరించి యిట్టి లీలల నొనర్చుచుండును. వాటిని శ్రవణ మొనర్చి జీవులు భగవత్పరాయణులగుదురుగాక" యనియే భగవత్సంకల్పము. వ్రజవాసులగు గోపాలురు, శ్రీకృష్ణ భగవానుని యందీషన్మాత్రమైనను దోషారోపణ చేయలేదు. ఆతని యోగమాయా ప్రభావముచే మోహితులై వారందరు, తమ భార్యలు తమవద్దనే యుండినట్లు భావించుచుండిరి.

బ్రహ్మయొక్క రాత్రితో సమానముగ నా శరద్రాత్రి గడచిపోయినది. బ్రాహ్మముహూర్తము వచ్చినది. గోపికలకు తమ యిండ్లకు పోవలయునను కోరిక యెంత మాత్రము లేకున్నను, శ్రీకృష్ణుని యాజ్ఞననుసరించి వారు తమ తమ యిండ్లకు వెడలిరి. ఏలననగా, వారు తమ ప్రతి చేష్టతోను, ప్రతి సంకల్పముతోను కేవలము భగవానునే ప్రసన్నుని గావించుకొనుటకు కోరుచుండిరి.

గోపికాసహితుడై గోవిందుడొనర్చిన యీ చిన్మయ రాసలీలా విలాసకథను మరల మరల నెవరు శ్రవణమొనర్చెదరో, వర్ణించెదరో వారికి, భగవానుని చరణములయందు పరమభక్తి ప్రాప్తించును. వారత్యంత శీఘ్రముగ, తమ హృదయ రోగమగు కామవికారమునుండి విముక్తి గాంచెదరు. వారికి కామభావము యెప్పటికిని కలుగకుండ సంపూర్తిగా నశించిపోవును. *

---

* విశేష వివరణము :

* శ్రీ మద్భాగవత మహాపురాణమునందు రాసలీలయొక్క యీ యైదధ్యాయములు దానికి పంచప్రాణములుగా పరిగణింపబడుచున్నవి. శ్రీకృష్ణ భగవానుని పరమాంతరంగ లీలయు, భగవత్స్వరూపభూతలేయైన గోపికలతోడను హ్లాదినీశక్తి రూపిణియగు శ్రీరాధాదేవితోడను జరుగునట్టి దివ్యాతిదివ్యమగు భగవంతుని క్రీడ యీ యైదధ్యాయములందు వర్ణింపబడినది, "రాస" శబ్దమునకు మూలము రసము. 'రస' మనగా స్వయముగా శ్రీకృష్ణ భగవానుడే యగుచున్నాడు. "రసోవైసః" అని శ్రుతి చెప్పుచున్నది. ఏ దివ్యక్రీడయందు, ఒకే రసము అనేక రసస్వరూపమై, అనంతానంత రసాస్వాదన మొనర్చునో; ఒకే రసము రససమూహ రూపముగా ప్రకటితమై తానే స్వయముగా ఆస్వాద్యము- ఆస్వాదకుడు, లీల, ధామము మఱియు విభిన్నములగు ఆలంబన- ఉద్దీపనరూపుడై క్రీడించునో-దానిని 'రాస'

మందురు. భగవానునియొక్క యీ దివ్యలీల నిరంతరము, భగవానుని దివ్యధామ మందు జరుగుచునే యుండును. అట్టిది, భగవానుని యపార కృపావిశేషముచే, ప్రేమ భక్తి సాధకుల హితార్థమై, యప్పుడప్పుడు తన దివ్య ధామ సహితముగనే భూ మండలముపై గూడ నవతరించుచుండును. దానిని చూచి, విని, గానము చేసియు, అటులనే స్మరించియు, చింతన మొనర్చియు, అర్హులగు పురుషులు(అనగా జీవులు), రసస్వరూపుడగు భగవానుని యొక్క పరమ రసమయమగు లీలయొక్క ఆనందమును పొందగలుగుదురు. మఱియు తాము స్వయముగా భగవానుని లీల యందు సమ్మిళితులై తమను కృతకృత్యులుగా చేసుకొన గలుగుదురు. ఈ రాస పంచాధ్యాయి యందు, వంశీనాదము, గోపికల యభిసరణము, శ్రీకృష్ణునితో జరిగిన వారి సంభాషణము, రమణము, శ్రీరాధాదేవితో• గూడి భగవాను డంతర్హితుడగుట, మరల ప్రత్యక్షమగుట, గోపికలొసంగిన వస్త్రాస్తరణముపై విరాజమానుడగుట, గోపికల కూట ప్రశ్నలకు సమాధాన మిచ్చుట. రాసనృత్యము, క్రీడ, జలకేళి, మరియు వనవిహారము వర్ణింపబడినవి. ఇవి యన్నియు మానవ భాషయందు వర్ణింపబడినను, వాస్తవమునకు పరమదివ్యములు.

కాలముతోపాటు మానవ మస్తిష్కము గూడ మారుచుండును. అది యొకప్పుడంతర్దృష్టి ప్రాధాన్యత గలదిగను మఱియొకప్పుడు బాహ్య దృష్టి ప్రాధాన్యత గలదిగను ఉండును. నేటి యుగమే యటువంటిది. దీనియందు భగవానుని యస్తిత్వము మీదనే యవిశ్వాసము ప్రకటిత మగుచున్నది. ఇట్టి స్థితిలో, యీ దివ్య రాసలీలా రహస్యము నెఱుగక, అనేక రకములగు ఆశంకలను చేయుటలో నాశ్చర్య మేమున్నది? ఈ రాసలీల యంతర్దృష్టి వల్లను, మఱియు ముఖ్యముగా, భగవత్కృపాపాత్రులునైనయే మహాత్ములీ రాసలీలానుభూతిని పొందుదురో, వారే ధన్యులు. అట్టి మహాత్ముల చరణ ధూళి చేతనే ముల్లోకములు ధన్యములగును, వారి మాటల నాధారము చేసుకొని, రాసలీలకు సంబంధించిన విషయమునేకొంచెమో వ్రాయు సాహసము చేయబడుచున్నది.

భగవానుని శరీరము, జీవుల శరీరములవలె, జడము కాదను విషయము ముందుగా గుర్తింపవలసి యున్నది. జడ పదార్థము యొక్క యునికి కేవలము జీవుని దృష్టియందు మాత్రమే యుండును. భగవానుని దృష్టి యందు కాదు. ఇది దేహము, వీడు దేహియను నట్టి భేద భావము కేవలము ప్రాకృతిక రాజ్యమందు మాత్రమే యుండును. ప్రకృతి గూడ చిన్మయమై యుండునట్టి య ప్రాకృత లోకమందు, సర్వము చిన్మయమేయై యుండును. అచట అచిత్తు యొక్క ప్రతీతి కేవలము చిత్తు యొక్క విలాసమే యగును లేక భగ వానుని లీలా సిద్ధి కొఱకు ప్రతీతమగును. కావున స్థూలముగా నిట్లు చెప్పవలని

యున్నది. ఏమనగా :- జడ రాజ్య మందు నివసించు మానవుల మస్తిష్కము భగవానుని యప్రాకృత లీలలను గూర్చి యాలోచించునపుడు, అది తన పూర్వ వాసనలననుసరించి,జడరాజ్యధారణలను, కల్పనలను, క్రియలయారోపమునే, ఆదివ్య రాజ్య విషయమందుగూడ చేయుచుండును.అందుచేత దివ్యలీలారహస్యమునే,యేఱుంగుట కసమర్థమైపోవును. ఈ రాసము, నిజమునకు, పరమోజ్జ్వల రసముయొక్క యొక దివ్య ప్రకాశము. జడ జగత్తు యొక్క విషయము దూరముగా నుండనిండు, జ్ఞాన విజ్ఞాన రూపమగు జగత్తునందు గూడ యిది ప్రకటముగాక యుండును. అధిక మేమనగా, సాక్షాత్తు చిన్మయతత్త్వమందుగూడ, యీ పరమ దివ్యోజ్జ్వల రసము యొక్క లేశాభాసము గూడ గోచరము గాకుండును. (ఉజ్జ్వల, శృంగారములు పర్యాయపదములు). ఈ పరమ రసస్ఫూర్తి, పరమ భావమయి యగు, శ్రీకృష్ణ ప్రేమస్వరూప గోపీ జన మధుర హృదయమందు మాత్రమే కలుగును. ఈ రాస లీల యొక్క యథార్థ స్వరూపము మరియు పరమ మాధుర్యాస్వాదము గోపికలకు మాత్రమే లభించును. ఇతరులు దీనిని యూహించను గూడ లేరు.

భగవానునివలెనే గోపికలు గూడ పరమ రసమయులు. సచ్చిదానందమయ స్వరూపులు. సాధనాదృష్టితో గూడ వారు కేవలము జడ శరీరమును మాత్రమే త్యాగము చేయలేదు. సూక్ష్మ శరీరముచే పొందబడునట్టి స్వర్గమును, కైవల్యము వలన ననుభవింపబడు మోక్షమును-యింకను యేమనగా - జడత్వము యొక్క దృష్టిని గూడ త్యాగమొనర్చియున్నారు. వారిదృష్టియందు కేవల చిదానందస్వరూపు డగు శ్రీకృష్ణుడే యుండెను. వారి హృదయమందు శ్రీకృష్ణుని తృప్తి పరచునట్టి ప్రేమామృతమున్నది· వారి యిట్టి యలౌకిక స్థితియందు, స్థూల శరీరము, దాని స్మృతి, దాని సంబంధముచే సంభవించు అంగసంగ కల్పనయు, యే ప్రకారముగను చేయబడజాలకుండును. అట్టి కల్పన, కేవలము దేహాత్మ బుద్ధిచే బద్ధులైన జీవులకు మాత్రమే కలుగును. ఎవరు గోపికలను సరిగా గుర్తించిరో, వారు గోపికల పాద ధూళి స్పర్శను పొంది తాము కృతకృత్యులగుటకు వాంఛించిరి. బ్రహ్మ, శంకరుడు ఉద్ధవుడు, మరియు అర్జునుడు, గోపికల యుపాసనచేసి భగవచ్చరణములందట్టి ప్రేమను వరదానముగా పొందిరి. లేక పొందవలయునని యభిలషించిరి. అట్టి గోపికల యొక్క దివ్యభావమును సాధారణ స్త్రీ-పురుష భావమువలె భావించుట, గోపికల యెడల, భగవానుని యెడల, యథార్థముగా సత్యమునెడల, చాల సన్యాయము, మహాపరాధమగుచున్నది. ఈ యపరాధము నుండి కాపాడుకొనుటకై, భగవానుని దివ్యలీలలను గూర్చి యాలోచించు సమయమందు, అతని యప్రాకృత దివ్యత్వమును స్మృతి యందించుకొనుట పరమావశ్యకము.

భగవానుని చిదానంద ఘన శరీరము దివ్యమైనది. (అతడు పుట్టుక లేని

వాడు) అది పుట్టునది గాదు. నశించునదియు గాదు. హానోపాదాన రహితము. అది నిత్యము సనాతనము, శుద్ధమునగు భగవత్స్వరూపము మాత్రమే. ఆ ప్రకారమే, గోపికలు దివ్యజగత్తునకు చెందిన భగవత్స్వరూప భూతలు. అతని యంతరంగ శక్తులు. వీరిరువురి సంబంధము గూడ దివ్యమేయైయున్నది. ఈ యుత్తమ భావ రాజ్యలీల, స్థూలశరీరమునకు, స్థూలమనస్సుకు అతీతము. ఆవరణభంగానంతరము (అనగా వస్త్రాపహరణానంతరము) యెప్పుడు భగవానుడు స్వీకరించునో, అప్పుడీ లీలయందు ప్రవేశము కలుగును.

స్థూల సూక్ష్మ కారణదేహముల సంయోగముచే ప్రాకృతదేహ నిర్మాణము జరుగుచున్నది. కారణ శరీరమున్నంతవరకు జీవునకి ప్రాకృతదేహము నుండి విముక్తి దొరకదు. దేహ నిర్మాణమునకు కారణమైనట్టి పూర్వజన్మ కృత కర్మ సంస్కారములను (వాసనలను) "కారణ శరీరమని" చెప్పుదురు. ఈ కారణ శరీరము యొక్క ఆధారము మీదనే, జీవుడు మాటిమాటికి, జననమరణ రూపమగు సంసారచక్రమందు పరిభ్రమించుట జరుగుచున్నది. ఈ చక్రము, జీవుడు ముక్తి పొందనంతవరకు, లేక "కారణ"మునకు సర్వధా అభావము కలుగ నంతవరకు తిరుగుచునే యుండును. ఈ కర్మబంధన కారణముచేత, రక్తమాంసాది భరితమై చర్మముచే గప్పబడి యుండు, పాంచ భౌతికమగు స్థూల శరీరము సంప్రాప్తమగు చున్నది. ప్రకృతి రాజ్యమందున్న శరీరములన్నియు వస్తుతఃయోని బిందు సంయోగము చేతనే నిర్మించబడుచున్నవి. కొన్ని కామజనితమైన - నికృష్టమైధున కర్మచే కలిగినను, లేక ఊర్ధ్వరేతస్కులగు మహాపురుషుల సంకల్పముచే నధఃపతనమైన బిందువువలన కర్తవ్య రూపమగు శ్రేష్ఠమైధునము వలన కల్గినను, లేక మైధునము లేకుండగనే, నాభి, హృదయ, కంఠ, కర్ణ, నేత్ర, మస్తకాది స్పర్శచే కలిగినను, అట్టి స్పర్శగూడ లేకుండ కేవలము సంకల్ప మాత్రముచేతనే కలిగినను, శరీరములుత్పన్నములు కావచ్చును. ఇట్టి, మైధున జనితములైనను, అమైథున జనితములైనను (లేక అప్పుడప్పుడు స్త్రీ పురుష శరీరములు లేకుండ కలిగినవైనను) సమస్త శరీరములును యోని-బిందు సంయోగ జనితముల వంటివే యగుచున్నవి. ఇవి యన్నియు ప్రాకృత శరీరములే. ఇదే ప్రకారము, యోగులద్వారా నిర్మితములైన "నిర్మాణకాయములు॥ అపేక్షా కృతములైనను శుద్ధములు. కాని, యవి గూడ ప్రాకృతములే. దివ్యములని చెప్పబడుచున్న, పితృదేవతలయొక్క లేక దేవతల యొక్క శరీరములు గూడ ప్రాకృతములే.

అప్రాకృత శరీరము వీటియన్నిటి కంటె విలక్షణముగ నుండును. అది మహాప్రళయ మందుగూడ నశించదు. భగవానుని దేహము సాక్షాత్తు భగవత్స్వరూపమేయైయున్నది. దేవతా శరీరములు సాధారణముగా అస్థి రక్త మాంసాది

మయములుగాక యుండును. అవి య[ప్రాకృత శరీరములు గూడ గాకయుండును. అట్టిచో భగవానుడగు శ్రీకృష్ణుని భగవత్స్వ రూపదేహము రక్తమాంసాస్థిమయ మెట్లగును? అది సర్వథా సర్వదా చిదానందమయమే! దానియందు దేహము-దేహి, గుణము-గుణి, రూపము-రూపి, నామము-నామి, అటులే, లీల-లీలాపురుషోత్తముడు నను భేధములులేవు. శ్రీకృష్ణుని ప్రతి యవయవము గూడ పూర్ణ శ్రీకృష్ణ రూపమే.

శ్రీకృష్ణుని ముఖ మండలము పూర్ణ శ్రీకృష్ణుడైనట్లే యతని పాదమందలి గోరుగూడ పూర్ణ శ్రీకృష్ణుడే, శ్రీకృష్ణుని యన్ని యవయవముల వలనను అన్ని పనులు జరుగగలవు. అతని చెవులు చూడగలవు. అతని కన్నులు వినగలవు. అతని ముక్కు స్పర్శజ్ఞానము కల్గియుండును. అతని నాలుక వాసన చూడగలదు. అతని చర్మము రుచి చూడగలడు. అతడు మోచేతితో చూడగలడు. కన్నులతో నడువగలడు. శ్రీకృష్ణుని యొక్క సర్వము గూడ శ్రీకృష్ణుడే యగుటవలన అతడు సర్వథా పూర్ణుడు. పూర్ణతముడు. ఇందుచేతనే యతని రూప మాధుర్యము నిత్య వర్ధనశీలమైయుండును. నిత్యనూతన సౌందర్యమయమై విలసిల్లుచుండును. అతని యందెట్టి చమత్కారము కలదనగా, అతడు స్వయముగా తనను తానే యాకర్షించు కొనుచుండునన్నచో, అతని సౌందర్యమాధుర్యముచే, గోవులు, హరిణములు, వృక్షాదులు గూడ పులకితములగుచున్నవనుటలో చెప్పవలసినదేమున్నది?

భగవానుని యిట్టి స్వరూపభూతమైన శరీరము వలన తుచ్ఛమగు మైథున కర్మ సంభవముగాదు. మానవుడు భుజించు దానినుండి క్రమముగా, రసము, రక్తము, మాంసము, మేధస్సు, మజ్జ మరియు యెముకలు తయారై, చివరకు శుక్ర మేర్పడును, ఈ శుక్రము నాధారము చేసుకొని శరీరముండును. మైథునక్రియ యందు యీ శుక్రము స్ఖలనమగుచుండును. భగవానుని శరీరము కర్మ జన్యమూ కాదు. మైథున సృష్టికి చెందినదికాదు. దైవికము గూడ కాదు. అది వీనియన్నిటికి నతీత మైనట్టిది. సర్వథా విశుద్ధమగు భగవత్స్వరూపము. దానియందు రక్త మాంసాదు లేమియులేవు. అందుచే నందు శుక్రము గూడ లేదు. అందుచే నతనివలన ప్రాకృత పాంచ భౌతిక శరీరధారులగు స్త్రీ పురుషుల క్రీడగాని, మైథున కల్పనగాని, కలుగ జాలదు.

ఇందుచేతనే ఉపనిషత్తునందు భగవానుడు "అఖండ బ్రహ్మచారి"యని చెప్ప బడి యున్నాడు. ఇందుచేతనే భాగవతమందు "అవరుద్ధసౌరతా"ది పదముల తనని గూర్చి ప్రయోగింపబడి యున్నవి. ఇంకను యెవరైనా, అతనికి పదునారు వేల నూట యెనిమిది మంది భార్యలు, అనేకమంది పుత్రులు యెట్లు కలిగిరని శంకించినచో, వారికి సూటియైన సమాధానమేమనగా, నది యంతయు భాగవత సృష్టి (భగవత్సం

బంధమైనది) భగవత్సంకల్ప మాత్రము చేతనే కలిగినది. అది భగవానుని యోగ మాయాశక్తి యొక్క చమత్కారమేగాని వేరుగాదు. ఈ వివేచనముచే గూడ, గోపికలతో గూడ శ్రీకృష్ణుడొనర్చిన రమణము, సర్వధా దివ్యభగవద్రాజ్యము యొక్క లీలయేగాని, లౌకిక కామక్రీడగాదనియే, సిద్ధమగుచున్నది.

ఈ గోపికల సాధన సంపూర్ణమైనది. రాబోవు రాత్రులందు వారితో గూడిన విహారము చేయవలయుననెడి ప్రేమ సంకల్పము చేయబడినది. దీనితోపాటు, నిత్య సిద్ధలై, లోకదృష్టిలో వివాహితలైన గోపికలను గూడ యీ రాత్రులయందే, దివ్య రాసలీలయందు భాగస్వాముల చేయవలసియున్నది. ఆ రాబోవు రాత్రులేవి యను విషయము భగవానుని దృష్టియందున్నది. అతడు శారదీయరాత్రులను చూచెను. "భగవానుడు చూచెను" అను మాటల యర్థము సామాన్యము గాదు. దానికి విశేషార్థమున్నది.

మొదటి సృష్టికాలమందు (ప్రారంభమందు) "సఐక్షత ఏకోఽహం బహుస్యాం" అను శ్రుతి ప్రకారము, భగవానుని యీక్షణచేతనే జగత్తుయొక్క యుత్పత్తి కలిగినది. అటులనే రాసలీలా ప్రారంభ సమయమందు గూడ భగవానుని యొక్క ప్రేమ వీక్షణముచేతనే శరత్కాలము యొక్క దివ్యమగురాత్రులు సృష్టింపబడినవి. మల్లికాపుష్పములు వెన్నెల మొదలగు సమస్త ఉద్దీపన సామగ్రియు భగవానుని ద్వారా వీక్షింపబడినవి. అనగా ఆ సామగ్రియంతయు లౌకికముగాదు. అలౌకికమని యర్థము. అప్రాకృతమని తెలియవలయును. గోపికలందరును తమ మానసములను శ్రీకృష్ణుని మానసమందు సమ్మిళిత మొనర్చినారు. అందుచే వారి మానసములు వారివద్దలేవు. అప్పుడు ప్రేమదానమొనర్చుచున్న శ్రీకృష్ణ భగవానుడు, విహారార్థము వారికి నూతన మానసములను–దివ్యములైన వాటిని సృష్టించినాడు. యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుని యోగమాయయే యిది. ఆ మాయయే రాసలీలార్థము, దివ్యస్థలమును, దివ్యసామగ్రిని, అదే విధముగ దివ్యమానసములను గూడ నిర్మించు కున్నది. ఇంత తతంగము జరిగిన మీదట భగవానుని వేణువు నినదించినది.

భగవానుని వేణునాదము, జడుని చైతన్యవంతునిగను, చేతనమును జడముగను, చలమున చలముగను, అచలమును చలముగను, విక్షేపము గలవానిని సమాధిస్థునిగను, సమాధిస్థుడైన వానిని విక్షిప్తునిగను చేయుచునేయుండును. భగవానుని ప్రేమదానమును పొంది గోపికలు, సంకల్పరహితులై, చింతారహితులై, గృహకృత్యములందు మునిగిపోయినారు. కొందరు గురుజనుల సేవాశుశ్రూషలయందును, ధర్మకార్యములందును నిమగ్నులైనారు. కొందరు గోదోహనాది ప్రయోజనాత్మకము లగు పనుల నాచరించుచుండిరి. కొందరు శృంగారాది యలంకార సాధనములందు

వ్యగ్రులైనారు. కొందరు పూజా సంకీర్తనాది మోక్షసాధనములందు నిమగ్నులైనారు. అందరును తమతమ పనులయందు నిమగ్నులైనను వారి మానసములు మాత్రమందులో దేనిని గూడ వాంఛించుటలేదు. ఇదియే వారిలోని విశిష్టత-దీనికి ప్రత్యక్షప్రమాణమేమనగా, మోహనమురళీరవము వినుటయే యాలస్యముగ-తాము చేయుచున్న పనిపూర్తియగుటపై వారికి ధ్యానములేకుండ-పని పూర్తియైనదేని వెళ్ళుదమని యాలోచించక, యెక్కడిదక్కడ వదలి, వారు మురళీధరుని వద్దకు పరువెత్తుకొని పోవుటయే. తీవ్రవైరాగ్య ప్రదీప్తజ్వాలచే పరిపూర్ణముగ నుండిన హృదయముగల సాధకుడగు సంన్యాసివలె వారు బృందావనము చేరిరి. ఒకరి కొకరు చెప్పుకొనలేదు. ఎవరి సలహాను కోరలేదు. అస్తవ్యస్తగతితో, యెటుల నున్న వారటులనే శ్రీకృష్ణ సమీపమును చేరియుండిరి. పూర్ణవైరాగ్యము మరియు పూర్ణప్రేమయనునవి యొకటేగాని భిన్నముగావు. గోపికావ్రజమునకు, శ్రీకృష్ణునకు మధ్యనున్నది మూర్తీభవించిన వైరాగ్యమా లేక మూర్తీభవించిన ప్రేమయా, యను విషయవివరణము నెవ్వరైనను చేయగలరా?

సాధన యనునది రెండు రకములు. 1. మర్యాదపూర్ణమగు వైధసాధన (విధియుక్తము) 2. మర్యాదారహిత అవైధసాధన-యనునవి. రెండు సాధనముల యందుగూడ వానికి సంబంధించిన స్వతంత్రనియమములున్నవి. వైధసాధనయందు నియమనిబంధనలయొక్క, సనాతనపద్ధతియొక్క, కర్తవ్యములయొక్క మఱియు పాటించవలసిన వివిధధర్మములయొక్క—త్యాగమేరకముగ సాధన భ్రష్టత్వము కలిగించి మహాహానికరమగుచున్నదో, అటులనే అవైధసాధనమందు (ప్రేమభక్తి సాధనమందు) నియమనిబంధనాదుల (పాటించుటను) త్యజించుట కళంకరూపముగ పరిణమించుచున్నది. అవైధప్రేమసాధకుడు బుద్ధిపూర్వకముగా, సమస్తయాత్మోన్నతిసాధనములను విడిచిపెట్టునని (నా) యభిప్రాయముగాదు. విషయమేమనగా, ఆస్థాయి యట్టిది. అచట వీని యావశ్యకతలేదు. అచటనవి తమంతట తామే-నది యావలితీరము జేరిన తరువాత స్వాభావికముగనే నౌకాయానము వదలిపోవునట్లుగా—వదలిపోవును. భూభాగముపై నావయందుగూర్చుండి పయనించుటయను ప్రశ్నయే యుదయించదు. అట్లుచేయువానిని గాని చేయదలచువానినిగాని, బుద్ధిమంతుడనియే యెవరును భావించరు! ఈ సాధనములన్నియు-సకలమనోవృత్తులును సహజమగు స్వేచ్ఛచే సద్వితీయ పరమాత్మవైపునకు పరుగెత్తుచుండ నుండుసంతవరకే—యుండును. ఇందుచేతనే, భగవానుడు గీతయందొకచో పార్థునితో నిట్లు పల్కియున్నాడు.

శ్లో. నమేపార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన
నానవాప్తమ వాప్తవ్యం వర్త ఏవచ కర్మణి

" యదిహ్యాహం నవర్తేయం జాతుకర్మణ్య తంద్రితః
మమవర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః
" ఉత్సీదేయురిమే లోకా సకుర్యాంకర్మ చేదహం
సంకరస్య కర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః
" సక్తాః కర్మణ్య విద్వాం సోయథా కుర్వన్తి భారత
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చి కీర్షుల్లోక సంగ్రహంః (3/22-25)

"అర్జునా, ముల్లోకముల యందును నేను చేయ వలసినది యేమియు లేకున్నను, నాకు ప్రాప్తము కాక పొందదగిన వస్తువే లేకున్నను, నేను కర్మచేయు చునే యున్నాను. నేను సావధానుడనై యెప్పుడైనా, కర్మ చేయకున్నచో, అర్జునా, నన్ను చూచుచుండు ప్రజలు, నా మార్గము ననుసరించి, కర్మలను చేయకుందురు. నేను కర్మ చేయనిచో లోకులందరును కర్మ భ్రష్టులయ్యేదరు. ఈ సాంకర్యము నకు, తద్వారా సర్వ ప్రజల సర్వనాశనమునకును నేను కారణమగుదును. నా యీ యాదర్శము ననుసరించి, అజ్ఞానులగు ప్రజలే రీతిగా ఆసక్తితో కర్మల నాచరించు చున్నారో, అనాసక్తులగు జ్ఞానులు గూడ నదేరీతిగా కర్మాచరణ మొనర్ప వలసి యున్నది. వారు చేయునది లోక సంగ్రహార్థము కొరకు మాత్రమే."

ఇచట భగవానుడు లోక సంగ్రహియగు మహాపురుషుని రూపము నబోధించు చున్నాడు. లోక నాయకరూపుడై సర్వ సాధారణునకు శిక్ష నొసంగుచున్నాడు. అందుకొరకే, స్వయముగా తననే యుదాహరణముగా చూపుచు, లోకులను కర్మల యందు ప్రవర్తింపజేయ గోరుచున్నాడు. ఆ భగవానుడే, భగవద్గీత యందు-అంతరంగతా విషయము వివరించుచోట, స్పష్టముగా నిట్లనుడివినాడు:-

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"

(నీవు) సర్వధర్మములను పరిత్యజించి నన్నే శరణందుము అని దాని యర్థము. ఈ మాట యందరి కొరకు చెప్పినదిగాదు. అందుచేతనే భగవానుడు మరల, యిది యన్నిటికంటె చాల రహస్యమైన విషయమని (సర్వగుహ్యతమం) చెప్పుచూ, తరువాతి శ్లోకమందిట్లు వచించినాడు.

శ్లో॥ ఇదంతే నాతపస్కాయ నా భక్తాయ కదాచన
నచాశుశ్రూషవే నాచ్యం నచమాం యోఽభ్య సూయతి.

(18-67)

"అర్థునా, యీ సర్వ గుహ్యతమగు విషయమును, యింద్రియ నిగ్రహ ముతో తపస్వి గాని వానికిని, నాయందు భక్తి లేని వానికిని, వినవలెనను కోరిక లేని వానికిని, నాయందలి యసూయతో నాపై దోషారోపణ చేయువానికిని, యెన్నటి కిని చెప్పరాదు." అని పల్కినాడు.

గోపికలు, సాధన యొక్క యీ పై యంతస్థునందున్న యాదర్శమూర్తులు, అందుచేతనే వారు, దేహ–గేహములను, పతి-పుత్రులను, యిహలోక పరలోకము లను, కర్తవ్య–ధర్మములను, సర్వమును త్యజించి, సమస్త మర్యాదల నుల్లంఘించి, పరమ ధర్మైక స్వరూపుడగు శ్రీకృష్ణ భగవానునే పొందుటకు అభిసరణ మొనర్చి నారు. వారి యీ పతి పుత్ర త్యాగము, యీ సర్వధర్మత్యాగమే, వారి యంతస్థు (స్థాయి) నకు అనురూపమైన స్వధర్మము.

ఇట్టి "సర్వ ధర్మ పరిత్యాగ" రూప స్వధర్మము యొక్క ఆచరణ, గోపికల వంటి యున్నత స్థాయి యందున్న సాధకుల యందే సంభవము. ఎందువల్లననగా, యెవరు యీ సర్వధర్మములను యధావిధిగా సంపూర్తిగా నెరవేర్చిన యనంతరము, దానికి పరమ ఫలముగా, అనన్యము- అచింత్యము– దేవదుర్లభమునగు భగత్ప్రేమ ప్రాప్తి నందుదురో వారు మాత్రమే యీ సర్వ ధర్మ త్యాగమును చేయగలుగుదురు, వారు గూడ ప్రయత్న పూర్వకముగా ధర్మ త్యాగ మును చేయరు. సూర్యుని ప్రఖర ప్రకాశము ప్రసరించిన సమయమందు తైల దీప ప్రకాశమువలె, ఆ ధర్మములే వారిని త్యాగ మొనర్చును. ఆ త్యాగము తిరస్కార మూలకముగా గాదు. తృప్తి మూలకము, భగవత్ప్రేమ యొక్క ఉన్నత స్థితికి యిదియే స్వరూపము. దేవర్షి యగు నారదుని భక్తి సూత్రమందిట్లున్నది.

"వేదానపి సంన్యస్యతి, కేవల మవిచ్ఛిన్నాను రాగం లభతే"

ఎవడు వేదములను (వేదమూలకములగు సమస్త ధర్మ మర్యాదలను) గూడ బాగుగా త్యాగమొనర్చునో, వాడు అఖండము, అసీమమునగు భగవత్ప్రేమప్రాప్తిని పొందును.

భగవానుడెవనికి, తన వంశీ ధ్వని వినిపించి, పేరుతో బిలచెనో, వాడెట్లు, యితర ధర్మముల వైపు చూచి యెప్పుడేవిధముగా నాగిపోగలడు? (ఆగలేడని భావము).

అడ్డగించువారడ్డగించినారు. కాని, హిమాలయమునుండి బయలుదేరి సముద్ర మందు బడబోవుచున్న బ్రహ్మపుత్రానది యొక్క తీవ్రప్రవాహము నడ్డగింపనెవని తరమగును? గోపికలాగ లేదు. వారినెవరు నడ్డగింపజాలకపోయినారు. చిత్తమందిం కను కొన్ని ప్రాక్తన సంస్కారములు మిగిలియున్నవారు మాత్రము, వారి యన ర్హత కారణముచేత, సశరీరముగ శ్రీకృష్ణుని సాన్నిధ్యమున కేగలేకపోయినారు. అటువంటివారి శరీరము లింటియందే పడియుండినవి. భగవానుని వియోగదుఃఖ ముచే వారి సమస్త కలుషములు తొలగిపోయినవి. ధ్యానస్థితియందు వారికి లభిం చిన భగవంతుని ప్రేమాలింగనముచేత, సమస్త సౌభాగ్యమునకు పరమ ఫలము సంప్రాప్తించినది వారికి. సశరీరముగా వెళ్ళిన గోపికలు శ్రీకృష్ణుని చేరుటకంటె

ముందుగనే, వారు భగవానుని చేరినారు. భగవానుని యందైక్యమైనారు. పుణ్య పాపముల కారణముపలననే బంధముకలుగుననియు, శుభాశుభ భోగములు లభించు ననియు, శాస్త్రముల ప్రసిద్ధమగు సిద్ధాంతమైయున్నది. శుభాశుభ కర్మఫలముల ననుభవించుటచే. పుణ్యపాపములు రెండును నశించిపోగా, జీవునకు ముక్తియప్పుడు లభించును. గోపికలు, పాపపుణ్యరహితమగు భగవానుని ప్రేమ ప్రతిమా స్వరూపిణులేయైనను, లీలకొరకై — తమ ప్రియతముడగు శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళలేక పోవుటచే గలిగిన విరహానలముచే మహా సంతాపము కలిగినదనియు, దానిచేత వారికి పాప ఫల భోగమై సమస్త పాపములు నశించిపోయిన వనియు- చూపబడినది.

తమ ప్రియతము భగవానుని ధ్యానించుటచే కలిగిన మహానందముచేత వారి సమస్త పుణ్యఫల భోగము గూడ పూర్తియైనది. ఈ ప్రకారము పాప- పుణ్యములు పూర్తిగా నశించగా, వారికి ముక్తి లభించినది. ఏ భావముతోనైనను,అనగా కామము చేగాని, క్రోధముచేగాని, లోభముచేగాని, భగవానుని మంగళమయమగు శ్రీమూర్తిని చింతనము చేయువారికి, వాని భావముతో నిమిత్తము లేకుండ వస్తు శక్తిచేతనే యతనికి శుభము లభించును. ఇది భగవానుని శ్రీ విగ్రహ విశేషము! భావము ద్వారా, ఒక ప్రస్తరమూర్తియు (శిలా విగ్రహము) పరమ కల్యాణ ప్రదము కాగలదు. భావరహితముగనైనను కల్యాణము కలిగించుట భగవద్విగ్రహము యొక్క సహజ స్వభావము.

భగవానుడు పరమ లీలామయుడు. ఎచట, అఖిల విశ్వమునకు విధాతయై, శివ బ్రహ్మాది దేవతల కందరికి వందనీయుడై, నిఖిల జీవులకు ప్రత్యగాత్మయై యుండెనో యచటనే భగవానుడు లీలానటవరుడై, గోపికల సంకేతము ననుసరించి నాట్యమొనర్చువాడుగ గూడనై యుండె. అతని యిచ్ఛచేతనే, అతనియొక్క ప్రేమాహ్వానముచేతనే, అతని వేణునిమంత్రణముచేతనే, ప్రేరితులై గోపికలాతని వద్దకు వచ్చి యుండిరి. కాని భగవానుడు, వారి రాక గూర్చి తనకే మాత్రము తెలియదన్నట్టి భావ భంగిమను, కృత్రిమ రూపమును ప్రదర్శించినాడు. బహుశః గోపికల నోటి నుండియే వారి హృదయ భావమును, ప్రేమ విషయమును, వినవలయునను తలంపాతనికి యుండి యుండవచ్చును.

విప్రలంభముద్వారా, వారి మిలనభావమును పరిపుష్టము చేయవలయునను సంకల్పముగూడ నతనికి యుండి యుండవచ్చును. బాగుగా విచారించగా, అలౌకికమగు దీనిని లోకులు సాధారణ విషయముగా భావించరాదనియు, అందుచేత సాధారణ మానవుల కుపదేశమొసంగుచు' అందరిముందు గోపికల యోగ్యతను ప్రకటించుట కొరకే, భగవానుడిట్లు ప్రవర్తించి యుండెనని తోచుచున్నది. అనాడు భగవానుడిట్లు చెప్పెగదా. "గోపికలారా, వ్రజమందెట్టి యాపదయు సంభవించలేదు గదా!

భయంకర నిశీథ సమయమందు మీరిచటికేల వచ్చితిరి? మీ యింద్లవారు మీ కొరకై వెదకుచుండి యుందురు. మీరిక్కడ యుండరాదు. వనశోభను తిలకించితిరి. ఇక మీ పసిపాపలను గూర్చియు, లేగదూడలను గూర్చియు నాలోచించుడు. ధర్మమునకనుకూలముగ తెరచియుంచిన మోక్షద్వారములగునట్టి, మీ సన్నిహిత సంబంధీకుల సేవను విడిచిపెట్టి, వనములయందు గ్రుమ్మరుట స్త్రీలకు తగదు. స్త్రీకి పతి సేవయే మహాభాగ్యము. అతడెట్టివాడైననుగానీ, ఇదియే సనాతన ధర్మము ఈ ధర్మము ననుసరించియే మీరు నడచుకొనవలయును. మీరందరు నాయందు ప్రేమగలిగి యుండిరను విషయము నాకు తెలియును. కాని ప్రేమయందు శారీరక సాన్నిధ్యము ఆవశ్యకముగాదు. శ్రవణము, స్మరణము, మరియు ధ్యానములచేత, శారీరక సాన్నిధ్యము కంటె నెక్కువగా ప్రేమ యభివృద్ధి చెందును. వెళ్ళుడు. మీరందరు సనాతన సదాచారమును పాటించుడు. మనస్సును చంచలముగా నటు నిటు పరుగెత్తనీయకుడు.

శ్రీకృష్ణుని యీ యుపదేశము (శిక్ష) గోపికల కొరకు గాదు. సామాన్య నారీ జాతికొరకే యుద్దేశింపబడినది. గోపికల యధికారము చాల విశేషమైనది. దానిని ప్రకటమొనర్చుటకే భగవాను డీరీతి బలికియున్నాడు. ఆ మాటలు విని గోపికలెట్టి దశకులోనైరి. దానికి ప్రత్యుత్తరముగ గోపికలు శ్రీకృష్ణునితో నెట్టి ప్రార్థన గావించిరి, వారు శ్రీకృష్ణుని మనుష్యునిగా భావించుటలేదు. అతని పూర్ణ బ్రహ్మ సనాతన స్వరూపమును వారు బాగుగనే తెలుసుకొని యుండిరి. తెలిసియు వారతనిని ప్రేమించుచుండిరి- ఈ విషయమెంత సుందరముగ వర్ణింపబడినది. ఈ విషయము లన్నియు మూలమునందే పఠించతగినవి. నిజముగా, యెవని హృదయమందు, భగవానుని పరతత్త్వముయొక్క అట్టి యనుపమ జ్ఞానము, మఱియు భగవానుని యందనన్యమగునట్టి మహానురాగము, ఋజుత్వముతో పాటు యెవని వాక్కునందట్టి యుద్గారము (భావోద్రేకము) ఉండునో, యతడే విశేషముగా అధికారముగలవాడగును.

గోపికల ప్రార్థనలవలన, వారతనిని అంతర్యామిగను, యోగీశ్వరేశ్వరుడగు పరమాత్మరూపునిగను గుర్తించిరనియు, యితర జనులు గురురూపముగను, సఖుని రూపమునను, మాతాపితృరూపమునను శ్రీకృష్ణుని యుపాసన చేయుచున్నట్లె వారు శాస్త్రములందుజ్జ్వల పరమరసనామముతో చెప్పబడునట్టి మధురభావముతో- పతిరూపమున ప్రేమించుచుండిరనియు, విశదమగుచున్నది. ప్రేమయొక్క సర్వ భావములు పూర్ణమై, సాధకులకు స్వామి- సఖాది రూపములతో భగవానుడు లభించినప్పుడు,— శాంత, దాస్య, సఖ్య, వాత్సల్యాది సమస్త భావములంతర్భూతములైనట్టియు, అన్నిటికంటె గొప్పదై యన్నిటి యొక్క చరమరూపమగు, గోపికల

యున్నత భావము పూర్ణము గాకుండుటకు (సఫలము గాకుండుటకు) వారొనర్చిన యుపరాధమేమి? భగవానుడు వారి భావమును సఫలము గావించినాడు! మఱియు, తానేనక రూపములుదాల్చి గోపికలతో రాసక్రీడ గావించినాడు. అతని క్రీడాస్వరూప మిటుల వర్ణింపబడియున్నది :-

"రేమేరమేశో వ్రజసుందరీభిః
యథార్భకః స్వప్రతిబింబ విభ్రమః"

ఏ విధముగ పసిపిల్లవాడు, అద్దమందలి, లేక జలమునందలి తన ప్రతిబింబ ములతో నాడుకొనునో, అటులనే రమేశభగవానుడు-వ్రజసుందరీమణులతో క్రీడించే అని యర్థము.

అనగా సచ్చిదానంద ఘనుడు, సర్వాంతర్యామి, ప్రేమ రసస్వరూపి, లీలా రసమయుడు, పరమాత్మయునగు భగవానుడు, తనహ్లాదినీ–శక్తి రూపము, ఆనంద చిన్మయరస ప్రతిభావితలు, తనదేయగు ప్రతిమూర్తి చేత నుత్పన్నములైన, తన ప్రతిబింబ స్వరూపము లేయగు గోపికలతో, ఆత్మక్రీడ గావించెనని యర్థము. పూర్ణబ్రహ్మ, సనాతనుడు, రసస్వరూపుడు, రసిరాజు, రసకశేఖరుడు, రసపర బ్రహ్మ, అఖిలరసాత్మక విగ్రహుడునగు శ్రీకృష్ణ భగవానుని యొక్క నామ ధేయమే—రాసము ఇందు జడ శరీరమేదియు లేదు. ప్రాకృతమగు అంగ సంగము లేదు. దీనికి సంబంధించినట్టి ప్రాకృతములు స్థూలములునగు కల్పనలేతేవు. ఇది చిదా నందమయుడగు భగవానుని దివ్యవిహారము. దివ్యలీలాధామ మందెప్పుడును జరుగు చుండునదేయైనను, అప్పుడప్పుడు భువియందు ప్రకటితమగుచుండును. వియోగమే సంయోగమునకు పోషకమగును. మానమదములే భగవానుని లీలయందు బాధకము లగును. భగవానుని దివ్యలీలయందు మాన, మదములు గూడ దివ్యములేయగును. ఆలీల యందవి యింకను రసపుష్టి కలుగుటకే కలుగుచుండును.భగవానునియిచ్ఛచే తనే గోపికలయందు లీలాను రూపమగు మానమద సంచారము కలిగినది. భగవాను డంతర్ధానమైనాడు. ఎవరి హృదయమందు లేశ మాత్రముగానైనను మదము మిగిలి యుండునో, నామమాత్రముగానైనను మాన సంస్కారము శేషించి యుండునో, అట్టివారు భగవానుని యెదుట నుండుట కర్హులుగారు. లేక అట్టివారు భగవానుని సమీపమందున్నప్పటికిని, వారికి భగవద్దర్శనము లభింపదు.కాని గోపికలు గోపికలే! వారితో ప్రపంచమందెవ్వరికిని తిలమాత్రమైనను పోలికలేదు. భగవానుని వియో గముచే వారికెట్టి దశ ప్రాప్తించినదను విషయము, "రాసలీలను పఠించు ప్రతిపాఠకు నకును తెలియును. గోపికల యొక్క తను-మన- ప్రాణములన్నియు శ్రీకృష్ణుని యందే కాగ్రములైనవి. వారి ప్రాణములకు ప్రత్యక్ష ప్రతీకమగు వారి ప్రేమో

న్మాద గీతము, నేటికిని భావుకులగు భక్తులను భావమగ్నులను గావించి భగవానుని దివ్యలీలా లోకమందు జేర్చుచుండును. హృదయహీనుడుగాకుండ, సరసహృదయముతో నొక్కమాఱు, పఠించినంత మాత్రముననే, యిది గోపికల యొక్క మహత్త్వమును సంపూర్ణముగా హృదయమందు నింపివేయును. గోపికల యొక్కయా "మహాభావము" ఆయలౌకిక "ప్రేమోన్మాద" మును చూచి శ్రీకృష్ణుడు గూడ అంతర్హితుడుగా నుండ లేకపోయినాడు వారియెదుట "సాక్షాన్మన్మథమన్మథ రూపమున ప్రత్యక్షమై, ముక్త కంఠముతో నతడు యీ విధముగా నంగీకరించినాడు. "గోపికలారా, నేను మీ ప్రేమ భావమునకు శాశ్వతముగా ఋణపడియున్నాను. అనంతకాలము వరకు నేను మీకు సేవచేయుచున్నను గూడ మీ ఋణము నుండి నేను విముక్తుడను కాజాలను. నేసంతర్థానపుగుటలో గల యుద్దేశ్యము, మీ మనస్సులను దుఃఖపెట్టవలయుననిగాదు. మీ ప్రేమను మఱింత యుజ్జ్వలముగనుసమృద్ధముగను చేయుటయే నా యభిప్రాయము" అని పలికినాడు. అనంతరము రాస క్రీడ ప్రారంభమైనది.

అధ్యాత్మ శాస్త్రమును బాగుగా నధ్యయన మొనర్చినవారికిది తెలియును. యోగసిద్ధినందిన సాధారణ యోగి కూడ కాయ వ్యూహము ద్వారా ననేక శరీరములను నిర్మాణముచేయ గలిగిన వాడై యుండును. మరియు ననేక స్థానములయందు పస్థితుడై యుండి వేరు వేరు పనులను చేయగలిగియుంతును. ఇంద్రాది దేవతలందరొకే సమయమందనేక స్థానములందు పస్థితులై, యనేక యజ్ఞము లందొకే పర్యాయము అహుతులను స్వీకరింపగలిగి యుందురు. యోగులందరికిని, యోగేశ్వరులకు గూడ యీశ్వరుడును, సర్వసమర్థుడునునగు శ్రీకృష్ణ భగవానుడొకేపర్యాయ మనేకమంది గోపికలతో క్రీడించుటలో నాశ్చర్యమేమున్నది? భగవానునిగా స్వీకరింపనివారు మాత్రమే పలువిధములగు శంకలను కుశంకులను చేయుచుందురు. భగవానుని నిజలీలయందిట్టి తర్కములే విధముగను ప్రవేశింపజాలవు.

గోపికలు శ్రీష్ణునికి స్వకీయలా, పరకీయలాయను ప్రశ్నగూడ, శ్రీకృష్ణుని యథార్థస్వరూపమును మరపించియే, యుదయించును. జగత్తునందలి వస్తువులన్నిటికి మరియొక భాగస్వామియుండుటకు శ్రీకృష్ణుడు జీవుడుకాడు. ఇదివరకేమైయున్నను, ముందేమిగానున్నను గాని, ప్రస్తుతము వారియేకమాత్రపతి శ్రీకృష్ణుడే. తమ ప్రార్థనయందు గోపికలును, పరీక్షితుని ప్రశ్నకు సమాధానముగ శ్రీశుకదేవుడును, చెప్పినదేమనగా, గోపికలు, గోపికల పతి-పుత్రులు, బంధుబలగములు, మరియు జగత్తునందలి సమస్తప్రాణుల హృదయమందాత్మరూపుడగను, పరమాత్మ రూపుడు

గను యే ప్రభువు స్థితుడై యున్నాడో అతడే శ్రీకృష్ణుడని చెప్పియున్నారు. ఎవరైనను భ్రమవలనగాని, అజ్ఞానము వలనగాని శ్రీకృష్ణుని పరాయివానినిగ దలచినను, అతడందరికిని తమవాడేగాని పరాయివాడుగాడు. అందరును అతనివారే. శ్రీకృష్ణుని దృష్టియందు, అదియే వాస్తవికదృష్టిగూడ, అతనికెవరును పరకీయలుకారు. అందరును స్వకీయలే అంతయు కేవలమతని లీలావిలాసమే. అందరును అతని స్వరూపభూతలగు అంతరంగశక్తులే. గోపికలీవిషయము నెరుగుదురు. ప్రతిచోట వారిటుల చెప్పియేయున్నారు.

ఇట్టి స్థితియందు "జారభావము" మరియు "ఔపపత్యము"లను పదములకు యెట్టి లౌకికార్థమునుండదు. కామములేనిచోట, అంగసంగములేని సందర్భమందు, ఔపపత్యము–జారభావముల కల్పనయే యెటుల సంభవింపగలదు? గోపికలు పరకీయలుగాదు, స్వకీయలే. కాని వారియందు పరకీయభావమున్నది. పరకీయలుగానుండుటకును, పరకీయభావముండుటకును ఆకాశపాతాళములకున్న యంతరమున్నది పరకీయా భావనమందు మూడు విషయములు గొప్ప మహత్త్వముగలవి యున్నవి. 1. తమ ప్రియతముని గూర్చిన నిరంతరచింతనము, 2. అతనిని కలుసుకొనవలయునను ఉత్కటమగు ఉత్కంఠ మరియు 3. సర్వథా దోషదృష్టియొక్క అభావము.

స్వకీయాభావమందు నిరంతరము కలిసియుండుటచేత, యీ మూడు విషయములును గౌణములై పోవుచున్నవి. కావి పరకీయాభావమందీ మూడునుండనేయుండును. కొందరు గోపికలు జారభావముతో శ్రీకృష్ణుని కోరుచుండిరని యనుటలో నర్థమేమనగా, వారు శ్రీకృష్ణుని నిరంతరము చింతించుచుండిరనియు, యతనిని కలుసుకొనవలయునను నుత్కంఠతో నుండిరనియు, మరియు శ్రీకృష్ణుని ప్రతి వ్యవహారమును ప్రేమదృష్టితోనే చూచుచుండిరని మాత్రమేయర్థము. విశేష మహత్వముగల నాల్గవభావమొకటి యున్నది. అదియేమన:– స్వకీయయగునామె తన యింటియొక్క, తనయొక్క, తన సంతానముయొక్క పాలన పోషణములను, రక్షణములను, పతి చూడవలయునని కోరుచుండును. ఈ విషయములన్నిటిని పర్యవేక్షించుట ప్రతి కర్తవ్యమని యామె భావించుచుండును. ఏలననగా వీరందరును నతని నాశ్రయించి యుండువారగుటచేత, ఆమె పతినుండి యిదియే యాశించుచుండును, ఆమె యెంత పతి పరాయణయైయున్నను, ఆమెయందీ సకామ భావము దాగియేయుండును. కాని పరకీయ, తన ప్రియతముని నుండి యేమియును వాంచిం

చదు. ఎట్టి యాశయును పెట్టుకొనదు. కేవలము తానాత్మసమర్పణమొనర్చి యతనిని సుఖపెట్టవలయుననియే కోరుకొనుచుండును. శ్రీ గోపికలయందీ భావము ప్రస్ఫుటముగ ప్రకటితమగుచునేయున్నది. ఇట్టి విశేషమున్న కారణముచేతనే, సంస్కృత సాహిత్యమందలి కొన్ని గ్రంథములందు నిరంతరచింతనమునకు ఉదాహరణ రూపముగా, పరకీయా భావముయొక్క వర్ణనము చేయబడియున్నది.

గోపికలయొక్క యీ భావమున కొక్కొటిగాదు అనేక దృష్టాంతములు భాగవతమందు లభించుచున్నవి. అందుచే గోపికలపై పరకీయత్వారోపణ, వారి భావమును సరిగా గ్రహింపలేని కారణముచేతనే చేయబడుచున్నది. ఎవరి జీవితమందు సాధారణ ధర్మముయొక్క యొకసూక్ష్మమగు ప్రకాశరేఖయైనను ప్రాప్తమగునో, అట్టివాని జీవితమే పరమపవిత్రము. అది యితరులకు ఆదర్శప్రాయమగును. అట్టిచో, యెవరి జీవితసాధన చరమదశకు చేరియున్నదో, లేక, యెవరు నిత్య సిద్ధలో, యెవరు భగవానుని స్వరూపభూతలైరో, యెవరు కల్పముల పర్యంతము సాధనయొనర్చి శ్రీకృష్ణుని యనుగ్రహముచేత నతనిని సేవించునధికారమును పొందియుండిరో, అట్టి గోపికలు, సదాచారోల్లంఘనమెటుల జేయగలరు? సమస్త ధర్మమర్యాదా సంస్థాపకుడగు శ్రీకృష్ణునిపై ధర్మోల్లంఘనా కళంకమెట్లాపాదింపబడ గలదు? శ్రీకృష్ణుడు—గోపికల సంబంధమందిట్టి కుకల్పనలొనర్చుట, వారి దివ్య స్వరూపము, దివ్యలీలల విషయమునందలి యనభిజ్ఞతనే ప్రకటితము చేయును.

శ్రీమద్భాగవతముమీద, అందలి దశమస్కంధముమీద, అందులోగూడ యీ రాసపంచాధ్యాయిమీద యింతవరకు అనేకానేక భాష్యములు, టీకలు, లిఖింపబడి యున్నవి. అట్టిలేఖకులలో, జగద్గురు శ్రీవల్లభాచార్యులు, శ్రీశ్రీధరస్వామి, శ్రీజీవ గోస్వామి, మొదలగువారున్నారు. వారందరు చాల వివరముగా రాసలీలయొక్క మహిమనుగూర్చి తెలియజెప్పియున్నారు. ఒకరు దీనిని కామవిజయముగా వర్ణించినారు. ఇంకొకరు దీనిని భగవానుని దివ్యవిహారముగ చెప్పినారు. మరియొకరు దీని కాధ్యాత్మికార్థము చెప్పినారు. శ్రీకృష్ణ భగవానుడు ఆత్మస్వరూపుడు, ఆత్మాకార వృత్తియే శ్రీరాధాదేవి. మిగిలిన ఆత్మాభిముఖలగు వృత్తులు గోపికలు. ధారాప్రవాహమగు వారి నిరంతరమగు ఆత్మరమణమే రాసము. ఏ విధముగ చూచినను రాసలీలయొక్క మహిమ అధికాధికముగ ప్రకటమగుచున్నది.

అయినను, దీనిచే శ్రీమద్భాగవతమందు వర్ణింపబడిన రాసము లేక రమణ ప్రసంగమును, కేవలము రూపకమనిగాని, కల్పనా మాత్రమని గాని భావింపరాదు.

అది సర్వదా సత్యము. ఎటుల వర్ణించబడినదో అటులనే మిలన విలాసాదిరూప మగు శృంగార రసాస్వాదనము గూడ జరిగినది. కాని భేదమేమనగా, అది లౌకిక స్త్రీ పురుషుల సమ్మేళనము వంటిదిగాదు. దాని నాయకుడు, సచ్చిదానంద విగ్రహుడు, పరాత్పరతత్త్వము, పూర్ణతముడు, స్వాధీనుడు, మరియు నిరంకుశుడు, స్వేచ్ఛావిహారియు, గోపీనాథుడు, భగవానుడునగు నందనందనుడు! నాయిక యా స్వయముగ హ్లాదినీశక్తియగురాధాదేవి. మఱియు,ఆమెయొక్క కాయవ్యూహరూపలు ఆమెయొక్కఘనీభూతమూర్తులగు శ్రీగోపికలు. అందుచేత వారి యీ లీల యప్రాకృతము! సర్వధా తీపి మిశ్రితమై చేదు సొరకాయవంటి యాకృతిగలదై యున్నను అనగా చూచుటకు చేదుసొరకాయవలె కనుపించినను, అది స్వాభావికముగ మధురమే గాని, చేదు స్వభావముండునా? స్వాభావికమగు మధుర గుణము మాయమగునా? అదియే సొరకాయాకారమందున్నను, సర్వత్ర, సర్వదా, సర్వథా కేవలము మాధుర్యమయమేగాని వేఱుగాదు. అయితే యిందు లీలా చమత్కార విషయము తప్పకయున్నది. లోకులు దానిని చేదు సొరకాయ యని తలచుచుందురు. కాని యది మధుర మిశ్రమము. అటులనే అఖిలరసామృత సింధువు, సచ్చిదానంద విగ్రహుడు నగు శ్రీకృష్ణ భగవానుడు అతని యంతరంగలు, అభిన్న స్వరూపలగు గోపికలయొక్క లీల గూడ చూచుటకు యెట్లున్నను, ప్రస్తుతః సచ్చిదానందమయమే యగును. అందు సాంసారికమగు నికృష్ట కామము యొక్క చేదురుచులు లేనే లేవు. కాని యీ లీల నెవరును అనుకరింపరాదు. అనుకరించుట సంభవము గూడ గాదు. మాయిక పదార్థముల ద్వారా మాయాతీతుడగు భగవానుని లీలనెవడైనను యెట్లనుకరింపగలుగును? చేదు సొరకాయకు, యెటువంటి మధురమగు మిఠాయి యాకారము సమకూర్చినను దాని చేదుతనము నేమాత్రమును పోగొట్ట జాలము. అందుచేతనే మోహగ్రస్తులగు మానవులు శ్రీకృష్ణుని రాసలీలాది యంతరంగ లీలల ననుకరించుచు, నాయికా-నాయక రసాస్వాదనము చేయదలచి, ఘోరముగా పతనము చెందినారు. మున్ముందు గూడ పతనమే సంభవించును. శ్రీకృష్ణుని యీ లీలలను శ్రీకృష్ణుడు మాత్రమే యనుకరించగలడు. కావుననే రాస పంచాధ్యాయము యొక్క చివర, శ్రీశుక దేవుడు, భగవానుని యుపదేశము నందరు పాటించవలసినదే గాని, యతని యాచరణలనన్నిటిని అనుకరించ రాదని, యందరికిని సూచించియున్నారు.

ఏ మానవులు శ్రీకృష్ణ భగవానుని కేవలము మానవునిగ భావించుచుందురో,

కేవలము మానవీయ భావముల - ఆదర్శముల యొక్క గీటురాయిపై యతని చరిత్రను పరిశీలించ దలచినవారు, మొదట్లోనే శాస్త్ర విముఖులై పోయెదరు. వారి చిత్తములయందు ధర్మ ధారణయే యుండదు.. భగవానుని గూడ తమ చిత్తము వచ్చినట్లు త్రిప్ప జూచెదరు. అందుచే సాధకుల దగ్గర వారి యుక్తియుక్తుల మహత్త్వ మేమియు నుండదు. "శ్రీకృష్ణుడు స్వయముగా భగవానుడే" యను, శాస్త్ర వచనమును గౌరవించినవాడు భగవల్లీలలనే యాధారముపై సత్యమని భావించి యాలోచించుననునది తెలియరాదు. మానవ ధర్మము, దేవ ధర్మము, పశు ధర్మము అనునవి వేర్వేరుగా నెట్లుండునో, యటులనే భగవద్ధర్మము గూడ వేరుగా నుండును. భగవానుని చరిత్రము యొక్క పరీక్ష అతని గీటురాయి పైననే జరుగవలయును. భగవానుని యేకైక ధర్మము - ప్రేమ పరవశత, దయాపర వశత, మఱియు భక్తుల యభీష్టముల పూర్తి గావించుట. యశోదాదేవి హస్తము లచే ఱోటియందు గట్టబడిన శ్రీకృష్ణుడు తన నిజజననమగు గోపికల ప్రేమ కారణ ముగ, వారితో గూడి నృత్య మొనర్చినాడు. ఇది యతని సహజ ధర్మము.

శ్రీకృష్ణుని చరిత్ర, మానవీయధారణలు, ఆదర్శములకు ననుకూలముగనే యుండవలయుననియే పట్టుబట్టినను, నందుకెట్టి బాధయునులేదు. శ్రీకృష్ణుని వయస్సాసమయమందు దాదాపు పది సంవత్సరములు. ఇది భాగవతమందు స్పష్టముగనేయున్నది. పల్లెలలోనుండు పది సంవత్సరముల వయస్సుగల పిల్లలు సాధారణముగ దిగంబరముగనే యుండెదరు. వారికి కామప్రవృత్తిగాని, స్త్రీ పురుష సంబంధమగు జ్ఞానముగాని కొంచెముగూడ నుండదు. మగపిల్లలు, ఆడ పిల్లలు కలిసి మెలసి యాడుకొనుచుందురు. నాట్యము లొనర్చుదురు. గానము చేయు దురు. పండుగ చేసుకొందురు. బొమ్మలకు పెండ్లిండ్లు జేయుదురు. ఊరేగింపులు జేయుదురు. విందులు జేసుకొందురు. గ్రామమందలి వృద్ధులుగూడ, మనోరంజనక రములగు పిల్లల చేష్టలకు ముఱియుచుందురు. వారి మనములందెట్టి చెడుభావము కలు గదు. ఇట్టి పిల్లలను యువతులగు స్త్రీలుగూడ మిక్కిలి ప్రేమతో చూచుచుందురు. ఆద రించుచుందురు. స్నానము చేయించుచుందురు. ఆహారము తినిపించుచుందురు. ఇది సాధారణ బాలుర విషయము.

ఎవని యనేక సద్గుణములు బాల్యకాలమునందే వెల్లడైయుండునో, యెవని సద్బుద్ధి, యెవని చాతుర్యము, యెవని శక్తిచేత, గొప్ప గొప్ప యాపదల నుండియు ప్రజవాసులకు రక్షణ లభించియుండెనో, అట్టి యసాధారణ ధీశక్తి సంపన్నుడైన

బాలకుడగు శ్రీకృష్ణుని యెడల అచటి స్త్రీలకు, బాలకులకు, బాలికలకు యెంతటి యాదరముండెడియుండునో - యనునది యూహించుటకును సాధ్యముగాదు. అతని సౌందర్యమునకు, మాధుర్యమునకు, ఐశ్వర్యమునకు ఆకర్షితులై గ్రామమందలి బాలబాలికలందరును అతని దగ్గరనే యుండుచుండిరి. శ్రీకృష్ణుడును, తన మౌలికమగు ప్రతిభచేత, రాగతాళాదులయందు నిత్యనూతన ప్రక్రియలచేత వారికి మనోరంజనము కలుగజేయుచు వారికి శిక్షణ గరపుచుండును. ఇట్టి మనోరంజనముల లోనిదే రాసలీలగూడ యని భావించవలయును. శ్రీకృష్ణుడు సాధారణ మానవుడని భావించువారి దృష్టియందుగూడ యీ దోషభావముదయించరాదు. ఉదారతతో బుద్ధి గలవారై, భాగవతమందు వచ్చునట్టి, కామ-రతి మొదలగు శబ్దములకు ఉపనిషత్తుల యందు గీతయందు యే యర్థమున్నదో, అదే యర్థము చెప్పవలయును. నిజమునకు, గోపికల యొక్క నిష్కపటమగు ప్రేమ యొక్క నామాంతరమే కామము. శ్రీకృష్ణ భగవానుని యాత్మరమణమే - అతని దివ్యక్రీడయే-రతి. ఇందుచేతనే ప్రతిచోట, ప్రభువు, పరమేశ్వరుడు, లక్ష్మీపతి, భగవానుడు, యోగీశ్వరేశ్వరుడు, ఆత్మారాముడు, మన్మథ మన్మథుడు మొదలగు శబ్దములు—యెవరికిని యెట్టి భ్రమయు కలుగకుండుటకొరకే—యుపయోగించబడినవి.

శ్రీకృష్ణుని మోహనమురళీ గానము విని గోపికలు బృందావనమునకు బయలుదేరినపుడు వారి దగ్గర బంధువులందరును వారిని వారించియుండిరి. రాత్రియందు తమ యాడుపిల్లల నెవరు బయటకు పోనిచ్చెదరు? ఆయనను వారు వెళ్ళినారు. కాని యందుకు వారెటువంటి యప్రసన్నతను వెలిబుచ్చలేదు. శ్రీకృష్ణునిపైగాని, గోపికలపైగాని, వారెట్టి కళంకము నాపాదించలేదు. వారికి గోపికలపైనను శ్రీకృష్ణుని పైనను గూడ మహావిశ్వాసమున్నది. వారికి, వారి బాల్యము, వారి యాటలుగూడ సుపరిచితములు. గోపికలు తమవద్దనే యున్నట్లు గోపాలురు తలచుచుండిరి. దీనిని రెండు విధములుగా నర్థము చేసుకొనవచ్చును.

మొదటిది-గోపికలు శ్రీకృష్ణునివద్ద యుండుట తమవద్ద యుండుట వంటిదని, వారికి శ్రీకృష్ణునియందు పరమ విశ్వాసమున్నది.

రెండవ దృష్టి యేమనగా, గోపికలు యింటియందే యున్నట్లు యోగమాయ వారిని మోహింపజేసినది.

ఏ దృష్టితో జూచినను, రాసలీల దూషిత ప్రసంగము కానేగాదు. పైగా, అధికారులగు జీవులకిది మనోమాలిన్యమును సంపూర్ణముగ నష్టమొనర్చునట్టిదై యున్నది. రాసలీల చివర, యెవరు శ్రద్ధాభక్తులతో నీ రాసలీలా ప్రసంగమును విన్నను, వర్ణించినను, వారి హృదయ రోగమగు కామము శీఘ్రముగనే నశించు

ననియు, భగవానుని ప్రేమ ప్రాప్తించుననియు చెప్పబడియున్నది. ఎవడు భగవానుని మాయను వర్ణించునో, వాడు మాయను దాటగల్గునని, భాగవతమందనేక స్థానములందు వర్ణింపబడియున్నది. భగవానుని కామజయమును వర్ణించినవాడు, కామముపై జయమును సాధించగలడు, పరీక్షిన్మహారాజు తన ప్రశ్నలయందే శంకలను లేవనెత్తెనో, వానికి సమాధానము, ప్రశ్నల కనురూపముగనే, యిరువది తొమ్మిదవ యధ్యాయమందలి 13వ శ్లోకమునుండి 16 వరకును ముప్పదిమూడవ యధ్యాయమందలి 33వ శ్లోకమునుండి 37వ శ్లోకము వరకు శ్రీశుకదేవులు వచించియున్నారు.

ఆ యుత్తరముచే శంకలన్నియు తొలగిపోవును. కాని భగవానుని దివ్యలీలయొక్క రహస్యము భేదింపబడదు. బహుశః యీ రహస్యమును గుప్తముగ నుంచుటకొరకే, ముప్పది మూడవ యధ్యాయమునందలి రాసలీలా ప్రసంగము సమాప్తము చేయబడినది. యథార్థముగా యీ దివ్యలీలయొక్క గూఢరహస్యము ప్రాకృత జగత్తునందు వ్యాఖ్యానము చేయుటయే సాధ్యముగాదు. ఏలననగా, యిది యీ జగత్తునకు సంబంధించిన క్రీడయేగాదు. ఇది యీ దివ్యానంద రసమయ రాజ్యముయొక్క చమత్కారమయమగు లీల. దానిని చూచుటకు, దానిని వినుటకు, పరమహంసలగు మునీశ్వరులుగూడ మహోత్సాహపడుచుందురు. కొందరు యీ లీలాప్రసంగము భాగవతమందాక్షేపణీయమని దురాగ్రహము ప్రకటించుదురు. ఏలననగా, అతి ప్రాచీనములగు ప్రతులయందుగూడ యీ ప్రసంగము కనుపడుచున్నది. కొంచెము విమర్శనాత్మకముగ విచారించినచో, యిది సర్వథా సుసంగతమేయనియు, దోషరహితమనియు తప్పక గోచరించును, మనమీ విషయమందలి రహస్యమును కొంచెముగానైనను తెలుసుకొను సమర్థతను, విమలమగు బుద్ధిని, దయతో శ్రీకృష్ణుడు మనకను గ్రహించుగాక.

జీవుడు గోపికలయొక్క ఆ యహైతుక ప్రేమ – శ్రీకృష్ణునకే సుఖము చేకూర్చుటకై యొనర్చిన ప్రేమ, స్మరించుకొనుచు, దాని ద్వారా భగవానుని రసమయ దివ్యలీలాలోకమందు, భగవానుని యనంత ప్రేమానుభవము పొందవలయుననియే, భగవానుని యీ దివ్యలీలా వర్ణనముయొక్క యాశయము. ప్రయోజనము.

(హనుమాన్‌పోద్దార్ - హిందీవ్యాఖ్యానకర్త)

# ముప్పది నాల్గవ యధ్యాయము

## సుదర్శన - శంఖచూడుల మోక్షము

శ్రీశుకయోగి పరీక్షిత్తుతో నిట్లు చెప్పుచున్నాడు.

ఒకమారు, శివరాత్రి సందర్భమున, నందరాజు మొదలగు గోపాలురందరు మహోత్సాహముతో యెద్దుబండ్లపై పయనించుచు నంబికావనమేగిరి. అచట వారందరును సరస్వతీనదియందు స్నానమాడి, సర్వాంతర్యామియు, పశుపతియు నగు శంకర భగవానుని, భగవతియగు నంబికనుగూడ మహాభక్తి ప్రపత్తులతో, వివిధ పూజాద్రవ్యములతో, పూజ గావించిరి. అచట వారు, ఆదరపూర్వకముగా గోవులను, బంగారమును, వస్త్రములను, మధువును, మధురాన్నములను, దేవతా ప్రీతికరమగునట్లుగా, బ్రాహ్మణులకు దానము లొసంగిరి. నందసునందకాది మహా భాగులందరు నానాడుపవసించి, కేవలము జలప్రాశనము మాత్రము చేసినవారై రాత్రిసమయమందా సరస్వతీ తీరమునందే నిదురించిరి.

ఆ యంబికావనమునందొక గొప్ప కొండచిలువ నివసించుచుండినది. ఆనాడది మిక్కిలి యాకొనియుండె. దైవయోగమున నది యా సమయమందచటికి వచ్చి నందుని పట్టివైచినది. నందరాజు, భీతితో‘ “నాయనా, కృష్ణా, యీ యజగరము నన్ను మ్రింగుచున్నది. నీవు వెంటనే వచ్చి, ప్రపన్నుడనైన నన్ను దీనినుండి విడిపింపుము” యని యాక్రోశింపసాగినాడు. నందుని యఱపులకు నిదురించుచున్న గోపికులందరు లేచి, సర్పగ్రస్తుడై యున్న నందరాజును జూచి, విభ్రాంతులై, కొఱవులతో నా సర్పమును గొట్టసాగిరి, ఎంత గొట్టినను నందరాజునది విడువ లేదు. ఇంతలో భక్తవత్సలుడగు గోవిందుడచటికేగి, తన చరణముతో నా సర్పమును స్పృశించగా, స్పర్శ మాత్రము చేతనే పాపసమూహములన్నియు భస్మమై పోవగా, సర్ప శరీరము తొలగిపోయి, విద్యాధరార్చిత సర్వాంగ సుందర రూపము గలవాడుగా మారి పోయినాడు. అ దివ్య సుందర దేహమునుండి, దివ్యప్రకాశము వెలువడుచుండె. అతని మెడయందు బంగారుహారమున్నది. శ్రీకృష్ణునికతడు ప్రణమిల్లి చేతులు జోడించి నిలువగా భగవానుడ తనినిగాంచి. “నీవెవడవు? నీ ప్రతి యంగము నుండియు సౌందర్యముట్టి పడుచున్నది. చూచుటకు గొప్పవానివలె గనుపించుచుంటివి. పరమ జుగుప్సితమగు అజగరజన్మ నీకేల గలిగినది?” అననతడిట్లు చెప్పసాగె.

“స్వామీ! పూర్వము నేను సుదర్శనుడను పేరు గల విద్యాధరుడను! సౌందర్యైశ్వర్యములు రెండును గలవాడనై, విమానముపై నన్నిదిక్కుల యందు

తిరుగుచుంటిని. ఒకనాడు, విరూపులై యున్న యంగిరస గోత్రోద్భవులగు ఋషులగు గాంచి, నేను సౌందర్య గర్వముచే వారిని పరిహసించితిని. ఆ యపరాధముచే, వారు నాకీయజగరయోని యందు జన్మించునట్లు శాపమొసంగిరి. ఇది నాపాపఫలము దయా సాగరులగు మహర్షులట్లు శపించుట, నాయందను గ్రహముగనే పరిణమించినది. ఏలననగా, చరాచరగురుడగు భగవానుడు స్వయముగా తన చరణముచే నన్ను స్పృశించుటయు, దానివలన నాపాపములన్నియు భస్మీ భూతములగుటయు గూడ, ఆ శాపము యొక్క ప్రభావమేగదా! సమస్త పాపములను పోగొట్టునట్టి పరమేశా, జనన మరణ ప్రవాహ రూపమగు సంసారమునకు భయపడి నిన్ను శరణు జొచ్చు వారి, సర్వభయములను తొలగ జేయుదువు. నేనిపుడు నీ శ్రీ చరణ స్పర్శచే శాపవిముక్తుడనైతిని. మా లోకమునకు పోవుటకు నీ యనుమతిని వేడుచున్నాను మహాయోగేశ్వరేశ్వరా, పురుషోత్తమా, నేను నిన్ను శరణు పొందుచున్నాను. ఇంద్రాది సర్వలోకేశ్వరేశ్వరా, స్వయం ప్రకాశపరమాత్మా, నాకనుమతి నొసంగుము. అచ్యుతా, నీ దర్శనమాత్రము చేతనే నేను బ్రాహ్మణ శాపమునుండి విముక్తుడనైతిని. ఇదియేమంత యాశ్చర్యకరమగు విషయముగాదు. ఏ జీవుడు, నీనామోచ్చారణ జేయునో, వాడు తనను తానేగాక, శ్రోతలను గూడ నతిశీఘ్రముగ పవిత్రులగావించును. అట్టిది, నీవు స్వయముగనే నీ చరణ కమలములచే నన్ను స్పృశించితివి! నాకు ముక్తి లభించుట యందింకను సందేహముండగలదా?" ఈ ప్రకారము సుదర్శనుడు భగవానుని వినుతించి, ప్రదక్షిణ గావించి నమస్కరించి, యనుమతిగైకొని, నిజలోకమునకేగినాడు. నందునకు మహాసంకటము తొలగినది.

శ్రీకృష్ణుని యీ యద్భుత ప్రభావమును కనులారగాంచిన వ్రజవాసులకు మహావిస్మయము కలిగినది. వారా క్షేత్ర నియమములన్నియు పాటించి, యత్యంత ప్రేమాదరములతో, శ్రీకృష్ణుని లీలనుగానము చేయుచు, మరల వ్రజమునకు వెడలి పోయిరి.

ఒకనాటిరాత్రి, యద్భుతవిక్రముడగు గోవిందుడు, బలరామ సహితముగ, గోపికలతోగూడ, బృందావనమునందు విహరించుచుండె.నిర్మలమగు పీతాంబరమును గోవిందుడును, నీలాంబరమును బలరాముడును ధరించియుండిరి. ఇద్దరి మెడల యందునను సుందరములగు సుమహారములు వ్రేలాడుచుండినవి. శరీరములందు అంగరాగములు, సుగంధిత చందనాదులలంకరింపబడియున్నవి. సుందరవస్త్రాభరణాదులు దాల్చియుండిరి. ప్రేమానందభరితులై గోపికలు లలితస్వరమున వారి గుణములగానము చేయుచుండిరి. అప్పుడప్పుడే సాయంకాలమైనది. ఆకాశమందు

తారకలు మిలమిల మెరయుచున్నవి. వెన్నెల విస్తరించుచున్నది. మల్లికాగంధ మత్తములైన మధుపములు ఝుంకారములొనర్చుచున్నవి. జలాశయములందు వికసించియున్న కుముదముల సుగంధముతోగూడిన వాయువులు మందమందమున వీచుచున్నవి. సర్వభూతములకు మనఃశ్రవణమంగళమగు పథమున బలరామకృష్ణులిర్వురేకస్వరమున రాగాలాపనము చేసిరి. వారి రాగాలాపనము, ఆరోహణావరోహణక్రమముతో, మహాసుందరముగా సాగినది. జగత్తునందలి సమస్తప్రాణుల యొక్క మానసములను, శ్రవణేంద్రియములను, ఆ రాగము ఆనందభరితము చేయుచున్నది. వారియాగానము విని గోపికలు మోహితులైరి. మూర్ఛితలైరి. వారికి శరీరస్మృతిలేకుండబోయినది. వారివస్త్రము లస్తవ్యస్తములగుటగాని, కేశబంధములూడిపోవుటగాని, యెరుగనివారై, వాటిని సరిదిద్దుకొనలేని యవస్థలో నుండిరి.

రామకృష్ణులీవిధమున స్వచ్ఛంధముగ విహరించుచు గానము చేయుచుండగా, ఆ సమయమందచటికి ♦ శంఖచూడుడను యక్షుడొకడు వచ్చినాడు. అతగు కుబేరుని యనుచరుడు. రామకృష్ణు లిరువురు చూచుచుండగనే, వారియాశ్రయమునందియున్న గోపికల నెత్తుకొని యుత్తరదిశగానేగుచుండె. ఆ గోపికలు బిగ్గరగా నేడ్చుచు నటవసాగిరి. దొంగలు గోవులదోలుకొని పోవునట్లు గోపికల నాయక్షుడు దీసుకొనిపోవు చుండుటయు, వారేడ్చుచుండుటయు,బలరామకృష్ణులిర్వురుచూచినారు. వారిరువురతని వెంటబడిరి. "భయపడవలదు-భయపడవలదనుచు" గోపికల కభయప్రదానమొసంగుచు, సాలవృక్షముల బెకలించి యాయుధములుగా ధరించి, రామ

---

♦శంఖచూడుడు :

గోలోకమునందు గోవిందునకు, రాధ, విరజ భూదేవియను వారు ముచ్వురు భార్యలుగనుండిరి. అందు రాధ యాతని కత్యంత ప్రీతిపాత్రురాలుగ నుండినది. భగవానుడు సపత్నులతో విహరించుచుండెనని చెలికత్తెలవలన విన్న రాధ కుపితయై, దివ్యరథారూఢయై, వారున్న నికుంజమున కేగగా ద్వారమందు కాపలాయున్న శ్రీదాముడామె నడ్డగించె. ఈ కోలాహలమును విన్న గోవిందుడంతర్థానుడాయె, అచట వారితో విహరించుచున్న విరజ నదిగా మారి ప్రవహించినది.

రాధాదేవి శ్రీకృష్ణుని నిందించుచుండగా సహించజాలని శ్రీదాముడు ప్రతిఘటించగా, "నీవు రాక్షసుడవై జన్మింపుమ"ని రాధ యాతని శపించినది. అతడును రాధాదేవిని "నీవును భూలోకమందు జన్మించి నూరుసంవత్సరముల వరకు శ్రీకృష్ణ వియోగమునను భవించెదవు గాక" యని శపించినాడు. ఆ శ్రీదాముడే సుధనునికి కుమారుడగు శంఖచూడుడుగా జన్మించె. "నన్ను రాసమండలమున హేళనమొనర్చి, నాచే విహతుడవై శాపవిముక్తి నందగలవ"ని శ్రీగోవిందుడాతని నోదార్చినాడు. [గర్గసంహిత]

కృష్ణులాదుష్టుని క్షణకాలములోనే సమీపించిరి. కాలమృత్యువువలె తనను వెంబడిం చిన వారినిగాంచి భయభీతుడై, శంఖచూడుడు గోపికలనచటనేవదలి, ప్రాణముల గాపాడుకొనుటకై పరువెత్తినాడు. ఆ గోపికల రక్షణార్థము బలరాముడచటనాగి పోగా, శ్రీకృష్ణుడు శంఖచూడుని వెంబడించి, యనతిదూరమునందే యాతనిబట్టి కొని, యొక ముష్టిఘాతముచేనతని శిరమును, చూడామణి సహితముగ శరీరము నుండి వేరుజేసె. ఈ విధముగ శంఖచూడుని వధించి, యాతనిశిరమందు, భాస్వర ముగ ప్రకాశించుచున్న మణిని గైకొని, తిరిగివచ్చి, గోవిందుడు గోపికలందరి సమ్ముఖమందు, తన యగ్రజుడగు బలరామునకు దానిని బహూకరించినాడు.

# ముప్పదియైదవ యధ్యాయము

## గో పి కా యు గ ళ గీ త ము

గోవుల మేపుటకై గోవిందుడు ప్రతిదినమును వనమునకు బోవుచుండగా, నతని వెంట గోపికల చిత్తములుగూడ వెళ్ళుచుండెడివి. వారి మానసములు శ్రీకృష్ణునే చింతించుచుండగా, వారు వాక్కులచే భగవానుని లీలలను గానము చేయుచునుండెడివారు. ఈ ప్రకారమతి కష్టముమీద నిత్యము – పగటి భాగమును గడుపుచుండెడివారు.

గోపికలొకరితో నొకరిట్లు చెప్పుకొనుచుండెడువారు.

"చెలీ, తనను ప్రేమించువారలకు ప్రేమను దానము చేయువాడును, ద్వేషించుచుండువారలకుగూడ మోక్షప్రదానము చేయునట్టి, సట్శ్రేష్ఠుడగు శ్యామ సుందరుడు, తన యెడమ కపోలమును యెడమ భుజమువైపునకు ప్రేలాడవైచి [వంచి], కనుబొమలను నాట్యమాడించుచు, వేణువు నధరమున కర్పించి, తన సుకుమారములగు వ్రేళ్ళ నా వేణురంధ్రములపై నర్తింపజేయుచు, మధురశబ్దమును నినదింపజేయు సమయమందు, ఆకాశమునందు సిద్ధపత్నులు తమ పతులతోగూడ విమానములపై నచటికి వచ్చుచుందురు. వచ్చి, యా మధురనాదము నాకర్ణించి చకితలై యత్యంత విస్మితలగుచుందురు. తమ భర్తల సమీపమందుండియు తమ కట్టి చిత్త విభ్రాంతి కలిగినందులకు వారు మొదట లజ్జితలైనను, మరుక్షణ మందే వారు మన్మథబాణవిద్ధలై, వివశలై చైతన్యరహితలై పోవుచుండిరి. వారి నీవీబంధములూడిపోయి వస్త్రములు జారిపోవుచుండుటయు తెలియనంతగా చైతన్య మును గోల్పోవుచుండిరి.

"గోపికలారా, మీరీ యాశ్చర్య విషయము వినుడు. ఈ నందనందను

డెంత సుందరుడు! అతడు నవ్వుచున్నపుడు ఆ హాస్యరేఖలు హారరూపము దాల్చి మంచిముత్యములవలె కాంతులీనుచుండును. అతని వక్షఃస్థలమందు వ్రేలాడుచున్న హారమునందు హాస్యకిరణములు ప్రతిఫలించుచుండును. అతని వక్షమందున్న శ్రీవత్సమను పుట్టుమచ్చయొక్క బంగారురేఖ, నీలమేఘమందు స్థిరముగా నెలకొని యున్న విద్యుత్తువలె దోచుచుండును. అతడెప్పుడు, దుఃఖితులగు వారికి సుఖము గల్గించుటకును, విరహిణులగు వారి మృతప్రాయములగు శరీరములందు ప్రాణ సంచారము కల్పించుటకును వేణువునూదునో, వ్రజమునందున్న జీవకోటియంతయు యెద్దులు, ఆవులు, హరిణములు, మొదలగునవన్నియు, నతనివద్దకు పరుగెత్తి వచ్చు చుండును. కేవలము వచ్చుటయేగాదు. దంతములతో నమలుచున్న గ్రాసము వాని నోటియందు అటులనే యుండిపోవును. (అనగా నమలుట యాగిపోవును) ఆ గ్రాసము నవి మ్రింగవు. వెడల గ్రక్కవు. నిద్రించుచున్న వానివలెను, గోడలపై బిగింప బడిన చిత్తరువులరీతిని, చెవులు రిక్కించి, చేష్టలుడిగినట్లుండి పోవును. వాని చిత్త ముల నా వేణునాదము హరించుటచేత, వానికిట్టి దశ సంభవించుట స్వాభావికమే యగుచున్నది.

"సఖియా, నందసూనుడు, శిఖరముపై శిఖిపింఛ కిరీటము దాల్చి, వంకరలు దిరిగిన ముంగురులయందు పుష్పగుచ్ఛముల దురిమి, రంగు రంగుల ధాతవులచే తన యంగాంగముల చిత్రించుకొని, నూతన పల్లవములతో నలంకరించుకొనియుండు సమయమందు, అతడొక మల్లయోధునివలె గోచరించుచుండును. బలరామ సహితుడై యాతడు గోపార్భకులతో గూడ, వేణువుపై, గోవులను పేరుపేరున బిలుచుచుండు సమయమందు—నదులగమనము గూడ నాగిపోవుచుండును. వాయువు ద్వారా భగ వానుని పాదధూళి తమవద్దకు వచ్చి తమకు సంతృప్తి గలిగించుగాక యని యవి వాంఛించుచుండును. కాని సఖియలారా, ఆ నదులు గూడ మనవంటి మందభాగ్యలే. నందనందనుని యాలింగన భాగ్యము పొందునపుడు మన భుజములు కంపించు చుండును. జడతారూప సంచార భావముదయించుటచే, మనము మన చేతులను కదలించుట గూడ లేక యుండెదము. అటులనే నదులును, రెండు మూడు మారులు తరంగములను భుజంగములను కదిలించినప్పటికిని, మరల వివశములై స్థిరముగ నుండి పోవును. ప్రేమావేశముచే స్తంభించి పోవును.

దేవతాగణములు అనంతా చింత్యైశ్వర్యములకు స్వామియగు శ్రీమన్నారాయ ణుని శక్తులను గానముచేయు విధముగనే, అనంత సుందర నటకావతంసుడగు శ్రీకృష్ణుని లీలలను, గోపబాలురు గానము చేయుచునుందురు. అనంతైశ్వర్య సంప న్నుడగు శ్రీకృష్ణుడు బృందావనమందు విహరించుచుండునపుడు, వేణువును ప్రయోగిం చుచు, గోవర్ధన పర్వత సానువులందు మేత మేయుచుండు గోవులను పేర్లతో

విలుచుచుండు సమయమందు, వనమునందలి వృక్షములు, లతలును ఫల పుష్ప సంభరితములై యా భారముచే క్రిందకు వంగి భూమిని తాకుచు, భగవానుని పూజించుచున్నట్లును ఆ వృక్షములు లతలు, తమయందు విష్ణు భగవానుని యభి వ్యక్తిని సూచించుచున్నవా యనునట్లు ప్రేమతోనుప్పొంగి, రోమరోమములు వికసించి పోగా, మధురధారలను స్రవించుచుండును.

ఈ సంసారమందుగాని, దానికి వెలుపలగాని, చూచుటకు యోగ్యమగు వస్తువులెన్నియున్నవో, వానియన్నింటికంటె సుందరము మధురమును, అన్నింటికి శిరోమణి వంటివాడు, మన మనోమోహనుడగు మురళీమోహనుడు. అతని నీలలలాట ముపై కుంకుమ తిలకమెంత శోభాయమానముగనున్నది! అతని కంఠమునందు మోకాళ్ళవరకు వ్రేలాడుచుండు వనమాల, అందు గ్రుచ్చబడియున్న తులసీదళముల యొక్క దివ్య సుగంధము, ఆ గంధ మాధుర్యముచే మత్తెక్కిన మధుపములు మధుర ఝుంకారము లొనర్చుచున్నవి. మన నటవరుడగు శ్యామసుందరుడు ఆ ఝుంకారముల నాదరించుచు, వాని స్వరమునందు స్వరమును మేళవించుచు మురళీ నినాదము చేయుచుండును. చెలీ, ఆ సమయమందాముని జనసమ్మోహనమగు సంగీ తము నాలకించి, సరోవరముల యందలి, సారస, హంసాది పక్షుల చిత్తములు గూడ స్వాధీనము దప్పిపోవును. వివశములై యవి శ్యామసుందరుని చేరి కనులు మూసుకొని మౌనముగ, యేకాగ్రచిత్తముతో, పరమహంసలవలె, యాతని నారాధించు చున్నవా యనునట్లుండును. ఇది యెంత యాశ్చర్యకరమగు విషయము!

వ్రజాంగనలారా, మన శ్యామసుందరుడు పుష్ప కుండలముల దాల్చి, బల రామ సహితముగ గోవర్ధన శిఖరముల నధిరోహించి, వేణురవముతో జగత్తునానంద పరచుచుండునపుడు, ఆ వేణువేమి శబ్దించునోగాని, యా వేణు రవముద్వారా నతడు సర్వ ప్రపంచమునే యాలింగనము చేసుకొనుచుండును! ఆ సమయమందు నీల మేఘము, తాను పెద్దగా గర్జించినచో వేణునాద మాధుర్యము చెడిపోయి, తద్ద్వారా, మహాత్ముడగు శ్రీకృష్ణుని కపరాధము చేసినవాడనగుదునేమో యను భయముతో, వంశీరవమున కనుగుణముగ మందముగ గర్జించుచుండును. అంతేగాదు, మన ఘన శ్యామునిపై యెండ పడుచుండునప్పుడు, అకసమాతనిపై గొడుగు వలె నేర్పడి, యెండ తగులకుండ చేయును. ప్రసన్నతతో నతనిపై తన జీవనమునే సమర్పణ చేయుచు—సన్నని చినుకుల రూపమున, దివ్య కుసుమములు జల్లుచున్నటుల—నత నిపై కురియుచుండును. అప్పుడప్పుడు మేఘముల చాటున జేరి దేవతలు గూడ పుష్ప వృష్టి గురిపించుచుందురు.

సతీ శిరోమణీ, యశోదారాణీ, నీ సుకుమార కుమారుడు, గోప బాలురతో నాటలాడుట యందు మహా నిపుణుడమ్మా, నీ ముద్దుల పట్టి యందరికిని ముద్దు గూర్చువాడే యైనను, మహా చతురుడమ్మా! అతడు వేణువు నూదుట లెవరి

యొద్దను నేర్చుకొనలేదు గదా! తను స్వంతముగా నెన్నెన్ని రాగములు వెలువరించి నాడు! తన బింబాధరముపై వేణువును ప్రయోగించుచు, ఋషభ, నిషాదాది యనేక స్వర జాతుల నాలపించుచు నతడు గానము చేయుచుండు సమయమందు, శివ బ్రహ్మేంద్రాది గొప్ప గొప్ప దేవతలు గూడ, వానిని గుర్తింపలేక పోవుచుందురు. ఎంత నిగ్రహించుకొన జూచినను వారి చిత్తములు స్వాధీనముగాక, పరవశములై వంశీధ్వని యందు లీనమగు నంతగా, వారు సంమోహితులగుచుందురు. వారి శిర ములు వాలిపోవుచుండును. స్మృతి భ్రంశ మేర్పడి వారు తన్మయులై పోవుచుందురు.

అతని చరణ కమలముల యందు ధ్వజ, వజ్ర, కమల, అంకుశాది విచిత్ర సుందర రేఖలున్నవి. వ్రజభూమి గోవుల గిట్టలచే త్రొక్కబడి బాధపడుచుండగా, భగవానుడు తన సుకుమార చరణములచే నా బాధను పోగొట్టుచు, గజరాజ సమాన మగు మందగతిచే నడచుచు, వేణునాదము గూడ చేయుచుండును. అతని యా వంశీ ధ్వని, యతని మందగమనము, విలాస భరితమగు నతని వీక్షణము, మన హృదయ మందతనిపై గల ప్రేమను, సంగమ కాంక్షను, వృద్ధిపరచుచున్నవి. ఆ సమయ మందు కదలలేని వృక్షములవలె సంమోహితులమై నిశ్చేష్టలమై పోవుచుందుము. మన కొప్పులు వీడిపోవుటను గాని, వస్త్రములు తొలగి పోవుటగాని యెరుగకుందుము.

అతని గళమునందు మణిమాల యెంతయో అందముగా నుండును. తులసీ గంధ మతనికి మిక్కిలి ప్రియము. అందుచేతనే యతడెప్పుడును దానిని విడువక ధరించుచుండును. శ్యామసుందరుడా మణిమాలతో గోవులను లెక్కించుచు లెక్కిం చుచూ, చెలికాని భుజముపై చేయివైచి, భావయుక్తముగ వేణువువాయించుచు గానము చేయునపుడు, ఆ మధుర ధ్వనికి మోహితములై కృష్ణసార మృగముల పత్నులగు హరిణములు గూడ తమ చిత్తముల నాతని చరణములపై సమర్పించుకొనుచుండును. గోపికలమగు మనమేప్రకారము, గృహములను, గృహ సంబంధములగు నాశలను అభిలాషలను గూడ వదలి, గుణసాగరుడగు నందనందనుని చుట్టుముట్టి యుందుమో యటులే యా హరిణములు గూడ నతని వద్దకు పరుగెత్తి యతనిపై చూపులుంచి తిరిగి వెళ్ళుట యను మాట గూడ మరచి పోవుచుండును.

నందరాణీ, యశోదా, నిజముగా నీవు మహాపుణ్యవతివి. అందుచేతనే నీ కిట్టి కుమారుడు కలిగినాడు. నీ ముద్దుల బిడ్డడు గొప్ప ప్రేమ గలవాడు. అతని చిత్త మత్యంత కోమలము. తన ప్రియ స్నేహితుల కతడు, తన హాస పరిహాస ములతో సుఖము కలిగించు చుండును. కుందకుట్మలహారమును ధరించి, విచిత్ర వేష ధారియై, గొల్లపిల్లలతో గూడి యమునా తీరమందాటలాడు సమయ మందు మందమలయజ సుగంధయుక్తమగు శీతల స్పర్శతో వాయు వతనిని సేవించు చుండును. గంధర్వాది యుపదేవతలు వంది జనములవలె, వాద్య గీతములతో

కాన్కలొసంగి సంతుష్టుని గావించుచుందురు. అన్ని వైపుల నుండి యతవిని చుందురు.

శ్యామ సుందరుడు వ్రజ మండలి గోపుల నెప్పుడుగా ప్రేమించుచుండును. తనే యతడు గోవర్ధన పర్వతమును ధరించినాడు. ఇపుడాతడు గోవులను చుకొని వచ్చువేళయైనది. సాయంకాలము కావచ్చినది చూడుడు. ఇంత య్యమైనదేమే చెలీ? మార్గమందు వయో వృద్ధులగు బ్రహ్మాదులను, జ్ఞాన ు శంకరాదులను శ్యామసుందరుని చరణారవిందములకు వందనము చున్నటులున్నది. ఇపుడు గోవుల వెనుక వేణువును వాయించుచూ నతడు నే యుండును. గోపబాలు రాతని గుణ గణముల గానము చేయుచుందురు. చూడుము. ఆ వచ్చుచున్నదేమి? గోధూలి ధూసరితమై యున్నది వనమాల. యు వనభూమి యందు తిరిగి తిరిగి, యలసి పోయినాడు కన్నయ్య, ప్పటికిని తన శోభచే నతడు మన కనుల కెంత యానందము చేకూర్చు. ఎంత సుఖము కల్గించుచున్నాడు! యశోదా గర్భము నుండి యుద యందలి నాహ్లాదపరచుచున్న యీ శ్రీకృష్ణ చంద్రుడు, తనను ప్రేమించు మనయొక్క మేలు కొరకు, మన యాశలను, అభిలాషలను సఫలము కొరకే, మనపాలి కేతెంచున్నాడు."

సఖీ, చూడుము. ఎంత సుందరముగ నున్నాడో! మదభరితములగు ఆ కొంచెము విహ్వలితములై యున్నవి. గళమందు వనమాల వ్రేలాడు కనకుండలకాంతిచే గండభాగములు అలంకృతములై యున్నవి. అందుచే కొంచెము బదరపాండురవర్ణము గలిగినట్లున్నది. ముఖమునందు ప్రసన్నత గుచున్నది చూడు.ఇపుడాతడు తన స్నేహితులకు ఆదర పూర్వకముగ చెప్పుచున్నాడు. చూడు, చూడు, వ్రజవిభూషణుడగు శ్రీకృష్ణుడు, గజ నములో సమానమగు మందగమనముతో, యీ సంధ్యా సమయమందు, నకు వచ్చుచున్నాడు. ఇపుడు వ్రజమందున్న గోవులకు, మనకును, పగ కలిగిన విరహతాపమును శమింపజేయుటకై యుదయించు చంద్రునివలె, యతమ శ్యామసుందరుడు, మన సమీపమునకే వచ్చుచున్నాడు.

మహారాజా, మహాసౌభాగ్యవతులగు గోపికల మానసములు శ్రీకృష్ణునియందే యున్నవి. శ్రీకృష్ణమయములై పోయినారువారు. పగలంతయు గోవుల యడవికేగిన గోవిందునిగూర్చియే చింతించుచు, తమ చెలులతో నతని ర్చియే ముచ్చటించుకొనుచూ, వారు క్రీడించుచుందురు. వారికి దినములీవిధ చిపోవుచుండును.

# ముప్పదియారవ యధ్యాయము

## అరిష్టాసుర మోక్షము — కంసుడక్రూరుని వ్రజమునకు బంపుట

శ్రీకృష్ణుడు వ్రజమునందు ప్రవేశించిన యనంతరము, ఆనందోత్సవములు జరుగుచున్న సమయమందు, వృషభరూపముదాల్చిన * "యరిష్టుడ"ను పేరుగల రక్కసుడొకడేతెంచినాడు. వాని శరీరము, మూపురము పర్వతాకారముగనున్నవి. వాడు గిట్టలతో నేలను మట్టుచుండగా, భూమికంపించుచుండె. భయంకరముగ ఱంకెలువైచుచువాడు, కాళ్ళతో దుమ్మురేపుచు తోకపైకెత్తి, కొమ్ములతో ప్రహరీ గోడలను, చేలగట్లను పడగొట్టుచు పోవుచు మధ్యమధ్య శకృన్మూత్రములవిడుచుచు నానాబీభత్సముచేయుచుండె. వానిగర్జనలచే, స్త్రీలకు, గోవులకుగూడ గర్భస్రావము లగుచుండె. వాని మూపురమును పర్వతముగా భావించి, మేఘములు దానిపైసాగి పోవుచుండినవి. తీక్షణశృంగములుగల యావృషభమును గాంచి, గోపగోపీజనము భయభీతులైపోయినారు. వ్రజవాసులందరును "శ్రీకృష్ణా, శ్రీకృష్ణా, మమ్మీవృషభము బారినుండి కాపాడు"మని యాక్రోశించుచు, శ్రీకృష్ణుని శరణుజొచ్చిరి. గోపకుల మంతయు భయముచే వ్యాకులమై యుండుటను గాంచిన గోపాలదేవుడు "భయపడ వలదని", వారికి ధైర్యముచెప్పి, వృషభాసురుని కయ్యమునకు బిలుచుచూ, "ఓరీ, దుష్టుడా, నీవీగోవులను గోపాలురనెందుకురా భయపెట్టెదవు? దానిచే నీకొరుగున దేమున్నది? నీవంటి దురాత్ముల బలగర్వమును చూర్ణముచేయు వాడనునేనున్నాను" అనుచు కరతలముతో భుజాస్ఫాలనమొనర్చుచు, నతనినింకను కోపింపజేయుతలం పుతో, తన చెలికాని భుజముపై చేయివైచి. నిర్భీతితో నిలుచుండె. భగవానుని యీ సవాలునకు, అరిష్టుని కోపము హద్దుమీరగా, నతడు నేలను త్రవ్వుచు కృష్ణునిపై నొక్కయుదుటున లంఘించె. ఆసమయమందు వాడుపైకెత్తిన తోకతగిలి మేఘ ములు చెల్లాచెదరైనవి. కొమ్ములు ముందుకువంచి, కన్నులనిప్పులు రాలుచుండగా శ్రీకృష్ణుని తీవ్రముగజూచుచు, యింద్రుని వజ్రాయుధమువలె మహావేగముగ నత నిపై దూకినాడు. శ్రీకృష్ణుడు తన రెండుచేతులతో నతని రెండు కొమ్ములు గట్టిగా

---

* అరిష్టాసురుడు

ఇతడు బృహస్పతి శిష్యుడగు వరతంతువనువాడు. గురువునెదుట పాదముల జాపి కూర్చుండి గురువున కవహేళనము చేసిన కారణముచేత, "గురుహేళన మొన ర్చితివిగాన వృషభాసురుడవై జన్మించుమ"ని గురువు శాపమొసంగె. అతడే వృషభ రూపమున అరిష్టుడుగా జన్మించె. గోవిందుని బొడిచి యతని చేతిలో హతుడై శాప విముక్తినంది దేవలోకమును చేరినాడు. (గర్గ సంహిత)

బట్టి, ఒక గజము మఱియొక గజమును నెట్టివైచునటుల, పదునెనిమిది యంగలా వలకునెట్టివైచినాడు. భగవానుడీవిధముగ నెట్టివేయగా, వారు వెంటనే తీవ్రకోప ముతో వేడినిట్టూర్పులు విడుచుచు, మరల భగవానునిపై దుమికె. వాని శరీర మంతయు స్వేదముచే నిండిపోయినది. తనపై ప్రహారము చేయబోవు చుండుట గాంచి, భగవానుడు, వాని కొమ్ములు పట్టుకొని, పాదముతో నేలపై బడగొట్టి, త్రొక్కిపట్టి తడిగుడ్డను పిండు విధమున మెలిద్రిప్పి, యొక కొమ్మునూడబెఱికి దానితోడనే వానిని పొడిచివైచినాడు. నోటినుండి రక్తధారలు స్రవించినవి. శకృ న్మూత్రములు స్రవించినవి. గ్రుడ్లువెళ్ళుకొచ్చినవి. గిలగిల తన్నుకొనుచు మహా బాధతో ప్రాణములు వదలినాడు వాడు. దేవతలు పుష్పవృష్టి గురియించుచు స్తుతిం చిరి. ఆ విధముగ భగవానుడు వృషభరూపమున నేతెంచిన యరిష్టాసురుని మర్దిం చగా, గోపాలురందరతని నెంతయో ప్రశంసించిరి. బలరామ సహితముగ గోష్ఠ మందు ప్రవేశించుచున్న గోవిందుని గాంచిన గోపికల నేత్రములు, మానసములు, ఆనందముచే నిండిపోయినవి.

భగవానుని లీల మహాద్భుతమైనది. గోకులమందు శ్రీకృష్ణడరిష్టాసురుని, సంహరించిన సమయమందే నారద భగవానుడు, కంసుని సమీపించి, "కంసా, నీ చేతి నుండి జారి యాకసమునకు కెగిరిన కన్య, యశోద యొక్క కూతురు. వ్రజ మందు బెరుగుచున్న శ్రీకృష్ణుడు దేవకీ తనయుడు. అక్కడ నున్న బలరాముడు రోహిణీ కుమారుడు. నీ వలన భయముచేత వసుదేవుడు తన మిత్రుడగు నందుని వద్ద వారిద్దరి నుంచినాడు. వారే నీ యనుచరులగు దైత్యులనందరిని వధించినారు" అని యదార్థము నెఱింగించినాడు. ఆ మాటలు వినుచునే, కంసుని సర్వేంద్రియములు కోపముచే కంపించసాగినవి. వెంటనే వసుదేవుని వధించుటకై కరవాలమును దూసి వెడలబోవ, నారదుడాతని వారించె. వసుదేవుని తనయులే తన మరణమునకు కార కులని తెలియగనే, కంసుడు, దేవకీ వసుదేవులను శృంఖలాబద్ధుల గావించి, మరల కారాగారమందుంచినాడు.

దేవర్షియగు నారదుడు, కంసునితో సంభాషించి వెడలి పోయిన యనంతరము కంసుడు కేశియను రాక్షసుని బిలిచి, "నీవు వ్రజమునకు బోయి, రామకృష్ణులవధించి రమ్మ"ని యాతని బంపి, పిమ్మట, ముష్టిక, చాణూర, శల, తోశలాది మల్లయోధు లను బిలిపించి, వారితో నిట్లు పలికె. "మల్లయోధులారా, నా మాటలను సావధాన ముగ నాలించుడు. వసుదేవుని కుమారులగు బలరామకృష్ణులను వారిద్దరు నందగో కులమందు వసించుచున్నారు. వారి చేతిలో నాకు మరణముగలదని చెప్పబడుచున్నది కావున వారిచటికి వచ్చినపుడు, వారితో కుస్తీ పట్టు నెపముతో మీరు వారిని వధించ వలయును. అనేకములగు మంచె లుండునట్లుగా మల్లరంగమును సిద్ధముచేయుడు.

వర్తులాకారముగ సన్నివైపులను, నగరవాసులు, యితర దేశ ప్రజలు కూర్చుండి మల్లయుద్ధము తిలకించునట్లు ఆసనము లేర్పాటు చేయుడు. మల్లులారా, మీరు చాలా నైపుణ్యము గలవారు. మావటివాడా, మల్లరంగ ద్వారమునందు నీవు కువలయాపీఠ మను గజరాజమును సిద్ధముగా నుంచుము. నా శత్రువులచటికి రాగానే, ఆ యేనుగు ద్వారా వారిని చంపించుము" "ఈ చతుర్దశినాడు విధి పూర్వకముగ ధనుర్యజ్ఞమును ప్రారంభించుడు. అది సఫలముగా నెరవేరుటకుగాను వరదుడగు భూతరాజునకు (భైరవునకు) మేధ్యములగు పవిత్ర పశువులననేకముల బలి యొసంగుడు" అని యీ విధముగ సందరకు నాజ్ఞ లొసంగినాడు.

కంసుడు మరల వారితో నిటుల పల్కె "నేను చెప్పునది విని, మీ మన సునందుంచుకొనుడు. నా తల్లి యొకప్పుడు, మలయమారుతము వీచుచుండ, గృహోద్యాన వనమునందు తిరుగుచుండె. అపుడామె ఋతుస్నాతయై భర్తనే తలచుకొనుచు, కామసంతప్తయైయుండె.

అపుడు, ద్రమిడుడను గంధర్వుడొకడు, అంతరిక్షమున దిరుగుచు, యేకాంతముగ విహరించుచున్న మా తల్లిని, మా తండ్రియగు ఉగ్రసేనుని రూపముతో సమీపించి యామెతో రమించె. అతడు తన భర్త కాదని యామె గ్రహించి, చాల ఖేదమంది, నీ వెవడవు? యేల యిట్టి నిందితమగు కర్మ నాచరించితివ"ని ప్రశ్నించినది. అపుడామె నోదార్చుచు ద్రమిడుడిట్లనియె. "మేము గంధర్వులను దేవజాతి వారము. మీ వంటి మానవాంగనలకు లభించు వారము కాము దేవతలకు మానవులకు మహదంతరమున్నది." అని పలుకుచున్న యాతనిని మా తల్లి మరల నిందించుచు "మదాంధమగు గజము కమలమును నశింపజేసినట్లు, మదాంధుడవై నీవు నన్ను మలినము గావించితివి" అని పలికినది.

అతడు మరల ఆమె ననునయించుచూ" మానినీ,

శ్లో. అనులోమస్తుకంజాక్షి మనుష్యాసుదివౌకసాం
సరాణాం దేవకాంతాసు ప్రతిలోమోహి సంగమః

మానవ స్త్రీలయందుదే వతలు సంగమించుట యనులోమము. దేవతా స్త్రీల యందు మానవులు సంగమించుట విలోమము. కావున యనులోమ సంగమము దూష్యము గాదు. నేనపరాధినిగానని గ్రహించుము. నా వీర్యము వలన నీకు మహా ధీమంతుడు, శ్రీమంతుడు బలవంతుడగు పుత్రుడుదయించగలడు. నా వాక్యము వృధాకాదు" అని పలుక, నా తల్లి శోక సంతప్తయగుచు "ఆ నీకుమారుడు దుర్మార్గుడు, క్రూరుడగుగాక. దేవతలకు ద్విజులకు సంతోషము గల్గించువాడు గాకుండును అని పలుకుచుండగా, శాపమును శంకించిన ద్రమిడుడు, వాడు మీకు శత్రువగునని పలుకుచు యాతడంతర్థానుడాయె,

వాడు వెళ్ళిన పిదప నా తల్లి గృహోద్యానము నుండి యంతఃపురము జేరి, కొంతకాలమునకు నన్ను ప్రసవించినది. ఈ వృత్తాంతమెవరికిని తెలియదు. ఇది నారదుడు నాకు దెలిపినాడు.

నాటి నుండియు నేను బంధువుల నందరిని ద్వేషించుచున్నాను. వారుగూడ నన్ను ద్వేషించుచునే యున్నారు. ఉగ్రసేనుని, దేవకిని, వసుదేవుని, వారి ననుసరించు యితరులను వధించినను గంధర్వ జన్ముడనగు నాకే పాపము నంటదు. అందుకనియే నేను వారిని వధించెదనని పరుషముగ మాటలాడుచుంటిని. కుంజరముచే బాలురు హతమైన పిమ్మట వీరుగూడ వారి గతినే పొందగలరు. వసుదేవోగ్రసేనులు, నందదేవకులు, గోపాలురు, యాదవులు అందరును, యీ బాలకుల వధను గాంచెదరుగాక. జానపదులను గూడ ఆహ్వానించుడు. అందరును సందర్శింపగలరు" అని కంసుడు పలెక్కె.

కంసుడు కేవలము స్వార్థ సాధన సిద్ధాంతము చక్కగా నెఱిగినవాడు. అందుచే నతడు మంత్రులకు, మల్లయోధులకు మావటివానికి (మహామాత్రునకు)యీ విధముగ నాజ్ఞల నొసంగి, యదువంశ శ్రేష్ఠుడగు అక్రూరుని తన వద్దకు రావించి యతని హస్తమును తన కరముచే గ్రహించి, యాదర పూర్వకముగ నతనితో నిట్లు పలెక్కె.

"అక్రూరా, నీవు ఉదారుడవు. దానపతివి. సర్వవిధములనాకాదరణీయుడవు. నేడు నీవు నాకొకమిత్రోచితమైన కార్యము నెరవేర్పవలయును భోజవంశీయులలోను వృష్ణి వంశీయులగు యాదవులందునను, నాకు మేలు చేకూర్చువాడు నీ కంటె మఱి యొకడు లేడు. నేను నీకు చెప్పబోవు పని చాల గొప్పది. కావుననే నేను నిన్నాశ్రయించుచున్నాను. ఇంద్రుడు సమర్థుడయ్యును విష్ణువు నాశ్రయించి తన ప్రయోజనములను సిద్ధింపజేసుకొనునట్లుగనే నేను నిన్నాశ్రయించుచున్నాను. నీవు సందవ్రజమునకేగుము. అచట వసుదేవ తనయులిర్వురున్నారు. వారిని నీయీరథమందే యెక్కించుకొని యిచటికిగొనిరమ్ము. అంతే, ఈ పని, యలసత్వమేమియు లేకుండ వెంటనే జరుగవలయును. వైకుంఠుని యాశ్రితులు వారిద్దరిని, నాచావుకు కారణముగా నిర్ణయించినట్లు తెలియవచ్చుచున్నది. కావున వారిద్దరిని, నీవు తీసుకొని రమ్ము. వారితోపాటు నందాది గోపకులందరిని గూడ కానుకలగొని రమ్మని చెప్పి, తీసుకొనిరమ్ము. ఇచటికి వచ్చిన పిమ్మట రామకృష్ణులను, కాలరూపియగుకువలయాపీడముచే చంపించెదను, ఒకవేళ, వారాయేనుగుచే చావకున్నచో వజ్రశరీరములు గల చాణూరముష్టికాది మల్లయోధులచే వారిని మ్రందింప జేసెదను. వారు మరణించిన పిదప, వసుదేవాది వృష్ణి, భోజ, దాశార్హ వంశీయులు, వారి బంధువులందరును శోకాకులురయ్యెదరు. వారలందరిని నాచేతులతో నేను హతమార్చెదను. నా తండ్రి

యగు ఉగ్రసేనుడు ముసలివాడైనను, అతనికి రాజ్యలోభము నశించలేదు. పైపను లన్నియు పూర్తిగావించిన పిదప, నేను నా తండ్రిని, అతని సోదరుడగు దేవకుని, యింకను నన్ను ద్వేషించువారందరిని యంతమొందించెదను. నా ప్రియమిత్రుడవగు అక్రూరా. అప్పుడు నేనుండెదను. నీవుందువు, నిష్కంటకమగు యీ పృథ్వీ రాజ్యముండును. జరాసంధుడు మా మామగారు, నా ప్రియసఖుడగు ద్వివిదుడను వానర రాజు, శంఖాసురుడు, నరకాసురుడు, బాణాసురుడు, వీరందరు నాయందు సుహృద్భావము గలవారు. వారి సహాయముతో నేను దేవ పక్షపాతులను నరపతులందరిని సంహరించి, నిష్కంటకమగు పృథ్వీరాజ్యమును అనుభవించెదను.

ఈ నారహస్యములలన్నింటిని నీకు తెలిపితిని. ఇపుడు నీవతిత్వరితముగ వ్రజమునకేగి, బలరామకృష్ణులనిచటికి దీసుకురమ్ము. వారింకను పిల్లలుగనున్నారు. వారిని చంపుట యేమంత కష్టముగాదు. వారితో నీవు కేవలము, ధనుర్యజ్ఞమును చూచుటకును, యదువంశ రాజధానియగు మధురానగర శోభను తిలకించుటకును రమ్మని మాత్రమే చెప్పుము."

కంసుని మాటలు విని యక్రూరుడిట్లనియె 'మహారాజా, నీవు నీ మృత్యువును నీయరిష్టమును తొలగించుకొనదలచు చుంటివిగాన, నీవిటులాలోచించుట యుచితమే యగును. ఫలము సిద్ధించినను, సిద్ధించకున్నను, రెంటియందును సమభావము గల వాడై మానవుడు తన ప్రయత్నము చేయుచునే యుండవలయును. ఫలము తన ప్రయత్నముచేగాక దైవప్రేరణచే లభించును. మనుష్యుడు రక రకములగు మనోరథములను సేతువులు నిర్మించుకొనుచుండును. కాని, దైవము ప్రారబ్ధము, వీనిని మొదటిలోనే నష్టపరచుచుండునవి గుర్తించడు. ఈ కారణముచేతనే యొక్కొక్కప్పుడు ప్రారబ్ధమనుకూలించగా, ప్రయత్నము సఫలమగు చుండును. అప్పుడతడు సంతసించును. ప్రారబ్ధము ప్రతికూలమైనప్పుడు ప్రయత్నము విఫలమగుటచే శోక గ్రస్తుడగుచుండును. అయినను నీయాజ్ఞను నేను తప్పక పాలించెదను" అని పలికె.

కంసుడు మంత్రులందరికి సెలవోసంగి తన యంతఃపురము ప్రవేశించె.

# ముప్పది యేడవ యధ్యాయము

## కేశి, వ్యోమాసురుల మోక్షము—నారదస్తుతి

కంసుడు గోకులము మీదికిపంపిన * కేశియను పేరుగల రక్కసుడు, పెద్ద గుఱ్ఱపు రూపముదాల్చి మనోవేగముతో పరుగిడుచు, గోకులమును చేరినాడు. వాడు తన డెక్కలతో నేలను త్రవ్వుచు వచ్చుచుండె. అతని మెడయందలి జూలు చిందర వందరగా నెగురుచు, ఆకాశమందలి విమానములను, మేఘములను గూడ చిందర వందర చేయుచుండె. వానిసకిలింపులకు సర్వులు భీతులగుచుండిరి.కన్నులు విశాలములై, నోరు విశాలమగు వృక్షకోటరమువలె నున్నది. మెడ లావుగానున్నది. శరీరము మహానీలమేఘము వలెనున్నది. కంసునకు హితమాచరింప వలయునను దురాశయముతో, భూమిని కంపింపజేయుచు, వాడు వ్రజ భూమికేతెంచె. అతని సకిలింపులకు తనవారందరును మహాత్రస్తులగుటయు, తోకవిదిలింపులకు మేఘములు చెదరిపోవు చుండుటయు, భగవానుడు చూచినాడు. యుద్ధము చేయుటకై తనకొరకే వాడు వెదకుచుండుట గాంచిన భగవానుడాతని సమీపమందు నిల్చుని యాతనిని సవాలు చేసినాడు. తన సమీపమందే యతడు నిల్చుండి యుండుట గాంచిన కేశి రాక్షసుడు, నోరుదెఱచి, ఆకాశముసంతను మ్రింగువానివలె, గోవిందునిపైకురికె.

ప్రచండవేగముతో వచ్చి, తన రెండు వెనుక కాళ్ళతో నొక్క తన్ను తన్నగా, గోవిందుడు తప్పించుకొనియె. ఇంద్రియాతీతుడగు వానినెట్లు తన్న గలుగును? భగవానుడు వాని రెండు వెనుక కాళ్ళను తనచేతులతో గరుడుడు సర్ప మును బట్టినట్లు పట్టుకొని, నూరు ధనుస్సుల (బారల) యావల బడునట్లు విసరివైచె. వాడు మూర్ఛిల్లి, మరల తెలివి దెచ్చుకొని నోరుదెరచు కొని, భగవానునిపై మహావేగముతో దుముకగా, భగవానుడు నవ్వుచూ, సర్పము శంకయేమియు లేకుండ తన బిలమునందు ప్రవేశించు విధమున, తనయెడమ చేతిని

---

* కేశిరాక్షసుడు :-

పూర్వమితడు దేవేంద్రుని యనుచరుడగు కుముదుడనువాడు. దేవేంద్రు డశ్వమేధయాగము చేయుచుండగా, యతడు యాగాశ్వము నపహరించి, దానిపై నెక్కి యతలమునకుపోగా, మరు ద్దేవతలాతనిని బంధించి యింద్రునెదుట నిలువ బెట్టిరి. "అశ్వరూపరాక్షసుడవుగమ్మ"ని, యింద్రుడు శపించె. అతడే యాకేశి. అతని నోటియందు తన చేయి యుంచి పెద్దది గావించి, శ్రీకృష్ణుడాతనిని చంపి, శాపవిముక్తి గల్గించె.

[గర్గ సంహిత]

వాని నోటియందు దూర్చినాడు. శ్రీకృష్ణుని కోమలమగు హస్తము ఆ సమయమంత
తనికి బాగుగా కాల్చిన యినుప కడ్డీవలెనైనది. ఆ హస్త స్పర్శకు కేశిరక్కసుని
దంతములు భగ్నములై క్రింద పడిపోయినవి. ఉపేక్షింపపడిన జలోదరరోగము,
వృద్ధిపొందునట్లు భగవానుని భుజము వాని నోటియందు వృద్ధి పొందసాగినది. అది
యెంత వృద్ధి పొందెననగా, చివరికతనికి యూపిరి పీల్చుకొనుట గూడ కష్టమైపోయి
నది. వాయు సంచార మాగిపోవుటచేత, గిలగిల తన్నుకొనుచు, కన్నులు తిరిగి
పోయి, శకృన్మూత్రములు విడిచినాడు. కొలదిసమయమందే, చైతన్యముడిగి యాతని
శరీరము క్రింద బడినది. ప్రాణపక్షి యెగిరిపోయినది. బాగుగా పండిన దోసపండు
వలె విచ్చిపోయిన యాతని శరీరము నుండి, గోవిందుడు తన బాహువును వెలుపలికి
లాగుకొనినాడు. దానిచే నతనికేవిధమగు ఆశ్చర్యముగాని, గర్వముగాని కలుగ
లేదు. పెద్ద ప్రయత్నమేమి లేకుండనే శత్రుసంహారమై పోయినది. కాని దేవతలకు
మాత్రమిది యత్యంతాశ్చర్యము కలిగించినది. వారు మహదానంద భరితులై భగ
వానునిపై పూలవాన గురిపించిరి. అతనిని స్తుతింపసాగిరి.

పరీక్షిన్మహారాజా, దేవర్షియగు నారదుడు గొప్ప భగవద్భక్తుడేగాక, జీవులకు
నిజమగు శ్రేయోభిలాషి. ఆ మహాత్ముడు కంసునితో సంభాషించిన యనంతరము
అక్లిష్ట కర్ముడగు శ్రీకృష్ణభగవానుని వద్దకువచ్చి, యేకాంతమందతనితో నిట్లు
వచించె. "సచ్చిదానందస్వరూపా, గోవిందా, నీ స్వరూపము మనోవాచామ గోచ
రము. నీవు యోగేశ్వరుడవు. సర్వజగన్నియామకుడవు. నీవందరి హృదయము
లందువసించెదవు. అందరును నీ హృదయమందు నివసించెదరు. నీవు యదువంశ
శిరోమణివి, మాస్వామివి. సర్వకాష్ఠములందు వ్యాపించి యుండు అగ్నివలె, నీ
వొక్కడవే సర్వభూతములకు ఆత్మస్వరూపుడవై యున్నావు. సర్వభూతాత్మస్వరూ
పుడవైనప్పటికిని, పంచకోశ స్వరూపమగు గుహలోనున్నందున, నీవెవరికిని గోచ
రము గాకుండ గుప్తముగనుందువు. పురుషోత్తమ రూపమున, సర్వ నియామక
రూపమున, సర్వసాక్షిరూపమున, నీయనుభవ మందరికిని కలుగుచునే యుండును.
సర్వమునకు నీవు అధిష్ఠానము. నీవధిష్ఠాన రహితుడవు. సృష్టిప్రారంభమునందు నీ
మాయచేతనే త్రిగుణముల సృష్టించితివి. ఆ గుణముల స్వీకరించియే నీవు జగదు
త్పత్తిస్థితిలయము లొనర్చుచుందువు. ఇది యంతయు చేయుటకు నీకు, నీకంటె
వేరగు వస్తువు యొక్క యావశ్యకతయే లేదు. ఏలననగా, నీవు సర్వ శక్తిమంతు
డవు. సత్య సంకల్పుడవు గనుక. అట్టినీవు, నేడు రాజ వేషములు దాల్చియున్న
దైత్యదానవుల శిక్షించుటకును,ధర్మసేతువును[మర్యాదను]రక్షించుటకునుయదువంశ
మందవతరించి యుంటివి. లీలగా నీవిపుడు కేశియను, గుర్రపు రూపమునను
యీ మహా రాక్షసుని వధించుటయెంతయు ముదావహము. ఇతని సకిలింపులకు
బెదిరి, సురలు స్వర్గమువీడి పారిపోవు చుందురు.

ప్రభూ, యెల్లుండి నేను, నీ చేతులతో చాణూరముష్టికాది మల్లులును, కువల యాపీడమను గజమును, స్వయముగ కంసుడును, మరణించుటగాంచెదను. అనంత రము, కాలయవనుడు, శంఖాసురుడు, మురాసురుడు, నరకాసురుడు గూడ కడ తేరుట గాంచెదను. నీచే పారిజాతాపహరణము, యింద్ర పరాజయము జరుగుటగూడ వీక్షించెదను. నీవు, నీదయ, వీరత్వము, సౌందర్యము మొదలగు వానిని శుల్కము గానొసంగి, వీరకన్యామణులను వివాహమాడ గలవు. జగదీశ్వరా, నీవు ద్వారక యందువసించుచు, నృగమహారాజునకు శాప విముక్తి కల్గించెదవు. శ్యమంతకమణి సహితముగ జాంబవతిని, జాంబవంతుని నుండి స్వీకరించెదవు. బ్రాహ్మణుని మృత పుత్రులను, నీ స్వధామము నుండి తెచ్చి యతని కప్పగించెదవు. ఆ తరువాత, పౌండ్రకుడను కుహనా వాసుదేవుని వధించెదవు. కాశీపురమును దహించెదవు. యుధిష్ఠిరుని రాజసూయ యాగమందు చేదిరాజగు శిశుపాలుని సంహరించెదవు.అచటి నుంచి తిరిగివచ్చుచు, నతని పినతల్లి కుమారుడగు దంతవక్త్రు సంతమొందించెదవు. ప్రభూ, నీవు ద్వారక యందు నివసించు సమయమందు యింకను అనేకములగు వీర్యవంతములగు పనులొనర్చెదవు. ఆ నీ లీలలన్నియు, గొప్ప గొప్ప జ్ఞానులు, ప్రతిభాశాలురగు పురుషులు, ముందు ముందు గానము చేసెదరు. నేనవియన్నియు చూచెదను. అనంతరము పృధ్వీభారనిర్హరణార్థమై, కాల రూపముతో నీవు, అర్జును నకు సారథివై, అనేకాక్షౌహిణీ సైన్యము నంతమొందించెదవు. ఆ సర్వమును నేను కనులార గాంచెదను.

స్వామీ, నీవు విశుద్ధ విజ్ఞాన ఘనుడవు. నీ స్వరూపమందు మరే పదార్థమును లేదు. నీవు నిరంతరము, నీ పరమానంద స్వరూపము నందే యుండెదవు. అందు చేతనే సర్వ పదార్థములు నీకు నిత్య ప్రాప్తములై యుండును. నీ సంకల్పమమో ఘము. చిన్మయమగు నీ శక్తి ముందు (తేజస్సు) మాయయు, మాయాకార్యమగు త్రిగుణమయ సంసార చక్రమును, నిత్య నివృత్తములై యుండును. ఎప్పుడునూ అవి ఉండనే యుండవు. నీవు సర్వాంతర్యామివి, సర్వనియంతవు. అఖండైకరస స్వరూపుడవు. సచ్చిదానంద మూర్తివి. నీయందే నీ వుందువు.పరమ స్వతంత్రుడవు. నిరతిశయైశ్వర్య సంపన్నుడవగు నీకు నమస్కరించుచున్నాను. ఈ జగత్తు అందలి సర్వ విశేషములు,భావా భావ రూపమగు సమస్త భేదవిభేదముల కల్పనలు,అన్నియు కేవలము నీ మాయా ప్రభావము చేతనే కల్గుచున్నవి. ఈ సమయమందు నీవు నీ లీలను ప్రకట మొనర్చుటకే లీలామానుష విగ్రహముతో నవతరించితివి.యదు,వృష్ణి, సాత్వత వంశములకు శిరోమణివై యలరారుచుంటివి. ప్రభూ నీకు వందనము."

అని యీ విధముగ, పరమ ప్రేమ భక్తావతంసుడగు నారదుడు భగవానుని

స్తుతించి నమస్కరించినాడు. భగవద్దర్శనముచే నతనికి రోమాంచితమైనది. అనంతరమనుమతి గైకొని యాదేవర్షి వెడలిపోయె.

ఇచట శ్రీకృష్ణుడు కేశి సంహారమొనర్చిన యనంతరము, తనను ప్రేమించు నట్టి ప్రసన్నచిత్తులగు గోపబాలురతో గూడి,పూర్వమువలెనే పర్వతసానువులయందు పశువుల మేపుచు, దొంగాటలను, దాగుడుమూతలు మొదలగు నాటల నాడుచుండె. ఆ యాటలలో కొందరు దొంగలుగను,కొందరు రక్షకులుగను,కొందరు మేకలుగనై, నిర్భయముగ నాడుకొనుచుండిరి. ఆ సమయమందొక గొల్లపిల్లవాని వేషముదాల్చి* వ్యోమాసురుడచటి కేతెంచె.వాడు మహా మాయావియగు మయునకు పుత్రుడగుటయే గాక స్వయముగగూడ మహామాయావి. వాడు తఱచుగా నాటలయందు దొంగ యగుచు, మేకలుగానున్న గోపబాలురను దొంగిలించి,దాచి వచ్చుచుండె.వారందరిని యొక కొండగుహ యందుంచి, వాకిలికడ్డముగ పెద్ద కొండ ఱాయినుంచి మూయు చుండె. ఇటుల చేయుచుండ బాలురయందు నలుగురైదుగురు మాత్రమే మిగిలి యుండిరి. భక్తవత్సలుడగు భగవానుడతని కపటమును గ్రహించినాడు. వాడు మేకగానున్న పిల్లవాని నెత్తుకొని పోవుచుండగా, సింహము తోడేలును పట్టినట్లు, వానిని గట్టిగా పట్టుకొనియె. వ్యోమాసురుడు మహా బలవంతుడు. వాడు పర్వతోప మానమగు నిజస్వరూపమును దాల్చి, తనను విడపించుకొన జూచినాడు. కాని భగ వానుడు, వానిని విడిపించుకోలేసంత గట్టిగా పట్టినాడు తన రెండు బాహువులతో వ్యోమాసురుని క్రిందబడవైచి, పశువునువలె, యాతని గొంతు పిసికి చంపినాడు, విమానములపైనుండి దేవతలీ యద్భుత దృశ్యమును గాంచుచుండిరి. అనంతరము శ్రీకృష్ణుడు కొండగుహ వద్దకేగి, ద్వారమందలి ఱాతిమూతను తొలగించి, గోపాల బాలుర సంకటమును తొలగించె. దేవతలు గోపబాలురు స్తుతించుచుండగా, గోపాల కృష్ణుడు, తిరిగి గోకులమును ప్రవేశించె.

---

*** వ్యోమాసురుడు :**

కాశీపట్టణమునందు దానపరాయణుడగు భీమరథుడను రాజుండెడివాడు. రాజ్యమును కుమారున కొసంగి యాతడు మలయాచలమున కేగి తపమొనర్చు చుండె. శిష్యసహితుడై యచటికి పులస్త్యమహర్షి రాగా, ధ్యానస్థితుడై యుండుటచే భీమరథుడాతనికి నమస్కరించలేదు. ముని కోపించి యతనిని, "రాక్షసుడవై జన్మించుమ"ని శపించినాడు. పిమ్మట కరుణించి, "ద్వాపరాంతమున గోపాలదేవుని వలన ముక్తి లభించుగాక" యని శాపాంతము ననుగ్రహించినాడు. అతడే వ్యోమా సురుడను పేరుతో మయాసురతనయుడుగా జన్మించి, భగవానునిచే మర్దింపబడి ముక్తి నందినాడు. (గర్గసంహిత)

# మంప్పది యెనిమిందవ యుద్యాయము

## అక్రూరుని వ్రజయాత్ర

కంసునివద్దనుండి వెళ్ళిన యక్రూరుడా రాత్రి మధురా నగరమందేయుండి' మరునాడు ప్రాతఃకాలమందే రథారూఢుడై, నందగోకులమునకు పయనమాయె. మహాభాగుడగు నక్రూరుడు మధురనుండి గోకులమునకు పోవుమార్గమందు, కమల నయనుడగు శ్రీకృష్ణుని ప్రేమ భక్తిచే, పరిపూర్ణుడైపోయినాడు. అతడీ విధమున తనలోతాను తలచుకొనసాగినాడు.

"నేను పూర్వమెట్టి శుభకర్మ నొనర్చితినో, యెట్టి శ్రేష్ఠమగు తపస్సా చరించితినో, లేక యేసత్పాత్రునకు యెట్టి మహత్త్వ పూర్ణమగు దాన మొనర్చితినోగాని, అట్టిదానికి ఫలముగా నేనీనాడు శ్రీకృష్ణ భగవానుని దర్శింపబోవుచుంటిని! నేను విషయాసక్తుడను. అట్టిస్థితిలో, యెవని గుణములు నిత్యమూ గానము చేయుచుండు మహాసాత్త్విక పురుషులుగూడ వర్ణనము చేయజాలక యుందురో, అట్టి భగవానుని దర్శనము నావంటి వాని కత్యంత దుర్లభముగదా. అది, శూద్రకులోత్పన్నునకు వేదగానమువలె దుర్లభము. కాని యట్లుకాదు. నాకంటె యధమునకుగూడభగవానుని దర్శనము తప్పక లభించును. ఏలనన, నదీప్రవాహము నందు గొట్టుకొని పోవుచుండు గడ్డిపోచగూడ అప్పుడప్పుడు, యీ తీరమునుండి యావలితీరమునకు చేరునట్లు, యీకాలనదీ ప్రవాహమునందు గూడ నెక్కడోయొకడు సంసార సాగరమును తరింప గల్గియుండును. నా సర్వపాపములు తప్పక నశించిపోయినవి.నాజన్మ నేడు ధన్యమైనది. గొప్ప గొప్ప యోగులకును యతీశ్వరులకును కేవలము ధ్యాన విషయమగు నట్టి భగవానుని చరణ కమలములను నేడు నేను నమస్కరింపబోవుచుంటిని. ఆహా, కంసుడు నేడు నాపై మహానుగ్రహముజూపినాడు! అట్టి కంసుడు పంపుటచేతనేగదా, నేను భూతల మందవతరించియున్న భగవానుని పాదకమల దర్శన భాగ్యమును పొందబోవుచుంటిని? ఎవని నఖమండల కాంతిని ధ్యానించి పూర్వయుగములందలి మహర్షులు, అపారమగు అజ్ఞానాంధకారమును తరించియుండిరో, అట్టిభగవానుడు స్వయముగ భూతల మందవతరించి యున్నాడు. విధి శంకరేంద్రాది దేవతలందరే మహాత్ముని శ్రీ చరణములను పాసించుచున్నారో, శ్రీ మహాలక్ష్మి యెవని పాద సేవ నొకక్షణకాలమైనను, విడువకయుండునో, ప్రేమభక్తులతోపాటు గొప్పజ్ఞానులుగూడ యెవనిని యారాధించుట యందు నిమగ్నులై యుందురో, అట్టి భగవానుని దివ్యచరణకమలములు, గోవులమేపుటకై గోపబాలురతో గూడి వనములందు గ్రుమ్మరుచున్నవి. సురముని వందితములగు నాశ్రీచరణ

ములే, గోపికల వృక్షస్థలములందలి కుంకుమ రాగముచే రంజితములై యుండును నేను తప్పకవానిని దర్శించెదను. మరకత మణితో సమానమగు సుస్నిగ్ధమగుకాంతి గల్గిన యాతనికోమల కపోలములు, శుకనాసిక వంటి సుందరనాసిక, పెదవులపై మంద మధురహాసము, ప్రేమభరితములగు మనోహరవీక్షణములు, అరుణకంజ లోచనములు, వక్రాలకములు, గల యాముకుందుని ముఖమును నేను దర్శించ గలను. హరిణములు నాకు దక్షిణవువైపునుండి వచ్చుచున్నవి. ఇది శుభశకునము. ముక్తి ప్రదాతయగు ముకుందుని నేను దర్శించ గలననియే యీ శకునము సూచించు చున్నది. విష్ణుభగవానుడు, యీ పృధ్వీ భారము తొలగించుట కొరకే, స్వేచ్ఛచే, మానవ లీలలను ప్రదర్శించుచున్నాడు. అతడు లావణ్య నిలయుడు. మూర్తీభవిం చిన సౌందర్యము. నేడా మహాత్ముని సందర్శనమే నాకు కలుగబోవుచున్నది. తప్పక కలుగును. నాకు నేత్రములున్నందుకు ప్రయోజనము సిద్ధించ బోవుచున్నది. భగవానుడు సర్వ జగత్తునకు దృష్టి (చూచువాడు) అట్లున్నను ద్రష్టృత్వాహంకార మతనిని స్పృశింపజాలదు. అతని చిన్మయ శక్తిచేత అజ్ఞానకారణముచే గలుగు భేద భ్రమంతయు, అజ్ఞానసహితముగ దూరముగాతొలగిపోవును. తనయోగమాయచేతనే తనలో, తాను, భ్రూవిలాసమాత్రముచేతనే, ప్రాణేంద్రియ బుద్ధ్యాది సహితులగు, తన స్వరూప భూతులగు జీవులను సృష్టించును. మఱియు వారితో గూడి బృందా వనని కుంజములయందున, అటులనే గోపికల గృహములందున రకరకములగు లీలలను చేయుచున్నట్లును, భగవానుడు కనిపించు చుండును.

సమస్త పాపములను పరిహరించునట్టి, భగవానుని పరమ కల్యాణ గుణము లను, కర్మలను, లీలలను కలిగియున్న వాక్కులు గానముచేయుచుండగా, ఆగాన ముచేత సంసారమునందు జీవనము యొక్క స్ఫూర్తికల్గు చుండును, శోభాసంచా రము కలుగును. సమస్తా శుభములును నశించిపోయి, పవిత్రతా సామ్రాజ్యము నెల కొనును. కాని యెవని వాక్కుచే భగవానుని గుణగణములు గానము చేయ బడ కుండునో, అట్టివాడు యెంత బాగుగా నలంకరించుకొన్నను, అది శవాలంకారము వలె శోభించకుండును. ఎవని గుణగానమే యంత మాహాత్మ్యము గలదై యున్నదో అట్టి మహానుభావుడే సాక్షాత్తుగ యదువంశ మందవతరించి యున్నాడు. ఎందు కొరకు? తనచే నేర్పడుపబడిన ధర్మ మర్యాదను పాలించునట్టి దేవతాగణములకు కల్యాణము కలుగు చేయుట కొరకే. అట్టి పరమైశ్వర్యశాలియగు భగవానుడు, నేడు వ్రజమండలమునవసించుచున్నాడు. అచటి నుండియే తన యశస్సును విస్త రింపజేయుచున్నాడు. అతని కీర్తి యెంత పవిత్రమైనది! ఆహా, దేవతలుగూడ ఆమంగళకరమగు పవిత్ర యశస్సును గానము చేయుచునే యుందురు. ఈ నాడు నేనాపవిత్ర మూర్తిని సందర్శించ గల్గుదుననుటలో నెట్టి సందేహమునులేదు. మహో

పురుషులకును, యింద్రాది లోకపాలురకును గూడ, యేకమాత్రాశయుతతడు. అందరికిని పరమ గురువు. జగద్గురువు.

అతని యపురూప సౌందర్యము ముల్లోకములను మోహింపజేయునట్టిది. నేత్రములున్నవారల యానందమున కది పరమావధి. అందుచేతనే స్వయముగా లక్ష్మీదేవి గూడ, తాను సౌందర్యాధి దేవతయైయుండియు, అతని సమాగమమునకై యువ్విళ్ళూరుచుండును. ఆ! నేనవశ్యమతని నవలోకించెదను. నేడు ప్రాతఃకాలము నుండియు నాకు శుభ శకునములు కలుగుచున్నవి.

సర్వశ్రేష్ఠ పురుషులగు బలరామకృష్ణులను నేను చూడగనే, వారి శ్రీచరణ ములకు నమస్కరించుటకై నేను రథము నుండి క్రిందకు దుమికెదను. వారి పాద ముల పట్టుకొనెదను. ఆ చరణములు లభించుటయెంత యపురూపము! మహా మహా యోగీశ్వరులు గూడ ఆత్మసాక్షాత్కారము పొందుటకై, హృదయమునందాచరణ ముల నిలుపుకొని ధ్యానము చేయుచుందురు. అట్టి శ్రీచరణములపై ప్రత్యక్షముగా పడి నేను నమస్కరించెదను! వారిద్దరితోపాటు వారి సహచరులగు గోపబాలుర చర ణములకు గూడ నమస్కరించెదను. ఆహా! యేమి! నా భాగ్యము. నేను వారి చరణ కమలములకు నమస్కరించునపుడు, వారి కరకమలములను నా శిరముపై నుంచె దరా? ఆ కరకమలములు, కాలసర్పమ్మయొక్క భయముచే భీతులై తమను శరణు జొచ్చినవారలకు, సర్వదా అభయదాన మొసగునట్టివి. ఇంద్రుడు, దైత్య రాజగు బలియు, ఆ భగవానుని కరకమలములు పూజించి యే యింద్ర పదప్రాప్తినంది యుండిరి. ఆ కరకమలములే రాసలీలా సమయమందు, తమ దివ్యసుగంధ స్పర్శచే గోపికల యలసటను దూర మొనర్చినవి.

నేను కంసుని దూతను. అతడు పంపుటచేతనే వారివద్ద కేగుచుంటిని. నన్ను తమ శత్రువుగా వారు భావించరుగదా? రామ, రామ, వారెప్పుడునట్లు భావించరు. ఎందుకనగా వారు నిర్వికారులు. సర్వసముఖు, అచ్యుతుడు, సర్వసాక్షి సర్వజ్ఞుడు. చిత్తమునకు లోపల వెలుపలనున్నవాడు. క్షేత్రజ్ఞరూపమున నుండి, అంతఃకరణ ప్రవృత్తులనన్నిటిని తన నిర్మల జ్ఞానదృష్టిచే గాంచుచుండువాడు. నేను వ్యర్ధముగా శంకించుచుంటిని. వారి చరణ సామీప్యమున కరములు జోడించి, వినీత భావముతో నిలుచుండెదను. ఆ దయామయుడు చిరునవ్వు నవ్వుచు, ప్రేమ దృష్టితో నా వంక జూచును. ఆ క్షణమందే నేను జన్మ జన్మల నుండి యాచరించిన యశుభ కర్మ వాసనలన్నియు నశించిపోగా, శంకారహితుడనై, యెప్పటికిని పరమానంద మగ్ను డనై యుండిపోయెదను. నేనా భగవానుని కుటుంబములోనివాడను. అతని హితము గోరువాడను. అతడు తప్ప నాకు వేరే యారాధ్య దైవములేదు. అట్టి స్థితిలో నతడు తన దీర్ఘబాహువులతో నన్ను తప్పక యాలింగన మొనర్చుకొనగలడు. ఆ సమయ

మందు నా దేహమతిపవిత్రమైపోవును. ఇతరులను గూడ పవిత్ర మొనర్పజాలు నట్టిదగును. ఆ యాలింగనము లభించుటయే తడవుగ, యే కర్మబంధనముల కారణ ముగా నేననాదికాలమునుండియు ఈ సంసార చక్రమునందు పరిభ్రమించుచుంటినో ఆ కర్మబంధములన్నియు తెగిపోవును ఆతడాలింగన మొనర్చినమీదట, నేను వినయ ముతో శిరము వంచుకొని నిలువబడియుండగా "చిన్నాన్నా అక్రూరా" యని యాతడు నన్ను సంబోధించును. ఏల సంబోధించడు? ఇట్టి పవిత్ర మధుర యశో విస్తార మొనర్చుటయేగదా, యతని లీలయొక్క పరమార్థము! అప్పుడు నా జన్మము సఫలమగును. శ్రీకృష్ణభగవానుడెవనిని స్వీకరించడో, యెవని నాదరించడో? వాని జన్మము వ్యర్థము. అతని కిష్టుడు గాని ద్వేష్యుడు (ద్వేషింపతగినవాడు)గాని లేడు. అతనికి మిత్రులు గాని శత్రువులు గాని లేరు. ఉపేక్షాపాత్రుడుగూడ యెవడును లేడు. అయినను, కల్పవృక్షము తన దగ్గరికి వచ్చి యాచించునట్టివారు కోరిన వన్నియు నిచ్చునట్లు, భగవానుడు గూడ, తన్నెవరేరీతిభజించిన వారిని తానట్లే సేవించుచుండును. (అనుగ్రహించుచుండును) తనను ప్రేమించు భక్తులనే యాతడు ప్రేమించుచుండును. నేను వినీత భావముతో వినమ్రుడనైయుండగా, ముసి ముసి నవ్వులు నవ్వుచూ బలరాముడు నా రెండు చేతులు బట్టుకొని నన్ను భవనములోనికి గొంపోవును. అచటవారు నన్నన్నివిధముల సత్కరించెదరు, పిమ్మట, వారు నన్ను "కంసుడు మాపై యెటువంటి యభిప్రాయముతో నున్నాడని" యడిగెదరు.

శ్వఫల్కనందనుడగు అక్రూరుడు, మార్గమందీ విధముగ మనసులో నూహించుకొనుచు సూర్యుడస్తమించు సమయమునకు గోకులమును చేరినాడు. ఎవని చరణకమల రజమును యింద్రాది లోకపాలకులందరును తమ కిరీటముల ద్వారా సేవించుచుందురో, అట్టి భగవానుని చరణ చిహ్నములను గోష్ఠ మంద క్రూరుడు దర్శించినాడు. కమల, అంకుశాది యసాధారణ చిహ్నముల ద్వారా వానిని గుర్తింప వీలగుచున్నది. ఆచరణ చిహ్నములచే పృథివి యొక్క శోభ యినుమడించుచున్నది. ఆ చరణ చిహ్నముల దర్శించుటచే గల్గిన హృదయా హ్లాదమును నిగ్రహించుకొనలేక, విహ్వలుడై పోయినాడు. ప్రేమావేగముచే నతని రోమరోమములు వికసించినవి. నేత్రము లశ్రు పూరితములైనవి. అశ్రు బిందువులు టపటప నేలరాలజొచ్చినవి. రథము నుండి యొక్క గంతువైచి, నేలపై పొరల సాగినాడక్రూరుడు. "ఆహో, యిది నా ప్రభువు యొక్క పాదధూళి" యని పలుకుచూ నేలపై దొరలినాడు.

పరీక్షిన్మహారాజా, కంసుని సందేశము నుండి యింతవరకు అక్రూరునకు కల్గిన చిత్తవృత్తియే దేహధారులగు జీవులందరి పరమ కర్తవ్యము దంభ, భయ, శోకములవదలి, భగవానుని మూర్తులను (ప్రతిమలు-భక్తులు మొదలగునట్టివి),

చిహ్నములను, లీలలను స్థానములను, గుణములను, దర్శన శ్రవణాదుల ద్వారా యిట్టి భావములను సంపాదించు కొనవలయును.

వ్రజము చేరిన యక్రూరుడు మరల రథారూఢుడై వెళ్ళి, రామకృష్ణులు గోదోహన స్థానమందుండుటను గాంచినాడు. శ్యామసుందరుడగు గోవిందుడు పీతాంబరము ధరించి యున్నాడు. గౌరసుందరుడగు బలరాముడు నీలాంబరధారియై యున్నాడు. వారి నేత్రములు శరత్కాల మందలి కమలములవలె వికసించియున్నవి. వారిరువురును సౌందర్య ఖనులైయున్నారు. ఆజాను బాహువులు, సుందర వదనములు గలవారై పరమ మనోహర రూపులై యుండిరి. గజకలభముల వలె మంద గమనము కల్గియుండిరి. వారు నడచుచున్నప్పుడు, ధ్వజ కులిశాలకుశాది పాదచిహ్నములతో భూమి శోభాయమానమగుచుండె. మందహాస యుక్తములగు వారి చూపుల యందు దయారసము తొణికిసలాడుచుండె. వారి ప్రతిలీలయు, ఉదారతతోనూ, సుందరకళా కౌశలముతోను నిండి యుండినవి. మెడయందు వనమాలలు మణి హారములు ప్రకాశించుచుండినవి. అంతకు ముందే, వారు స్నాన మొనర్చి, నిర్మల వస్త్రముల దాల్చి, శరీరములందు పవిత్రములగు అంగరాగములు, చందన లేపనముల నలదుకొని యుండిరి.

అక్రూరుడు చూచినాడు. జగత్తు నకాదికారణుడను, జగత్పతియునగు పురుషోత్తముడే, యీ ప్రపంచమును రక్షించుటకై తన సంపూర్ణాంశములతో, బలరామ శ్రీకృష్ణ రూపములతో నవతరించి, తన శరీరకాంతితో దిక్కులయందలి యంధకారమును దూర మొనర్చు చుండుటను, గాంచినాడు. కనకాచితములైన, మరకతమణి, రౌప్య పర్వతములు ప్రకాశించుచున్నట్లుండినారు. వారలను చూచుటయే తడవుగ అక్రూరుడు రథమునుండి దూకి, ప్రేమా వేగముచే రామకృష్ణుల పాదములపై సాష్టాంగముగ పడి ప్రణామము చేసినాడు. భగవద్దర్శనముచే కలిగిన యానందముచే నాతని నేత్రములు హర్షాశ్రు పరిపూర్ణములైనవి. శరీరము పులకాంకితమైనది. ఔత్కంఠ్యముచే గొంతు గద్గదికమైపోయి (పూడిపోయి) తన పేరుగూడ చెప్పుకొన లేకపోయినా డక్రూరుడు. శరణాగత వత్సలుడగు భగవానుడతని మనఃస్థితిని గమనించినాడు. మహాప్రసన్నతతో, చక్రాంకితమగు తన చేతిద్వారా నతనిని లేవనెత్తి, హృదయమునకు హత్తుకొనియె. అనంతరము అక్రూరుడు పరమ వినీత భావముతో బలరాముని సమక్షమున నిలువబడి యుండగా, నతడాతని నాలింగన మొనర్చె. రామకృష్ణులిర్వురు చెరియొక చేతిని గ్రహించి, యక్రూరుని యింటి లోనికి గొంపోయిరి.

ఇంటికి గొనిపోయి భగవానుడతని కపూర్వ స్వాగత సత్కారములు నెరపినాడు. కుశల ప్రశ్నానంతరము, శ్రేష్ఠమగు నాసనముపై గూర్చుండబెట్టి, యథా

విధిగ పాదప్రక్షాళన మొనర్చి, మధుపర్కమిచ్చి, పూజించినాడు. ఆతిధియగు అక్రూరు నకు గోదానమిచ్చి, యతని పాదసంవాహన మొనర్చి మార్గాయాసమును పోగొట్టి నాడు. ఆదరపూర్వకముగ, శ్రద్ధతో నతనికిష్టమృష్టాన్నము బెట్టించినాడు. భోజనా నంతరమందు మర్మజ్ఞుడగు బలరాముడాతనికి తాంబూల గంధమాల్యాదు లొసంగి సంతృప్తుని గావించినాడు. ఈ విధముగ సత్కారము లొనర్చిన పిదప, నందరాజ క్రూరుని సమీపించి యిట్లు పలికినాడు.

"అక్రూరా, నిర్దయుడగు కంసుడు బ్రతికియుండగా, మీరందరే విధముగా దినములు గడుపుచున్నారు? వాడు జీవించియుండునంత కాలము మీ పరిస్థితి కసాయి వానిచే పెంచబడు గొర్రెలచందముగనే యుండును. వాడు, విలపించుచున్న తన చెలియలి విలాపమును గూడ లక్ష్యపెట్టక, యామె పసిబిడ్డల కనిమసంగిన కఠిన హృదయుడు. మీరందరతని ప్రజలు. అట్టి మీరు సుఖముగా నుందురను యూహ యైనను మేమెట్లు చేయగలము?" అని నందుడాతని పరామర్శించినాడు. అక్రూరుడు ముందే నందుని కుశలప్రశ్న గావించినాడు.

ఈ ప్రకారము నందరాజు మధురవాక్కులచే కుశలప్రశ్న గావించి సన్మా నించగా, అక్రూరుని శరీరమందు మార్గాయాసముచే కలిగిన శ్రమయంతయు తొలగి పోయినది.

# ముప్పదితొమ్మిదవ యధ్యాయము

## శ్రీకృష్ణ బలరాముల మథురాగమనము

బలరామకృష్ణు లక్రూరునికి గొప్ప సన్మానము చేసినారు. అక్రూరుడారామ ముగ శయ్యపై కూర్చుండినాడు. అతడు మార్గమందే యే యభిలాషలను సంకల్పిం చెనో, యవి యన్నియు సఫలములైనవి. లక్ష్మీదేవి కాశ్రయభూతుడగు భగవానుడు ప్రసన్నుడుకాగా, సిద్ధింపని యభిలాషలేమి యుండును? అయినను భగవానుని పరమ ప్రేమభక్తులగు వారెట్టి వస్తువులను కోరుకొనరు. దేవకీ నందనుడగు శ్రీకృష్ణ భగ వానుడు, రాత్రి భోజనానంతరము అక్రూరుని సమీపమునందు గూర్చొని, తన బంధు జనులతో కంసుడు ప్రవర్తించు తీరెట్లున్నదియు, వాని భావి కార్యక్రమమును గూర్చియు ప్రశ్నించినాడు.

"నాయనా, నీ హృదయము చాల పవిత్రమైనది. నీకు ప్రయాణమందెట్టి బాధయు కలుగలేదు గదా? నీకు సుస్వాగతము. నీకు భద్రమగుగాక. మథురానగ రమునందలి మా యాత్మీయులు, సుహృత్తులు, కుటుంబీకులు, యితర బంధువు

అందరును కుశలులై యున్నారా? మాకు నామమాత్రుడైన మాతులుడగు కంసుడు మా కులమునకు మహావ్యాధివంటివాడు. వాడు వృద్ధిలో నుండునంతవరకు, మా వంశస్థులయొక్క వారి సంతానముయొక్క కుశలమేమని యడుగగలము?నా కారణ ముగా, నిరపరాధులు సదాచారులునగు మా తలిదండ్రులనేక రకములగు యాతనల ననుభవించుచు, కష్టపడుచుండిరను విషయమే నాకు చాల బాధాకరముగ నున్నది. నా మూలముననేగదా, వారు శృంఖలాబద్ధులై కారాగారము నందుండుటయు, వారి సంతానమంతయు నశించుటయు జరిగినది. చాలదినములనుండియు మీలోనే యొకరి దర్శనమైన కలిగిన బాగుండునని కోరుకొనుచుంటిని. అదృష్టవశమున నా కోరిక నేటికి తీరినది. సాధుస్వభావుడగు తండ్రీ, దయయుంచి, నీ యాగమన కారణము దెలిపెదవా?" యని శ్రీకృష్ణుడు ప్రశ్నించగా, అక్రూరుడిట్లు చెప్పదొడగె.

కృష్ణా, కంసుడు యాదవులందరి యెడల ఘోరవైరము గలిగియున్నాడు. వాడు వసుదేవుని చంపవలయునని గూడ ప్రయత్నించినాడు" అని ప్రారంభించి కంసుడే యుద్దేశ్యముతో తనను దూతగా బంపినదియు, నారదునివలన కంసుడు, శ్రీకృష్ణుని జన్మవృత్తాంతము తెలుసుకొనుట మొదలుగాగల విషయములన్నియు, అక్రూరుడు శ్రీకృష్ణునకు వివరించె. అక్రూరుని మాటలకు రామకృష్ణులు నవ్వుచూ అనంతరము కంససందేశమును నందరాజునకు తెలిపిరి. నందుడు గోపాలురనందర రావించి, "గవ్యములనన్నియు సిద్ధమొనర్చి, రాజునకు కానుకలుగా పంపవలయును. ఆ కానుకలన్నిటిని బండ్లపైకెత్తించి, రేపు ప్రాతఃకాలముననందే మనమందరము మధురకు పయనమై పోవలయును. అక్కడ యొక గొప్ప యాగము జరుగనున్నది. అది చూచుటకై దేశమందలి ప్రజలందరచటి కేతెంచుచున్నారు. కంసునకు గో రసమును కానుకగా యిచ్చి, మనముగూడ ఆ యుత్సవమును కనులారగాంచుదము" అని యాజ్ఞాపించెను. ఆ యాజ్ఞను చాటింపుద్వారా తనవారందరికి తెలియజేసినాడు.

తమ మానసముల హరించిన రామకృష్ణులను మధురకు గొనిపోవుటకై యక్రూరుడు వచ్చియుండెనను వార్త తెలియగనే గోపికల యంతరంగములంద త్యంత వంతగలిగినది. శ్రీకృష్ణుడు మధురకేగు చుండెనను వార్త వినగానే కొందరి హృదయములందు మంటలురేగి, వానిచే వచ్చువేడి నిట్టూర్పులచే వారి ముఖకమల ములు వాడి పోయినవి. చాలమంది తమ మేలిమునుగులు తొలగిపోవుటగాని, కేశబంధములూడిపోవుటగాని తెలియనంత యచేతనులైపోయిరి. భగవానుని స్వరూ పము స్మరించినంత మాత్రముననే యనేక గోపికల చిత్తములు ప్రాపంచిక విషయ ములనుండి నివృత్తములై, ఆత్మస్థితములైన యటుల సమాధిస్థితములైపోయినవి. వారికి శరీరముల గూర్చిగాని సంసారముల గూర్చిగాని యావంత చింతయు లేకుండ బోయినది. గోపికల యెదుట, శ్రీకృష్ణుని ప్రేమ, మృదుమందహాసము, హృద

యము స్పృశించునట్టి విచిత్ర పదయుక్తములగు మధురవాక్కులు, నాట్యమాడ సాగినవి. వారు వానియందు తల్లీనులై, మోహితులైపోయిరి. మనములందే భగవానుని లలితగమనమును, భావభంగిమను, ప్రేమమయమగు మందహాసమును, స్నిగ్ధవీక్షణమును, శోకాపహములగు సర్మోక్తులను, మాధుర్యములగు లీలలను చింతనము చేయుచు, అట్టి భగవానునితో తమకు కలుగబోవు విరహము యొక్క భయముచే కాతరలైపోయిరి. వారి హృదయములు, వారి జీవనములు, సమస్తము భగవదర్పితములై పోయినవి. వారి నేత్రములనుండి, కన్నీరు వరదలై ప్రవహింప సాగినది. గోపికలందరు గుంపులుజేరి యిట్లు పలుకజొచ్చిరి.

"విధాతా, నీవు సర్వము విధించువాడవు. కాని నీయందు దయ యనునది లేశమాత్రము గూడలేదుగదా! జగత్తునందలి జీవులను, ప్రేమ - స్నేహములచే నొకరితో నొకరు బద్ధులగునట్లుచేసి, వారి యందైక్యభావన కలిగించి, వారు వారి యాశలను అభిలాషలను పూర్తిగాపించుకొనకముందే, వాటింకను తృప్తిబడయక మునుపే, మరల వారిని వేరుచేయుదువు. నిజముగా, నీ యీ యాట, పిల్లలయాట వలె వ్యర్థమైనట్టిదే గదా!

ఇదియెంత దుఃఖకరమగు విషయము ! మొదట, నీవు మాకు ప్రేమ ప్రదానమొనర్చునట్టి శ్యామసుందరుని సుందర ముఖారవిందమును దర్శింప జేసితివి. ఆహా, అది యెంత పరమ సుందరమైనట్టిది! నల్లని ముంగురులు కపోలములపై వ్రేలాడుచుండును. మరకతమణివలె మెఱయుచుండు కపోలములు, ఉన్నతమగు నాసిక, అధరముపై సుందరమగు మందహాసరేఖ గలయా ముకుందవదనము సర్వశోకములను, దర్శనమాత్రము చేతనే తొలగద్రోయును. అట్టి సుందరవదనము నొక్క పర్యాయము మాకు జూపి, యిప్పుడు దానిని మాకదృశ్యముగావించుచుంటివా! నీకిది చాలయనుచితము. ఇందక్రూరుని దోషమేమియు లేదనియు, యిది కేవలము నీ క్రూరత్వమేననియు మాకు దెలియును. వాస్తవముగా, నీవే యక్రూరుని రూపముతోనిచ్చటకువచ్చి, నీ చేతనే మాకొసంగబడిన కన్నులను, మూర్ఖునివలె, నీవేలాగుకొని పోవుచుంటివి. ఆ కన్నులద్వారా, శ్యామసుందరుని ప్రతి యవయవమునందునుగల, నీ సృష్టియందలి సంపూర్ణ సౌందర్యమును గాంచగల్గుచుంటిమి. విధాతా, నీవిట్లొనర్చుట యెంతయు అనుచితము.

నందనందనుడగు శ్యామ సుందరునకుగూడ క్రొత్తవారితో స్నేహము చేయవలెనని కోరికగలిగినట్లున్నది. ఇతని ప్రేమ, స్నేహము, క్షణమాత్రములోనే యెచటకేగినవి? మేము మాయిండ్లు వాకిళులను, పతిపుత్రులను, బంధుబలగములనన్నిటిని వదలివచ్చి, యితనికి దాసీలమై పనిచేయుచు, నేడితనికొరకే మేము శోకాతురలమైయుండగా, యితడు మాత్రము మావంక చూడనైన చూడకుండయున్నాడు.

నేటిరాత్రి ప్రాతఃకాలము మధురానగరమందలి మానినీమణులకు మంగళ మయము కాగలదు. ఎన్ని దినములనుండియో గల వారియభిలాష నేడు నెరవేర నున్నది. మా వ్రజ మండలపు రాజగుశ్యామసుందరుడు, తనక్రీగంటి చూపులతో, మందహాసయుక్త ముఖారవిందము యొక్క మాదక మధువును పంచియిచ్చుచు మథురాపురమందు ప్రవేశించుచుండగా, మధురానగర మానినులా మధువును పాన మొనర్చుచు ధన్యులగుదురు. మాశ్యాముడు ధైర్యశాలి యగుటయేగాక, తండ్రి యాజ్ఞకు లోబడి యుండు వాడేయైనప్పటికిని, మధురానగరమదవతులు తమ మధుర మంజులములగు మాటలచే, నితనిచిత్తమును బలాత్కారముగ తమవైపున కాక ర్షించుకొనియెదరు. శ్యామసుందరుడా విధముగ నాకర్షింపబడిన వాడై, సిగ్గుదొంతర లతో గూడిన వారి చిరునగవులతోడను, విలాసభరితములగు భంగిమలతోను అచ టనే రమించుచు నుండి పోవునేగాని, మరల మావంటి పల్లె గొల్లపడుచులవద్ద కేలనేతెంచును? నేడు మా శ్యామసుందరుని కనులారగాంచి, మధురానగరమందలి, దాశార్హ, భోజ, అంధక, వృష్ణి వంశీయులగు యాదవులందరి నేత్రములును పరమా నంద సాక్షాత్కారమును పొంది, తరించిపోగలవు. వారి ప్రదేశమునందు మహోత్స వము జరుగగలదు ఇచటినుండి మధురకు బోవు మార్గమందు గూడ దేవకీ నందను డగు శ్యామసుందరుని దర్శన భాగ్యము పొందినవారు పరమ సంతృప్తి బడయ గలరు.

"చూడు, సఖీ, యీయక్రూరుడెంత నిష్ఠురుడో, హృదయహీనుడో, చూడు. ఇచట, గోపికల మందరమింత దుఃఖించుచుండగా, మన ప్రియతముడగు నంద నందనుని, మనకు కనుపించకుండ దూరముగ, తీసుకొని పోవుచున్నాడు.

మనతో రెండు మాటలు చెప్పి మనకు ధైర్యమును గల్గించుటగాని, యోదా ర్చుటగాని చేయకుండ నున్నాడు. ఇటువంటి యత్యంత క్రూర పురుషునికి, "అక్రూర" నామధేయముండరాదు. సఖీ, మన శ్యామసుందరుడు గూడ యేమంత తక్కువ నిష్ఠురుడుగాడు. అప్పుడే రథమెక్కి కూర్చున్నాడు చూడు! మత్తెక్కిన గొపాలురందరు, బండ్లపై యాతనివెంట బోవుటకెంత హడావుడిపడుచున్నారో చూడు! ఈ మన పెద్దలందరు మహామూఢులు, గోపాలుర యాగడమును చూచి యుపేక్షించుచున్నారు "మీయిచ్ఛవచ్చినట్లు చేయుడ' న్నట్లు, చూచిచూడనట్లున్నారు మనమిప్పుడేమి చేయవలె? నేడు విధాత మనకు ప్రతికూలముగ వ్యవహరించ చున్నట్లున్నది. పదండి. మనమే వెళ్ళి మన ప్రాణ ప్రియుడగు శ్యామసుందరుడు వెళ్ళకుండనడ్డగించుదము. కులపెద్దలు, బంధువులు, మననేమిచేయగలరు? మనమొక యరక్షణము గూడ మన ప్రాణవల్లభుడగు శ్యామసుందరుని విడిచియుండజాలము

నేడు మన దౌర్భాగ్యము, మన మురహర శ్యామసుందరుని వియోగమును కలిగింపజేసి, మనచిత్తములను, వ్యాకులము గావించుచున్నది.

సఖియలారా, యెవని ప్రేమ భరితమగు మనోహర మందహాసముతో, రహస్య మధుర సంభాషణముతో, విలాస పూర్ణములగు క్రీగంటి చూపులతో, ప్రేమాలింగనములతో, మహావిశాలమగు రాసలీలా రాత్రులను, క్షణముగా గడిపితిమో, అట్టి శ్యామసుందరుడు లేకుండ, మనమీ విరహవ్యథా జనితమగు దురంతతమము నెట్లు తరించగలము? ఒకనాడు గాదు. ప్రతి దినము గూడ, గోపబాలపరివేష్టితుడై, గోవిందుడు బలరామ సహితముగ, సాయంకాల సమయమందు గోవుల దోలుకొనుచు వనమునుండి వ్రజమునకు తిరిగి వచ్చుచుండును. అతని నీలకుటిలాలకములు, గళమందలి పుష్పహారములు అన్నియు గోధూళిచే నిండియుండును. వేణునాదముచేయుచు, చిరునగవుతో క్రీగంటి చూపులతో మనహృదయచ్ఛేదనము చేయుచుండువాడుగదా!

గోపికల వాణి ఈ విధముగ పల్కుచుండినదేగాని, వారిప్రతిమనో భావము గూడ శ్రీకృష్ణుని స్పృశించుచు, ఆలింగనముచేయుచు నుండి పోయినవి. విరహము కలుగునను భావనచేతనే వారత్యంత వ్యాకులత్వమునంది యుండిరి. సిగ్గువదలినారు 'గోవిందా, దామోదరా, మాధవా'యని యెలుగెత్తి బిలచుచు, మధురముగా నేడువసాగిరి. ఈ విధముగ రాత్రియంతయు వారేడ్చుచునే యుండగా తెల్లవారెనది.

అక్రూరుడు సంధ్యా వందనాది నిత్య కర్మల పూర్తిగావించుకొని, రథము నధిరోహించి కదలినాడు. నందాదులు, పాలు, పెరుగు, వెన్న, నేయి మొదలగు గోరసములచే నిండిన భాండములను బండ్లపైకెత్తినారు. ఇతర కానుకలను గూడ బండ్లపై కెక్కించి, బండ్లను నడుపుచు వానివెంట, నందాదులు శకటములపైపయనము సాగించినారు. ఇదే సమయమందు, అనురాగ రంజితులగు అభీరవనితలు గోవిందుని సమీపించినారు. అతని ప్రేమవీక్షణములు, మధురదరహాసములచే కొంచెము సుఖమనుభవించినారు. తమ ప్రియతముడగు శ్యామసుందరుని సందేశమును వినదలచినవారై యచటనే నిలబడి పోయినారు? తన మధురా ప్రయాణముచే గోపికల హృదయములు విరహతప్తములై పోవుచున్నవని, యదువంశ శిరోమణి గుర్తించినాడు. అపుడతడొక దూతద్వారా, "మరలవచ్చెద" నని ప్రేమ సందేశము బంపి, వారికి ధైర్యము కల్గించినాడు. గోపికలక్కడనే, రథపతాకము, రథచక్రములచే పైకిలేచిన ధూళి కనుపడునంతవరకు, చిత్తరువులవలెనుండి పోయిరి. వారి మనములందింకను శ్యామసుందరుడు కొంతదూరమేగి తిరిగివచ్చునను యాశయుండినది. అతడెంతకును తిరిగి రానందున నిరాశ జేసుకొని తమ తమ యిండ్లకేగిరి. అహోరాత్రములు వారు భగవానుని లీలలను గానమొనర్చుచు, తమ సంతాపమును కొంతయుపశమింప జేసుకొనుచుండిరి.

అచట, శ్రీకృష్ణుడు, బలరామా క్రూర సహితముగ, రథముపై వాయువేగమున బోవుచు, పావన యమునానదీ తీరమును జేరినాడు. అచట వారు రథము దిగి, మరకతమణిప్రభలతో ప్రకాశించుచున్న యమునానదీ మధురజలములందు పాద ప్రక్షాళనాదుల గావించి, దాహశాంతి గావించుకొనిరి. అనంతరము, వృక్షచ్ఛాయ యందున్న రథముపై రామకృష్ణు లుపవిష్ణులుకాగా, వారి యనుమతి గైకొని, య్రకూరుడు బ్రహ్మహ్రదము (యమునా హ్రదము) నందు స్నానమొనర్చుటకై వెళ్ళినాడు. యథావిధిగా స్నానమొనర్చిన యనంతరమాతడు జలమునందే యుండి గాయత్రీజపము చేయసాగినాడు. ఆ సమయమందాతనికి, యమునాజలములందు బలరామకృష్ణులు కనుపించిరి. "నేను వసుదేవుని పుత్రులను రథమందు గూర్చుండబెట్టి వచ్చితినిగదా. వారీ జలములలోని కెట్లేతెంచిరి" అని యనుమానము కలిగి య్రకూరుడు తలయెత్తి చూడగా, రామకృష్ణులు పూర్వమువలె రథమందే యుండిరి. తాను వారిని జలమందు గాంచుట భ్రమయై యుండబోవునని, మరల తలవంచి చూడగా, వారు జలమునందెటుల గాన్పించిరి? ఆదిశేషుడచట విరాజమానుడగుచుండ, సిద్ధ చారణ గంధర్వాది దేవతాగణములును, అసురులుగూడ శిరములు వంచి యాతనికి నమస్కరించుచు, స్తుతించుచుండిరి. ఆ యనంతునికి వేయిపడగలు, వానిపై కిరీటములు ప్రకాశించుచున్నవి. కమలనాళమువలె తెల్లనైన యాతని శరీరముపై నీలాంబరము ధరించి యున్నాడు. సహస్రశిఖరములుగల శ్వేతగిరియగు కైలాసపర్వతమువలె యాతడు శోభాయమానుడై యుండె. ఆ యాదిశేషుని యొడియందు, నీల మేఘమువలె, ఘనశ్యాముడు పీతాంబరముధరించి విరాజమానుడగుచుండె. చతుర్భుజములతో, శాంతరూపమున, పద్మపత్రముల వంటి విశాల నేత్రములతో శోభిల్లుచుండె. అతని వదన మత్యంత మనోహరమై, ప్రసన్నతాసదనమై యున్నది. అతని మధుర సుందర దరహాసము, రమ్యవీక్షణము, చిత్తమును దొంగిలించుచుండినవి. సుందరములగు కనుబొమలు, ఉన్నతమగు నాసిక, చారుకర్ణములు, సుకపోలములు, అరుణాధరముల కాంతి యపూర్వముగా నున్నది. బాహువులు మోకాళ్ళవరకు వ్రేలాడుచు బలిష్ఠములై యున్నవి. భుజములెత్తుగా నుండినవి. వక్షఃస్థలము విశాలమై లక్ష్మీ నివాసమై వెలయుచుండె. శంఖమువంటి మెడ, నిమ్ననాభి, త్రివళీయుక్తమగు నుదరము, స్థూలకటిప్రదేశము, నితంబము, హస్తితుండ సమానములగు జంఘలు, తుంగగుల్ఫములైన నఖదీధితులతో వెలుగుచున్న పాదములు, జ్యోతిర్మయములుగా నున్నవి. అనర్ఘమణి ఖచితములైన స్వర్ణకిరీట, కటకాంగద, కటిసూత్ర, బ్రహ్మసూత్ర, హారనూపుర కుండలములు మొదలగు వానిచే ఆ దివ్యమూర్తి యలంకృతమై యున్నవి. ఒక చేతియందు కమలము, మిగిలిన మూటియందు శంఖ, చక్ర, గదాయుధములున్నవి. వక్షఃస్థలమందు శ్రీవత్స

మను పుట్టుమచ్చ యున్నది. మెడయందు వనమాలయు, కౌస్తుభమణియు వ్రేలాడు చున్నవి. నందసునందాది విష్ణుపార్షదులు తమ స్వామియనియు, సనకసనంద నాది బ్రహ్మర్షులు పరబ్రహ్మమనియు, బ్రహ్మేశానాది దేవతలు సర్వేశ్వరుడనియూ, మరీచ్యాది నవద్విజోత్తములు (ప్రజాపతులు) పరమప్రజాపతి యనియు, ప్రహ్లాద నారదాది పరమప్రేమభక్తులు, అష్టవసువులు, తమ ప్రియతముడగు భగవాను డనియు భావించుచు, వారి వారి భావములకనుగుణముగ, దోషరహితములగు వేద వాక్కులచే భగవానుని స్తుతించుచుండిరి. లక్ష్మి, పుష్టి, తుష్టి, సరస్వతి, కాంతి, కీర్తి, (అనగా, ఐశ్వర్య, బల, జ్ఞాన, శ్రీ, యశ, వైరాగ్యములను షడైశ్వర్య రూపశక్తులు), ఇల (సంధినీ రూపమగు పృథ్వీశక్తి), ఊర్జ [లీలాశక్తి] విద్యా-అవిద్యా (జీవులకు, మోక్ష-బంధనములకు కారణరూపములగు బహిరంగశక్తులు) హ్లాదినీ, సంవిత్ (అంతరంగశక్తులు, మఱియు, మాయ మొదలగు శక్తులన్నియును, రూపములు దాల్చి యా పరమేశ్వరుని సేవించుచుండినవి.

భగవానుని యీ దివ్యదర్శనము గాంచి యక్రూరుని హృదయము పరమా నంద సంభరితమైపోయినది. పరమభక్తి యుప్పొంగినది. శరీరమంతయు హర్షాతి రేకముచే పులకించినది. ప్రేమ భావోద్రేకము కల్గుటచే నతని నేత్రములానందాశ్రు పూరితములైనవి. అక్రూరుడు తన ధైర్యమును కూడదీసుకొని, భగవానుని చర ణములపై తన శిరముజేర్చి ప్రణామము గావించి, యనంతరము చేతులు జోడించి, సావధానుడై, మందమందముగ గద్గదస్వరమున, యీ విధముగా భగవానుని స్తుతించసాగె.

# నలుబదియవ యధ్యాయము

## అక్రూరకృత శ్రీకృష్ణ స్తుతి

"ప్రభూ, నీవు ప్రకృతి మొదలగు సమస్త కారణములకుగూడ కారణమైన వాడవు. ఆది పురుషుడగు నారాయణుడవు అవ్యయుడవు. నీనాభికమలమునుండియే చతుర్ముఖ బ్రహ్మ యుదయించినాడు. అతడీ జగత్తును సృష్టించినాడు. అట్టి కారణ కారణుడవగు నీకు నమస్కారము.

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహ త్తత్త్వము, ప్రకృతి, పురుషుడు, మనస్సు, యింద్రియములు, యింద్రియ విషయ ములు, వాటి యధిష్ఠానదేవతలు- యివియే యీ సమస్త చరాచర జగత్తు దాని వ్యవహారములకు కారణములై యున్నవి. అవి యన్నియు నీ యవయవ స్వరూప ములేయై యున్నవి.

ప్రకృతి, ప్రకృతి వలన యుత్పన్నములగు సమస్త పదార్థములు, "ఇదం వృత్తి"చే గ్రహింపబడుచున్నవి. అందుచే నవియన్నియు అనాత్మ వస్తువులు. అనాత్మలగుటచే జడములు. అందుచేత నవి నీ స్వరూపము నెఱుగజాలకుండును. నీవాత్మ స్వరూపుడవు గదా! బ్రహ్మ నీ స్వరూపుడేయైనను ప్రకృతి సంబంధమగు రజోగుణముచే కూడియున్నందున, నీ ప్రకృతియొక్కయు, ప్రకృతి కతీతమగు నీ యథార్థ స్వరూపమును గుర్తింపజాలకున్నాడు.

సాధువులు, యోగులు స్వయముగా తమ యంతఃకరణములందున్న "అంతర్యామి"గను, (సాధ్యాత్మం); సమస్త భూత భౌతిక పదార్థములయందు వ్యాపించియున్న పరమాత్మ (సాధిభూతం) గను; మఱియు సూర్యచంద్రాది దేవమండల మండలమందున్న యిష్టదేవతా (అధిదైవ) రూపముగను, అధ్యాత్మాధిభూతాధిదైవ సాక్షిగను, మహాపురుషునిగను, సర్వనియంతగను, సాక్షాత్తుగ నిన్నే యుపాసించుచున్నారు.

కర్మకాండ ప్రవర్తకులగు బ్రాహ్మణులనేకులు, వేదవిద్య ద్వారా కర్మమార్గము నుపదేశించుచు, యింద్రవరుణ వాయ్వాది యనేక దేవవాచకములగు నీ నామములను, వజ్రహస్త, సప్తార్చ్యాది యనేకములగు నీ రూపములను చెప్పుచు గొప్ప గొప్ప యజ్ఞములాచరించుచుందురు. వాటి ద్వారా వారు నిన్నే యుపాసించుచుందురు.

జ్ఞానులగు వారనేకులు సర్వకర్మత్యాగమొనర్చి, శాంతభావముతోనుండి, జ్ఞానయజ్ఞముచే, జ్ఞాన స్వరూపుడవగు నిన్నే యారాధించుచున్నారు.

మఱికొందరు, శైవవైష్ణవ దీక్షలచే సంస్కృతులై నీచే చెప్పబడిన పాంచరాత్రాద్యాగమ విధానములచే, త్వన్మయులై వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ భేదముచే ననేక రూపుడవుగను, నారాయణ రూపముతో నొక్కడవుగనుయున్న నిన్నే, శివస్వరూపుడవగు నిన్నే యారాధించుచున్నారు.

జ్ఞానమూర్తియగు శివునిచే నుపదేశింపబడిన మార్గముద్వారా ఆచార్యభేదముచే ననేక యవాంతరభేదములున్నప్పటికిని, శివస్వరూపుడవగు నిన్నే గొల్చుచున్నారు.

స్వామీ, యితర దేవతల నారాధించుచు, వారు నీ కంటె భిన్నులని భావించు వారు అందరును వాస్తవముగా నిన్నే యారాధించుచున్నారు. ఏలననగా సర్వదేవతల రూపమందున్న సర్వేశ్వరుడవు నీవే గదా.

పర్వతములనుండి యన్ని వైపులకు ప్రవహించుచున్న నదీనదములన్నియు వర్షజలముచే సంపూరితములై సముద్రమునే ప్రవేశించు విధమున, సర్వవిధములైన యుపాసనామార్గములన్నియు, ముందు వెనుకలుగా, చివరకు నీయందే ప్రవేశించుచున్నవి.

నీ ప్రకృతి, సత్త్వ రజస్తమములను మూడు గుణములు కలిగియున్నవి, బ్రహ్మాది స్తంబపర్యంతము గల ప్రకృతి యందలి చరాచర ప్రాణులన్నియు, ప్రకృతి యొక్క యీ మూడు గుణములచే— వస్త్రమునందు దారములు ఓతప్రోత ములై (పడుగు-పేకలై) యుండునట్లు ఓతప్రోతములై యున్నవి.

శ్లో. తుభ్యం నమస్తే ష్యవిషక్తదృష్టయే
సర్వాత్మనేసర్వ ధియాంచసాక్షిణే
గుణప్రవాహోఽయ మవిద్యయాసకృత్
ప్రవర్తతే దేవనృతిర్య గాత్మసు

కాని, యన్ని రూపములలోనున్నది నీవేయైనను, ఆ ప్రకృతి గుణములు నిన్నంటవు. సమస్త బుద్ధివృత్తులకు నీవు సాక్షిగా నుందువుగాన, నీ దృష్టి నిర్లిప్త ముగా నుండును. గుణప్రవాహమువలన గలుగు యీ సృష్టి అజ్ఞానమూలకము. ఇది దేవతా, మనుష్య, తిర్యగాది సమస్త జీవరాసులయందును వ్యాప్తమైయున్నది. కాని నీవు వాటికతీతుడవై యుందువు అట్టి నీకు నేను నమస్కరించుచున్నాను.

అగ్ని నీ యొక్క ముఖము (నోరు), భూమి నీ పాదతలము. సూర్యచం ద్రులు నీ నేత్రములు. ఆకాశము నీ నాభి. దిశలు నీ కర్ణములు. నీ శిరస్సుస్వర్గము. దేవేంద్రగణము నీ భుజములు. సముద్రములు నీ యుదరము. ఈ వాయువు నీ ప్రాణశక్తి. అని యుపాసన చేయుటకుగాను రూపములు కల్పింపబడినవి. వృక్షములు, ఓషధులు, నరోమములు, మేఘములు, నీకేశములు, పర్వతములు, నీ యెముకలు, గోళ్ళు, నీవు కనులు తెఱచుట మూయుటయనునవే దివారాత్రములు. నీ జననేం ద్రియమే ప్రజాపతి. సృష్టియే వీర్యము.

నీవవ్యయుడవు. పూర్ణపురుషుడవు. జలమునందనేక సూక్ష్మక్రిములుండు నట్లును, మేడిపండునందనేక సూక్ష్మక్రిములుండునట్లును, ఉపాసనకొరకై కల్పింప బడిన నీమనూమయ పురుషరూప మందనేక జీవజంతుసంయుతములగు బ్రహ్మాండ ములు కల్పితములై సంచరించుచున్నది.

క్రీడనార్థమై భువియందు నీ వేయే రూపముల దాల్చితివో, ఆయవతారము లన్నియు, లోకుల శోకమోహముల కడిగివేయుచున్నవి. అందరును మహానంద ముతో, నీ నిర్మలయశమును గానము చేయుచున్నారు.

వేదములను, ఋషులను, సత్యవ్రతుడు మొదలగు వారెని సంరక్షించుటకై, నీవు మత్స్యావతారమెత్తి ప్రళయ సముద్రమునందు స్వేచ్ఛగా విహరించితివి. నీ మత్స్యరూపమునకు నమస్కారము. మధుకైటభులను రాక్షసుల మ్రందించుటకై నీవేహయగ్రీవుడవుగా నవతరించితివి. హయగ్రీవరూపుడవగు నీకు నమస్కా రము.

నీవే విశాల కచ్ఛపరూపమును ధరించి, మందరాచలము ధరించితివి. అట్టి నీ రూపమునకు నమస్కారము. పృథివి నుద్ధరించుటకై నీవు దాల్చిన వరాహరూపమునకు పునఃపునః ప్రణామములు.

ప్రహ్లాదుని వంటి సాధుజనుల భయముల బొలగించుటకై నీవు దాల్చిన నృసింహరూపమునకు నమస్కారము. వామనరూపమున, నీ పాదములతో ముల్లోకముల నాక్రమించిన నీ త్రివిక్రమావతారమునకు నమస్కారము.

ధర్మోల్లంఘన మొనర్చి గర్వితులై తిరుగుచున్న క్షత్రియ కాంతారమును ఛేదించుటకై భృగుపతివై యవతరించిన, నీ పరశురామ రూపమునకు నమస్కారము. రావణసంహారార్థమై రఘువంశమందవతరించిన నీ శ్రీరామ రూపమునకు నమస్కారము.

వైష్ణవ భక్తులను, యాదవులను, పాలించి పోషించుటకై, వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్న, అనిరుద్ధనామములతో, చతుర్వ్యూహరూపమున నవతరించిన నీకు నమస్కారము.

దైత్యదానవుల భ్రమింప జేయుటకై నీవు, శుద్ధ అహింసా మార్గ ప్రవర్తకుడగు బుద్ధ రూపము దాల్చెదవు. అట్టి నీకు నమస్కారము.పృథివి యందలి క్షత్రియులందరును మ్లేచ్ఛప్రాయులై పోయినప్పుడు, వారిని నశింప జేయుటకై నీవు కల్కి రూపము దాల్చెదవు. అట్టి నీ రూపమునకు నమస్కారము.

శ్లో॥ భగవన్ సర్వలోకోఽయం మోహితస్తవమాయయా
అహం మమేత్య సద్గ్రాహో భ్రామ్యతే కర్మ వర్త్మసు

భగవానుడా, సమస్త జీవులును నీ మాయచే మోహితులై పోవుచున్నారు. 'నేను—నాది' అను అహంకారమమకారములే దానికి కారణము. ఈ యసత్య దురాగ్రహము నందు జిక్కుకొని, వెలికి రాలేక, కర్మ మార్గములందు పరిభ్రమించుచున్నారు. అటులనే నేను గూడ, స్వప్న కల్పములగు. దేహగేహములు, పత్నీ పుత్రులు, ధన—స్వజనములను మిథ్యా పదార్థములందు సత్య బుద్ధి గలవాడనై, వాటి యందలి మోహమున జిక్కి, పరిభ్రమించుచున్నాడను. ప్రభూ, నా మూర్ఖత్వమును గాంచుము. అనిత్య వస్తువులను నిత్యమనియు, అనాత్మ నాత్మ యనియు, దుఃఖమును సుఖమనియు, భ్రాంతిచే భావించుచుంటిని. ఈ విపర్యయబుద్ధికి అంతమే లేకున్నది! ఈ ప్రకారము అజ్ఞాన వశముచేత, సాంసారిక సుఖ దుఃఖములు మొదలుగా గల ద్వంద్వములందే రమించుచు, తమోపహతుడనై, నీవే మా యాత్మ ప్రియుడవను మాటయే పూర్తిగా మరచిపోయి యుంటిని. అజ్ఞాని యగువాడు, జలము కొరకై జలాశయము వద్దకేగి, యందు జలము నాచు మొదలగు వానిచే కప్పబడి యుండుటచే జలము లేదని భావించి వెనుకకు పోవునట్లును, మృగ తృష్ణ యందు నీరున్నదని భ్రమించి పరువెత్తునట్లును, నేను, నీ మాయా మోహితుడనై

యున్న కారణముచేత, నిన్ను వదలి విషయములందు సుఖమున్నదను భ్రాంతిచే వాని వైపు పరువిడుచుంటివి. అవినాశియగు అక్షర వస్తు జ్ఞానము లేనివాడనై యున్నాను. అందుచేతనే నా మనమునందనేక వస్తు కామనలు, వానిని పొందుటకై కర్మ చేయవలయునను సంకల్పములు, పుట్టుచునే యున్నవి. అంతేగాక, ప్రబలములు, దుర్దమనీయములునగు యీ యింద్రియములు గూడ మనస్సును మథించి—మథించి, బలవంతముగ దావి నిటునటు లాగుకొని పోవుచున్నవి. అందుచే నేను నా మనస్సును నిగ్రహించలేక పోవుచుంటిని. ఈ విధముగ సంసార చక్రమందు పరిభ్రమించుచున్న నేను, యీనాటికి, దుష్టులకు దుర్లభములగు నీ చరణ కమలములను గొడుగు నీడకు చేరితిని. దీనిని గూడ నీ ప్రసాదమనియే నేను భావించుచున్నాడను. ఏలననగా, జీవుడు సంసారము నుండి విముక్తి గాంచు సమయ మాసన్నమైనపుడు, సదుపాసన (సత్పురుషులనుపాసించుట) చేత, చిత్తవృత్తి నీయందు లగ్నమగును. ప్రభూ, నీవు కేవలము విజ్ఞాన స్వరూపుడవు. విజ్ఞాన ఘనుడవు. జ్ఞానము లెన్ని యున్నను (ప్రతీతులు), వృత్తులెన్ని యున్నను, వాని యన్నిటికిని కారణము, అధిష్టానము, నీవే యగుచున్నావు. జీవరూపము నను, జీవిని సుఖ దుఃఖాదులకు నిమిత్తములగు, కాల-కర్మ-స్వభావ-ప్రకృతి రూపములుగా నున్నదియు నీవే గదా! అటులనే వాటి సన్నిటినిని యమించు నియామకుడవు గూడ నీవేయై యున్నావు. నీ శక్తుల నంతములు. బ్రహ్మ స్వరూపుడవగు నీకు నమస్కారము. నీవే వాసుదేవుడవు. సమస్త జీవులకు ఆశ్రయుడవు (సంకర్షణుడు) నీవే. బుద్ధి, మనస్సుల కధిష్ఠాతృ దేవత (ప్రద్యుమ్న, అనిరుద్ధులు) వగు హృషీకేశుడవు నీవే. నీకు నమస్కరించుచున్నాను. ప్రపన్నుడనైన నన్ను రక్షింపుము, స్వామీ"యని యక్రూరుడు శ్రీకృష్ణ భగవానుని స్తుతించె.

# నలుబదియొకటవ యధ్యాయము

## శ్రీకృష్ణుని మథురా ప్రవేశము

అక్రూరుడీ విధముగ స్తుతించుచునే యున్నాడు. జలమునందతనికి గాన్పింప జేసిన తన దివ్యరూపమును భగవానుడుపసంహరించినాడు. రంగస్థలమందు నటకుడు తన పాత్ర నభినయించి, తెరమరుగున కేగునట్లు, దృశ్యమంతయు తిరోహితమైనది. దివ్యరూపమంతర్ధానమగుట తెలుసుకొనిన యక్రూరుడు జలమునుండి వెలుపలకేతెంచి, త్వరగా కర్మానుష్ఠానము పూర్తి గావించుకొని, విస్మితుడగుచు రథ సమీపమున కేతెంచె. శ్రీకృష్ణుడు నవ్వుచూ నతనితో "నీవు పృధివియందుగాని, ఆకాశమునందుగాని లేక జలమందుగాని యేదైన యద్భుతమును గాంచితివా యేమి? నీ మొగమునందట్లు గనుపించుచుండుటచే నడిగితిని"అని యక్రూరుని ప్రశ్నించె.

అందుల కక్రూరుడు "ప్రభూ, పృథివ్యాకాశ జలములందే గాదు, సమస్త జగత్తునందును యెన్ని యద్భుత వస్తువులున్నవో, అవి యన్నియు నీ యందే యున్నవి. ఏలననగా, నీవు విశ్వరూపుడవుగదా. నేను నిన్ను జూచుచున్నపుడు, నేను గాంచునట్టి యద్భుత వస్తువింకేది యుండును? పృథివి, ఆకాశము జలముల యందుగాని యేయే యద్భుత వస్తువులుగలవో అవియన్నియును తనయందుగల మహానుభావుడగు నిన్ను నేను గాంచుచున్నాను. అట్టిచో నేనిచట దర్శించిన మహాద్భుతమగు వస్తువు వేరే యేది యున్నది?" శ్రీకృష్ణ ప్రభువుతో గాందినీ నందనుడీ విధముగ బల్కి రథమునెక్కి తోలుచూ, రామకృష్ణ సహితముగ సాయంకాలమగు సరికి, మథురానగరమును సమీపించినాడు. మార్గమధ్యమందలి పల్లెప్రజలు రథము వద్దకువచ్చి, రామకృష్ణుల గాంచి ఆనందపరవశులై పోవుచుండిరి. వారిని చూడగనే తమ దృష్టి మరల్చుకొనలేక పోవుచుండిరి. నందుడు మొదలగు గోపాలురంద రంతకుమున్నే యచటికివచ్చి, మథురానగరోపవనమునందు, బలరామకృష్ణుల కొర కెదురు చూచుచుండిరి. శ్రీకృష్ణుడచట రథమునందు, వినీతభావమున నక్రూరునితో నవ్వుచు, పాణిని గ్రహించి, అయ్యా, మీరు రథముపై ముందుగా మథుర ప్రవేశించి, మీ యింటికి వెళ్ళుడు. మేమిచట ప్రస్తుతము దిగి, నగరమును చూచుట కనంతరము వచ్చెదము" అని పలికె.

ప్రభూ, మీరిరువురు లేకుండ నేను మథురానగరము ప్రవేశింపజాలను. నేను మీ భక్తుడను. భక్తవత్సలా, నన్ను విడనాడకుము. స్వామీ, రమ్ము పోవుదము. నా హితైషివగు సుహృద్వరా, నీవు, నీయన్న, నందరాజు మొదలగు గోపాలు రందరితోగూడ వచ్చి, మా యింటిని పావన మొనర్పుము. నీ పాదోదకముచేత (గంగాజలము లేక చరణామృతము) అగ్నులు, దేవతలు, పితృదేవతలు అంద రును తృప్తిగాంచెదరు. ప్రభూ, నీ పాదయుగములు ప్రక్షాళనమొనర్చి బలిచక్రవర్తి పుణ్యకీర్తిగలవాడై, యేకాంత భక్తులకు లభించునట్టి పరమగతిని పొందినాడు. అనంతైశ్వర్యమునుగూడ పొందినాడు. నీ చరణములనుండి యుద్భవించిన గంగ ముల్లోకములను పవిత్రమొనర్చుచున్నది. ఆమె మూర్తీభవించిన పవిత్రతయే. ఆమె స్పర్శ మాత్రముచేతనే సగరతనయులకు సద్గతి సంభవించినది. ఆ గంగాజలమునే శంకరుడు తన శిరమందు ధరించినాడు. యదువంశ శిరోమణీ, నీవు దేవతలకుగూడ ఆరాధ్యదేవుడవు. జగన్నాథుడవు. నీ లీలాగుణ కథాశ్రవణ, సంకీర్తనములు మహా మంగళప్రదములు. ఉత్తములగు పురుషులు పురుషోత్తముడవగు నీ గుణసంకీర్తన మెల్లపుడు చేయుచుందురు. నారాయణా, నీకు నమస్కారము"

శ్లో॥ దేవదేవ జగన్నాథ పుణ్యశ్రవణ కీర్తన
యదూత్తమోత్తమ శ్లోక నారాయణ నమోఽస్తుతే

అని పలికిన యక్రూరునితో, గోవిందుడు "అయ్యా, నేను అన్నయగు బలరామునితోగూడ మీ యింటికి తప్పక వచ్చెదను. కాని యంతకుముందు యదువంశ ద్రోహియగు కంసుని బరిమార్చి, సుహృజ్జనులందరికి ప్రియమొనర్చెదను" అని పలికె.

భగవానుడీరీతి వచించిన పిమ్మట, కొంచెము సంతృప్తి చెందినవానివలెనై, నగరము ప్రవేశించి, కంసునితో రామకృష్ణులు వచ్చిన వార్త విన్నవించి, తన యింటి కేగినాడక్రూరుడు.

ఆ మరునాడు, మూడవజాముసందు, భగవానుడు, బలరామసహితముగ, గోపబాలురు వెంటరాగా, మధురానగర సందర్శనార్థము బయలుదేరినాడు. స్ఫటిక మయములగు ప్రహారీగోడలు, ఉత్తుంగ గోపురములు గల్గియున్నవి. గృహములు పెద్ద పెద్ద కిటికీలు, బంగారు తోరణములు గల్గియున్నవి. నాల్గువైపుల ప్రహరీ గోడలు (తామ్ర), రాగి, యిత్తడి లోహములతో కట్టబడియున్నవి. చుట్టును పెద్ద యగడ్తయుండుటచే బయటివారు లోనికివచ్చుట చాల కష్టము. లోపల నచ్చటచ్చట సుందరములగు ఉద్యానవనములున్నవి. అంతఃపురస్త్రీ లుపయోగించునట్టి రమణీయ ములగు ఉపవనములు గూడనున్నవి. సువర్ణమయములగు శృంగాటకములు, ధని కుల ప్రాసాదములు, వానికంటియుండు తోటలు, పరిచారకులగృహములు, ప్రజావర్గ సభాభవనములు, సాధారణప్రజలు నివసించుగృహములు, అన్నియు శోభాయమాన ముగనున్నవి. వైడూర్య, వజ్ర, నీల, పగడ, ముత్యము, పచ్చలచే పొదగబడిన పైకప్పులు, అరుగులు, గవాక్షములు, తివాచీలు మొదలగునవి వెలుగులు విర జిమ్ముచున్నవి. వానిపై విహరించునట్టి, పావురములు, మయూరములు మొదలగు పెంపుడు పక్షులు కలరవములు చేయుచున్నవి. రాజమార్గములు, సందులు గొందు లన్నియును, కలాపిజల్లబడి, యచ్చటచ్చట, పూలకుండీలమర్చబడి, మంగళద్రవ్య ములు చల్లబడియున్నవి. ఇంటిముంగిళులయందు దధిచందన చర్చితములగు జల కలశములుంచబడియున్నవి. అరటివృక్షము లమర్చబడియున్నవి. పట్టుపతాకము లెగురుచున్నవి. నగరమంతయు శోభాయమానముగ నలంకరింపబడియున్నది.

వసుదేవనందనులగు బలరామకృష్ణులు తమ సహచరసహితులై రాజమార్గ మున మధురానగర ప్రవేశమొనర్చినారు. వారి సందర్శనాభిలాష గలిగిన నగరనారీ మణులందరు నతిత్వరితముగ ప్రాసాదోపరి భాగములందు చేరినారు. ఆ తొందరలో కొందరు వస్త్రముల నస్తవ్యస్తముగ ధరించిరి. కుండలములు, కంకణములు, కేశా భరణములు, నొక్కొక్కటియే ధరించి, రెండవవానిని ధరించుట మరచినారు మరి

కొందరు. ఒకయామె ఒకచెవికే పత్రమును ఆభరణమును దాల్చినది. ఇంకొకయామె యొకపాదమునకే నూపురమును దాల్చినది. ఒకతె ఒకకంటికే కాటుక పెట్టుకొని పరువెట్టగా, మఱియొకతె కాటుక పెట్టుకొనుటయే మఱచినది. "ఒకయామె భోజనము చేయుచున్నది. ఆమె చేతియందలి ముద్దను విసరివైచి, విసవిస ప్రాసాదాగ్రము చేరి నది. అందరి మానసములు నానందోత్సాహ సంభరితములై పోయినవి. అభ్యంగన స్నానముచేయుటకై యొకయంగన యొంటికి నలుగుబెట్టుకొనుచున్నది. ఇంతలో నామెకు శ్రీకృష్ణాగమన వార్త దెలియరాగా, నామె స్నానమాచరించక యటులనే పై యంతస్థుకు పరువెత్తినది. నిదురించుచున్న యొకతె యా కోలాహలమునకు మేల్కాంచి, ఉన్నదున్నటులే ప్రాసాదమెక్కినది. పిల్లలకు పాలిచ్చుచున్న తల్లులు, పిల్లలను క్రిందబడవైచి, శ్రీకృష్ణదర్శన లాలసలై పరువెత్తినారు.

మదగజమువలె మందగమనముతో మధుసూదనుడు మథురానగర రాజవీధి యందు ముందుకు సాగుచుండె. మహాలక్ష్మికిగూడ మహానందము గలిగించునట్టి, తన శ్యామసుందర మోహన విగ్రహముచే నగర నారీమణులకు నేత్రపర్వము గావించుచు, విలాసపూర్ణమగు తన ప్రగల్భమందహాసము చేతను, ప్రేమపూరిత కటాక్షవీక్షణములచేతను, వారి మానసముల హరించినాడు. మథురానగర మానినులు, చాల దినములనుండియు శ్రీకృష్ణుని యద్భుతలీలలను కర్ణాకర్ణిగ వినుచుండిరి. వారి చిత్తములు చంచలములై, యట్టిమహాత్ముని దర్శించుటకై వ్యాకులపడుచుండినవి. వారందరునేడా మహానుభావుని దర్శించుట సంభవించినది. భగవానుడుగూడ, తన ప్రేమదృక్కులచేతను, మధురమందహాసామృతము చేతను వారిని చక్కగా సన్మా నించినాడు. ఆ నారీమణులు తమ నేత్రములద్వారా భగవానుని తమ హృదయము లందుజేర్చుకొని, అతని యానందమయస్వరూపము నచటనాలింగన మొనర్చు కొనుచుండిరి. వారి శరీరములు పులకించినవి. బహుకాల భరితమైన విరహవ్యథ యుపశమించినది. తమ ప్రాసాద శిఖరాగ్రభాగములందు చేరిన మథురానగర నారీ మణులు రామకృష్ణులపై పుష్పవృష్టిని గురిపించసాగిరి. ఆ సమయమందామానినుల ముఖకమలములు ప్రేమావేశముచే వికసించియున్నవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అచ్చటచ్చట, దధ్యక్షతజలభరిత పాత్రలను, పుష్పహారములను, చందనము మొద లగు కానుకల సమర్పించుచు, ఆనందమగ్నులై రామకృష్ణుల పూజించుచుండిరి. భగవానుని దర్శించిన పురవాసులందరును, అహో, గోపికలెంతధన్యులు! మనుష్య మాత్రులకు పరమానందము కలిగించునట్టి యీ యిరువురు మనోహరకిశోరుల నిత్యము సందర్శించు భాగ్యము కలుగుటకు వారు పూర్వమెట్టి మహాతపస్సాచరించి యుండిరోగదా"యని తమలోతాము గుసగుసలు పోవుచుండిరి.

రామకృష్ణులు యీ విధముగ రాజమార్గమున బోవుచుండగా, వారికొకరజ కుడు గానుపించినాడు. వాడు వస్త్రములకురంగులుగూడ వేయునట్టివాడు. వానినిగాంచి

వాసుదేవుడు, ఉత్తమవస్త్రములిమ్మని యాచించినాడు. "మాకు తగిన వస్త్రములొసంగుము. వాస్తవముగా మేమావస్త్రముల ధరించుటకు యోగ్యులము. నీవుమాకువస్త్రము లొసగినచో నీకు పరమశుభము లభించుననుటలో నెట్టి సందేహములేదు." అని యడిగినాడు.

రాజా, భగవానుడు పరిపూర్ణుడు. సమస్తము అతనిదేగదా! అయినను అతడటుల రజకుని యాచించుట యొకలీల. కాని యా మూర్ఖుడు గుర్తించలేదు. కంసరాజ సేవకుడై నందున గర్వించి యున్నాడు. భగవానుని వస్తువును భగవానునికి సమర్పించుట యను మాట యటుంచి, క్రోధ పరవశుడై, యాక్షేపించుచు నిట్లు పల్కినాడు. "ఏమిటి? మీరంతా యెప్పుడు పర్వతప్రాంతములందు, వనములందు వసించువారు. మీరక్కడ యిట్టి వస్త్రములనే ధరించుచున్నారా? ఉద్రిక్తులైమీరిట్టి పెద్ద పెద్ద మాటలు వాగుచున్నారురా జద్రవ్య మపహరింపదలచుచున్నారా,మూర్ఖుడా వెళ్ళు, వెళ్ళు, కొన్నాళ్ళు బ్రతుకదలచినచో యిటుల పిచ్చిపిచ్చిగా ఆడుగవలదు. రాజకర్మచారులు మీవంటి పొగరుబోతులను కారాగారములందు బడవైచి చావగొట్టి మీ వద్ద నున్న దానిని గూడ లాగుకొనియెదరు" అని ఈ విధముగ ♦ రజకుడు నోటికి వచ్చినట్లు వాగుచుండగా, శ్రీకృష్ణుడు కొంచెము కోపగించి వానికొక చెంప దెబ్బను ప్రసాదించగా, తల, శరీరమునుండి తెగి, యావలబడినది. అది చూడగనే యా రజకుని యధీనమందుండి పనులు చేయుచున్న యనుచరులందరు, వస్త్రముల మూటలనటబారవైచి పలాయనమొనరించిరి. రామకృష్ణులా మూటలయందు తమకు నచ్చిన వస్త్రములను తాము దాల్చి మిగిలిన వానిలో ననేకములను తమ సహచర గోపబాలురచే ధరింపజేసిరి. మిగిలిన వస్త్రములచటనే బారవైచి యటనుండి వెడలి పోయిరి. వారు కొంచెము ముందుకేగగావాయకుడొకడు వారి కగుపించినాడు. *

---

* త్రేతాయుగమున శ్రీరాముని రాజ్యమందు, రజకుడొకడు చారులు విను చుండగా సీతాదేవిపై నిందమోపె. తన భార్య పరుని యింటవసించి రాగా, "పరుని యింట వసించి వచ్చిన దుష్టురాలవగు నిన్నేలుకొనుటకు నేను స్త్రీలోలుడనగు రాముడననుకొంటివా"యని యామెతో ననియె. అది యానోట నానోటబడి సీతపై యపవాదమేర్పడనది భరింపజాలక శ్రీరాముడామెను పరిత్యజించె.అప్పుడు శ్రీరాముడాతని శిక్షింపదలచలేదు. ఆ రజకుడే మథుర యందు జన్మించి, శ్రీకృష్ణునిచే శిక్షింపబడియె.

* వాయకుడనగా సాలెవాడు:— పూర్వమీతడు మిథిలయందు మహా హరి భక్తుడు. శ్రీరాముని వివాహ కాలమునందు జనకుని యాజ్ఞానుసారము రామలక్ష్మణుల యలంకారార్థము వస్త్రముల నేసి యిచ్చె. వివాహసమయమందా వస్త్రముల

భగవానునియనుపపు సౌందర్యముగాంచి వాని కత్యంతప్రీతి కల్గినది. రంగురంగుల విచిత్ర వస్త్రములను, వారిరూపురేఖలకు సరిపోవునట్లువాడు, రామకృష్ణులకు వస్త్రాలంకరణము గావించినాడు. ఆ వస్త్రాలంకరణముచే, రామకృష్ణులత్యంత శోభాయమానులైనారు. ఉత్సవ సమయములందు, శ్వేత శ్యామలమగు కరికలభములలంకరింపబడినట్లు వారు విరాజిల్లినారు. శ్రీకృష్ణుని కావాయకునిపై పరమానుగ్రహముకల్గినది. వాని కిహలోకమందు పరిపూర్ణధన-సంపత్తి, బలైశ్వర్యములు, భగవత్స్మృతి, అతీంద్రియజ్ఞానము మొదలగుశక్తులను ప్రసాదించి, దేహాంతము నందాతనికి సారూప్యముక్తి లభించునట్లను గ్రహించినాడు.

అనంతరము భగవానుడు తన వారందరితో * సుదాముడను మాలాకారుని యింటికేగినాడు. ఆ సోదరులను చూచుటయే తడవుగ సుదాముడు లేచి నిల్చుండి, భూమిపై సాష్టాంగ దండ ప్రణామము గావించినాడు. మరల లేచి, వారి నాసనములపై కూర్చుండబెట్టి, పాదప్రక్షాళనమొనర్చి, చేతులు గడిగి, యాచమనాదులొసంగిన యనంతరము, సహచరసహితముగ రామకృష్ణులకు, పుష్ప హారములను, చందన తాంబూలాది సామాగ్రుల సమర్పించి, యథావిధిగ బూజించినాడు. పిమ్మట "ప్రభూ, మీ యిరువురి శుభాగమనముచే మా యందరి జన్మములు ధన్యములైనవి. మేము మా కులము పవిత్రులమైతిమి. నేడు మా పితరుల, ఋషుల, దేవతల ఋణము నుండి మేము విముక్తులమైతిమి. వారు మాపై పరమ సంతృప్తులైనారు. మీరు యిద్దరు సర్వ జగత్కారణులు. మీరు సంసారమందభ్యుదయము, ఉన్నతి, మోక్షము కలిగించుట కొరకే, పృథివిపై జ్ఞాన బలాది శక్తియుతముగ నవతరించిన మహానుభావులు. మిమ్ము ప్రేమించువారలనే మీరు ప్రేమించువారైనను, మిమ్ము సేవించువారినే సేవించువారైనప్పటికిని, మీ దృష్టి యందు వైషమ్యము లేదు. ఏల ననగా మీరు సమస్త జగత్తున కాత్మ స్వరూపులు సర్వసములు గావున, నేను మీ

---

ధరించియున్నవారిని గాంచి, 'యీ సుందర కుమారులకు నేను స్వహస్తములతో వస్త్రాలంకరణ గావింపవలయునని మనసా వాంఛించినాడు. అది గుర్తించిన శ్రీరామచంద్రుడు మనసునందే పరమొసంగె. అతడే మధురయందు జన్మించి రామకృష్ణులకు వస్త్రాలంకరణ మొనర్చి, సారూప్య ముక్తి నందినాడు.

* కుబేరుని చైత్రరథమను ఉద్యానవనమునందు హేమమాలియను పుష్ప బటుకుడొకడు, కృష్ణానుగ్రహప్రాప్తికై నిత్యము మూడు వందల పద్మములతో శివుని పూజించుచుండెడివాడు. ఇన్నైదువేల సంవత్సరములు పూజించగా శివుడుప్రత్యక్షమై వరము గోరుకొమ్మన, శ్రీకృష్ణ దర్శనముచే వరముగా గోరినాడు. ద్వాపరాంతమున నీ మనోరథ మీడేరగలదని శివుడనుగ్రహించె. అతడే సుదాముడుగా జన్మించి శ్రీకృష్ణానుగ్రహ ప్రాప్తి నందినాడు.

దాసుడను. నేను మీకేమి యొనర్పవలయునో నాకానతీయుడు. మీరాజ్ఞ యొసంగి పని చేయించుకొనుట, యా జీవునిపై మీకుగల గొప్ప యనుగ్రహము, పరిపూర్ణ దయయే యగును" యని యీ విధముగ ప్రార్థించిన యనంతరము సుదాముడు భగవానుని యభిప్రాయము గ్రహించి, శ్రేష్ఠములగు సుగంధ సురభిళ పుష్పములచే గూర్చిన గొప్ప మాలనాతని కంఠమందలంకరించినాడు. భగవానుడు తనను, తన వారందరిని గూడ చక్కగా నలంకరించిన సుదాముని యెడల ప్రసన్నుడై, శరణాగతుడైన యాతనికి శ్రేష్ఠవరమొసంగినాడు. సుదాముడు భగవానుని "ప్రభూ, నీవు సర్వప్రాణుల కాత్మ స్వరూపుడవు. అఖిలాత్ముడవగు నీ చరణకమలముల యందు నాకు నిశ్చల భక్తి యుండునట్లనుగ్రహింపుము. నీ భక్తులతో నాకు సాంగత్యము కలిగి యుండునట్లును, నాకు వరమొసంగు"మని ప్రార్థించినాడు. భగవానుడతడు కోరినదంతయు నొసంగుటయేగాక, వంశపారంపర్యముగ నభివృద్ధి గాంచునట్టి మహదైశ్వర్యమును, ఆయు, బల, కీర్తి, కాంతులను గూడ వరముగా నిచ్చినాడు. అనంతరము రామకృష్ణులచటి నుండి తమ వారందరితో తరలినారు.

# నలుబది రెండవ యధ్యాయము

## కుబ్జననుగ్రహించుట—ధనుర్భంగము-కంసుని యారాటము

శ్రీశుకులిట్లు చెప్పుచున్నారు.

"పరీక్షన్మహారాజా, అనంతరము మిత్రమండలీ సహితుడైన మాధవుడట నుండి కదలి రాజమార్గమున బోవుచు, నొక యువతిని గాంచినాడు. ఆమె మొగము సుందరముగనే యున్నది. కాని శరీరము గూని గలిగియున్నది. అందుచే నామెకు "కుబ్జ" యను అన్వర్థనామ మేర్పడియున్నది. ఆమె చేతియందు చందన పాత్ర యుంచుకొని పోవుచున్నది. శ్రీకృష్ణ భగవానుడు ప్రేమ రసమును ప్రసాదించువాడగుటచే కుబ్జయందాతని కనుగ్రహము కల్గినది. నవ్వుచూ, నతడామెతో నిట్లు

---

* శ్రీరాముని యరణ్యవాసకాలమందు అతని పొందజాలకపోయిన శూర్పణఖ పుష్కర తీర్థమున 10 వేల సంవత్సరములు రామేశ్వరుని గూర్చి తపమొనర్చి, "శ్రీరాముని తనకొసంగు"మని వేడినది. ద్వాపరాంతమున నీ కోరిక దీరగలదని శంకరు డనుగ్రహించె, ఆమెయే కుబ్జగా ననుగ్రహముబడసె.

పల్కె, "సుందరీ, నీవెవరవు? ఈ చందన మెవరికొరకు గొనిపోవుచుంటివి? కల్యాణీ, మాకు యథార్థ మెఱింగిపుము. ఈ యుత్తమ చందనము, అంగరాగము మాకు గూడ యిమ్ము. ఈ దానముచే నీకు శీఘ్రముగనే పరమ కల్యాణము లభింప గలదు."

అని పల్కిన భగవానునితో, సైరంధ్రియగు కుబ్జ యిటుల పల్కినది. "పరమ సుందరా, నేను కంసునికి దాసిని. మహారాజు నన్ను చాల గౌరవించును నన్ను "త్రివక్ర" యందురు. చందనాంగరాగాది యను లేపనముల తయారు చేయు చుందును. నేను తయారు చేసిన చందనము, అంగరాగాదులనిన, భోజరాజునకు చాల యిష్టము. కాని వాటికి, మీకంటె గొప్ప యోగ్యతగలవారెవరును లేరు."

భగవానుని సౌందర్యము, సౌకుమార్యము, మందహాసము, ప్రేమాలాపము, రసికత, స్నిగ్ధా పాంగ వీక్షణములచే, కుబ్జ మానస మామె వశము దప్పిపోయినది. భగవానునిపై తన హృదయము సమర్పించినది. రామకృష్ణులిర్వురికి ఆమె సుందర చందనాంగరాగాను లేపన సమర్పణమొనర్చినది. శ్యామసుందరుడు తన శరీరముపై సువర్ణాంగరాగమును ధరించగా, గౌరవర్ణుశరుణాంగ రాగమును పట్టించినాడు. నాభికి పైభాగమునందీ విధముగ నంగరాగమలదుకొనుటచే వారత్యంత సుందర తనూ శోభతో నొప్పారుచుండిరి. కుబ్జపై భగవాను డమిత ప్రసన్నుడైనాడు. తనను దర్శించినందు కామెకు ప్రత్యక్ష ఫలము నొసంగదలచినవాడై మూడు వంకరులు గలిగియున్నను సుందరముఖి యగునామె వంకరలు దీర్ప సంకల్పించినాడు. భగ వానుడు తన రెండు చరణములను, కుబ్జ పాదములపైనుంచి నొక్కిపెట్టి, రెండుచేతి వ్రేళ్ళ నామె గడ్డముక్రింద పెట్టి యొక్కయుదుటున పైకెత్తి లాగగా, నామె శరీర మందలి వంకరలంతర్హితములై శరీరము తిన్నగా వచ్చినది. ప్రేమదాత, ముక్తి దాతయునగు ముకుందుని స్పర్శచే, యామె సౌందర్యమినుమడించి, పీననితంబ పయోధరములు గల యుత్తమ తన్వంగిగా నామె రూపొందినది.

ఆ క్షణమందే యామె రూప, గుణౌదార్య సమేతయగుటచే నామె మానస మందు భగవత్సంగమాభిలాష యంకురించినది. అతని యుత్తరీయాంచలమును, నవ్వుతూ లాగినది. "వీర శిరోమణీ! రమ్ము, మా యింటికి బోవుదము. ఇపుడు నేను నిన్నిచట వదలి వెళ్ళజాలను. ఏలననగా నీవు నా చిత్తమును మథించితివి. పురుషోత్తమా! నీ దాసినగు నాపై ప్రసన్నుడవగుము" అని యీ విధముగ, బల రాముని సమీపమునందే, ప్రార్థించగా, భగవానుడు తన సహచరులగు గోపబాలుర వంక సాభిప్రాయముగ జూచుచు, మందహాస మొనర్చి కుబ్జతో నిట్లు పల్కినాడు. "సుందరీ, నీ యిల్లు లోకులకు తమ మానసిక వ్యాధి తొలగించుకొనుటకు సాధ నమై యున్నది. నేను నా కర్తవ్యమును పూర్తి గావించిన యనంతరము తప్పక

నీ యింటికి వచ్చెదను. ఇల్లులేనట్టి మావంటి పొందులకు, నీ యిల్లేగదా యాశ్రయము!'' అని తియ్యగా మాటలాడి, భగవానుడామెకు వీడ్కోలు చెప్పి, విపణి వీథుల (వర్తక స్థలములు) జేరగా, నచటి వ్యాపారులందరు వారికి, తాంబూలము పుష్పహారములు చందనము మొదలగు రకరకములగు కానుకల సమర్పించి, యాదరించిరి. భగవంతుని దర్శించిన మాత్రముచేతనే యచటి స్త్రీల హృదయములందు ప్రేమ యుప్పొంగి, సమాగమాభిలాష యుదయించినది. వారి శరీరములనే వారు మఱచిపోయిరి. వారికి, వస్త్రములు, కేశపాశమును, కంకణములు, జారిపోవుచుండుటనుగూడ గమనించలేనంతటి యపస్మారకస్థితి యేర్పడినది. చిత్తరువులవలె నిశ్చేష్టలై నిలబడిపోవుచుండిరి.

అనంతరము పురవాసుల నడిగి తెలుసుకొనుచు, శ్రీకృష్ణాదులు ధనుర్యాగ స్థలమును జేరిరి. ఇంద్రధనుస్సుతో సమానమగు అద్భుత ధనుస్సొకటి యచట నగుపడినది. ఆ ధనుస్సు చక్కగా నలంకరింపబడి, యనేక వీరవరులచే రక్షించబడుచున్నది. అచ్చటి రక్షకభటులు వారించుచున్నను వినక, శ్రీకృష్ణుడా ధనుస్సును బలాత్కారముగ నెత్తినాడు. అందరు చూచుచుండగా నతడెడమ చేతితో ధనుస్సునెత్తి, నారిదగిలించి, యెక్కుపెట్టి గట్టిగాలాగి, యా ధనుస్సును మధ్యకు విరుగగొట్టినాడు. అది, మదించియున్న మాతంగము, చెఱకుగడను విరిచినట్లున్నది. ధనుర్భంగముచే గలిగిన మహాశబ్దము భూనభోంతరాళముల దద్దరిల్లజేసినది. ఆ శబ్దమాలించిన కంసుడు భయభీతుడై పోయినాడు. ధనుస్సును రక్షించుచున్న వీరులు, ఆతతాయులగు అసురులందరును కుపితులై. 'పట్టుకొనుడు, బంధించుడ'ని యఱచుచు రామకృష్ణులను చుట్టుముట్టిరి. వారి దురభిప్రాయమును గ్రహించి రామకృష్ణులు ఆ ధనుఃఖండములనే యాయుధములుగా గ్రహించి, వారందరినంతమొందించిరి. వారికి సహాయముగా కంసుడు పంపిన సైనికులనుగూడ యటులే మర్దించిరి. అనంతరము, యజ్ఞశాలయొక్క ప్రధానద్వారమునుండి, తమ యనుచరసహితముగ రామకృష్ణులు వెలువడి, మథురానగర శోభను తిలకించుచూ పోవుచుండిరి. ఈ యద్భుత కార్యమును గూర్చి వినియు, వారి సుందరరూపమును గాంచియు, నగరవాసులందరును, వారు తప్పక యే దేవతలోయై యుందురను నిశ్చయమునకు వచ్చినారు. ఈ విధముగ రామకృష్ణులు స్వేచ్ఛగా నగరమునందు విహరించి సాయంకాలముకాగానే గోపబాలసహితముగ, నందాదులు విడిసియున్న యుపవనము చేరినారు. [ముల్లోకములందలి ముఖ్యదేవతలందరును, లక్ష్మీదేవి తమను వరించవలయునను కోరికతో నుండగా, ఆ దేవి వారందరిని తిరస్కరించి, తనను వరించనట్టి వైకుంఠుని వరించినది. సర్వదా యతనినే తన నివాసస్థానముగా చేసుకొన్నది. అట్టి పురుషభూషణుడగు వాసుదేవుని యంగాంగ సౌందర్యమును మథురావాసులు

కనుల కరవుదీర గాంచుచుండిరి. గోకులమందు రామకృష్ణులు బయలుదేరు సమయమందే యే మాటలు పలికియుండిరో, యవియన్నియు నక్షరాలా నిజమైపోయినవి. నిజముగనే మధురావాసులు పరమానంద మగ్నులైపోయిరి. రామకృష్ణులు, కాలు సేతులు కడుగుకొని, పాయసాన్నముతో గూడిన మధుర భోజనమును భుజించి, యటుపై కంసుడేమి చేయదలంచుచుండెనో యని యాలోచించుచు, ఆ రాత్రియందచటనే సుఖముగా నిద్రించిరి.

అట కంసుడు, బలరామకృష్ణులు ధనుర్భంగము గావించిరనియు,రక్షకులను, వారికి సహాయముగా బంపిన సైనికులనందరిని వధించిరనియు, అదియంతయు వారికొక యాటగా నుండెననియు, శ్రమ యేమియు లేకుండెననియు తెలియగనే యతనికత్యంత కలవరము కలిగినది. ఆ దుష్టునకు చాలా సేపటివరకు నిద్రపట్టలేదు. జాగ్రత్స్వప్నావస్థలందతనికి కనేక దుశ్శకునములు కలిగినవి. అవియన్నియు నతని మృత్యువునే సూచించుచుండె. జాగ్రదవస్థ యందతనికి జలమునందుగాని యద్దము నందుగాని, తన ప్రతిబింబము శిరోవిహీనముగా నగుపడినది. ఎటువంటి యడ్డు లేకుండినను, చంద్రుడు నక్షత్రములు మొదలగునవి- ఒక్కటిగా నున్నవి, రెండు రెండుగా గనుపడుచుండె. తన నీడయందు రంధ్రములు గానుపించినవి. చెవుల యందు వ్రేళ్ళు జొనిపి వినిననుగూడ ప్రాణఘోష వినుపడుటలేదు. వృక్షములు బంగారు వర్ణములో గన్పించుచుండె. ఇసుకయందుగాని బురద యందుగాని, తన పాదచిహ్నములు కాన్పించుటలేదు. స్వప్నమందాతనికి, ప్రేతలాలింగనముచేసుకొనినట్లును, తాను గాడిదపైనెక్కి యూరేగుచున్నట్లును, విషము భుజించుచున్నటులును, దృశ్యములు గోచరించినవి. తన శరీరమంతయు తైలసిక్తమై యుండి, మెడయందెర్రని జపాకుసుమల ధరించి, దిగంబరముగా నెక్కడికో వెళ్ళుచున్నట్లు కన్పించినది. జాగ్రత్స్వప్నావస్థలు రెంటియందుగూడ యిట్టి యనేక యపశకునములతనికి గోచరించినవి. దానిచే నతనికి తాము మరణింతునను భయము కలిగి, నిద్రపట్టకుండె.

రాత్రి గడిచినది. ప్రాగద్రిపై భానుబింబము గోచరించినది. వెంటనే కంసుడు మల్లక్రీడా మహోత్సవమును ప్రారంభించుటకు ముదల యిచ్చినాడు. రాజ కర్మచారులు, మల్లక్రీడారంగమును మహా శోభాయమానముగ నలంకరించిరి. భేరీతూర్యాది వాద్యములు మాఱుమ్రోగుచున్నవి. పుష్పహార, పతాక, తోరణాదులతో మంచెలలంకరింపబడినవి. వానియందు, పౌరులు, జానపదులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, రాజులు మొదలగు వారందరును, తమకు నిర్ణయింపబడిన ప్రదేశము లందుపవిష్టులై యుండిరి. కంసమహారాజు, తన మంత్రులు, మండలేశ్వరులు

పరివేష్టించియుండగా, వారిమధ్యనొక యున్నతరాజ సింహాసనముపై నధిష్ఠించినాడు. అప్పుడుగూడ,అపశకునముల కారణముచే నతని మానస మాందోళితమైయేయున్నది. మల్లయోధుల చప్పట్లతోపాటు తూర్యారావములు మ్రోగినవి. బలగర్వితులైన మల్లయోధులు బాగుగా నలంకరించుకొని, తమ తమ గురువులతోగూడ మల్లరంగస్థలము నందు చేరినారు. చాణూర, ముష్టిక, కూట, శల, తోశలాది ప్రధాన మల్లయోధులు, సుమధుర వాద్య శ్రవణముచే నుత్సాహితులై, రంగస్థలమును జేరి యుపవిష్టులైరి. ఆ సమయమునకు కంస మహారాజు నందాది గోపాలురనుగూడ పిలిపించినాడు. వారందరును వచ్చి, తాము తెచ్చిన రకరకములగు నుపాయనముల రాజునకు సమర్పించి, వారికి కేటాయించిన మంచెపై కేగి కూర్చుండిరి.

# నలుబది మూడవ యధ్యాయము

## కువలయాపీడమోక్షము-రంగప్రవేశము

శ్రీకృష్ణబలరాములు, స్నానాది శౌచకృత్యములు నిర్వర్తించుకొని, మల్లయుద్ధమున కనురూపములైన వాద్యఘోషలనువిని, మల్లరంగమును చూచుటకై బయలుదేరిరి. రంగభూమియొక్క ద్వారము చేరుసరికి, అచట మావటివానిచే ప్రేరితమై యడ్డుగానిలిచియున్న * కువలయా పీడగజమును కృష్ణుడు చూచినాడు. తన

---

*** కువలయాపీడుడు :**

ఇతడు పూర్వము బలిచక్రవర్తియొక్క కుమారుడు. మందగతియను పేరు గలవాడు. లక్షయేనుగుల బలముగలవాడు. ఒకనాడాతడు రంగయాత్రకు బయలుదేరి జనమధ్యమున మహావేగముగ బోవుచుండనతని భుజములు తగిలి జనులు నలిగిపోవుచుండిరి. అతనివేగముచే క్రిందబడిన "త్రితుడ"ను వృద్ధముని కోపించి "యోరీ, మదోన్మత్తుడవై మందగజమువలె జనులమర్దించుచు బోవుచుంటివి గావున, నీవు మదగజముగా జన్మించుమని" శాపమొసంగె. మునిపాదములపై బడి యతడు వేడుకొనగా కరుణించి, "హరిపురమగు మధురయందు ద్వాపరాంతమున శ్రీకృష్ణుని వలన నీకు ముక్తి లభింపగలదని యనుగ్రహించె. అతడే కువలయాపీడుడను పేర వింధ్యపర్వతమునందు మదపుటేనుగుగా జన్మించినాడు. మాగధేంద్రుడగు జరాసంధుడు, వింధ్యపర్వతమునందు బలాత్కారముగా పట్టుకొనిన లక్షయేనుగులతో కువలయాపీడుడు గూడనొకడు. జరాసంధు డీ యేనుగులను తన యల్లుడగు కంసునకు కాన్కగా నొసంగినాడు.

త్రితముని వాక్యానుసారము గోపాలదేవుని చేతియందు మరణించి భగవానుని యందైక్యమైనాడు కువలయాపీడుడు.

[గర్గసంహిత]

పట్టుదట్టీని బిగించి, యెగిరిపడుచున్న ముంగురులను సర్దుకొని, శ్రీకృష్ణుడు మేఘ గంభీరస్వరమున మావటీవానిని కన్పింపుచు, "ఓ మావటీడా! మాకు మార్గమొసం గుము. మా మార్గము నుండి యావలకు తొలగిపొమ్ము. అరే, వినపడుటలేదా? జాగు చేయకుము. లేనిచో, నిన్ను నీ యేనుగుతోసహా, యమరాజునొద్దకు పంపెదను." అని బెదిరించగా మహామాత్రునకు మహాక్రోధము కలిగి, కాలమృత్యువు, కాలయముని వలె మహాభయంకరముగనున్న కువలయాపీడము నంకుశముతో నొక్క పోటు బొడిచి, శ్రీకృష్ణునిపై పురిగొల్పెను అదియును కోపించి కృష్ణునిపై కురికి యాతనిని తొండముతో నాడిసిపట్టెను. భగవానుడును కరీంద్రము నొక గ్రుద్దుగుద్ది, దాని పట్టు నుండి తప్పించుకొని, దాని కాళ్ళమధ్యకుపోయెను. అదియు, తనముందు భగ వానునిగానక, తన తొండముతో వాసన జూచి, మరల పట్టుకొనియె. కాని బల పూర్వకముగ దానినుండి భగవానుడు విడిపించుకొని, వెనుకవెళ్ళి, దానితోక బట్టు కొని యెదునూర్లబారలావలబడునట్లు, లీలగావిసరివైచె దూడలతో బాలురాడుకొను నట్లు భగవానుడు కువలయాపీడము యొక్క తోకబట్టుకొని, గరుడుడు సర్పమును విసరివైచునట్లు, విసరివైచుచు నాడుకొనసాగినాడు. అది యెడమవైపునుండి పట్టు కొన ప్రయత్నించునపుడు గోవిందుడు కుడివైపునకు వచ్చుచుండె. కుడివైపు పట్టు కొందమన్న ఎడమవైపున కేతెంచుచుండె. అనంతరమాతడు యేనుగుముందు భాగ మునకేవచ్చి, దాని కుంభస్థలముపై నొక గ్రుద్దుగుద్ది దానిని వంచించుచు పరుగెత్తి దానిని క్రిందబడునట్లు జేసినాడు. భగవానుడు క్రిందబడెనని తలచి యాగజమునేల పైబడి, రెండు దంతములతో నేలను గ్రుచ్చినది. భగవానునే గ్రుచ్చిచంపవలయు నని దాని యుద్దేశ్యము. కాని భగవానుడచట లేనందున దాని ప్రయత్నము వ్యర్థమై పోయినది. దానితో దానికోపము మరింత వృద్ధిచెందినది. మహామాత్రునిచే నింకను ప్రోత్సహించబడినదై, కువలయాపీడము కృష్ణునిపైకి విజృంభించినది. అదిగాంచి యశోదాతనయుడు దాని తొండమును గట్టిగాబట్టి లాగి నేలపైబడవైచి, సింహము వలె దానికుంభస్థలముపైకి లంఘించి, పాదములతో నదిమిపట్టి, దానిదంతము లూడ బెరికి, వానితో మదగజమును, మావటివానిని యమపురికంపె.

మరణించిన మదగజము నచటనే వదలి, దాని దంతమునే యాయుధముగా ధరించి, భగవానుడు మల్లరంగమును ప్రవేశించినాడు. అతని భుజముపై గజదంతా యుధమున్నది. శరీరమందంతటను గజమదపు చుక్కలును, రక్తపు చుక్కలును పడియున్నవి. మొగముపై శ్రమాంబువులు తళ తళ మెరయుచున్నవి. గజదంతము నొకటి బలరామునికిచ్చి, యిరువురును దంతాయుధులై రంగ ప్రవేశ మొనర్చిరిగాన యా దంతములు వారి భుజములపై యాయుధములవలె శోభిల్లుచుండె. కొద్దిమంది గోపపాలురు గూడ, రామకృష్ణుల వెంట రంగస్థలమును ప్రవేశించిరి. ఆ సమయ మునను, శ్రీకృష్ణుని గాంచిన వారికి, భిన్న భిన్న భావములు కల్గినవి.

శ్లో. మల్లానామశనిర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోశ్శిశుః
మృత్యుర్భోజ పతేర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినాం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగంగతస్సాగ్రజః

మల్లులకు వజ్ర (పిడుగు) కఠోర శరీరుడుగ గన్పట్టినాడు. సాధారణమనుజులకు మానవ శ్రేష్ఠుడను భావము కల్గినది. స్త్రీలకు మూర్తీభవించిన మన్మథుని వలె యగుపడె. గోపాలురకు తమ స్వజనుడను భావముదయించె. దుష్ట భూపాలురకు దండించునట్టి శాసకునివలెను, తమ పితరులకు శిశువువలెను, దోచగా, కంసునకు మృత్యు దేవత వలెనే గోచరించినాడు. అజ్ఞానులకు విరాట్పురుషుని వలెను, యోగులకు పరతత్త్వమువలెను, భక్త శిరోమణులగు వృష్ణి వంశీయులకు తమ యిష్ట దైవముగను గోచరించినాడు. ఈ విధముగా నందరును, తమ తమ భావానుగుణముగా వరుసగా, రౌద్ర, అద్భుత, శృంగార, హాస్య, వీర్య, వాత్సల్య, భయానక, బీభత్స, శాంత, ప్రేమ భక్తి రసానుభూతి ననుభవించిరి.

కంసుడు మహాధీరవీరశూరుడైయైనను, రామకృష్ణులు కువలయాపీడమునుగూడ హతమొనర్చి వచ్చిరను విషయము వినగనే, వారిని జయించుట చాల కష్టమను భావ మాతనికి కలిగి, యాందోళిత హృదయుడాయె. రామకృష్ణులాజానుబాహులు. పుష్ప హారములతోడను, అ భూషణాదులతోడను వారి వేషము అత్యంత విచిత్రమైయుగ నున్నవి. ఉత్తమ వేషముల ధరించిన యిరువురు నటశ్రేష్ఠులు నాటకరంగ స్థలము పైకి వచ్చినట్లున్నది. ఎవరి నేత్రములైనను ఒక్క పర్యాయము వారిని గాంచినచో నపి యక్కడనే లగ్నమైపోవుచుండినవి. అంతేగాదు వారి మనస్సులను గూడవారు హరించుచుండిరి. ఈ ప్రకారము రంగస్థలమునకు శోభను చేకూర్చుచున్న యా ఇరువురు సోదరులను గాంచిన మంచెలపైనున్న సర్వజనులును మహాహర్షము నొందు చుండిరి. వారి మానసములు వికసించినవి. తమ నేత్రముల ద్వారా రామకృష్ణుల ముఖ మధురిమను పానము చేయుచు, నెంతకును తృప్తి గాంచకుండిరి. వారు తమ నేత్రములతో (నామధురిమను) పానము చేయుచున్నటులను, నాలుకతో నాకుచున్నట్లును, ముక్కుతో వాసన చూచుచున్నటులును, మఱియు భుజములతో పట్టుకొని హృదయములోనికి గొంపోయి యాలింగనము జేసుకొనుచున్నటులను గోచరించుచుండె. రామకృష్ణుల సౌందర్యము, గుణములు, మాధుర్యము, నిర్భయతచూచు వారలకు వారి లీలలను జ్ఞప్తికి దెచ్చుచుండినవి. అందుచే వారా లీలలకు సంబంధించిన, తాము - చూచి - వినియున్న విషయముల నొకరికొకరు చెప్పుకొనుచు వినుచు నానందించుచుండిరి. "వీరిరువురు సాక్షాన్నారాయణాంశజులు. ఈ భూమిపై వసుదేవుని గృహమందవతరించినారు. ఈ

నల్లని సుకుమారుడు (చేతితో చూపుచు) దేవకీ గర్భశుక్తి ముక్తా ఫలము. ఈతడు జన్మించగనే వసుదేవుడీతనిని గోకులము నందు జేర్చినాడు. ఇంత దనుక యితడచటనే రహస్యముగ నంద గృహము నందే వర్థిల్లుచు నింతవాడైనాడు. ఇతడే పూతన, తృణావర్త, శంఖచూడ, కేశి, ధేనుకాద్యనేక దుష్ట రాక్షసుల వధించినాడు. యమళార్జున వృక్షముల బడగొట్టి, నలకూబరమణిగ్రీవులకు శాపమోక్షము గల్గించినాడు. ఇతడే గోవులను గోపకుమారులను దావానల జ్వాలలనుండి రక్షించినాడు. కాళీయుని మర్దించినాడు. ఇంద్రునికి గూడ గర్వభంగము నితడే గావించినాడు. ఏడు దినము లేకధాటిగా నెడమ చేతిపై గోవర్ధన పర్వతము నెత్తి, గాలివాన, వరదలు, వజ్రపాతముల నుండి గోకులమును గాపాడిన గోవర్ధనగిరిధారి యితడే. ఇతని మధుర మందహాసము, ప్రేమావలోకనము, ప్రసన్న ముఖమును దర్శించిన గోపికలానంద పరవశలై, యనాయాసముగ తమ సర్వ తాపముల నుండియు విముక్తలగుచుండిరి. వీరు యదు వంశ రక్షకులనియు చెప్పబడుచున్నారు. విఖ్యాతమగు యదు వంశము, వీరివలన సంపత్సమృద్ధమై, యశోగౌరవముల నందగలదు. రెండవ కమల నయనుడు, శ్యామసుందరుని యగ్రజుడగు బలరాముడు. ఇతడు, ప్రలంబాసుర, వత్సాసుర బకాసురాదుల వధించిన పరాక్రమశాలి యని యెవరో చెప్పగా విని యుంటిమి.

ప్రేక్షకు లీవిధముగ చర్చించుకొనుచుండగా, మల్లరంగ స్థలమునందు మేళములు మ్రోగినవి. చాణూర ముష్టికులు రామకృష్ణులను సంబోధించుచు నిట్లు పలికిరి. "నందనందనా శ్రీకృష్ణా, బలరామా, మీరిరువురును వీరులకు ఆదరణీయులు. మీరు మల్లయుద్ధ ప్రవీణులని విని, మీ కౌశలమును వీక్షించుటకై మన మహారాజు మిమ్ముల నిక్కడకు పిలిపించినారు. మనోవాక్కాయ కర్మలచే మహారాజునకు ప్రీతి కలిగించు ప్రజలకు మేలు చేకూరును. రాజాభీష్టమునకు వ్యతిరేకముగ ప్రవర్తించు వారలకు హాని కలుగును. ఆవులను దూడలను గాచుచు తిరుగుచుండు గొల్లవారు, నిత్యము ఆనందముగా వనములందు తిరుగుచు కుస్తీపట్లు పట్టుచు నాడుకొనుచుందురను విషయము సర్వజనులకు విదితమే గదా. కావున రండి. మీరు, మేము కలిసి, మహారాజునకు వినోదము కల్గించుటకై కుస్తీ పట్టుదుము. అట్లు చేసినచో, రాజు సర్వభూతమయుడు గావున, మనపై సర్వులును ప్రసన్నులగుదురు" అని పలికిరి.

భగవానునికి వారితో చేతులు గలుపవలయుననియేయున్నది. కావున యాతడు చాణూరుని వాక్యముల కనుమోదము తెల్పుచు, దేశకాలానుసారముగ నిట్లు పల్కె. "చాణూరా, మేము గూడ యీ భోజరాజునకు, వనవాసులగు ప్రజలమే. కావున రాజునకు ప్రసన్నత కలుగు ప్రయత్న మొనర్చుట మాకు గూడ కర్తవ్యమే. దాని

యందే మాకు గూడ శుభముగలదు. కాని, చాణూరా, మేమింకను చిన్నపిల్లలము-కావున మా యీడుగల పిల్లలతో కుస్తీయాట యాడెదము. మల్లయుద్ధమనునది సమాన వయస్సు, బలముగల వారి మధ్యనే జరుగవలయును. దానిచే, ప్రేక్షకులకు సభాసదులకు, అన్యాయమును సమర్థించిన పాపము కలుగకుండును."

ఆ మాటలు విని చాణూరుడు భగవానునితో నిట్లు పల్కె. "అయ్యా, నీవు, బలరాముడు బాలకులుగారు కిశోరులు గారు. మీరు బలవంతులలో శ్రేష్ఠులు. ఇప్పు డిప్పుడే మీరు, వేయి యేనుగుల బలముగల కువలయాపీడమను గజమును లీలగా వధించి వచ్చితిరి గదా! కావున మీరు మావంటి బలశాలురతో యుద్ధము చేయుటయే యుచితము. ఇందనయము (అన్యాయము) యేమియులేదు. కావున శ్రీకృష్ణా, నీవు నాపై విక్రమింపుము బలరామునితో, ముష్టికుడు యుద్ధమొనర్చు"ననియె.

# నలుబదినాల్గవ యధ్యాయము

## చాణూర ముష్టికాదుల మోక్షము—కంస మోక్షము

శ్రీకృష్ణ భగవానుడు, చాణూర ముష్టికాదులను నిశ్చయముగా వధించ సంకల్పించినాడు. జోడీలు కుదిరినవి. శ్రీకృష్ణుడు చాణూరునితోను, ముష్టికుడు బలరామునితోను తలపడినారు. ఒకరి నొకరు జయింపవలయునను పట్టుదలతో, చేతులతో చేతులను, పాదములతో పాదములను గలుపుకొనుచు తమ వైపుకు లాగు కొనుచుండిరి. చేతులతోను మోకాళ్ళతోను, తలలతోను, వక్షఃస్థలములతోను ఒకరి నొకరు పొడుచుకొనుచు యెదుటి వారికి గాయము కలుగచేయనూహించు చుండిరి. ఒకరి నొకరు పట్టుకొనుచు విసరివైచుచు-క్రిందబడుచు-పైకి లేచుచు-యెత్తి క్రింద బడవైచుచు ననేక విధములగు మల్లయుద్ధ ప్రావీణ్యమును గనపరచుచు రంగస్థల మందు పరిభ్రమించుచుండిరి.

ఈ మల్లయుద్ధమును తిలకించుటకై యనేకమంది మధురానగర మహిళలు నా సభకు విచ్చేసియుండిరి. మల్లయోధులగు చాణూర ముష్టికులతో బలహీనులగు చిన్నపిల్లలు పోరాడుచుండుటను గాంచిన యా తల్లులకు మహాజాలి కలిగినది. గుంపులు గుంపులుగాజేరి యా మహిళలు తమలో తామీ విధముగ గుస గుసలాడు కొనసాగినారు.

"ఈ కంస సభయందలి సభాసదులు, గొప్ప యన్యాయము అధర్మము చేయు చున్నారు. రాజసమక్షముననందే మహాబలులతో బలహీనులగు బాలురు పోరుటను వారామోదించుట యెంత విచారకరము! చెలీ, చూడు. ఆ మల్లయోధుల ప్రతి యవ

యవము గూడ వజ్రమువలె నెంత కఠినముగా నున్నవో చూడు. పర్వతాకారములు గల్గియున్నారు. ఈ రామకృష్ణులింకను యౌవన ప్రాదుర్భావముగాని కిశోరావస్థ యందేయున్నారు. వారిప్రతి యంగములు నెంతసుకుమారముగనున్నవో చూడుము! వారికి వీరికి పోటీ యెక్కడ? ఇక్కడ చేరి యీ ప్రదర్శన తిలకించు వారందరికి ధర్మోల్లంఘన పాపము తప్పక కల్గును. చెలీ, మనమీయధర్మము గాంచుచు నిక్కడ యుండరాదు. అధర్మ ప్రాధాన్యత యుండుచోట నెప్పుడును ఉండరాదనునది శాస్త్ర నియమము. బుద్ధిమంతుడగువాడు, సభాసదుల దోషములను తెలిసి యుండియునట్టి సభకేగుట యుచితముగాదు. ఎందువల్లననగా, అట్టిసభకేగి, యా దోషములను చెప్పుటగాని, నోరుమూసుకొని యుండుటగాని, లేక "నాకు తెలియదని పలుకుట గాని," యీ మూడు విషయములును, మనుజుని దోషిగా చేయును. చూడు, చూడు, శ్రీకృష్ణుడు తన ప్రత్యర్థి యొక్క నాల్గువైపుల మహానైపుణ్యముతో కదము ద్రొక్కుచున్నాడు. అతని మొగముపై శ్రమ బిందువులు పద్మకోశముపైనున్న జల బిందువులవలె శోభ గూర్చుచున్నవి.

ముష్టికునిపైగల క్రోధముచే కొంచె మెఱ్ఱబారిన కనులతో నున్న బలరాముని నీవు చూచుటలేదా? అయినను అణచుకొనలేని హాస సంరంభముచే నాతని మొగ మెంత యందముగానున్నది! సఖీ! నిజము పలుకవలసినచో, వ్రజభూమియే పరమ పవిత్రము, ధన్యమైనది. ఏలననగా, యీ పురుషోత్తము డచట మానవరూపముతో గూఢముగానున్నాడు. స్వయముగా శంకరభగవానుడు మఱియు లక్ష్మీదేవియు యెవని చరణముల పూజించుచుందురో యట్టి భగవానుడు, రంగు రంగుల వన పుష్పముల మాలధరించి, బలరామ సహితముగ వంశీ నినాదము జేయుచు, గోవుల పాలించుచు, రకరకముల లీలల ప్రదర్శించుచు నానందముగ విహరించుచున్నాడు. నిరంతరము యీమనోహరుని రూప-మధురిమను తమ రెండు నేత్రములలో తనివి దీర పానము చేయునదృష్టము కల్గుటకా వ్రజమునందలి గోపికలొనర్చిన తప స్సెట్టిదియో తెలియరాదు. ఇతని రూపమెట్టిది! అది లావణ్యసారము. ఈ ప్రపంచ మందుగాని, మరెచ్చటనైనగాని, యితని రూపముతో సమానమగు రూపము మరి యొకటి లేదన్నచో, యింతకంటె గొప్పదియుండునను మాటయే యసంభవముగదా! ఆ సౌందర్యము వేష భూషణాద్యలంకారముతో వచ్చినదిగాదు. అది స్వతస్సిద్ధము. ఈ రూపము నెంతగాంచినను తనివి దీరుటలేదు. ఏలననగా నది నిత్య నూతనము. ప్రతిక్షణమును నూతనత్వమును సంతరించుకొనుచుండును. సమసైశ్వర్యములు, యశస్సు, సౌందర్యములును యితనినే యాశ్రయించియుండును. కాని యితని సౌం దర్యమితరుల కత్యంత దుర్లభము. అది గోపికల భాగ్యమందే లిఖింపబడియున్నది.

సఖీ, వ్రజ గోపికలు మహాధన్యులు గదే. నిరంతరము వారు యీ దామో

వరుని యందే తమ చిత్తముల జేర్చి యుండుటచే, ప్రేమ సంభరితమగు హృదయముతో, ఆనందాశ్రువులచే గద్గదమైన కంఠముతో యీ మహానుభావుని లీలలనే గాన మొనర్చుచు కాలము గడుపుచుందురుగదా! వారు పాలు పిదుకుచున్నపుడు పెరుగు చిలుకుచున్నపుడు, ధాన్యము దంపుచున్నపుడు, గృహ సమ్మార్జనము చేయుచున్నపుడు పిల్లల నూయలలో నుంచి యూచుచున్నపుడు, యేడ్చుచున్న పిల్లల సముదాయించుచున్నపుడు, వారికి స్నానము చేయించి యలంకరించునపుడు, వేయేల, యెట్టి గృహ కృత్యము లొనర్చుచున్నపుడు గూడ, శ్రీకృష్ణ గుణగానము నందే లగ్నమైన చిత్తము గలవారై యుందురు. ఈ గోపాలుడు గోవుల మేపుటకై ప్రాతఃకాలమందు వనమున కేగునపుడును, సాయంకాలము వానిని దోలుకొని వ్రజమునకు తిరిగి వచ్చునపుడు గూడ, నతడు మధురముగ మురళిని మ్రోయించుచుండును. ఆ మురళీరవము వినుటయే తడవుగ గోపికలందరు గృహకృత్యములెక్కడి వక్కడ వదలి, యాతని మార్గమునకు పరుగెత్తి వచ్చుచుందురు. వచ్చి, యతని, మధుర మందహాసము దయావీక్షణములు గల యాతని ముఖకమలమును కనులార గాంచుచు తన్మయులై పోవుచుందురు. నిజముగా గోపికలు పరమ పుణ్యవతులు"

మధురాపురవాసినులగు స్త్రీలీవిధముగ సంభాషించుకొనుచుండగా, ఆ సమయమున యోగీశ్వరుడగు శ్రీకృష్ణ భగవానుడు, తన మనస్సు నందా మల్లుని చంపుటకు నిశ్చయించినాడు. భయపూరితములగు స్త్రీల మాటలను దేవకీ వసుదేవులు గూడ వినుచుండిరి. (స్త్రీలు గూర్చున్న ప్రదేశమునకు సమీపమునందే దేవకీ వసుదేవులున్న చెరసాల యున్నదనియు, నందుచే వారి మాటలు వినగలిగిరనియు భావింపవలయును.) పుత్ర స్నేహముచే వారు శోక విహ్వలులైరి. వారి హృదయమందు మహా వ్యథ గలిగినది. దానికి కారణము వారు తమ పుత్రుల బలవీర్యము లెఱుంగకుండుటయే. చాణూర శ్రీకృష్ణులు,మల్లయుద్ధమునందలి వివిధ కౌశలముల ప్రదర్శించుచు పోరుచుండిరి. అటులనే ముష్టిక బలరాములును వెనుదీయక పోరుచుండిరి. భగవానుని యవయవములన్నియు వజ్రము కంటె కఠోరము కాజొచ్చినవి. అతని యొరిపిడిచే చాణూరునకు మహా సంకటము కలుగజొచ్చినది. మాటిమాటికి యతనికి తన సంధి బంధములన్నియు శిథిలమగుచున్న యనుభూతి కలుగసాగినది. వాడు మహా వ్యథ చెందుచుండె. మహా కోపముతో గ్రద్దవలె, వాడొక్క యెగురెగిరిరెండు పిడికిళ్ళతో భగవానుని యుదరమందు తీవ్ర ముష్టి ఘాత మొనర్చినాడు. కాని వాసుదేవుడు లేశమాత్రము గూడ విచలితుడుగాలేదు. అతనికాయా ఘాతము గజరాజును పుష్ప మాలికతో కొట్టినట్టులుండె. వెంటనే శ్రీకృష్ణుడు చాణూరుని రెండు చేతులను బట్టుకొని వానిని కొన్ని మారులంతరిక్షమున గిరగిర ద్రిప్పి నేలపై గొట్టె. చాణూరుని ప్రాణములు భ్రమణ సమయమందే యెగిరిపోయినవి. అతని శరీరమందలి

యలంకారములన్నియు చిందరవందరయైనవి. కేశములు, హారములు చెల్లాచెదురై పోవగా నాతని శరీరము యింద్ర ధ్వజ సమీపమునందు పడిపోయినది. (ఇంద్ర ధ్వజమనగా యింద్ర పూజకై స్థాపించబడిన జెండా).

అటులనే ముష్టికుడుగూడ బలరామునిపై నొకముష్టి ప్రహారము చేయగా, క్రుద్ధుడైన బలరాముడాతనికొక చెంపపెట్టు ప్రసాదించె. దానితో ముష్టికుడు, వాతాహతమగు వృక్షమువలె, నేలగూలి వ్యథితుడై, రక్తము గ్రక్కుకొనుచు ప్రాణములు విడిచె. అనంతరము తనపైకి వచ్చిన కూటుడనుమల్లుని గూడ రాముడంత మొందించె. శ్రీకృష్ణుడొక్కతన్నుతన్ని శలుని, గడ్డిపోచనువలె నిలువుగా చీల్చి తోశలుని, యమసదనమునకు బంపె. * ప్రధానమల్లురగు, చాణూరముష్టిక,కూట, శల, తోశలు రీవిధముగ మరణించగా, మిగిలినమల్లురు ప్రాణభీతితో రంగస్థలము వీడి, పలాయనము చిత్తగించిరి. వారందరు పారిపోయినపిమ్మట రామకృష్ణులు, తమ సహచరులగు గొల్లపిల్లలను లాగి వారితో లీలగా మల్ల క్రీడ గావించదొడంగిరి.

బలరామ, శ్రీకృష్ణుల యీయద్భుత లీలలను గాంచిన ప్రేక్షకులందరును మహాశ్చర్య చకితులైనారు. బ్రాహ్మణులు ప్రశంసలు కురిపించినారు. కాని కంసునకు మాత్రము గొప్ప దుఃఖముకలిగినది. కోపముతో నూగిపోయినాడు. ప్రధాన మల్లురు మరణించగా, మిగిలిన వారందరు పారిపోగా, భోజరాజు, భేరీమృదంగాది వాయిద్యములన్నిటిని యాపుజేయించినాడు. తన సేవకుల నీవిధముగ నాజ్ఞాపించి నాడు.

"వసుదేవుని కుమారులగు వీరిద్దరిని నగరమునుండి వెడలగొట్టుడు. గోపాలురధనమునంతయు స్వాధీనము చేసుకొని, నందుని చెరయందుంచుడు.వసుదేవుడు

---

* **చాణూరాదులు :**

పూర్వము అమరావతియందు ఉతథ్యుడను మునియొకడుండెడివాడు. అతనికి మన్మథునితో సమానమగు సౌందర్యముగల కుమారులైదుగురుండిరి. వారందరును స్వధర్మములగు అధ్యయన జపాదులనువదలి, మదోన్మత్తులై మల్లయుద్ధ ప్రావీణ్యతను గడించుచుండిరి. బ్రాహ్మణ కర్మపరిభ్రష్టులైన వారింగాంచి తండ్రి కోపించి, "మీరు స్వకులాచార ధర్మములను వదలి క్షాత్రధర్మముల ననుసరించితిరి గాన భరతభూమియందు మల్లులై జన్మించి యాసురప్రవృత్తి గలిగియుండుడ"ని శపించె.

వారే, చాణూర, ముష్టిక కూట, శల, తోసలులను మల్లయోధులుగా జన్మించి శ్రీకృష్ణ బలరాముల యంగస్పర్శచే పరమపదము నొందినారు.

మహాకుటిలుడు. దుష్టుడు. అతనిని శీఘ్రమే వధింపుడు. ఉగ్రసేనుడు నాతండ్రియై నప్పటికిని, తనయనుయాయులతోపాటు శత్రుపక్షము జేరినాడు. కావున నతనిని గూడ ప్రాణములతో విడువకుడు." అని యీ విధముగ నోటికివచ్చినట్లు వదరు చున్న కంసునిపై శ్రీకృష్ణున కపరిమితాగ్రహము కల్గినది. మహావేగముతో నెగిరి, యాతడు కంసుడున్న యెత్తైనమంచెపైకి దూకినాడు. తన మృత్యురూపియగు శ్రీకృష్ణుడటుల తన యెదుట ప్రత్యక్షముకాగనరికి, కంసుడు సింహాసనముపుండిలేచి, డాలుచేబూని, కత్తిదూసి, శ్రీకృష్ణునిపై వేటువేయుటకు అవకాశముకొరకు నిరీక్షించు చుండె. కాని భగవానుని తేజమత్యంత దుస్సహము. గరుత్మంతుడు సర్పమునుబట్టు నటుల భగవానుడు కంసునొడిసిపట్టినాడు. కంసుని కిరీటము క్రిందపడిపోయినది. కృష్ణుడాతని కేశముల గట్టిగాబట్టి గుంజి యాతనిని నాయున్నతమంచెపైనుండి రంగ భూమియందు బడద్రోసి యాతనిపైకెగిరి కూర్చుండె. ఆతడెగిరి కూర్చొనుటలోనే కంసుని ప్రాణములనంత వాయువులలో గలిసిపోయినవి. సింహము తాను వేటాడిన గజ శరీరమును లాగునట్లు, వాసుదేవుడా కంసశవమును నేలపై నీడ్చినాడు. అందరు 'హా హా' కారము లొనర్చిరి. కంసుడు నిరంతరము కలవర పాటుతో శ్రీకృష్ణుని గూర్చియే చింతించుచుండె. తినుచున్నను, తాగుచున్నను, నిద్రించుచున్నను, నడచుచున్నను, భాషించుచున్నను, ఉచ్ఛ్వాస సమయమందు గూడ అతడు తన సమీపమందు చక్రధారియగు శ్రీకృష్ణునే దర్శించుచుండె. ద్వేష భావముచేనైనను, భయముచేనైనను, నిరంతరము భగవానునే చింతించుచుండిన కారణముచేనతడు సారూప్యముక్తినందినాడు, గొప్పతాపసులకు, యోగులకుగూడ నట్టిది మహా దుర్లభము.

కంసునకు, ♦ కంక - న్యగ్రోధాదు లెనిమిదిమంది తమ్ములున్నారు. తమ

---

♦ కంకసోదరులు (కంకన్యగ్రోధాదులు)

అలకాపట్టణమున దేవయక్షుడను పేరుగల మహాజ్ఞాని యుండెడువాడు. అత నికి దేవకూటుడు, మహాగిరి, గండుడు, దండుడు. ప్రచండుడు, ఖండుడు, అఖం డుడు, పృథువు అను నామములు గల యెనిమిదిమంది కుమారులుండిరి. తండ్రి యా దేశానుసారము శివారాధనకు వేయి కమలముల దెచ్చుటకై వారొకనాడు మానస సరోవరమునకుబోయి, పుష్పములుకొనివచ్చుచు, పుష్పసుగంధమునకాకర్షితులై వానిని వాసనజూచి, పిమ్మట పుష్పములను జనకున కొసంగిరి. ఆఘ్రాణిత కుసుమము లనుమానాదున కర్పించిన కారణముచే వారి కాసురీ ప్రవృత్తిగల జన్మము లభించి నది. వారే కంసుని సోదరులను, కంకుడు, న్యగ్రోధుడు కహ్వుడు, సువాహుకుడు. సుభుడు, రాష్ట్రపాలుడు, విస్సష్టుడు, తుష్టిమానుడు అను యెనిమిది మందిగా జన్మించి బలరాముని చేతిలో మరణించి ముక్తినందిరి. (గర్గసంహిత)

యగ్రజుడు మరణించగా వారు మండిపడుచు, రామకృష్ణుల చుట్టుముట్టిరి. అది గాంచిన బలరాముడొక పరిఘు చేబూని, సింహము పశువుల వధించినట్లు, వారందరిని దునుమాడినాడు. ఆకాశదుందుభులు మ్రోగినవి. భగవానుని విభూతి స్వరూపులగు విధి శంకరేంద్రాది దేవతలందరు మహానందముతో రామకృష్ణులపై పుష్పవర్షమును గురిపించిరి. స్తుతించిరి, అప్సరసలు నాట్యమాడ దొడగిరి.

కంసుని యొక్కయు, అతని సోదరుల యొక్కయు భార్యలు, తమ వారి మరణమున కత్యంత దుఃఖితలై, తలలు బాదుకొనుచు కన్నీరు కాల్వలు గట్టునట్లే డ్చుచు, రంగస్థలమున కేతెంచి, వీరశయ్యనలంకరించియున్న తమ పతుల శరీర ముల కౌగలించుకొని, హృదయ విదారకముగ వారు రోదించుచుండిరి. "నాథా, ప్రియా, కరుణామయా, నీవు మరణించుటచే మేమనాథలమైతిమి. పురుషశ్రేష్ఠా, యీ పురమునకు నీవే స్వామివైయుంటివి. నీవు యీ పురము వీడి వెళ్ళిపోగానే, నీ విరహముచే యీ యుత్సవము సమాప్తమైనది. మంగళ చిహ్నములన్నియు మాయమైపోయినవి. మావలెనే పట్టణముగూడ విధవయై, శోభాహీనమైపోయినది. స్వామీ, నీవు నిరపరాధులకు చాలద్రోహ మొనర్చుచుంటివి. అన్యాయ మొనర్చి తివి. అందుచేతనే నీకిట్టి గతి సంభవించినది. అది సత్యమే గదా! జీవులకు ద్రోహము చేయుచు, వారి కప్రియము గల్గించునట్టి వాడెవ్వడు శాంతిని పొంద గలడు?

ఈ శ్రీకృష్ణభగవానుడు సర్వప్రాణుల యుత్పత్తిలయముల కాధారుడు. రక్ష కుడుగూడ నితడే. ఆతని కపకారము తలపెట్టువాడు, నిరాదరించువాడు యెప్పటికిని సుఖపడజాలడు, అని కంసపత్నులు విలపించసాగిరి.

భగవానుడు సర్వప్రపంచమునకేకైక జీవనదాతగదా! అందుచే నతడు రాణులవద్దకేగి వారి నూరడించె. ధైర్యము కలిగించినాడు. లోకరీతిననుసరించి, మర ణించినవారలకు జరుగవలసిన పారలౌకిక క్రియల జరిపించినాడు. తదనంతరము రామకృష్ణులిర్వురు చెరసాలకేగి. తమ తల్లిదండ్రులగు దేవకీవసుదేవులను, బంధం విముక్తులగావించి, వారి పాదములకు తమ శిరస్సులానించి వందనమొనర్చిరి. వార టుల నమస్కరించినను, వారిని జగదీశ్వరులుగా భావించిన దేవకీవసుదేవులు, తమ హృదయములకు హత్తుకొనలేదు. జగదీశ్వరులను తమ పుత్రులని యెట్లు భావించగలమ'ను శంకవారికి కలిగినది.

# నలుబదియైదవ యధ్యాయము

## రామకృష్ణుల యుపనయనము—గురుకులవాసము

తమ తల్లిదండ్రులకు తమ యెడల భగవద్భావన కలిగినదను విషయము భగవానుడు గ్రహించినాడు. అట్టి భావము వారికి కలిగినచో వారు పుత్ర స్నేహ సుఖమును పొందజాలరుగాన, వారికది కలుగుట యుచితముగాదని తలచిన భగవానుడు, స్వజనులను సంమోహితుల గావించి తన లీలయందు సహకరించుచుండు నట్టి యోగమాయను వారిపై ప్రసరింపజేసినాడు. బలరామసహితముగ వారివద్దకు జేరి, యాదరపూర్వకముగ వినయముతో, శ్యామసుందరుడు తలవంచి "తల్లీ, తండ్రీ," యని సంబోధించుచు వారిని ప్రసన్నుల గావించుచునిట్లు పలుకదొడగినాడు.

"తల్లిదండ్రులారా, మేము మీ పుత్రులము. మా కొరకై మీరుత్కంఠితులై యున్నారు. అయినప్పటికిని, మీరు, మా బాల్య, పౌగండ, కిశోరావస్థల సుఖమును మా వలన పొందలేకపోయినారు. దురైవవశమున, మాకా వయస్సునందు మీదగ్గర నుండు నదృష్టము కలుగలేదు. అందుచేతనే తల్లిదండ్రుల వద్దనుండు బాలకులకు లభించు ముద్దుమురిపెములు, మేము పొందజాలకపోతిమి. తల్లిదండ్రులే యీ శరీరమునకు జన్మనిచ్చి, దీని లాలన-పాలనముల జేయుచుందురు. అప్పుడీ శరీరము చతుర్విధ పురుషార్థప్రాప్తికి సాధనమగుచున్నది. పురుషుడు నూరుసంవత్సరములు జీవించి, జీవించినంతవరకు మాతాపితల శుశ్రూష గావించినను, వారి ఋణము దీర్చుకొనజాలకుండును. సమర్థుడయ్యు తల్లిదండ్రులకు తన శరీరముతోను ధనముతోను సేవజేయనట్టికుమారుడు మరణించిన పిదప, యమదూతలతనిచే నతని శవమాంసమునే దినిపింతురు. ఏ పురుషుడు సమర్థతగలవాడై యుండియు, వృద్ధులైన తల్లిదండ్రులను, పతివ్రతయగు పత్నిని, తన చిన్నపిల్లలను, గురువును, బ్రాహ్మణుని, శరణాగతుని, భరించి పోషించకయుండునో వాడు జీవచ్ఛవము వంటివాడు. తండ్రీ, మా జీవితమింతవరకు వ్యర్థముగా గడచినది. కంసునివలన భయముచే నెల్లప్పుడు నుద్విగ్నచిత్తులమై యుండుటచేత మేము మీ సేవ జేయుటయందసమర్థులమై యుంటిమి. అమ్మా! నాయనా, మీరు మా యపరాధమును క్షమింపుడు. దుష్టుడగు కంసుడు మిమ్మెంత కష్టపెట్టినను, పరతంత్రులమై యున్నందున మేము మీకెటువంటి సేవా శుశ్రూషలనుగూడ చేయజాలకపోయినారమ"ని పలికె.

మహారాజా, లీలామానుష విగ్రహుడగు విశ్వాత్ముడైన శ్రీహరియొక్క మాటలచే మోహితులైన, దేవకీవసుదేవులు, పిల్లలిరువురిని తమ యొడిలోనికి దీసుకొని, హృదయమునకు హత్తుకొని పరమానంద మందిరి. స్నేహపాశబద్ధులై,

వారు ఆనందాశ్రువులచే రామకృష్ణుల నభిషేకించిరి. అశ్రువులచే కంఠములు రుద్ధమై పోవుటచే వారేమియు మాటాడలేకపోయిరి.

దేవకీనందనుడీ విధముగ తన తల్లి దండ్రుల నోదార్చి, తమ మాతా మహుడగు నుగ్రసేనుని, మరల మధురా నగరమునకు రాజుగావించి, యతనితో, "మహారాజా, మేమందరము మీ ప్రజలము. మీరు మాకాజ్ఞల నొసంగుచు పరిపాలించుడు. యయాతి మహారాజు యొక్క శాపకారణముగా యాదవులకు రాజ్యాధికారము లేదు. (నాయిచ్ఛయునదియే గాన మీకెట్టి దోషము గలుగనేరదు.) నేను మీకు సేవకుడనై మిమ్ము సేవించుచుండగా, శ్రేష్ఠులగు దేవతలు గూడ,తలలు వంచి మీకు కానుకలు సమర్పించెదరన యితర నరపతుల మాట చెప్పనేల?" అని పల్కె.

శ్రీకృష్ణుడే సర్వ ప్రపంచ విధాతగదా. కంసునికి వెఱచి, యితరదేశములకు వలసబోయిన యదు, వృష్ణి, అంధక, మధుదాశార్హ, కుకురాది వంశోత్పన్నులైన తమ బంధువుల నందరను తిరిగి మధురకు రావించి, వారి వారి యిండ్ల యందు వారుండునట్లు చేసినాడు వాసుదేవుడు. వారందరిన్ని దినము లిండ్లు వదలి వెళ్ళినందున చాలక్లేశమనుభవించియున్నారు. వారికివలయుధనసంపత్తు లొసగి భగవానుడు వారు సుఖముగ నివసించు వసతి గల్పించినాడు. ఇపుడు సమస్త యదువంశీయులు, రామకృష్ణుల బాహు బలముచే సురక్షితముగ సుఖముగ నివసించగలిగిరి. వారి దయచే వారికెట్టి దుఃఖములేకుండె. వారి మనోరథములన్నియు సఫలములైనవి. వారు కృతార్థులైరి. వారు తమ తమ గృహము లందానందముగ నివసించసాగిరి.

దామోదరుని వదన మానందసదనము. అదిసదా వికసించియుండు సరసిజము వంటిది. ఆ ముఖ సౌందర్యమపారము, అపూర్వము. దయా పూర్ణమగు దరహాసము, కృపావలోకనము, అందెపుడును తాండవించుచుండును. అట్టి ముకుందుని వదనాంబుజమును యదువంశీయులు దిన దినము దర్శించును నానంద నిమగ్నలగుచుండిరి. తమ రెండు నేత్రములతోను, మాటిమాటికి, భగవానుని ముఖారవిందముయొక్క యమృతమయమగు రసమును పానము చేయుచుండుటచేత, మధురానగరమందలి వయోవృద్ధులుగూడ యువకులతో సమానమగు బలోత్సాహములు గలవారైరి.

తరువాత, రామకృష్ణులిరువురు, నందుని సమీపించి, కంఠాలింగనమొనర్చి, యిటుల పలుకదొడగిరి. "తండ్రీ మీరు, యశోదామాతయు యెంతో ముద్దుమురిపెములతో మా లాలన-పాలనముల గావించి యుంటిరి. తల్లిదండ్రులు తమ సంతానమును తమ శరీరము కంటె మిన్నగా ప్రేమించుదురనుటలో నెట్టి సందేహము లేదు. స్వజనులు పోషింపలేక త్యాగమొనర్చిన పిల్లలను తమ సంతానముతో సమానముగ ప్రేమతో పోషించినవారే నిజముగ నా పిల్లలకు తల్లిదండ్రులు. తండ్రీ, మీ

రిపుడు గోకులమునకు వెళ్ళుడు. పూవైపై మీపుగల వాత్సల్య ప్రేమకారణముగా, మేము లేనప్పుడు మీకు మహా దుఃఖము కలుగుననుటలో సందేహోమేమియు లేదు. ఇక్కడి బంధు మిత్రులందరికి సుఖము చేకూర్చిన యనంతరము మిమ్ములను గలియుటకు వచ్చెదము" అని శ్రీకృష్ణుడు నందాది గోపాలురందరకు మనస్సమాధానము కలుగునట్లు మాటలాడి, యత్యంతాదరముతో వారి కనేక వస్త్రాభరణాది కానుకలొసంగి సత్కరించినాడు. భగవానుని మాటలు విని, ప్రణయ విహ్వలుడైన నంద గోపుడు, రామకృష్ణులను గాఢాలింగన మొనర్చి, నేత్రములందు దుఃఖాశ్రువులు దొరలుచుండ, వ్యాకుల హృదయముతో గోకులమునకు, తనవారందరితో వెడలిపోయె.

అనంతరము, వసుదేవుడు తమ కుల పురోహితుడగు గర్గాచార్యుని, యితర బ్రాహ్మణోత్తములను రావించి, యథావిధిగ,పుత్రులకుద్విజాతి సముచితమగు యజ్ఞోపవీత సంస్కారమును చేయించినాడు. బ్రాహ్మణులకు దక్షిణా సహితముగ వస్త్రాభరణాదు లొసంగుటయే గాక, సవత్స గోదానములను గూడ విరివిగ జేసినాడు. పూర్వము తన తనయుల జన్మ కాలమందు తాను మనసా సంకల్పించి, పిమ్మట నిచ్చియున్న దానములను దుష్టుడగు కంసుడు వారి వద్ద నుండి యపహరించి యుండె. అవి యన్నియు జ్ఞప్తికి దెచ్చుకొని, యిపుడు వాసుదేవుడా దానములను తిరిగి యెవరికివ్వవలసిన వాటిని వారి కొసగె. గర్గాచార్యు డీవిధమున రామకృష్ణులకుపనయన సంస్కారము గావించి, వారికి ద్విజత్వ ప్రాప్తిని కల్గించె.

వారి బ్రహ్మచర్య వ్రతమఖండమేయైనను, యిపుడు గాయత్రీ మంత్రపూర్వకమగు సధ్యయనము చేయుటకై వారు బ్రహ్మచర్య వ్రతమును స్వీకరించిరి. జగదీశ్వరులగు రామకృష్ణులు సర్వవిద్యలకు నుత్పత్తి స్థానులు. సర్వజ్ఞులు. నిర్మల జ్ఞానము వారికి స్వతః సిద్ధము. ఐనను వారు మనుష్యుల వలె, లీల నభినయించుచు వారి సర్వజ్ఞత్వము నెవరికి దెలియనీయక దాచి యుంచిరి.

రామకృష్ణు లిరువురు గురుకుల వాసము చేయ నిశ్చయించినవారై, యవంతీ పురమందు నివసించుచున్న కాశ్యపగోత్రీయుడగు సాందీపని ముని వద్దకేగి, విధిపూర్వకముగ వారు గురువు నొద్దనే వసించినారు. వారు గొప్ప నియమ నిష్ఠలతో బ్రహ్మ చర్యము జరుపుచు, గురువు వారి నెంతయో యాదరించుచున్నప్పటికిని. లోకులకు ఆదర్శమును జూపుటకై, మహాభక్తి శ్రద్ధలతో గురువున కుత్తమ సేవా శుశ్రూషలు జరుపుచుండిరి. పరిశుద్ధ భావముతో కూడిన వారి పరిచర్యలకు గురువగు సాందీపముని యెంతయో ప్రసన్నుడాయె. వేదాంగ వేదాంత సహితముగ సర్వ వేదములను వారికి బోధించినాడు. మనుస్మృతి, మొదలగు ధర్మ శాస్త్రములు, మంత్ర, దేవతాసహితముగ దనుర్వేద్య, మీమాంస మొదలగునవి, వేదములు

తాత్పర్యములు తెలుపునట్టి శాస్త్రములు, తర్కవిద్య (న్యాయశాస్త్రము). సంధి-విగ్రహ- యాన- ఆసన ద్వైధ, ఆశ్రయములను ఆరు భేదములతో గూడిన రాజనీతిని వారికి బోధించినాడు.

రాజా, రామకృష్ణులు సర్వ విద్యలకు ప్రవర్తకులుగదా. మనుష్య వ్యవహారము ననుసరించి వారు విద్యాభ్యాస మొనర్చుచున్నారే గాని వేరుగాదు. గురువుగారొక్క మారు చెప్పినంత మాత్రముననే వారు సర్వ విద్యల గ్రహించుచుండిరి. అరువది నాలుగు కళలను అరువది నాలుగు దినములలోనే నేర్చుకొనిరి. *

---

* అరువది నాలుగు విద్య లేవి యనగా :-

1) గానవిద్య, 2) వాద్యము, 3) నృత్యము, 4) నాట్యము, 5) చిత్రలేఖనము, 6) లతా పుష్పములు చిత్రించుట, 7) బియ్యము పుష్పములు మొదలైన వాటితో పూజా ద్రవ్యములు తయారుచేయుట, 8) పూలశయ్య తయారు చేయుట, 9) దంత, వస్త్ర, అంగములకు రంగులు వేయుట, 10) తివాచీలుతయారుచేయుట, 11) శయ్యా రచన, 12) జల బంధము (సేతు) నిర్మించుట, 13) విచిత్ర సిద్ధి ప్రదర్శనము, 14) హారములు, మాలలు తయారు చేయుట, 15) చెవులకు శిరోజములకు పుష్పాలంకారము, 16) వస్త్రములు, ఆభరణముల తయారీ, 17) పుష్పాలంకారములచే సింగారించుట, 18) చెవులకు ఆకులలంకరించుట. 19) సుగంధ తైలము అత్తరువుల తయారీ, 20) ఇంద్రజాలము, 21) విచిత్ర వస్త్ర ధారణము, 22) హస్త లాఘవము, 23) తినుబండారముల తయారు చేయుట, 24) పానీయములు తయారు చేయుట, 25) కుట్టుపని, 26) చెక్కబొమ్మల తయారీ, 27) పొడుపు కథలు, సమస్యలు, 28) ప్రతిమల తయారీ, 29) కూటనీతి, 30) గ్రంథములు చదివించు నేర్పు, 31) నాటకము, ఆఖ్యాయికలు మొదలైనవి రచించుట, 32) సమస్యాపూరణము, 33) పట్టీ, బెత్తములు, బాణముల తయారీ, 34) రత్నకంబళములు, జంపకానాలు తయారీ, 35) వెండి, బంగారు, రత్నాదుల పరీక్ష 36) గృహాది నిర్మాణము, 37) మృదంగము, 38) వెండి బంగారు వస్తు నిర్మాణము, 39) మణికాంతి పరీక్ష, 40) గనుల కనుగొనుట, 41) వృక్ష చికిత్స, 42) పొట్టేళ్ళు, కోడి మొదలగు పందెములు, 43) చిలుక, మైనా మొదలగు పక్షుల కూతల కూయుట, 44) ఉచ్చాటన విధి 45) కేశములు శుభ్రముచేయు కౌశలము, 46) గుప్పిటలోని వస్తువు, లేక మనసు నందలి మాట చెప్పగల్గుట, 47) మ్లేచ్ఛ కావ్య పరిజ్ఞానము, 48) విభిన్న దేశభాషా జ్ఞానము, 49) శకునజ్ఞానము-ప్రశ్నలు చెప్పుట. 50) వివిధ మాతృకా యంత్ర నిర్మాణము, 51) రత్నములను వివిధాకారములలో చెక్కుట, 52) సాంకేతిక భాష తయారుచేయుట, 53) మనమునందు కటక (సేన-కంకణము) రచన చేయుట, 54) క్రొత్త క్రొత్త విషయము

ఈ ప్రకారము విద్యాభ్యాసము పూర్తిగావించుకొనిన పిమ్మట రామకృష్ణులు సాందీపనిమునిని, "తమకిచ్చవచ్చిన గురుదక్షిణ కోరుకొమ్మని'యడిగిరి. రామకృష్ణు లయద్భుత మహిమ, అలౌకిక బుద్ధి నాతడు గ్రహించి యున్నవాడు గావున, తన భార్యతో సంప్రదించిన యనంతరము, "నాయనలారా, పూర్వము ప్రభాసతీర్థమున సముద్రమునందు మునిగి చనిపోయిన మా కుమారుని తెచ్చి యిండు. ఇదియే మీ రొసగవలసిన గురుదక్షిణయని, సూచించె. రామకృష్ణులనంత శక్తి సంపన్నులగు టచే, గురునకు తమ యంగీకారము తెలిపి, వెంటనే ప్రభాసక్షేత్రమునకేగి సముద్ర తీరమును జేరిరి. వారు సాక్షాత్పరమేశ్వరులని యెఱింగిన సముద్రుడు ఉపాయన ములగొని వారి వద్దకు వినయమునరాగా, భగవానుడాతని గాంచి "సాగరా, నీవు నీ తరంగములచే నీ లోనికి లాగుకొనిన మా గురు పుత్రుని వెంటనే మాకు తెచ్చి యిమ్ము"ని యడిగెను.

మానవ వేషధారియై వచ్చియున్న సముద్రుడందులకు "దేవాధిదేవా, శ్రీకృష్ణా నేనా బాలకుని యపహరించలేదు. నా జలమందు, * పంచజనుడను మహా రక్కసు డొకడు వసించియున్నాడు. వాడు శంఖ రూపుడు. మీ గురుపుత్రుని తప్పక వాడే

లను కనిపెట్టుట, 55) కపటముచే కార్య సాధన చేయుట, 56) సమస్త కోశ పరిజ్ఞానము, 57) సమస్త ఛందస్సుల జ్ఞానము, 58) వస్త్రముల దాచుట, మార్చు టకు సంబంధించిన విద్య, 59) ద్యూత క్రీడ, 60) దూరమందున్న వాటి నాక ర్షించుట. 61) బాలక్రీడ, 62) మంత్ర విద్య, 63) విజయ ప్రాప్తికరమగు విద్య. 64) బేతాళాదులవశము చేసుకొను విద్య.

*** పంచజనుడు (శంఖాసురుడు)**

శ్రీహరికి, శంఖ చక్రాద్యుపాంగములు స్వతేజా విర్భూతములై యుండినవి. ఆయు పాంగములలో పాంచజన్యమను శంఖ మగ్రస్థానము వహించి యుండె. మాధవుని ముఖారవింద లగ్నమై యాతని యధరామృత పానమొనర్చు నదృష్టము కల్గి యుండుటచేత, మిగిలిన యందరికంటే తానధికుడనను గర్వమాతని నావహిం చినది. "దక్షిణావర్తముగల నన్ను దామోదరుడు విజయ సమయములందు పూరించు చుండును. రమాదేవికి గూడ దుర్లభమగు భగవానుని యధరామృతము నాకు లభించు చుండును గావుననే నందరి కన్న మిన్న"యని యహంకరించిన పాంచజన్యముపై కోపించిన రమాదేవి "రాక్షసుడవై పుట్టుము"ని యాతని శపించినది.

అతడే పంచజనుడుగా జన్మించి, శ్రీకృష్ణునిచే నిహతుడై, దోషరాహిత్య మును పొంది, తన పూర్వ స్థానమలంకరించినాడు.

(గర్గసంహిత)

యపహరించి యుంతు"నని పలికె. వెంటనే భగవానుడు జలమునందు జొచ్చి శంఖాసురుని వెదకి, వధించె. కాని వాని యుదరమునందు గురుపుత్రుడు గానుపించ లేదు. పంచజనుని శంఖమగు పాంచజన్యమును గైకొని, బలరాముని సహితముగా రథముపై యమలోకమునకేగి, పాంచజన్యమును పూరించగా, ఆ శబ్దమును విను టయే తడవుగ, సమవర్తి యెదురేతెంచి, స్వాగతము పల్కి, యథావిధిగ పూజించి, వినమ్రుడై, "లీలా మానుష విగ్రహా, సర్వవ్యాపకుడవగు పరమేశ్వరా, నేను మీకేమి సేవ చేయగల"నని పలికె.

"యమరాజా, తన కర్మానుసారముగ మా గురు పుత్రుడిచటికి గొని రాబడి నాడు. నీవు నా యాజ్ఞ ననుసరించి, యతని కర్మ విషయమై దృష్టియుంచక, మా గురు పుత్రుని నా కొసంగుము" అని భగవానుడు పలుకగా, భగవానుని యాజ్ఞా ప్రకారము గురు పుత్రుని దెచ్చి వారి కర్పించినాడు యమధర్మరాజు. రామకృష్ణులా బాలకుని గైకొని యుజ్జయినికి వచ్చి, గురువగు సాందీపమునికి సమర్పించి, ఇంకను యేమైన వలయుచో నడుగుడ"ని పల్కిరి.

సాందీపుని యానందమునకు మేరయే లేకున్నది. "నాయనా, మీరిరువురు నాకు గొప్ప గురుదక్షిణ నొసంగి యున్నారు. ఇంతకంటె నాకు కావలసినదేమున్నది? మీ వంటి పురుషోత్తములకు గురువగు భాగ్యము లభించిన వానికి, తీరని మనో రథము లేమి యుండును? వీరులారా, మీరిక మీ గృహమున కేగుడు. లోక పవిత్ర మగు కీర్తి మీకు లభించుగాక, మీరు నేర్చుకొనిన విద్య, యిహ పరలోకములందు నిత్యనూతనముగా నుండుగాక. ఎప్పటికిని మఱుపునకు రాకుండుగాక" అని యాశీ ర్వదించె.

గురుని యనుజ్ఞనంది, రామకృష్ణులు, వాయుసమానవేగమును మేఘసమాన శబ్దముగల రథముపైనెక్కి, మథురానగరము జేరిరి. మథురానగరవాసులు, చాల దినముల నుండి యాసోదరులను గాంచకుండుటచే దుఃఖితులై యుండిరి. వారిప్పుడు రాగా, జూచి, పోయిన ధనము తిరిగి దొరికినంతగా, పరమానంద భరితులైరి.

## నలుబదియారవ యధ్యాయము

### ఉద్ధవుని వ్రజయాత్ర

శ్రీశుకమహర్షి పరీక్షిత్తుతో నిట్లు చెప్పుచున్నాడు.

"రాజా, వృష్ణివంశీయులలో నుద్ధవుడొక ప్రధాన పురుషుడు. అతడు సాక్షాత్తు బృహస్పతికి శిష్యుడు. మహాబుద్ధిమంతుడు. కృష్ణునకాతడు ప్రీతి గూర్చుసఖుడు,

మంత్రియున్నైయుండెనన, యింతకంటె నతని మహిమయొక్క గొప్పతనమును గూర్చి చెప్పవలసినదేముండును? ప్రపన్నార్తిహరుడగు భగవానుడొకనాడు, తన యేకాంత భక్తుడగు నుద్ధవుని కరము తన కరమున గీలించి, యేకాంతమందు, యిట్లు పలికె. "సౌమ్యుడా, ఉద్ధవా, నీవు వ్రజభూమికేగుము. అచట నాతలిదండ్రు లగుయశోదానందులున్నారు.నీవువారినానందింపజేయుము. అచటగోపికలు నావిరహ వ్యథచే దుఃఖితులై యున్నారు. నీవు వారికి నా సందేశమును వినిపించి, వారివేదనను దూరము చేయుము. గోపికల చిత్తములు నిరంతరము నాయందే లగ్నమై యుండును. వారి ప్రాణములు, జీవితము, వారి సర్వస్వము నేనే సుమా! నాకొఱకై వారు తమ పతిపుత్రులను బాంధవుల సంపదని త్యజించినారు వారు బుద్ధియందు గూడ నన్ను దమ ప్రియతమునిగా-కాదు, కాదు—తమ యాత్మగా భావించి యున్నారు. ఎవరు నాకొరకై తమ లౌకిక పారలౌకిక ధర్మములన్నిటిని త్యజించు దురో, వారిని భరించి పోషించుట నా నియమము. మిత్రమా, నేనా గోపికలకు పరమప్రియతముడను. నేనిచటికి వచ్చియుండుటచేత వారికి నేను దూరమైపోతినను భావముతో, నన్నే స్మరించుచు, మోహితులై మూర్ఛనుగూడ పొందుచుందురు. నా విరహవ్యథచే వారు విహ్వలలై, ప్రతిక్షణము నాకొరకు తహతహలాడుచుందురు. నా ప్రేయసులగు గోపికలు యీ సమయమందు మహాకష్టముతో మహా ప్రయత్నముతో తమ ప్రాణముల నెట్టులో నిలుపుకొని యుందురు. "నేను మరల వచ్చెద"నని, నేను వచ్చునపుడు వారికి చెప్పివచ్చియుంటిని. ఆ నా మాటయే వారికి జీవనాధారము. ఉద్ధవా, ఇంకను యేమి చెప్పమందువు? నేనే వారి యాత్మను. వారు నిత్యము నా యందే తన్మయులైయుందురు."

అని యీ విధముగ భగవానుడు పలుకగా, ఉద్ధవుడత్యంతాదరముతో భగ వత్సందేశమును గైకొని, రథారూఢుడై నందగోకులమునకు బయలుదేరినాడు. పరమ సుందరమూర్తియగు నుద్ధవుడు సాయంత్రమగుసరికి వ్రజభూమిని ప్రవేశించి నాడు. ఆ సమయమందావులు వనమునుండి వ్రజమునకు తిరిగి వచ్చుచున్నవి. ఆ గోధూళిచే యుద్ధవుని రథము కప్పబడిపోయినది. ఋతుమతులైన యావులకొరకు మదించిన యాంబోతులు తమలోతాము పోరాడుకొనుచున్నవి. వాని ఱంకెలచే వ్రజ మండలము ప్రతిధ్వనించుచుండె. కొలదికాలముక్రింద యీనినధేనువులు తమ పొదు గుల భారముచే క్రుంగుచున్నను, తమ దూడలయందలి ప్రేమచే, దూడలదగ్గరకు పరుగులెత్తుచున్నవి. తెల్లని యావుదూడలిటునటు గంతులువైచుచు చూపరుల కానందము గల్గించుచున్నవి. గోదోహన శబ్దముచేతను, వేణురవముచేతను గోకు లము శోభిల్లుచున్నది.సుందరముగా నలంకరించుకొనిన గోపీగోపకులు రామకృష్ణుల మంగళమయ చరిత్రలగానము చేయుచుండిరి. గోపాలుర గృహములందు, అగ్ని, సూర్యుడు, ఆవులు, బ్రాహ్మణులు, దేవతలు, పితృదేవతలు పూజింపబడియుండుటచే

ధూపసుగంధమన్ని వైపుల వ్యాపించియున్నది. దీపములు ప్రకాశించుచున్నవి. ఆ గృహములు పుష్పములచే నలంకరింపబడియున్నవి. అట్టి మనోహరములగు గృహములచే వ్రజము రమ్యముగ జూపట్టుచున్నది. నాల్గువైపుల వృక్షపంక్తులు ఫలభరితములైయున్నవి. పక్షుల కలరవము చేతను, మధుకర ఝుంకారముచేతను జలస్థల కమలములచేతను, సర్వము మనోరంజకముగా నున్నది. హంసకారండవములు జలమునందు విహరించుచున్నవి.

శ్రీకృష్ణుని ప్రియసహచరుడగు ఉద్ధవునిజూచి, నందరాజు మహాప్రసన్నుడైనాడు. ఉద్ధవుని కంఠాలింగనమొనర్చి, శ్రీకృష్ణునివలెనే యాతనిని సన్మానించినాడు. పరమాన్నమును భుజింపజేసినాడు. అతడారామముగ శ్రమదీర శయ్యపై విశ్రమించియుండగా సేవకులు పాదసంవాహనాదులొనర్చి వీవనలతో విసరుచుండిరి. అప్పుడు నందుడాతని దగ్గరచేరి యతనితో నిట్లుపలికె.

"మహాభాగా, ఉద్ధవా. మా మిత్రుడైన వసుదేవునకిపుడు, చెరనుండి విముక్తి కలిగినది. అతనిస్వజనులు, పుత్రాదులందరు నిపుడాతని సమీపమందేయున్నారు. ఇపుడాతడు సుఖముగనే యున్నాడుగదా! తన పాపములకు ఫలితముగ, పాపాత్ముడగు కంసుడు, తన యనుయాయులందరితో సహా, అంతమొందుట యెంత యదృష్టము! ఏలననగా, స్వభావముచే పరమ సాధువులు,ధార్మికులునైన యదు వంశీయుల నాకంసుడెల్లపుడునుద్వేషించుచుండెడువాడు. అట్టివాడు మరణించుట యాదవులందరికీ ముదావహముగదా! సరే. ఉద్ధవా,శ్రీకృష్ణుడెప్పుడైనా మమ్ముగూడ తలచు కొనుచుండునా? ఈమె యాతని తల్లి యశోద. ఇచట నతని బంధువులు, మిత్రులున్నారు. ఈ వ్రజ మండలమతనినే తమ సర్వస్వముగ, స్వామిగ భావించు చుండును. ఈ గోవులు, బృందావనము, యీగిరిరాజగు గోవర్ధనుడు, అన్నియు నతనికి చెందినవే. వీనినెప్పుడైన నతడు స్మరించుచుండునా? తన సుహృద్బాంధవుల దర్శించుటకై యెప్పుడైన యదునాథుడొక్కపరియైన వచ్చునా? ఆ విషయము చెప్పుము. అతడటులవచ్చినచో, నాతని సుందరముఖమండలము, మధురహాస్యము, ప్రేమభరిత వీక్షణముల గాంచ గల్గుదుముగదా! ఉద్ధవా, శ్రీకృష్ణుడతియుదారుడు. అనంతశక్తియుతుడు. దావానలము నుండి, మహావాతవర్షము నుండి, వృషాసుర అఘాసురాది దురత్యయములగు మృత్యు కారకములనుండి, మమ్మందరిని నొకపర్యాయముగాదు, అనేక పర్యాయములతడు కాపాడినాడు. శ్రీకృష్ణుని విచిత్ర చరిత్రము, అతని విలాస పూర్ణములగు క్రీగంటి చూపులు, ఉన్ముక్తహాస్యము, మధురభాషణము మొదలగువానిని స్మరించుకొనుచు, మేమెంత తన్మయులమగుదుమనగా, అప్పుడు మేమేపనియు చేయలేనివారలమై పోవుదుము. ఈ యమునా నదినిగాంచి శ్రీకృష్ణుడు జల క్రీడలాడుచుండెనది, యిదియే యనియు,

తన యొంటి చేతిపై నెత్తిన గోవర్ధనరాజమిదియేననియు, శ్రీకృష్ణుడు గోవుల గాచుచు వేణురవమొనర్చి నదీవనములందేయనియు, తన సఖులతో గూడి యనేక విధములగు బాల్యక్రీడలొనర్చి నదీ ప్రదేశమందే యనియు, ఆ ప్రదేశములందాతని చరణ చిహ్నముల (యింకను ఉన్నవి) వియేయనియు,-వీనినన్నిటిని గాంచుచు, మా మానసములు శ్రీకృష్ణమయములైపోవుచుండును. రామకృష్ణులిర్వురు దేవశిరోమణులని నేను నిస్సంశయముగ భావించుచుందును. అంతేగాదు. వారేదో గొప్ప దేవకార్యము నిర్వహించుటకే యిచటికి వచ్చిన యవతార మూర్తులనియు నేను భావించు చుందును. సింహమే విధముగ నెట్టి శ్రమయు లేకుండ పశువును పరిమార్చునో, యటులే శ్రీకృష్ణుడు అవలీలగా, పదివేల యేనుగుల బలముగల కంసుని అజేయులగునతని మల్లయోధులను, మహాబలవంతమగు కువలయాపీడ గజరాజమును, సునాయాసముగ సంహరించినాడు.

మూడు తాటిచెట్ల యెత్తుగలిగి, యత్యంత దృఢమగు ధనుస్సునొక యేనుగు కఱ్ఱను విరిచినట్లు తేలికగా విరిచినాడు. మా ముద్దుకృష్ణుడేడు రాత్రింబగళ్ళు గోవర్ధనగిరి నొక్క చేతితో నెత్తి యుంచినాడు. ఇచట నందరు చూచుచుండగా సమస్త దేవదానవుల నిర్జించిన మహాబలవంతులగు, ప్రలంబ, దేనుక, అరిష్ట, తృణావర్త బకాది రాక్షసులందరిని వధించినాడు, అని చెప్పదొడగినాడు నందుడు.

నందుని హృదయము శ్రీకృష్ణుని యందుగల యనురాగముచే రంజితమై పోయినది. ఈ విధముగ భగవానుని యొక్కొక్క లీల స్మరించుకొనుటచే నతని యందు ప్రేమ ప్రవాహముప్పొంగి వరదలై పారసాగినది. ఆ కన్నయ్యను కలియవలయునను తహ తహ (ప్రబలమగుకోరిక)చే నతని కంఠము గద్గదికమైనది. ఆ వేగముచే నతడు మాటాడలేక పోయినాడు.

యశోదా మాతయు నాప్రక్కనే గూర్చుండి నందుని మాటలను వినుచునే యున్నది. శ్రీకృష్ణుని యొక్కొక్క లీలనుగూర్చి నందుడు పల్కు మాటలను వినుచున్నకొలదియు నామెనేత్రముల నుండి యశ్రువులేకధారగా గారజొచ్చినవి. పుత్రవాత్సల్యముచే నామె స్తనములనుండి పాలు స్రవించినవి, నంద యశోదల హృదయములందు శ్రీకృష్ణునిపై యెంత గాఢ ప్రేమ గలదో యుద్ధవుడు గ్రహించినాడు. అతని హృదయమానందముచే నుప్పొంగిపోయినది. వారితో నతడిట్లు వచించినాడు.

"నందరాజా, మీరిరువురు శరీరధారులందరిలో, మహాశ్లాఘనీయులగు మహాత్ములనుటలోనెట్టి సందియమును లేదు. సమస్త చరాచరజగత్తును సృష్టించునట్టియు, జ్ఞానము నొసంగునట్టివాడునగు నారాయణునిపై మీకింతటి వాత్సల్యప్రేమ [పుత్ర భావము] యుండుటయే యందుకు కారణము. బలరామకేశవు లిరువురు పరమ పురుషులు. సమస్త ప్రపంచమునకు, నిమిత్త - ఉపాదాన కారణములు రెండును

వారే. శ్రీకృష్ణుడు పురుషుడు. బలరాముడు ప్రధానము [ప్రకృతి] వీరిరువురే సమస్త శరీరము లందును ప్రవేశించి వానికి జీవనదాన మొనర్చి వానియందు వాని కంటె విలక్షణముగనుండు జ్ఞానస్వరూపుడగు జీవుని నియమన మొనర్చుచుందురు. మరణ కాలమందు తన శుద్ధమైన మనస్సు నొక్కక్షణకాలమైనను యీ పురాణపురుషులందు లగ్న మొనర్చినచో, జీవుడు తనకర్మవాసనలన్నిటిని ప్రక్షాళమొనర్చుకొని శీఘ్రము గనే సూర్యసమానమగు తేజస్సుగలవాడై బ్రహ్మమయుడై పరమపదము నంద గలడు. అందరికి ఆత్మస్వరూపులై పరమకారణులైన యాభగవానులే భక్తుల యభిలాషలను సఫలమొనర్చుటకును, పృథ్వీభారమును తొలగించుటకును మనుష్యుల వలె శరీరధారణ మొనర్చి ప్రకటితులైనారు. అట్టి భగవానుని యెడల సుదృఢ మగు వాత్సల్యభావము గలిగిన మహాత్ములగు మీరిరువును చేయవలసిన శుభకర్మ లింకను యేమి మిగిలియున్నవి? [యేమియులేవని భావము] భక్తవత్సలుడును, యదువంశ శిరోమణియునగు శ్రీకృష్ణభగవానుడు, కొలది దినములలోనే యీ వ్రజ భూమికి వచ్చి, తన మాతాపితరులగు మీ యిద్దరిని నానందింపజేయగలడు.

జనులందరు చూచుచుండగా, మల్లరంగస్థలమందు కంససంహార మొనర్చిన యనంతరమాతడు మీ వద్దకువచ్చి, "నేను వ్రజమునకు వచ్చెద" నని యాతడాడిన మాట నతడు తప్పక సత్యముగావించును. నందయశోదలారా, మహానుభావులగు మీరు ఖేదమునందవలదు. మీరు తప్పక శ్రీకృష్ణుని మీవద్దగాంచగలరు. కాష్ఠమునందు అగ్ని యెల్లప్పుడును వ్యాపించియుండు విధమున, ఆ పరమాత్మ సర్వుల హృదయము లందు నంతర్యామి రూపమున నెల్లప్పుడును విరాజమానుడగుచునే యుండును. ఏ శరీరమునందు గూడ అతని కభిమానములేనందున, అతనికి ప్రియుడనిగాని, యప్రియుడనిగాని యెవడును లేడు. అతడు సర్వసముడు. అందుచే నతనికి ఉత్తమాధమభేదములులేవు. తనయందు వైషమ్యభావముగల వారియందుగూడ నత నికి వైషమ్యములేదు. అతనికి మాతాపితలుగాని, పత్నీపుత్రులుగానిలేరు. తనవారు పెరవారను భేదముగూడలేదు. అతనికి దేహమేలేదు. అందుచే జన్మయేలేదు. లోక మందతనికేమి పనియులేదు. అయినను సాధుజనులను పరిరక్షించుటకును, దుష్టుల శిక్షించుటకు మాత్రమే, దేవాది సాత్త్వికగుణయుక్తములును, మత్స్యాదితామస యుక్త ములును, మనుష్యాది మిశ్రగుణయుక్తములునగు జన్మలయందతడు లీలావతారముల నెత్తుచుండును. భగవానుడు జన్మరహితుడు. అతనియందు ప్రాకృతములగు త్రిగుణ ములలో నొక్కటియులేదు. గుణరహితుడైనను [గుణాతీతుడైనను] లీలార్థమతడు త్రిగుణముల స్వీకరించి,వానిద్వారా,సృష్టి, స్థితిలయములను గావించుచున్నాడు. మను ష్యుడు గిరగిరతిరిగినప్పుడు భూమియే తిరుగుచున్నట్లు భ్రాంతికలుగు విధమున వాస్తవముగా, కర్తయగు చిత్తమే సర్వమునకు కారణమగుచున్నది. కాని యీ

చిత్తమునందు అహంబుద్ధికలుగుటచేత, వానిని ఆత్మ [నేను] యని భ్రమించుట చేత, జీవునకు కర్తృత్వభావనకలుగుచున్నది. శ్రీకృష్ణభగవానుడు కేవలము మీకు పుత్రుడేగాదు, సమస్తజీవుల కతడు ఆత్మ, పుత్రుడు,తల్లి, తండ్రి, స్వామి-సర్వము నతడే. మనము చూచునదిగాని, వినునదిగాని, అది భూతభవిష్యత్వర్తమాన కాలము లందు దేనికి సంబంధించినదైనను, స్థావరముగాని, జంగముగాని, గొప్పదిగాని, గాని అల్పముగాని, యేవస్తువైనను శ్రీకృష్ణునికంటె వేరుగా నేదియులేనేలేదు. పరమార్థభూతుడగు నతడే సర్వమునై యున్నాడు.

శ్రీకృష్ణ సఖుడగు నుద్ధవుడు నందరాజు ఈవిధముగ ప్రసంగించుకొనుచుండ, తెలియకుండగనే రాత్రి గడచిపోయినది. తెల్లవారు ఝామున గోపికలు మేల్కాంచి, దీపారాధన గావించి వాస్తు [గృహ] దేవతా పూజ యొనర్చి, సమ్మార్జనీ కృత్యముల పూర్తి గావించి, పెరుగు చిలుకు పనిని ప్రారంభించినారు. గోపికల కరములందు కంకణములు కమనీయముగ నున్నవి. కవ్వపు త్రాడు లాగుచున్నపుడా కంకణ ములు దీపకాంతితో నింకను బాగుగా ప్రకాశించుచున్నవి. వారి పీనపయోధరములు, గురునితంబములు, మెడలయందలి హారములు కదులుచుండినవి. కర్ణకుండలముల కాంతి కపోలములపై ప్రసరించుచు వారి కుంకుమారుణ వదనముల శోభనినుమడింప జేయుచున్నవి. ఈ విధముగ సుందర శోభ గలిగిన గోపికలు, కమలనయనుని కమనీయ చరిత్రను గానము చేయుచు దధిమంథనమాచరించుచుండిరి. వారి సంగీ తము దధిమంథన శబ్దముతో మేళవించి, యద్భుతమై స్వర్గలోకము వరకు వ్యాపించి నది. ఆ మధుర స్వరలహరి యన్ని వైపుల వ్యాపించి, దశదిశలయందలి యమంగళమును నశింపజేసినది.

సూర్యభగవానుడుదయించినాడు. నందరాజ గృహ ద్వారము నందొక బంగారు రథ మాగి యుండుటను, వ్రజాంగనలప్పుడు గాంచినారు. ఆ రథ మెవరి దై యుండునోయను యాలోచన కల్గినది వారికి. కంస ప్రయోజనము సిద్ధింప జేసిన యక్రూరుడు మరలనేతెంచెనా యను శంకను వెలిబుచ్చినదొక గోపిక. మరియొకతె, అతడీమారు మనలనందరిని గొనిపోయి, మరణించిన తన మహారాజుకు పిండ ప్రదా నము జేయునా? లేనిచో నతడిచటికి వచ్చుటకు కారణమేమై యుండును?" అని తర్కించినది. వ్రజభామలీ విధముగ తమలో తాము భాషించుకొనుచుండగా, నిత్య కర్మానుష్ఠానముల నిర్వర్తించుకొని, యుద్ధవుడు వారి వద్ద కేతెంచె.

# నలుబదిఏడవయధ్యాయము

## ఉద్ధవ-గోపీసంభాషణము—భ్రమర గీతలు

శ్రీకృష్ణానుచరుఁడగు యుద్ధవుని యాకృతియు, వేషభూషణములన్నియు
ష్ణునితో సమానముగనే యుండుటను గోపికలు గాంచినారు. ఆజానుబాహు
, నూతన కమల దళములతో సమానములగు నేత్రములు, శరీరముపై పీతాంబ
, గళమునందు పద్మమాలిక, మణికుండలమండితమగు ముఖారవిందము,
యు శ్రీకృష్ణుని పోలియే యున్నవి. పవిత్ర మందహాసముతో గోపికలు
రో తాము "యితడు జూచుటకు చాల సుందరుడుగా నగుపించుచున్నాడు. కాని
డితడు? ఎక్కడనుండి వచ్చినాడు? యెవని దూతగా విచ్చేసినాడు. వేషాలంకా
లన్నియు శ్రీకృష్ణున వలెనే యేల దాల్చినాడు?" అని యనుకొనుచు నంద
నతని పరిచయము పొందుటకై యువ్విళ్ళూరుచుండిరి. ఆ గోపికలందరును,
త కీర్తియగు శ్రీకృష్ణ భగవానుని చరణ పంకజాశ్రయుడును, అతని సేవకుడు
నుద్ధవుని చుట్టు చేరిరి. తమ శ్యామ సుందరుని సందేశము గొని వచ్చిన
తెలియగనే వారందరు వినయముతో తలలు వంచి, సవ్రీడహాసేక్షణములతో
ర వాక్కులతో, నతనిని సత్కరించి, యేకాంత మందతని నుపవిష్టుని గావించి
నితో నిట్లు పలికిరి.

"అయ్యా, నీవు యదునాథుని పార్షదుడవని మేము తెలుసుకొంటిమి. అతని
శమును గొని వచ్చి నాడవనియు విని యుంటిమి. మీ స్వామి తమ తల్లి
తులకు సుఖము కలిగించుటకై మిమ్మిచటికి బంపినాడు. లేనిచో, గోవులు
రించు యీ గోకుల మందతడు స్మరించుటకు యోగ్యులగువారు మఱెవ్వరు
? తల్లి దండ్రి మొదలగు సంబంధులతోటి బంధమును మహా మహా ఋషులు,
లు గూడ, కష్టము మీద గూడ త్యజింపలేకుందురు. స్నేహానుబంధ మట్టిది.
లతో నటించునట్టి ప్రేమ — సంబంధము యొక్క యనుకరణము, యేదో
స్వార్థము కొరకే చేయబడు చుండును. తుమ్మెదలకు కుసుమములతోటి
ంధమును, పురుషులకు స్త్రీలతోటి సంబంధమును, యిట్టి స్వార్థముతో గూడిన
సంబంధములే యగుచున్నవి. వేశ్య, తన యొద్దకు వచ్చు వాని వద్ద
ు లేదని తెలియగనే, యేదో యొక సాకు చెప్పి, యాతనిని వదలించుకొనును.
నే ప్రజలు, రాజు తమకు రక్షణ గల్పింప లేని యసమర్థుడని గ్రహించినప్పు
ని త్యజించెదరు. అధ్యయనము పూర్తియైన పిమ్మట నాచార్యుని
చు శిష్యు లెందరు గలరు? యజ్ఞము నందు దక్షిణ ముట్టగనే ఋత్విజులు
పుకొని లేచిపోవుదురు. వృక్షము నందు ఫలములై పోవగనే పక్షు లెగిరి

పోవును. అతిథులాదరించిన పిమ్మట నిష్క్రమించెదరే గాని, గృహస్థుని జూచుచు కూర్చుందురా? వనమందగ్ని రగుల్కొనినచో పశువులు పరువెత్తిపోవును. స్త్రీ హృదయ మందనురాగ మెంత యున్నను, జార పురుషుడు తన యవసరము దీరిన వెనుక నామె వైపు తిరిగి చూడడు." అని పలుకసాగిరి.

గోపికల మనోవాక్కాయములు గోవిందునియందు లగ్నమై పోయినవి. ఉద్ధవుడు శ్రీకృష్ణుని దూతగా వ్రజమునకు వచ్చినపుడు, గోపికలా ప్రకారము మాటలాడుచు, యే మాట యెవరితో నేవిధముగా పలుక వలయునను విషయమే మఱచిపోయిరి. భగవానుడు శైశవము నుండి కిశోరావస్థ వరకు యెన్ని దివ్య లీలల గావించి యుండెనో, వానిని స్మరించుకొనుచు గోపికలు వానిని గానము చేయుచుండిరి. శరీరములనే మఱచి పోయిన వారు, స్త్రీ జన సహజమగు లజ్జను గూడ వీడి, వెక్కి వెక్కి యేడవ దొడగిరి. ఒక గోపిక కప్పుడు, శ్రీకృష్ణ సమాగమ లీల స్మృతికి రాగా, తన సమీపము నందే తిరుగాడుచున్న యొక తుమ్మెదను గాంచి, కోపగించిన తనను సమాధాన పరచుటకై పంపిన దూతగా దానిని భావించి, యా తుమ్మెదతో నా గోపిక, యిట్లు చెప్పసాగెను.

శ్లో॥ మధుపకి తన బంధో మాస్పృ శాంఘ్రింసపత్న్యాః
కుచ విలులి తమాలా కుంకుమ శ్మశ్రుభిర్నః
వహతి మధుపతిస్స న్మానినీ నాంప్రసాదం
యదుసదసివిడంబ్యం యస్యదూత స్త్వమీదృక్ః

ఓయీ మధుకరా, నీవు కపటియొక్క సఖుడవు. కావున నీవుగూడ కపటముగలవాడవే. నీవు మా పాదములను తాకకుము. మిథ్యాప్రణామము లొనర్చి మా యెడల అనునయ-వినయము ప్రదర్శింపకుము. మా సవతుల వక్షఃస్థలములందు నలిగిన శ్రీకృష్ణుని వనమాల కంటిన కుంకుమ నీ మీసములకు గూడ నంటుకొనియే యున్నది. నీవు స్వయముగా యే కుసుమమునుగూడ ప్రేమించవు. ఒక పూవు నుండి మఱియొక పూవున కెగురుచునే యుందువు. నీ ప్రభువెట్టివాడో నీవును అట్టి వాడవే. మధుపతియగు శ్రీకృష్ణుడు మథురానగర మానినీమణులనే సేవించుచు వారి కృపాప్రసాదమగు కుంకుమను-యాదవ సభయంద హాస్యపాత్రమగు దానిని-తనే యుంచుకొనుగాక. దానిని నీ ద్వారా మా వద్దకు పంపవలసిన యావశ్యకత యేమున్నది?

నీ వెటుల నల్లగ నుంటివో నీ ప్రభువు గూడ నటులనే నల్లనివాడు. నీవు పుష్పముల రసము గ్రహించి యెగిరిపోవుచుందువు. అటులే యాతడిటనుండి వెడలి పోయినాడు. ఆ మహానుభావుడు కేవలమొక్క పర్యాయము-అటులనే దోచుచున్నది. కేవలమొక్క పర్యాయము మాత్రమే, సంమోహనకరము, మాదకమునగు తన

యధరసుధను కొంచెము రుచిచూపి, యమాయక గోపికలమగు మమ్ము వదలి యిచటినుండి వెడలిపోయినాడు. సుకుమారియగు లక్ష్మి యీ కపటియొక్క చరణ కమలముల సేవ యెట్లు చేయుచున్నదో యర్థమగుట లేదు. శ్రీకృష్ణుని మధురము లగు మాయ మాటలకామె తప్పక మోసపోయియే యుండును! చిత్తచోరుడామె చిత్తమునుగూడ హరించి యుండవచ్చును.

'ఓరీ భ్రమరమా, మేము వనములందుండు వారము. మాకు సరియైన యిండ్లు వాకిళ్ళు గూడలేవు. అట్టి మా యెదుట నీవు యదువంశ శిరోమణియగు శ్రీకృష్ణుని గొప్ప గుణములనేల గానము చేసెదవు? మా యలకదీర్చుటకై యట్లు జేయుచుంటివా? కాని, యాతడు మాకేమి క్రొత్తవాడుగాడు. మాకు చాల బాగా తెలిసిన పాతవాడే సుమా! నీ ముఖస్తుతి మావద్ద సాగదు. వెళ్ళు వెళ్ళు. నీ యాటలు సాగునట్టిచోటికి వెళ్ళుము. విజయసఖుడగు శ్రీకృష్ణుని యొక్క మధురాపుర ప్రేయసులవద్దకు వెళ్ళి యాతని గుణగానము చేయుము. వారు క్రొత్తవారు గావున యతని లీలలను వారు పూర్తిగా నెఱుగరు. పైగా వారిప్పుడాతని నూతన ప్రియు రాండ్రు. వారి హృదయ వ్యధ నాతడిప్పుడు తొలగించుచున్నాడు. నీ ప్రార్థనను వారు స్వీకరించెదరు. నీ ముఖస్తుతికి వారు సంతసించి వారు నీవు కోరినదెల్ల నిచ్చెదరు.

ఆ శ్రీకృష్ణుడు మా కొరకై విలవిలలాడుచున్నాడని నీవెందుకు చెప్పెదవు! అతని కపట భరితమగు మధుర మందహాసమునకును, కనుసైగలకును వశము గాని స్త్రీ యెవతెయుండును? స్వర్గమర్త్యపాతాళముల యందట్టి స్త్రీ యొకతెయు నుండదు. ఇతరుల మాటయెందుకు? స్వయముగ లక్ష్మీదేవియే యందుకు తార్కాణము. అతని చరణ రజసేవనమామె చేయుచునే యున్నది గదా! శ్రీకృష్ణునకు మా లెక్క యేమున్నది? కాని నీవాతని వద్దకేగినప్పుడు యీ విధముగ చెప్పుము. "నీనామము "ఉత్తమ శ్లోకుడ"ని చెప్పుదురు. గొప్ప గొప్ప వారు గూడ నీ కీర్తిని గానము చేయుచుందురు. కాని దాని సార్ధకత నీవు దీనులయందు దయజూపుట యందే యుండును. కానిచో, కృష్ణా, నీ యుత్తమ శ్లోక నామము వ్యర్థమగును."

"ఓ మధుకరా, నీవు నా పాదమును ముట్టకుము. అనునయ-వినయములు చూపుటయందును గొప్ప నైపుణ్యముగలవాడవని నాకు తెలియును. నీవు శ్రీకృష్ణుని వద్ద యీ విద్యయే నేర్చుకొనివచ్చినట్లగుపడుచున్నది. కోపముతో నున్నవారియలక దీర్చుటకై, సందేశవాహకుడగు దూతయెట్టి చమత్కారమును ప్రదర్శించవలయునో యాతడు నీకు బాగా నేర్పినట్లున్నది. కాని నీ పప్పులిక్కడ యుడకవని గ్రహిం పుము. చూడు! మేము శ్రీ కృష్ణుని కొరకు మా పతి-పుత్రులను, యితర బాంధవుల

నందరిని వదలి వచ్చియుంటిమి. కాని యాతని యందేమాత్రము కృతజ్ఞత యను నదిలేదు. నిర్మొగమాటముగనతడు మమ్ము వదలి వెళ్ళినాడు. ఇట్టి కృతఘ్నునితో మేమెట్లు రాజీపడవలయునో, నీవే చెప్పుము! అతనిపై విశ్వాసముంచవలయునని నీ వింకను అనగలవా?"

"అరే మధుపా. అతడు రామావతారమెత్తినప్పుడు, కపిరాజగు వాలిని, నిర్దయగా వ్యాధునివలె చెట్టుచాటున నుండి వధించినాడు. కామించి వచ్చిన శూర్పణఖను, తన స్త్రీకి వశుడైయుండి, నిర్దయగా ముక్కు చెవులు గోయించి విరూపను జేసి పంపినాడు. బ్రాహ్మణ గృహమున వామనుడై జన్మించి యప్పుడేమి చేసినాడు? ఆ బలిచక్రవర్తి యతనిని పూజించి యతడు కోరిన దానినిచ్చినాడు. వామనుడాతడొనర్చిన పూజనంతయు గ్రహించి, వారుణపాశములతో నాతనిని బంధించి పాతాళమందు బడవైచినాడు. కాకి బలిని గ్రహించి తనకు బలినొసంగినవానిని తనతోటి కాకి సమూహముతో చుట్టుముట్టి, యతనిని బాధించునట్లున్నదతడు చేసినపని.

అయినదేదోయైనది. ఇక మాకు కృష్ణునితోనేగాదు, మఱియే నల్లటి వస్తువుతోగూడ మిత్రత్వము చేసనందువలన మాకెట్టి ప్రయోజనముండదని నిశ్చయించుకొంటిమి. "అట్లయినచో మీరాకృష్ణుని గూర్చిన చర్చయేలజేసెదరు?" అని నీవనుచో ఓ భ్రమరమా, మేము నిజము పలుకుచున్నాము. ఒకమారతనితో యేప్రకారమైన సాంగత్యము కలిగినను ఆవ్యసనము నుండి విడిపించుకొనుట సాధ్యముగాదు. అందుచేతనే మేమెంత ప్రయత్నించిననుగూడ, అతనిని గూర్చిన చర్చ విడువలేకుండనుంటిమి.

శ్లో. యదనుచరిత లీలా కర్ణపీయూషవిప్రుట్
సకృదదన విధూత ద్వంద్వ ధర్మావినష్టాః
సపది గృహ కుటుంబం దీనముత్సృజ్యదీనా
బహవఇవ విహంగా భిక్షు చర్యాంచరంతి

శ్రీకృష్ణుని లీలారూపమగు కర్ణామృతమునందలి యొక్క బిందువుయొక్క రసాస్వాదనమునైనను చేసిన వానికి రాగ-ద్వేషములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వ భావములన్నియు తొలగిపోవును. అట్టి యనేకులు, దుఃఖితులైయున్న తమ యింటి వారినందరిని వదలి, దరిద్రులై, పక్షులవలె, భిక్షుచర్య యొనర్చుచు దీనులవలె తిరుగుచుందురు. అయినను శ్రీకృష్ణ లీలలకు సంబంధించిన కథలను విడువలేక యుందురు. వాస్తవమేమన, అందలి రసము, వ్యసనము అంతగొప్పవి. మాదశగూడ నట్టిదే.

కృష్ణసార మృగపత్నులగు హరిణము లేవిధముగా వ్యాధునియొక్క సుమధుర గానముచే నాకర్షితములై యతని వలలో జిక్కి మరణించునో, అటులనే

కల్లకపట మెఱుగని గొల్లపిల్లలమగు మేమును వంచకుడగు కృష్ణుని కపటభరిత మగు తీయని వాణిచే నాకర్షితులమై యతని మాటలన్నియు సత్యమను భ్రమతో నుండి, యతని నఖస్పర్శచే గలుగు కామవ్యాధికి మాటిమాటికి లోనగుచు కాలము గడిపియుంటిమి. కావున శ్రీకృష్ణ దూతవగు వో మధుకరమా, యిక యీ విషయ ములో నీవింకేమియును చెప్పకుము. నీకేదైన చెప్పవలయునని యున్నచో, కృష్ణుని సమాచారము వదలి మఱింకేదైన చెప్పుము. మా ప్రియతముని ప్రియమిత్రమా, నీవొకమారతని వద్దకేగి మరల వచ్చినట్లు కనుపడుచున్నావు. మా ప్రియతముడు మా యలకదీర్చుటకే నిన్నవశ్యము పంపినట్లు తోచుచున్నది. నీవన్నివిధముల మాకు మాననీయుడవే. కావున నీ కోరికయేమో చెప్పుము. మానుంచి నీకేమి కావలయునో యది యడుగుము. అయ్యో, ఆ మహాత్మునివద్దకు వెళ్ళి తిరిగి వచ్చుట కడుదుర్లభము. మేమతని వద్దకిదివరకు వెళ్ళియే యుంటిమి. కాని నీవు మమ్మచటికి గొనిపోయి చేయగలిగినది మాత్రమేమున్నది? ప్రియభ్రమరా, అతని వక్షఃస్థలమందతని ప్రియభార్యయగు లక్ష్మీదేవి యెల్లపుడు నివసించుచున్నది గదా! మేమక్కడ చేయు నిర్వాకమేమున్నది. సరేకాని, ఆర్యపుత్రుడు గురుకులము నుండి తిరిగివచ్చి మధురయందు సుఖముగ నున్నాడా? ఆ విషయము చెప్పుము. ఎప్పుడైనా, తన తలిదండ్రులగు యశోదానందులను, యిచటి గృహములను, బంధువులను, తన సహచరులైన గొల్లపిల్లలను జ్ఞాపకము చేసుకొనుచుండునా? ఈ దాసీలమగు మా విషయమెపుడైనా అతని మాటలయందు దొరలుచుండునా? అగరుతో సమానమగు పరిమళముగల యాతని భుజములను మా శిరసులందు మోపునట్టి యదృష్టము మాకెపుడైనా కలుగునా? చెప్పుము. మా జీవితములందట్టి శుభదినమేనాటికైన వచ్చునా?"

కృష్ణదర్శన లాలసలై, కృష్ణునికొరకు తహతహలాడుచుండిన గోపికల మాటలనాలించి, యుద్ధవుడు, వారికి శ్రీకృష్ణ సందేశమును వినిపించి యోదార్చదల చినవాడై, వారితో నిట్లు పలుకదొడగె.

"గోపికలారా, ఆహా, మీరు కృతకృత్యులు. మీ జీవితములు ధన్యములు. మీరు లోకమునకు పూజనీయులు. ఎందుకనగా, శ్రీకృష్ణ భగవానునకు మీ హృదయ మును, మీ సమస్తము నీ విధముగ సమర్పణ గావించిన పుణ్యమూర్తులు. దాన, వ్రత, తపో, హోమ, జప, వేదాధ్యయన, ధ్యాన, ధారణ, సమాధి మొదలగు యితర సాధనములచేత భగవద్భక్తి ప్రాప్తికై ప్రయత్నము చేయబడుచుండును. ఆ యుత్తమ శ్లోకుని యందనుత్తమమగు ప్రేమభక్తిని మీరు పొంది, గొప్ప గొప్ప ఋషీశ్వరులకు గూడ దుర్లభమగు ప్రేమ భక్తికి మీరాదర్శమూర్తులైనారు. మీరెంత యదృష్టవంతులు! మీ పతిపుత్రులను, స్వజనులను, యిండ్లను, దేహాభిమానమును గూడ వదలి, సర్వులకు పరమ పతియగు పురుషోత్తముని పతిగా వరించిన మీకు

పరమపతివ్రతలు. సౌభాగ్యవతులారా, శ్రీకృష్ణవియోగముచే, సమస్త వస్తురూపముగా తన దర్శనము కలిగించునట్టి యింద్రియాతీతుడగు పరమాత్మ యొక్క భావమును మీరు పొందగలిగినారు. ఆ భావమును మీరు నాయెదుట గూడ ప్రకటితము గావించినారు. ఇది, దేవీ మణులగు మీరు నాయందు జూపిన యపారమగు కృపయే. నేను స్వామి యొక్క రహస్య కార్యముల నిర్వర్తించు భృత్యుడను. మీకు పరమ సుఖమును కల్గించుటకై, మీ ప్రియతముడగు భగవానుడు ప్రేమ సందేశమును నా ద్వారా పంపినాడు. ఆ సందేశము గొనియే నేనిచటికి వచ్చితిని. ఆ సందేశమును వినిపించెద. సావధానముగ వినుడు" అని కృష్ణ సందేశము నుద్ధవుడు, గోపికలకీ క్రింది విధమున తెల్పెను.

శ్రీకృష్ణ సందేశము :

"నేను సర్వమునకు నుపాదాన కారణమగుటచే, అందరకి ఆత్మను. అన్నిటి యందుననుగతమైయుందును. కావున నాతో మీకెప్పుడును వినియోగమనునదియుండ జాలదు. ప్రపంచమందలి సర్వభౌతిక పదార్థములయందును, పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, లను పంచభూతములు వ్యాప్తములైయున్నవి. వాని చేతనే సర్వవస్తువులును నిర్మింపబడియుండుటచే, ఆ పంచభూతములే వస్తురూపములుగా నున్నట్లయితే, నేనును మనఃప్రాణభూతేంద్రియ గుణాశ్రయుడనై వ్యాపించి యుంటిని. అవి నాయందున్నవి నేను వానియందున్నాను. యథార్థమేమనగా నేనే వీటన్నిటి రూపమున ప్రకటితమగుచున్నాను. నేనే, నా మాయాశక్తిద్వారా భూత, యింద్రియ, విషయ రూపములదాల్చి, వానికాశ్రయుడనైయుండి, నిమిత్తకారణము గూడ నేనేయై నన్ను నేనే సృజించుకొనుచున్నాను, పాలించుచున్నాను, లయము జేయుచున్నాను. ఆత్మజ్ఞానమయము, శుద్ధము. మాయ, మాయాకార్యములకంటె నది వేరుగానుండును. గుణములేవియు ఆత్మను స్పృశింపజాలవు. మాయకు మూడు వృత్తులుగలవు. సుషుప్తి, స్వప్న, జాగ్రత్తులనునవి. ఈ వృత్తులద్వారా, అఖండానందబోధ స్వరూపమగు ఆత్మయొకప్పుడు ప్రాజ్ఞుడుగను, యింకొకప్పుడు తైజసుడు గను, మఱియొకప్పుడు విశ్వుడుగను ప్రతీతమగుచుండును. స్వప్నమందు గానుపించు పదార్థమువలెనే, జాగ్రదవస్థయందు గూడ యింద్రియగోచరములగు పదార్థములుగూడ మిథ్యయనియే మానవుడు తెలియవలయును. ఇందుచేత, యింద్రియ విషయముల నెల్లపుడు చింతించుచుండు మనస్సును, మరియు నింద్రియములనునిగ్రహించి, నిదురనుండి లేచినప్పుడు స్వాప్నికవిషయములవలెనే జాగ్రద్విషయములను గూడ మిథ్యాత్వనిశ్చయముచే త్యాగమొనర్చి నా [ఆత్మ] సాక్షాత్కారమును పొందవలయును [పొందుడు] ఏ విధముగా నదులన్నియు తిరిగి తిరిగి సముద్రమునందే లయించునో, బుద్ధిమంతులయొక్క వేదాభ్యాసము, యోగసాధనము, ఆత్మానాత్మవివేకము, త్యాగము, తపస్సు, యింద్రియ సంయమనము, సత్యము మొద

లగు సమస్త ధర్మములును, నా ప్రాప్తియందే సమాప్తిచెందును. అన్నియు మన స్సును నిగ్రహింపజేసి నావద్దకు చేర్చునవేగనుక, వాటియన్నిటికి యథార్థమగు ఫలము నా సాక్షాత్కారమే.

గోపికలారా, నేను మీ జీవన సర్వస్వ మనుటలో నెట్టి సందేహమునులేదు. అయితే, నేను మీకింత దూరముగా నుండుటకు కారణమేమియో చెప్పెద వినుడు. దూరముగా నుండుటచే మీరు నిరంతరము నా ధ్యానము చేయుచు, శారీరకముగా దూరము నందున్నను నిత్యము మానసికముగ నా సాన్నిధ్య మందున్నటుల మీరనుభూతి పొందుదురు. మీ మానసములను నా సన్నిధియందే యుంచుడు. స్త్రీల యొక్క, లేక ప్రేమికులయొక్క చిత్తములు పరదేశమందున్న తమ ప్రియతముని యందు నిశ్చల భావముతో లగ్నమైన విధముగా, తమ సాన్నిధ్యమందున్నప్పుడుం డదు. సర్వవృత్తి రహితమైన మీ సంపూర్ణ మనస్సును నాయందు లగ్న మొనర్చి మీరెప్పుడు నన్ను స్మరించుచుందురో, అప్పుడచిరకాలము నందే మీరు నన్ను చేర గలుగుదురు. నేను బృందావనమందు, మీతోశారదీయ రాత్రివేళ రాసక్రీడ సలిపి నప్పుడు, స్వజన నిర్బంధముచే నచటికి రాలేక పోవుటచే రాసక్రీడయందు పాల్గొన లేకపోయిన గోపికలు, నా లీలలచే మనసా స్మరించుకొనుచు, నన్నే పొందియుం డిరి. (నేను మిమ్ము తప్పక కలుసుకొనెదను నిరాశపడవలసిన పనిలేదు.)

అని యుద్ధవుడు శ్రీకృష్ణుని సందేశము వినిపింపగా, గోపికలు ఆనంద పారవశ్యమునందిరి. ఆ సందేశముచే వారికి, భగవానుని యొక్కొక్క లీలయు జ్ఞప్తికిరాసాగినది. అతని దివ్య స్వరూపము కనులముందు సాక్షాత్కరించినట్లయి నది. ప్రేమ సంభరితలై వారుద్ధవునితో నిట్లు పలికిరి.

ఉద్ధవా, పాపాత్ముడు, యదువంశీయుల కష్టనష్టముల బెట్టిన వాడునగు, కంసుడు, తనయనుచర సహితముగ నంతమొందుట యానందించదగిన విషయము. శ్రీకృష్ణుడు తన స్వజనుల మనోరథముల పూర్ణమొనర్చి, వారితో సుఖముగ నుండు టయు తక్కువ సంతోషకరమేమీగాదు. కాని యుద్ధవా, ఒక్కమాట నీవు మాకు చెప్పుము! "మా ప్రేమ సంభరిత సవ్రీడహాసములతో, ఉదార వీక్షణములతో యే ప్రకారముమేమాతని పూజించియుంటిమో, అటులనే యతడుగూడ మమ్మే ప్రకా రము ప్రేమించియుండునో, మధురానగర స్త్రీలనుగూడ నతడావిధముగనే ప్రేమించు చుండెనా, లేదా?" అని యొక గోపిక యనగానే, మరియొక గోపిక "సఖీ, మన శ్యామసుందరుడు ప్రేమయొక్క మోహినీకళయందు మహాప్రజ్ఞగలవాడే ! శ్రేష్ఠస్త్రీలందరతనిని ప్రేమించుదురు. అందున, మధురయందలి నాగరికస్త్రీలు తియ్యతియ్య మాటలాడుచు, తమ హావభావ విలాసయుక్తములగు వీక్షణము

లతనిపై ప్రసరింపజేయగా, నతడు వారి యందేల ప్రసన్నుడు గాకుండును?" అని పలికె.

ఇంకొక గోపిక యిట్లనినది. "సాధుమహాశయా, ఈ విషయము చెప్పుము. నగరనారీ మండలియందు యేదైన ప్రసంగము వచ్చినపుడు, మాశ్యామసుందరుడెట్టి సంకోచము లేకుండ ప్రేమ సంభాషణలు చేయుచున్న సమయమందు ప్రసంగ వశ శముగనైనా,పల్లె గొల్లపడుచులమగు మమ్మెపుడైనా జ్ఞాపకము చేసుకొనునా?"

మఱికొందరు గోపికలు, "ఉద్ధవా, ఎప్పుడైనా యదునందనుడు మధురము లగు నాటి శారదరాత్రులను స్మరించునా? చెప్పుము. కుముదకుందకుసుమములు వికసించియుండ, వనమందంతట వెన్నెల వ్యాపించియుండగా,బృందావనమత్యంత రమణీయకతను సంతరించుకొని యుండగా, ఆ రాత్రుల యందారమణుడు రాసమండల మేర్పరచి, మాయందరితోగూడి రాసనృత్యము సలిపియుండేనే! ఆహా. ఆ రాసలీల యెంత సుందరమైనది! ఆ సమయమందు మా నూపురములు మధురముగ శబ్దించుచుండ, మేమందరమా కృష్ణలీలలను గానము చేయుచుండగా నాతడు మాతో నానా ప్రకారములగు విహారములొనర్చినాడు." అనిరి.

మరికొందరు గోపికలు "ఉద్ధవా! మేమందఱమాతని విరహాగ్నియందు మాడిపోవుచున్నాము! దేవరాజగు యింద్రుడు వర్షము కురిపించి వనములను సస్య శ్యామలమొనర్చు విధముగ, గోవిందుడుగూడ తన కరస్పర్శాదులచే మాకు జీవన దానము చేయుటకై, యెప్పుడైనా యిక్కడకు వచ్చునా?" యని ప్రశ్నించిరి.

అప్పుడింకొక గోపిక "ఓసే చెలీ, యిపుడాతడు శత్రుసంహార మొనర్చి రాజ్యము సంపాదించినాడే,చూచినవారందరితో స్నేహము చేయుచుతిరుగుచుండును. గొప్పగొప్ప మహారాజుల కూతుళ్ళ నాతడు వివాహము చేసుకొనును. వారితోనానందముగ కాలము గడుపునుగాని పల్లెటూరివారమగు మనదగ్గర కేలవచ్చునే?" యని పలికె, మఱియొకతె". మాధవుడు మహాలక్ష్మికి పతి. ఆతడు పూర్ణకాముడు. కృతకృత్యుడు. మనవంటి వనవాసులగు పల్లెపడుచులతోగాని, లేక రాజకుమారికలతో గాని యాతనికి ప్రయోజనమేమియులేదు, మనము లేనిచో నతని కాగిపోవుపనియే మున్నది? చూడు, వేశ్యయైనప్పటికిని, పింగళ యెంత చక్కగా చెప్పినదోచూడు. "సంసారమందు దేనిమీదగూడ ఆశపెట్టుకొనక యుండుటయే మహాసుఖము" అని చెప్పినది. ఈమాట మనకు తెలిసినదే. అయినను, శ్రీకృష్ణుడు తిరిగి రాగలడను నాశను విడువలేకున్నాము. ఆ యాశయే మనకు జీవనము. ఎవని కీర్తిని మహాత్ములుగూడ గానము చేయుచుందురో అట్టి మనప్రియతముడగు శ్యామసుందరుడు, మనతో నేకాంతమగు పల్కిన ప్రేమమయములగు మధురవాక్కులను వదలుటగాని, మఱువవలయునను సంకల్పముగాని మనమెటుల చేయగలము? అతడు కోరకున్నను

లక్ష్మీదేవి యాతని చరణముల వీడలేకున్నది చూడుడు! ఒక క్షణకాలముగూడ నాతని యంగసంగమువీడి యావలకేగుటలేదు! ఉద్ధవా! ఆ శ్రీకృష్ణుడు జలక్రీడ గావించిన నది యిదియే, చూడు. దేని శిఖరముపైనెక్కి యాతడు మురళిని వాయించెనో ఆ గోవర్ధనగిరి యిదియే. అతడు రాసక్రీడ నొనర్చిన బృందావనమిదియే. ప్రతిదిన ముదయమే మా కనులయెదుట, మేపుటకై యడవికి దోలుకొనిపోయి, సాయంత్రముం మేము చూచుచుండగా నింటికి దోలుకొని వచ్చుచుండిన గోవులివియే. అతడానాడొనర్చుచుండిన వేణునాదమే యిప్పటికిని మా చెవులయందు మ్రోగుచున్నది. బలరామ సహితముగ శ్రీకృష్ణుడీ పనులన్నిటిని చేయుచుండెడివాడు. ఇచ్చటి ప్రతి ప్రదేశము, ప్రతి ధూళికణముగూడ పరమసుందరమగు నతని చరణములచే చిహ్నితములే. వానిని మేము చూచినప్పుడుగాని, విన్నపుడుగాని, నిత్యము మేము చేయునది యదియేగదా-అవి శ్యామసుందరుని మా మనోనేత్రములయందు నిల్పుచుండును ఉద్ధవా! చచ్చినను మేమతనిని మఱువజాలము అతని హంసగమనము, మధురహాసము, విలాసభరితములగు చూపులు, మధుమయవాణి, అన్నియు మా చిత్తములను హరించునవి. మా మనములు మా వశము దప్పినవి. మేమాతని నెట్లు మఱువగలము? ప్రియతమా, శ్రీకృష్ణా! నీవే మా జీవితములకు స్వామివి. మా సర్వస్వము నీవే. నీవు లక్ష్మీదేవికి పతివైన మాత్రమేమి? మాకు నీవు వ్రజనాధుడవే. వ్రజ గోపికల కేకైక స్వామివి నీవే. శ్యామసుందరా, నీ వెన్నియోమారులు మా వ్యధను బాపియుంటివి, మా సంకటములదొలగించితివి. గోవిందా, గోవులనిన నీకెంతయో ప్రేమగదా. మేము మాత్రము గోవుల వంటి వారము గామా?నీ యీగోకులమంతయు-గోపబాలురు, తల్లిదండ్రులు, గోవులు, గోపికలమగు మేముఅందరము గూడ అపారమగు దుఃఖసాగర మందు మునిగి యున్నాము. నీవు యీ గోకులము నుద్ధరించుము. వచ్చి మమ్మందరిని రక్షింపుము" అనుచు తమ యావేదను వెల్లడించిరి.

శ్రీకృష్ణ సందేశముచే గోపికల విరహ వేదన కొంత యుపశమించినది. ఇంద్రియాతీతుడగు భగవానుడాత్మ రూపమున సర్వత్ర స్థితుడై యున్న విషయమును వారు గ్రహించిరి. ఇపుడు వారుద్ధవుని ప్రేమాదరములతో సత్కరించ సాగిరి. గోపికల విరహ వ్యథను శాంతింప జేయుటకై యుద్ధవుడు గోకులమందు కొన్ని నెలలపాటు వసించినాడు. భగవానుని గోపికలకు వర్ణించి చెప్పుచు వ్రజవాసులందరిని యుద్ధవుడానంద పరచుచుండె. కృష్ణలీలా విషయికమగు చర్చ జరుగుచుండుటచేత గోకుల మందుద్ధవుడున్న కాలమొక క్షణమువలె వ్రజవాసులకు దోచినది. భగవానుని ప్రియభక్తుడగు నుద్ధవుడొకప్పుడు నదీతటమునకేగుచు,

యింకొకప్పుడు వనములందు సంచరించుచు మఱియొకప్పుడు గిరిసానువుల యందు తిరుగుచుండెడువాడు. శ్రీకృష్ణుడేయే లీలల నెక్కడెక్కడ గావించెనో వ్రజవాసుల నడిగి తెలుసుకొనుచు, వారికి భగవల్లీలా స్మరణ కలిగించుచు తన్మయుల గావించు చుండె.

ఉద్ధవుడు గోకులమందు వసించి, గోపికల ప్రేమ వికలత్వమును, వివిధ ప్రేమ చేష్టలను సందర్శించినాడు. వారి తన్మయతను గాంచి యాతడు ప్రేమానంద భరితుడైనాడు. గోపికల కాతడు ప్రణామము లొనర్చుచు నతడీవిధముగ గానము చేయసాగినాడు. "ఈ పృథివి యందు గోపికల శరీర ధారణమే సర్వశ్రేష్ఠము, సఫల మునై యున్నది. ఏలనగా:- వీరు సర్వాత్మయగు శ్రీకృష్ణ భగవానుని ప్రేమ మయ మగు దివ్య మహాభావము నందు స్థితులై పోయినారు. గోపికల ప్రేమ యొక్క యీ యుత్తమోత్తమ స్థితి, సంసార భయభీతులై మోక్షము వాంఛించు వారికి మాత్ర మేగాక, గొప్ప గొప్ప మునులకు, ముక్తజనులకు, మా వంటి భక్తజనులకు గూడ వాంఛనీయమే యగుచున్నది. మేమిట్టి యుత్తమస్థితిని పొందలేకుంటిమి. భగవానుని లీలా రసవ్యసనము కలిగిన వానికి, కులీనత్వము యొక్కగాని, ద్విజాతి సముచిత మగు సంస్కారము యొక్క గాని, గొప్ప గొప్ప యజ్ఞ యాగాదుల యొక్కగాని యవసరమే మున్నది? లేక, భగవత్కథా రసప్రాప్తి కలుగనిచో, వాటియందు రుచి కలుగనిచో, ననేకమారులు బ్రహ్మ పదవి లభించినను దాని వలన లాభమేమి యుండును? ఆచార, జ్ఞాన, జ్ఞాతి హీనులైన వనవాసులగు యీ పల్లెల గొల్ల భామ లెక్కడ? సచ్చిదానంద ఘనుడగు శ్రీకృష్ణ భగవానుని యందు వీరికిట్టి యనన్య ప్రేమ కలుగుటెక్కడ?

అహా! వీరెంతధన్యలు! దీనిచే, యెవడైనను భగవానుని స్వరూపమునుగాని, రహస్యమునుగాని, తెలియకున్నను గూడ, అతనిని ప్రేమించినవో, భజన మొనర్చి నచో, భగవానుడే తన శక్తిచేత, తన దయచేత, నట్టివానికి పరమ శుభము కల్గించు నను విషయము నిరూపింపబడు చున్నది. తెలియక పోయినను అమృతము త్రాగినచో, ఆ యమృతము తనవస్తు శక్తిచేత, త్రాగినవాని కమృతత్వము నందించును గదా! రాసోత్సవమునందు భగవానుడే గోపికల, కంఠములందు తన బాహువులనుంచి, వారి మనోరథమును సఫలమొనర్చియుండె. వీరికి భగవానుడెట్టి కృపా ప్రసాదమును పంచియిచ్చెనో, వీరికెట్టి ప్రేమదానమొనర్చెనో, అట్టిది భగ వానునకు పరమ ప్రేమయియు. నిత్యసంగినియు, వక్షఃస్థలమందు విరాజమాన యునగు లక్ష్మీదేవికి గూడ లభించలేదనుట సత్య దూరముగాదు. కమల సుగంధ కాంతియుతులగు దేవాంగనలకును లభించలేదు. * ఇతర సామాన్య స్త్రీలమాట చెప్పనేల? నేనీ బృందావనధామమందు చిన్న మొక్కగనో, లతగనో, ఓషధిగనో

జన్మించినచో, నా కదియెంతయో మంచిది యగును. ఆహా! నేనట్లు జన్మించినచో నాకీ వ్రజాంగనలయొక్క చరణ ధూళి నిరంతరము సేవించు భాగ్యము లభించును గదా! వీరి చరణ ధూళియందు స్నానమాడి నేను ధన్యుడనగుదును గదా?

ఆహా, గోపికలెంత ధన్యురాండ్రు! విడుచుట కత్యంత కఠినమగు, స్వజనమును, లోకాచారమును ఆర్య మర్యాదనుగూడ త్యజించి ఈ గోపికలు, భగవానుని స్థానమును, అతనితో తన్మయత్వమును, అతని పరమప్రేమను పొందగలిగినారు. ఇతరులమాట యెందుకు? భగవద్వాణి, అతనినిః శ్వాసరూపములగు శ్రుతులు, ఉపనిషత్తులుగూడ, యింతవరకు భగవానుని పరమ ప్రేమమయమగు స్వరూపము నన్వేషించుచునే యున్నను, పొందజాలకయున్నవి.

భగవాను నెల్లపుడు పూజించుచుండు లక్ష్మీదేవియు, విధి శంకరాది పరమ సమర్థులగు దేవతలును, పూర్ణకాములై యాత్మారాములగు వారును,యోగేశ్వరులును, తమ హృదయములందెవరిని గూర్చి చింతన చేయుచుందురో, యట్టి శ్రీకృష్ణుని చరణారవిందములను, రాసలీలాసమయమందు, గోపికలు తమ వక్షస్థలముల యందుంచుకొని యాలింగనమొనర్చి, తమ హృదయ తాపమును, విరహ వ్యధను శాంతపరచుకొనిరి. నంద గోకులమందలి వ్రజాంగనల పాదరేణువులకు నేను మాటి మాటికి నమస్కరింతును. నేను ఆ చరణ ధూళిని శిరమునదాల్తును. ఆహా యీ గోపిక లొనర్చిన శ్రీకృష్ణ లీలా సంబంధమగుగానము ముల్లోకములను యిప్పుడూ యెల్లప్పుడూ పవిత్రమొనర్చుచునే యుండును పునీతమొనర్చుచున్నవి." అని యుద్ధవుడనియె.

శ్లో॥ వందేనంద వ్రజ స్త్రీణాం పాద రేణుమభీక్ష్ణశః
యాసాంహరి కథోద్గీతం పునాతి భువనత్రయం.

పరీక్షిన్నరేంద్రా, యీ ప్రకారము కొన్ని మాసములు వ్రజమందువసించిన యుద్ధవుడు మధురకేగ దలచినవాడై, గోపికలవద్ద, నందయశోదలవద్ద సెలవు గైకొని, గోపబాలురకు వీడ్కోలు చెప్పి, రథారూఢుడాయె. రథము కదిలినది. నందాది గోపకులనేక కానుకలగొని రథమునొద్దకు వచ్చి, "నాయనా, ఉద్ధవా, మేమెపుడును,మా మనోవృత్తులు,సంకల్పములన్నియు శ్రీకృష్ణుని చరణకమలములనే యాశ్రయించి యుండవలయునని వాంఛించుచున్నాము. అతని సేవ కొరకే లేచి, అతని సేవయందే నిమగ్నులమైయుండ గోరుచున్నాము. మావాక్కు లెల్లపుడు నతని నామోచ్చారణమునే సల్పుగాక, శరీరమతనికే నమస్కరించుగాక. మేమంద రమతని యాజ్ఞాపాలన మొనర్చు సతని సేవయందే యుండెదముగాక. ఉద్ధవా, మేము నిజము పలుకుచున్నాము. మాకు మోక్షమందు వాంఛలేదు. భగవానుని

[19]

యిచ్చానుసారము, మాకర్మలననుసరించి, మేమెట్టి జన్మమెత్తినను, ఆ జన్మల యందు శుభాచరణ మొనర్చుచు, దానములొసర్చుచు, వాటికి ఫలితముగా శ్రీకృష్ణుని యందు మా భక్తి యుత్తరోత్తరాభివృద్ధి గాంచుగాక యనియే మేము వాంఛించు చున్నాము." అని యశ్రుపూరిత నయనములతో ప్రేమపూర్వకముగ బల్కుచు, కానుకలనాతనికి సమర్పించిరి. గోపాలులందరిచే నీవిధముగ సన్మానితుడై, యుద్ధవుడు కృష్ణపాలితమగు మధురాపురమును చేరెనాడు.

శ్రీకృష్ణునకు నమస్కరించి, యుద్ధవుడు, వ్రజవాసుల ప్రేమభక్త్యుద్రేకమును తాను చూచినది చూచినట్లాతనికి వినిపించినాడు. అనంతరము నందాదులొసంగిన కానుకల నెవరివి వారికి, అనగా కృష్ణునకు, వసుదేవునకు, బలరామునకు, ఉగ్రసేన మహారాజునకు సమర్పించినాడు.

# నలుబది యెనిమిదవ యధ్యాయము

## భగవానుడు, కుబ్జ–అక్రూరుల గృహములకేగుట

శ్రీశుకులు పరీక్షిత్తుతోనిట్లు చెప్పుచున్నారు.

"సర్వాత్మయు, సర్వదర్శనుడునగు శ్రీకృష్ణభగవానుడు, తన సమాగమాభి లాషచే వ్యాకులితమైయున్న కుబ్జకు సంతోషము గల్గించుటకై, యామెగృహమున కేగినాడు. కుబ్జ గృహము బహుమూల్యములగు సామగ్రితో సంపన్నమైయున్నది. శృంగార రసోద్దీపనములగు వస్తువులనేకము లచట సేకరింపబడి యున్నవి. ముక్తా దామ పతాకములచేతను, వితానశయనాసనములతోను నిండియున్నది. సుగంధ ధూపములు, పరిమిళిత పుష్పహారములు చందనాదులు సుగంధమును వెదజల్లు చున్నవి. దీపకాంతులు సర్వత్ర వ్యాపించి యున్నవి.

భగవానుడు తన గృహమున కేతెంచుట గాంచిన కుబ్జకు మహాసంభ్రమము కల్గినది. ఒక్కయుదుటున లేచి, చెలికత్తెలతో సహా యెదురేగి, విధి పూర్వకముగా భగవానునకు స్వాగత సత్కారములు నెరపినది. ఉత్తమాసన మందతని నుపవి ష్టుని గావించి వివిధోపచారములతో నతనిని పూజించినది. అతని వెంట వచ్చిన భక్తశిఖామణియగు నుద్ధవునిగూడ సముచిత రీతిని సత్కరించినది. కానియాతడామె యొసంగిన యున్నతాసనమును స్వీకరింపక చేతితో తాకి భూమియందే యుపవిష్టు డాయె. (తన స్వామి సమీపమందు తానాసనమందు గూర్చుండరాదని యాతని భావము) శ్రీకృష్ణుడు సచ్చిదానంద స్వరూపుడైనప్పటికిని, లోకాచారము ననుసరించి వెంటనే లేచి, సుందరముగా నలంకరించియున్న శయన గృహమందామె

పర్యంకమునందు గూర్చుండె. కుబ్జయు, స్నానమొనర్చి వస్త్రాభరణములచేతను, అంగరాగాదులచేతను, చక్కగా నలంకరించుకొని, సిగ్గులొలక బోయుచు చిరు నవ్వులతో, హావభావములు వెలువరించుచు, ప్రేమభరితములగు క్రీగంటిచూపులు భగవానునిపై ప్రసరించుచు నతని దరికి చేరినది. నవసంగమ సంకోచముచేత కుబ్జ కొంచెము తొట్రుపడుచున్నది. శ్యామసుందరుడామెను తనవద్దకు బిలిచి, కంకణ శోభితమైన యామె ముంజేతిని తన చేతితో పట్టుకొని, శయ్యయందధివసింపజేసి, యామెతో క్రీడించి యామె సమర్పించిన చందనాద్యంగరాగానులేపన ఫలము నామె కనుగ్రహించినాడు. కుబ్జ, భగవానుని శ్రీ చరణములను, కామసంతృప్తమైన తన వక్షఃస్థలమందునను, నేత్రములందున నుంచుకొని, వాని దివ్యసుగంధము నాఘ్రా ణించుచు, తన హృదయమందలి యాధివ్యాధుల పోగొట్టుకొనినది. ఆనంద మూర్తియు తన ప్రియతముడునగు గోవిందుని, తన భుజములతో గాఢాలింగనము గావించుకొని, దీర్ఘ కాలమునుండి తాననుభవించుచున్న విరహతాపమును శాంతింప జేసుకొనియె. రాజా, కుబ్జ కేవలమంగరాగమును మాత్రమే సమర్పించినందులకే, కైవల్యమోక్షప్రదాతయగు, సర్వశక్తిమంతుడగు, దుష్ప్రాపుడగు యీశ్వరుని పొందగలిగినది. కాని యా దౌర్భాగ్యురాలు, భగవంతుని పొందిగూడ, వ్రజ గోపికలవలె సేవాభాగ్యము నభ్యర్థించక, యిట్లు కోరినది. "ప్రియతమా, నీవు కొన్ని దినములిట్లు నా వద్దనే యుండి నాతో క్రీడించుచుండుము. ఏలననగా, కమల నయనా, నీ పొందు విడిచిపెట్టుట నాకు సాధ్యము గాకుండ నున్నది" భగవాను డందరిని గౌరవించువాడు. కావున యామె కోరికను మన్నించి, కామవరమును ప్రసాదించి, యనంతరము ఉద్ధవ సహితముగా స్వధామము చేరెను.

సర్వేశ్వరుడగు భగవంతుని ప్రసన్నుని గావించుకొనుట జీవుని కత్యంత కఠినము. అట్టి దురారాధ్యుని ప్రసన్నుని గావించుకొనియు, విషయ సుఖమును గోరుట, కుబ్జ విషయసుఖమును వాంఛించుట, యామె బుద్ధిలోపముగాక మఱేమి? నిజమునకు విషయసుఖమత్యంత తుచ్ఛము గదా. *

తదనంతర మొకనాడు ఉద్ధవ, బలరామ సహితముగా, భగవానుడు, అక్రూ రుని యభీష్టము దీర్చుటకును, అతనిచే నొకపని చేయించుటకుగూడ, నతని యింటి కేగినాడు. నరవర శిరోమణి తన యింటికి వచ్చుచుండుటను దూరమునుండియే

---

* రామావతారకాలమున శ్రీరాముని పొందుగోరి వచ్చిన శూర్పణఖ యాతనిచే తిరస్కృతురాలైనది. ఇతర ప్రయత్నములు ఫలించనందున, రామానుగ్రహ ప్రాప్తికై పుష్కర క్షేత్రమందామె పదివేల సంవత్సరములు, రామేశ్వరుని గూర్చి తపము చేయగా, నాతడు ప్రత్యక్షమై, 'ద్వాపరాంతమున నీ కోరిక దీరగలద'ని వర మొసంగె. ఆమెయే కుబ్జగా జన్మించి, యభీష్టసిద్ధి నందినది.

గమనించిన యక్రూరుడు, యెదురేగి యానందనిర్భరుడై యభినందనలు దెలుపుచు నాలింగనము జేసుకొనియె. నమస్కార ప్రతి నమస్కారములైనవి. యథోచిత పూజలొనర్చినాడక్రూరుడు. వారందరి నుపవిష్టుల గావించి, ముందుగా భగవానుని పాదముల కడిగి యా జలమును తన శిరముపై జల్లుకొనినాడు. దివ్య వస్త్ర, గంధ, మాల్యాభూషణములతో పూజించి సతశిరస్కుడై నమస్కరించి, యతని పాదములను తన యొడిలోనుంచుకొని, పాదసంవాహనము చేయసాగినాడు. ఆ సమయమందు రామకృష్ణుల నుద్దేశించి యాతడిట్లు పలికె.

"స్వామీ, పాపియగు కంసుడు తన యనుచరులతో సహా మరణించుట మన యదృష్టము. ఆనందప్రదము. మీరిరువురట్టి ఘనకార్యమొనరించి, యదువంశమును సంకట పరిస్థితినుండి గట్టెక్కించుటయేగాక, వంశాభ్యున్నతిని, సర్వసంపత్సమృద్ధత్వమునుగూడ గల్గించితిరి. మీరు జగత్కారణులు, జగద్రూపులునైన యాది పురుషులు. మీకంటె వేరుగా యే వస్తువును—కారణముగాని, కార్యముగాని—లేనే లేవు. ముకుందా, నీవే నీ శక్తిచే విశ్వమును సృష్టించి, నీవే, కాలమాయాది శక్తి సమన్వితముగ నందు ప్రవేశించి, సమస్త వస్తురూపముగా ప్రతీతుడవగుచుందువు. పృథివ్యాది కారణతత్త్వములవలన. వాని కార్యములగు స్థావర జంగమ శరీరము లుత్పన్నములైనటులనే, వాని యందనుప్రవిష్టములై యనేక రూపములతో ప్రతీతమగుచున్నవి. కాని వాస్తవములో నవి కారణరూపములేయై యున్నవి. ఇదే విధముగ నీవు కేవలుడివేయైయున్నను, నీ కార్యరూపమగు జగత్తునందు, స్వేచ్ఛచే, ననేక రూపములందు ప్రతీతుడవగుచుందువు. ఇదిగూడ నీకొక లీలయే. ప్రభూ, నీవు నీ శక్తులగు, రజోగుణ, సత్త్వగుణ, తమోగుణముల నాశ్రయించి, క్రమముగా, సృష్టి, స్థితి, లయము లొనర్చుచుందువు. కాని, నీవు శుద్ధజ్ఞానస్వరూపుడవగుటచే, ఆ త్రిగుణములతోగాని వానిద్వారా చేయబడు కర్మలతోగాని యెట్టి సంగము లేక యుందువు. అట్టి నీకు బంధహేతువేమియుండును?

స్వయముగా ఆత్మవస్తువునందు, స్థూలదేహ, సూక్ష్మ దేహాది యుపాధులు లేని కారణముచేత, దానియందు జన్మమరణములుగాని, మఱెట్టి భేదభావములును కలుగనేరవు. అందుచేతనే నీకు బంధముగాని, మోక్షముగాని లేవు. తమ యభిప్రాయానుసారము నీయందు బంధమోక్షములను కల్పించుటకు కారణము కేవలము మా యవివేకమేగాని వేఱొండుగాదు. జగత్కల్యాణార్థము నీవే యీ వేదమార్గమును ప్రవర్తింపజేసితివి. పాఖండపథానువర్తులచే యీ వేదమార్గము బంధింపబడునపుడల్లా నీవు శుద్ధసత్త్వమయ స్వరూపముతో నవతరించుచుందువు. అటులనే యిపుడుగూడ, నీయంశస్వరూపుడగు బలరామ సహితముగ, పృధ్వీభారము తొలగించుటకై వసుదేవ గృహమునందు వాసుదేవుడవుగా నవతరించితివి. అసురుల యంశచే

నుద్భవించిన, నామమాత్ర రాజన్యులనెల్ల, నక్షౌహిణీశత సేనాయుతముగ సంహరించి, యదువంశ యశమును విస్తరింపజేయగలవు. పరమాత్మా, సమస్త దేవతలు, పితరులు, భూతగణములు, రాజులు అందరును నీ మూర్తులే. నీ పాదోద్భవ యగు గంగ ముల్లోకములను పావనమొనర్చుచున్నది. సమస్త జగత్తునకు నీవు తండ్రివి, గురుడవుగూడ. అట్టి నీవు నేడు నా గృహమునకు విచ్చేసితివి. నేడు నా గృహము పరమపావనమైనదనుటలో సందేహమేమీలేదు. నీవు ప్రవేశించిన గృహము యొక్క సౌభాగ్యమున కవధియుండదు. ప్రభూ, నిన్ను ప్రేమించు భక్తులకు నీవు పరమ ప్రియతముడవు. నీవు సత్యవక్తవు. అకారణహితుడవు. కృతజ్ఞుడవు. కొంచెము సేవించిన వారినైన నభిమానించెదవు. అట్టి నిన్ను వదలి యితరుల సేవించువాడెవ్వడైనను బుద్ధిమంతుడగునా? నిన్ను ప్రేమతో సేవించు భక్తులకు సర్వాభీష్టములు సిద్ధింపజేయుచుందువు. వృద్ధిక్షయరహితమై, యేకరసమగు నీ యాత్మనుగూడ వారికి దానము జేయుదువు. జనార్దనా, యోగీశ్వరులు, సురేశ్వరులు గూడ నీ స్వరూపమును తెలియజాలకుందురు, అట్టిచో! సామాన్యులమగు మాకు నీ ప్రత్యక్ష దర్శనము లభించినది. ఇది యెంత సౌభాగ్యకరమగు విషయము ! ప్రభూ, మేము, స్త్రీ, పుత్ర, ధన, జన, దేహ, గేహాదుల యందలి వ్యామోహమను త్రాటిచే గట్టిగా కట్టబడియున్నాము. ఇదియంతయు నీ మాయాజాలమే. నీవు మాపై దయయుంచి, యీ మోహబంధమును శీఘ్రముగా త్రుంచి వేయుము.” అని యీ ప్రకారము మహాభక్తుడగు అక్రూరుడు, భగవానుని పూజించి స్తుతించినాడు. భగవానుడు మందహాస మొనర్చుచు, తన మధురవాక్కుతో నతనిని మోహింపజేయుచు, నిట్లుపలికె.

నాయనా, నీవు మాకు గౌరవనీయుడవు. పితృతుల్యుడవు. హితోపదేశకుడవు. మా వంశమందత్యంత ప్రశంసనీయుడవేగాక, మా శ్రేయోభిలాషివిగూడ. మేము నీకు బాలురవంటివారము. నీచే రక్షింపబడుటకు, పాలింపబడుటకు యోగ్యులము. నీ కృపాపాత్రులము. శుభములు గోరువారు, నీవంటి పరమపూజనీయులగు మహానుభావుల నెల్లపుడు సేవించుచుండవలయును. మీవంటి సత్పురుషులు దేవతలకంటె గూడ గొప్పవారు. దేవతల యందు స్వార్థ ముండును. కాని సత్పురుషుల యందు స్వార్థ ముండదు. కేవలము జల తీర్థములే, (నదులు - సరస్సులు మొదలగునవి) తీర్థములు గావు. కేవలము మృచ్ఛిలా మయములగు మూర్తులే దేవతలుగారు. అట్టి దేవతామూర్తుల ననేక దినములు శ్రద్ధతో సేవించిననేగాని, మనసు పవిత్రము చేయరు. కాని సత్పురుషులు దర్శన మాత్రముచేతనే, యితరులను పవిత్రుల జేయుదురు. నీవు మాకు హితైషివి. మా సుహృత్తులలో సర్వశ్రేష్ఠుడవు. కావున పాండవులకు హితము కల్గించుటకు

గాను, వారి క్షేమ సమాచారముల దెలిసికొనుటకు గాను, నీవు హస్తినాపురమునకు వెళ్ళవలయును. పాండురాజు మరణించిన పిమ్మట తమ తల్లియగు కుంతీదేవితో గూడ యుధిష్ఠిరాది పాండవులు మహా దుఃఖములో నుండిరని మాకు వర్తమాన మందినది. ధృతరాష్ట్ర మహారాజు వారలను హస్తినాపురము రావింపగా, వార లిపుడచట నుండిరనియు తెలియవచ్చినది. ధృతరాష్ట్రుడంధుడగుటయే గాక, యతని యందు మనోబలము గూడ లేదను విషయము నీకు తెలియునుగదా! అతని పుత్రుడగు దుర్యోధనుడతి దుష్టుడు. అతని కధీనుడై యుండుటచేత, గ్రుడ్డి రాజు, తన పుత్రులతో సమానముగా పాండవులతో వ్యవహరింప లేకున్నాడు. నీవచటికి వెళ్ళి, యతడు పాండవుల యెడ మంచిగా వ్యవహరించుచుండెనా లేదా యను విషయము తెలుసుకొనుము. నీ ద్వారా యీ విషయము తెలుసుకొని, మా సుహృత్తులగు పాండవులకు సుఖము కల్గించు నుపాయము నేనాలోచించెదను." అని సర్వశక్తి మంతుడగు భగవాను డీరీతి యక్రూరు నాదేశించి, బలరామ యుద్ధవ సహితుడై యట నుండి, తన భవనమునకేగె.

# నలుబదితొమ్మిదవ యధ్యాయము

## అక్రూరుని హస్తినాపుర యాత్ర

భగవానుని యాదేశానుసారము అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్ళినాడు. ఆ నగరము పురువంశ రాజుల యమర కీర్తిచే చిహ్నితమై యున్నది. అచట నక్రూరుడు ధృతరాష్ట్ర భీష్మ, విదుర, కుంతీ, బాహ్లీక, సోమదత్త, ద్రోణాచార్య కృపాచార్య, కర్ణ, దుర్యోధన, అశ్వత్థామలను, ధర్మరాజాది పంచపాండవులను, యితర మిత్రులను గలిసినాడు. గాందినీ సుతుడగు నక్రూరుడు తన యిష్ట మిత్రులతో పరస్పర కుశల ప్రశ్న జేయు సందర్భమున, హస్తినాపుర వాసుల యోగ క్షేమముల విచారించుచు, కొన్ని నెలలు హస్తినాపుర మందుండి పోయినాడు. ధృతరాష్ట్రుడు పాండవుల యెడల నెట్లు వ్యవహరించుచుండెనో తెలుసుకొనుట కొరకే, యతడు హస్తినాపుర మంతంత కాలము వసించె. ధృతరాష్ట్రునకు తన దుష్ట పుత్రుల యిష్టమునకు వ్యతిరేకముగానే పని చేయుటకును సాహసములేకుండె. యథార్థముగ, నతడు శకుని మొదలగు వారి దుష్ట బుద్ధులననుసరించియే పనులు చేయుచుండె. కుంతీ, విదురులక్రూరునకు, పాండవుల ప్రభావము బలము, శస్త్ర కౌశలము, వీరత్వ వినయాది సద్గుణములగురించి, ధృతరాష్ట్రపుత్రులగు దుర్యోధనాదులు వారిని ద్వేషించుచుండిన విషయమును దెలిపిరి. ప్రజలు పాండవులను ప్రేమిం

చుచుండుటచే, వారింకను క్రోధోద్రిక్తులగుచు పాండవులకనిష్టము దలపెట్టుచుండిరి. అంతవరకు ధృతరాష్ట్రపుత్రులు కొన్నిపర్యాయములు పాండవులకు విషప్రయోగము సల్పుట, యింకను పలు విధములగు సత్యాచారములు చేయుట మొదలగు విషయములన్నియు నక్రూరునకు, కుంతీవిదురులు సమగ్రముగ దెలిపిరి.

అక్రూరుడు కుంతీనివాసమునకు వెళ్ళినపుడు ఆమె తన యన్నవద్ద గూర్చుండినది. అతనిని జూడగనే యామెకు తన పుట్టింటి విషయములు గుర్తునకురాగా, యామె నేత్రము లశ్రుసిక్తములైనవి. "సోదరా, నా తలిదండ్రులు, సోదరీ సోదరులు, మేనల్లుండ్రు, కులస్త్రీలు, స్నేహితురాండ్రు, నన్నెపుడైనా తలచుకొనుచుందురా? నా మేనల్లుళ్ళగు బలరామకృష్ణ భగవానులు, గొప్ప భక్తవత్సలులనియు, శరణాగతరక్షకులనియు నేనువినియుంటిని. వారు తమ మేనత్త కుమారులగు పాండవులనెప్పుడైన స్మరించుచుందురా? నేను శత్రుమధ్యమందు, శత్రువులచే చుట్టబడి, తోడేళ్ళమధ్యనున్న యాడులేడివలె శోకాకులితనైయున్నాను. నా పిల్లలు తండ్రిలేనివారైనారు. మా కృష్ణుడెప్పుడైనా యిచటికి వచ్చి, నాకును, యీ యనాథ బాలురకును యూరటగలిగించునా? (శ్రీకృష్ణుడామె సమీపమందున్నటుల భావించి పల్కుచున్నది).

శ్లో. కృష్ణకృష్ణమహాయోగిన్ విశ్వాత్మ న్విశ్వభావన
ప్రపన్నాంపాహిగోవింద శిశుభిశ్చావసీదతీం
నాన్యత్తవపదాంభోజా త్పశ్యామిశరణం నృణాం
బిభ్యతాంమృత్యుసంసారా దీశ్వరస్యాపవర్గికాత్

"సచ్చిదానంద స్వరూపా, శ్రీకృష్ణా, నీవు యోగీశ్వరుడవు. విశ్వాత్ముడవు. సమస్తజగత్తునకు జీవనదాతవు, గోవిందా! నా పిల్లలతోసహా నేను దుఃఖము మీద దుఃఖముననుభవించుచున్నాను. నిన్ను శరణువేడుచున్నాను. నన్ను రక్షింపుము. నా పిల్లలను గాపాడుము. నా కృష్ణా యీ సంసారము మృత్యుమయము. నీ చరణములు మోక్షప్రదములు. జననమరణరూపమగు సంసారమునకు భయపడినవారలకు నీ చరణములకంటె వేరు శరణములేదనియు, వానికి మించిన యాధారములేదనియు నేను గ్రహించినాను. నీవు మాయాలేశము గూడ లేని పరమశుద్ధుడవు. నీవు స్వయముగా పరమాత్మవు. పరబ్రహ్మవు. సమస్త సాధనములకు, యోగములకు నీవు స్వామివి. యోగముగూడ నీ స్వరూపమే. శ్రీకృష్ణా, నేను నీ శరణుజొచ్చితిని. నన్ను రక్షింపుము."

"పరీక్షన్మహారాజా, మీ ప్రపితామహియగు కుంతీదేవి, యీ ప్రకారము తన స్వజనమును స్మరించుకొని, యంతమందు జగదీశ్వరుడగు శ్రీకృష్ణుని స్మరించి, యత్యంతదుఃఖితయై వెక్కివెక్కియేడ్చినది. అక్రూరుడు విదురుడుగూడ సుఖ-

దుఃఖములను సమానముగ జూచునట్టి ద్వంద్వాతీతులగు మహానుభావులు. వారిరువురు, కుంతికి, ఆమె పుత్రులు దేవతాంశసంభూతులను విషయము జ్ఞప్తికిదెచ్చి, వారధర్మమును నశింపజేసి, ధర్మముద్ధరించగల మహానుభావులు, కారణజన్ములను విషయమును సూచించుచు, ననేకవిధములుగ నామె నోదార్చిరి. అక్రూరుడు మథురకేగదలచినవాడై, ధృతరాష్ట్రుని వద్దకేగినాడు. ఇప్పటికాతనికి, ధృతరాష్ట్రుడు తన పుత్రులయెడ పక్షపాతముగలవాడై పాండు పుత్రులను పుత్రసమానముగ చూచుట లేదని పూర్తిగా తెలిసినది. నిండు కౌరవ సభయందాతడు హితైషులగు బలరామ కృష్ణుల సందేశము నీవిధముగ వినిపించినాడు.

"ధృతరాష్ట్ర మహారాజా, కురువంశము యొక్క యుజ్జ్వల కీర్తిని పెంపొందించుము. నీ సోదరుడగు పాండురాజు స్వర్గస్థుడై నీకు రాజ్యాధికారము సంక్రమించుటచే నీ బాధ్యత ఇంకను పెరిగినది. ధర్మముగా రాజ్యపరిపాలనముచేయుచు నీ సద్వ్యవహారముచే ప్రజలను ప్రసన్నుల గావించుము. స్వజనులయందు సమాన వైఖరి నవలంబింపుము. అట్లు ప్రవర్తించిన యెడలనే, నీకిహమందు యశస్సును పరలోకమందు సద్గతియు లభింపగలవు. అందుకు భిన్నముగ వ్యవహరించినచో, యీ లోకమందు నీకు నింద గలుగుటయేగాక, దేహాంతమున నరక ప్రాప్తియు సంభవించును. కావున నీ పుత్రులు, నీ సోదరుని పుత్రులగు పాండవుల యెడల సమాన సద్భావముతో వ్యవహరించుము. ఈ సంసారమందెక్కడను, యెవనితోనైనను సాంగత్యము యెల్లపుడు నుండదను విషయము నీకు తెలియనిదిగాదు. ఎవరితో మనము కలిసి యుందుమో వారితో నేదో యొక సమయమున విడిపోవుట తప్పదు. మన శరీర విషయమందు గూడ నిది పరమ సత్యము. ఇక స్త్రీ, పుత్ర, ధనాదుల విడిచిపోవు విషయమందు చెప్పునదేమున్నది? జీవుడేకాకిగనే జన్మించుచున్నాడు.ఏకాకిగనే చచ్చిపోవుచున్నాడు. తానొనర్చిన పాప పుణ్య ఫలములను గూడ తానొక్కడే యనుభవించుచున్నాడు. ఏ భార్యా పుత్రులను మన వారినిగా భావించుచున్నామో, వారు "మేము నీ వారము. మిమ్ము భరించి పోషించుట నీ ధర్మము" అను మాటలు చెప్పుచు, జీవుని యధర్మ కార్యములందు ప్రవర్తింపజేసి, యతని యధర్మార్జితవిత్తమునంతయు హరించెదరు. తన వారని భావించి ఎవడు, పోషించెనో, అట్టి మూర్ఖ జీవుని యసంతుష్టునిగా చేసి పుత్రాదులును, ధనము, చివరకు ప్రాణములు గూడ త్యజించి యావలకు బోవును. ధర్మము నుండి తప్పినవాడు నిజముగా, లౌకికమగు స్వార్థమును గూడ గుర్తింపజాలడు. ఎవరికొరకు తానధర్మమునకు పాల్పడెనో, వారతనిని వర్జించెదరు. వాని కెన్నటికిని సంతోషానుభవము కలుగ నేరదు. తన పాపముల మూట నెత్తికెత్తుకొని, యాతడు నరకమునకేగును. కావున నో మహారాజా, యీ ప్రపంచము మూడునాళ్ళ ముచ్చటయనియు, స్వప్న మాయా మనోరథమనియు, యింద్రజాలము వంటిదనియు, బాగుగా గుర్తించి, నీవు నీ ప్రయత్నముచే

శక్తిచే, నీ మనస్సును నిగ్రహించి, మమతావశుడవై పక్షపాతమును జూపకుము. నీవు మహా సమర్థుడవు. సమత్వము కల్గియుండుము. సంసార దృష్టి నుండి యుపరతుడవై, ప్రశాంత స్థితి నందుము" అని యుపదేశించిన యక్రూరునితో ధృతరాష్ట్రుడిట్టులనియె.

"దానపతీ, అక్రూరా. నీవు నాకు శుభము కల్గించు పలుకుల చక్కగా పలికితివి. మరణించబోవు వాని కమృతము లభించినచో నెంత త్రాగినను వానికి తృప్తి కలుగని చందమున, నీ యమృతమయములగు వాక్యములెంత విన్నను, తనివిదీరుట లేదు. కాని, హితైషివగు అక్రూరా, నా హృదయము పుత్రులపై గల మమత్వకారణముచే విషమమై యుండుట చేత, చంచలమగు నా చిత్తమందు నీ హిత బోధ కొంచెము గూడ నిలువక యున్నది. స్పటిక పర్వత శిఖరమందొక విద్యుల్లత తళుక్కున మెరిసి, మరుక్షణము నందే యంతర్ధానమగునట్లుగా నీ యుపదేశ వాక్యములంతర్థానములగుచున్నవి. పృథ్వీ భారమును పోగొట్టుటకై సర్వశక్తిమంతుడగు భగవంతుడు యదుకులమందవతరించెనని విని యుంటిని. అతని నిర్ణయమును మార్పు చేయగల పురుషుడెవ్వడుఁగలడు? భగవదిచ్ఛయెటులున్నదో యటులనే జరుగును. భగవానుని మాయామార్గమచింత్యము. ఊహాతీతము. ఆ మాయ నాశ్రయించియే భగవానుడు సృష్టి గావించి యందు ప్రవేశించుచున్నాడు. కర్మ, కర్మఫలముల విభాగము చేయుచున్నాడు. ఈ సంసార చక్రము యొక్క నిరాటంకగమనమునకు, భగవానుని యచింత్య లీలా శక్తియే దప్ప వేఱొక కారణములేదు. అట్టి పరమైశ్వర్య శాలియగు పరమేశ్వరునకు నేను ప్రణమిల్లుచున్నాను" అని ధృతరాష్ట్రుడనియె.

ఈ ప్రకారము ధృతరాష్ట్రుని యభిప్రాయమును తెలిసికొనిన యక్రూరుడు, కురు వంశీయులగు స్వజన, బాంధవులవద్ద, ప్రేమ పూర్వకమగు ననుమతిని పొందినవాడై, మధురకు వెళ్ళి, రామకృష్ణుల సమక్షమున, ధృతరాష్ట్రుని వ్యవహారమంతయు నివరించి, పాండవుల యెడ గల భావమును చెప్పినాడు. అక్రూరుని హస్తినకు పంపుటలోని యుద్దేశ్యమదియే గదా!

# ఉత్తరార్ధము

## ఏబదియవ యధ్యాయము

### జరాసంధునితో యుద్ధము—ద్వారకా నిర్మాణము

శ్రీ శుకులు చెప్పుచున్నారు.

"పరీక్షిన్మహారాజా, కంసునకు, అస్తి-ప్రాప్తియను యిరువురు భార్య లుండిరి. వారిరువురును జరాసంధుని పుత్రికలు. తమ పతి మరణముచే వారికి మహా దుఃఖము కలిగినందున, తమ తండ్రివద్దకు వారు వెళ్ళిరి. * జరాసంధుడు మగధ దేశాధిపతి. వారు తమ తండ్రితో తాము విధవలగుటకు కారణమును వివరించిరి. ఆ సమాచారము వినగనే మొందాతని కమితదుఃఖము కలిగినది. పిదప క్రోధా వేశము కలిగినవాడై, భూమియందు యాదవుడనువాడు లేకుండ చేసెదనని నిర్ణ యించుకొని, యుద్ధమునకు సన్నద్ధుడాయె. ఇరువది మూడక్షౌహిణులుగల మహా సేనావాహినితో నతడు, యాదవుల రాజధానియగు మథురపై దండు వెడలినాడు.

శ్రీకృష్ణ భగవానుడు చూచినాడు.జరాసంధుని సేన యుప్పొంగుచు చెలి యలి కట్టదాట నుంకించుచున్న సముద్రమువలె నున్నది. వచ్చి మధురానగరమును నాల్గువైపుల ముట్టడించినది. అందుచే పురవాసులందరును భయభీతులగుటనుగూడ భగవానుడు చూచినాడు. పుడమి భారమును పోగొట్టుటకేగదా పురాణపురుషుడు, మానుష వేషమున నవతరించినది! దేశకాలానుగుణముగా తన యవతార ప్రయోజన

---

*** జరాసంధుడు :**

మగధ దేశాధీశుడగు బృహద్రథునకు యిరువురు భార్యలుండిరి. కాని వారి యందాతనికి సంతానము లేకుండుటచే, రాజు చండకౌశికుడను మునిని ప్రార్థించగా నతడు, చెట్టునుండి తన యొడియందు పడిన పండును రాజునకిచ్చి, యతని భార్య కొసంగమని పలికె. రాజు దానిని కోసి యిరువురు భార్యల కొసంగె. పాదాదిమస్త కాంతము రెండుభాగములుగానైన శిశుఖండములను రాణులు చెరియొక దానిని ప్రసవించిరి. బాధపడిన యా రాణులు వానిని బారవేయించిరి. ఆ నగరదేవతయగు జర యను రక్కసి యా రెండు ఖండములను సంధించగా శిశు రూపమేర్పడినది. జరచే సంధింపబడినందున జరాసంధుడను పేర బరగినాడు. చండకౌశికుని యనుగ్రహా మున నతడు మహా బలవంతుడాయె. యుక్తవయస్కుడైన యతనికి రాజ్య మొసంగి బృహద్రథుడు భార్యాసహితముగ, తపస్సాచరించుటకై, వనమేగినాడు.

(మహాభారతం-సభాపర్వము)

మును సిద్ధింప జేయదలచినాడు భగవానుడు. "మగధరాజు, తనయొక్కయు, తన సామంతరాజులయొక్కయు చతురంగ బలములతో గూడిన యక్షౌహిణీల సైన్యము దెచ్చుట చాలమంచిదై నది. వీరందరు భూమికి భారమైనవారే. ఇంతమందిగుమిగూడి నా సమీపమున కేతెంచినారు. నేను వీరిని సంహరించెదను. కాని యిప్పుడు జరాసంధుని చంపరాదు. ఎందుకనగా, వాడు జీవించియున్నచో మరల బలముల సేకరించుకొని రాగలడు. వారిని మరల సంహరించుట సంభవించును. పృథ్వీభారమును తగ్గించుట, దుష్టశిక్షణ శిష్టరక్షణయేగదా నా యవతార ప్రయోజనము. ఆయా సమయములందు, ధర్మమును రక్షించుట కొరకును, వృద్ధిపొందుచుండు నధర్మమును అణచుటకును, నేనింకను, అనేక యవతారముల దాల్చుచుందును."

అని భగవానుడీ ప్రకారమాలోచించుచుండగనే, సూర్యకాంతితో వెలుగుచున్న రెండు రథములు దివినుండి భువికి దిగినవి. వానియందు యుద్ధమునకువలయు సామగ్రియంతయు నున్నది. ఇరువురు సారథులు వానిని నడుపుచుండిరి. భగవానుని సనాతనములగు దివ్యాయుధములు గూడ నతనిని చేరినవి. అదియంతయు జూచి, శ్రీకృష్ణుడు తన యన్నయగు బలరామునితో నిట్లు వచించె. "అన్నా, నీవు గొప్ప శక్తిశాలివి. ఇప్పుడు యదువంశీయులందరు నిన్నే తమ స్వామిగను, రక్షకునిగను భావించుచున్నారు. మీ యధీనమందున్న వారికి మహాకష్టము సంభవించినది. చూడు. ఇది నీ రథము. నీకు ప్రియములైన, హల, ముసలాయుధములు గూడ వచ్చినవి. ఇప్పుడు నీవీ రథమధిరోహించి శత్రుసంహారము చేసి, స్వజనుల నీ విపత్తునుండి రక్షింపుము. స్వామీ, సాధుజనులను కాపాడుటకే గదా మనమిరువురమీ యవతారముల దాల్చినది! కాన, నీవిపుడు, యిరువది మూడక్షౌహిణుల సేనాభారమును పుడమికి దప్పింపుము" అని పలికె. బలరామకృష్ణులిద్వురు నాలోచించుకొని, కవచముల ధరించి, రథారూఢులై నగరమునుండి వెలువడినారు. సోదరులిర్వురు తమ తమ యాయుధముల గ్రహించినారు. కొద్దిపాటి సేనయు వారి వెంట కదలినది. దారుకుడు శ్రీకృష్ణుని రథమును నడుపుచున్నాడు. నగరమునుండి వెలువడినపిమ్మట భగవానుడు తన పాంచజన్యమును పూరించినాడు. భయంకరమగు నా శంఖ ధ్వనికి శత్రువీరుల హృదయములు కంపించిపోయినవి. ఆ శ్రీకృష్ణుని జూచి, జరాసంధుడు, "పురుషాధమా, కృష్ణా, నీవింకను బాలుడవు. నీతో పోరుటకు నాకు సిగ్గు కలుగుచున్నది. ఇంతదనుక గుప్తముగా నీవెక్కడ పరిభ్రమించుచుంటివో తెలియదు. నీ మామను చంపిన హంతకుడవు. నేను నీతో యుద్ధము చేయరాదు. "బలరామా, నా చేతిలో మరణించి వీరస్వర్గము పొందవలయునను యాశ నీకున్నచో, నాతో నీవు, ధైర్యము వహించి యుద్ధ మొనర్పుము. లేక, నీకు శక్తియున్నచో నన్నే జయింపుము" నిష్ఠురముగ మాటలాడె.

భగవానుడు "మగధరాజా, శూరవీరులగు వారెవ్వరును నీవలె దంబ
పలుకరు. వారు తమ బలపౌరుషములను ప్రదర్శించెదరు. చూడు మృత్యు
నీ శిరమున నాట్యమాడు చున్నది. సన్నిపాత జ్వరము వచ్చి మరణించుటక
ముగా నున్నవాడు చేయు సంధి ప్రేలాపనవలె వాగుచున్నావు. నీ మాటల
యేమి?" యని పలికె.

వాయువు, సూర్యుని మేఘములచేతను, అగ్నినిపొగచేతను, గప్పివేయు
జరాసంధుడు, బలరామకృష్ణులను సమీపించి, తన విస్తృతమగు సేనచే
చుట్టుముట్టినాడు. మధురానగర స్త్రీలు,— మేడలు, గోపురములపైకెక్కి చూ
గరుడ, తాల ధ్వజచిహ్నితములగు, శ్యామ, రాముల రథములు కనుపింప నం
వారత్యంత దుఃఖాక్రాంతలైరి. శోకావేగముచే మూర్ఛిల్లిరి శత్రుసైనికులు
సైన్యముపై బాణవర్షమును గురిపించు చుండుటయు, తన సైన్యము పీడి
యుండుటయు, చూచిన భగవానుడు, సురాసురార్చితమగు తన శార్ఙ్గధనుస
టంకార మొనర్చి, తూణీరమునుండి బాణములుతీసి సంధించుచు, పుంఖాను
ములుగ బాణములను ప్రయోగింపసాగె. ఆ సమయమందాతని ధనుస్సు
వేగముగా కదలుచుండెననగా, చూచువారి కది యొక యలాతచక్రము— (
చక్రము) వలె గోచరించసాగినది. ఈ విధముగా నతడు జరాసంధుని చతు
సైన్యమును సంహరింపసాగె. అనేక గజములు, కుంభస్థలములు పగిలి, చచ్చి
చుండినవి. బాణ వర్షముచే గుర్రముల తలలు తెగిపడుచుండె. సారథులు
గూలుచుండిరి. రథము లనేకములు విరిగిపోయినవి. మహాతేజస్వియగు
ముడు, తన ముసలాయుధముచే శత్రువీరుల కసిమసంగుచుండె. నెత్తురేరులు
నవి. ఆ రక్తనదుల యందును, తెగిపడిన మానవుల భుజములు సర్పము వ
శిరములు తాబేళ్ళవలెను, కేశములు శైవాలములవలెను గన్పట్టినవి. మర
పడియున్న యేనుగులు ద్వీపములవలెను, గుర్రములు మొసళ్ళవలెను జ
నవి. బహుమూల్యములగు మణులు, ఆభూషణములు, పెద్ద కంకరరాళ్ళవ
చిన్న గులకరాళ్ళవలెను, రక్త నదులయందు కొట్టుకొనిపోవుచుండినవి. ఆ ర
ేరులను గాంచిన పిరికివారు భయపడి దడదడలాడుచుండగా, వీరులగు
ఉత్సాహ మురకలు వేయుచుండె. జరాసంధుని సైన్యమపార సముద్రవ
దుర్గమమై భయావహముగ నుండినను, రామకృష్ణులద్దానిని కొద్ది స
మందే నశింపజేసిరి. వారు జగన్నాథులు. వారికీ యుద్ధమొక యా
నుండినది. భగవానుని గుణము లనంతములు. లోకముల సృష్టిస్థితి లయ
అతడొక క్రీడవలె చేయుచుండును. అట్టి మహానుభావునకు, యీ విధ
శీఘ్రముగ శత్రు సైన్యమును సర్వనాశన మొనర్చుట యొక గొప్ప

యమేకాదు. అయినను మర్త్యవేషము దాల్చి, మనుష్యలీల చేయుటచేత, నతని యుద్ధము గూడ వర్ణింపబడినది" అని శ్రీశుకులు పరీక్షిత్తుతో ననిరి.

ఈ ప్రకారము జరాసంధుని సైన్యము సర్వనాశనమైనది. అతని రథము భగ్నమైనది. కేవలము ప్రాణావశిష్టుడైయుండె. అప్పుడు, సింహము మరియొక సింహమును పట్టుకొనునట్లు, బలరాముడు, మహాబలియగు జరాసంధుని పట్టుకొనియె. జరాసంధుడంతకు ముందెందరో శత్రురాజుల వధించియున్నాడు. అట్టివాని నీనాడు బలరాముడు వరుణపాశములవంటి మానుషపాశములతో బంధించినాడు. వీనిని విడిచి పెట్టినచో వీడు మరల సైన్య సమీకరణ మొనర్చి యుద్ధమునకు రాగలడు.అప్పుడు మరల నాసైన్యమును వధించుటచే పృథ్వీ భారముక్రమక్రమముగ తగ్గుచుండగలదని భావించిన శ్రీకృష్ణుడు, బలరాముని వారించి జరాసంధుని విముక్తుని జేసె. శూరవీరులచే గొప్పగా కొనియాడబడు చుండిన జరాసంధుడీనాడు, దీనుడుగా, రామకృష్ణుల దయ వలన బంధ విముక్తుడగుటచే, నాతడెంతయో లజ్జించినాడు. తపస్సు చేయవలయునని నిశ్చయించినాడు. కాని, యాతడు తన రాజధానికి తిరిగి పోవుచుండగా, సాటిరాజులాతని సమాధానపరచుచు నిట్లు పల్కిరి. "రాజా, యాదవులలో నేమి బలమున్నది? వారు నిన్ను బొత్తుగా పరాజితుని చేయ జాలరు. ప్రారబ్ధ వశముచే నీ వోడిపోవుటతటస్థించినది." అని యోదార్చుచు, నతనిని తపస్సంకల్పము నుండి విరమింపజేసిరి. ఆ సమయమందు మగధరాజ సైన్యమంతయు నశించిపోయినది. బలరాముడుపేక్షించి యాజరాసంధుని విడిచి పుచ్చుటచేత, ఉదాసీనభావముతో నతడు మగధ చేరినాడు.

శ్రీకృష్ణపక్ష మందలి సైనికుల కెట్టినష్టమును వాటిల్లలేదు. జరాసంధుని యిరువది మూడక్షౌహిణుల సైన్యముపై వారు సహజముగనే తేలికగా విజయము సాధించిరి. ఆకాశమునుండి దేవతలు, నందవనమందలి దేవతాపుష్పములు వర్షము గురిపించి, యీ మహాకార్యమునకు వారిని ప్రశంసించిరి.

జరాసంధుడు పరాజితుడగుటచేత, మధురాపురవాసుల భయము పోయినది. ఆనందితులై వారు శ్రీకృష్ణ విజయమును గానము చేయసాగిరి. భగవానుడు గూడ వారితో గలిసినాడు. వందిమాగధ జనములు స్తోత్ర పాఠములు చేయుచుండిరి.విజయ దుందుభులు మ్రోగినవి. వివిధములగు వాద్యములు వాయించబడినవి. మధుర యందలి వీథులన్నియు సుగంధజలములచే తడుపబడినవి. మంగళ తోరణములు వ్రేలాడదీయబడినవి. సంతోష భరితులైన నగరవాసులాట పాటలతో తమయానందమును ప్రకటించుచుండిరి. బ్రాహ్మణుల వేదపాఠములు మిన్ను ముట్టినవి. సువాసినులు సేసలు జల్లిరి. శ్రీకృష్ణభగవానుడు యుద్ధభూమినుండి, శత్రువులు వదలి వెళ్ళిన యపార ధన సంపత్తిని, ఆభూషణాదులను తెప్పించి, యదుపతియగు ఉగ్రసేనునకు సమర్పించె.

ఈ ప్రకారము పదునేడు పర్యాయములు ప్రతిసారి యిరువది మూడక్షౌహిణుల సైన్యయుతుడై, జరాసంధుడు మధురపైకెత్తివచ్చి యాదవులపై యుద్ధము చేసినాడు. కాని యన్నిమారులు, భగవానుడగు శ్రీకృష్ణుని శక్తిచేత వారతనిని తరిమికొట్టిరి. ప్రతి పర్యాయము జరాసంధుని సైన్యము నశించుటయు, యాదవులు దయతలచి జరాసంధుని విడిచిపుచ్చుటయు జరుగుచుండినది. పదునెనిమిదవ మారు సంగ్రామము జరుగబోవు సమయమందు, నారద ప్రేరితుడైన కాలయవనుడు గనుపించినాడు. కాలయవను నెదిరించగల వీరుడు ప్రపంచమందెవడునులేడు. యదువంశీయులు తమవలెనే బలశాలురనియు, తమతో తలపడజాలుదురనియు. విన్న కాలయవనుడు, మూడుకోట్ల యవన సైన్యమును దీసుకొని, మధురపైకెత్తివచ్చి, నలువైపులనుండి నగరమును ముట్టడించినాడు.

కాలయవనుని యీ యాకస్మిక దాడిని గాంచి, భగవానుడు బలరామునితో జేరి యీ విధముగ మంత్రాలోచన గావించినాడు. "ఆహా యీ సమయమున యాదవులపై కాలయవనుడు జరాసంధుడు అను రెండు విపత్తులు ఒకేమారు పరిభ్రమించుచున్నవే, నేడు పరమ బలశాలియగు యవనుడు మన నగరమును చుట్టుముట్టినాడు. నేడో రేపో జరాసంధుడును యెత్తిరాగలడు, ఇపుడు మన మిరువురము యీ యవనునితో యుద్ధము చేయుచున్నచో, అదే సమయమందు జరాసంధుడుగూడ

---

**కాలయవనుడు ;**

వృష్ణ్యంధకాది యాదవులకు గురువు శ్రీ గర్గాచార్యుడు. బ్రహ్మచర్య వ్రత నిష్ఠుడై యాతడు వివాహ విముఖుడైయుండె.అందుచే నతడు నపుంసకుడని శ్యాలుడు రాజసభయందు హేళన మొనర్చినాడు. కోపించిన గర్గుడు, స్త్రీ వాంఛ లేనివాడై, రుద్రునిగూర్చి తపమాచరించినాడు. రుద్రుడతని తపమునకుమెచ్చి, వృష్ణ్యంధకాదుల నిగ్రహింపగల్గునట్టి తేజశ్శాలియగు పుత్రు నను గ్రహించినాడు. అపుత్రకుడగు యవనాధీశ్వరుడు, గర్గునకు లభించిన వరమును తెలిసి, యాతనిని తన ప్రాసాదమునకు గొంపోయినాడు. శంకరునిని యోగముచే, గోపాలియను నప్సరస గోప స్త్రీ వేషమున, గార్గ్యతేజమును గర్భమున ధరించి, కాలయవనునను మహాతేజశ్శాలియగు పుత్రుని ప్రసవించినది. యవనాధిపతి సంతానము లేనివాడగుటచే, ఆ పిల్లవానిని తన యంతఃపురమునందే పెంచినాడు. అతడు మరణించగా కాలయవనుడు యవనాధిపతియాయె. యుద్ధకాముడై యాతడు తనతో పోరుగలవారెవరున్నారని ద్విజోత్తముల ప్రశ్నించుచుండ, నారదుడే యాతనికి యాదవులగూర్చి చెప్పినాడు. అందుచే నతడు మధురపై దండెత్తివచ్చినాడు. కాలయవనునిగూర్చి నారదుడే శ్రీకృష్ణునకు దెలిపినాడు,

(హరివంశము)

వచ్చిన యెడల నాతడు మనవారందరిని వధింపగలడు. లేదా బంధించి తన నగర మునకు గొంపోవగలడు. అతడు మహాబలవంతుడు. కావున, అందరికిని దుర్గమ మగునట్టి దుర్గము నొకదానిని నిర్మించి, మనవారందరినందు జేర్చి, యనంతర మీ కాలయవనునంత మొందించుటము."

అని యీ విధముగ బలరామునితో నాలోచించి, భగవానుడు సముద్రమధ్య మందు ద్వాదశయోజన చతురశ్ర విస్తీర్ణము గలట్టియు, అద్భుతములగు సర్వవస్తు సముదాయము గలట్టియు నొక సుందర, దుర్గమ నగరమును నిర్మింపజేసినాడు. ఆ నగరమందలి ప్రతి వస్తువుగూడ విశ్వకర్మయొక్క వాస్తువిజ్ఞానము యొక్కయు శిల్పకళయొక్కయు ప్రతిభను చాటుచున్నవి. వాస్తుశాస్త్రము ననుసరించి, విశాలములగు రాజవీధులు, చత్వరములు, చిన్న చిన్న వీధులు సక్రమముగా నేర్పాటు చేయబడియున్నవి. సుందరములగు నుద్యానవనములు, విచిత్రములగు నుపవనములు నిర్మించబడి, యందు దేవతా వృక్ష జాతులు, లతలు, కన్నుల కింపుగొల్పుచున్నవి. ఆకాశమును తాకుచున్నవా యను నట్లున్న యెత్తయిన బంగారు శిఖరములు, స్ఫటికాట్టాలములు గోపురములు (ద్వారములు) మహా సుందరముగా నున్నవి. ధాన్యము నిల్వజేసుకొనుటకుగాను వెండి, యిత్తడితో నిర్మితములైన కొట్లనేకములున్నవి. ప్రాసాదములన్నియు బంగారు మయములు. హేమకలశములు వానిపై నేర్పాటుచేయబడియున్నవి. అవి రత్నములు, పచ్చలచే పొదగబడియున్నవి. వాస్తుదేవతా మందిరములుగూడ నిర్మింపబడినవి. సర్వవర్ణముల ప్రజలుండుటకు గృహములు నిర్మించబడియున్నవి. మధ్య భాగమందు, ప్రధానులగు, ఉగ్రసేన, వసుదేవ, బలరామ, శ్రీకృష్ణ మందిరములు మహాశోభాయమానముగ ప్రకాశించుచున్నవి. దేవరాజగు యింద్రుడు, సుధర్మ యను సభను, పారిజాత వృక్షమును పంపినాడు. ఆ సభ యెంత గొప్పదనగా, అందు గూర్చుండువారల కాకలిదప్పులుండవు. వరుణదేవుడు తన లోకమునుండి తెల్లని వాయుజాశ్వముల బంపినాడు ఆగుర్రములకొక చెవిమాత్రము నల్లగనుండును. మనోవేగ సమానమగు వేగముతో నవి పరుగెత్తగలవు. కుబేరుడు తన నవనిధుల * లో నుండి యెనిమిది నిధులను పంపినాడా నగరమునకు. ఇతరలోక పాలకులు గూడ తమ తమ విభూతుల నానగరమందు వెలయించినారు. 'లోక పాలురందరును. తమ యధికారసిద్ధికై భగవానుడు తమ కెయ్యవి యనుగ్రహించి యుండెనో వానిని భగవానునికి సమర్పించినారు

శ్రీకృష్ణ భగవానుడు తన సమస్త బంధుజనులను, పరివారము, తన

---

* శ్లో॥ పద్మశ్చైవ మహా పద్మో మత్స్యం కూర్మ స్తథోదకః
నీలో ముకుందశ్శంఖశ్చ నిధయోఽష్ట ప్రకీర్తితాః

యచింత్యమగు యోగమాయాశక్తిచేత, * ద్వారక యందు ప్రవేశింపజేసి, మధురా నగర రక్షణకై బలరాముని మధుర యందుంచి, యతని యనుమతి గైకొని, మెడలో కమల మాలిక దాల్చి, అస్త్ర శస్త్రములేవియు లేకుండ, తానొక్కడే నగర ప్రధాన ద్వారము నుండి, వెలువడినాడు.

---

*** ద్వారకాపురి :—**

మను తనయుడు శర్యాతి. అతడు చక్రవర్తియై పదివేల సంవత్సరములు ధర్మముగా రాజ్యపాలన మొనర్చినాడు. అతనికి ఉత్తానబర్హి, ఆనర్తుడు, భూరి షేణుడు అను మువ్వురు కుమారులుండిరి. తన కుమారులకు రాజ్యమును పంచి యిచ్చుచు శర్యాతి వారలతో "నాయనలారా, యీ రాజ్యము నా బలార్జితము. దీనిని నేనింతవరకు ధర్మముగా పరిపాలించితిని. ఇకముందు మీరు గూడ నటులనే పాలించుడు" అని పలుకగా, వారిలో మధ్యమ తనయుడగు ఆనర్తుడు తండ్రితో, "రాజా, యీ భూమి నీదిగాదు. ధరిత్రి యంతయు మాధవునిదే. దీనిని పాలించు వాడు గూడ నతడే. చరాచర భూతజాలమున కంతటికి ఆధారమతడే. బలిష్ఠుడై నంత మాత్రమున మానవుడు మాధవునితో సమానుడగునా? అహంకారము వీడి సర్వాత్మనా ఆ సర్వేశ్వరుని భజించుట యుచితమ'ని పలుకగా శర్యాతి కుపితుడై, "ఓరీ, ఆ భగవానుడే నీకు భూమి నొసంగుగాక. నా రాజ్యము నుండి తొలగి పొమ్ము" అని పలుకుచు, అతనికి రాజ్య భాగ మొసంగక, వెడల గొట్టెను.

ఆనర్తుడంత సముద్రతీరమును జేరి, పదివేల సంవత్సరములు తీవ్రమగు తపమొనర్పగా శ్రీహరి ప్రత్యక్షమై యతనితో, "నీ కొసంగుటకు యీ లోకము నందు వేరు భూమి లేదు. నేను నీ యెడల ప్రసన్నుడనైతిని గాన, వైకుంఠము నుండి నూరు యోజనముల విస్తీర్ణము గల భూ ఖండమును దెచ్చి నీ కొసంగెద" నని పల్కి, యా భూభాగమును దెచ్చి సముద్ర మధ్య మందుంచి దానికాధారముగ తన సుదర్శన చక్రము నుంచె. ఆనర్తుడు లక్ష సంవత్సరము లాదేశమును పరి పాలించినాడు. అతని పేరు మీదనే ఆ ప్రదేశమునకు ఆనర్తదేశ"మను పేరు వచ్చినది. ఆనర్తుని తనయుడే రేవతుడు.

శ్రీశైలగిరి తనయుని రైవతుడు తన హస్తములతో పెళ్ళగించి ఆనర్త దేశ మందు ప్రతిష్ఠించినాడు. అతని పేరు మీదనే యా పర్వతము "రైవతగిరి" యని ప్రసిద్ధిగాంచినది. ఈ రేవతుడే కుశస్థలిని నిర్మించి, రాజ్యపాలన మొనర్చి, తన కొమరిత యగు రేవతిని శ్రీబలరామ దేవున కొసంగి పరిణయ మొనర్చినాడు.

శ్రీకృష్ణ దేవు డీప్రదేశము నందే ద్వారకాపుర నిర్మాణము గావించినాడు. ఇది ద్వారవతి యొక్క పుణ్య గాథ.

(గర్గ సంహిత)

# ఏబదియొకటవ యధ్యాయము

## కాలయవన మరణము – ముచుకుందుని కథ

రాజా, శ్రీకృష్ణుడు, మధురానగర ప్రధాన ద్వారము నుండి వెలువడగా, తూర్పు దిక్కున చంద్రుడుదయించినట్లుండె. అతని మేఘ శ్యామల దేహ మత్యంత దర్శనీయముగా నున్నది, పచ్చని పట్టు వస్త్రము ధరించి యున్నాడు. వక్షః స్థలమందు స్వర్ణ రేఖా రూపమున శ్రీవత్స చిహ్నము వెలుగుచున్నది. కంఠమందు కౌస్తుభమణి ప్రకాశించుచున్నది. బలిష్ఠములగు చతుర్భుజములు, నవకంజారుణ నయనములు, ముఖమునందానందము తాండవించుచున్నది. కర్ణములందలి మకర కుండలముల కాంతి ప్రతిఫలించుచున్న కపోలముల శోభ యపూర్వముగ నున్నది. ఆ రూపమును గాంచిన కాలయవనుడు, తనకు నారదుడు వివరించిన లక్షణము లన్నియు సరిపోయినందున, యతడే వాసుదేవుడని నిశ్చయించుకున్నాడు. ఇపు డాతడు శస్త్రాస్త్రములేవియు లేకుండ, పాదచారియై వచ్చుచుండె గావున, నేనుగూడ శస్త్రాస్త్ర రహితుడనై యతనితో పోరాడెద" నని నిశ్చయించి కాలయవను డాతని వైపు పరుగిడినాడు.

కాని భగవానుడు యుద్ధ పరాఙ్ముఖుడై, రణ భూమిని వదలి యావలకుపోవు చుండ, కాలయవను డాతని పట్టుకొనదలచి, యాతని వెంటనంటినాడు. యోగులకు గూడ దుర్లభుడగు నాతని బట్టుకొనుట సామాన్యమా? లీలార్థమై భగవానుడు రణ భూమిని వీడి పోవుచుండ, ప్రతి పదమునందు కాలయవనునకు చిక్కినట్లే యుండియు, చిక్కక, చివరకాతని నొక కొండ గుహవద్దకు గొని పోయినాడు. కాలయవనుడాతని వెంట పరుగిడుచు, "నీవు కీర్తివంతమగు యదు వంశము నందుద్భవించితివి. నీ విటుల యుద్ధ భూమిని వదలి పారిపోవుట యుక్తముగాదు." "అని యాక్షేపించుచునే యున్నాడు. వాని పాపములు నిశ్శేషముగా పోలేదుగావున భగవానుడాతనికి జిక్కకుండె. అతని యాక్షేపములు లక్ష్య పెట్టక గోవిందుడా కొండ బిలమును ప్రవేశించినాడు. అచట నిద్రించుచున్న మరియొక పురుషు డాతనికి గోచరించినాడు.

"నన్నింత దూరము తీసుకొని వచ్చి, నా సంగతియే యెరుగని సాధు పుంగ వుని వలె కపట నిద్ర నటించుచుండె"నని తలచి, మూఢుడగు కాలయవనుడతనిని, కాలితో నొక్కతన్ను దన్నె. ఆ పురుషుడచట చాల దినములనుండి నిదురించు చుండె. కాలి తాపున కాతనికి మెలకువ వచ్చినది. నెమ్మదిగా కనులు దెఱచి, యటు నిటు జూచుచుండ, కాలయవనుడాతని కంటబడియె. దెబ్బతిని లేచినందున, ఆపురు

షుడు కొంచెము కోపగించియుండె. అతని కోపదృష్టి కాలయవనునిపై ప్రసరించుటయే తడవుగ నందుండి యగ్ని ప్రజ్వరిల్లి, యందాతని శరీరము భస్మావశేషమై పోయినది."

అని శుక యోగి చెప్పగా, పరీక్షిత్తు "స్వామీ, దృష్టిపాత మాత్రము చేతనే కాలయవనుని భస్మమొనర్చినట్టి యా మహానుభావుడెవరు? ఏ వంశము వాడు? అతని శక్తి యెట్టిది ? అతడెవరి తనయుడు? పర్వత గుహయందాతడేల నిద్రించుచుండె? నా యందు దయయుంచి, యీ విషయము లన్నియు తెలుపవేడెద"నని పలుక శ్రీశుకులు మరల నిట్లు చెప్పసాగిరి.

"రాజా, అతడిక్ష్వాకు వంశమందలి మాంధాత మహీపతి పుత్రుడు. ముచుకుంద మహారాజు, బ్రహ్మణ్యుడు. సత్యసంగరుడు సంగ్రామ విజయియగు మహాపురుషుడు. ఒకానొక సమయమందింద్రాది దేవతలు అసురుల వలన నత్యంతభయపీడితులై, తమకు సాహాయము చేయుమని ముచుకుందుని కోరగా, నతడు "వల్లె" యని, చాల దినములు వారికి సహాయముగా నసురులతో పోరు సాగించినాడు. అనంతరము దేవతలకు సమర్థుడగు కార్తికేయుడు సేనాపతిగా లభించినాడు. అప్పుడు దేవతలు ముచుకుందునితో, "రాజా, నీవు మహాశ్రమతోమమ్ము రక్షించితివి. నీవిక విశ్రాంతి గైకొనుము వీర శిరోమణీ, మాకు రక్షణకల్పించుటకై, మనుష్య లోకమందలి, నిష్కంటకమగు నీ సామ్రాజ్యమును గూడ వదలి జీవితాభిలాషలను, భోగములను గూడ విడనాడి వచ్చినాడవు. ఇపుడు, నీదారాపుత్రులుగాని, బంధు-బాంధవులు, మంత్రులు, యెవ్వరును భూలోకమందు లేరు. ఆనాటి ప్రజలెవ్వరును లేరు. అందరును కాలగర్భమున గలిసిపోయినారు. కాలము బలవంతులకంటె గూడ బలము గలది. అది పరమ సమర్థమైనది. ఎన్నటికిని నశించునది గాదు. కాలము భగవత్స్వరూపమే. పశు పాలకుడు పశువులను తన వశము నందుంచుకొనునట్లు, కాలము సర్వజీవులను తన వశమందుంచుకొని క్రీడించుచుండును. రాజా, నీకు శుభమగుగాక, నీకిచ్చ వచ్చిన వరము గోరుకొనుము. ఇచ్చెదము. కైవల్యమోక్షము తప్ప నీ వెద్ది కోరినను యివ్వగలము. కైవల్య మోక్ష మొసంగుటకు విష్ణు భగవానుడు తప్ప యితరులు సమర్థులు గారు." అని దేవతలు పలుకగా, పరమ యశస్వియగు ముచుకుందుడు, వారికి నమస్కరించి, చాల యలసియుండుట చేత, నిద్రను వరముగా గోరినాడు. ఆ వరమును పొంది ఈ గుహలో ప్రవేశించి నిదురించినాడు. వరమొసంగు సమయమున దేవతలు, "రాజా, నీవు నిదురించు సమయమందే మూర్ఖుడెవడైన నీకు నిద్రాభంగ మొనర్చినచో, నీ దృష్టి పాతముచే నతడు క్షణములో భస్మమైపోగలడు'' అని వచించియుండిరి.

కాలయవనుడు భస్మమైపోయిన యనంతరము శ్రీకృష్ణ భగవానుడు, ముచుకుందునకు తన దర్శన భాగ్యమును కలిగించె. శ్రీకృష్ణ భగవానుని శ్రీమూర్తి, వర్షా

కాలీనమేఘమువలె శ్యామలముగనున్నది. పట్టుపీతాంబరము, వక్షఃస్థలమందు శ్రీవత్స చిహ్నము, గళమందుకౌస్తుభము, దివ్యకాంతులీనుచున్నవి. చతుర్భుజములు, వైజయంతీమాల మోకాళ్ళవరకు వ్రేలాడుచున్నది. ముఖకమలమత్యంత సుందరమై ప్రసన్నరమణీయముగనున్నది. కర్ణములందు మకరకుండలములు ప్రకాశించుచున్నవి పెదవులపై ప్రేమభరితమగు మధురమందహాసము వెలయుచున్నది. చూపులందనురాగము వర్షించుచున్నది. అత్యంత దర్శనీయమగు తరుణావస్థ, మదించిన సింహముతో సమానమగు నిర్భీకమగునడక గల్గిన యాదివ్యరూపమును గాంచి, ముచుకుందుడు, మహాబుద్ధిమంతుడును ధీరపురుషుడైనప్పటికిని, చకితుడైనాడు. ఆ దివ్యతేజస్సుముందు హతప్రభుడైనాడు. కొంచెము శంకితుడై యాతడిట్లు ప్రశ్నించినాడు.

"తమరెవ్వరు? కంటకాన్వితమగు యీ ఘోరకాంతారమందు నిరావరణ చరణారవిందములతో మీరేల సంచరించుచుంటిరి? ఈ పర్వతగుహలోనికి మీరు వచ్చుటకు కారణమేమి? తేజస్వంతుల మూర్తీభవించిన తేజస్వరూపులా మీరు? లేక అగ్నిభగవానులు కాదు గదా? మీరు, సూర్యులా, చంద్రులా, దేవేంద్రులా? లేక యితరలోకపాలురలో నెవ్వరైనాయగుదురా? నాకు జూడగా, త్రిమూర్తులలో పురుషోత్తముడగు నారాయణుడనియే తోచుచున్నది. ఏలననగా, శ్రేష్ఠమగు దీపము తమస్సును దూరముచేయుచున్నట్లు, మీరు మీ శరీరకాంతిచే యీ గుహయందలి యంధకారమును పారదోలుచున్నారు. మహాపురుషా, మీకిష్టమైన యెడల, మీ జన్మ, కర్మ గోత్రాదులచెప్పుడు ఏలనన, హృదయపూర్వకముగ నేను వినగోరుచుంటిని గనుక. మీరు నా విషయము తెలియగోరుచో చెప్పెదవినుడు. నేనిక్ష్వాకు వంశీయ క్షత్రియుడను. నన్ను ముచుకుందుడందురు. యువనాశ్వనందనుడగు మాంధాత కుమారుడను. అనేక దినములు జాగరితుడైయున్నందున నేనలసియుంటిని. నిద్ర (లేమి) నా యింద్రియశక్తిని హరించినది. పనికిరాని వానినిగా జేసినది. అందుచే నేనీనిర్జన స్థానమందేకాంతముగ నిదురించుచుంటిని. ఇప్పుడిప్పుడే యెవరో నన్ను లేపినాడు. వాడి పాపముచేతనే వాడుమాడి బూడిదయైనాడు. పిమ్మట, శత్రునాశకరమగు మీ సుందరమూర్తి దర్శనమైనది. మహాభాగా, మీరు సమస్త ప్రాణులకు మాననీయులు. మీయొక్క పరమదివ్యము, అసహనీయమునగు శక్తిచేత నాశక్తి క్షీణించుచున్నది. నేనెక్కువసేపు మిమ్ము చూడలేకుంటిని" అని ముచుకుందుడు పలుకగా, భూతభావనుడగు భగవానుడు నవ్వుచు, మేఘగంభీరధ్వనితో, ముచుకుందునితో నిట్లు వచించె.

"ముచుకుందా, నాకు వేలకొలది, జన్మలు, కర్మలు, నామములున్నవి. అవి యనంతములు. అందుచేత నేనుగూడ వానిని లెక్కపెట్టి చెప్పజాలను. పృథ్వి

యందలి రేణువులనైన లెక్కపెట్టవచ్చునేమోగాని, నాజన్మ కర్మ, గుణ, నామముల లెక్కింపతరముగాదు. సనకసనందాది పరమఋషులు, కాల్రతయోప పన్నములగు నాజన్మకర్మలను వర్ణించుచుందురు. కాని వానియంతమును గాంచలేకుందురు. అయి నప్పటికిని నాప్రస్తుతజన్మ, కర్మ, నామముల నీకు దెల్పెదను. వినుము. మొదట బ్రహ్మధర్మముమ రక్షించవలసినదనియు, పృథివికి భారముగానున్న దుష్టరాక్షసుల సంహరించవలసినదనియు నన్ను ప్రార్థించియున్నాడు. అతని ప్రార్థన ననుసరించి, నేను, యదువంశమునందు వసుదేవునింట యవతరించితిని. వసుదేవుని పుత్రుడనగు టచే నన్ను "వాసుదేవు"డందురు. ఇంతవరకు నేను, కంసుడుగా జన్మించిన కాల నేమియను రక్కసుని, సాధుహింసకులగు ప్రలంబాద్యనేక రాక్షసులను సంహరించి యుంటిని. రాజా, యిపుడు నీకంటి మంటలో బూడిదయైనవాడు కాలయవనుడు. నీపైగల యనుగ్రహము చేతనే నేనీగుహలోనికి వచ్చితిని. నీవు పూర్వము నన్ను మహాభక్తితో నారాధించియుంటివి. నేను భక్తవత్సలుడను. కావున, వో రాజర్షీ, నీకే మైన యభిలాషలున్నచో నాకు చెప్పుము. నేను వాటిని సఫలమొనర్చెదను. నన్ను శరణుపొందిన పురుషుడు, కోరి పొందజాలని వస్తువేమియునుండదు." అని పలికె.

భగవానుడీ విధమున వచించగా, ముచుకుందునికి గర్గాచార్యుని వాక్యములు జ్ఞప్తికి వచ్చినవి. యదువంశమునందు నారాయణుడవతరించగలడని యాతడు చెప్పి యుండినందున, యీతడు సాక్షాత్తు నారాయణ భగవానుడని ముచుకుందునకర్థమైన సది. మహానంద భరితుడై యాతడు భగవానుని చరణములకు ప్రణమిల్లి, యీ క్రింది విధముగ స్తుతి యొనర్చినాడు.

ప్రభూ, ప్రపంచమందలి ప్రాణులన్నియు నీ మాయచే నత్యంతము మోహి తములై యున్నవి. అవి యన్నియు నీ యందు విముఖత్వము గలవై నీ భజన సేయకున్నవి. జీవులందరును, దుఃఖమునకు మూలకారణములగు గృహ సంబంధ మైన జంఝాటములందే మునిగియుందురు. ఈ విధముగ స్త్రీ పురుషులందరు వంచి తులై యున్నారు.

ఈ భరత భూమి యత్యంత పవిత్రమగు కర్మభూమి. ఇందు మనుజ జన్మ లభించుటయే చాల దుర్లభము. మానవజన్మ పరిపూర్ణమైనది. భగవత్సేవజేయుటకెట్టి యిబ్బందియునుండదు. అదృష్టవశముచేతను, భగవానుని యహైతుకమగు కృప చేతను, అట్టి మానవజన్మ అనాయాసముగ లభించినను, తనబుద్ధిని, నడతను, అశా శ్వతమగు సంసారమందు, తుచ్ఛములగు విషయసుఖముల ననుభవించుటయందే సమస్త ప్రయత్నములజేయుచు, మానవుడు గృహమను చీకటి నూతియందే పడి యుంటున్నాడేకాని, భగవానుని చరణకమలముల నుపాసించుటలేదు. భజనచేయుట లేదు. అట్టివారు తృణలోభముచే చీకటి నూతియందు బడునట్టి పశువుతో సమా నము.

స్వామీ, నేను పూర్వము రాజునై యుంటిని, రాజ్యలక్ష్మీ మదముచే మత్తెక్కి యుంటిని. ఈ మరణ శీలమగు శరీరమునే యథార్థమగు ఆత్మ స్వరూపముగా భావించి, రాజకుమారులు, రాణి, ధనాగారము, భూమి మొదలగువాని యందలి, లోభ మోహములయందు కూరుకొనిపోయి యుంటిని. రాత్రింబగళ్ళు వానినిగూర్చిన యాలోచనలే నా మనస్సును పీడించుచుండెడివి. ఈ విధముగా నా జీవితమందలి యమూల్యమగు కాలము, నిష్ఫలముగా, వ్యర్థముగా గడిచిపోయినది. ఘట, కుడ్యములవలె మట్టితో నిర్మింపబడి, వాటి వలెనే నా కంటె వేరగు యీ శరీరమునే నా యాత్మగా భావించి, 'నరదేవు'డనని గర్వించియుంటిని. అట్లు మదాంధుడనై యుండి, నిన్నుగూర్చి కొంచెము గూడ తెలియకుంటిని. రథ, గజ, తురగ, పదాతులను చతురంగ బలములతోను, సేనాపతులతోను పరివేష్ఠితుడనై, పృథ్వియందు గ్రుమ్మరుచునుంటిని. ఏది కర్తవ్యము, యేది యకర్తవ్యము అనునది విచారించుచు మానవుడు, తన యేక మాత్ర కర్తవ్యమగు భగవత్ప్రాప్తి నుండి విముఖుడై, ప్రమత్తుడై యసావధానుడై పోవుచున్నాడు. సంసారమునందు బద్ధుని గావించునట్టి విషయములందు వాని యాసక్తి దినదినాభివృద్ధి చెందుచున్నది. ఆకలితో నకనకలాడుచు నాలుకలల్లాడించువచ్చి, సర్పముప్రమత్తమైయున్న యెలుకను హఠాత్తుగా గ్రహించునట్లు, కాల రూపముతో సదా-సర్వదా సావధానుడవై యుండునట్టి నీవు, ప్రమాద గ్రస్తుడై యుండు ప్రాణి నకస్మాత్తుగ నంత మొందించెదవు. పూర్వము బంగారు రథములపైననో, మద గజేంద్రములపైననో 'నరదేవు'డని పిలువబడుచు నూరేగుచుండెడి శరీరము నీదురత్యయమగు కాలమున కాహారమై, బయట పార వేయబడి పక్షుల కాహారమై వాని పెంటగ మారును. భూమియందు పాతబడి క్రిముల కాహారమగును. అగ్నిచే దహింపబడి భస్మమగును. ఎవడు దిగ్దిగంతదేశాధీశుడై యుండెనో, సంసార మందెవ్వడును యెవ్వని నెదిరించలేకుండిరో, యేమేటిమేటి సింహాసనమందు ఠీవిగ నుపవిష్టుడై యుండెనో, యిదివరకు తనతో సమానులై యున్న గొప్ప గొప్ప మహారాజులందరు నెవనికి ప్రపాదాక్రాంతులైరో, అట్టి చక్రవర్తి, విషయ సుఖము ననుభవించుట కొరకు-గృహమందలి విశేషవస్తువులగు స్త్రీలను చేరునప్పుడు వారి చేతిలో నాట బొమ్మయగును. పెంపుడు జంతువగును. అనేకమంది విషయ భోగముల త్యజించియు, మరల రాజ్యాది భోగములు లభించ వలయునను నుద్దేశ్యముతోడనే. దాన ధర్మములు చేయుచుందురు. "నేను మరల జన్మించి, యందరి కంటె గొప్పవాడనై పరమ స్వతంత్రతగల సామ్రాట్టునయ్యెద" నను కోరికతో, తపస్సాచరించుటయో లేక యితరములైన శుభకర్మల చేయుటయో చేయుచుందురు. ఈ విధముగా యెవని కాశ నిరంతరము వృద్ధియగుచునేయుండునో వాడెన్నటికి సుఖము నందలేడు.

అచ్యుతా, జీవుడనాది కాలమునుండియు, జనన మరణ రూపమగు ఈ సంసారచక్రమునందు పరిభ్రమించుచునే యున్నాడు. సంసార చక్రమునుండి ముక్తుడగు కాలము సమీపించి నపుడాతనికి సత్పురుషుల సాంగత్యము లభించును. అట్టి సత్సంగప్రాప్తి కలిగినప్పుడు, ఆక్షణమునందే సత్పురుషుల కాశ్రయుడగును. కార్య కారణరూపమగు జగత్తునకేకైక స్వామియనగు నీయందు, జీవునకు, అత్యంత దృఢమగు భక్తి కలుగుననుట నిశ్చయము.

నీవు నాపై పరమానుగ్రహమును వర్షించినట్లు నేను భావించుచున్నాను. కానిచో, నీదర్శనము లభించునా? ఎట్టి ప్రయత్నము లేకుండ, అనాయాసముగనే నారాజ్యబంధము తెగిపోయినది. సాధుస్వభావుడగు చక్రవర్తి గూడ, తన రాజ్యమును త్యజించి, యేకాంతమందు భక్తి సాధనచేయుటకై వనములకేగి, అతడు తన మమతానుబంధములనుండి విడివడుటకై నిన్ను గూర్చి ప్రేమతో ప్రార్థించుచుండును.

"ప్రభూ, అంతర్యామీ, నీనుండి దాచునది యేమున్నది? నీ పాద సేవకంటె యితరము నేనేమియు కోరుటలేదు. ఎందుకనగా, యేమియు లేని దరిద్రుడుగూడ. దేనిమీదగూడ యెవని కభిలాషలేకుండనో, అట్టివాడు గూడ నీపాద సేవకొరకే ప్రార్థించుచుండును. మోక్షప్రదాతవగు నిన్ను చక్కగా నారాధించియు, తనను బద్ధునిగావించునట్టి సాంసారిక విషయములను వరముగా గోరునట్టివాడు, శ్రేష్ఠ పురుషుడెట్లగునో చెప్పుము?

కావున ఓ ప్రభూ, నేను, త్రిగుణసంబంధములగు కోరికలన్నిటిని త్యజించి, మాయాలేశ సంబంధముగూడలేని, గుణాతీతుడవు, అద్వితీయుడవు, చిత్స్వరూపుడవు, పరమ పురుషుడవునగు నిన్ను శరణు పొందుచున్నాను.

భగవానుడా, నేననాది కాలమునుండియు నాకర్మఫలముల ననుభవించి యనుభవించి, యత్యంత దుఃఖార్తుడనై యున్నాను. ఆ దుఃఖజ్వాల నన్నుదహించి వేయుచున్నది. నాయంతఃశత్రువులార్గురు [మనఃషష్ఠానీంద్రియాణి] నన్ను శాంతముగా నుండనీయుట లేదు. విషయభోగములందు వారికి గల యాసక్తి దిన దినాభివృద్ధినందుచునే యున్నది. ఒక్కక్షణ కాలమైనను నాకే విధముగను శాంతియనునది లభించుటలేదు. శరణదాతా, భయ, మృత్యు, శోకరహితములగు నీ చరణ కమలముల చేరినాడను జగన్నాథా, పరమాత్మా, శరణాగతుడనైన నన్ను రక్షింపుము."

అని ముచుకుందుడు వేడగా, భగవానుడిట్లనియె.

"ముచుకుందసార్వభౌమా, నీమతి, నీ నిశ్చయము మహాపవిత్రములైనవి. ఉత్తమశ్రేణికి చెందినట్టివి. నేను వరములిచ్చెదనని నిన్ను ప్రలోభ పెట్టినప్పటికిని, నీబుద్ధి కోరికలకు లొంగలేదు! వరము లొసంగెదని నేను నిన్ను ప్రలోభపెట్టినది,

కేవలము నీ మనఃస్థైర్యమును పరీక్షించుటకు మాత్రమే. నాయందనన్య భక్తిగల వారల బుద్ధి యెన్నడును ప్రాపంచిక కామనలను వాంఛించదు. నాయందుభక్తి లేని వారు, ప్రాణాయామాది సాధనలద్వారా మనస్సు నిగ్రహించుటకై యెంత ప్రయత్నించినప్పటికిని, వారి వాసనలు క్షీణించవు. రాజా, వారి మానసములు మరల విషయములపై గంతులు వేయుచునేయుండును. నీవు, నీ మనస్సును, నీసర్వమనోభావములను నాకు సమర్పింపుము. నాపైలగ్న మొనర్పుము. అట్లొనర్చి, స్వచ్ఛందముగ భూమిపై విహరించుము. విషయవాసనా శూన్యమగు నీ నిర్మలభక్తి నాయందెప్పుడును నిశ్చలముగా నుండగలదు. నీవు క్షత్రియధర్మాచరణ మొనర్చుచుండిన కాలమందు వేట మొదలగు సందర్భములలో ననేక పశువుల వధించి, పాపమార్జించియుంటివి. ఏకాగ్రచిత్తముతో నన్నుపాసించుచు, తపస్సుద్వారా నీపాపమును క్షాళనమొనర్చుకొనుము. రాజా, రాబోవుజన్మమున నీవు బ్రాహ్మణుడువై జన్మించి, సమస్తభూతహితైషివై, సుహృత్తముడవై, విశుద్ధ విజ్ఞాన ఘన పరమాత్మనగు నన్ను చేరగలవు" అని శ్రీకృష్ణుడు ముచుకుందున కభయవర ప్రదానమొనర్చె.

# ఏబదిరెండవ యధ్యాయము

## ద్వారకాగమనము-బలరామ వివాహము—శ్రీకృష్ణునకు రుక్మిణీ సందేశము

శ్రీ శుకులిట్లు చెప్పదొడగిరి.

"పరీక్షిన్మహారాజా, యీ ప్రకారము భగవానునిచే ననుగ్రహింపబడిన, ముచుకుందుడు, భగవానునకు ముమ్మారు ప్రదక్షిణచేసి నమస్కరించి, గుహ వెలువడిరాగా, మనుష్య, పశు వృక్ష వనస్పత్యాది ప్రాణిజాతమంతయు పూర్వముకంటె చాలచిన్నవిగా నతనికి గోచరించినవి. కలియుగము సమీపించినదని యాతడు గమనించినవాడై, యుత్తరదిశగా పయనించినాడు. తపస్సునందు శ్రద్ధ గలిగినవాడై, నిస్సంగుడు-సంశయరహితుడునైన, ధీరుడగు ముచుకుందుడు, తన చిత్తమును శ్రీకృష్ణునియందు లగ్నమొనర్చి, గంధమాదన పర్వతముపై జేరినాడు. నరనారాయణులకు నిత్యనివాస స్థానమగు బదరికాశ్రమమును ప్రవేశించి, మహాశాంత భావముతో, శీతోష్ణాది ద్వంద్వముల సహించుచు, తపస్సుద్వారా, శ్రీకృష్ణునారాధింప దొడగినాడు.

ఇక నచట భగవానుడు గుహనుండి వెలువడి మథురకు తిరిగివచ్చి చూడగా కాలయవనుని సైన్యమింకను మథురను ముట్టడించియే యున్నది. ఆమ్లేచ్ఛ సైన్యమును సంహరించి, వారి యపార ధనరాసులను ద్వారకకు తరలించినాడు భగ

వానుడు. అదే సమయమున మగధరాజగు జరాసంధుడు, మరల యిరువది మూడ క్షౌహిణుల సైన్యమును వెంటనిడుకొని, మధురపై, పదునెన్మిదవసారి దాడిచేసినాడు.

శత్రువుల ప్రబల సేనావాహినిని గాంచి, రామకృష్ణులు మనుష్యలీల నభిన నయించుచు, భయపడిన వారివలె, నందరు చూచుచుండగనే, వేగముగా పరుగిడి పోవుచుండిరి. వారికీషణ్మాత్రమైనను భయము లేకుండినను అత్యంత భయభీతుల వలె నటించుచు, ద్వారకకు తరలించుచున్న ధనమచటనే వదలి, పద్మపత్రముల వంటి పాదములతో బహుయోజనములు పరువెత్తినారు. వారు పరువెత్తుచుండుట గాంచి జరాసంధుడు పరిహసించుచు, తన రథసేనతో వారిని వెంబడించినాడు. రామ కృష్ణుల ప్రభావము నాతడెఱుంగడు. బహుదూరము పరువెత్తుటచే వారికి కొంచెము శ్రమవంటిది కలుగగా, వారున్నతమైన ప్రవర్షణ పర్వతము నధిరోహించిరి. ఆ పర్వతముపై మేఘములెప్పుడును వర్షించుచుండుటచేత దానికి ప్రవర్షణ గిరియను పేరు గల్గినది. వారు పర్వతముపై నెచటనో దాగియుండి, యెంత వెదికినను గాన్పించనందున, జరాసంధుడా పర్వతమందన్ని వైపుల కట్టెలను చేర్పించి, యగ్నిని దరికొల్పించినాడు. పర్వతమంతయు మండుచుండుట గాంచిన భగవానుడు, బలరాముడు. యిరువురును, చుట్టుముట్టియున్న జరాసంధ సైన్యములకావల, పదు నొకండు యోజనముల దూరమునకు, వేగముగ పర్వతమునుండి లంఘించి ద్వారక కేగిరి. జరాసంధుడుగాని యతని సైన్యముగాని వారిని గమనించలేకపోయిరి. రామ కృష్ణులాకొండపై దగ్ధమైయుందురను మిథ్యాభావనతో, జరాసంధుడు తన సేనను మరలించుకొని తన మగధదేశమునకు వెడలిపోయినాడు.

"ఆనర్త దేశాధీశుడగు రైవతుడను మహారాజు రేవతియను తన కుమా ర్తెను, బ్రహ్మ యాదేశానుసారము, బలరామునకిచ్చి పరిణయమొనర్చియుండెనని, నీకిదివరకే (తొమ్మిదవ స్కంధమందు) చెప్పియుంటిని. శ్రీకృష్ణ భగవానుడుగూడ స్వయంవరమునకు వచ్చియున్న, శిశుపాల, సాల్వాదులందరిని బలపూర్వకముగ నిర్జించి, యందరు చూచుచుండగా, గరుత్మంతుడమృతమును హరించిన విధమున, విదర్భ దేశాధీశుని కొమరితయగు రుక్మిణి నపహరించి, వివాహమాడినాడు. ఆ రుక్మిణీదేవి భీష్మక మహారాజు కూతురు. స్వయముగ భగవతియగు మహాలక్ష్మి యొక్క యవతారమ"ని శ్రీశుకుడు చెప్పగా పరీక్షిత్తిట్లనియె,

"స్వామీ, భీష్మకనందినియగు రుక్మిణిని, శ్రీకృష్ణ భగవానుడు బలపూర్వక ముగ హరించి, రాక్షసవివాహము చేసుకొనియెనని వింటిను. పరమ తేజస్వియగు భగవానుడు, జరాసంధ, శాల్వాదుల జయించి యెట్లు రుక్మిణిని హరించినదియు వినవలతును. శ్రీకృష్ణ లీలాచరితముల విషయమై చెప్పెడిదేమున్నది? కృష్ణ కథలు జగత్తునందలి మాలిన్యముల దొలగించి పవిత్రతను గలుగజేయునట్టివి. లోకోత్తర మాధుర్యములగు నా కథామృతముల నిత్యము సేవించుచున్నను, నిత్య

నూతన రసమందు లభించుచునే యుండును. అట్టి కథలను వినుచు తృప్తి చెందు నట్టి, రసికుడుగాని, మర్మజ్ఞుడుగాని యెవడుండును?" అని పరీక్షిత్తు పలుకగా, శ్రీశుకులాతనికి వివరించ చొడగిరి.

"పరీక్షిన్మహారాజా, భీష్మకమహారాజు విదర్భదేశాధిపతి. అతనికైదుగురు తనయులు, నొక కుమార్తెయు నుండిరి. పుత్రులలో పెద్దవాడు రుక్మి. మిగిలినవలు గురు, క్రమముగా, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలి యనువారలు. అందరికి చెల్లెలు రుక్మిణి. ఆమె శ్రీకృష్ణ భగవానుని, సౌందర్య, పరాక్రమ, గుణవైభవాదుల ప్రశంసలను కర్ణాకర్ణిగ విని, అనగా తమ యింటికేతెంచు నతి ధులు కీర్తించుచుండగా విని-యాతనిపై మక్కువ బెంచుకొని-యాతడే తనకు పతియగుటకు యోగ్యుడని భావించినది. శ్రీకృష్ణ భగవానుడు గూడ నటులనే, "రుక్మిణి సర్వలక్షణలక్షిత. మహాబుద్ధిమంతురాలు. సౌందర్య, సౌశీల్య, సుగుణ ముల యందు గూడ నద్వితీయురాలు. కావున, రుక్మిణియే నా కనురూపయగుపత్ని" యని తలచుచున్నందున యాతడామెను వివాహమాడ నిశ్చయించుకొనియుండె. బంధువులందరును కన్యను కృష్ణున కివ్వవలయుననియే కోరుచుండిరి. కాని యన్న యగు రుక్మి శ్రీకృష్ణుని యెడల ద్వేషముగలిగియుండుటచే, ఆ సంకల్పమును వ్యతి రేకించి, శిశుపాలుడే తన చెలియలికి యోగ్యుడగు వరుడని భావించినాడు.

పరమ సుందరియగు రుక్మిణికి, తన జ్యేష్ఠ సోదరుడగు రుక్మి శిశుపాలు నితో తన వివాహము జరిపించగోరుచుండెనను విషయము తెలియగనే, యామె దుఃఖించినది. బాగుగా నాలోచించి, యామె విశ్వాసపాత్రుడగు నొక బ్రాహ్మణుని రావించి, శీఘ్రముగ శ్రీకృష్ణు నొద్దకు పంపినది.

ఆ బ్రాహ్మణుడు ద్వారక చేరగానే, ద్వారపాలకు డాతనిని రాజమహలు లోనికి గొంపోయె. అచట హేమ సింహాసనముపై విరాజమానుడగుచునున్న శ్రీకృష్ణ భగవానుని యా బ్రాహ్మణుడు దర్శించినాడు. బ్రహ్మణ్యుడగు భగవానుడు వెంటనే యాసనము నుండి దిగి, యా బ్రాహ్మణుని తన యాసనమందు గూర్చుండ జేసి, తనను దేవతలు పూజించు విధమున, నతనిని పూజించినాడు. ఆదర— సత్కారములు, కుశల ప్రశ్నలు పూర్తియైన పిదప, బ్రాహ్మణుడు భుజించి విశ్రమించిన పిమ్మట, శ్రీకృష్ణుడాతనిజేరి, తన కోమలకర పల్లవములతో నాతని పాదములొత్తుచు, శాంత భావముతో నిట్లు ప్రశ్నించె.

"బ్రాహ్మణ శిరోమణీ, నీ చిత్త మెల్లపుడును సంతుష్టి చెందియున్నదా? వృద్ధ సమ్మతమగు ధర్మాచరణమునందు నీకెట్టి కష్టములు నుత్పన్నములగుటలేదు గదా! బ్రాహ్మణుడు తనకు లభ్యమైన దానితో తృప్తిపడి తన ధర్మము నాచరించుచు,

ధర్మచ్యుతి కలుగకుండనున్నచో, నతని సంతోషమే యతని సర్వకోరికలను సిద్ధింపజేయును. ఇంద్ర పదవి లభించినప్పటికిని యెవనికి సంతోషము కలుగకుండునో, వాడు సుఖమునకై, యొక లోకము నుండి మఱియొక లోకమునకు తిరుగవలసి వచ్చుచుండునేగాని, యెచ్చటను శాంతినొందజాలకయుండును. తన యొద్ద నేమియులేకున్నను, యెవడు సంతుష్టుడైయుండునో, వాడన్నివిధముల సంతాపరహితుడై, సుఖముగ నిద్రించగలిగియుండును. ప్రాప్తించినదానితో సంతృప్తిచెంది మధుర స్వభావము గలవాడై, భూతదయాపరులై, యహంకార రహితులై, శాంతులైయుండునట్టి—బ్రాహ్మణులకు నేను నమస్కరింతును. "బ్రాహ్మణోత్తమా, రాజువలన మీకు కుశలము లభించుచున్నదా? ఎవని రాజ్యమందు ప్రజలు సురక్షితులైయుందురో, ఆనందభరితులైయుందురో, అట్టి రాజు నాకు మిక్కిలి యిష్టుడు. ఇంతకు స్వామీ, నీ వెచట నుండి, యే కారణముచె, యే కోరికతో, యింత శ్రమతో గూడిన ప్రయాణమొనర్చి యిచటి కేతెంచినాడవు? అది రహస్యము గాకున్నచో, నాకు దెలుపుము. నేను నీకేమి సేవ జేయవలెనో తెలుపుము."

లీలామానుష రూపధారియగు భగవానుడీ ప్రకారము బ్రాహ్మణునితో బలుకగా, నతడు విషయమంతయు వినిపించి, యనంతరము, రుక్మిణీదేవి తన ద్వారా పంపిన సందేశము నీ క్రింది విధముగ చెప్పసాగినాడు.

శ్లో. శ్రుత్వాగుణాన్ భువనసుందర శృణ్వతాంతే
నిర్విశ్యకర్ణవివరైర్హరతోఽగతాపం
రూపందృశాం దృశిమతా మఖిలార్థలాభం
త్వయ్యచ్యుతా విశతి చిత్త మపత్రపంమే

"త్రిభువన సుందరా, వినువారల చెవుల ద్వారా, హృదయమందు ప్రవేశించి, సర్వాంగముల తాపమును, జన్మ జన్మల యనుతాపమును బోగొట్టునట్టి నీ కల్యాణ గుణములను, కన్నులుగల వారల చూపుల కఖిలార్థలాభమును కలిగించునట్టి నీ సుందర రూపమును, గూర్చి విని, నా చిత్తము నీ యందు, సిగ్గువిడిచి, లగ్నమైనది.

శ్లో కాత్వాముకుంద మహతీ కుల రూపశీల
విద్యావయోద్రవిణ ధామభి రాత్మతుల్యం
ధీరాపతింకులవతీన వృణీత కన్యా
కాలేనృసింహనరలోక మనోభిరామం

ప్రేమ స్వరూపా, శ్యామ సుందరా, ఏ దృష్టితో జూచినను, కుల, శీల, సౌందర్య, విద్య, వయస్సు, ధన ధామాది సర్వ విషయములందును నీవద్వితీయు

డవు. మనుష్య లోకమందు గల ప్రాణులందరి మనస్సులును, నిన్ను గాంచిశాంత్య నుభవమును పొందును. ఆనందతరంగితములగును. కావున, పురుష భూషణా,కుల వతియు, గుణవతియు, ధైర్యవతియగునట్టి కన్య యెవతె వివాహ యోగ్యమగు సమ యము వచ్చినపుడు, నిన్నే పతిగా వరించకుండునో నీవే చెప్పుము.

శ్లో॥ తన్మేభవాన్ ఖలువృతః పతి రంగజాయా
మాత్మార్పితశ్చభవతోఽత్ర విభోవిధేహి
మావీరభాగమభిమర్శతు చైద్య ఆరాత్
గోమాయువన్మృగపతే ర్బలి మంబుజాక్ష.

కావున ప్రియతమా, నేను నిన్ను పతిగా వరించితిని. నేనెన్నడో నీకాత్మ సమర్పణ గావించియుంటిని. నీవు సర్వాంతర్యామివి. నా హృదయమందలి విష యము నీకు తెలియనిదిగాదు. నీవిక్కడికి దయచేసి నన్ను నీ పత్నిగా స్వీకరిం చుము. కమలనయనా, ప్రాణవల్లభా, నీ వంటి వీరునికి నేనాత్మ సమర్పణగావించు కొని యుంటిని. నేను నీ దానను. సింహము పాలి సొమ్ము గోమాయువుహరించులా గున, చైద్యుడగు శిశుపాలుడు నన్నంటకుండుగాక. నేను జన్మజన్మములందు పూర్తములుగాని (నూతులు, చెరువులు మొదలైనవి) ఇష్టములు (యజ్ఞయాగాదులు) గాని, దాన, నియమ, వ్రత దేవగురు బ్రాహ్మణాది పూజలుగానిచేసి, పరమేశ్వరు నారాధించి యున్న యెడలను, వారు నన్ననుగ్రహించి యున్న యెడలను, శ్రీకృష్ణ భగవానుడేతెంచి నా పాణిగ్రహణము చేయుగాక. శిశుపాలుడు గాని, మఱెవడుగాని నన్ను స్పృశింపజాలకుందురుగాక. ప్రభూ నీవు అజితుడవు. వివాహమునకొక రోజు ముందుగనే నీవు మా రాజధానికి రహస్యముగ విచ్చేసి, సైన్యసమేతముగ, శిశు పాలాదుల సేనలను మర్దించి, బలపూర్వకముగ, వీర్యశుల్కనగు నన్ను రాక్షస విధానముచే వివాహమాడుము.

"నీవంతఃపురమునందుండెదవు. నీ వారిని సంహరించకుండ నేనునిన్నెటుల తీసుకొని పోగలను?" అను సంశయము నీకు కలుగుచో నేనొక యుపాయము నీకు సూచించెదను. వివాహమునకు ముందటి రోజున, కులదేవతను దర్శించుటయను కులాచారము మా వంశమందున్నది. ఆనాడు పెద్ద యుత్సవము జరుగును. ఆ యుత్సవ యాత్ర యందు పెండ్లికొమరిత నగరము వెలుపలనున్న గిరిజాదేవియొక్క యాలయమునకు వెళ్ళవలసి యుండును. కమలనయనా, ఉమాపతివంటి మహాను భావులు గూడ, ఆత్మశుద్ధికొరకై నీ పాదరజమునందు స్నానమాడ వాంఛించుచుం దురు. అట్టి నీ ప్రసాదమగు చరణధూళిని నేను పొంద లేనిచో, వ్రతోపవాసముల ద్వారా శరీరమును శుష్కింప జేసుకొని ప్రాణత్యాగ మొనర్చెదను. నీ యనుగ్రహ

ప్రాప్తికై యెన్ని వందల జన్మము లెత్తవలసి వచ్చినను, యెత్తి, యెప్పుడో యొక ప్పుడు, నీ యనుగ్రహ ప్రాప్తిని తప్పక పొందెదను."

అని రుక్మిణీ సందేశమును వినిపించి బ్రాహ్మణుడు, "యదువంశ శిరోమణి యిది అత్యంత రహస్యమగు రుక్మిణీ సందేశము. ఈ విషయములో నీవు చక్కగా నాలోచించి కర్తవ్యమును నిర్ణయించుము. తదనుసారముగ, వెంటనే కార్యమును నిర్వర్తించుము" అని పలికె.

# ఏబది మూడవ యధ్యాయము

## రుక్మిణీ హరణము

శ్రీకృష్ణ భగవానుడు, రుక్మిణీ సందేశమును విని బ్రాహ్మణుని చేతిని తన చేతితో గ్రహించి మందహాసము చేయుచు నిట్లు వచించె.

బ్రాహ్మణోత్తమా! విదర్భ రాజకుమారి నన్నెటుల కోరుచున్నదో, నేనును నామెనటులే కోరుచున్నాను. నా చిత్తమామెయందే లగ్నమై యున్నది. ఏమని చెప్పుదును? నాకు రాత్రులందు నిదురగూడ పట్టుటలేదు. రుక్మిణీ నాయందలి ద్వేష ముచే మా వివాహము కడ్డు పడుచున్నాడనియు నేనెఱుగుదును. కట్టెలను మథించి యందుండి యగ్నిని వెలికి దీయు విధమున, యుద్ధమందు నేనా రాజన్యాపసదులను మథించి, నన్ను ప్రేమించుచున్న పరమసుందరియగు నా రాజకుమారిని, వెలికిగొని వచ్చెదను" అని పలికె.

పరీక్షన్మహారాజా, రుక్మిణీదేవి యొక్క వివాహోమెల్లుండి రాత్రియని తెలుసు కున్న మధుసూధనుడు వెంటనే సారథిని బిలచి, "దారుకా, శీఘ్రముగ రథమును సిద్ధముచేయుము. అని యాజ్ఞాపించె. దారకుడటులనే, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకములను నాలుగు గుర్రములతో గూడిన రథమును సిద్ధముచేసి తీసుకొని వచ్చి, ప్రాంజలియై నిల్చుండె. మాధవుడు బ్రాహ్మణుని ముందుగా రథమెక్కించి, యనంతరము తానధిరోహించి, వేగవంతములైన యా గుర్రముల ద్వారా, యొక్క రాత్రిలోపలనే, ఆనర్తదేశమునుండి విదర్భదేశమునుజేరి, కుండిన (విదర్భరాజధాని) నగలేశుడగు భీష్మకుడు, తన పెద్ద కుమారుడగు రుక్మియందలి స్నేహముచేత, తన కన్యయగు రుక్మిణిని శిశుపాలునకిచ్చియుద్వాహమొనర్చుటకై, వివాహ మహో త్సవమునకేర్పాట్లు చేయుచుండె. నగరమందలి రాజవీధులు, చత్వరములు,సందులు గొందులన్నియు బాగుగా శుభ్రముచేయబడి కలాపజల్లబడినవి. చిత్ర విచిత్రములగు రంగురంగుల పతాకములెగురుచున్నవి. తోరణములు గట్టబడినవి. నగరమందలి స్త్రీ పురుషులందరును మంచి మంచి వస్త్రాభరణములచే నలంకరించుకొనియుండిరి.

అచటి సుందరగృహములనుండి యగరుధూపముయొక్క సౌగంధము వెలువడి సర్వత్రా వ్యాపించుచున్నది. భీష్మకమహారాజు, పితృదేవతలకు, దేవతలకు యథా విధిగ పూజలొనర్చి, బ్రాహ్మణసంతర్పణగావించి, నియమానుసారముగ స్వస్తివాచనము చేయించినాడు. సుదతి [సుందరదంతములుగలది] యగు రాజకుమారిని సుస్నాతగావించి, మంగళకరములగు కంకణ, వస్త్రాభూషణాదులచే నలంకరించినారు. కులదేవతను ప్రతిష్ఠించినారు. బ్రాహ్మణోత్తములు, ఋగ్యజుస్సామవేద మంత్రములచే రక్షావిధిని నెరవేర్చగా, అథర్వణవేదవేత్తయగు పురోహితుడు గ్రహశాంతికై హోమవిధిని నెరవేర్చినాడు. భీష్మకుడు, కులసంప్రదాయములను, శాస్త్రీయవిధులను చక్కగా తెలిసినవాడు. బంగారము, వెండి, వస్త్రములు, బెల్లముతో గలిపినతిలలు, మఱియు గోవులను బ్రాహ్మణులకు దానములిచ్చినాడు.

అటులనే, చేదిదేశాధీశుడగు దమఘోషుడుగూడ, తన కుమారుడగు శిశుపాలునకు, మంత్రజ్ఞులగు బ్రాహ్మణులచే వివాహసంబంధములగు మంగళకృత్యములు చేయించినాడు. అనంతరము మదగజములు, బంగారు మాలలతో నలంకరించబడిన రథములు, గుర్రములు, పదాతులు గల చతురంగబలముతో కూడినవాడై కుండిన నగరమును ప్రవేశించినాడు. విదర్భరాజగు భీష్మకుడాతని కెదురేగి సాదరముగ నాహ్వానించి, యథోచిత సత్కారపూజలొనర్చి, వారికై నిర్దేశింపబడిన విడిది గృహమునందు ప్రవేశింపజేసినాడు. పెండ్లికుమారుని వర్గములో శాల్వుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, విదూరథుడు, పౌండ్రకుడు మొదలగు శిశుపాలుని మిత్రులనేకుండిరి. వారందరును బలరామకృష్ణులకు విరోధులు. రాజకుమారియగు రుక్మిణిని శిశుపాలున కిప్పించవలయుననియే వారందరేతెంచియుండిరి. రామకృష్ణాది యాదవులువచ్చి కన్యనుహరించు ప్రయత్నమొనర్చినయెడల ప్రతిఘటించవలయుననియే వారి యుద్దేశ్యము. అందుకొరకే తమతమ చతురంగబలముతో వచ్చియుండిరి.

శత్రురాజుల యార్భాటమును బలరాముడు గుర్తించినాడు. శ్రీకృష్ణుడొక్కడే రాజకుమారిని తెచ్చుటకై వెళ్ళియుండెనని యాతనికి తెలిసినది. కన్యనుతెచ్చు సమయమందు గొప్పయుద్ధము జరుగగలదను శంకగలిగి, భాతృప్రేమ పరిప్లుతుడగు బలరాముడు, చతురంగబలముతో గూడిన గొప్ప సైన్యమును వెంటబెట్టుకుని కుండిన నగరమునకు పయనమాయె.

కుండిన నగరమందు పరమ సుందరియగు రుక్మిణి, శ్రీకృష్ణభగవానుని శుభాగమనమునకై యెదురు చూచుచున్నది. శ్రీకృష్ణుని మాట యటుంచి, వెళ్ళిన బ్రాహ్మణుడు వచ్చిన జాడ గూడ యగుపించదాయె. ఆమె యారాట మధికమైనది. చింతాకులిత స్వాంతయై యామె యిట్లు చింతించసాగినది. "అయ్యో, అభాగిననగు నా వివాహమునకు గడువింక నొక్క దినము మాత్రమే యున్నది. నా జీవన సర్వస్వమగు ద్వారాకానాథుడింతవరకు రాలేదు. ఇందుకు కారణమే యూహింపజాల

కుంటిని. అది సరే వెళ్ళిన బ్రాహ్మణుడు గూడ యింతదనుక రాకుండెనే! శ్రీకృష్ణుని స్వరూపము పరమ శుద్ధమగుటచే, పరిశుద్ధాత్ములగు వారు మాత్రమే యతనిని ప్రేమించగల్గుదురనుటలో నెట్టి సందేహము లేదు. అతనికి నా యందేదో లోపము గనుపించి యుండవచ్చును. అందుచేతనే నన్ను పాణిగ్రహణమొనర్చుటకై యాతడి చటికి రాలేదేమో! నేను దౌర్భాగ్యురాలను బ్రహ్మ, శంకర భగవానులు నాకనుకూలురు గాకుండిరట్లు గాన్పించుచున్నది. గిరిరాజకుమారియగు పార్వతియు నాయందు ప్రసన్నురాలు గానట్లే తోచుచున్నది." అని గోవిందునియందే లగ్నమైన చిత్తముగల రుక్మిణి, యాలోచించుచుండినది. భక్తమానసచోరుడగు భగవానుడామె చిత్తమును హరించినాడు. ఇట్లాలోచించుచు, కాలజ్ఞయగునామె యశ్రుభరితములైన కన్నులను మూసుకొని కృష్ణాగమనమును నిరీక్షించుచుండె. ఆ సమయమందామె యెడమ యూరువు, యెడమ భుజము, యెడమ నేత్రము అదిరినవి. ఆ శకునము, ప్రియాగమనము ప్రియ సంవాదము సూచించునట్టిది. ఇంతలోనే శ్రీకృష్ణుని వద్ద నుండి, తన సందేశహరుడగు బ్రాహ్మణోత్తముడేతెంచి, ధ్యానమగ్నయైన దేవివలె నున్న రుక్మిణిని చూచినాడు. వికసించియున్న బ్రాహ్మణుని ముఖమును రుక్మిణియు చూచినది. అతని ముఖమందెట్టి యాందోళనగాని, కలవరపాటుగాని లేకున్నది. అతని ముఖ లక్షణముల గాంచి యామె శ్రీకృష్ణుడు వచ్చియుండెనని గ్రహించినది. ప్రసన్నురాలై యామె విప్రుని ప్రశ్నించగా నాతడు "శ్రీకృష్ణుడు వచ్చియుండెనని చెప్పెను. అతనిని మిక్కిలి ప్రశంసించుచు నతడు "రాజకుమారీ, నిన్నుగొని పోదునని యాతడు శపథము చేసినాడ"నియు చెప్పినాడు. ఆ మాట విని యామె హృదయమానందాతిరేకముచే నుప్పొంగి పోయినది. ఇంత యుపకారము చేసిన బ్రాహ్మణునకామె బహుమానమేమియు నీయలేనిదై కేవలము నమస్కారము మాత్రము చేసినది. అనగా తనను తాను సమర్పించుకొనినది. లేక—శ్రీదేవియగు తనకు నమస్కరించినవారలకు సర్వసంపత్సమృద్ధి కలుగునుగదా. అట్టిచో, తానే నమస్కరించిన వానికి ప్రాప్తించనిదేముండును? కావున అంతకంటె గొప్పదానినేమియు గాంచలేక నమస్కరించినదని భావము. అనగా జగత్తు యొక్క సమస్తైశ్వర్యము బ్రాహ్మణున కామె సమర్పించినదని యర్థము.

బలరామకృష్ణులు, కన్యా వివాహ సందర్శనాభిలాషులై యేతెంచిరను వార్త విన్న భీష్మక మహారాజు మంగళ వాద్యములతో నెదురేగి, యథావిధిగ పూజించి, సత్కరించినాడు. భీష్మకుడు మహా బుద్ధిమంతుడు, భగవానుని యందాతనికి గొప్ప భక్తియున్నది. రామకృష్ణులకు వారి వెంట వచ్చిన వారలకు, సేనకు తగిన వసతి కల్పించినాడు. భీష్మకుడు తమ నగరమునకు విచ్చేసిన వారందరికిని, వారి వారి యంతస్థులకు తగినట్లు వారి వారికి వలయు వస్తు సామాగ్రుల లొసంగి సత్కరించినాడు. శ్రీకృష్ణుని యాగమన వార్త తెలియగనే విదర్భపురవాసులందరును, భగవానుని నివాస గృహమున కేతెంచి, తమ నయనములను దోసిళ్ళతో, యదుసందనుని

వదనారవిందమకరందరసమును తనివితీర గ్రోలుచుండిరి. "రుక్మిణి యితని కర్ధాంగి యగుటకు తగినది పరమపవిత్రమూర్తియగు నీ శ్యామసుందరుడే యామెకు తగిన భర్తయగునని వారందరు తమలో తాము గుసగుసలు పోవుచుండిరి. "మేము పూర్వ జన్మయందేమైన పుణ్య కర్మలు చేసియున్నచో, త్రిలోకేశుడగు భగవానుడు మా యందు అనుగ్రహము కలిగి యుండుచో, యీ కృష్ణుడే, రుక్మిణీ పాణిగ్రహణము చేయుగాక" యని యభిలషించుచుండిరి.

ప్రేమ పరవశులై పురవాసులు పరస్పర మీ విధమున సంభాషించుకొను చున్న తరుణము నందే, రుక్మిణీదేవి తన యంతఃపురము నుండి వెలువడి, నగర బహిః ప్రదేశమందున్న దేవీ మందిరమునకు బయలుదేరినది. ప్రేమమూర్తియగు శ్రీకృష్ణచంద్రుని చరణ కమలములనే చింతనము చేయుచు, నామె భవానీ పదపల్లవ సందర్శనార్థము పాదచారిగనే పోవుచున్నది. అస్త్రశస్త్రపాణులై యనేకమంది సైనికు లామెకు రక్షణగా వెళ్ళుచుండిరి. భేరీ, మృదంగ శంఖాద్యనేక వాద్యములు మ్రోగు చుండినవి. బ్రాహ్మణ ముత్తైదువలనేకులు, పుష్పమాలలు, చందనాది సుగంధ ద్రవ్య ములు, వస్త్ర భూషణాలంకారములు ధరించి యామె ననుసరించిరి. నానా ప్రకారము లగు పూజా సామగ్రులను, ఉపహారములను తీసుకొని వరవారాంగనలు వేలకొలది వెళ్ళుచుండిరి. గాయకులు, స్తోత్ర పాఠములు గానము చేయుచు వందిమాగధ జన ములు కన్యను పరివేష్టించి వెళ్ళుచుండిరి. దేవీమందిరము చేరి యామె, కాలుసేతులు కడుగుకొని, యాచమన మొనర్చి, శుచియై, బాహ్యాభ్యంతర పవిత్రత గలదియై, శాంతభావముతో, అంబికామందిరము ప్రవేశించినది. విధి విధానములు తెలిసిన వృద్ధ సువాసినులు ఆమెవెంట నుండిరి వారు భవానీదేవికి, భవానీపతికి రుక్మిణీదేవిచే ప్రణామము చేయించిరి. రుక్మిణీదేవి భగవతినిట్లు ప్రార్థించినది.

అంబికామాతా, నీ యొడియందున్న నీ ప్రియతనయుడగు, గణపతికి, నీకు పునః పునః ప్రణామములర్పించుచుంటిని. నా మనోరథము సిద్ధించునట్లు వర మొసగుము తల్లీ. శ్రీకృష్ణ భగవానుడు నాకు పతి యగునట్లనుగ్రహింపుము."

అని ప్రార్థించి, జల, గంధ, అక్షత, ధూప, వస్త్ర, పుష్పమాల, హార, ఆభూషణాద్యనేక ప్రకారాలంకారములను, వివిధ నైవేద్యములను సమర్పించి, హారతి యొసంగి యంబికాదేవి పూజ యొనర్చినది. అనంతరము, లవణము, అపూపములు, తాంబూలము, కంఠసూత్రములు, చెఱకు, మొదలగు వానిచే, బ్రాహ్మణ సువాసినులను గూడ పూజించినది. వారందరనుగ్రహముతో నామె నాశీ ర్వదించిరి. పెండ్లికూతురా బ్రాహ్మణ ముత్తైదువలకును, భవానీదేవికిని నమస్క రించి, ప్రసాదమును స్వీకరించినది. పూజా విధి సమాప్తియైన పిమ్మట నామె తన మౌనవ్రతమును వదలినది. రత్నముద్రోపశోభితమగు తన కరముతో నొక చెలి కత్తె చేతిని బట్టుకొని, రుక్మిణీదేవి గిరిజామందిరమునుండి వెలువడినది.

రాజా, రుక్మిణీదేవియు, భగవానుని మాయాశక్తివలెనే, శూరవీరులనుగూడ మోహింపజేయునట్టిది. ఆమె కటిభాగము సుందరముగను, చాల సన్నముగ నున్నది. కర్ణకుండలములు కమనీయ కాంతివంతములై యున్నవి. ఆమె యౌవన ప్రాదుర్భావముందున్నది. నితంబముపై, రత్నమేఖల మెరయుచున్నది. వక్షఃస్థల మున్నతముగ నున్నది. వ్రేలాడుచున్న యలకల కారణమున, ఆమె దృష్టి కొంచెము చంచలముగా నుండినది. పెదవులపై మనోహరమందహాసము వెలయు చున్నది. దంతపంక్తి మల్లెమొగ్గలవలె తెల్లగానున్నను, అరుణాధరోష్ఠకాంతి ప్రసరించుటచే కొంచెమెర్రదనము సంతరించుకున్నది. ఆమె పాదములయందలి నూపురములు మంజుల ధ్వనులు చేయుచున్నవి. సుకుమారములగు చరణకమలములతో నామె పాదచారిగనే మరాళమంధగతితో నడచుచుండె. ఆమె యపూర్వ శోభనుగాంచి, యచటజేరిన వీరాధివీరులందరు సమ్మోహితులై పోయిరి. కామదేవుడే, భగవానుని కార్యసిద్ధికై, తన బాణములచే వారి హృదయములను జర్ఝరిత మొనర్చినాడు.

రుక్మిణీదేవి యీ ప్రకారము, ఉత్సవయాత్రా నెపమున, మందమంద గమన మొనర్చుచు, శ్రీకృష్ణ భగవానునిపై తన సౌందర్యరాశిని సమర్పించుకొనుచుండె. ఆమెను, ఆమె సౌందర్యమును, మధురమందహాసమును గాంచుచు ముగ్ధులైపోయిన రాజులు, శూరవరులు, మూర్ఛితులైపోయిరి. వారి చేతులందలి యాయుధములు జారి నేలపై పడిపోయినవి. తాముగూడ తమ తమ వాహనములందుండి పడిపోవుచుండిరి. శ్రీకృష్ణుని యాగమనమును ప్రతీక్షించుచు రుక్మిణీదేవి నెమ్మది నెమ్మదిగా నడుగులు వేయుచు కదలుచున్నది. తన యెడమచేతితో వ్రేలాడుచున్న తన యలకలను వెనుకకు తొలగించుచు, క్రీగంటిచూపుల నచట జేరియున్న నరపతులపై ప్రసరింపజేయుచున్నది. అదే సమయమందామెకు శ్యామసుందరుని సందర్శనమైనది. రాజకుమారి రథము నెక్కవలయునని తలచుచుండగనే సమస్త రాజలోకము చూచుచుండ, వారిమధ్య నుండియే, రుక్మిణినెత్తి, గరుడధ్వజమండితమగు తన రథముపై గూర్చుండబెట్టుకొని, మాధవుడు ముందుకు సాగినాడు. సింహము, నక్కల గుంపుమధ్యనుండి తన భాగమును గొనిపోవునట్లు, భగవానుడు రుక్మిణిని హరించి, బలరామాది యాదవవీరులు వెంటరాగా, నచటనుండి తరలిపోయినాడు. ఆ సమయమందచట జేరియున్న జరాసంధవశవర్తులైన యభిమానధనులగు రాజులకది గొప్పయవమానముగను, తిరస్కారముగను తోచినది. తమ యశఃక్షయకరమగు నా తిరస్కారమును వారు సహింపలేకపోయినారు. అందరు కోపముతో తమను తాము చీదరించుకొనుచు, "మనమందరము ధనుర్ధారులమై యిచట నుండగనే, సింహభాగమును హరిణము గొనిపోయినట్లు, మన యశస్సు నీ యాదవులు హరించిరి." యని, రోషాన్వితస్వాంతులైరి.

# ఏబదినాల్గవ యధ్యాయము

## శిశుపాల సహచరరాజులు రుక్మి పరాజయమందుట-
## రుక్మిణీ వివాహము

రాజులందరు పరస్పరము సంప్రదించుకొని, క్రోధముతో మండిపడుచు, కవచముల ధరించి, తమ తమ వాహనములధిరోహించి, సేనాసహితముగ ధనుర్ధారులై, శ్రీకృష్ణుని వెంటబడిరి. శత్రుబలములు తమ పైకెత్తి వచ్చుచుండుట గాంచిన యాదవసేనానాయకులు గూడ ధనుష్టంకారములు గావించుచు వారినెదుర్కొనిరి. జరాసంధ పక్షీయులు కొందరు గుర్రములపైనను, కొందరు గజములపైనను, కొందరు రథములపైనను అధిరోహించి యుండిరి. అందరును ధనుర్వేద పారంగతులే. పర్వతములపై మూసలధారలతో మేఘములు వర్షించునట్లు, వారు యాదవసేనలపై బాణవర్షమును గురిపించసాగిరి. శ్రీకృష్ణుని సేన బాణవర్షముచే గప్పబడియుండుటను గాంచిన రుక్మిణీదేవి భయభీతయై సిగ్గుతో భగవానుని ముఖము వంక జూచినది. భగవానుడామె యభిప్రాయమును గాంచి, "సుందరీ, భయపడకుము. నీ సేన యిప్పటికిప్పుడే శత్రుసైన్యమును సర్వనాశన మొనర్చ గలదు" అని యూరడించె. యదువీరులగు గదసంకర్షణాదులు, శత్రుబలాధిక్యత నింక సహింపనివారై, తమ బాణములతో, శత్రుసైన్యమునందలి, యేనుగులను, గుర్రములను, రథములను ఛిన్నాభిన్న మొనర్పసాగిరి. శత్రువీరుల కిరీటకుండలాలంకృతములగు శిరములు తెగిపడసాగినవి. జంతువులు హతములైనవి. రథములు భగ్నములైనవి. యాదవవీరులచే శత్రుసైన్యము సర్వనాశనము గావింపబడినది. జరాసంధాధి రాజన్యులందరు పలాయనము చిత్తగించిరి.

అచట శిశుపాలుడు, తనకు కాబోవు భార్య యపహరింపబడుటచేత, మరణాసన్నునివలెనై పోయినాడు. హృదయమందుత్సాహము నశించినది. శరీరముపై కాంతి లేకుండబోయినది. అతని నోరెండిపోయినది. జరా సంధు డాతని వద్దకేగి, "శిశుపాలా, నీవు పురుషశ్రేష్ఠుడవు. ఈ యుదాసీనతను విడువుము. ఏ విషయము గూడ, యెప్పుడు అనుకూలముగా గాని, ప్రతికూలముగా గాని, యుండదు. ఈ విషయములో స్థిరత్వమనునది యే ప్రాణియొక్క జీవితమందును గాన రాదు. గారడివాని యిచ్ఛానుసారము నృత్యమొనర్చు కర్రబొమ్మవలె, జీవుడు యీశ్వరేచ్ఛానుసారము సుఖదుఃఖములకు సంబంధించిన విషయములకై యథాశక్తిగా ప్రయత్నించుచుండును. ఈ శ్రీకృష్ణుడు పదునేడు పర్యాయములు, యిరువది మూడక్షౌహిణీ సమేతుడనై, దండెత్తిన నన్ను జయించియుండె. అయినను పదునెనిమిదవ పర్యాయము నే నాతనిని జయించితిని. ఆ పరాజయమును గూర్చిన చింతగాని విజయమును

గూర్చిన హర్షముగాని నేను పెట్టుకొనలేదు. ఏలననగా, కాలరూపి యగు భగవానుడు ప్రారబ్ధానుసారము, యీ చరాచర జగత్తునంతటిని నడిపించుచుండునను విషయము నాకు తెలియును గనుక. మనము మహాయోధులము, వీర సేనాధిపతుల కధీశ్వరుల మనుటలోనెట్టి సందేహమును లేదు. అయినను యీ సమయమున శ్రీకృష్ణరక్షితమగు స్వల్ప సేనయే మనలను పరాజితుల గావించినది. కాలము వారి కనుకూలించినందుననే వారి కిపుడు జయము కలిగినది. కాలము మనకనుకూలించినపుడు మనము వారిని జయించగలము" అని యీ విధముగ తన మిత్రులందరు బోధించగా శిశుపాలుడు తన యనుయాయులతోగూడి తన నగరమునకు తిరిగిపోయినాడు. చావగా మిగిలిన రాజులు గూడ తమ తమ నగరములకేగినారు.

"రుక్మిణీదేవి యొక్క పెద్దన్నగారగు రుక్మి శ్రీకృష్ణునెక్కువగా ద్వేషించుచుండె. తన చెల్లెలిని శ్రీకృష్ణుడు హరించుట నాతడు సహించలేకుండె. రుక్మి బలవంతుడే. కావున యొక యక్షౌహిణీ సేనతో బయలుదేరి శ్రీకృష్ణుని వెంట తగిలె. కవచము ధరించి ధనుర్బాణములు గైకొని యాతడు తన వారితో సమస్త నరపతుల సమక్షమున నీ విధముగ ప్రతిజ్ఞ గావించినాడు. "నేను మీ మధ్యలో నిట్లు శపథ మొనర్చుచుంటిని. యుద్ధమందు శ్రీకృష్ణుని వధించి, సోదరియగు రుక్మిణిని తీసుకు రాలేనిచో, కుండిన నగరమును ప్రవేశించను" అని పలికి రథమెక్కి, శ్రీకృష్ణుడున్న యెడకు రథమును బోనిమ్మని, సారథితో బలికెను. "నేనతనితోనే యుద్ధము చేయవలసియున్నది. నిశితములగు బాణములచే దుర్మతియగు నతని గర్వము చూర్ణము గావించెద. వాని సాహసము చూడుము. మా చెల్లెలి నపహరించుకొని పోయినాడు." అని సారథితో బలికె. రుక్మికి శ్రీకృష్ణుని ప్రభావము తెలియదు. అతని మతి చలించినది.

కావున నటుల వాగుచు, నతడొక్కడే శ్రీకృష్ణుని సమీపించి, యాగుమాగుమని యరచుచు, నతనిపై మూడు తీవ్రబాణాఘాతములొనర్చె "యదుకుల కళంకా, ఒక్కక్షణమాగుము. కాకి హోమసామగ్రిని దొంగిలించుకొనిపోయినట్లు నా చెలియలిని దొంగిలించి నీవెందు బోగలవు? ఓరీ, మూర్ఖుడా, నీవు మహామాయావివి. కపటయుద్ధ కుశలుడవు. నేడు నీ సర్వగర్వమును ఖర్వమొనర్చెద. నా బాణము నిన్ను హత మొనర్చి ఖళాయిగా చేయకముందే మా చెల్లెలిని వదలి పారిపొమ్ము" అని రుక్మి పలుకుచుండగా, శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుచూ, నతని ధనస్సును విరుగగొట్టి యాతనిపై నారు బాణములు ప్రయోగించె. ఎనిమిది బాణములతో గుఱ్ఱములను, రెండు బాణములతో సారథిని గొట్టి, మూడు బాణములతో నాతని రథపతాకమును బడగొట్టె, మఱియొక ధనుస్సును ధరించి రుక్మి గోవిందునిపై నైదు బాణములు ప్రయోగించగా, నతడా ధనస్సునుగూడ త్రుంచివైచె. ఇంకొకధనుస్సును

గ్రహించ దానినిగూడ విరుగగొట్టె. అతడు పరిఘ, పట్టిస, శూలాద్యాయుధము లెన్ని గైకొన్నను, భగవానుడు వానినెల్ల ఖండించివైచె. క్రోధావేశుడై రుక్మి, కర వాలము గైకొని, శ్రీకృష్ణుని జంపు నుద్దేశ్యముతో రథమునుండి దూకి, యాతని వైపు పరుగిడె. అగ్నియందు శలభమువలె తనమీదికి వచ్చుచున్న యాతనిని గాంచి, భగవానుడాతని డాలును, కరవాలమును బాణములచే ఖండించి, యాతనిని సంహరించుటకై తీవ్రమగు పదునుగల ఖడ్గమును చేబూనినాడు. శ్రీకృష్ణుడు తన సోదరుని వధించునని భయపడిన రుక్మిణి, తన ప్రియతమ పతియగు భగవానుని చరణకమలములందువ్రాలి, కరుణస్వరమున నిట్లు పల్కినది. "దేవాధిదేవా, జగత్పతీ నీవు యోగీశ్వరుడవు. నీ స్వరూపమునుగాని, నీ సంకల్పములనుగాని, యెవ్వ రును గుర్తింపజాలరు. నీవు మహాబలవంతుడవు. కల్యాణ స్వరూపుడవుగూడనై యుంటివి. ప్రభూ, నా యగ్రజుని జంపుట నీకు యోగ్యమగు పనిగాదు" అని పలికి నది. రుక్మిణి యొక్క సర్వాంగములు వణుకుచున్నవి. శోకావేగముచే నోరెండి పోయినది. కంఠము గద్గదికమైనది. ఆతురతవల్ల బంగారు హారముక్రింద జారి పడి పోయినది. భగవానుని చరణకమలములను పట్టుకొనియే యున్నది. పరమదయాళు డగు ప్రభువు, ఆమె భయభీతయై యుండుటగాంచి, కరుణార్ద్ర హృదయుడయి, రుక్మిని సంహరించు సంకల్పమును విరమించినాడు. కాని రుక్మి, యాతని కనిష్టము గల్గించు ప్రయత్నమును మానలేదు. అందువే శ్రీకృష్ణుడాతనిని బంధించి, గడ్డమును, మీసమును, కేశములను అచ్చటచ్చట గొరిగి విరూపుని గావించినాడు. అప్పటికి యదువీరులు శత్రుసైన్యమును ఛిన్నాభిన్నము గావించి శ్రీకృష్ణుని సమీపించగా, యుత్తరీయముచే బంధించబడి సగము చచ్చినట్లున్న రుక్మి యగుపించినాడు. అది గాంచి బలరామునకు చాల దయగలిగినది. అతని బంధమూడదీసి వదలిపెట్టుచు, కృష్ణునితో నాతడిట్లులనియె. "కృష్ణా, నీవు చేసినపని మంచిదిగాదు. ఇది చాలా నింద్యము, మనవంటి వారికి తగినదిగాదు. మన బంధువు నీవిధముగా గొరిగి యవ మానించుట, చంపుటతో సమానమే యగును" అని మందలించి యాతడు, రుక్మిణి వంక దిరిగి, "అమ్మా, నీ యన్న రూపము వికృతము గావింపబడినదని నీవు మా యెడల కినుక వహింపవలదు. జీవుడు తన కర్మల ఫలమునే తాననుభ వింపవలసి యుండునే గాని, యతనికి సుఖ దుఃఖము లొసంగువాడు వేఱొక డుండడు." అని యామె నోదార్చి, మరల శ్రీకృష్ణునితో, "కృష్ణా, మన సన్ని హిత బాంధవులు, చంపవలసినయట్టి యపరాధమొనర్చినను, వారు బాంధవులచేతనే చంపబడరాదు. అతనిని వదలివేయ వలసినదే. ఇప్పుడతని యపరాధము చేతనే మరణించినాడు. చచ్చిన వానిని మరల చంపుట యెందులకు?" అని మరల రుక్మిణితో, "అమ్మా, బ్రహ్మ యీ క్షత్రియకులమునే యిట్టుల నిర్మించినాడు.

స్వంత సోదరునిగూడ సోదరుడు చంపుచుండును. కావున యీ క్షత్రియ ధర్మ మతి ఘోరమైనది."

అని పలికి మరల శ్రీకృష్ణునితో, "సోదరా, ధనమదాంధులగు వారు, అహంకారాభిమానులునగు వారు. రాజ్యము, పృథివి, ధనము, స్త్రీ, మానము, తేజస్సు, లేక మఱియే కారణము చేతనైనను, బంధువులను గూడ తిరస్కరించుచుందురను విషయము, సత్యమే" యని వచించె. మరల రుక్మిణితో నాతడు, "అమ్మా, నీ సోదరులు, బంధువులు సర్వ ప్రాణుల యెడల, దుర్భావము కలిగి యున్నారు. అందుచే వారికి శుభము చేకూర్చు నుద్దేశ్యముతోనే మేము దండ విధిని విధించితిమి. అజ్ఞాన వశముచే దానిని నీవు అమంగళముగా భావింపరాదు. అట్లు భావించినచో నది బుద్ధి వైషమ్యమగును. భగవన్మాయామోహితులగు వారు, దేహమునే యాత్మగా భావించి యున్నందున, వారికి యితడు మిత్రుడు, యితను శత్రుడు, యితడు దాసీనుడను భేదభావము కలుగుచుండును. సమస్త దేహ ధారులకు గూడ ఆత్మ యొక్కటే. కార్య కారణములతోగాని, మాయతోగాని ఆత్మ కెట్టి సంబంధమును లేదు. జలము, ఘటము మొదలగు నుపాధి భేదములచేత, సూర్యుడు, చంద్రుడు, ఆకాశము మొదలగునవి భిన్న భిన్నములుగా గోచరించుచుండినను, నొక్కటియేయైయుండు విధమున, ఆత్మ యొక్కటిగ నున్నను శరీర భేదముల చేత ఆత్మ భిన్నముగా నున్నదని మూర్ఖులు భావించుచుందురు. ఈ శరీరాదులంతముగలవి. పంచభూతములు, పంచ ప్రాణములు, తన్మాత్రలు, త్రిగుణములు, దీనికి స్వరూపము (శరీరమునకు). అజ్ఞానవశముచేత ఆత్మ యందిది కల్పితమైనది. అట్టి కల్పిత శరీరము (దేనిని 'నేన'ని భావించుచుంటిమో) జీవుని జన్మమృత్యురూప సంసార మందు పడవేయుచున్నది. అమ్మా, నేత్రము-రూపము రెండును సూర్యునిద్వారా ప్రకాశితములగుచున్నవి. అందుచే సూర్యునితో, నేత్ర రూపముల కెన్నటికిని వియోగము సంభవింపదు. అదే విధముగ సమస్త సంసారము యొక్కయునికి, ఆత్మ సత్యత్వకారణముచేతనే తెలియబడుచున్నది. అట్టిచో ఆత్మతో యితర అసత్పదార్థముల యొక్క సంయోగముగాని, వియోగముగాని యెట్లు సంభవించును? పుట్టుట, ఉండుట, వృద్ధిపొందుట, మారుట, తగ్గుట, మరణించుట యను (షడ్భావ వికారములు) వికారములు శరీరమునకు కలుగునుగాని యాత్మకుగాదు. కృష్ణపక్షమందు చంద్రకళలు క్షీణించునేకాని చంద్రుడు క్షీణించడు. కాని యమావాస్యనాడు, వ్యావహారికముగా, లోకులు, చంద్రునకే క్షయము కల్గినదని వ్యవహరించుచుందురు. అటులనే జన్మ మరణములను వికారములు శరీరమునకే కలుగచున్నను, భ్రాంతిచే నవి యాత్మకంటగట్టుచున్నారు లోకులు. నిద్రించుచున్న పురుషుడు, భోగ్యవస్తువులేవియు లేకున్నను, స్వప్నమందు, భోక్త, భోగ్యము, భోగ రూప ఫలానుభవము పొందుచుండునట్లు, అజ్ఞానులు,మిథ్యాసంసార

చక్రానుభవము పొందుచుందురు. అందుచేత, తల్లీ, అజ్ఞానవశముచే కలుగు శోకమును వీడుము. ఈ శోకమంతఃకరణమును శోషింపజేయును. మోహితము గావించును. కావున దానిని వీడి నీ స్వరూప స్థితినందుము."

అని బలరాముడీ రీతి తత్త్వోపదేశము చేయగా, పరమ సుందరియగు రుక్మిణి తన మనోమాలిన్యమును దొలగించుకొని, వివేకముచే మనస్సును సమాధాన పరచుకొనినది. రుక్మికి సైన్యమదివరకే నశించినది గదా, కేవలము ప్రాణములు మాత్రము దక్కినవి. అతని కోరికలన్నియు వ్యర్థములైనవి. శత్రువు లవమానించి వదలినారు. తనను విరూపము గావించిరను స్మృతి నాతడు వదలలేకపోయినాడు. భోజ కటమను నగర మొక దానిని నిర్మించుకొని యతడందుండిపోయినాడు. "దుర్బుద్ధియగు కృష్ణుని వధించి, తన చెల్లెలిని విడిపించనంతవరకు కుండిన నగర ప్రవేశము జేయనని శపథముచేసి యాతడు భోజకటమునందే వసింపసాగినాడు.

భగవానుడీ విధముగ సర్వరాజన్యుల జయించి, రుక్మిణిని ద్వారకకు గొంపోయి యచట విధి పూర్వకముగ నామె పాణిగ్రహించినాడు. ఆ సమయమందు ద్వారకాపురమందు మహోత్సవములు జరిగినవి. నర నారీమణులందరు సర్వాలంకార శోభితులై, మహానందముతో నూతన వధూవరులకనేక కాన్కలొసంగిరి. ద్వారకానగర శోభ మరింత వన్నెకాంచినది. గృహములు, వీధులు అన్నియు చిత్ర విచిత్రముగా నలంకరింపబడినవి. మిత్రనరపతులందరాహ్వానితులైనారు. వారి గజముల మదజలముచే వీధులన్నియు తడిసిపోయినవి. ప్రతి గృహద్వారమునందును అరటి స్తంభములు పోకమ్రాకులు సమర్చబడినవి. కుతూహలముచే నిటునటు తిరుగు, బంధువర్గములందు, కురు, సృంజయ, కేకయ, విదర్భ, యదు, కుంతి మొదలగు వంశముల వారందరును, ఆనందోత్సవముల జరుపుకొనుచుండిరి. అచ్చటచ్చట రుక్మిణీహరణ గాధ వినవచ్చుచుండె. అది విన్నరాజులు, రాజకన్యలు విస్మితులగుచుండిరి. రుక్మిణీ రూపములో సాక్షాల్లక్ష్మీదేవిని, నారాయణ స్వరూపుడగు శ్రీకృష్ణునితో జూచిన ద్వారకానగర వాసులందరికిని, పరమానందము కలిగినది.

# ఏబదియైదవ యధ్యాయము

## ప్రద్యుమ్నజననము-శంబరాసుర వధ

శ్రీశుకు లిట్లు చెప్పుచున్నారు.

"రాజా, కామదేవుడు వాసుదేవాంశజుడు. పూర్వమాతడు రుద్రదేవుని క్రోధాగ్నికి భస్మమైపోయి యుండెె మరల శరీర ప్రాప్తికై యాతడు వాసుదేవునే యాశ్రయించె. ఆ కామదేవుడే వాసుదేవుని ద్వారా, రుక్మిణీదేవి గర్భమందుదయించి,

ప్రద్యుమ్ననామముతో జగత్తునందు ప్రసిద్ధుడైనాడు. సౌందర్య, వీర్య, సౌశీల్యాది సద్గుణములలో నాతడు శ్రీకృష్ణునకేమియు తీసిపోడు. ప్రద్యుమ్నుడు జన్మించి యింకను పది రోజులు గూడ వెళ్ళకమునుపే, కాము రూపియగు శంబరాసురుడు, ప్రద్యుమ్నుడు తనకు శత్రువు కాగలడని భావించి, మాయారూపముతో సూతికా గృహమును ప్రవేశించి, శిశువును గ్రహించి-నడి సముద్రమున బారవైచి, యింటి కేగె. సముద్రమందా శిశువును నొక పెద్ద చేప మింగినది. జాలరుల కామత్స్యము వలలో జిక్కగా, దానిని వారు శంబాసురునకు కానుకగా సమర్పించిరి. వంటవారు దానిని మహానస గృహమునకు జేర్చి కోయగా, దానియందు బాలకుడు గానుపించె. శంబరాసురుని దాసి యగు మాయావతి కా పిల్లవానిని సమర్పించిరి. బాలుడెవడై యుండునా యని యామె యాలోచించుచుండగా దేవర్షియగు నారదు డామెకు సర్వము వివరించె. ఆ బాలకుడే కామదేవుడనియు, శ్రీకృష్ణాంశచే రుక్మిణికి జన్మించగా, శంబరునిచే సముద్రమందు వైవబడి,మత్స్యగర్భమందు జేరెననియు చెప్పెను.

ఆ మాయావతి యెవరోగాదు. కామదేవుని యశస్విని యగు భార్యయైన రతీదేవియే. శంకరుని క్రోధాగ్నియందు కామదేవుడు భస్మమైన నాటి నుండియు మరల నాతడెప్పుడు శరీరధారియౌనాయని యామె యెదురు చూచుచుండె. ఆమెను శంబరాసురుడు వంటపనుల యందు వినియోగించియున్నాడు. ఆమె యా శిశువే తన భర్తయగు కామదేవుడని గ్రహించి, యతని యందత్యంత ప్రీతితో, బెంచుచుండె. త్వరలోనే ప్రద్యుమ్నుడు యౌవనావస్థకు జేరినాడు. అతని రూపలావణ్యము లెంత యద్భుతములుగా నుండెననగా, నతని వైపు జూచిన యువతుల మనములందు శృంగార రసోద్దీపనము కలుగుచుండె. కమల దళములవంటి కోమలములగు విశాల నేత్రములు, ఆజానులంబితములగు బాహువులు కలిగి, మనుష్యలోకమందందరి కంటె సుందరముగా రూపొందిన దాతని శరీరము. రతీదేవి, సిగ్గుతో గూడిన క్రీగంటి చూపులతో నాతనివంక జూచుచు, ప్రేమపూరితములగు స్త్రీ – పురుష సంబంధమగు హావభావముల ప్రకటించుచు నాతని సేవించుచుండె. శ్రీకృష్ణ కుమారు డామె భావములందలి మార్పును గమనించి, యామెతో, "దేవీ, నీవు నాకు మాతృ సమానురాలవు. నీవట్టి మాతృ భావమును వదలి, యేల కామినీ సమానమగు హావ భావముల ప్రకటించుచుంటివి?" అని మందలించగా నామె యిట్లు వచించినది.

"ప్రభూ, నీవు స్వయముగ నారాయణుని పుత్రుడవు. శంబరాసురుడు, సూతికా గృహము నుండియే నిన్నపహరించి యుండె. నీవు నా భర్తయగు కామ దేవుడవు. నేను నీకు శాశ్వత ధర్మపత్నినగు రతిని. నీవు జన్మించి, పురిటి దినములుగూడ గతించక మునుపే యీ శంబరుడు నిన్నపహరించి, సముద్రమందు బారవైవగా, నందొక మీనము నిన్ను మింగినది. అచేపయుదరము నందే నాకు నీ దర్శనము లభించినది. ఈ శంబరునకు వందలకొలది మాయలు తెలియును.

కావున యాతని వశపరచుకొనుట గాని, జయించుటగాని చాల కష్టము. మోహనాది మాయలచే నీతని నీవు నశింప జేయుము. స్వామీ, తన సంతానమగు నీవు కన పడనందున మీ తల్లి పుత్ర ప్రేమచే నెంత యలమటించు చున్నదో! హృదయ వేద నతో నత్యంత దీనురాలై యహోరాత్రములు చింతతో కుములు చుండును. తన సంతానమును పోగొట్టుకొనిన కురరి (క్రౌంచపక్షి) వలెను, వత్సమును పోగొట్టు కొనిన యావువలెను, దీనురాలై యున్నది నీ తల్లి." అని యీ ప్రకారము మాయా వతి పరిస్థితి నంతయు ప్రద్యుమ్నునకు వివరించి, సర్వమాయావి–నాశినియగు మహామాయ యను విద్యను అతనికి నేర్పినది. అంత శంబరుని వద్దకేగి ప్రద్యు మ్నుడాతనిని కటూక్తులచే నొప్పించి, యుద్ధమున కాహ్వానించె.

ప్రద్యుమ్నుని కటు భాషణములకు కినిసిన శంబరుడు, తోక త్రొక్కిన త్రాచువలె, బుసలు గొట్టుచు, గదాహస్తుడై వెలుపలికివచ్చి గదను గిరగిర ద్రిప్పుచు సింహగర్జన మొనర్చినాడు. ఆ గద నాతడు తనపై విసురుట గాంచిన ప్రద్యుమ్న భగవానుడు, తన గదా ప్రహారముచే దానిని బడగొట్టి, తన గదచే నాతనిని గొట్టె. శంబరుడు, మయదర్శితమగు అసురీమాయనాశ్రయించి, యదృశ్యుడై యాకాశమున కెగిరి, యటనుండి ప్రద్యుమ్నునిపై శస్త్రాస్త్ర వర్షము కురిపింపసాగె. దానిచే బాధపడిన ప్రద్యుమ్నుడు సర్వమాయావినాశినియు, సత్త్వమయియునగు మహా మాయా విద్య నాతనిపై ప్రయోగించె. శంబరుడు ప్రయోగించిన, యక్ష, గంధర్వ, పిశాచనాగ, రాక్షసమాయలన్నియు, మహామాయా విద్య యందణగారి పోయినవి. అనంతరము ప్రద్యుమ్నుడు, పదునుగల యొక కరవాలమును గైకొని, కిరీట కుండల శోభితమును, తామ్రశ్మశ్రు భయంకరమునగు శంబరుని మస్తకమును ఖండించివైచె. దేవతలాతనిపై పుష్పవర్షము గురిపించి స్తుతించిరి. అనంతరము, ఆకాశగమనము నెఱింగిన మాయావతీ రూప మందున్న రతీదేవి, తన భర్తను దీసు కొని, యాకాశమార్గమున ద్వారకా పురమును ప్రవేశించినది.

ఆకాశ మార్గమున వారేగుచున్నపుడు, విద్యుల్లతతో గూడిన మేఘమువలె గోచరించినది. ద్వారకాపుర మందలి భగవానుని యంతఃపురమును ప్రవేశించినారా దంపతులు. ఆ యంతఃపురమునందు వందల కొలది నారీరత్నములున్నారు. ప్రద్యు మ్నుని శరీరము నీలవర్ణముగ గలిగి యున్నది. పీతాంబరమును ధరించియున్నాడు. ఆజానుబాహువులు, కొంచెమెరుపురంగు గల కన్నులు, సుందర వదనముపై మధుర మందహాసము, ముఖారవిందముపై యళికులమాడుచున్నట్లు నీలవక్రాల కములు,-యీ లక్షణములన్నియు గాంచిన యంతఃపుర యువతీమణులు శ్రీకృష్ణుడే వచ్చి యుండెనను భ్రాంతితో, నచ్చటచ్చట దాగుచుండిరి. కొంచెము పరీక్షగా చూచినపిమ్మట, యీషద్భేదము గోచరించుటచే, నతడు శ్రీకృష్ణుడుగాడని నిశ్చ

యించుకొని, ప్రముదితులై యా దంపతుల యెదుటకు వచ్చిరి. ఇంతలో నచటికి రుక్మిణీదేవియు చేరినది. ఆ దంపతుల గాంచుటతోడనే రుక్మిణీదేవికి, పోయిన తన పుత్రుడు జ్ఞాపకమునకు వచ్చినాడు. వాత్సల్యాధిక్యతచే నామెకు పాలుచేపునకు వచ్చినవి.

ఆమె యీ విధముగ నాలోచించసాగినది. "ఈ నరరత్నమెవరై యుండును? ఎవని పుత్రుడై యుండు నీకమలనయనుడు? ఏ యదృష్టవంతురాలీతనికి జన్మనిచ్చినదో? ఇతనికి పత్నీరూపమున నున్న యీ సౌభాగ్యవతి యెవ్వరో? నా పుత్రుడొకడు పురిటియందే కనుపడక తప్పి పోయెగదా! ఎవడాతనిని సూతికాగృహమందుండి యే యపహరించెనోయెఱుగను. అతడెక్కడైనా బ్రతికి పెరుగుచుండినచో, నతనివయోరూపములు గూడ నిటులనే యుండి యుండును. ఇతని శ్యామ సుందర రూపము, అవయవ నిర్మాణము, నడక, మందహాసము, చూపు, మాట తీరు, అన్నియు శ్యామసుందరుని వలెనే యుండుట యెలా సంభవించినది? నేను పోగొట్టుకొనిన పుత్రుడీతడేయై యుండును అందుకుని దర్శనము నాకీతనిపై పుత్ర ప్రేమ యుప్పొంగుటయే. నాయెడమ కన్నుగూడ నదురుచున్నది,"

అని యీ విధముగ రుక్మిణీదేవి డోలాందోళిత మానసయై, నిశ్చయ—సందేహములతో తటపటాయించుచుండగా, నచటికి శ్రీకృష్ణ భగవానుడు, దేవకీ వసుదేవ సహితముగ విచ్చేసె. భగవానుని కన్నియు దెలియును కాని యాతడేమియు బలుకకుండ మౌనముగ నుండి పోయినాడు. ఇంతలో నచటికి నారద మహర్షి విచ్చేసి, శంబరాసురుడు ప్రద్యుమ్ను నపహరించుకొని పోయినది మొదలు జరిగిన యా వద్వృత్తాంతము నచటి వారలకు వివరించె. నారదునిద్వారా యీ యద్భుత వృత్తాంతమును విన్న యంతఃపుర వాసులందరాశ్చర్యచకితులైరి. ఇంతకాలమునకు తిరిగి వచ్చిన ప్రద్యుమ్నుని గాంచి, మృతుడైనవాడు తిరిగి జీవించినట్లు భావించి, యంతఃపుర స్త్రీ లందరాతని నభినందనలతో ముంచెత్తిరి. దేవకీ వసుదేవులు, బలరామ శ్రీకృష్ణులు, రుక్మిణీదేవి, యంతఃపుర స్త్రీలు, అందరుగూడ నూతన దంపతులను గాఢాలింగనమొనర్చుకొని, యమందానందమందిరి. ద్వారకా వాసులకీ వృత్తాంతము తెలియగా, వారు "ఆహా యెంతటి యదృష్టకరమగు సంఘటన. ఈ బాలుడు చచ్చి బ్రతికినాడే"యని పరస్పరము చెప్పుకొని యానందించిరి.

ప్రద్యుమ్నుని రూపురేఖలు శ్రీకృష్ణునితో నెంత సామ్యమును పొంది యున్నవనగా, నొక్కొక్కప్పుడాతని తల్లులు గూడ నతనిని గోవిందుడనియే భావించి, మధుర భావ మగ్నలై, యతని యెదుట నుండి తప్పుకొని పోవుచుండిరి. భగవానుని ప్రతిబింబ రూపుడును, కామావతారుడునగు ప్రద్యుమ్నుని గాంచి యట్లు భ్రాంతి పడుటలో నాశ్చర్యమేమియులేదు. అట్టి వానిని గాంచి యితర పడతులకు విచిత్ర దశ కలుగుచుండెననుటలో నాశ్చర్యమేముండును.

# ఏబది యారవయధ్యాయము

## స్యమంతకమణి కథ—జాంబవతీ—సత్యభామల వివాహము

"పరీక్షిన్మహారాజా, సత్రాజిత్తు శ్రీకృష్ణునిపై మిథ్యాపవాద మారోపించి, కల నా యపరాధము పోగొట్టుకొనుటకై, స్యమంతకమణి సహితముగ, తన ్యయగు సత్యభామను గూడ శ్రీకృష్ణునకు సమర్పించె" అని శ్రీశుకుడు చెప్పగా, ిక్షి త్తిటుల ప్రశ్నించె.

"స్వామీ, సత్రాజిత్తు శ్రీకృష్ణుని కేమి యపరాధ మొనర్చెను? అతనికి మంతకమణి యెట్లు లభించినది? అతడు తన కన్య నెందులకై శ్రీకృష్ణునకు ుర్పించె"నని ప్రశ్నింప, శుకయోగి మరల నిట్లు చెప్పసాగె.

"సత్రాజిత్తు, మహా సూర్యభక్తుడు. సూర్యుడాతని భక్తికి ప్రసన్నుడై, ుముతో నాతసికి స్యమంతకమణి ననుగ్రహించె. సత్రాజిత్తా మణిని ధరించి, ిత్తు సూర్యునివలెనే ప్రకాశించుచుండె. అతడు ద్వారకకు వచ్చుచుండగా, నాతని ున్నునుగాంచిన పురవాసులాతనిని గుర్తింపలేక, సాక్షాత్తుసూర్యుడే వచ్చుచుండెనని ాంతించిరి. వారు భగవానుని వద్దకేగి పాచికలాడుచుండిన యాతనిగాంచి, "శంఖ ్రగదాధరా, నారాయణా, కమలనయనా, దామోదరా, యదువంశ శిరోమణీ, ివిందా నమస్కారము. తేజస్వంతములగు తన కిరణములచే లోకుల కన్నుల ుమిట్లు గొల్పుచు, సూర్యభగవానుడు నిన్ను దర్శించుటకై విచ్చేయుచున్నాడు. వత్తాశ్రేష్ఠులు ముల్లోకములయందు నీ మార్గము నన్వేషించుచుందురు. అట్టి నీవి ్రుడు యదుకులమందు గూఢముగ నున్న సంగతి కనిపెట్టి, నీ దర్శనార్థమైయిటకు చ్చుచున్నా"రని, విన్నవించిరి.

"అజ్ఞానులగు వారి మాట లాలించి, వాసుదేవుడు నవ్వుచు, "అయ్యా, ఆ చ్చుచున్నది సూర్యుడుగాడు. అతడు సత్రాజిత్తు. అతడు ధరించిన మణిచేత నతడు ార్యునివలె ప్రకాశించుచున్నాడు" అని వివరించినాడు. అనంతరము సత్రాజిత్తు ంపత్సమృద్ధమగు తన గృహమున కేగినాడు. ఆతడింటికి వచ్చిన సందర్భముగా ంగళోత్సవములు జరిగినవి. బ్రాహ్మణోత్తములచే స్యమంతకమణిని దేవతా మం రమందు ప్రతిష్ఠింపజేసినాడు. ఆ మణి ప్రతిదినముయెనిమిది భారముల * బంగా

---

* భారము :-

॥ చతుర్భిర్వ్రీహిభిర్గుంజం గుంజాన్పంచ పణం పణాన్
అష్టౌ ధరణ మష్టౌచ, కర్షంతాంశ్చతురః ఫలం
తులాంపలశతం ప్రాహుర్భారం స్యాద్వింశతి స్తులాః

అనగా:-నాలుగు వడ్లగింజల యెత్తు ఒక గుంజ, 5గుంజలొక పణము, 8 ుములొక ధరణము, 8 ధరణములొక కర్షము. నాలుగు కర్షము లొక పలము, ూరు పలములొక తులము, యిరువది తులములొక భారము-అని చెప్పబడినవి.

రమును యిచ్చుచుండును. ఆ మణి యెచట పూజింపబడుచుండునో యచట, దుర్భిక్షము, మహామారి, గ్రహపీడ, సర్పభయము, ఆదివ్యాధులు, మాయావుల యుపద్రవములు మొదలగు నశుభము లేవియు కలుగనేరవు.

ఒకనాడు ప్రసంగవశమున భగవానుడు, సత్రాజిత్తుతో, "సత్రాజిత్తూ, నీవు నీ మణిని రాజగు నుగ్రసేనుని కొసంగుము" అని పలుక, లోభియగు సత్రాజిత్తు భగవానుని యాజ్ఞోల్లంఘన మొసర్చి, యాతని మాటను గూర్చి యేమియు విచారించక, పెడ చెవిని బెట్టె.

ఒకనాడు, సత్రాజిత్తుని సోదరుడగు ప్రసేనుడు, పరమప్రకాశమానమగు స్యమంతకమణిని కంఠమందు ధరించి, గుర్రము నెక్కి వేటకు బయలుదేరినాడు, వనమునకు. అచట నొక సింహము గుర్రముతోగూడ నతనని సంహరించి, మణిని గ్రహించి గిరి గుహను ప్రవేశింపబోవుచుండగా, భల్లూక ప్రభువగు జాంబవంతుడు మణికై యా సింహమును జంపి, యా మణిని తన గుహ యందాడుకొనుటకై పిల్లవాని కొసగె. తన తమ్ముడగు ప్రసేను డెంతకును తిరిగి రానందున, సత్రాజిత్తునకు మహా దుఃఖము కల్గినది. "శ్రీకృష్ణుడే, మణిని ధరించి వనమున కేగి నా తమ్ముని వధించియుండు"నని చెప్పుచు, శ్రీకృష్ణునిపై నిందను ప్రచారముగావించినాడు. ఆ కలంక ప్రచారము చెవిని బడగా, ఆ యపవాదమును పోగొట్టుకొనుటకై నగరమందలి కొందరు సజ్జనుల వెంట నిడుకొని, కృష్ణుడు ప్రసేనుని వెదకుటకై వనమున కేగె. వెదకుచుండగా, నొకచోట ప్రసేనుని యొక్కయు గుర్రము యొక్కయు శవములు గనుపించినవి. వారిని జంపిన సింహము యొక్క యడుగు జాడలను బట్టి వెళ్ళగా, పర్వత ప్రాంతమందు వారికి చనిపోయిన సింహము కనుపించినది. సింహమును జంపిన భల్లూకపు గుర్తులను బట్టి గుహను సమీపించి, తన వెంట వచ్చిన వారందరిని గుహ వెలుపల నుంచి, శ్రీకృష్ణుడు గుహను ప్రవేశించినాడు.

గుహయంధకార బంధురమైయున్నది. మణిశ్రేష్ఠమగు స్యమంతక మచట బాలునకు క్రీడావస్తువై యుండుట గాంచినాడు భగవానుడు. దానిని తీసుకొనుటకై యాతడు బాలుని సమీపింపగా, గుహయందొక యపరిచిత మానవునిగాంచి యచట నున్నదాది, భయభీతయై, కేకలువైచినది. దాది యఱుపులువిని, మహాబలవంతుడగు జాంబవంతుడు కుపితుడై యచటకు పరువిడివచ్చె. క్రోధముతోనుండుటచేత జాంబవంతుడు, భగవానుని మహిమను, ప్రభావమును గుర్తింపజాలక, సామాన్య మానవుడని యెంచి యతనితో యుద్ధమునకు దలపడియె. మాంసముకొరకై రెండు డేగలు పోరాడునట్లుగా, విజయాభిలాషులగు, శ్రీకృష్ణ జాంబవంతులు భీకరముగ పోరాడ సాగిరి. అస్త్రశస్త్రములతో, శిలలతో, వృక్షములతో పోరాడి, చివరకు బాహు యుద్ధ

మునకు దిగినారు. వజ్రప్రహారములవంటి పిడి గ్రుద్దులతో నొకరినొకరు గ్రుద్దుగొను చుండిరి. ఈ విధముగ నిరువదియెనిమిది దినములు, విశ్రాంతి లేకుండ, రాత్రిం బగళ్ళు వారు పోరుచునేయుండిరి. చివరకు శ్రీకృష్ణుని ముష్టిఘాతములచే జాంబ వంతుని శరీరమందలి సంధిబంధములు సడలిపోయినవి. శరీరము స్వేదసిక్తమై పోయినది. విస్మయావిష్టచేతస్కుడై యాతడు శ్రీకృష్ణునితో, "ప్రభూ,నేను గ్రహించి తిని. సమస్తప్రాణులకు ప్రభువు, రక్షకుడవు, పురాణపురుషుడవునగు విష్ణుభగవాను డవే నీవని గ్రహించితిని. అందరికిని ప్రాణము, యింద్రియబలము, మనోబలము, శరీరబలమునీవే. విశ్వమును సృష్టించు బ్రహ్మాదులను సృష్టించినవాడవు నీవు. సృష్టించబడిన పదార్థములందు సత్తారూపముననున్నవాడవు గూడ నీవే. కాలస్వరూ పుడవు నీవే. కాలావయవముల నియమించు పరమకాలస్వరూపుడవు నీవు. శరీరాద్యు పాధి భేదముచేత భిన్నభిన్నముగా ప్రతీయమానములగు సంతరాత్మలకన్నింటికి పరమాత్మస్వరూపుడవు నీవే. ప్రభూ, నాకు జ్ఞాపకమున్నది. నీవు, నీ నేత్రము లందు కొంచెము కోపమును ప్రకటించుచు, క్రీగంటితో నీవానాడు సముద్రునివంక జూచితివి. ఆచూపునకే సముద్రమందలి చక్రములు, తిమింగిలములు గూడ క్షుబ్ధ ములై పోయినవి. సముద్రుడు మార్గమొసంగినాడు నీకు. అపుడు నీవు సముద్రముపై సేతునిర్మాణముగావించి, సుందరమగు కీర్తి నార్జించి, లంకను విధ్వంస మొనర్చి యుంటివి. నీబాణములచే రాక్షసులతలలు తెగి పృథివిపై బడినవి. [తప్పక, ఆనా స్వామియగు రాముడవే యీనాడు శ్రీకృష్ణ రూపముతో విచ్చేసియుంటివి]" అని పలికె.

ఋక్షరాజగు జాంబవంతుడీ విధముగ భగవానుని గుర్తించగనే, కమలనయ నుడగు శ్రీకృష్ణుడు, పరమ కల్యాణకరమగు తన శీతలకరకమలములచే నొకసరి యాతని శరీరమునంతను తుడిచి, పరమదయతో, మేఘగంభీర వాక్కులనిట్లుపలికె. "ఋక్షరాజా, "మేమీమణికై యిచటికి వచ్చియుంటిమి. ఈ మణిద్వారా, నాపై మోప బడిన యపనిందను పోగొట్టుకొన దలచితి" నని వచించగనే, జాంబవంతుడు మహా నంద భరితుడై, భగవానుని పూజించుటకొరకై తన కుమార్తెయగు జాంబవతీసహిత ముగ మణి నాతని చరణకమలములయందు సమర్పించె.

భగవానుడు గుహాద్వారమందు వదలివచ్చినవారు, పన్నెండు రోజులవరకు భగవానునికొఱకెదురుచూచిరి, అప్పటికిని గుహనుండి యాతడు వెలువడనందున వారు మహాదుఃఖమునొందినవారై, ద్వారకకు తిరిగి వెళ్ళిపోయిరి. అచట, దేవకీమాత, రుక్మిణీదేవి, వసుదేవుడు, యితర బంధువులందరును, శ్రీకృష్ణుడు గుహనుండి తిరిగి రాలేదను సమాచారము వినగనే శోకాకులితస్వాంతులైరి. ద్వారకావాసులందరికిని యీ విషయము దుఃఖకారకమైనందున, వారందరును సత్రాజిత్తును దూషింపసాగి

నారు, శ్రీకృష్ణప్రాప్తికై మహామాయయగు దుర్గాదేవిని శరణువేడినారు. ఆమెనుపాసింపసాగినారు. వారియుపాసనచే ప్రసన్నురాలై దుర్గాదేవి, యాశీర్వదించినది. ఇంతలో నచటికి, స్యమంతకమణిని, నవవధువగు జాంబవతిని తీసుకొని, సఫల మనోరథుడై, యందరికానందము కలుగజేయుచు, శ్రీకృష్ణుడు ప్రత్యక్షమాయె. ద్వారకావాసులందరును, పత్నీసహితుడై శ్రీకృష్ణుడు మణితోగూడ వచ్చియుండుట గాంచి, మృతుడైనవాడు తిరిగి వచ్చినంత, మహదానందమునొందిరి,

అనంతరము భగవానుడు రాజసభయందుగ్రసేనుని సమీపమునకు సత్రాజిత్తును బిలిపించి,యేవిధముగ మణిలభించినది సవివరముగ తెలిపి యా మణిని సత్రాజిత్తునకొసగె. సత్రాజిత్తత్యంత లజ్జితుడైనాడు. మణిని మాత్రము గ్రహించినాడుగాని, సిగ్గుచేనాతడు తలయెత్తలేకపోయినాడు. తన యపరాధముపై నాతనికి గొప్ప పశ్చాత్తాపము కల్గినది. ఎట్టులో తనగృహము చేరినాడు. అతని మనోనేత్రము నందాతని యపరాధమే నిరంతరము నాట్యమాడసాగినది. బలవంతునితో తనకు గలిగిన వైర కారణముచే మహాభయభీతుడైనాడు. తన యపరాధమునే విధముగ పోగొట్టుకొనుటయా యని యాలోచించసాగినాడు. భగవానుడు నాపై యెట్లు ప్రసన్నుడగును? నాకు శుభముకల్గుటకును, లోకులు నన్ను దూషించకుండుటకును, నేనేమిపని చేయవలయును? నిజముగా నేను ముందుచూపు లేనివాడను, క్షుద్రుడను. ధన లోభముచే మూర్ఖముగా ప్రవర్తించితిని. కాన, నేనిప్పుడు నారీరత్నమగు నాగకన్య యైన సత్యభామను, స్యమంతకమణి సహితముగ, శ్రీకృష్ణునకు సమర్పించెదను. ఈ యుపాయమే చాల యుత్తమముగ కన్పట్టుచున్నది, దీనిచే నాయపరాధము తుడిచివేయబడును ఇంతకంటె వేరుపాయములేదు."అని, సత్రాజిత్తు వివేక బుద్ధితో నాలోచించి, నిశ్చయించినవాడై తనకన్యను స్యమంతకమణీ సహితముగ శ్రీకృష్ణునకు సమర్పించినాడు సత్యభామ సకల సద్గుణసంపన్న. ఆమెకైయనేకమంది యువకులు ప్రయత్నించుచుండిరి. కాని శ్రీకృష్ణుడామెను యథావిధిగ వివాహమాడినాడు. భగవానుడు, సత్రాజిత్తుతో, స్యమంతకమణి మాకు వలదు. అది నీయొద్దనేయుండుగాక. మేము దాని ఫలమనుభవించెదము." అని పలికె.

# ఏబది యేడవ యధ్యాయము

## స్యమంతకహరణము-శతధన్వమోక్షము-అక్రూరుడు ద్వారకకు తిరిగివచ్చుట

శ్రీశుకమహర్షి పరీక్షిన్మహారాజుతో చెప్పుచున్నాడు.

"రాజా, పాండవులకు లాక్షాగృహ దాహమందెట్టి యాపదయు కలుగలేదను

విషయము శ్రీకృష్ణ భగవానునకు తెలిసియుండినను, కుంతీసహితముగ పాండవులు లక్కయింటియందు తగులబడిపోయిరను విషయము వినగనే, యా సమయమందు, కులపరంపరోచితములగు వ్యవహారము లొనర్చుటకై, బలరామ సహితముగ నాతడు హస్తినాపురమున కేగె. అచటికేగి, భీష్మ, ద్రోణ, కృపాచార్య, విదుర, గాంధార్యాదుల గలుసుకొని, వారితో సమానముగ దుఃఖించుచు, సానుభూతిని ప్రకటించి, వారితో "అయ్యయ్యో, యెంత పని జరిగినది! ఇది యెంత దుఃఖకరమగు విషయము" అని పలికినాడు.

భగవానుడు హస్తినాపురమునకు వెళ్ళగా, అక్రూరకృతవర్మలకు సమయము చిక్కినది. వారిరువురు శతధన్వుని కడకేగి, "నీవు సత్రాజిత్తు వద్దనుండి మణినేల హరింపరాదు? అతడు మనలో నొకనికి సత్యభామ నిచ్చెదనని మాట యిచ్చి, మనలనందరిని తిరస్కరించి, శ్రీకృష్ణున కామెనొసంగి పరిణయమొనర్చినాడు. ప్రసేనునివలె సత్రాజిత్తుగూడ యమలోకమునకేల నేగరాదు?" అని పలికిరి. శతధన్వుడుగూడ పాపాత్ముడే. అతని మృత్యువాతని తలపై తాండవమాడుచున్నది. అక్రూరకృతవర్మల పలుకులాతనిపై పనిచేసినవి. ఆ దుష్టుడు లోభవశుడై నిద్రించుచున్న సత్రాజిత్తు నంతమొందించినాడు. స్త్రీలందరనాథలవలె నేడువసాగిరి. కాని వారిని లక్ష్యపెట్టక, కసాయివాడు పశువును చంపునట్లు, సత్రాజిత్తును చంపి, మణిని గైకొని యటనుండి వెడలిపోయినాడతడు.

సత్యభామకు మహాదుఃఖము కలిగినది. తండ్రి శవముపైబడి రోదించినది. మధ్య మధ్య మూర్ఛిల్లినది. అనంతరము శవమును తైలద్రోణియందుంచి, తాను హస్తినాపురము వెళ్ళి, దుఃఖముతో తన తండ్రి హత్యావార్తను భగవానునకు నివేదించినది. సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడగు భగవానుడంతయు విని మనుష్యుని వలె నభినయించుచు, కనుల వెంబడి నీరు కారుచుండ "అయ్యో, మనకెంతటి విపత్తు సంభవించినది?" అనుచు విలపింపసాగె. పిమ్మట సత్యభామ, బలరాములతో గూడ హస్తినాపురమునుండి ద్వారకకు తిరిగివచ్చి, శతధన్వుని వధించి, మణిని గ్రహించు ప్రయత్నము లొనర్చుచుండె.

శ్రీకృష్ణుడు తనను వధించుటకు ప్రయత్నించుచున్నాడను విషయము శతధన్వునకు తెలిసినది. మహాభీతి కలిగి, యతడు తన ప్రాణముల రక్షించుకొనుటకై, కృతవర్మ సహాయమర్థించె. అతడు, "రామకృష్ణులు సర్వశక్తి సంపన్నులగు యీశ్వరులు, నేను వారినెదుర్కొనజాలను. వారితో వైరము బెట్టుకొని యిహలోకమందుగాని పరలోకమందుగాని యెవడు క్షేమముగా నుండగలడు? అతనిని ద్వేషించిన కంసుడు తన రాజ్యమును గోల్పోవుటయేగాక, తన యనుచర సహితముగ మరణించిన విషయము నీవెఱుగుదువు గదా! జరాసంధునివంటి మహావీరుడు గూడ పదునేడు పర్యాయములు కృష్ణునితో పోరి పరాజితుడై, రథముగూడ లేకుండ రాబ

ధానికి పారిపోయెగదా." అని తన యశక్తతను వెలిబుచ్చగా, శతధన్వుడక్రూరుని సహాయము వేడె. అతడును, "సోదరా, సర్వశక్తిమంతులగు రామకృష్ణుల బల పౌరుషములు తెలిసియు వారితో విరోధము పెట్టుకొను మూర్ఖుడెవడుండును? విశ్వ సృష్టిస్థితిలయములు వారికొక యాటవంటివి. శ్రీకృష్ణ భగవానుడెప్పుడేమి చేయ దలచునో, యనునది బ్రహ్మాదులుగూడ తెలియజాలకుందురు. కేవలమేడు వర్షముల వయస్సుగల బాలుడై యున్నపుడే యతడు గోవర్ధనగిరి నొక్కచేతిపై, చిన్నపిల్ల వాడు గొడుగెత్తి పట్టుకొను విధమున, యేడుదినములు నిర్విరామముగ నెత్తిపట్టు కొని యుండినాడు. నేనా శ్రీకృష్ణ భగవానునకు నమస్కరింతును. ఆయన పనుల న్నియు మహాద్భుతములు. అతడనంతుడు, అనాది. కూటస్థుడు! ఆత్మస్వరూపుడు. అతనికి నమస్కారము" అని పలికె.

అక్రూరుడుగూడ యీ విధమున బలుకగా, దిక్కుతోచని శతధన్వుడు స్యమంతకమణి నక్రూరునివద్ద నుంచి, వెంటనే, శతయోజనమేగు శక్తిగల గుర్రమునెక్కి, యటనుండి పారిపోయినాడు.

బలరామకృష్ణులు, గరుడ ధ్వజచిహ్నితమగు తమ రథమునెక్కి, తమ మామయగు సత్రాజిత్తును చంపిన శతధన్వుని వెంటబడిరి. మిథిలానగర ప్రాంతోప వనమందు శతధన్వుని యశ్వము పడిపోగా, నతడు పాదచారియై పరువెత్తె. అత డత్యంతభీతుడై యుండె. శ్రీకృష్ణుడును క్రోధముతో నాతని వెంబడించి తన చక్రముతో శతధన్వుని శిరము దరిగి, యతని వస్త్రములందు వెదుకగా, స్యమంతక మణి యగుపడలేదు. అందుచే శ్రీకృష్ణుడు తిరిగి బలరాము నొద్దకువచ్చి, "మనము శతధన్వుని యనవసరముగ వధించితిమి. అతనివద్ద స్యమంతకమణి లేనేలేదు" అని పలుకగా, బలరాముడు "శతధన్వుడామణి నెవరి యొద్దనో దాచియుండును. ఇప్పుడు నీవు ద్వారకకు వెళ్ళి యామణి జాడ నరయుము. నేను నా ప్రియమిత్రు డగు విదేహరాజును చూచివచ్చెద" నని పలికి, బలరాముడు మిథిలానగరమును ప్రవేశించె. బలరాముని యాగమనవార్త దెలిసిన మిథిలానగరాధిపతి యత్యంతా నందముతో, నెదురేగి, యతిథి సపర్యలొనర్చి, యాదరించినాడు. బలరాముడచట కొన్ని సంవత్సరములుండి పోయినాడు. జనక మహారాజతనిని సగౌరవముగ తన వద్ద నుంచుకొనియె. ఆ సమయమందే ధృతరాష్ట్ర తనయుడగు దుర్యోధనుడు, బల రామునివద్ద గదాయుద్ధమునందు శిక్షితుడాయె.

కేశవుడు, ద్వారకకేగి, సత్యభామకు ప్రియము కలుగునట్లు, శతధన్వుని నిధనవార్త నామెకు దెల్పి, మణి దొరకలేదనియు చెప్పినాడు. అనంతరమతడు తన బంధువులతోగూడి, తనశ్వశురుడగు సత్రాజిత్తున కౌర్ధ్వదైహిక క్రియలు జరిపించి, యతనికి పరలోకప్రాప్తిని కల్గించె.

అక్రూరుడు, కృతవర్మ యిద్దరును సత్రాజిత్తుని వధించుటకై శతధన్వుని ప్రేరేపించియుండిరి. అందువలననిప్పుడు, శ్రీకృష్ణుడు శతధన్వుని వధించెనను వార్త వారికి కలవరము గలిగించినది. భయభీతులై వారు ద్వారకనుండి పారిపోయిరి.

అక్రూరుడు ద్వారకనుండి వెడలిపోయిన పిమ్మట, ద్వారక యందనేకము లగు అరిష్టములు సంభవించినవి. దైవికములు, భౌతికములునగు కారణములచే, ద్వారకావాసులకు శారీరక, మానసిక కష్టములు కలిగినవి అని కొందరనుకొన జొచ్చిరి. అట్లనువారు, పూర్వము చెప్పబడిన మాటలమరచి యట్లు తలంచుచుండిరి. ఏ శ్రీకృష్ణ భగవానుని యందు ఋషులు, మునులు సందరు నివసించుచుందురో, అట్టి శ్రీకృష్ణునకు నివాస స్థానమందు, ఆయన యున్నసమయమందే, యే యుప ద్రవమైన కలుగుట సంభవమగునా? అపుడు కొందరు వృద్ధులిట్లు పల్కిరి. "ఒక సారి, కాశీరాజ్య మందు వర్షములు లేక, క్షామము సంభవించగా, తమ రాజ్యమున కేతెంచిన యక్రూరుని తండ్రి యగు శ్వఫల్కునకు, కాశీరాజు తన తనయయగు 'గాందిని' నిచ్చి వివాహమొనర్చె. అపుడు కాశీ రాజ్యమందు వర్షములు గురిసినవి. అక్రూరుడు గూడ శ్వఫల్కుని పుత్రుడగుటచే నితని యందుగూడ నట్టి ప్రభావము గలదు. అందుచేత అక్రూరుడుండుచోట, వర్షములు చక్కగా కురియుచుండును. ఎటువంటి కష్టములుగాని, మహామారి మొదలగు నుపద్రవములుగాని సంభవింప కుండును" అని పలికిరి.

వారి మాటలు విని, యీ యుపద్రవమున కిదేకారణము గాదని తెలిసి యుండియు, భగవానుడు దూతలను బంపి, యక్రూరునికై వెదకించి, యతనిని రప్పించి, యతడురాగా స్వాగత సత్కారములు జరిపి, ప్రేమయుక్తములగు మధుర భాషణముల నతనితో నవ్వుచు నిట్లనియె. "నీవు దానపతివి. (దాన-ధర్మ పాలకు డవు) మహాప్రకాశమానము సువర్ణ ప్రదమునగు స్యమంతకమణిని, శతధన్వుడు నీయొద్దనుంచి వెళ్ళెనను విషయము నాకెన్నడో తెలియును. సత్రాజిత్తునకు పుత్రులు లేరను సంగతి నీకు తెలియును గదా! అందుచే నతని కూతురి కుమారులే (అనగా దౌహిత్రులే) యతని వారసులై, యాతనికి తిలాంజలులు, పిండ ప్రదానములు చేయుదురు. అతని ఋణముల దీర్చి, శేషించిన యాస్తికి వారుత్తరాధికారు లగుదురు.

ఈ విధముగ శాస్త్రీయ దృక్పథమందు, స్యమంతకమణి మా పుత్రులకే చెందవలసియున్నను, ఆ మణిని నీవద్దనేయుంచుకొనుము. ఏలననగా, నీవు గొప్ప వ్రతనిష్ఠ గలవాడవు, పవిత్రాత్ముడవుగాన. ఇతరులామణిని తమవద్ద నుంచుకొన సమర్థులు గారు. కాని మాకిప్పుడొక గొప్ప సమస్య యేర్పడినది. నాయన్న బల రాముడే, మణి విషయములో నామాటను విశ్వసించుటలేదు. కావున మహాభాగా,

నీవా మణిని జూపి మా బంధువులకు (బలరామ, సత్యభామ, జాంబవత్యాద
సందేహము తొలగించి, వారికి మనశ్శాంతిని కల్గించుము. ఆ మణి ప్రభావము
నీవు స్వర్ణ వేదికల నిర్మించి, గొప్ప యజ్ఞములు చేయగలుగుచున్నాడవని
తెలియును" అని యీ విధముగా సరళ స్వభావముతో నతని ననునయించగా,
వస్త్రమునందు దాచియుంచిన, సూర్య ప్రభాభాస మానమగు మణినిదీసి యక్రూ
శ్రీకృష్ణ భగవానునకు సమర్పించె. శ్రీకృష్ణుడా మణిని తన బంధువు లం
జూపి, తనపై గల్గిన కళంకమును తొలగించుకొని, దానిని తనవద్ద నుంచ
సమర్థత గల్గియున్నను, మరల నక్రూరునికే దానినిచ్చెను.

సర్వ శక్తిమంతుడు, సర్వవ్యాపకుడు, భగవానుడునగు, శ్రీకృష్ణుని
క్రమముచే పరిపూర్ణమగు, యీ యాఖ్యానము, సమస్త పాపములను, అప
లను, కళంకములను తొలగించునట్టిది. పరమమంగళకరము. దీనినెవరు పఠి
వినిపింతురో, విందురో, లేక స్మరించెదరో వారు సర్వపాప వినిర్ముక్తులై,
సౌఖ్యముల బడయగలరు.

# ఏబది యెనిమిదవ యధ్యాయము

## శ్రీకృష్ణుని యితర వివాహముల కథ

పాండవులు లాక్షా గృహమందు దగ్ధముగాలేదను వార్త దెలిసినది. వా
మారు కలుసుకొనదలచి, గోవిందు డింద్రప్రస్థ నగరమేగె. అతని వెంట
మొదలగు యాదవులనేకులు గూడ వెళ్ళినారు. సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడు
నగరమునకు విచ్చేయుచుండెనను వార్త తెలియగనే, ప్రాణ సంచారముచే
యములు చైతన్యవంతములగునట్లు, పాండవులంద రొక్కమారులేచి యాత
రేగి, యాతని నాలింగనమొనర్చి, తమ పాపప్రక్షాళన మొనర్చుకొనిరి. భగ
ప్రేమ భరితమగు మధుర మందహాసముచే సుశోభితమగు ముఖ కాంతిని
వారందరానంద నిమగ్నులైనారు. శ్రీకృష్ణుడు ధర్మజ భీములకు నమస్కరి
కవలలాతనికి నమస్కరించిరి. విజయునతడు గాఢాలింగన మొనర్చుక
శ్రీకృష్ణుడు హేమ సింహాసనాసీనుడై యుండగా, శ్యామసుందరియగు
నూతన వధువగు కారణముచే కొంచెము సిగ్గుతో నెమ్మదిగవచ్చి, యాతనికి
స్కరించినది. శ్రీకృష్ణునితో సమానముగనే సాత్యకిని గూడ పాండవులు
రించిరి. ఇతర యాదవులను గూడ యథోచితముగ పూజించి, యందరు శ్రీ
చుట్టు నుపవిష్టులైరి.

అనంతరము శ్రీకృష్ణుడు తన మేనత్తయగు కుంతివద్దకేగి యామె చరణములకు నమస్కరించగా, నామె ప్రేమతో నతనిని కౌగలించుకొనినది. తనసోదరుడు, బంధువులు మొదలగువారి కుశల ప్రశ్న యొనర్చగా, భగవానుడు యథోచితముగ ప్రత్యుత్తరమొసగి, యామెయొక్కయు, యామెకోడలియొక్కయు క్షేమమడిగినాడు. ప్రేమవిహ్వలత్వముచే కుంతిగొంతు బొంగురుపోయినది. నేత్రములందశ్రువులు దొరలినవి. భగవానుడు ప్రశ్నించగనే యామె యనుభవించిన కష్టములన్నియు గుర్తుకురాసాగినవి. ఆమె తనను తాను సంబాళించుకొని, శ్రీకృష్ణునితో నిట్లు వచించినది. "కృష్ణా" నీవు యేనాడు, మమ్ములను నీ వారిగా భావించి మా క్షేమ సమాచారములను తెలుసుకొనుటకై యక్రూరుని బంపియుంటివో, ఆనాటినుండి మాకుకుశలము లభించినది. అనాథలమగుమమ్ము నీవు సనాథలగావించితివి. సమస్త జగత్తునకు నీవు హితముగోరు స్నేహితుడవనియు, ఆత్మ స్వరూపుడవనియు నేనెఱుగుదును. వీడు నావాడు, వీడు పరాయివాడను భేదభావము నీయందులేదు. అయినను, నిన్నెప్పుడు స్మరించుచుండు వారలహృదయమునందు నీవు వసించుచు, నెల్లపుడు వారిక్లేశముల తొలగించుచుండెదవు" అని పల్కినది కుంతి.

అనంతరము ధర్మజుడు, "సర్వేశ్వరా, కృష్ణా, మేము పూర్వజన్మములందుగాని, లేక, యీ జన్మమందేగాని, యెట్టి పుణ్యములొనర్చియుంటిమో నేనెరుగను. గొప్పగొప్ప యోగీశ్వరులకుగూడ నీదర్శనమత్యంత దుర్లభము. అటువంటిది, మావంటి కుమతులకు యింటివద్దనే నీ సందర్శనప్రాప్తి కలుగుచున్నది." అని పలుకుచు, భగవానుని మిక్కిలి సమ్మానించి, కొన్ని దినములక్కడనే యుండవలసినదిగా, భగవానుని ప్రార్థించినాడు. ధర్మజుని ప్రార్దనను మన్నించి భగవానుడు, తన రూపమాధుర్యముచే యింద్రప్రస్థ పురవాసులకు నయనానందమనుగ్రహించుచు, వర్షాకాలము నాలుగు నెలలచటనే యుండిపోయె.

ఒకమారు గాండీవమును, అక్షయతూణీరములనుదాల్చి, విజయుడు, శ్రీకృష్ణ సహితముగ రథారూఢుడై, విహారమునకు బయలుదేరినాడు. వనమునందు వారనేక సింహశార్దూలాది మృగములను వేటాడిరి. మేధ్యము (యజ్ఞయోగ్యము)లగు పశువులను సేవకులు, పర్వసమయమగుటచే, ధర్మరాజునొద్దకు గొంపోయిరి. అర్జునుడు వేటయందలసిపోయినాడు కృష్ణార్జునులిరువురును యమునానదివద్దకుజేరి, కాలు సేతులగడుగుకొని, దప్పికదీర్చుకొని, తీరమందుపవిష్టులైయుండగా, పరమసుందరియగు నొకకన్య తపస్సాచరించుచు వారికగుపడినది. ప్రియమిత్రుడగు శ్రీకృష్ణువిపనుపున నర్జునుడా సుందరివద్దకేగి "సుందరీ, నీవెవ్వరవు? ఎవరి తనయవు? ఎచ్చటినుండి వచ్చితివి? ఏమిచేయదలచుచుంటివి? నీవు యోగ్యుడగు పతినిగోరు

చుంటివని నేను భావించుచున్నాను. కళ్యాణీ, నీవృత్తాంతమును వినగోరుచుంటి"నని ప్రశ్నింప, నామె యిట్లు చెప్పినది.

"అయ్యా, నేను సూర్యుని పుత్రికను. వరదుడు వరేణ్యుడునగు శ్రీ విష్ణు భగవానుని పతిగాబడయగోరి యీ కఠోరతపమొనర్చుచున్నాను. ఆ లక్ష్మీపతిని దక్క నేనితరునెవనిని వతిగాపరింపజాలను. అనాథనాథుడును, ప్రేమప్రదాతయునగు శ్రీకృష్ణ భగవానుడు నాపై యనుగ్రహము జూపుగాక. నన్ను "కాలింది"యందురు. యమునాజలములందు మా తండ్రియగు సూర్యుడొక భవనమును నాకై నిర్మించి యిచ్చినాడు. దానియందు నేను నివసించుచుంటిని. భగవానుని దర్శనము గానంత వరకు నేనిచటనేయుండెద"నని, వచింప నర్జునుడా విషయమును భగవానునకు దెలియజెప్పె.

అతనికీ విషయమంతకుముందే తెలిసియుండుటచే, కాళిందిని తమ రథముపై గూర్చుండ బెట్టుకుని, ధర్మరాజునొద్దకు తీసికొనిపోయిరి.

ఆ తరువాత, పాండవులు ప్రార్థించిన మీదట శ్రీకృష్ణ భగవానుడు, విశ్వకర్మచే, పాండవులు వసించుటకుగాను, విచిత్రమును, అత్యంతాద్భుతమునగు నొక నగరమును నిర్మింపజేసె. పాండవుల హితము కోరుచు, వారి నానందింపజేయుటకై భగవానుడచట చాల దినములుండి పోయినాడు. ఈ సమయమునందే, యగ్నిదేవునకు ఖాండవ వనము నిప్పించుటకై, శ్రీకృష్ణుడర్జునునకు సారథ్యము వహించినాడు. ఖాండవ వన భోజనముచే సంతుష్టి చెందిన యగ్నిహోత్రుడు, అర్జునునకు గాండివమను ధనుస్సును, నాలుగు తెల్లని గుర్రములను, దివ్యమగు రథమును, రెండక్షయ తూణీరములను, శస్త్రాస్త్ర నిర్భేద్యమగు కవచమును యిచ్చినాడు. ఖాండవ దహన సమయమందు అర్జునుడు, మయదానవుని మంటల నుండి గాపాడినందున, నతడర్జునునితో మిత్రత్వము నెఱపి, పరమాద్భుతమగు నొక సభను నిర్మించి యిచ్చినాడు. ఆ సభయందే దుర్యోధనునకు, జలమందు స్థల భ్రాంతియు, స్థలమందు జలభ్రాంతియు కలిగినది.

కొన్ని దినముల తరువాత, భగవానుడర్జునుని యనుమతితోను, యితర బంధువులయను మోదముతోను, సాత్యకి మొదలగు వారితో గూడుకొని, ద్వారకకు తిరిగిపోయె. ద్వారక యందొక శుభలగ్నమున కాలిందీదేవిని, శ్రీకృష్ణుడుద్వాహ మాడినాడు. బాంధవులందరును పరమానంద భరితులైరి.

అవంతీ (ఉజ్జయిని) దేశాధిపతులు, విందానువిందులనువారు దుర్యోధనునకు వశవర్తులై యాతని కనుయాయులై యుండిరి. వారి సోదరియగు మిత్రవిందయను సుందరాంగి, స్వయంవరమందు శ్రీకృష్ణుని పతిగా వరించదలచియుండె. కాని విందానువిందుల లందుకడ్డు దగిలిరి. మిత్రవింద శ్రీకృష్ణుని మేనత్తయగు రాజాధిదేవి కూతురు. భగవానుడామెను రాజులందరు చూచుచుండగా, నిండుసభయందపహరించు

కొని పోయినాడు. రాజులందరేమియు చేయలేక తెల్లమొగములు వైచుకొని యుండ పోయిరి.

కోసల దేశమునకు నగ్నజిత్తురాజుగా నుండె. అతనికి "సత్య" యను పేరు గల పరమసుందరియగు కొమరిత యుండె. నగ్నజిత్తు కుమార్తెయగుటచే నామెను నాగ్నజితియనియు బిలుచుచుండిరి. రాజు చేసిన ప్రతిజ్ఞానుసారము, దుర్దాంతములగు నేడు బలీవర్దము (యెద్దుల)ల నిర్జించలేకపోయిన కారణముచేతనే రాజుగూడ నాగ్నజితిని వివాహమాడలేకపోయిరి. ఆ యెద్దుల కొమ్ములు మహా తీక్షణములుగా నుండి, యవి వీర పురుషుని వాసనను గూడ సహింపలేనివై యుండినవి. యదు వంశ శిరోమణికి విషయము తెలిసినది. అతడు సేనా సమన్వితుడై యయోధ్యను చేరినాడు. కోసల దేశాధీశుడు ప్రసన్నతతో నాతనికి స్వాగత సత్కారము లొనర్చి నాడు. భగవానుడు గూడ నతనినభినందించినాడు. చిరకాలాభిషితుడగు రమారమణు డేతెంచెనని విన్న సత్యాదేవియు తన మనసునందిట్లు తలపోసినది. "నేను వ్రత నియమాదులను సక్రమముగా పాలించుచు యితనినే చింతించుచున్నదాననేయైనచో, యితడు నాకు పతియై, నా తీవ్రమగు మనోరథ మీడేరుగాక" యని కోరుకొనినది. భగవతియగు లక్ష్మి, బ్రహ్మ, శంకరుడు, లోకపాలురు, యెవని పాదపరాగమును తమ శిరములపై ధరించవలయునని కోరుకొనుచుందురో యే మహానుభావుడు తనచే నిర్దేశింపబడిన ధర్మ సేతువును గాపాడుటకై యప్పుడప్పుడనేక లీలావతార ముల దాల్చుచుండునో, ఆ ప్రభువు నా యొక్క యే ధర్మముచేత, వ్రతములచేత, నియమములచేత ప్రసన్నుడగును? అతడు కేవలము తన చేతనే ప్రసన్నుడగును" నగ్నజిత్తు విధి పూర్వకముగ నారాయణునర్చించి, యిటుల ప్రార్థించినాడు.

"నారాయణా, జగదేకనాథా, స్వరూపానందముచే పరిపూర్ణుడవు. నేనొక తుచ్ఛ మానవ మాత్రుడను. నేను నీకేమి సేవ గావింపగలను" అని ప్రార్థన యొన ర్చినాడు. నగ్నజిత్తు చేసిన పూజలకు సంతసించిన భగవానుడు, మేఘ గంభీర స్వర మున నతనితో నిట్లు వచించె.

"రాజా, క్షత్రియ ధర్మమందు స్థితుడై యుండు రాజెవ్వరిని యాచించరాదు. ధర్మము తెలిసిన విద్వాంసులట్టి పనిని గర్హించెదరు. అయినను నీ మైత్రి వాంఛించు నట్టి నేను, నీ కన్యను నా కిమ్మని యడుగుచున్నాను. అందుకుగాను యెట్టి శుల్క మును యిచ్చు నాచారము మాకు లేదు" అని పలుక నగ్నజిత్తు యిటుల వచించె.

"ప్రభూ, నీవు సర్వసద్గుణములకు నిధివి. ఏకమాత్రాశ్రయుడవు. శ్రీదేవి నీ యురమున నిత్యనివాసము చేయుచున్నది. కన్యకు కంటె యోగ్యుడగు వరు డెవ్వడుండును? కాని, యదూత్తమా, మేమిదివరకే యీ విషయమందొక పందె మేర్పాటు చేసియుంటిమి. కన్యకెట్టి వరుడు యోగ్యుడగుననునది తెలుసుకొనుటకై, యీతని బలపౌరుషములు మొదలగువానిని పరీక్షించుటకే యీ పణము నిర్ణయించ

బడినది. వీరశ్రేష్ఠా, మావద్దనున్న యీ యేడు వృషభములు యెవరికిని వశము గాకుండ నున్నవి. మహాపొగరుబోతులు. అనేక రాజకుమారులనివి భిన్నాంగుల గావించి, వారి యుత్సాహమును నీరు గార్చినవి. నీవు వీనిని నిగ్రహించినచో, నీవే మాకన్యకభీష్టవరుడవు కాగలవు" అని పలికె. పందెపు సమాచారము విన్న గోవిందుడు నడుము బిగించినాడు. ఏడు రూపముల దాల్చి యేడెద్దుల నవలీలగా కొంగదీసినాడు. దానితో యెద్దుల పొగరు దిగిపోవుటతోబాటు, గోవిందుని బల పౌరుషములుగూడ వెల్లడియైనవి. ఆ యేడింటిని తాళ్ళతోగట్టి, భగవానుడు, చిన్న పిల్లవాడు కొయ్యతోచేసిన యెద్దుబొమ్మలను లాగినట్లు లాగినాడు. నగ్నజిత్తునకు విస్మయము కల్గినది. ప్రసన్నుడై యాతడు తన కన్యను శ్రీకృష్ణునకు దానము చేసినాడు. సత్యాదేవిని శ్రీకృష్ణుడు యథావిధిగ వివాహమాడినాడు. రాణులందరు గూడ, తమ కన్యకు ప్రియతముడగు భగవానుడే పతిగా లభించెనని యెంతయో మురిసిపోయిరి. మహోత్సవములు జరిగినవి. మంగళవాద్యములు మ్రోగినవి. బ్రాహ్మణాశీర్వచనములు మిన్నుముట్టినవి. నగరమందలి నరనారీమణులందరును, సుందర వస్త్రాభరణభూషితులై యానందోత్సాహములు వెల్లడించిరి. నగ్నజిన్మహా రాజు, పదివేల గోవులను, మూడువేల సుందరదాసీరత్నములను, తొమ్మిదివేల యేనుగులను, తొమ్మిదికోట్ల గుర్రములను, తొమ్మిదిలక్షల రథములను, తొమ్మిది వందల కోట్ల పదాతులను, వరకట్నముగా, వాసుదేవున కొసంగె. వధూవరులను రథారూఢుల గావించి, మహాసేనా సమేతముగ వారికి వీడ్కోలు చెప్పినాడు మహా రాజు. ఆ సమయమందాతని హృదయము వాత్సల్యప్రేమచే ద్రవించిపోయినది.

నగ్నజిన్మహారాజుయొక్క వృషభము లిదివరకెందరో మహారాజులకు శృంగభంగమొనర్చి యున్నవి. వారికీ వివాహ వృత్తాంతము తెలియగనే శ్రీకృష్ణ విజయమును సహించలేక, వారు ద్వారకకేగు మార్గమందు వారిని చుట్టుముట్టినారు. వారిపై మహావేగముతో బాణవర్గము కురిపించసాగిరి. ఆ సమయమందు శ్రీకృష్ణ సఖుడగు అర్జునుడు, గాండీవము ధరించి, సింహము క్షుద్రమృగములవేటాడునట్లు, శత్రువీరుల చించిచెండాడినాడు. అనంతరము యదుసింహుడు, సత్యాదేవితో, పారి బర్హసహితముగ, ద్వారకను ప్రవేశించి గృహస్థోచితముగ విహరించసాగినాడు.

భగవానుని మఱియొక మేనత్తయగు శ్రుతకీర్తి కేకయదేశమందు వివా హితయై యున్నది. ఆమె కూతురిపేరు "భద్ర". ఆమె సోదరులగు సంతర్దనాదులు, స్వయముగ, భద్రాదేవిని శ్రీకృష్ణునకిచ్చి వివాహము గావించిరి.

మద్రదేశాధీశుని కూతురు "లక్ష్మణ". ఆమె సర్వసులక్షణ సమన్విత. గరుత్మంతుడు స్వర్గమునుండి యమృతమును హరించి దెచ్చిన విధముగ శ్రీకృష్ణు డామెను స్వయంవర సభామధ్యమందుండి, యేకాకిగనే హరించినాడు.

"పరీక్షిన్మహారాజా, యీ ప్రకారము, శ్రీకృష్ణ భగవానుడింకను వేలకొలది స్త్రీలను పెండ్లియాడినాడు. పరమ సుందరీమణులగు వారందరిని, అతడు నరకాసురుని వధించి చెఱవిడిపించియుండె"నని, శ్రీశుకయోగి, వచించె.

# ఏబది తొమ్మిదవయధ్యాయము

## భౌమాసురోద్ధారము - 16100 మంది కన్యలతో శ్రీకృష్ణ వివాహము

"స్వామీ, శ్రీకృష్ణుడు ఆస్త్రీలను చెఱ పెట్టిన యా భౌమాసురుని(నరకాసురుని) యేల, యెటుల వధించెనో, విచిత్రమగు వాసుదేవుని చరితమును, దయతో వివరింప వేడెద" నని పరీక్షిత్తుడడుగగా, శ్రీశుకయోగి యిట్లు చెప్పదొడగె.

"రాజా,♦ భౌమాసురుడు, వరుణదేవుని ఛత్రమును, దేవమాతయగు అదితి యొక్క కుండలములను, మేరు పర్వతమందలి, దేవతలకు చెందిన మణి పర్వతమను ప్రదేశమును, బలపూర్వకముగ హరించినాడు. అందుపై దేవేంద్రుడు ద్వారకకేతెంచి, వాని దుశ్చేష్టితములను శ్రీకృష్ణభగవానునకువిన్న వించుకొనియె. భగవానుడప్పుడు, తన ప్రియ పత్నియగు సత్యభామతోగూడ, గరుడారూఢుడై, నరకుని, రాజధానియగు ప్రాగ్జ్యోతిష పురమేగినాడు. ఆ పురమునందు ప్రవేశించుటయే మహాకష్టము. కొండలే దానికి కోట గోడవలెనున్నవి. అది గిరి దుర్గములు, శస్త్రదుర్గము, జలఅగ్ని, అనిల దుర్గములచే చుట్టబడియున్నది. దానికిలోపల మురాసురుడు ఘోరములు, సుదృఢములునగు తన పదివేల పాశములను నగరమునకు నాలుగువైపుల చుట్టియున్నాడు. భగవానుడు గరుడునిపై వెళ్ళుచు, గిరిదుర్గములను గదచే పగుల గొట్టినాడు. బాణములచే శస్త్ర దుర్గముల ఛేదించినాడు. చక్రముచే జలాగ్నివాయుదుర్గముల ఛేదించినాడు ఖడ్గముచే మురపాశములను తెగవేసినాడు.

---

♦ భౌమాసురుడు :- నరకాసురునికే భౌమాసురుడని పేరు. భూమిదేవికి భగవానునివలన (వరాహావతారమున) కలిగినందున "భౌముడ"ను పేరు గల్గినది. నరకుని సంహారానంతరము భూదేవి శ్రీకృష్ణభగవానునితో నిట్లు వచించినది.

శ్లో॥ దత్తస్త్వయైవ గోవిందత్వయైవవిని పాతితః
యథేచ్ఛసితథాక్రీడ బాలఃక్రీడనకైరివ.

"స్వామీ. యీ కుమారుని నాకు నీవే ప్రసాదించితివి. నీయిచ్చవచ్చినట్లు—బాలుడు ఆట బొమ్మలతో నాడుకొనునట్లు—ఆడుకొనుము" అని పల్కినది.

(హరివంశము)

అచటనమర్చబడి యున్న యంత్రములను, వీరపురుషుల హృదయములను, శంఖ నినాదముచే నిర్భిన్న మొనర్చినాడు. కోటగోడను గదతో పగుల గొట్టినాడు గదాధరుడు.

ప్రళయకాలమందలి వజ్రఘోషమువంటి, పాంచజన్య భీకరారావమును విని మురాసురునికి నిద్రాభంగమైనది. వెంటనే యాతడు వెలుపలకేతెంచినాడు. అతని కైదు తలలుండినవి. అంతవరకాతడు జలములందు నివసించి యుండె. వాడు ప్రళయ కాలమునందలి సూర్యాగ్నులవలె ప్రచండతేజము గలవాడు. ఆ భయంకర రూపుని కన్నెత్తి చూచుటగూడ సులభముగాదు. త్రిశూలము నెత్తి యాతడు, గరుడునిపై కెగురు సర్పరాజువలె, భగవానునిపై దుమికినాడు. తన యైదు తలలతో నాతడు ముల్లోకములను మ్రింగునా యనునట్లుండె. తన త్రిశూలము నాతడు గరుడునిపై విసరి సింహనాద మొనర్చినాడు.ఆశబ్దము భూస భోంతరాళములయందు వ్యాపించినది. దిక్కులు పిక్కటిల్లినవి. గరుడుని పైకి దూసుకొని వచ్చుచున్న త్రిశూలము గాంచిన భగవానుడత్యంత నైపుణ్యముతో రెండు బాణముల ప్రయోగించి దానిని ఖండించి క్రింద బడగొట్టినాడు. మురాసురునిపై గూడ ననేకబాణములు ప్రయోగించగా వాడు క్రుద్ధుడై, భగవానునిపై గదా ప్రహారమొనర్చె. కాని గోవిందుడు తన గదచే నాతని గదను చూర్ణమొనర్చివైచె. అంతనాతడు చేతులుచాచుచు భగవానునిపై నాక్రమింపగా, నతడు తన చక్రముచే నాతనియైదు తలల నవలీలగా నుత్తరించె. మురదైత్యుని ప్రాణవాయువులనంత వాయువులతో లీనమై పోయినవి. ఇంద్రుని వజ్రముచే శిఖరములు ఛేదింపబడిన పర్వతమువలె నాతడు నేల గూలినాడు. మురదైత్యునికి యేడుగురు పుత్రులుండిరి. వారు తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనువారలు. పితృమరణముచే వారత్యంత శోకార్తులై, పగదీర్చుకొనదలచి, యాయుధముల ధరించి, “పీఠు” డనురాక్షసుని తమసేనాధిపతిగచేసుకొని, భౌమాసురుని యాదేశానుసారము శ్రీకృష్ణునితో తలపడిరి. వచ్చుచునే వాసుదేవునిపై బాణవర్షము గురియించిరి. భగవానుని శక్తి యమోఘము అనంతము గదా. తన బాణములచే వారి శస్త్రాస్త్రములన్నియు చూర్ణము గావించి, సేనాధిపతియగు పీఠుని, యతని యనుచరులను యముని పాలికంపినాడు. శ్రీకృష్ణుని చక్రప్రహారముచే సర్వనాశమగుట గాంచిన, భౌమాసురునకత్యంత క్రోధము కలిగినది. సముద్రోద్భూతములగు మదగజ సైన్యము దీసుకొని యాతడు కోటనుండి వెలువడినాడు. భగవానుడు భార్యా సమేతముగ గరుడునిపై శోభాయమానముగ నాకసమందు విహరించు చుండుటను గాంచి, నరకుడాతనిపై శతఘ్ని యను నాయుధమును ప్రయోగించినాడు. అతని సైనికులందరును గోవిందునిపై బాణవర్షము గురిపించిరి. భగవానుడు, చిత్రవిచిత్ర బాణ ప్రయోగ మొనర్చి శత్రుసైన్యముల చిందరవందర చేయుచుండె.

శత్రు సైన్యములు ప్రయోగ మొనర్చిన ప్రతి బాణమును, మూడు మూడు బాణములచే ముక్కలుగావించినాడుమురారి. భగవానునివాహనమగు గరుత్మంతుడు, తన ఱెక్కలచే యేనుగుల సంహరించుచుండె. అతని, ముక్కు, ఱెక్క, పాద ఘాతములచే పీడింపబడియేనుగులు, చావగా మిగిలినవి, నగరములోనికి పారి పోయినవి. గరుడుని పరాక్రమము గాంచిన నరకుడు, వజ్రనిర్భేదకమగు తన శక్త్యాయుధము నాతనిపై ప్రయోగించె. దానిచే గరుడు డొక్కింతయు విచలితుడుగా లేదు. కాని మదగజముపై వైచిన పూలమాలవలెనున్నదాతనికి. తన ప్రయత్నము లన్నియు విఫలమగుట గాంచిన నరకుడు, శ్రీకృష్ణునిపై త్రిశూలమును ప్రయో గింప నుంకించుచున్నంతలో, నతడు చక్రముచే, గజారూఢుడై యున్న నరకుని శిరమును ఖండించివైచినాడు. కిరీట కటక కుండలాన్వితమై ప్రకాశించుచున్న నరకుని శిరము భూమిపై బడినది. నరకుని సంబంధీకులందరు హాహాకారము లొనర్చిరి. ఋషులు, మునులు సాధువాదములు బలికిరి. దేవతలు పుష్పవృష్టి గురిపించి, భగవానుని స్తుతించిరి.

ఆ సమయమున భూదేవి భగవానుని సమీపించినది. భగవానుని కంఠమం దామె వైజయంతితోబాటు, వనమాలను వైచినది. తప్త జాంబూనదనిర్మితములై రత్నఖచితములై ప్రకాశించుచున్న యదితమాత కుండలములను, వరుణచ్ఛత్ర ముతో సహానాక మహామణినిగూడ దెచ్చి, భగవానునకు సమర్పించినది. అనంత రము దేవతలచే గూడ పూజింపబడునట్టి దేవాధిదేవుడగు శ్రీకృష్ణునకు చేతులు జోడించి నమస్కరించి, భక్తితో హృదయపూర్వకముగనిట్లు స్తుతించినది.

"దేవదేవేశ, శంఖచక్రగదాధర, నీకు నమస్కారము. పరమాత్మా, భక్తుల కోరికల దీర్చుట కనురూపములగు రూపముల దాల్చుచుందువు. నేను నీకు నమస్క రించుచున్నాను.

ప్రభూ, నీ నాభినుండి కమలముత్పన్నమైనది. అందుచే నీవు పంకజనాభు డవు. పద్మమాలధరింతువు. నీ నేత్రములు పద్మములవలె వికసించి శాంతిదాయక ములై యుండును. నీ చరణములు పద్మమువలె సుకుమారముగనుండి, భక్తుల హృదయములను చల్లబరచుచుండును. అట్టినీకు నేను నమస్కరించుచున్నాను.

షడ్గుణైశ్వర్య సంపన్నుడవు నీవు. సర్వవ్యాపకుడవయ్యును, వాసుదేవు డవుగా (వసుదేవతనయుడుగా) ప్రకటితుడనగుచున్నావు. అట్టి నీకు నమస్క రించుచున్నాను.

నీవాదిపురుషుడవు. సర్వకారణ కారణుడవు. పూర్ణజ్ఞానస్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము.

స్వయముగా నీవు జన్మరహితుడవు. అయినను యీ జగత్తునకు నీవే జన్మ దాతవు. అనంతశక్తి యుతుడవు, శక్తులకాశ్రయుడవు; నగు పరబ్రహ్మవు నీవే.

జగత్తునందలి కార్యకారణ రూపములన్నియును, స్థావరజంగమాత్మక ప్రాణులు జడపదార్థములన్నియు నీ స్వరూపములే. పరమాత్మా, నీచరణములకు పునః పునః ప్రణామములర్పించుచున్నాను.

ప్రభూ, జగత్తును సృష్టింపదలచినపుడు, రజోగుణమును, ప్రళయమొనర్ప దలచినపుడు, తమోగుణమును, అటులనే పరిపాలన చేయదలచినపుడు సత్త్వగుణ ముకు స్వీకరించి, ఆయా కార్యముల గావించుచుందువు. అయినను ఆ గుణములచే నీవు కప్పబడవు. లిప్తుడవుగాకుండుదువు. ప్రకృతిరూపము, పురుషరూపము రెంటి సంయోగ వియోగములకు కారణమగు కాలరూపములన్నియు నీ రూపములే. వీటి యన్నిటికి నతీతుడవుగ నీవేయున్నావు (పరుడవు).

స్వామీ, నేను (పృథివి) జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ భూతములు, పంచతన్మాత్రలు, మనస్సు, యింద్రియములు, వాటి యధిష్ఠాన దేవ తలు, అహంకారము, మహత్తత్త్వము. మొదలగు వానితో గూడిన చరాచర జగ త్తంతయు, నీ యద్వితీయ స్వరూపమందు, భ్రాంతి కారణముచేత వేరుగానున్నట్లు కనుపడుచున్నవి. (కాని వేరుగావు).

శరణాగతుల భయము పోగొట్టునట్టి ప్రభూ, వీడు నాపుత్రుడగు నరకుని పుత్రుడు భగదత్తుడు. వీడిపుడత్యంత భయభీతుడైయున్నాడు. నేను వీనిని నీచర ణములదరికి చేర్చినాను. సమస్తజగత్తునకు తాప, పాపముల పోగొట్టునట్టి, నీకర కమలములను వీని మస్తకమందుంచి వీనికభయ మొసంగుము"

అని భక్తిభావముతో భూదేవి ప్రార్థించగా, భగవంతుడు భగదత్తునకభయ మొసగి, సకల సంపత్సమృద్ధమగు భౌమాసురుని యంతఃపురమును ప్రవేశించె. రాజులవద్దనుండి బలవంతముగ పదునారువేల నూరుమంది రాజకన్యలను దెచ్చి నరకుడంతఃపురమందుంచి యుండుట యాతనికి గానవచ్చినది. వారందరచటికి వచ్చిన నరశ్రేష్ఠుడగు శ్రీకృష్ణునిగాంచి, మోహితలై, యతని యహైతుకమగు దయ, తమ సౌభాగ్యమును గమనించి, మానసికముగనే భగవానుని తమ ప్రియ తమపతిగా వరించిరి.

వారందరు ప్రత్యేకముగా, యీ శ్రీకృష్ణుడే నాకు పతియగుగాక. విధాత నా యీ కోరికను దీర్చుగాక" యని మనసునందు తలచుచు, ప్రేమ భావముతో తమ హృదయమును భగవానున కర్పణ గావించిరి.

భగవానుడా రాకుమారికలందరిని, సుందరములు, నిర్మలములునగు వస్త్రా భూషణాదులచే నలంకరింపచేసి, పల్లకీలపై నెక్కించి, చాల ధన మొసంగి, రథాశ్వ ములనిచ్చి, సబహుమానముగ, వారిని ద్వారకకు బంపినాడు. నాల్గు దంతములు గలిగి, యైరావతకులోద్భూతములగు తెల్లని యేనుగుల నరువది నాల్గింటిని గూడ ద్వారక కనిపినాడు.

అనంతర మచటి నుండి భగవానుడింద్రుని యమరావతీ పురమేగినాడు. శచీ సహితుడై దేవేంద్రుడు సత్యభామా సమేతుడగు శ్రీకృష్ణుని యథావిధిగ పూజించినాడు. భగవానుడు దేవమాతయగు నదితి కుండలముల నామె కందిచ్చినాడు. తిరిగి వచ్చునప్పుడు, సత్యభామాప్రేరితుడై గోవిందుడు పారిజాత వృక్షమును పెళ్ళగించి, గరుత్మంతునిపై నునిచి, యడ్డు వచ్చిన దేవేంద్రాది దేవతల నెల్ల జయించి, ద్వారకకేతెంచి, యా వృక్షమును సత్యభామా ప్రాసాదోపవనమందు నాటినాడు. ఆ వృక్షముచే నా యుపవన మత్యంత శోభను సంతరించుకొన్నది. కల్పవృక్షముతోబాటు, దాని సుగంధ మకరంద రసాస్వాదన లాలసములైన తుమ్మెదలు గూడ ద్వారకను చేరినవి. తన ప్రయోజనమునకై కిరీట మాతని పాదములకు సోకునట్లు ప్రణామమొనర్చి సహాయ మర్థించిన యింద్రుడు, తన ప్రయోజనము సిద్ధించగనే భగవానుడగు శ్రీకృష్ణునితో యుద్ధమునకు సిద్ధమాయెగదా! నిజముగా యీ దేవతలు గూడ తమో గుణయుక్తులుగనే గనుపించుచున్నారు. వారియందీ ధనాఢ్యతయే, యన్నిటికంటె మిన్నయగు దోషము-అట్టి ధనాఢ్యతకు ధిక్కారము.

అనంతరము భగవానుడొకే ముహూర్తమునందు, వేర్వేరు భవనములందు వేర్వేరు రూపములు దాల్చి, పదునారువేల నూర్గురు రాజ కన్యకలను శాస్త్రోక్త విధానముచే వివాహమాడినాడు. సర్వశక్తి సమన్వితుడు, అవ్యయుడునగు భగవానుడిట్లు చేయుటలో నాశ్చర్య మేమియున్నది. భగవానుని భార్యలందరికి వేర్వేరుదివ్య భవనములున్నవి. వానియందు సమస్త దివ్య వస్తువులు సమృద్ధిగ నున్నవి. వానితో సమానములగు సామగ్రులు ప్రపంచమందు మరెక్కడను కానరావు. అట్టిచో వానికంటె గొప్పవి యుండుట యను ప్రసక్తియే కలుగదుగదా. అట్టి ప్రాసాదములందు వసించుచు లీలారూపుడగు భగవానుడాత్మానందమగ్నుడై లక్ష్మ్యంశ సంభూతులగు భార్యలతో, సామాన్య మానవుడు గృహస్థుడై గృహ ధర్మముల ననుసరించి ప్రవర్తించునట్లుగనే, గృహస్థుడై విహరించుచుండె. బ్రహ్మాదిదేవతలు గూడ భగవానుని యదార్థ స్వరూపమును, ఆ స్వరూప ప్రాప్తి నొందు మార్గమును దెలియకుందురు. అట్టి రమారమణుడగు శ్రీకృష్ణభగవానుని ఆ రాజ కన్యకలు పతిరూపమున పొందియుండిరి! వారి ప్రేమానందములు దినదినాభివృద్ధి గాంచుచుండినవి. ప్రేమ పూరితములగు మందహాసములు, మధురములగు కటాక్ష వీక్షణములు, నవసమాగమము ప్రేమాలాపములు, భావస్ఫోరకములగు నునుసిగ్గు దొంతరలచే కూడినవారై సర్వ విధములుగ వారు భగవానుని సేవించుచుండిరి. ఆ భార్య లందరికి సేవలొనర్చు దాసీజనము వందల కొలది యున్నప్పటికిని, భగవానుడు వారి ప్రాసాదము ప్రవే

శించగనే వారే [భార్యలే] యాతని కెదురేగి, యాదర పూర్వకముగ లోనికి గొని వచ్చి, యున్నతాసనమందు గూర్చుండబెట్టి, శ్రేష్ఠములగు వస్తువులతో నతనిని పూజించి, పాదములు కడిగి, తాంబూలాదులొసంగి, పాద సంవాహన మొనర్చుచు నాతని శ్రమను పోగొట్టుచుందురు. అత్తరు మొదలగు సుగంధ ద్రవ్యములు, చందనాదులు పూయుచుందురు. పూలహారములు సమర్పించి, కేశము అలంకరించుచుందురు. సుఖముగ నిద్రింప జేయుచుందురు. స్నానాది సేవ లొనర్చుచు, చక్కని భోజనముల బెట్టి యతనిని సంతృప్తిపరచుచుందురు. ఈ సమస్త సేవలను, స్వయముగ భార్యలే నిర్వర్తించుచుందురు.

# అరువదియవ యధ్యాయము

## శ్రీకృష్ణ-రుక్మిణీ సంవాదము

ఒకనాడు, తన పర్యంకముపై సుఖముగ శయనించియున్న జగన్నాథుడగు శ్రీకృష్ణుని రుక్మిణీదేవి, సఖీసమేతయై సేవించుచుండినది. అతనికి వీవన విసరుచుండినది. సృష్టి స్థితి లయము లొనర్చునట్టి, యజన్ముడగు భగవానుడు తనచే నేర్పరుపబడిన ధర్మమును సంరక్షించుటకైయదువంశము నందవతరించియున్నాడు. రుక్మిణీదేవి యంతఃపురము పరమ సుందరముగానున్నది. ముత్యాల జాలరులు వ్రేలావగట్టిన చాందినీలు ప్రకాశించుచున్నవి. మణిదీపములు ప్రకాశించుచున్నవి. మల్లికా దామములు, పూలపై విహరించు మధుకర ఝుంకారము జాలరంధ్రముల నుండి లోన ప్రవేశించు చంద్రుని శీతల కిరణములు, పారిజాతకుసుమ సువాసనతో వీచు మంద మంద వాయువులు, పరిమళ ధూపములు గలిగి యత్యంత మనోహరముగ నున్నవి.

అట్టి యంతఃపురమందు పాలనురుగువలె తెల్లగానున్న మెత్తని పర్యంకమందు శ్రీకృష్ణు డానందముగ విరాజమానుడగుచుండగా,ముల్లోకముల కధిపతియైన భగవానుని పతిగా పొందిన రుక్మిణీదేవి, యాతనికి భక్తితో సేవజేయుచున్నది. ఆమె కమల హస్తములయందు రత్నాంగుళీయకములు, కంకణములు, చామరము, శోభాయమానముగ నున్నవి. పాదములందు మణినూపురములు ధ్వనించుచున్నవి. వక్షఃస్థలమందు హారములు మెరయుచున్నవి. నితంబ భాగమందమూల్యమగు నొడ్డాణమునందలి సరములు వ్రేలాడుచున్నవి. ఈ విధముగ నామె భగవానుని ప్రక్కనేయుండి యాతనిని సేవించుచుండినది.

రుక్మిణీదేవి యొక్క వంకరలు దిరిగిన ముంగురులు, కర్ణములందలి కుండలములు, కంఠమందలి స్వర్ణహారములు, అత్యంత విలక్షణములుగ నున్నవి. ఆమె

ముఖచంద్రమండలమునుండి, ముసి ముసి నగవుల యమృతవర్షము కురియుచుండి నది. రుక్మిణీదేవి, యలౌకిక రూపలావణ్యవతియగు సాక్షాత్ లక్ష్మీదేవియేగదా! భగ వానుడు లీలామానుష రూపము ధరించగా, నామెకూడ తదను రూపముగ మానుష రూపముదాల్చినది. అనన్య ప్రేయసియు, భక్తి పరాయణయునగు రుక్మిణిని గాంచి, ప్రీతుడైన వాసుదేవుడు, చిరునవ్వు నవ్వుచు నామెతోనిట్లు పల్కె.

"రాజకుమారీ, లోకపాలురతో సమానమగు నైశ్వర్యముగలిగినవారును, మహానుభావులు శ్రీమంతులు, రూపౌదార్యబలోపేతులగు భూపాలోత్తములెందరో నిన్ను వివాహమాడుటకై ముందుకు వచ్చియుండిరి. నీ సోదరులు, తండ్రి యందరు నిన్నట్టివానికే యిచ్చి వివాహము చేయదలచి యుండిరి. వాగ్దానము గూడ చేసి యుండిరి. కామోన్మత్తులై శిశుపాలాదివీరులు నిన్ను యాచించుచుండగా, కాదని, యే ప్రకారముగా గూడ నీతో సమానుడను గానట్టి నావంటి వానిని నీవు పతిగా వరించి తివి. నీవేల యట్లొనర్చితివి? సుందరీ, చూడు మేము జరాసంధాది రాజవరులకు భయపడి సముద్రుని శరణుజొచ్చియుంటిమి. మహా మహా బలవంతులతో మేము విరోధము బెట్టుకొని యున్నాము. రాజ సింహాసనాధికారము గూడ మాకు లేదు. మేమే మార్గానుయాయులమో, మా మార్గమెటువంటిదో గూడ లోకులకు దెలియ కుండును. లౌకిక వ్యవహారములను గూడ మేము సరిగా పాటించము. అనునయ వినయముల ద్వారా స్త్రీలను సంతోషబెట్టుట గూడ చేయము. ఏముదితలు మావంటి పురుషుల ననుసరించుచుందురో, వారు తఱచుగా క్లేశములే యనుభవింపవలసి వచ్చు చుండును. మే మెల్లప్పుడు దరిద్రులమే. ఇదివరలో నెప్పుడును మావద్ద నేమియు లేదు. ఇకముందుగూడ నుండదు. మావంటి మందభాగ్యులనే మేము ప్రేమించుచుం దుము అందుకనియే, ధనవంతులమని యనుకొనువారు తఱచుగా మమ్ము ప్రేమించ కుందురు. మమ్ములను సేవించరు. ధనము, కులము, అయిశ్వర్యము,సౌందర్యము ఆదాయము, సమానముగాగల వారితోనే వివాహముగాని, మిత్రత్వముగాని చేయ వలయునేగాని, తమకంటె గొప్పవారితోగాని, తక్కువ వారితోగాని యట్టి సంబంధ ములు చేయుట యుచితముగాదు. విదర్భరాజపుత్రీ, నీకు దూరదృష్టి లేని కారణ ముచే యీ విషయములన్నియు సరిగా విచారించక తెలిసీ తెలియని భిక్షుకుల వలన నన్ను గూర్చిన మిథ్యాప్రశంసలు విన్నదానివై, నావంటి గుణహీనుని వరించితివి. ఇపుడు గూడ మించిపోయినదేమీలేదు. నీ కనురూపుడగు నుత్తమ క్షత్రియుని నీవు వరించుము. అతని వలన నీకు యిహలోక పరలోకములకు సంబంధించిన సమస్త మనోరథములు సఫలము కాగలవు. సుందరీ, శిశుపాల, జరాసంధ, శాల్వ, దంతవ క్త్రాది నరపతులును, చివరకు మీ యన్నయగు రుక్మియు నన్ను ద్వేషించుచుండి రను విషయము నీకు తెలియునుగదా. వారందరును, బల పౌరుషమదాంధులై యెవ

రిని లెక్క పెట్టకయుండిరి. ఆ దుష్టుల మానభంగ మొనర్చుటకే నేను నిన్ను హరించి యుంటిని. అంతేగాని మరే కారణమును లేదు. నిశ్చయముగా మేము దాసీనులము-స్త్రీలు, సంతానము, ధనము మొదలగు వానికి సంబంధించిన కోరికలు మాకు లేవు. మేము నిష్క్రియులము. దేహ గేహములతో సంబంధములేని దీప శిఖవలె సాక్షిమాత్రులుగ నుండెదము. ఆత్మ సాక్షాత్కారము చేతనే మేము పూర్ణ కాములముగను కృతకృత్యులముగ నుండెదము."

శ్రీకృష్ణ భగవాను డొక్క క్షణకాలము గూడ నామెను విడిచి పెట్టకయుండు టచేత, తానందరి కంటెనతని కెక్కుడు ప్రియముగలదానినని, రుక్మిణీదేవి కభిమానము జనించినది. ఆమె గర్వము నణచుటకే భగవానుడా విధముగా మాట్లాడి, యూరకుండి పోయినాడు. తనకు పరమ ప్రియుడు, త్రిలోకేశ్వరుడునగు భగవాను డీరీతిగా నప్రియములగు పలుకులను—యిది వరకెన్నడును విననట్టి వానిని-వినిపించ గనే, రుక్మిణి కత్యంత భయము కల్గినది, ఆమె హృదయము కంపించినది, రోధించుచునామె దురన్తచింతా సముద్రమందు మునిగిపోసాగినది. నఖ రక్త కాంతిచే కొంచె మెరుపు వర్ణము గలిగి, కమలముల వలె కోమలములగు తన చరణములచే నేలపై రాయసాగినది. కాటుక కన్నుల నుండి కారిన కన్నీరు కుంకుమాంకితమగు వక్షఃస్థలమును తడుపసాగినది. ముఖము క్రిందికి వ్రేలాడినది. అత్యంత దుఃఖకారణముచే నామె వాణి రుద్ధమైనది. దుఃఖ శోకభయములు ముప్పిరిగొన, విచారశక్తి నశించి, వియోగ శంకిత యగుటచే నామె కృశించి పోయినది. ఎంత కృశించినదన నామె ముంజేతి కంకణములు జారి క్రింద పడి పోయినవి. చేతి యందలి చామరము క్రిందకు జారిపోయినది. బుద్ధి వైక్లబ్యము కలుగుటచే నామె వెంటనే మూర్ఛిల్లి పడిపోయినది. కేశములు చెల్లా చెదురైనవి. వాతాహతమైన యరటి స్తంభమువలె, భూమిపై బడిపోయిన యామెను గాంచి భగవానుడు, హాస్యమందలి గాంభీర్యమును గ్రహింపజాలక, తన ప్రేయసి, ప్రేమ పాశవివశయై పడిపోయినదని గ్రహించగనే, సహజముగ దయార్ద్రమగునతనిహృదయము, ఆమెపై కరుణచే నిండిపోయినది. చతుర్భుజుడగు భగవానుడు పర్యంకము నుండి వెంటనే క్రిందికి దూకి, రుక్మిణిని లేవనెత్తి పర్యంకముపై పరుండబెట్టి, యామె కేశపాశమును సరిజేసి, తన శీతల కర కమలములచే నామె మొగమును తుడిచినాడు. కనుల నుండి కారిన దుఃఖాశ్రువులచే తడిసిన యామె వక్షఃస్థలమును గూడ తుడిచినాడు. తన యందనన్య ప్రేమ భావమును గలిగియుండిన పరమ పతివ్రతయగు రుక్మిణిని బాహువులచే బంధించి, గాఢముగ హృదయమునకు హత్తు కొనినాడు. అనునయించుటలో నత్యంత నేర్పరియగు శ్రీకృష్ణుడామె నోదార్చినాడు. హాస్య ప్రసంగమందలి గాంభీర్యముచే నామె చిత్తము భ్రమించియుండుటనుగాంచి,

దీనులగు భక్తులకేకమాత్రాశ్రయుడగు భగవానుడు, అట్టిదేనస్థితి కయోగ్యయగు రుక్మిణిని సాంత్వన పరచుచునిట్లు పలుకసాగినాడు.

"వైదర్భీ, నన్నపార్థము చేసుకొనకుము. నాపై కోపగించకుము. నీవు మత్పరాయణవనినేనెఱుగుదును. నా ప్రియ సహచరీ, ప్రేమ సంభరితములగు నీ వాక్కులను వినదలచియే, హాస్యముగ నేను వ్యంగోక్తుల బలికితిని. నేనటులమాట్లాడగనే, ప్రణయకోపముతో నీయరుణాధరములెటుల,కంపించునో,నీకటాక్షాపారుణాపాంగమును, సుందర భ్రుకుటీతటమును చూడదలచితిని. ప్రియతమా, గృహస్థ కార్యములందు నిమగ్నులై యుండు గృహస్థులకు, తమ యర్థాంగితో నిటుల నర్మోక్తులాడుచు, కొద్దిసేపు హాస్య ప్రసంగముతో కాలము గడుపుటయే గడా పరమలాభము!"

అని యీ విధముగ, తన ప్రాణ ప్రియననునయించిన మీదట, తన ప్రియతముడగు భగవానుడు కేవలము హాస్యము కొరకే తనతో నటుల మాటలాడెనను విశ్వాసము,రుక్మిణీదేవికి కలిగినది. తననాతడెక్కడతన్ను త్యజించునో యను భయమామెనిప్పుడు వీడినది. సిగ్గు, హాస్యముతోగూడిన ప్రేమ దృక్కులతో నాపురుష భూషణుని జూచుచు నిటులపల్కినది.

"కమలనయనా, మీరు పల్కిన పలుకులలో నెంతయో సత్యమిమిడియున్నది. ఐశ్వర్యాది సమస్త గుణములతో గూడిన యనంతులగు మీకు నేను తగినదానను కానేకాను. ఏ ప్రకారముగా గూడ నేను మీతో సమానురాలను కాజాలను. ఆత్మ మహిమయందే యుండి, త్రిగుణములకును అధీశులై యుండి, బ్రహ్మాది దేవతల సేవలందు కొనునట్టి తమరెక్కడ? త్రిగుణముల ననుసరించు స్వభావము గలిగియుండు, గుణమయ ప్రకృతి రూపురాలనగు నేనెక్కడ? విషయ సుఖముల వైపు పరుగిడుచుండు అజ్ఞానులే ప్రకృతిని సేవించుచుందురు. నేను మీతో సమానురాలనెట్లు కాగలుగుదును? మీరు రాజుల వలన భయముచేత సముద్రమందు దాగియుంటిమనుమాట గూడ యథార్థమే. కాని 'రాజు' అను పదమునకు "భూపతు" లని యర్థము గాదు. త్రిగుణరూపమగు రాజని భావము. ఆ త్రిగుణములభయము చేతనే, అంతఃకరణరూపమగు జలధియందు, చైతన్య ఘనము అనుభూతి స్వరూపమునకు ఆత్మ స్వరూపమున మీరు విరాజమానులగుచున్నారు. రాజులతో మీరు విరోధము గల్గియుండుటలో నెట్టి సందేహమును లేదు. కాని యారాజు లెవరు? దుష్టములైన యీ యింద్రియములే. వీనితో మీకు విరోధముండియేయున్నది.

ప్రభూ, తమరు రాజసింహాసన భూరహితులమని యంటిరి. అదియు సరియైన మాటయే, ఏలననగా-మీ చరణముల సేవించువారు గూడ రాజ పదవిని ఘోరాజ్ఞానాంధకారముగా భావించి, దానిని దూరముగా వదలి వేయుచున్నారు. అటువంట

ప్పుడు మీ విషయమేమి చెప్పవలయును? మా మార్గము స్పష్టముగాదనియు, మేము లోకమందలి పురుషుల యాచరణము ననుకరించమనియు మీరు సెలవిచ్చి తిరి. అది నిస్సంశయముగా సత్యమే. మీ పాద పద్మముల మకరందరసాస్వాద మొనర్చు మునులయొక్క మార్గమే యస్పష్టముగ నుండును. విషయములందు మునిగితేలుచుండు నరపశువు వారి మార్గము నూహించనైనా లేకుండును. అనంతా మీ మార్గముననుసరించు చుండునట్టి భక్తుల చేష్టలే యలౌకికములుగా నుండ, సమస్త శక్తులకు అయిశ్వర్యములకు ఆశ్రయ భూతులగు మీ చేష్టల లౌకికములుగా నుండునని వేరే చెప్పవలయునా? తమరకించనులమని యంటిరి. కాని మీయకించ నత్వము దారిద్ర్యము గాదు. దాని యర్థమేమనగా మీకంటె వేరగు వస్తువేదియు లేని కారణము చేత, సర్వము తమరేయని భావము. మీ వద్ద నుంచుకొనుట కేమియులేదు. కాని సర్వులచే పూజింపబడుచు కాన్కల గైకొనుచుండునట్టి బ్రహ్మాది దేవతలు గూడ, మిమ్ము పూజించుచుందురు. మీరు వారికి ప్రియులు. వారు మీకు ప్రియులు. ధనాఢ్యులగువారు మిమ్ము భజింపకుందురని మీరు పల్కినది గూడ సత్యమే, ధనమదముచే నంధులై యింద్రియముల తృప్తి పొందించుట యందే నిమ గ్నులై యుండువారు, మిమ్ము సేవింపకుండుటయే గాదు, తమ శిరముపై మీరు, మృత్యుదేవత రూపమున నృత్య మొనర్చుచున్న విషయమును గూడ గ్రహింపజాల కుందురు. జీవునకు వాంఛనీయములగు, ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థ రూపములందు గూడ మీరే ప్రకటితమగుచున్నారు.

సమస్త వృత్తులకు-ప్రవృత్తులకు, సాధనములకు, సిద్ధులకు, సాధ్యములకు-ఫలస్వరూపులుమీరే. విచారశీలుడగు పురుషుడు, మిమ్ము పొందుటకై సర్వస్వమును త్యాగమొనర్చును. అట్టి వివేకవంతులగు వారికే మీతో సంబంధముండవలయును. స్త్రీ-పురుషసహవాసముచే సంభవించు సుఖ దుఃఖములకు వశీభూతులై యుండువారు మీతో సంబంధము కలిగియుండుటకెన్నటికిని యర్హులుగారు.

భిక్షుకులు మాత్రమే మిమ్ము ప్రశంసించుచుందురను మాట గూడ సత్యమే. కాని వారెటువంటి భిక్షుకులు? మహాపరాధియగు వానికి గూడ శిక్ష విధించరాదను నిశ్చయము గలిగి, మీమహిమలను ప్రభావమును. వర్ణించుచుండునట్టి పరమ శాంతులగు సర్వసంగ పరిత్యాగులగు మహాత్ములు వారు. నేను దూర దృష్టి లేక, మిమ్ము వరించలేదు. మీరు సర్వ ప్రపంచమున కాత్మ స్వరూపు లనియు, మిమ్ము ప్రేమించిన వారికి ఆత్మదానము చేయుదురను విషయము బాగుగ తెలిసియే మిమ్ము వరించితిని. బ్రహ్మేంద్రాది మహానుభావులందరును, మీ కను సన్నల యందుద్భవించు కాలము, వారి యభిలాషలపై నీరు జల్లుచు నిర్వీర్యుల

చేయుచుండుటను విషయము గుర్తించియే, వారిని పరిత్యజించితిని. అట్టిచో శిశుపాల జరాసంధాది రాజులమాట చెప్పనేల?

ఆర్యపుత్రా, సర్వేశ్వరా, మీరు రాజులకు భయపడి సముద్రమందు నివసించుచుంటి మని పలికిన మాట, యే విధముగను, యుక్తియుక్తముగా కనుపించుట లేదు. ఏలననగా, సింహము తన గర్జనచే సర్వజంతువులను భయపెట్టి తన భాగమును గొనిపోవునటుల, నావివాహ సమయమందు మీరు కేవలము మీ ధనుష్టంకారముల చేతనే సర్వరాజన్యులను పారద్రోలి, మీ చరణదాసినగు నన్ను హరించి తెచ్చితిరి. "నన్ననుసరించువారు సర్వదా క్లేశములనుభవించెదర"ని మీరెటుల చెప్పగలరు? ప్రాచీనకాలమందలి, అంగ, పృథు, భరత, యయాతి, గయాది రాజాధిరాజులందరును తమ తమ యేకచ్ఛత్రాధిపత్య సామ్రాజ్యములను వదలి, మిమ్ములను పొందుటకై వనముల కేగి తపస్సాచరించి యుండిరి. వారికి, మీ మార్గమనుసరించుట చేత నేదైన కష్టము సంభవించినదా?

"నీవే రాజకుమారునైనా వరించుమని" నాతో పల్కితిరి. ప్రభూ, మీరు సర్వగుణాశ్రయులు, సజ్జనులు, మీచరణకమల సుగంధమును ప్రశంసించుచుందురు. ఆ చరణ కమలముల నాశ్రయించినంత మాత్రముచేతనే, లోకులు, పాప–తాపవిముక్తులగుచుందురు. లక్ష్మీదేవి యచటనే నివసించుచుండును. స్వార్థము పరమార్థము చక్కగా దెలిసినట్టి స్త్రీ యెవరైనా, కేవలమొక పర్యాయమైనా మీ చరణ కమల సుగంధము నాఘ్రాణించినచో, మరల దానిని వదలి, జరా జన్మ మృత్యు రోగాది భయములచే పీడింపబడునట్టి నరునెవ్వనినైనా వరించునేమో, మీరే చెప్పుడు. బుద్ధిగల్గిన వనిత యెవ్వతెయునట్లు చేయజాలదు!

ప్రభూ, మీరు సర్వజగన్నాథులు. ఇహ పరలోక సంబంధములను సర్వకామనలను దీర్ప సమర్థులు. ఆత్మస్వరూపులు, తమరు నాకు తగినవారని యెంచియే నేను మిమ్ము వరించి యుంటిని – నా కర్మానుసారము నేను భిన్నములగు జన్మలెత్త వలసియున్నను నాకెట్టి చింతయులేదు. తనను సేవించువారలకు, మిథ్యా సంసారభ్రమను బోగొట్టి వారికి తన స్వరూపమును గూడ దాన మొనర్చునట్టి పరమేశ్వరులగు మీ చరణములనే సర్వదా శరణమందుచుండవలయుననునదియే, యేక మాత్రమగు నా యభిలాష.

"అచ్యుతా, శత్రు సూదనా, గాడిదలవలె గృహస్థభారము మోయుచును, యెద్దులవలె కాడికిగట్టబడి గృహస్థ కార్యములజేయుచు, కష్టముల భరించుచును. కుక్కలతో సమానముగ తిరస్కారముల భరించుచును, పిల్లివలె లోభిత్వము హింసాస్వభావము కలిగియుండి, క్రీత దాసులవలె స్త్రీలకు సేవ చేయుచుండునట్టి మీరు నాకు సూచించిన యా శిశుపాలాది రాజలోకము, యెవరిచెవి యందు, విభిశం

కరేంద్రాద్ది దేవతల సభయందున గానము చేయబడుచుండు మీలీలా కథ ప్రవేశింపకయుండునో, అట్టి యభాగిని యగు స్త్రీకి పతియగుగాక.

ఈ మానవ శరీరము జీవించి యున్నను శవమే. పై భాగమందు చర్మము, గడ్డము, మీసములు, వెంట్రుకలు, గోళ్ళు, రోమములచే కప్పబడియున్నవి. కాని లోపల మాంసము, ఎముకలు, రక్తము, పురుగులు. మలమూత్రములు, కఫపిత్త వాయువులతో నిండియున్నది. మీ చరణారవింద మకరందము యొక్క సుగంధము నెప్పుడును వాసన జూడనట్టి మూఢురాలగు స్త్రీ మాత్రమే, యీ శవప్రాయమగు శరీరమును తన పతియని భావించి సేవించుచుండును.

కమలనయనా, మీరాత్మారాములు. నేను సుందరిని, గుణవతి నను విషయములపై మీ దృష్టి ప్రసరించదు. కావున మీకు ఉదాసీనముగనుండుట యనునది స్వభావము. అయినను తమ చరణకమలముల యందు నాకు సుదృఢమగు నను రాగముండవలయుననియే నాయభిలాష. మీరు సంసారాభివృద్ధి కొరకై, యుత్కటమగు రజోగుణమును స్వీకరించి, నావైపు జూచుట గూడ, మీకు నా యెడలగల పరమానుగ్రహమే.

మధుసూధనా, మీరు నాతో అనురూపుడగు వరుని వరించమని పలికితిరి. ఆ మాటను గూడనేనబద్ధమని భావించుట లేదు. ఏలననగా, అప్పుడప్పుడు, ఒక పురుషునిచే జయింపబడినప్పటికిని కాశీరాజకుమార్తెయగు అంబవలె, స్త్రీకి మరియొక పురుషునిపై ప్రీతి యుండుట సంభవించుచుండును. కులటయగు స్త్రీ మానసము వివాహమైన పిమ్మట గూడ, నూతన పురుషుల వైపునకు లాగబడుచుండును బుద్ధిమంతుడగు పురుషుడట్టి కులటను తన దరికి చేరనీయరాదు. అట్టి స్త్రీని తన దానినిగా చేసుకొను వానికిహ పరలోకములు రెండును చెడును. ఉభయభ్రష్టుడై పోవును." అని పలికిన రుక్మిణీదేవితో భగవాను డిట్లనియె.

"సాధ్వీ, యీ మాటలు నీనుండి వినుట కొఱకే, పరిహాసముగ నీతో వ్యంగముగ నేను మాటాడియుంటిని. నీవు నామాటలపై చేసిన వ్యాఖ్య అక్షరాలా సత్యము. సుందరీ, నీవు నాకనన్యప్రేయసివి. నీకు నాపై యనన్యమగు ప్రేమ యున్నది. నీవు నానుండి యేయేకోరికలను గోరుకొనియుంటివో యవియన్నియు నీకు సంప్రాప్తించియేయున్నవి. ఇంకొక విషయమేమనగా, నావలన పొందగోరు నభిలాషలన్నియును, సాంసారికకామనలవలె, బంధనమందు పడవేయునట్టివిగావు. కాకపోగా, అవి యట్టి సమస్త సాంసారికకామనల నుండియు జీవునివిముక్తి నందించును. ప్రియా, నీకు పతియందుగల ప్రేమను, నీపాతివ్రత్యమును నేను చక్కగా గ్రహించితిని. వ్యంగ్యముగ మాటలాడి, నిన్ను విచలితురాలనుగా చేయదలచితిని. కాని నీబుద్ధి నానుండి కొంచెముగూడ చలించలేదు. నేను మోక్షమునకు ప్రభువును. లోకులను సంసారసాగరమునుండి తరింపజేయుదును. సకాలములై జీవులనేక

విధములగు వ్రతములను తపస్సులను జేయుచు దాంపత్య జీవనమందలి విషయ సుఖాభిలాషచే నన్ను సేవించుచుందురు. వారు నా మాయచే మోహింపబడిన వారలు, నేను మోక్షమునకు, అటులనే సర్వసంపదలకు గూడ ఆశ్రయుడను, అధీశ్వరుడను గూడ. అట్టి పరమాత్మనగు నన్ను పొందిగూడ, కేవల విషయసుఖసాధన సంపత్తులనే యభిలషించుచు, నాపరాశక్తిని గోరనట్టివారు నిజముగా మందభాగ్యులు. ఏలననగా, విషయసుఖములు, నరకమందును, నరకముతో సమానమగు కుక్క పంది జన్మలయందుగూడ ప్రాప్తించవచ్చును. కాని వారి మనస్సులు విషయములందే లగ్నమైయుండుటచేత వారికి నరకమున కేగుటయే మంచిదిగా గానుపించును.

ప్రాణేశ్వరీ నీవు యింతవరకు, నిరంతరము సంసారబంధమునుండి విముక్తి కలిగించునట్టి, నా సేవనే చేయుచుండుట, యెంతయు నానందకరమగు విషయము. దుష్టులగు జీవులిట్లెన్నటికిని చేయజాలకయుందురు. నింద్యములగు కోరికలచే నిండి యుండునట్టి చిత్తములుగల స్త్రీలు, యింద్రియ తృప్తియందే నిమగ్నులై యుండు కారణముచేత అనేకములగు కపటవ్యూహముల రచించుచుందురు. అట్టి వారు నన్ను సేవించుట చాలాకష్టము. మాగృహములందు, నీతో సమానముగ ప్రేమించునట్టి భార్య మరియొకతెగానరాదు. ఏలననగా, నన్ను చూడనుగూడ లేనట్టి సమయమందు, కేవలము నా ప్రశంసలువిని, ఆ సమయమందు గూడ నీ వివాహము కొరకై విచ్చేసి యున్న రాజులందరిని యుపేక్షించి, బ్రాహ్మణునిద్వారా నాకు రహస్య సందేశమంపియుంటివిగదా! నిన్నపహరించుకొని పోవునపుడు, నీయన్నను యుద్ధములో జయించి యాతనిని విరూపునిజేసి యుంటిని. అనిరుద్ధుని వివాహసమయమందు బలరాముడాతనిని చంపనే చంపినాడు. కాని మాతో వియోగమెక్కడ కలుగునోయను శంకచే నీవు దుఃఖమునంతయు మ్రింగి మౌనముగ నుండిపోయితివి. నాతోనొక్క పల్లెత్తుమాటయు ననక మిన్నకుంటివి. నీయీ యుదారగుణముచేతనే నేను వశుడనైపోతిని. నీవు నన్ను పొందుటకై దూతద్వారా నాకు గుప్తసందేశమంపియుంటివి కాని నేను వచ్చుటలో కొంచెము జాప్యము జరిగినది. దానిచే నీకు ప్రపంచమే శూన్యముగా గానుపించునది. ఆ సమయమందు, నీయీ సర్వాంగసుందరమగు శరీరము యితరునికెవరికిని యోగ్యముగాదను భావముతో శరీరమునే త్యజింప సమకట్టితివి గదా! ఆ నీ ప్రేమభావమును నీయందే యుంచుకొనుము. దాని ఋణము మేము తీర్చుకొనలేము. సర్వోత్తమమగు నీ ప్రేమ భావమునభినందించుట మాత్రము చేసెద" నని పల్కె.

ఆత్మారాముడు, జగదీశ్వరుడునగు భగవానుడు మనుజునివలె లీలలొనర్చుచుండునపుడు, దాంపత్య ప్రేమను వృద్ధిపరచునట్టి వినోదభరితములగు హాస్యాలాప

ములనుగూడ చేయుచుండును. ఈ విధముగ మహాలక్ష్మిస్వరూపిణియగు రుక్మిణితో నాతడు విహరించుచుండెె. అతడిటులనే యితర భార్యల గృహములందుగూడ, గృహస్థునివలెనుండుచు. గృహస్థధర్మముల నెరవేర్చుచుండెె.

# అరువది యొకటవ యధ్యాయము

## భగవానుని సంతతి వర్ణనము—అనిరుద్ధ వివాహమున రుక్మి వధ

శ్రీకృష్ణభగవానుని భార్య లొక్కొక్కరికి పదిమంది మగపిల్లలు కలిగిరి. వారందరును, రూపబలాదిగుణములందు జనకునితో సమానముగ నుండిరి భార్య లందరును, తమ భర్త తమ యిల్లు వదలి వెళ్ళుట లేదనియే భావించుచుండిరి. తమ వద్దనే యాతడుండుటచే యెవరికి వారు, భార్యలందరిలో తామే గొప్పవారమని భావించుచుండిరి. నిజము చెప్పవలెనన్నచో, వారికి, తమ పతియగు భగవానుని తత్త్వము, అతని మహిమ తెలియకున్నవి. ఆ సుందరులు, ఆత్మానందైకరసస్థితుడగు శ్రీకృష్ణుని కమలకోశమువలె సుందరమగు ముఖమును, విశాల బాహువులు, ఆకర్ణాయత నేత్రములు, ప్రేమ భరితమగు మధుర మందహాసము, రసమయమగు కటాక్ష వీక్షణము, మధుర వాక్కులచే స్వయముగా మోహితులై పోవుచుండిరి. శృంగార సంబంధములగు తమ హావభావ విలాసములచేత నతని మనస్సును తమ వైపున కాకర్షించుకొనలేక పోవుచుండిరి. అతని భార్యలు పదునారు వేలకు పైబడి యుండిరి. హావభావములచే పరిపూర్ణములగు, తమ మందహాసములచేతను, క్రీగంటి చూపులచే గూడిన మనోహరములగు కనుబొమల (కదలికల) సంకేతము చేతను, ప్రేమబాణముల ప్రయోగించుచునే యుండిరి.కాని,యే విధముగను, యెట్టి సాధనలచే గూడ, వారు భగవానుని మనస్సునందు, యింద్రియములందు చంచలత్వమును కలిగించలేకపోయిరి. బ్రహ్మాది దేవతలు గూడ, భగవానుని యథార్థ స్వరూపమును గాని, స్వరూప ప్రాప్తికి సాధనమగు మార్గమునుగాని, తెలియకున్నారు. అట్టి రమా రమణుని, యా స్త్రీలు తమ పతి రూపమున పొందియున్నారు. వారి ప్రేమ, ఆనందములు, నిరంతరమభివృద్ధి పొందుచునే యున్నవి. వారు ప్రేమ భరితములగు మందస్మితముల చేతను, మాధుర్య వీక్షణముల చేతను, నవ సమాగమలాలసాదులచేతను, భగవానునికి సేవ జేయుచుండిరి. ఆ పత్నులకు సేవచేయుట కొక్కొక్కరికి వందల కొలది దాసీ జనములుండిరి. అయినను భగవానుడు తమ గృహమునకు విచ్చేసినపుడు, వారు [భార్యలు] స్వయముగ యెదురేగి, యాదర పూర్వకముగ నాతనిని లోనికి గొని వచ్చి, యున్నతాసనమందు గూర్చుండబెట్టి, చరణ కమలముల కడిగి,

యుత్తమ సామగ్రులచే పూజించి, తాంబూలము సమర్పించి, పాద సంవాహన మొనర్చి యాతని శ్రమను పోగొట్టుచుండిరి. విసన కర్రలతో వీచుచు, అత్తరు సువాసన తైలములను చందనమును పూయుచు, పూలహారముల ధరింపజేయుచు కేశసంస్కారము చేయుచు, నిదుర బుచ్చుచు స్నానము చేయించుచు, వివిధములగు రుచ్య పదార్థములతో గూడిన భోజనము బెట్టుచు,తమ చేతులతో నేయాతనికి సేవలు జేయుచుండిరి.

"పరీక్షిన్మహారాజా, భగవానుని ప్రత్యేక పత్నికిని పదిమంది పుత్రులు గల్గిరని చెప్పియుంటిని గదా. వారిలో నెనిమిది మంది పట్టపు రాణులు. వారి వివాహముల గూర్చి యిదివరలో నీకు చెప్పియుంటిని. ఇపుడు వారికి గలిగిన ప్రద్యుమ్నాది కుమారుల గురించి చెప్పెద వినుము.

రుక్మిణీదేవికి గలిగిన పదిమంది పుత్రులెవ్వరనగా:- ప్రద్యుమ్నుడు, చారుదేష్ణుడు, సుదేష్ణుడు, చారు దేహుడు, సుచారుడు, చారుగుప్తుడు, భద్రాచారుడు, చారుచంద్రుడు, విచారుడు, చారుడు, ననువారలు. వారు తమ తండ్రియగు గోవిందున కెందునను తీసిపోకుండ నుండిరి.

సత్యభామకు గూడ పదిమంది పుత్రులు గలిగిరి. భానుడు, సుభానుడు,స్వర్భానుడు, ప్రభానుడు, భానుమానుడు, చంద్రభానుడు, బృహద్భానుడు, అతిభానుడు, శ్రీభానుడు, ప్రతిభానుడు ననువారలు.

జాంబవతీ సంతానము : సాంబుడు, సుమిత్రుడు, పురజితుడు, శతజితుడు, సహస్రజితుడు, విజయుడు, చిత్రకేతుడు, వసుమానుడు, ద్రవిడుడు, క్రతుడు ననువారలు.

నాగ్నజితీసత్యాదేవి సంతానము : వీరుడు, చంద్రుడు, అశ్వసేనుడు, చిత్రగుడు, వేగవానుడు, వృషుడు, ఆముడు, శంకుడు, వసుడు, కున్తి యనువారలు.

కాళిందీదేవి తనయులు : శ్రుతుడు, కవి, వృషుడు వీరుడు, సుబాహుడు, భద్రుడు, శాంతి, దర్శుడు, పూర్ణమానుడు, సోమకుడనువారలు.

మద్రదేశరాకుమారియగు లక్ష్మణాదేవి కుమారులు : ప్రఘోషుడు, గాత్రవానుడు, సింహుడు, బలుడు, ప్రబలుడు, ఊర్ధ్వగుడు, మహాశక్తి, సహుడు, ఓజుడు, అపరాజితుడనువారలు.

మిత్రవిందాదేవిసుతులు ; వృకుడు, హర్షుడు, అనిలుడు, గృధ్రుడు, వర్ధనుడు, అన్నాదుడు, మహాశుడు, పావనుడు, వహ్ని, క్షుధియను వారలు.

భద్రాదేవి పుత్రులు ; సంగ్రామ జిత్తు, బృహత్సేనుడు, శూరుడు, ప్రహరణుడు, అరిజిత్తు, జయుడు, సుభద్రుడు, వాముడు, ఆయుడు, సత్యకుడు ననువారలు.

ఈ పట్టపురాణులుగాక భగవానునకు రోహిణి మొదలుగాగల పదునారువేల నూరు మంది పత్నులుండిరి. వారికి దీప్తిమానుడు, తామ్రతప్తుడు మొదలుగాగల

పది-పది మంది కుమారులుదయించిరి. రుక్మిణీ నందనుడగు ప్రద్యుమ్ననకు రతీ దేవి యవతారమగు మాయావతిగాక, భోజకట నివాసియగు రుక్మి తనయయగు రుక్మవతి యను కన్యతో గూడ వివాహము జరిగినది. ఆమె గర్భమందే పరమబల శాలియగు ననిరుద్ధుడుదయించినాడు. శ్రీకృష్ణ పుత్రుల తల్లులే పదునారు వేలకు మించి యుండుటచే వారి పుత్రులు, పౌత్రుల సంఖ్య కోట్లకు చేరినది." అని శ్రీశుకులు చెప్పగా విని పరీక్షిత్తిటుల ప్రశ్నించె.

"స్వామీ, రణభూమియందు శ్రీకృష్ణుడు రుక్మినవమానము జేసియుండెగదా. వాడాఖేదమును మరువక, సమయము చిక్కినపుడు శ్రీకృష్ణునంత మొందించి తన పగదీర్చుకొనదలచియుండగా, తన కన్యయగు రుక్మవతిని, తన శత్రుపుత్రుడగు ప్రద్యుమ్ననికిచ్చి పెండ్లిచేయుట యెట్లు తటస్థించినది? దయయుంచి చెప్పుడు. ఇరువురు శత్రువుల (శ్రీకృష్ణ-రుక్మి) మధ్య మరల పరస్పర వైవాహిక సంబంధమెట్లు కుదిరినది? మీరేవిషయమును గూడ దాచకుండ చెప్పుచుంటిరి. మీకే విషయము తెలియకుండనుండదు. ఏలననగా, యోగిజనులకు భూత భవిష్యద్వర్తమానములకు సంబంధించిన యన్ని విషయములును తెలిసియుండును. ఇంద్రియాతీతములైనట్టియు, చాలదూరమందున్నట్టియు, లేక మధ్యలో నేవైన యడ్డంకులుండుటచే గానరానట్టియు, సర్వవిషయములును, వారికి తెలియరాకుండనుండవు." అని ప్రశ్నించిన రాజుతో, శ్రీశుకులిట్లు పల్కిరి.

"రాజా, ప్రద్యుమ్నుడు మూర్తీభవించిన కామదేవుడు. అతని యందమునకు కల్యాణగుణముల కాకర్షితయై, రుక్మవతి, స్వయంవరమందాతని మెడలో పూల మాలవైచినది. ప్రద్యుమ్నుడేకాకిగనే యచటజేరియున్న రాజులందరిని జయించి, రుక్మవతిని హరించినాడు. శ్రీకృష్ణునిచే నవమానితుడైన కారణముచేత, రుక్మి యొక్క క్రోధాగ్ని యింకను చల్లారకున్నను, యింకను వైరమునేబూనియున్నను, తన చెల్లెలగు రుక్మిణికి సంతోషము కల్గించుటకై యతడు, తన మేనల్లుడగు ప్రద్యుమ్ననకు తనకూతురినిచ్చి వివాహమొనర్చినాడు.

పదిమంది పుత్రులయనంతరము రుక్మిణీదేవికి పరమసుందరియగు చారుమతి యనుకొమరిత గూడ కలిగినది. కృతవర్మకుమారుడగు బలియను నతనితో నామె వివాహము జరిగినది.

శ్రీకృష్ణభగవానునితో రుక్మికి పూర్వవైరమున్నప్పటికిని, తన చెల్లెలైన రుక్మిణికి సంతోషము కల్గించుటకే యాతడు తన పౌత్రియగు రోచనయనుకన్యను, రుక్మిణీపౌత్రుడును, తనకు దౌహిత్రుడునగు అనిరుద్ధునకిచ్చి వివాహము జరిపించి నాడు. ఈ ప్రకారము వివాహములు చేయుట ధర్మసమ్మతములుగావని రుక్మికి తెలిసియున్నప్పటికిని, రుక్మిణీదేవియందు గల తన సోదరప్రేమచే నతడట్లొనర్చి నాడు,

అనిరుద్ధుని వివాహమహోత్సవమునందు పాల్గొనుటకై, శ్రీకృష్ణ బలరాములు, ప్రద్యుమ్నుడు, సాంబుడు మొదలుగాగల యాదవ వీరులందరు భోజకటమునకు చేరినారు. వివాహమహోత్సవము నిర్విఘ్నముగ నెరవేరినది. అప్పుడు కళింగ రాజు మొదలగు గర్వితులగు రాజులు రుక్మితో, "నీవు బలరామునితో పాచికలాడి గెలువుము. బలరామునకాయాట బాగుగా తెలియదు. కాని యాటయందాతనికి వ్యసనము మెండుగా నుండును" అని ప్రేరేపించిరి. వారిచే ప్రోత్సహించబడినవాడై రుక్మి బలరాముని యాట కాహ్వానించె. అక్షక్రీడ జరుగుచున్నది. బలరాముడు మొదట నూరు, వేయి పదివేలు మొహరీలను పందెముగా, వరుసగా నాడినాడు. వాని నన్నిటిని రుక్మి గెలిచినాడు. రుక్మి గెలువగా, కళింగ నరేశుడు పండ్లిగిలించుచు నవ్వినాడు. పరిహాసముగ మాటలాడుచు బలరాముని గాంచి యెకసక్కెములాడినాడు. బలరాముడది సహించలేకపోయినాడు. కొంచెము క్రోధముగల్గినది. ఆ తరువాత రుక్మి లక్ష మోహరీలను పణముగా నుంచగా, దానిని బలరాముడు గెలుచుకొనియె. కాని ధూర్తుడగు రుక్మి, మోసముతో తానే గెల్చితినని వాదించె. పర్వకాలమందు (పూర్ణిమనాడు) సముద్రముక్షుభితమగునట్లు, బలరాముడు కోపముచే క్షోభిల్లినాడు. స్వాభావికముగనే యెర్రనగు బలరాముని నేత్రములు, కోపాధిక్యతచే, మఱింత యెర్రనైనవి. పదికోట్ల మొహరీలనాతడు పందెముగా బెట్టినాడు. ద్యూతనియమానుసారముగ నీమారుగూడ బలరాముడే గెలిచినాడు. కాని రుక్మి మోసముతో తానే గెల్చితిని అని ప్రకటించుచు, "యీ విషయములో విశేషజ్ఞులగు కళింగ రాజు మొదలగు సభాసదులు నిర్ణయించెదర"ని పలికె. అప్పుడాకాశవాణి "ధర్మ పూర్వకముగా చెప్పవలసి వచ్చుచో, బలరాముడే యీ పందెమును గెలిచినాడు, రుక్మి చెప్పునది శుద్ధాబద్ధమని వచించినది.

రుక్మి తలపై మృత్యు దేవత నాట్యమాడుచున్నందునను, అతని సహచరులగు దుష్టరాజన్యుల ప్రబోధనచేతను ఆకాశవాణి పలుకులను పెడచెవినిబెట్టి, బలరాముని పరిహసించుచు "బలరామా, మీరందరు వనములందు దిరుగాడు గొల్లవారు. మీకి యక్షక్రీడ యేమి తెలియును? పాచికలతోగాని, బాణములతోగాని రాజులగువారు మాత్రమే యాడగలరుగాని మీవంటివారు గాదు" అని యెక సక్కెమాడినాడు. ఈ విధముగా రుక్మి యాక్షేపము చేయుటయు, దానిపై రుక్మి యనుచరులగురాజులు పరిహాసము చేయుటయు జరుగగా, బలరాముడు క్రోధముతోమండిపడుచు ముద్గరముగైకొని, రాజ సభయందే రుక్మిని సంహరించినాడు. పండ్లిగిలించి నవ్విన కళింగనరేశుడు పారిపోవుచుండగా, బలరాము డాతని బట్టుకొని పండ్లూడగొట్టి, ఇతర రాజులనుగూడ బలరాముడు తనముద్గరముచే మోది క్షతగాత్రులగావించినాడు. వారందరురుధిరోక్షితులై, మహాభయముతో నట నుండి పారిపోయిరి.

బలరాముని సమర్థించినచో రుక్మిణీ కప్రియము కల్గును. రుక్మిని వధించుట యక్రమ మని నుడివినచో బలరామునకు కోపము వచ్చునను శంకతో శ్రీకృష్ణుడు దేమియు పలుకక మౌనము వహించినాడు. అనిరుద్ధుని వివాహము రుక్మి వధయను రెండు ప్రయోజనములు సిద్ధించిన పిదప, యాదవులందరును నూతన వధూవరుల వెంట నిడుకొని, భోజకటమునుండి ద్వారకా నగరము చేరిరి.

# అరువది రెండవ యధ్యాయము

## ఉషా-అనిరుద్ధుల సమాగమము

"శుకయోగీశ్వరా, యదు వంశ శిరోమణి యగు అనిరుద్ధుడు బాణాసురుని పుత్రికయగు ఉషాదేవిని పాణిగ్రహణ మొనర్చుకొనియెనని, ఆ సందర్భంలో శ్రీకృష్ణునకు శంకరునితో గొప్పయుద్ధము జరిగెననియు వినియుంటిని. దయయుంచి యా విషయము వివరింప గోరెద"నని వేడిన పరీక్షిన్న రేంద్రునకు శ్రీశుకయోగి యిట్లు చెప్పె"

"రాజా, మహాత్ముడగు బలిచక్రవర్తి కథను నీవు వినియుంటివిగదా! వామన రూపముతో వచ్చిన జనార్దనున కాతడు సర్వస్వము సమర్పించినాడు. అతనికి నూర్గురు తనయులు. వారిలో పెద్దవాడు బాణాసురుడు. అతడెల్లపుడును శివభక్తిలో నిమగ్నుడై యుండెడివాడు. అతడు మాన్యుడు, వదాన్యుడు, ధీమంతుడు, సత్య సంధుడు దృఢవ్రతుడునై రమణీయమగు శోణిత పురమునందు రాజ్యము చేయుచుండె. భగవానుడగు శంకరుని కృపచే యింద్రాది దేవతలుగూడ నతనికి కింకరులై యుండిరి. బాణునకు వేయి భుజములుండినవి. ఒకనాడా బాణుడు, శివుడు తాండవము చేయు సమయమున, తన వేయి చేతులతో వివిధములగు వాద్యములను వాయించి శివునికి సంతోషము గల్పించె. శంకర భగవానుడు, భక్తవత్సలుడు, శరణాగత రక్షకుడు, సర్వభూతేశుడు అతడు బాణునితో, "నీ కిష్టము వచ్చిన వరము గోరుకొమ్మ"ని పలుక, "స్వామీ, మీరు నా నగరమును రక్షించుచు నుండు డని కోరినాడు.

బలదర్పితుడైన బాణుడొకనాడు తన సమీపమందున్న శంకరునకు సాష్టాంగ దండ ప్రణామమొనర్చి, "దేవాధిదేవా, సమస్త చరాచర జగత్తునకు నీవు గురుడవు. యీశ్వరుడవునగు నీకు నమస్కరించుచున్నాను. కోరికలు దీరనివారికి కోరికలు దీర్చు కల్పవృక్షము వంటివాడివి. నీవు నాకు వేయి భుజములు ప్రసాదించియుంటివి. అవి నాకు కేవలము భారరూపముగనే యున్నవి. ఏలననగా, ముల్లోకములందు గూడ, నీవుదక్క, నాతో సమానముగ యుద్ధము చేయు వీరయోధుడగుపించుటయే

లేదు. నా భుజముల కండూతి (దురద) తీర్చుకొనుటకై నేను దిగ్గజములందరి కేగగా, నవి నాకు భయపడి పాఱిపోయినవి. నా భుజముల తాకిడికనేక పర్వత శిఖరములు విరిగిపోయినవి'' అని పలుకగా, నతని గర్వరూప ప్రార్థనకు శివున కొకింత కోపముకల్గి; "ఓరీ, మూఢుడా, నీ రథపెక్కెుమెప్పుడు విరిగిపడునో యప్పుడు నాతో సమానుడగు వీరునితో నీకు యుద్ధము సంభవించును. నీగర్వము ఖర్వమగు" నని పలికె. శంకరుని మాటలకాకుమతియగు బాణునకు సంతోషము కలిగినది. తన గృహమునకు వెడలిపోయి యా శంకరుడు సూచించిన యుద్ధము సంభవించునట్టి శుభసమయమునకై యెదురు చూచుచుండె.

బాణాసురునికొక కుమార్తె యున్నది. ఆమె పేరు 'ఉషాదేవి'. ఆమెకొక నాటిరాత్రి స్వప్నమందు, తాదినివరకెన్నడును చూడనట్టి యనిరుద్ధునితో క్రీడసల్పి నట్లు కల వచ్చినది. స్వప్నమందే "ప్రాణేశ్వరా, నీవెక్కడ నుంటివ"ని పలుకుచు లేవగా కల చెదిరిపోయినది. మెలకువ వచ్చినది. ఆమె మనస్సంతయు వికలమై పోయినది. తాను చెలికత్తెల మధ్యనే యుండుట జూచుకొని సిగ్గిల్లినది బాణాసురుని మంత్రియగు కుంభాండునికి, చిత్రలేఖయను నొక కన్య యుండినది. ఉషాదేవికి చిత్రలేఖకు సన్నిహితమగు స్నేహము. కుతూహలముతో చిత్రలేఖ ఉష నిట్లు ప్రశ్నించినది. "రాకుమారీ, నీకింతవరకు వివాహము జరుగలేదు. మఱి నీవెవరి కొరకు వెదకుచుంటివి! నీ మనోరథమెట్టిదో తెలుపుము" అని యడిగిన చిత్రలేఖకు రాకుమారి యిటుల చెప్పసాగినది.

"సఖీ, స్వప్నమందే నేనొక మనోహరాకారుడగు నవయువకుని గాంచితిని. అతని శరీరము శ్యామలవర్ణములతో నున్నది.నేత్రములు కమలదళములవలెనున్నవి. పీతాంబరము ధరించియున్నాడు దీర్ఘబాహువులుగలిగి, స్త్రీల చిత్తములు హరించు నట్టి యందము గలిగియున్నాడు అతడు. మొదట నాకతడుతన మధురాధరామృత మును పానము చేయించుచునేయుండగా,నేనింకను పూర్తిగా పానము చేయక మునుపే నన్ను దుఃఖములో ముంచి యెటకేగెనో తెలియరాదు. ఆ ప్రాణవల్లభుని కొరకే తహతహలాడుచు నేను వెదకుచుంటి"నని పలుక, చిత్రలేఖ యిట్లనియె.

"సఖీ, నీ చిత్తచోరుడు ముల్లోకములందెక్కడ యున్నను, నీవాతని గుర్తు బట్టగలిగిన యెడల, నేను నీ విరహవ్యథను శాంతింప జేయగలను. ఆతడెక్కడ యున్నను నేనాతనిని నీ చెంత జేర్చగలను. నీ ప్రాణవల్లభుని గుర్తించి నాకు తెలుపుము. నేను చిత్రములు చూపెదను" అని పల్కుచు, మాటలలోనే చిత్రలేఖ, యనేక దేవతలయొక్కయు, గంధర్వులయొక్కయు, సిద్ధ, చారణ, పన్నగ, దైత్య, విద్యాధర యక్ష మానవుల చిత్రపటములు లిఖించి చూపినది. మనుష్యు లందు శూరసేనునియొక్కయు, వసుదేవునియొక్కయు, రామకృష్ణుల పటములను చూపినది. ప్రద్యుమ్నుని చిత్రమును జూచి, ఉష కొంచెము సిగ్గుపడినది. పిమ్మట

ననిరుద్ధుని పటము జూడగనే పూర్తిగా సిగ్గుతో తలవంచుకొన్నది. మందస్మిత మొనర్చుచు, ఇతడే నా ప్రాణవల్లభుడ"ని చెలికి చెప్పినది

చిత్రలేఖ యోగశక్తులు గలది. ఆ సుకుమారుడు శ్రీకృష్ణ భగవానుని పౌత్రుడని గ్రహించినది. రాత్రికి రాత్రే యాకాశమార్గాన, శ్రీకృష్ణ రక్షితమగు ద్వారక కేగినది చిత్రలేఖ. అనిరుద్ధుడచట సుందర పర్యంకమందు నిదురించు చున్నాడు. యోగసిద్ధి ప్రభావముచేత, నిదురించుచున్న యనిరుద్ధుని, శోణితపుర మందలి యుషాదేవి యంతఃపురమును జేర్చి యామెకాతని దర్శనము కలిగించినది. ప్రాణవల్లభుని దర్శించిన యుషాదేవి ముఖకమలమానందోద్రేకముచే ప్రఫుల్లిత మైనది, తన యంతఃపురమునందే యామె యనిరుద్ధునితో స్వేచ్ఛగా విహరించ సాగినది, ఆమె యంతఃపురమత్యంత సురక్షితము. పురుషుడెవడటువైపు చూచుట కైనను వీలులేదు. వారిప్రేమ దినదినాభివృద్ధి గాంచసాగినది. సర్వాలంకారములచే ననిరుద్ధుని పూజించుచు, ప్రీతికరములగు భోజన పదార్థములచేతను,మధురములగు వాక్కులతోడను అతనిని సంతృప్తుని గావించుచు, సేవించుచుండె. ప్రేమచే నామె యతని మనస్సును వశము గావించుకొనియె. అనిరుద్ధుడామె యంతఃపురమునందు గుప్తముగా నుండి, తనను తాను మఱచిపోయినాడు. తానచటికి వచ్చి యెన్నిదినము లైనదిగూడ యాతనికి గుర్తులేకుండ బోయినది.

యాదవకుమారుని సహవాసముచే యుషాదేవి కన్యాత్వము భంగమైనది. ఆమె శరీరముపై దౌహృదలక్షణములు ప్రస్ఫుటముగ గోచరింపసాగినది. ఉషాదేవి మాత్రమానందముగనే యున్నది. కాపలావారు ఆమెకు పురుష సంబంధముకలిగి యున్నట్టులనుమానించినారు. వారు బాణాసురుని వద్దకేగి, "రాజా, రాజకుమారి యందు కులదూషణములగు లక్షణములను మేము గమనించితిమి. మేమహర్నిశలు చాల జాగరూకతతో నంతఃపురమునందు కావలి గాయుచునే యుంటిమి. బయటి పురుషుడెవ్వడును మీ కుమార్తెవంక జూచుటకు వీలేలేదు. అట్టిచో యీ కళంక మెటుల సంభవించినదో, దీనికి కారణమేమో మా బుద్ధికి తెలియరాకున్నద"ని విన్నవించిరి.

కాపలావారివలన, తన కుమార్తెయొక్క కన్యాత్వము దూషితమైనదని విన్న బాణాసురుని హృదయము మహావ్యథ చెందినది వెంటనే యాతడు కన్యక యొక్క యంతఃపురమునకేగగా నతనికక్కడ యనిరుద్ధుడగుపడినాడు. అని రుద్ధుడు, సాక్షాత్తు కామావతారుడగు ప్రద్యుమ్నుని కుమారుడు ముల్లోకములం దును, అతనితో సమానుడగు సుందరాకారుడు మఱియొకడు లేడు. నీలమేఘ శ్యామల శరీరముతో, పీతాంబరముతో, కమలదళములవంటి విశాల నేత్రములతో దీర్ఘబాహువులతో, వక్రాలకములతో, కటకకుండలములతో, మందస్మిత వదన ముతో, నతని సౌందర్యమపురూపముగ నున్నది. మెడయందు పుష్పహారములు

వ్రేలాడుచున్నవి. ఉషాదేవియొక్క యంగసంగముచే నతని వక్షఃస్థలము కుంకుమాంకితమై యున్నది. అతడా విధముగ నుషాదేవియొద్దనే గూర్చుండియుండుటను గాంచిన బాణాసురుడాశ్చర్య చకితుడైనాడు. సైన్యసహితముగ నాయుధధారియై యంతఃపురమునకు దూసుకొని వచ్చిన బాణాసురుని గాంచగనే, యనిరుద్ధుడొక పరిఘను గైకొని, కాలదండమును గైకొనియున్న యమునివలె నిలువబడియె. బాణునివెంట వచ్చిన సైనికులాతని బట్టుటకై ప్రయత్నింపగా నతడు వారినందరిని వధించినాడు. తన సేననంతను సంహరించుచున్న యనిరుద్ధుని గాంచిన బాణాసురుడు, క్రోధోద్రిక్తుడై యాతనిని నాగపాశములతో బంధించి చెరయందుంచినాడు. తన ప్రియతముడు బంధితుడాయెనని విన్న యుషాదేవి యత్యంత దుఃఖితయై, కన్నీరు మున్నీరుగా నేడ్చుచునుండిపోయినది.

# అరువది మూడవ యధ్యాయము

## శ్రీకృష్ణునితో బాణాసురుని యుద్ధము

వర్షాకాలపు నాలుగు మాసములు గడచినవి. అనిరుద్ధుని బంధువులకాతని జాడ తెలియలేదు. బంధువులందరు శోకాకులితులైనారు. ఒకనాడు నారదుడు విచ్చేసి, వారికి, అనిరుద్ధుడు శోణితపురమునకేగుటయు, నచటనతడు బాణాసుర సైనికుల నిర్జించుటయు, బాణాసురుడాతనిని నాగపాశబద్ధుని గావించుటయు మొదలుగా గల సర్వవిషయములను, దెలిపినాడు. శ్రీకృష్ణుని తమ యారాధ్యదైవముగ భావించునట్టి యాదవులందరును శోణితపురముపై దండయాత్ర గావించిరి. శ్రీకృష్ణబలరాములతోపాటు వారి యనుచరులగు, ప్రద్యుమ్న, సాత్యకి, గద, సాంబ, సారణ, నంద, ఉపనంద భద్రాదులందరు, పన్నెండక్షౌహిణుల సైన్యముతో వ్యూహమును రచించి, బాణాసురుని రాజధానిని నాలుగువైపుల ముట్టడించిరి. నగరమందలి యుద్యానవనములను, ప్రాకారములను, బురుజులను, సింహద్వారములను యాదవ సైన్యములు ధ్వంసము చేయుచుండుటను గాంచిన బాణాసురుడు, కోపముచే గంపించుచు, నతడుగూడ పన్నెండక్షౌహిణుల సైన్యము దీసుకొని యుద్ధసన్నద్ధుడై నగరము వెలువడినాడు. బాణాసురుని పక్షమున సాక్షాత్తు శంకరభగవానుడు వృషభవాహనారూఢుడై తన కుమారులగు కార్తికేయ గణపతి సహితముగ యుద్ధభూమికేతెంచి, బలరామకృష్ణులతో యుద్ధమొనర్చె: ఇరువాగుల వారికి తుములమగు యుద్ధము జరిగినది. శ్రీకృష్ణునితో శంకర భగవానుడు, ప్రద్యుమ్నునితో కార్తి

కేయుడు, బలరామునితో కుంభాండకుడు కూపకర్ణుడు, బాణాసురుని పుత్రునితో సాంబుడు, స్వయముగ బాణాసురునితో సాత్యకియు పోరుచుండిరి. బ్రహ్మాది దేవతలు, ఋషులు, మునులు, సిద్ధచారణులు, గంధర్వులు, అప్సరసలు, యక్షులు మొదలగు వారందరును యంతరిక్షమందు విమానములపై నుండి, యుద్ధమును తిలకించుచుండిరి. శ్రీకృష్ణుడు తన బాణములచే శంకరుని యనుచరులగు, భూత, ప్రేత, ప్రమథ, గుహ్యక, డాకినీ,యాతుధాన, బేతాళ, వినాయక, ప్రేతగణ మాతృగణ, పిశాచ, కూష్మాండ, బ్రహ్మరాక్షసుల నందరిని, గొట్టి, పారద్రోలినాడు. పినాకపాణియగు శంకరుడుగూడ వివిధ శస్త్రాస్త్రములను శ్రీకృష్ణునిపై ప్రయోగించగా, యెట్టివిస్మయమునొందక గోవిందుడు ప్రత్యస్త్రముల ప్రయోగించి వానిని శాంతింపజేసె. బ్రహ్మాస్త్రమును శాంతింపజేయుటకు, బ్రహ్మాస్త్రమును, వాయువ్యాస్త్రమునకు పార్వతాస్త్రమును, ఆగ్నేయాస్త్రమునకు పర్జన్యాస్త్రమును, పాశుపతాస్త్రమునకు నారాయణాస్త్రమును ప్రయోగించినాడు. అనంతరము జృంభణాస్త్రముచే (దానిచే ఆవలింతలు వచ్చును) శ్రీకృష్ణుడు శంకరునిమోహితునిగావించె. దానితో శంకరుడావలించుచు యుద్ధవిరతుడై యుండగా, శ్రీకృష్ణుడాయదను చూచి, గదా, ఖడ్గ, బాణములచే బాణాసుర సైన్యమును సంహరింప సాగినాడు. ప్రద్యుమ్నుడు బాణవర్షము గురిపించి, కార్తికేయుని గాయపరచగా, నతని యంగములన్నియు రక్తసిక్తములైపోవ, నతడు రణాంగణము వీడిపోయె. బలరాముడు ముసలాయుధముచే కుంభాండక కూపకర్ణులను గొట్టగా వారు రణరంగమున బడిపోయిరి· సేనాపతులందరు పడిపోవగా, బాణాసురుని సేనయంతయు నస్తవ్యస్తమై పలాయన మొనర్చినది.

తన సేన చిన్నాభిన్నమగుట గాంచిన బాణాసురునకు మహాక్రోధము కల్గినది. ఆతడు సాత్యకిని వదిలి శ్రీకృష్ణునిపై లంఘించినాడు. రణోన్మత్తుడైన బాణుడు తన వేయి హస్తములతో నొకేసారి యైదువందల ధనుస్సులగొని ధనుస్సొక్కంటిపై రెండేసి బాణములను సంధించినాడు. కాని గోవిందుడాధనుస్సు లన్నింటి నొకేమారు ఖండించి, సారధిని అశ్వములను గూడ సంహరించి, పాంచ జన్యమును పూరించె. బాణాసురుని తల్లియగు కోటరయనునామె, పుత్రుని ప్రాణముల రక్షించుకొనదలచినదియై, జుట్టువిరియ బోసుకుని నగ్నముగా వచ్చి శ్రీకృష్ణుని యెదుట నిలిచినది. ఆమెను జూడజాలక యాతడు తన మొగమావలకు మరలించె. ఆ సమయము జూచుకొని, విరధుడై యున్న బాణుడు నగరమును ప్రవేశించె.

అచట శంకరుని భూతగణములు యిటునటుపారిపోవగా, శంకరుడు పంపిన, మూడు తలలు మూడు పాదములు గలిగిన శైవజ్వరము దశదిశలను దహించుచున్నదానివలె శ్రీకృష్ణుని వైపు పరుగిడినది. శ్రీకృష్ణుడది గాంచి దాని నెదుర్కొ

నుటకై తన వైష్ణవజ్వరమును ప్రయోగించినాడు. శైవ వైష్ణవ జ్వరములు ఘోర ముగా పోరసాగినవి. వైష్ణవజ్వరము యొక్క ధాటికి శైవజ్వరమాగలేకపోయి, పీడితయై యాక్రోశింపసాగినది. వేరుగతిలేక, భయభీతయైన శైవజ్వరము వినయ ముగ చేతులు జోడించి, శ్రీకృష్ణ భగవానుని శరణంది యిటుల స్తుతించ ప్రారంభిం చినది.

"ప్రభూ! నీ శక్తి యనంతము. నీవు బ్రహ్మాది దేవేశ్వరుల కందరికి పరమ మహేశ్వరుడవు. సర్వాత్ముడవు. సర్వస్వరూపుడవు. నీవద్వితీయుడవు. కేవల జ్ఞాన స్వరూపుడవు. సృష్టి స్థితిలయములకు నీవే కారణుడవు. శ్రుతులద్వారా నీవే వర్ణించబడుచు, నీవే యూహించబడుచుంటివి· నీవు వికారరహితుడవు.పరబ్రహ్మవు. నేను నీకు నమస్కరించుచున్నాను. కాలము, దైవము [అదృష్టము] కర్మ, జీవుడు, స్వభావము, సూక్ష్మభూతములు, సూత్రాత్మ, ప్రాణములు, అహంకారము, యేకాద శేంద్రియములు, పంచభూతములు, వీని సంఘాతమగు లింగ శరీరము మఱియు బీజాంకుర న్యాయానుసారముగ దానిచే కర్మ, కర్మచే మరల శరీరోత్పత్తి- యిది యంతయు నీ మాయయే. మాయా నిషేధముయొక్క పరమావధి నీవే. నేను నిన్ను శరణొందుచున్నాను. ప్రభూ! నీవు నీ లీలచేతనే యనేక రూపముల ధరిం చుచు, దేవతలను, సాధుపురుషులను, లోక మర్యాదలను కాపాడుచు పోషించుచుం దువు. దానితోపాటే ఉన్మార్గగాములు, హింసకులునగు నసురుల సంహారము గూడ చేయుచుందువు. నీ యీ యవతారము భూభారము దీర్చుటకొరకే యుద్దేశింపబడినది. ప్రభూ! నీ యొక్క శాంతము, ఉగ్రము, అత్యంత భయానకము, దుస్సహ తేజము గల జ్వరముచే నేనత్యంత సంతప్తమగుచుంటిని. ఆశా పాశములందు దగుల్కొని యుండు కారణముచేత నీ చరణ కమలముల నాశ్రయించనంతవరకు దేహధారులగు జీవులకు తాప సంతాపములు కలుగుచునేయుండును" అని వినయముగా వచించిన శైవ జ్వరముతో శ్రీకృష్ణ భగవాను డిట్లులనియె.

"ఓయీ త్రిశిరా! నేను నీ యెడల ప్రసన్నుడనైతిని. నా జ్వరము వలన నీకెట్టి భయములేదు. సంసారమందెవడైనను మన యిరువురి సంవాదమును స్మరిం చినచో వానికి నీవలన యెట్టి భయము కలుగకుండుగాక" అని భగవానుడు పలు కగా, మాహేశ్వర జ్వరమాతనికి నమస్కరించి వెడలిపోయినది. అంతలో బాణా సురుడు మరల రథారూఢుడై యుద్ధము చేయనేతెంచె. తన వేయి చేతులతో నతడు రకరకములగు నాయుధముల ధరించియుండె. అత్యంత క్రోధముతో నతడు భగ వానునిపై బాణవర్షము గురిపించినాడు. అది గాంచి భగవానుడు కత్తివలె పదునైన యంచులుగల తన చక్రముచే వృక్షము యొక్క చిన్న చిన్న కొమ్మల ఖండించు నట్లు బాణాసురుని భుజములు ఖండింపసాగినాడు. బాణాసురుని భుజములు ఖండింప

బడుట గాంచిన శంకర భగవానుడు చక్రధారియగు గోవిందుని సమీపించి యీవిధ
ముగ స్తోత్రము చేసినాడు.

"ప్రభూ! వేదమంత్రముల యందు తాత్పర్య రూపమున దాగియున్న పరం
జ్యోతి స్వరూపుడగు పరబ్రహ్మవు నీవు. పరిశుద్ధ హృదయులగు మహాత్ములు,
ఆకాశమువలె సర్వవ్యాప్తమైయున్న నీ నిర్వికార స్వరూపమును సాక్షాత్కరించు
కొన గలుగుచుందురు. ఆకాశము నీ నాభి. నీ నోరు అగ్ని. జలము నీ వీర్యము.
స్వర్గలోకము నీ శిరస్సు. దిక్కులు నీకర్ణములు. భూమి నీ పాదములు. చంద్రుడు
నీ మనస్సు. సూర్యుడు నీ దృక్కు. నేను [శివుడు] నీ యహంకారము. సముద్రము
నీ యుదరము· ఇంద్రుడు నీ భుజములు. ధాన్యాదియోషధులు నీ రోమములు.మేఘ
ములే నీ కేశములు. బ్రహ్మ నీ బుద్ధి. ప్రజాపతి లింగము ధర్మము నీ హృదయము
[ధర్ముడు] ఈ ప్రకారము లోకములు లోకాంతరములచే కల్పింపబడు (ఊహింప
బడు) శరీర మేదిగలదో యది పరమ పురుషుడవగు నీవే.

అఖండ జ్యోతి స్వరూపుడవగు పరమాత్మా! నీయీ యవతారము ధర్మ సం
రక్షణకును సంసారాభ్యుదయాభివృద్ధికొరకే కలిగినది. మేమందరము నీ ప్రభావము
చేతనే ప్రభావితులమై మూడులోకములను పాలించుచున్నాము. నీవు, స్వజాతీయ,
విజాతీయ, స్వగత భేదములు లేనివాడవు. ఏకము, అద్వితీయమునగు ఆది పురుషు
డవు. మాయాకృతములగు జాగ్రత్స్వప్న సుషుప్తులు, యీ మూడు దశలకు
అనుగతమై మఱియు వీని కతీతమగు తురీయావస్థయు గూడ నీవే యగుచున్నావు.
నీవు యితరములగు యే వస్తువువలనను ప్రకాశింపబడువాడవుగావు. స్వయంప్రకాశు
డవు. సర్వమునకు కారణమైనట్టి వాడవు. నీకెద్దియు కారణము గాదు. నీ యందు
కారణత్వమును లేదు. అట్లయిననుగూడ నీవు త్రిగుణముల యొక్క విభిన్న వైష
మ్యములను ప్రకాశింపజేయుటకై నీ మాయచే దేవ, పశు—పక్షి, మానవాది శరీర
ముల ననుసరించి, భిన్న భిన్న రూపములతో ప్రతీతుడవగుచుందువు. ప్రభూ!
సూర్యుడే విధముగ తన ఛాయయగు మేఘముచే గప్పబడినవాడై, తన ఛాయయగు
మేఘమును, వేర్వేరు రూపములనుగూడ ప్రకాశింపజేయుచుండునో యటులనే నీవును
స్వయంప్రకాశుడవైయుండి, గుణములచే గప్పబడిన వానివలె గన్పట్టుచు, సమస్త
గుణములను, గుణాభిమానులగు జీవులను ప్రకాశింపజేయుచుందువు. యదార్థముగా
నీవనంతుడవు.

భగవానుడా, నీ మాయా మోహితులై జీవులు, స్త్రీ-పుత్ర, దేహ-గేహాది
బంధాసక్తులై పోవుచు, అపారమగు దుఃఖసాగరమందు మునుగుచు తేలుచు నెప్పటి
కిని దరి గాంచలేకున్నారు. సంసారమందలి మానవులకు, నీవు అపార కృపతో
మానవ శరీరము నొసంగియున్నావు. అట్టి మానవ శరీరమును పొందియు, యిం

ద్రియ నిగ్రహముతో, నీ చరణ కమలముల నాశ్రయించి సేవించని వాని-జీవన మత్యంత శోచనీయమగుచున్నది. వాడు తననుతానే వంచించుకొనినవాడగుచున్నాడు. నీవు సమస్త ప్రాణులకు ఆత్మ స్వరూపుడవు, ప్రియతముడవు, ఈశ్వరుడవు, అట్టి నిన్ను వదలి మరణశీలుడగు మానవుడు, అనాత్మ వస్తువులు, దుఃఖభాజనములు, తుచ్ఛములునగు విషయములందేదో సుఖమున్నదని భ్రాంతి చెంది వాని వైపు పరి భ్రమించుచున్నాడు. వాడు, అమృతమును వదలి విషమును పానము చేయునట్టి మూర్ఖుడు. నేను, బ్రహ్మ, సమస్త దేవతలు, విశుద్ధాత్ములగు ఋషి–మునిపుంగ వులు, సర్వ విధముల, సర్వాత్మ భావముతో నీకు శరణాగతుల మగుచుంటిమి. ఏల ననగా, నీవు మా యందరికి, ఆత్మవు, యీశ్వరుడవు, ప్రియతముడవు గనుక. నీవు జగదుత్పత్తి స్థితిలయములకు కారణుడవు. నీవందరియందు సమభావము గలవాడవు. పరమ శాంతుడవు. అందరికి స్నేహితుడవు. ఇష్టదైవమవు. ఏకాద్వితీయ స్వరూపు డవు, జగదాధారుడవు, అధిష్ఠానము నీవే. ప్రభూ, మేమందరము భవబంధముల నుండి విడివడుట కొరకై నిన్ను భజించుచుందుము. దేవా! యీ బాణాసురుడునాకు పరమ ప్రియుడు, కృపాపాత్రుడు, నా భక్తులయందగ్రగణ్యుడు.ఇతని ముత్తాతయగు ప్రహ్లాదుని పై నీకెంత యనుగ్రహము కలదో, అంతటి యనుగ్రహమునునీవువీనిపై గూడ చూపుము" అని శంకరుడు వచించగా, శ్రీకృష్ణుడిట్లులనియె.

"శంకరా, నీ మాటను మన్నించి నీవు కోరినట్లే యీ బాణాసురున కభయ మొసంగుచున్నాను. వీని విషయములో నీవిది వరకు సంకల్పించిన ప్రకారము, నేను వీని భుజములను ఖండించితిని. బాణుడు బలి తనయుడని నేనెఱుంగుదును. అందుచే గూడ నేనీతనిని వధింపజాలను. "నేను నీ వంశమందుద్భవించు దైత్యునెవ్వనిని వధించ"నని నేను ప్రహ్లాదునకు యిదివరలో వరమిచ్చి యుంటిని. ఇతని గర్వమును చూర్ణము చేయుటకే నేనీతని భుజముల ఖండించితిని. ఇతని గొప్ప సేన భూమికి భారముగా నుండుటచే దానిని సంహరించితిని. ఇతనికి నాల్గు భుజములు మిగిలి యున్నవి. ఇతడజరుడు, నమరుడునైయుండగలడు. ఇపుడితనికెవని వలనను యెట్టి భయమును లేదు" అని శ్రీకృష్ణుడు శంకరునితో వచించె.

శ్రీకృష్ణునివలన అభయదానమును పొందిన బాణాసురుడు, అతనిని సమీ పించి, భూమిపై తలనానించి నమస్కరించి, యనంతరము ఉషానిరుద్ధులను రథ ముపై గూర్చుండబెట్టుకొని తెచ్చి శ్రీకృష్ణునికి సమర్పించినాడు. శంకర భగవానుని యనుమతితో వస్త్రాలంకారభూషితులగు నూతన దంపతుల నొక యక్షౌహిణీసేనా సమన్వితముగముందిడుకొని, ద్వారకకు పయనమైనాడు గోవిందుడు. వారి శుభా గమనసమాచారము ముందుగనే తెలుసుకొనిన ద్వారకావాసులు, పురమునంతను పతాకములతోను తోరణములతోను అలంకరించిరి. మార్గములన్నియు సుగంధజల

ముచే తడుపబడినవి. బ్రాహ్మణులాశీర్వచనములు పలుకుచుండ ద్వారకావాసులు మేళతాళములతో పెండ్లివారికెదురేగి స్వాగతము పల్కిరి. మంగళవాద్యములు మ్రోగుచుండ శ్రీకృష్ణాదులు ద్వారకాప్రవేశ మొనర్చిరి.

ఈ శివకేశవయుద్ధము, కేశవ విజయమునకు సంబంధించిన కథను ప్రాతః కాలమున స్మరించిన వానికి పరాజయమనునది యెన్నటికిని కలుగదు.

# అరువదినాల్గవ యధ్యాయము

## నృగమహారాజ చరిత్ర

శ్రీశుకయోగి యిటుల చెప్ప నారంభించె.

"రాజా, ఒక దినమున, సాంబుడు, ప్రద్యుమ్నుడు, చారుభానుడు, గదుడు మొదలగు యదువంశ రాజకుమారులు విహారార్థముపవనమున కేగిరి. వారచట చాలసేపాటపాటలయందు గడిపి, దాహమగుటచే జలముకొరకన్వేషించసాగిరి. వారొక నూయివద్దకేగగా, దానియందు నీరుమాత్రము లేదుగాని, యొకవిచిత్రజీవ మందుగాన వచ్చినది. అదియొకపర్వతమువలెనున్న యూసరవెల్లి (తొండ). దానిని చూచి వారందరాశ్చర్యచకితులైరి. వారి హృదయములు కరుణాతరంగితములైనవి. దానిని నూతినుండి వెలుపలకు దీయ ప్రయత్నించిరి. త్రాళ్ళతోగట్టి లాగుటకెంత ప్రయత్నించినను, వారియత్నములు ఫలించనందున, యీ యాశ్చర్యకరవృత్తాంత మును వారు శ్రీకృష్ణునకు నివేదించిరి. భగవానుడు నూతిదగ్గరకు విచ్చేసి, తన యెడమచేతితో దానిననాయాసముగ వెలుపలకులాగివైచె. భగవానుని కరకమలస్పర్శ కలుగుటయేతడవుగ నతని యూసరవెల్లి రూపముతొలగిపోయి, దివ్యదేవతాస్వరూ పముగ పరిణతిచెందినది. మేలిమి బంగారువలె నాతనిదేహము ప్రకాశించుచుండ, దివ్యమాల్యాంబరాభరణ భూషితుడై యతడు సాక్షాత్కరించె. ఆ మహాపురుషునకు తొండరూపము వచ్చుటకు కారణము భగవాను డెరిగియుండినను, అందరకు తెలియ వలయునను నుద్దేశ్యముతో, నతనినిట్లు ప్రశ్నించె. మహాభాగా, నీరూపము చాల సుందరముగానున్నది. నీవెవరవు? నీవుతప్పకయేదో దేవతవైయుందువనియే నేనను కొనుచున్నాను. ఏపాపముచేత నీకీయూసరవెల్లి రూపము సంప్రాప్తించినది? నీకిట్టి దీనస్థితికలుగగూడదే. మేము నీవృత్తాంతము వినవలయునను కుతూహలముతో నున్నారము. మాకు తెలుపుటకుచితమగు నెడల నీవృత్తాంతము మాకెఱిగింపుము." అని శ్రీకృష్ణుడు కోరగా, నాదివ్యపురుషుడు, తనకిరీటోజ్జ్వలమగు శిరమును మాధవునిపాదములకు తగులునట్లు నమస్కరించి, తన వృత్తాంతమునిట్లు చెప్పసాగె.

"ప్రభూ, నేనిక్ష్వాకుమహారాజు తనయుడగు నృగుడను. దాతల నామము లెపుడైన నీ కర్ణయుగములకు సోకియున్నచో నందులో నా పేరుగూడ మీ చెవినబడి యుండును. స్వామీ, నీవు సర్వప్రాణుల మనోవృత్తులకు సాక్షిగానున్న కారణము చేత-భూతభవిష్యద్వర్తమాన భేదములులేక, నీకన్నియు తెలిసియేయుండును. అయి నను నీయాదేశప్రకారము నేను చెప్పుచున్నాను. పృథ్వియందెన్ని ధూళికణములు న్నవో, ఆకాశమందెన్ని నక్షత్రములున్నవో, వర్షమునందెన్ని జలబిందువులున్నవో, యన్ని గోదానములను నేను చేసియుంటిని. ఆ గోవులుగూడ, పాలిచ్చునట్టివి, మంచి వయసులోనుండి, సాధువులై మంచిలక్షణములు గలిగిన సుందరములగు కపి లవర్ణముగలవి. అవి నా న్యాయార్జితములు. అన్నియుదూడలుగలవి. వాని కొమ్ము లకు బంగారుతొడుగులు, గిట్టలకు వెండితొడుగులు వేయించి, యన్నింటిని వస్త్రాభ రణహారాదులచే నలంకరించి దానములిచ్చియుంటిని. ఆ దానములుగూడ సత్పాత్రు లకే—సద్గుణశీలులు, దంభరహితులు, వేదవేదాంగ పారంగతులు, యువకులు, కుటుంబముగలవారు, తపస్వులు, శిష్యులకు పాఠములు బోధించుచుండునట్టి సచ్చరి త్రగలవారికే-యొసంగితిని. ఈ ప్రకారమనేక గోవులనేగాక, భూమిని, బంగార మును, గృహములను, గుర్రములను, యేనుగులను, దాసీయుతముగ కన్యలను, తిలపర్వతములను, వెండిని, శయ్యలను, వస్త్రములను, రత్నములను, గృహపరికర ములను, రథములు మొదలగువానిని గూడ దానముచేసియుంటిని. అనేక యజ్ఞ ములు చేసియుంటిని. వాపీకూపతటాకముల త్రవ్వించియుంటిని.

ఒకనాడొక తపస్వియగు బ్రాహ్మణుని గోవొకటి తప్పించుకొని వచ్చి నా గోధనమందు గలిసిపోయినది. ఆ విషయము తెలియని నేను దానిని మఱియొక బ్రాహ్మణునకు దానమొసంగితిని. ఆ గోవునాతడు తోలుకొనిపోవుచుండ, దాని స్వంతదారుడగు బ్రాహ్మణుడేతెంచి, "ఇది నాది" యని యాతనినడ్డగించె. దాన గ్రహీతయగు బాపడు, "దీనిని నృగ మహారాజు నాకు దానమొనర్చి యుండెగాన యియ్యది నాదే" యని యాతడు ప్రతిఘటించె. వారిరువురు వాదులాడుచు, న్యాయ నిర్ణయమునకై నా వద్ద కేతెంచిరి. దానమును గ్రహించియున్న యాతడు "ప్రభూ, దీనిని మీరింతకు ముందే నాకు దానమొనర్చి యుంటిర"ని పలుక, రెండవయాతడు "అట్లైనచో మీరు నా గోవును దొంగిలించితిర"ని పలికె. వారిరువురి పలుకులాలించి, నాకు చిత్తభ్రమణము కలిగినది. ధర్మసంకటమునందు పడి, నేను వినయముగ ననునయించు నిట్లు పలికితిని. "స్వామీ, మీకు ఉత్తమములగు లక్ష గోవుల నొసం గుదును. ఈ గోవునిచ్చి వేయుడు. నేను మీకు సేవకుడను. అజ్ఞానము వలన నాచే యీయపరాధము చేయపడినది. నాపై మీరు దయయుంచి, నన్ని ధర్మ సంకటము నుండియు, నరకము నుండియు, రక్షించుడని వేడుకొంటిని. "రాజా, నేనీ గోవునకు

బదులుగా నేమియు గైకొన"నని యా గోవు యొక్క నిజ యజమాని వెడలిపోయి నాడు. "రాజా యీ యావునకు బదులుగా, లక్ష గోవులు గాదు యింకను పదివేలె క్కువ యిచ్చినను నేను తీసుకొనువాడనుగా"నని పలుకుచు రెండవ బ్రాహ్మణుడు గూడ వెడలిపోయినాడు. దేవాధిదేవా, జగదీశ్వరా, నాయాయువు దీరిపోగా, యమ దూతలు వచ్చి నన్ను యమపురికి గొంపోయిరి. అచట యమధర్మజు నన్నిట్టుల ప్రశ్నించినాడు. "రాజా, నీవు ముందుగా పాపఫలమనుభవించెదవా? లేక పుణ్యఫల మనుభవింతువా? నీవు చేసిన దాన ధర్మములకు ఫలస్వరూపముగ నంతులేని తేజ స్వంతములగు లోకములు నీకు ప్రాప్తించుచున్నవి" అని వచించిన యమరాజుతో నేను "దేవా, నేను ముందుగా పాపఫలమునే యనుభవించదలచితి" నని పలుకగనే, యాతడు నన్నీ రూపమున నిందు బడవైచె.

"కేశవా నేను బ్రహ్మణ్యుడను, వదాన్యుడను, మీదుమిక్కిలి నీదు భక్తుడన గుటచేతను, నీదర్శనాభిలాష గలవాడనగుటచేతను, నాకు పూర్వజన్మస్మృతి గలిగి యుండినది స్వామీ, నీవు పరమాత్మవు. విశుద్ధహృదయులగు గొప్ప యోగీశ్వ రులు, ఉపనిషద్దృష్టితో [అభేదదృష్టితో] తమ హృదయములందు నిన్ను ధ్యానించు చుందురు. ఇంద్రియాతీతుడవగు పరమాత్మా, నీవు సాక్షాత్తుగ నానేత్రములయెదుట నెటులదర్శన మొసంగితివి? ఏలననగా, నేననేక ప్రకారములగు వ్యసనములందు నను, దుఃఖదములగు కర్మములందునను దగుల్కొని, యంధుడనైపోయియున్నాను. సంసారచక్రముమండి విడివడు సమయమాసన్నమైనపుడే నీదర్శనము లభించును. దేవాధిదేవా, పురుషోత్తమా, గోవిందా, వ్యక్తావ్యక్త స్వరూపా, అచ్యుతా, సమస్త యింద్రియవృత్తులకు నీవేస్వామివి. నేనిక దేవలోకమునకేగదను. నాకాజ్ఞయొసం గుము. నేనెచట నేవిధముగనున్నను, నాచిత్తమెప్పుడును నీపాదకమలములయందే లగ్నమైయుండునట్లు, నన్ననుగ్రహింపుము. సమస్తకార్య, కారణరూపముగ నీవు విద్యమానుడవగుచుందువు. నీ శక్తియనంతము. నీవు స్వయముగా పరబ్రహ్మవు. నీకు నమస్కారము. సచ్చిదానందస్వరూపా, సర్వాంతర్యామీ, వాసుదేవా, శ్రీకృష్ణా, నీవు యోగములకుపతివి. నీకు పునఃపునః ప్రణామములు".

శ్లో. నమస్తే సర్వభావాయ బ్రహ్మణేఽనన్తశక్తయే
కృష్ణాయవాసుదేవాయ యోగానాంపతయేనమః

నృగమహారాజీ విధముగవచించి, భగవానునకు ప్రదక్షిణమొనర్చి, తన మకు టముచే నాతని పాదముల స్పృశించునట్లు నమస్కరించి, యతని యనుమతిగైకొని, యందరు చూచుచుండ, శ్రేష్ఠమగు విమానము నధిరోహించి వెడలిపోయె.

నృగమహారాజు వెడలిపోయిన పిమ్మట, బ్రహ్మణ్యుడగు గోవిందుడు, క్షత్రియులకు బోధింపదలచినవాడై, యటనున్న తన కుటుంబ సభ్యులతో నిట్లు

పల్కె. అగ్నితో సమానమగు తేజస్సుగల రాజులుగూడ, బ్రాహ్మణద్రవ్యమును కొంచెమపహరించినను, దానిని జీర్ణింప జేసుకొనజాలరు. అట్టిచో, అహంకార వశముచేత తాము రాజులమని మిథ్యాభిమానముచే ప్రవర్తించువారివిషయము చెప్పనేల? ప్రతి క్రియ జేయగల్గుటచే, హాలాహలమునుగూడ నేను విషమని భావింపను. బ్రాహ్మణ ద్రవ్యమే పరమ విషమని నాయభిప్రాయము. దానిని జీర్ణమొనర్చుటకు పృథివి యందెట్టి యౌషధమును లేదు. ఎట్టియుపాయముగూడ లేదు. హాలాహలము కేవలము తినువాని ప్రాణమునే హరించును. అగ్ని జలముచే శమించును. (చల్లారును). కాని బ్రాహ్మణుని ధనరూపమగు నరణినుండి యుద్భవించినయగ్ని, కులమునంతటిని సమూలముగ నశింపజేయును. బ్రాహ్మణ ద్రవ్యమును,అతని పూర్తి సమ్మతి లేకుండ ననుభవించినచో, నటుల యనుభవించువానిని, వానిపుత్ర, పౌత్రులను మూడు తరముల వారిని నశింపజేయును. బలాత్కారముగ బ్రాహ్మణ ద్రవ్యమపహరించి యనుభవించిన వానిని, పది పూర్వతరములవారు, పది రాబోవు తరములవారితో సహా నశింపజేయును. మూర్ఖుడగురాజు, రాజ్యమదాంధత చేత, బ్రాహ్మణ ద్రవ్యమపహరింపగోరుచో, తాను తెలిసి తెలిసి నరకమునకు మార్గమును సుగమముగా చేసుకొనుచుండెనని తెలుసుకొనవలయును. తామెంతటి యగాధమగు గోతియందు పడవలసి వచ్చునో వారెరుగకున్నారు. ఉదారహృదయులు, బహుకుటుంబీకులునగు బ్రాహ్మణుల జీవనాధారమును హరించిన యెడల, ఆ బ్రాహ్మణులేడ్చినపుడు వారి కన్నీటి బిందువులచే నెన్ని ధూళికణములు తడియునో యన్నివర్షములు, బ్రాహ్మణ ద్రవ్యమపహరించిన దుర్మార్గుడగు రాజు, అతని వంశమువారు, కుంభీపాక నరకమందు దుఃఖమనుభవింపవలసి వచ్చును. ఏ మనుష్యుడు, తానుగాని, యితరులుగాని బ్రాహ్మణుల కొసంగినట్టి వృత్తిని, వారి జీవనాధారమును, లాగుకొనునో వాడు యేడువేల సంవత్సరములు మలమునందు క్రిమియై జన్మించును. కావున, పొరపాటున గూడ, బ్రాహ్మణద్రవ్యము నాకోశమందు జేరరాదని నేను కోరుచుందును. బ్రాహ్మణ ద్రవ్యమపహరించుటయను మాట యటుంచుడు. బ్రాహ్మణద్రవ్యముపై యేమాత్రము కోరికగల్గినవారు గూడ, యీ జన్మ మందల్పాయువులై, శత్రువులచే పరాజితులై, రాజ్యభ్రష్టులై పోవుటయేగాక, దేహాంతమందు యితరులకు హాని కలిగించునట్టి సర్పజన్మ మెత్తెదరు. కావున నో యాత్మీయులారా, బ్రాహ్మణుడపరాధ మొనర్చిన యెడలగూడ వానిని ద్వేషించకుడు. అతడు కొట్టినను, తిట్టినను, శాపమొసంగిననుగూడ, మీరెప్పుడు నతనికి నమస్కారమునే చేయుచుండుడు. త్రికాలముల యందును నేనెటుల బ్రాహ్మణులకు ప్రణామము చేయుచుందునో, మీరు గూడ నటులనే సావధానులరై నమస్కరించుచుండుడు. నా యీయాజ్ఞనతిక్రమించిన వారిని నేను క్షమించను. దండించెదను.

బ్రాహ్మణ ధనమపహరింపబడిన యెడల, ఆ ధనము, అది యపహరించిన వానిని–వాడు తెలియక నాయపరాధమొనర్చినను — అధఃపతితుని గావించును. బ్రాహ్మణుని యావును తెలియక స్వీకరించిన నృగమహారాజు నరకపతితుడగుడయే యందుకు నిదర్శనము." అని శ్రీకృష్ణుడు తనవారి కుపదేశించె.

పరీక్షిన్మహారాజా, సమస్తలోకములను పవిత్రమొనర్చునట్టి శ్రీకృష్ణభగవానుడు ద్వారకావాసులకీ విధముగ నుపదేశము గావించి, తన భవనమునకేగె.

# అరువది యైదవ యధ్యాయము

## శ్రీబలరామ వ్రజగమనము

రాజా, బలరాముని మనస్సునందు, వ్రజమందలి నందాది స్వజన - సంబంధుల నందరి నొకమారు సందర్శించవలయునను తీవ్రమగు వాంఛ యుదయించినది. రథారూఢుడై యాతడు నందవ్రజమున కేగినాడు. వ్రజవాసులగు గోపీగోపకులు గూడ నతనికొరకు చాలదినములనుండి యుత్కంఠితులై యుండుటచేత, వారతనిపై గల ప్రేమచే నతని నాలింగనమొనర్చుకొనిరి. మాతాపితరులగు యశోదానందుల కాతడు నమస్కరించినాడు. వారును ఆశీర్వాదము లొసంగి యతని నభినందించిరి.

బలరామా, నీవు జగదీశ్వరుడవు. నీ చిన్నితమ్ముడగు శ్రీకృష్ణునితోగూడి, నీవెప్పుడును మమ్ము రక్షించుచుండుము." అని పలికి యాతనిని వారు తమ యొడియందు చేర్చుకొని, ప్రేమాశ్రువులచే నభిషేకించిరి. అనంతరము గోపాలురలో తనకంటె పెద్దలగువారికి బలరాముడు తాను నమస్కారము చేయగా, పిన్నలగు వారాతనికి నమస్కారమొనర్చిరి. వయోభేదమునను సరించి యతడందరిని యథోచితముగ కలిసి పలుకరించినాడు. గొల్లపిల్లల వద్దకేగి, కొందరితో కరచాలనము లొనర్చియు, కొందరితో మధురముగ సంభాషించియు కొందరితో నాలింగనము లొనర్చియు, నందరిని యలరించినాడు. అనంతరమాతని శ్రమయంతయు తీరిపోగా, నతడు విశ్రాంతిగా గూర్చుండియుండగా, గోపాలురందరాతనివద్ద చేరిరి. వారందరును శ్రీకృష్ణునికొరకై తమ సమస్త భోగములను, సర్వమోక్షములను గూడ త్యాగమొనర్చియుండిరి. బలరాముడు వారిని గూర్చియు, వారి గృహసంబంధీకుల గూర్చియు కుశలప్రశ్న గావింపగా, ప్రేమాతిరేకముచే గద్గదికములైన వారతని నిట్లు ప్రశ్నించిరి. "బలరామా, వసుదేవాదులగు మన సోదరులు, బంధువులందరును కుశలముతో నుండిరా? మీరిపుడు స్త్రీ-పుత్రాది సహితులైతిరి. సంతానవంతులై తిరి. ఎప్పుడైనా మేము మీకు జ్ఞాపకమునకు వచ్చుచుందుమా? పాపియగు కంసుని మీరు వధించి మనవారందరిని మహావిపత్తునుండి కాపాడుట యెంతయు

సంతోషకరమగు విషయము. ఇంకను యెంతోమంది శత్రువులను మీరు సంహరించి, యిపుడు మీరు సురక్షితమగు దుర్గమందు వసించుచుండుటయు, యేమంత తక్కువ సంతోషకరమగు విషయము గాదు."

బలరామ భగవానుని సందర్శనముచేతను, అతని ప్రేమభరితములగు చూపులచేతను గోపికలు మహా సంతృప్తి చెందిరి. వారు నవ్వుచు నతనితో నిట్లనిరి. "బలరామా, నగరనారీమణులకు ప్రాణవల్లభుడైన శ్రీకృష్ణుడిపుడు కుశలముగ నున్నాడా? అతనికెప్పుడైనా యిక్కడి బంధువులుగాని, తలిదండ్రులుగాని గుర్తుకు వచ్చుచుందురా? ఒక్కమారైనా తన తల్లిని జూచుటకైన యాతడిచటికి రాగలడా? ఆ మహాబాహునకు మేమొనర్చిన సేవలెపుడైనా జ్ఞాపకమునకు వచ్చుచుండునా? స్వజనులను బంధువులను వీడిపోవుట చాలకష్టమను విషయము నీకు తెలియును. అయినను మేమాతనికొరకై బంధువులను, పతి-పుత్రులను, సోదరీ సోదరులనందరిని వదలితిమి. కాని, ప్రభూ, అతడివేమియు గమనించక క్షణములో మమ్మందరిని వదలి, మా ప్రేమబంధము త్రుంచివైచి, పరదేశమున కేగినాడు. మమ్ములను బొత్తుగ త్యజించినాడు. మేము తలుచుకున్నచో నాతని నడ్డగించి యుండెడివారమే. కాని యాతడు "నేను మీకు ఋణపడి యున్నాను. మీరొనర్చిన యుపకారమునకు నేను ప్రత్యుపకారమెన్నటికి చేయజాలను" అని యీ విధములగు మురిపించుమాటలు పలుకుచుండగా, అతని మధురాలాపములకు ముగ్ధురాలై, యతని మాటలను విశ్వసింపని స్త్రీ యెవతె యుండును? అని పలికిరి. ఒక గోపిక లేచి, "బలరామా మేము పల్లెయందలి యమాయక ప్రజలము. కాని నగరమందలి మానినులు చాతుర్యముగలవారై యుందురు. చంచలుడు కృతఘ్నుడునగు శ్రీకృష్ణుని, మాటలలోనే వారెందుకు బంధించకుండనుండెదరు. అతడు వారిని మావలె మోసగింపలేక పోయి యుండును" అని యనగా, మఱియొక గోపిక, "కాదు కాదు సఖీ, శ్రీకృష్ణుడు మాటలలో మహా నేర్పరి. అతడికతడే సాటి అతడు మధుర మధురముగా మాటలాడుచో చెప్పెడిదేమున్నది? అతని మధుర మందహాసము, ప్రేమగర్భితములగు చూపులచే నగర నారీమణులుగూడ ప్రేమావేశముచే వ్యాకులముచెందినవారై, యతని మాయమాటలకు మోసపోయి యాత్మసమర్పణ జేసియుందురు" అని పలికె.

మూడవ గోపిక, "అరే గోపికలారా, మనకామాటలతో నేమి ప్రయోజనము! కాలక్షేపము కొరకేయైనచో, ఇంకేమైనా మాటలు చెప్పండి. ఆ కఠినాత్ముడికి మనసు లేకుండా కాలము గడుచుచున్నచో, మనకుగూడ నతనివలెనే దుఃఖముండిననుండుగాక, కాలము గడిచిపోగలదు" అని పల్కినది.

ఇటుల చెప్పుకొనుచుండ గోపికల, మనోనేత్రము ముందు, శ్రీకృష్ణుని చిరునగవు, ప్రేమపూరితవాక్కులు, చారువీక్షణములు, అపూర్వమగు గమనము, ప్రేమా

లింగనాదులన్నియు, రూపములుదాల్చి నృత్యమొనర్పసాగినవి. ఆ మధుర స్మృతుల యందు తన్మయులై వారు రోదించసాగిరి.

బలరాముడు అనేకవిధములుగా ననునయించుటలో నేర్పరి. హృదయంగమములగు శ్రీకృష్ణ సందేశములవారికి వినిపించుచు వారిననునయించినాడు. వసంత ఋతువునందలి రెండుమాసములతడు నందగోకులమందే గడిపినాడు. రాత్రియందతడు గోపికలవద్దనే యుండుచు వారికి ప్రేమాభివృద్ధి కలిగించినాడు. అతడును భగవానుడగు బలరాముడే గదా.

ఆ సమయమందు వికసించిన కలువల పుప్పొడితో కూడి సుగంధ వాయువులు మందమందముగ వీచుచున్నవి. పూర్ణచంద్రుని తేజోమయములగు శీతల కిరణములు యమునాతటమందలి యుపవనమందుజ్జ్వలముగ ప్రకాశించుచుండినవి. అట్టి మనోహరమగు సమయమందు, బలరాముడు గోపీ పరివేష్టితుడై యా యుపవనము నందు విహరించుచున్నాడు. వరుణదేవుడు తన పుత్రిక యగు వారుణీదేవిని బలరామునకు సేవలందించుటకై యటకు బంపినాడు. వారుణి యొక వృక్షకోటరము నుండి ప్రవహింపసాగినది. ఆ వారుణియొక్క సుగంధము ఆ యుపవనమునంతను పరిమిళితము చేసినది. ఆ మధుధారా పరిమళమును బలరామునకు కానుకగా సమర్పించుచున్నట్లు, వాయుదేవు డాతని వద్దకు గొనివచ్చినాడు. దాని మాదకత్వముచే నాకర్షితుడై బలరాముడు గోపికా సమేతుడై యటకు చేరినాడు. ఆ సమయమందు గోపిక లతనికి నాలుగువైపుల పరివేష్టించి, యతని చరిత్రను గానము చేయు చుండిరి.

వారుణీ సేవనముచే మత్తెక్కిన వారివలె వారందరును వనమందు విహరించుచుండిరి. నేత్రములానంద మదముచే విహ్వలములగుచుండినవి. గళమునందు పుష్పహారములు శోభాయమానముగ నున్నవి. వైజయన్తీమాల ధరించి యాతడానందోన్మత్తుడై యుండినాడు. అతని యొక చెవి యందు కుండలము కాంతులీను చున్నది. ముఖారవిందమ్ముపై యపూర్వ్యమగు మందహాసము శోభిల్లుచున్నది.దానిపై శ్రమాంబువులు హిమకణములవలె నుండినవి. సర్వశక్తిమంతుడగు బలరామునకు జలక్రీడ గావింపవలయునను తలంపు కలిగి, యమునానది నచటి కాహ్వానించినాడు. కాని యమునాదేవి, యతడు మత్తెక్కియున్నాడను భావముతో నతని యాజ్ఞను పాటించలేదు. అచటికి రాలేదు. బలరామునకు కోపమువచ్చి తన నాగలియంచుతో నదిని లాగినాడు. ఆమెతో "పాపాత్మురాలా, యమునా, నేను పిలిచినను నీవు నా యాజ్ఞను ధిక్కరింతువా? నేను కోరినట్లిచటికి రాకుండ నన్ను తిరస్కరించితివి. నీ స్వేచ్ఛాచారమునకు ఫలమనుభవింపజేసెద చూడుము. ఇప్పటికిప్పుడే నిన్ను నా లాంగలాగ్రముచే నూరుపాయ లొనర్చెదను" అని బలరాముడు బెదరించగనే

యమున భీతిల్లినది. గడ గడలాడుచు స్త్రీ రూపముదాల్చి వచ్చి యతని చరణము లపైబడి యీ రీతి ప్రార్థించినది.

"లోకాభిరామా, బలరామా, మహాబాహూ, నేను నీ పరాక్రమమును విస్మరించితిని. ఎవని యంశామాత్రముచే నీ జగత్తంతయు ధరింపబడుచున్నదో, అట్టి జగత్పతి యగు నాదిశేషుడవు నీ వని గ్రహించితిని. నీవు పరమైశ్వర్యశాలివి. నీ వాస్తవిక స్వరూపము తెలియని కారణముచేత, నా వలన యీ యపరాధము చేయబడినది. భక్తవత్సలా, నేను నిన్ను శరణు వేడుచున్నాను. నా యపరాధమును మన్నించి నన్ను విడిచిపెట్ట ప్రార్థించుచుంటి"నని వేడుకొనగా బలరాముడా యమునను క్షమించినాడు.

తన పాదముల వద్దకు వచ్చిన యమునానదియందు, కరిణీసంఘయుతుడైన గజరాజువలె, గోపికాయుతుడైన బలరాముడు జలక్రీడనొనర్పసాగినాడు. అతడు యథేచ్ఛగా జలక్రీడలాడి, తీరమును చేరగా, లక్ష్మీదేవి యతనికి నీలాంబరమును, బహు మూల్యములగు నాభరణములను, సువర్ణహారమును సమర్పించినది. అంగరాగముల నలదుకొని, సర్వాలంకారములు గావించుకొని, యాతడు తెల్లని యింద్రైరావతమువలె శోభిల్లినాడు.

బలరాముని హలాగ్రముచే నాకర్షితమైన కారణముచేత, యమున యిప్పటికి గూడ ఆ మార్గముననే ప్రవహించుచు, అనంత శక్తియుతుడగు ననంతుని యశమును కీర్తించుచున్నదా యనునట్లు, చూపరులకు గోచరించుచుండును. బలరాముని చిత్తము గోపికల మాధుర్యముచే నెంత ముగ్ధమైపోయిన దనగా, నతనికి కాలజ్ఞానము లేకుండ బోయినది. అనేక రాత్రు లొక్కరాత్రివలె గడచిపోయినవి. ఈ ప్రకారము, బలరాముడు వ్రజమందు విహరించుచు నుండి పోయినాడు.

# అరువదియారవ యధ్యాయము

## పౌండ్రక-కాశీరాజుల మోక్షము

బలరాముడు నంద వ్రజమున కేగి యున్నపుడు, కరూషదేశాధిపతి యగు పౌండ్రకుడు, అజ్ఞానియగువాడు, వాసుదేవుని వద్ద కొక దూతను బంపెను. "నిజమగు వాసుదేవుడవు నీవు జగత్పతి యగు భగవానుడు వాసుదేవుడుగా నవతరించినది నీవని", మూర్ఖులు పొగడగా తానే వాసుదేవుడనని ఆ మూర్ఖుడు తానే భగవానుడ నను నభిమానముతోనుండె. పిల్లలాడుకొను సమయమందొకడురాజుగా నుండునట్లు, అప్పుడు తాను రాజుగా నితరులతో వ్యవహరించునట్లుగా, మందమతి యగు

పౌండ్రకుడు, అచింత్యగతి యగు భగవానుని లీలా రహస్యమును గుర్తింపజాలక ద్వారకయందున్న భగవానునకు దూత ద్వారా నొక సందేశ మంపె. ఆ దూత, ద్వారక యందు సభదీర్చియున్న శ్రీకృష్ణ భగవానుని జేరి తమ రాజు సందేశము నీ విధముగ వినిపించినాడు.

"భూమియందు వాసుదేవుడుగా నవతరించినది నేనొక్కడనేగాని, వేరెవడును లేడు. ప్రాణులపై దయ జూపుట కొరకే నేనవతరించియుంటిని. నీవు అసత్యవాదివై, వాసుదేవుడను పేరు పెట్టుకుంటివి. ఆ పేరును వదలివేయుము. అజ్ఞానముచే నీవు నా చిహ్నములగు శంఖచక్రాదుల గూడ దాల్చితివి గాన నీవా చిహ్నముల నన్నిటిని దీసివైచి నన్ను శరణు వేడుము. నా మాటలు నీకు సమ్మతము గాకున్నచో, నాతో యుద్ధము చేయుము."

మందమతి యగు పౌండ్రకుని బెదరింపుతో గూడిన సందేశము నాకర్ణించి, యుగ్రసేనాది సభాసదులందరును పక పక నవ్వసాగిరి. నవ్వుట పూర్తియైన పిమ్మట, శ్రీకృష్ణుడు దూతతో నిట్లు పల్కె. "నీవు పోయి మీ రాజుతో నామాటగా నిట్లు చెప్పుము." "ఓరీ, మూఢా, నేను నా చక్రాది చిహ్నముల నూరకే వదలిపెట్టను. వానిని నీ మీదనే వదిలెదను. కేవలము నీ మీదనేగాదు. నీ సహచరులందరి మీదను, నీవు వాసుదేవుడవని పొగడుచుండు నీ వారందరి పైనను వదలెదను. ఆ సమయమందు నీవు గ్రద్దలు, రాబందులచే నావరింపబడినవాడివై భూమిపై శయనించి యుందువు. అపుడు నీవు నాకు శరణదాతవుగా గాక, నీ మాంసమును పీకుచుండు కుక్కలను శరణు బొందెదవు" అని పలికె.

భగవానుని యీ తిరస్కార పూర్వకమగు సందేశమును గైకొని యాదూత తన స్వామి వద్ద కేగి వినిపించె. అచట భగవానుడు గూడ రథారూఢుడై కాశీ నగరముపై దాడి గావించినాడు. (ఏలననగా కరూషాధిపతి యా సమయమందు తన మిత్రుడగు కాశీరాజు వద్ద నుండియుండె).

శ్రీకృష్ణుని ముట్టడిని గూర్చి విని పౌండ్రకుడు రెండక్షౌహిణుల సేనను దీసుకొని, నగరము వెలువడి యుద్ధ సన్నద్ధుడాయె. అతనికి స్నేహితుడగుటచే కాశీరాజుగూడ మూడక్షౌహిణుల సేనతో నతనికి సహాయముగా యుద్ధమునకు వచ్చె. శ్రీకృష్ణుడు పౌండ్రకునివంక జూచినాడు. పౌండ్రకుడుగూడ శంఖ, చక్ర కౌమోదకీ, నందక, శార్ఙ్గ, శ్రీవత్స చిహ్నాదులన్నిటిని ధరించియున్నాడు. అతని వక్షఃస్థలమందు మాయ కౌస్తుభమణియు, వనమాలయు వ్రేలాడుచున్నవి. పీతాంబరధారియై యున్నాడు. రథముపై గరుడ చిహ్నముగల పతాకమెగురుచున్నది. అతని శిరముపైన మూల్యమగు కిరీటము, కర్ణములందు మకరకుండములు ప్రకాశించుచున్నవి. వేషమంతయు కృత్రిమమే. నాటకరంగమందభినయించుటకై వచ్చిన

వేషధారివలె నున్నాడు. తనతో సమానమగు వేషము దాల్చి వచ్చియున్న పౌండ్ర కుని గాంచి వాసుదేవుడు కిలకిల నవ్వినాడు.

శత్రువులు శ్రీకృష్ణునిపై త్రిశూల, గదా, ముద్గర, శక్తి, ప్రాస, తోమర, పట్టిశ, ఖడ్గ, బాణాద్యాయుధములచే ప్రహారములు గావించుచుండిరి. శ్రీకృష్ణుడు గూడ వివిధాయుధములతో శత్రువులపై విజృంభించినాడు. వారి చతురంగ బలము లను నాశము గావించినాడు. ఆ సమయమందా ప్రదేశము,భూతనాధుడగు శంకరుడు ప్రళయతాండవ మొనర్చుచుండు భయంకర క్రీడాస్థలమువలె గన్పట్టినది.

భగవానుడు, పౌండ్రకునితో, "పౌండ్రకా, నా శస్త్రాస్త్రచిహ్నముల వదలి వేయమని నీవు దూతతో నాకు సందేశమంపితివిగదా దానిని నేనిపుడు నీపై వదలు చుంటిని. అబద్ధముగా నీవు నా పేరు పెట్టుకొనియుంటివి. ఆ నామమునుగూడ పెరికి వేయుదును. నేను నీతో యుద్ధము చేయలేకున్నచో నిన్ను శరణందెదను." అని యీ విధముగ తిరస్కార పూర్వకముగ మాటలాడుచు, భగవానుడు, వాడియైన బాణములచే నాతని రథమును భగ్న మొనర్చి, చక్రముచేత నతని శిరమును ఖండించె. ఇంద్రుని వజ్రముచే పడిన గిరిశిఖరమువలె నాతని శిరము భువిపై పడి పోయినది. అదేవిధముగ కాశీరాజు శిరమునుగూడ ఖండించగానది, వాయువుచే నెగురగొట్టబడిన కమలమువలె నెగిరి, కాశీపురద్వారమందు బడిపోయినది. శత్రువుల నిర్వురనిట్లు దునుమాడి శ్రీకృష్ణభగవానుడు తన రాజధానికి తిరిగిపోయె. ఆ సమయమున. సిద్ధగణములమృతమయమగు భగవానుని కథాగానము చేయుచుండిరి. పౌండ్రకుడే భావముచేనైనప్పటికిని, భగవానుని రూపధారణమొనర్చి, యా రూప మునే యెల్లపుడును చింతన చేయుచుండుటచేత, వాని సంసారబంధములన్నియు, తెగిపోయినవి. ఎప్పుడును భగవానుని వేషమునే ధరించుచు, దానినే స్మరించు చుండుటచేత, నతనికి భగవానుని సారూప్యముక్తి లభించినది.

కాశీనగరమందలి రాజప్రసాదముయొక్క ప్రధానద్వారమందుపడిన కాశీ రాజుయొక్క, కుండలమండితమగు శిరమును గాంచి "యిదియేమి? ఇది యెవని శిరమని, ప్రజలు శంకించుచుండిరి. అది కాశీనరేశుని శిరమని రూఢియైన పిదప, రాణులు, రాకుమారులు, రాజపరివారము, నాగరికులు విలపింపసాగిరి. హాహాకార ములు చెలరేగినవి. కాశీనగరాధీశుని కుమారుడు సుదక్షిణుడనువాడు తండ్రి కంత్యక్రియల గావించి, మనసునందే, తన పితృఘాతియగు వానిని సంహరించి, తండ్రి ఋణము దీర్చుకొన సంకల్పించినాడు. తన గురుపురోహితులతో గూడిన వాడై, యతడు యేకాగ్రనిష్ఠతో భగవానుడగు శంకరునారాధింపసాగినాడు. అతని యారాధనకు ప్రీతుడైన యంబికాపతి, వరము గోరుకొమ్మని పలుక, సుదక్షిణుడు, "నా పితృహంతకుని వధించు నుపాయము సూచించుమ"ని వేడగా, శంకరుడు "నీవు బ్రాహ్మణులతోగూడి, దక్షిణాగ్నియందాభిచారక విధానముతో యజ్ఞమొన

ర్పము. అపుడగ్ని ప్రథమగణ సహితముగ ప్రత్యక్షుడగును, బ్రహ్మణ్యుడుకాని వానిపై ప్రయోగింపబడిన యెడల నీ సంకల్పము నెరవేరగలదు" అని పలికె.

శంకరుని యాదేశప్రకారము సుదక్షిణుడు, తన యనుష్ఠానమునకు కావల సిన సంభారములనన్నిటిని సేకరించుకొని, నియమముతో, శ్రీకృష్ణునికొరకభిచార హోమమును ప్రారంభించినాడు. అభిచారహోమము పూర్తికాగానే యజ్ఞకుండము నుండి, అతిభీకరరూపముతో నగ్ని వెలువడినాడు. అతని కేశములు, గడ్డము—మీస ములు, బాగుగా తప్తమైన రాగిరంగులో నున్నది. ముఖమందు క్రూరత ప్రస్ఫుట ముగానున్నది. శరీరము దిగంబరముగా నున్నది. హస్తమందు త్రిశూలము నటు నిటు త్రిప్పుచుండ నందుండి జ్వాలలెగయుచున్నవి. కన్నుల నిప్పుకణములు రాలు చుండినవి. కాళ్ళు తాటిచెట్లవలె నున్నవి. తన పదాఘాతముచే భూమిని కంపింప జేయుచుండె. దిక్కులనన్నిటిని దగ్ధమొనర్చుచు నాకృత్య ద్వారకవైపు పరుగిడి, మాటలలోనే ద్వారకయందు ప్రవేశించె. అతనివెంట ననేక ప్రమథగణములు గూడ నుండినవి. ఆ యభిచారాగ్ని దాదాపు తమ సమీపమునకురాగా, నడవియందు దావాగ్నిచే భయపడు హరిణములవలె, ద్వారకా వాసులడలిపోయిరి. భయభీతులై వారు భగవానునిపాలికి పరువెత్తుకొనిపోయిరి. ఆ సమయమందు భగవానుడు పాచిక లాడుచుండినాడు. ప్రజలాతనింగాంచి, "త్రిలోకేశా, రక్షించుము, రక్షించుము. ద్వారకానగరము యిప్పుడు భస్మమై పోవనున్నది. నీవు మమ్ము రక్షించుము. నీ కంటె రక్షకుడెవ్వడును మాకు లేడు. శరణాగతవత్సలా," యని ప్రార్థింప, తన వారందరు భయగ్రస్తులై యుండుటగాంచిన భగవానుడు, నవ్వుచూ, "భయపడ కుడు, నేను మిమ్ము రక్షించెదను" అని పలికె.

సర్వమునకు, బాహ్యాభ్యంతర సాక్షియగు భగవానుడు, అది కాశీనుండి ప్రయోగింపబడిన మహేశ్వరకృత్యయని గ్రహించినాడు. దానికి ప్రతీకారముగ, తనవద్దనే విరాజమానమైయున్న సుదర్శన చక్రమునకాజ్ఞ యిచ్చినాడు. ముకుందుని ప్రియమగు ఆయుధమైన సుదర్శనము, కోటి కోటి సూర్యప్రతీకాశమై వెలుగుచు ప్రళయాగ్ని సదృశముగ మండుచునున్నది. ఆ చక్రకాంతిచే భూనభోంతరములు, దశదిశలు వెలిగిపోవుచున్నవి. ఆ చక్రము వెళ్ళి, అభిచాగ్నిని పడద్రోయగా, దానిశక్తిచే కృత్యముఖము భగ్నమైపోయినది. తేజస్సు నశించిపోయినది. శక్తి కుంఠితమైనది. ఆకృత్య యచటనుండి తిరిగి కాశీకివెళ్ళి, తనను ప్రయోగించిన ఋత్విజాచార్యసహితుడగు సుదక్షిణుని దగ్ధమొనర్చినది. ఆ ప్రకారము అతని యభిచారవిధి యతనికే వినాశకారణమైనది.

కృత్యననుసరించి, సుదర్శనచక్రముగూడ కాశికేగినది. కాశి విశాలమగు గొప్పనగరము. పెద్దపెద్ద కోటగోడలు, సభాభవనము, గోపురద్వారములు, విశాల ములగు విపణివీధులు, కోశాగారములు, రథశాలలు, గజశాలలు, అశ్వశాలలు,

కలిగినదై సర్వాలంకారశోభితమైయున్న ప్రసిద్ధ నగరమది. అట్టి సుందర నగరమును సుదర్శనచక్రము. భస్మమొనర్చి, యక్లిష్టకర్ముడగు శ్రీకృష్ణునివద్ద కేగినది.

శ్రీకృష్ణుని పుణ్యకీర్తికి సంబంధించిన యీ చరిత్రమును యేకాగ్రభక్తితో విన్నను, వినిపించినను అట్టివాడు సర్వపాప వినిర్ముక్తుడగు"నని శ్రీశుకయోగి యనియె.

# అరువది యేడవ యధ్యాయము

## ద్వివిదోద్ధారము

"బలరాముడమితశక్తి సమన్వితుడు. సృష్టి ప్రళయముల కతీతుడు. అనంతుడు. అతని స్వరూపము, గుణములు, లీలలు మొదలగునవి, మనస్సుకు, బుద్ధికి, వాక్కునకు అందునవిగావు. అతని ప్రతిలీలయు, లోకమర్యాదకంటె విలక్షణముగ నుండును. అతని యద్భుతలీలాకార్యములను నేనింకను వినగోరుచుంటి"నని పలికిన పరీక్షన్మహారాజునకు శ్రీశుకయోగి యిట్లు వచించె.

"రాజా, ద్వివిదుడను వాడొక వానరుడు. అతడు నరకాసురునికి సఖుడు. రామావతారకాలమున సుగ్రీవునకు మంత్రి మైందుడను వానికి సహోదరుడు. శ్రీకృష్ణుడు భౌమాసురుని సంహరించెనని విని, ద్వివిదుడు, తనమిత్రుని మిత్రత్వ ఋణమునుండి విముక్తుడుగాదలచి రాష్ట్రవిప్లవము ప్రారంభించినాడు. పెద్ద పెద్దనగరములను, పట్టణములను, పల్లెలను, గోకులములను నిప్పుపెట్టి కాల్చివేయుచుండె. అప్పుడప్పుడు పెద్ద పెద్ద పర్వతశిఖరముల పెకల్చి విసరివైచుచు కొన్నిప్రాంతములను చూర్ణముచేయుచుండె. విశేషముగ, ఆనర్తదేశమందే యీ విప్లవమునాతడు సాగించుచుండె. తన మిత్రహంతకుడగు గోవిందుడానర్తదేశమందే వసించుచున్నాడు! ఆ ద్వివిదవానరుడు పదివేల యేనుగుల బలముగలవాడు. అప్పుడప్పుడాతడు సముద్రతీరముజేరి చేతులతో సముద్రజలమును యెగరజిమ్ముచుండగా, తీరప్రాంతప్రదేశములా జలముతో మునిగిపోవుచుండెడివి. ఆ దుష్టుడు, మునీశ్వరుల యాశ్రమములందలి లతలను, వృక్షములను పెకలించి నాశనముచేయుచుండె. యజ్ఞసంబంధములగు అగ్నికుండములందు మలమూత్రముల విసర్జించుచు వారి యగ్నిహోత్రముల మలినపరచుచుండెడివాడు. మదోన్మత్తుడై వాడు స్త్రీ పురుషులను గొంపోయి కొండచరియలయందో గుహలయందో యుంచి బాధించుచుండెడివాడు. పెద్ద పెద్ద రాళ్ళతో గృహద్వారములను మూయుచుండెడివాడు. ఈ విధముగ

దేశములను నాశనమొనర్చుచు, కులస్త్రీల జెరచుచునుండ, నొకనాడతనికి సులలిత మగు సంగీతధ్వని వినిపించగా, దాని ననుసరించి యాతడు రైవతకాద్రి చేరినాడు.

అట, యదువంశ శిరోమణి యగు బలరాముడు, సుందర యువతీ సమూహా మధ్యమందు విరాజమానుడగుచు నతని కగుపడినాడు. అతని ప్రత్యంగము నత్యంత మనోహరముగ నుండినవి. వక్షఃస్థలముపై పద్మమాల ప్రకాశించుచుండె. అతడుమధు పాన మొనర్చి మధుర సంగీతమును గానము చేయుచుండె.ఆనందోన్మాదముచేనతని నయనములు విహ్వలములై యుండెనవి. ఆతని శరీరము మదమత్త గజేంద్రము వలె శోభిల్లుచుండినది. ద్వివిదుడచట నున్న వృక్షముల పైకెక్కి యూపుచు, నప్పు డప్పుడు స్త్రీల సమీపమునకేగి హర్షధ్వనులు చేయుచునుండ; చంచల స్వభావలగు యువతులు గూడ నతని కోతి చేష్టలకు పరిహాసముగ నవ్వుచు నానందించుచుండిరి. ఆ వానరుడు, బలరాముని యెదుటనే, యతని స్త్రీలను పరిహసించుచు నవమాన పరచసాగినాడు. తన గుదము నాతనికి ప్రదర్శించుచు, నొసలుచే వెక్కిరించుచు, గర్జించుచు నతనిని బెదిరింపసాగినాడు. వీర శిరోమణి యగు బలరామునకతని చేష్ట లచే కోపము వచ్చినది. అతడొక రాతి నాతనిపై విసిరివేయగా, ద్వివిదుడు తప్పిం చుకొని, యొక్క దూకు దూకి బలరాముని మధు కలశము నెత్తుకొనిపోయి యతని నవహేళన చేయసాగినాడు. ఆ ధూర్తుడా మధు కలశమును భగ్నము చేయుటయే గాక యచటి స్త్రీల వస్త్రములనుగూడ చించసాగినాడు. వికటముగ నవ్వుచు, బల రాముని పరిహసింపసాగినాడు. మదోన్మత్తుడైన ద్వివిదుడీ విధమున పరిహసించుచు, బలరాముని యందవినయమును జూపుచుండగా, వాని మొండితనమును, వానిచే పీడింపబడుచున్న ప్రదేశములదుర్దశను విచారించి,బలరాముడు వానిని వధించదలచి, హల-ముసలాయుధముల నెత్తె. ద్వివిదుడుగూడ చాల బలవంతుడగుటచేత, పెద్ద సాలవృక్షము నొకదానిని పెరికి, మహావేగముగా వచ్చి దానితో బలరాముని శిర ముపై గొట్టె. బలరాముడు పర్వతమువలె చలించకుండనుండి, తన శిరముపై బడ బోవుచున్న యా వృక్షమును బట్టుకొని, సునందమను పేరుగల తన ముసలాయుధ ముతో ద్వివిదుని గొట్టగా, నతని మస్తకము పగిలి, యందుండి, పర్వతము నుండి స్రవించు గైరిక ధాతువువలె, రక్తధార ప్రవహింపదొడగినది. అంత జరిగినను లక్ష్యము చేయక ద్వివిదుడు కోపముతో మఱియొక వృక్షము బెకలించి దాని యాకులు రాల్చి మొండిగా చేసి, దానితో బలరామునిపై ప్రహరించినాడు. బలరా ముడద్దానిని నూరుముక్క లొనర్చినాడు. ద్వివిదుడు మరియొక వృక్షమునేయగా, సంకర్షణుడు దానినిగూడ శతధా భిన్న మొనర్చె. ఈ ప్రకారము వరుసగా వృక్ష ముల బెకలించి ద్వివిదుడు ప్రహరించుటయు బలరాముడు వానిని ఖండించుచుండు టయు జరుగుచుండ, నా వనమందలి వృక్షములన్నియు నంతమైనవి. వృక్షములై పోవుటచేత వృద్ధి పొందిన కోపముగల ద్విపిపుడు రాతి బండలను ప్రయోగింప

సాగినాడు. కాని బలరాముడు వాటిని గూడ తన ముసలాయుధముచే చూర్ణమొనర్చి నాడు. చివరకు కపిరాజు తాల ప్రమాణములగు తన దీర్ఘ బాహువులతో పిడికిలి బిగించి, బలరామునిపై దూకి యాతని వక్షమందు ముష్టి ఘాత మొనర్చినాడు. బల రాముడు తన హలముసలముల నావల బెట్టి, క్రుద్ధుడై, రెండు చేతులతో నతనిజత్రు (మెడకంటె యెముక) స్థానమునందు గొట్టగా, వానరుడు రక్తము గ్రక్కుచు భువిపైపడిపోయె. తుపాను బీభత్సముచే కల్లోలితమగు జలమందుండు నావవలె, వాడు పడుటచే పర్వతము చలించిపోయినది. దేవతలు జయ జయ ధ్వానములొన ర్చిరి. సిద్ధులు నమస్కారములొనర్చిరి. ఋషులు, మునులు సాధువాదములుపలికిరి. దేవతలందరును బలరామునిపై కుసుమ వర్షమును గురిపింప సాగిరి.

ద్వివిదుడు గొప్ప యుపద్రవమును కల్గించినందున బలరాముడాతని సంహ రించె. అనంతరమాతడు ద్వారకకేగె. పురజనులు, పరిజనులు నందరును బలరా ముని ప్రశంసించుచుండిరి.

# అరువదియెనిమిదవయధ్యాయము

## కౌరవులపై బలరాముని కోపము-సాంబుని వివాహము

జాంబవతీతనయుడైన, సమితింజయుడగు సాంబుడు, దుర్యోధనునికుమార్తె యగు లక్షణాదేవీ స్వయంవరమునకేగి యామెను హరించి తెచ్చినాడు. దానితో కౌరవులకు క్రోధము కల్గినది. "ఈ బాలకుడు మర్యాదలేని మొండివాడు. వీడు మనందరిని నవమానించి, బలవంతముగా మనకన్యనపహరించినాడు"కన్యయువానిని కోరుటలేదు. కావున యీ దుర్వినీతుని పట్టి బంధించుడు. దానిచే యాదవులకు మనపై కోపమువచ్చినను వారు మనలనేమి చేయగలరు? మన దయాధర్మములపై నాధార పడి, మన మొసంగిన ధనధాన్యసమృద్ధమగు భూభాగమును వారనుభవించుచున్నారు. మనమీ బాలకుని బంధించిన సమాచారమును విని వారిచటికేతెంచినచో, మనము వారి గర్వమును ఖర్వము గావించుదము. సంయమియగు పురుషుడు ప్రాణాయామాద్యు పాయములచే వశమొనర్చుకొనబడిన యింద్రియములవలె, యాదవుల గర్వము తొలగి, వారిస్వభావము శాంతించును." అని యీ విధముగ నాలోచించి, కర్ణ,శల్య, భూరిశ్రవ, యజ్ఞకేతు, దుర్యోధనాది వీరులు, కురువృద్ధుల యనుమతిబడసి,సాంబుని బంధించుటకై ప్రయత్నించిరి.

మహారథియగు సాంబుడు, ధృతరాష్ట్రకుమారులు తనవెంటబడుట గమ నించినవాడై, సుందరమగు ధనుస్సుచేబూని, సింహమువలె యేకాకిగనే యుద్ధము నకు సన్నద్ధుడాయె. కర్ణుని ముందుంచుకొని, కౌరవవీరులు ధనుర్ధారులై, "నిలు

నిలు"మని యరచుచు సాంబుని సమీపించిరి. కయ్యమునకు కాలుదువ్వుచు వారు యదువీరునిపై బాణవర్షము గురిపించిరి. సాంబుడు, అచింత్యైశ్వర్యశాలియగు శ్రీకృష్ణభగవానుని పుత్రుడు. కౌరవుల ప్రహారములచే నతనికి వారిపై కోపము కల్గినది. ఆ కోపము, తుచ్ఛహరిణముల పరాక్రమముగాంచి సింహమునకు గలుగు కోపమువలెనున్నది. సాంబుడు తన ధనుష్టంకారముచేయుచు, వేర్వేరు రథములపై నున్న కర్ణాదియోధుల నార్గురనారేసి బాణములతో గొట్టినాడు. వాటిలో నాల్గేసిబాణములతో నాల్గు-నాల్గు గుర్రములను, నొక్కొక్క బాణము సారథిపైనను, మిగిలిన దానితో రథికుని గొట్టినాడు. సాంబుని యా హస్తలాఘవమును గాంచి, ప్రతిపక్ష యోధులత్యంతాశ్చర్య చకితులైనారు. ముక్తకంఠులై యాతనిని ప్రశంసించిరి. అనంతరమా యార్గురువీరులు కలిసి, సాంబుని విరథుని గావించిరి. నల్గురువీరులొక్కొక్క బాణముచే నతని రథమునకున్న యొక్కొక్క గుర్రమును జంపిరి. ఒక వీరుడాతని సారథిని గొట్టగా, మరియొకడాతని ధనుస్సును విరుగగొట్టిరి. ఈ విధముగా కురువీరులు మహాకష్టముతో సాంబుని విరథునిగావించి, పట్టుకొని బంధించిరి. విజయులైవారు హస్తినను ప్రవేశించి తమ కన్యకనంతః పురమునందు ప్రవేశపెట్టిరి.

నారదుని వలన ఈ సమాచారమును విన్న యదు వంశీయులకు తీవ్ర క్రోధము కల్గినది. మహారాజగు నుగ్రసేనునియాజ్ఞతో వారు కౌరవులపై దాడిచేయ సంకల్పించి సైన్య సమీకరణము చేయ దొడగిరి. కలిమలముల దొలగించునట్టి బలరాముడు, యాదవ కౌరవులకు కలహము గలుగుట కిచ్ఛగింపకయుండె. యాదవులు తమ యుద్ధ ప్రయత్నముల పూర్తిగావించినప్పటికిని, వారిని శాంత పరచి, బలరాముడు సూర్య సంకాశమగు రథము నధిరోహించి హస్తినాపురమునకేగె. అతని వెంట కొందరు బ్రాహ్మణులు, కొందరు యదు వృద్ధులు గూడ నుండిరి. గ్రహముల మధ్య చంద్రుని వలె బలరాముడు ప్రకాశించుచుండె. హస్తినాపురమును సమీపించి, పురమునకు వెలుపల నున్న యుద్యానవనమందు విడిసి, కౌరవులేమి చేయ దలిచి యుండిరో తెలుసుకొనుటకై, యుద్ధవుని దూతగా కౌరవుల వద్దకు బంపె.

ఉద్ధవుడు కౌరవ సభకేగి, ధృతరాష్ట్ర, భీష్మ, బాహ్లీక, దుర్యోధనాదులకు యథావిధిగ నమస్కరించి, "బలరాముడు వచ్చియుండె"నని విన్నవించె. తమ శ్రేయోభిలాషియు, ప్రియతముడునగు బలరాముడేతెంచెనని విన్న కౌరవులు ప్రసన్న చిత్తముతో, విధి పూర్వకముగ నుద్ధవుని సత్కరించిరి. అనంతరము మంగళ ద్రవ్యముల గైకొని, బలరాముని జేరి, పూజించి, గోదానమును, అర్ఘ్య ప్రదానములను చేసిరి. వారిలో బలరాముని ప్రభావము తెలిసిన పెద్దలు, శిరములు వంచి యాతనికి నమస్కరించిరి. పరస్పర కుశల ప్రశ్నానంతరము, బలరాముడు మహాధైర్యముగ గంభీరములగు వాక్కులతో నిటుల బల్కినాడు. "సర్వసమర్థుడు

రాజాధిరాజమహారాజునగు ఉగ్రసేనుడు మిమ్మీవిధముగ నాజ్ఞాపించుచున్నాడు. మీరు సావధానులై యేకాగ్రతతో నాలించుడు. ఎట్టియాలస్యము లేకుండ ఆ యాజ్ఞను పాలించుడు. ఉగ్రసేనుని యాజ్ఞ యేమనగా, "మీరనేకులు గలిసి యేకాకియై యున్న ధర్మాత్ముడగు సాంబుని నిర్జించి, బంధించిరను విషయము మాకు తెలిసినది. ఇది యధర్మము. పరస్పరము సంబంధులమగు మనలో విభేదములు పొడసూపరాదను భావముతో మేము మీ యీ యవినయమును సహించితిమి. (కావున యీ కలహమును పొడిగించక, సాంబుని, యతని నవవధూసహితముగ మావద్దకు పంపుడు).

బలరాముని వాణి, వీరత్వ శూరత్వబల పౌరుషముల యుత్కర్షచే పరిపూర్ణమై యతని శక్తికితగినట్లుండినది. అతని మాటలాలించి కురువంశీయులు కోపముచే నుడికిపోయిరి. వారిటుల పలుకసాగిరి. "ఆహా, యేమి యాశ్చర్యము, దురత్యయమగు కాలగతినెవరును తప్పించుకొనలేరుగదా! కిరీటమండితమగు శిరస్సుపైకి, నేడు పాదరక్షలెక్క జూచుచున్నవి. ఈ యాదవులతో నెట్టులో మనము సంబంధ బాంధవ్యములునెరపి, శయ్యాసన భోజనములు వారితోచేయుచు, మనతో వారికి సమానత్వము కలిగించితిమి. మనతో సమానముగ రాజపదవులనిచ్చి గౌరవించితిమి. చామరములు, వ్యజనములు, శంఖములు శ్వేతచ్ఛత్రములు, కిరీటములు, రాజ సింహాసనములు, రాజోచితములగు శయ్యాద్యుపభోగములనీ యాదవులనుభవించుచుండ, తెలిసియు మనము పేక్షచేసి యుండుటచే నింతవిపరీతము సంభవించినది. యదువంశీయులవద్ద యీ రాజచిహ్నములిక నుండరాదు. మనము వానిని తొలగింపనేవలయును. పామునకు పాలు పోయుటయనునది, పోసినవానికే హానికరముగ పరిణమించునట్లు, మనము వారికొసంగిన రాజచిహ్నములు, విపరీతముగా పరిణమించినవి. మన యనుగ్రహముచే వృద్ధిగాంచుచున్న యాదవులు, సిగ్గులేక, మనపైనే యధికారము చెలాయించజూచుచున్నారు. ఎంతకష్టమెంతకష్టము! సింహము యొక్క ఆహారము మేకపిల్ల యెత్తుకుపోలేనట్లు, భీష్మ, ద్రోణార్జునాది కురువీరులు వదలకున్నను, యివ్వకున్నను, స్వయముగ దేవరాజుగూడ యేవస్తువును అనుభవింపలేకుండును." అని పల్కిరి.

కౌరవులు తమ వంశము యొక్క గొప్పతనము గూర్చియు, భీష్మాదియోధవరుల బలము, ధన సంపత్తుల గూర్చియు గర్వించియుండుట చేత, నది యిప్పుడు పోవుచున్నట్లు బాధపడుచుండిరి. సాధారణమగు శిష్టాచారమును గూడ పరిగణించక ' బలరామునితో నటుల దురుసుగ మాటలాడి, హస్తినాపురమునకు తిరిగి వెడలిపోయిరి.

బలరాముడు వారి దుష్ట స్వభావమును చూచినాడు దురుక్తుల నాలించినాడు. అతని ముఖ మండలము క్రోధముచే నెర్రనై తేరి చూడరాకుండినది. పెద్దగా

నవ్వుచూ, "వీరన్నదినిజమే, తమ కులీనతను గూర్చియు, బలైశ్వరముల గూర్చియు గర్వించుచుండు వారు శాంతిని వాంఛించరు. వారిని శిక్షించి సరియైన మార్గములోనికి గొనువచ్చుటకు, వారితో మంచిగా మాట్లాడిన లాభములేదు. దండించుట యొక్కటే సరియైన పద్ధతి. పశువులను దారిలోకి మళ్ళించుటకు దండమేగదా యుపాయము! యదువీరులందరును, శ్రీకృష్ణసహితముగ, క్రోధోద్రిక్తులై యుద్ధమునకు సన్నద్ధులైయుండగా, నేను వారిని వారించి, వీరికి సచ్చజెప్పి శాంతులజేయుటకై వచ్చియుంటిని. కాని యీ మూర్ఖులిట్లు కలహకాముకులై యుండిరే! వీరికి శాంతియందు ప్రీతిలేదు. కలహమందే ప్రీతిగలదు. గర్వముతోనన్నవమాన పరచుచు,నోటికివచ్చినట్లు వదరుచున్నారు. సరే, పృధ్వియందలి రాజులమాటయట్లుంచి, యింద్రాది లోకపాలురు గూడ యెవరి యాజ్ఞలను పాలించుచున్నారో అట్టి యుగ్రసేనుడు రాజాధిరాజుగాదా? అతడు కేవలము, భోజ, వృష్ణి, అంధక వంశీయులగు యాదవులకు మాత్రమే స్వామియా! ఎందువలన? దేవసభయగు సుధర్మను స్వాధీనమొనర్చుకొని, దానియందు విరాజిల్లుచు, దేవతావృక్షమగు పారిజాతమును భూమిపైకిదెచ్చి యనుభవించుచున్న శ్రీకృష్ణభగవానుడు గూడ రాజసింహాసనార్హుడుగాడా! సరే మంచిది, సర్వజగత్తునకు నైశ్వర్య ప్రదాత్రియగు లక్ష్మిభగవతి, స్వయముగానెవని పాదాబ్జములను నిత్యము సేవించుచుండునో, అట్టి లక్ష్మిపతియగు శ్రీకృష్ణభగవానుడు, ఛత్రచామరాది రాజచిహ్నముల ధరించుటకు యోగ్యుడుకాడా? బాగున్నది. ఎవని చరణకమల ధూళికణములు, సత్పురుషులు సేవించునట్టి గంగాది తీర్ధములను గూడ పవిత్రముచేయుచున్నవో, యింద్రాది లోకపాలురందరు గూడ యెవని పాదాబ్జరేణువులను తమ మకుటములపై దాల్చుచుందురో బ్రహ్మ, శంకరుడు, లక్ష్మి గూడ యెవని కళయొక్క యంశలో, యట్టి శ్రీకృష్ణునకు సింహాసనమెక్కుడయున్నది? దిక్కులేని యాదవులు, కౌరవులిచ్చిన భూభాగము ననుభవించుచున్నారా? ఏమీ! మేము పాదరక్షలము; కౌరవులు శిరములా? ఈ కౌరవులైశ్వర్య మదమత్తులై, గర్వితులై. యున్మత్తులవలె ప్రేలుచున్నారు. వీరి ప్రతిమాటయు కర్ణకఠోరములై తలతోక లేనట్లున్నవి. వీరిని శాసించి, సరియైన మార్గమునకు తీసుకొని రాగలిగినట్టి నావంటి సమర్థుడు, వీరి కటుభాషణముల నెట్లుసహించి యూరకొనగలడు? పృధ్వియందు కౌరవుడనువాడు లేకుండ చేసెద"నని, త్రిలోకములను గూడ భస్మముచేయునా యనునంత కోపమును ప్రదర్శించుచులేచి, తన లాంగలాగ్రముచే హస్తినాపురమును పెకలించి గంగవైపునకు లాగుచుండె.

హలముచే లాగబడుచుండిన హస్తినాపురము, నీటియందు పయనించుచున్న నావవలె నూగులాడ సాగినది. తమ నగరము గంగార్పితము గాబోవుచుండుట

గాంచిన కౌరవులకు వ్యాకులమును కల్గినది. లక్ష్మణాదేవి సహితముగ సాంబునిముందుంచుకొని, తమ ప్రాణరక్షణార్థమై సకుటుంబముగ చేతులు జోడించుకొని, సర్వశక్తిసమన్వితుడగు బలరామదేవుని శరణుజొచ్చినారు, కౌరవులు.

"లోకాభిరామా, బలరామా, నీవు సమస్త జగదాధారుడవగు ననంతుడవు. మేము మూఢులము. మాబుద్ధి వక్రించినది. కావున మాయపరాధమును క్షమింపవేడుచున్నాము. నీవు సృష్టిస్థితిలయములకాధారుడవు. నిరాధారుడవు, సర్వశక్తిమంతుడవు. ఈ లోకములన్నియు నీ యాటవస్తువులనియు, నీవు వీటితో నాడుకొనుచుందువనియు మునీశ్వరులు పలుకుచుందురు. వేయిపడగలు గల యాదిశేషుడవు నీవు. అందొక ఫణాగ్రముపై లీలగా నీవీ భూభారమును వహించుచుంటివి. ప్రళయకాలమప్పుడు నీవీజగత్తునంతయు నీలో లీన మొనర్చుకొనుచుందువు. అపుడు నీవేశేషించియుండి, యద్వితీయరూపమున శయనించియుందువు. జగత్తును సంరక్షించుటకై విశుద్ధసత్త్వమయమగు శరీరమును దాల్చియున్నాడవు. నీకిప్పుడు కల్గిన క్రోధము, ద్వేషము, మాత్సర్యమువలన కల్గినదిగాదు. ఇది ప్రాణులను శిక్షించి సరియైన మార్గము నందు నడుపుటకే యుద్దేశింపబడినది. సర్వభూతాత్ముడవు, సర్వశక్తిధరుడవు, అవ్యయుడవు, విశ్వరచయితవు నగు నీకు నమస్కరించుచున్నాము. నిన్నే శరణందుచున్నాము. దయతో మమ్ము రక్షింపుము" అని వేడుకొనిరి.

కౌరవుల రాజధాని, యూగులాడుచున్నది. కౌరవులందరు వేపమానులై యుండిరి. వారందరావిధముగ స్తుతించిన మీదట, ప్రసన్నుడైన బలరాముడు వారికభయమొసంగినాడు. దుర్యోధనునకు తన పుత్రికయగు లక్ష్మణయందమిత ప్రేమయుండుటచేత, ఆరు సంవత్సరముల వయస్సుగల యేనుగులను పన్నెండు వందలును, పదివేల గుర్రములను, సూర్య సమానవర్చస్సుతో వెలుగొందుచున్న యారువేల బంగారు రథములను, సర్వాలంకార భూషితలగు వేయిమంది దాసీలను, కూతురికి కట్నముగా నొసంగినాడు. బలరాముడు వానినన్నిటినీ స్వీకరించి, నూతన వధూవరులతో పాటు కౌరవుల యభినందనలను గూడ స్వీకరించి ద్వారకానగరమునకు పయనమైనాడు. ద్వారక ప్రవేశించిన యనంతరము జరిగిన వృత్తాంతమంతయు తమ వారలకు, సభా మధ్యమందు వివరించినాడు.

ఆ బలరాముని పరాక్రమమును సూచించుచున్నదా యనునట్లు,హస్తినాపురమీనాటికి గూడ దక్షిణ భాగమందు కొంచె మెత్తుగను, గంగవైపునకు కొంచెము పల్లముగ నున్నట్లగుపడుచుండు"నని శ్రీశుకులు పరీక్షిత్తుతో పలికిరి.

# అరువది తొమ్మిదవ యధ్యాయము

## నారదుడు భగవానుని గృహచర్యను పరిశీలించుట

పరీక్షిన్మహారాజా, శ్రీకృష్ణభగవానుడు భౌమాసురుని వధించి, వేలకొలది రాజకన్యలను తానొక్కడే వివాహమాడెనను వార్తవిన్న నారదునకాతని గార్హస్థ్య జీవనవిధానమును పరిశీలింపవలయునను కోరికయుదయించినది. అహో, యిదియెంత యాశ్చర్యకరమగు విషయము; భగవానుడొక్కడే, పదునారువేల రాకొమరితల నొకేముహూర్తమునందు వివాహమాడుట యెంతయాశ్చర్యమ"ని తలచిన నారదుడు, భగవానునిలీలను దర్శించవలయునను కుతూహలముతో ద్వారకను ప్రవేశించినాడు. అచటి యుపవనములు, ఉద్యానవనములు వికసించియున్న రంగురంగుల పూలతో గూడిన లతావృక్షములతో నిండియుండినవి. పుష్పములపై మధుపములు మధురఝంకారములొనర్చుచు, తిరుగుచున్నవి. పక్షిగణములు కలకల నినాదము లొనర్చుచున్నవి. నిర్మలజల సంభరితములైన సరోవరములందు రకరకములగు కమలములు వింతసొబగునువెలార్చుచున్నవి. హంసకాండవములు మధురధ్వనులు చేయుచున్నవి. స్ఫటిక, రజత నిర్మితములగు తొమ్మిదిలక్షల భవనములున్నవి. ద్వారకయందు. తివాచీలయందు మరకతమణులు కూర్చబడియున్నవి. స్వర్ణరత్న నిర్మితములగు సామగ్రులు ప్రకాశించుచున్నవి. రాజవీధులు, చిన్నవీధులు, చత్వరములు, విపణివీధులు, అన్నియు మహాసుందరములుగానున్నవి. అశ్వశాలలు, పశుశాలలు, సభాభవనములు, దేవాలయములచేత, పట్టణశోభమరింత ప్రకాశించుచున్నది వీధులు, వాకిళ్ళు సుగంధజల సంసిక్తములైయున్నవి. ఎగురుచున్న పతాకములు ధ్వజములు, గొడుగువలె, యెండతగులకుండ జేయుచున్నవి.

ఆ ద్వారకాపట్టణమందత్యంత శోభాయమానమగు నచ్యుతుని యంతఃపురమున్నది. అది యింద్రాది దేవబృంద వందితము. దానిని నిర్మించుటయందు విశ్వకర్మ తన పూర్ణకళాకౌశలమును, సాధనసామగ్రిని వినియోగించియుండె. అందలి యంతఃపురము (రాణివాసము) నందు పదునారు వేలకుమించిన రాణులకు ప్రత్యేక ప్రాసాదములున్నవి.

దేవర్షియగు నారదుడందొక పెద్ద భవనమును ప్రవేశించినాడు. ఆ భవనమందలి స్తంభములు విద్రుమనిర్మితములు. పైకప్పు వైడూర్యములతోను, గోడలింద్రనీలమణులతోను నిర్మింపబడియున్నవి. క్రింద గూడ యింద్రనీలమణులు తాపడము చేయబడి సుందరముగ నున్నది. ముత్యాలజాలరులుగల వితానములు విశ్వకర్మచే నిర్మితములైయున్నవి. దివ్యభూషాంబరాదులు ధరించిన సుందరదాసీజనము తమ తమ పనులయందు నిమగ్నలైయుండి, ప్రాసాదశోభ నినుమడింపచేయుచుండిరి. అనేకములగు రత్నప్రదీపములు, ధగద్ధగాయమానముగ వెలుగుల విర

జిమ్ముచు ప్రాసాదమందలి యంధకారమును పారద్రోలుచున్నవి. అగరుధూపము, సుగంధము సర్వత్రా వ్యాపించుచున్నది. మణిమయములగు చూరులపైకెక్కి, గవాక్షములనుండి వెలువడుచున్న ధూపమును మేఘముగా భ్రమించిన మయూరములు, కేకలువేయుచు నృత్యమొనర్పసాగినవి

ఆ భవనము నందు, యజమానురాలగు రుక్మిణీదేవితో గూర్చుండియున్న శ్రీకృష్ణభగవానునిముని గాంచినాడు. రుక్మదండముగల చామరముతో రుక్మిణిదేవి భగవానుని వీచుచున్నది. ఆమెతో సమానమగు వయో రూప లావణ్యముగల దాసీజనమెందరో యున్నప్పటికిని, భగవానుని సేవ నామెయే జేయుచున్నది.

నారదుని చూచుటయే తడవుగ ధార్మిక శ్రేష్ఠుడగు భగవానుడు, పర్యంకము దిగి, నారదుని చరణయుగళమునకు, కిరీట మండితమగు తన శిరమునుజేర్చి నమస్కరించి, సాంజలియై, యాతనిని తన యాసన మందు గూర్చుండ బెట్టినాడు. శ్రీ కృష్ణ భగవానుడు చరాచర జగత్తునకు పరమ గురువు అనుటలోను, అతని పాద జలమగు గంగ పరమపావని యనుటలోను సందియములేదు గదా, అయిననునతడు పరమభక్తవత్సలుడు. సజ్జనుల కాదర్శమూర్తి. వారికి ప్రభువు. అతనికి బ్రహ్మణ్య దేవుడను నొక యసాధారణ నామమున్నది. అతడు బ్రాహ్మణులనే తన యారాధ్య దైవములుగా భావించుచుండును. ఈ నామమతని గుణము ననుసరించి కల్గినదియై యతనికి తగియున్నది. అందుచేత భగవానుడు స్వయముగ నారదుని పాదములను ప్రక్షాళన మొనర్చి, యా పాద జలమును తన శిరమున దాల్చినాడు. నరశిరోమణియు నరసఖుడును, సర్వదర్శియు, పురాణపురుషుడు నగు నారాయణుడు, శాస్త్రోక్తముగ నారదుని పూజించి, అద్భుతము కంటె మధురములగు మితభాషణములతో స్వాగత సత్కారముల నెరపి యతనితో నిట్లు పల్కె. "స్వామీ, నీవు సమగ్రమగు జ్ఞాన వైరాగ్య, ధర్మ, యశః శ్రీయైశ్వర్యములతో పూర్ణుడవు. నేను నీకేమి సేవ జేయవలయునో సెలవిమ్ము."

అని పలికిన భగవానునితో, నారదుడు, "ప్రభూ, నీ వఖిలలోకనాథుడవు. నీవు నీ భక్త జనులను ప్రేమించుటయు, దుష్టుల దండించుచుండుటయు, క్రొత్త విషయములుగావు. జగత్తునకు స్థితి, రక్షణలు కల్పించుట ద్వారా నీవు సమస్త జీవులకు శుభము చేకూర్చుటకే, భువిపై నవతరించుచుందువు. ఈ విషయము మాకు బాగుగా తెలియును. నేడు నా యదృష్ట వశమున నీ చరణ కమల సందర్శనము లభించినది. నీ చరణ కమలములు, సర్వజీవులకు పరమ సౌభాగ్యమును, మోక్షమును, గలిగింప సమర్థములు. అపరిమిత జ్ఞానము గలిగిన విధి శంకరాదులుగూడ దానిని యెల్లప్పుడును తమ హృదయములందు ధ్యానించుచుందురు. యథార్థమునకు ఆశ్రీచరణములే, సంసార రూపమగు నూతియందు మునిగి యున్న వారి నుద్ధరిం

చుట కవలంబనములు. అటువంటి నీ చరణ కమలముల స్మృతి నా కెప్పుడును కలిగి యుండునట్లును, నే నెచటనే స్థితిలోనున్నను వాని ధ్యానమునందే తన్మయుడనై యుండునట్లును, నన్ననుగ్రహించుమ"ని పలికె.

అనంతరము దేవర్షియగు నారదుడు యోగీశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుని యోగమాయా ప్రభావము యొక్క రహస్యము నెఱుంగుటకై యాతని మఱియొక పత్నియొక్క ప్రాసాదమును ప్రవేశించినాడు. అచట భగవానుడు తన భార్యతోను, ఉద్ధవునితోను పాచికలాడుచుండె. నారదుని గాంచిన తోడనే భగవానుడులేచి, స్వాగతము పల్కి సుఖాసీనుంగావించి, మహాభక్తితో నతని నర్చించె. తెలియని, అమాయకునివలె, నారదునితో, స్వామీ, తమరిచ్చటికెప్పుడేతెంచిరి? ''మీరు పరిపూర్ణులు, ఆప్తకాములు, మేమపూర్ణులము. ఇట్టి మేము మీకెమి సేవ గావింపగలము? అయినను, బ్రహ్మ స్వరూపుడవగు, నారదా, మాకేదేనియొక యాదేశ మొసగి, తమకు సేవ చేయు భాగ్యము మాకు కలిగించి, మా జన్మ సఫలము గావించుడు" అని పలుక నారదుడు చకితుడైనాడు. విస్మయాశ్చర్యములు కలుగుచుండినవి.

నారదుడచట నుండి లేచి, మౌనముగ మరియొక ప్రాసాదమును చేరినాడు. అచట భగవానుడు పసిపిల్లలను ముద్దాడుచుండెడినాడు. అచట నుండి మరియొక భవనము చేరగా, నచట భగవానుడు స్నానము చేయ ప్రయత్నములోనుండె. (ఈ విధముగ భగవానుడు వేర్వేరు భవనములయందు వేర్వేరు కార్యములనిర్వర్తించుచుండుటను నారదుడు గాంచె). ఒకచోటనాతడు యజ్ఞకుండమందు హోమముచేయుచుండ వేరొకచో పంచయజ్ఞములతో దేవతలు మొదలగు వారినారాధించుచుండె. ఒకచోట బ్రాహ్మణసంతర్పణ చేయుచుండ, మఱియొకచోట తాను స్వయముగ యజ్ఞశేషమును భుజించుచుండె. ఒకచోట సంధ్యావందనము చేయుచుండె. వేరొకచోట మౌనముగ గాయత్రిని జపించుచుండె. ఇంకొకచోట డాలు, కత్తులగైకొని, ఖడ్గచాలనగతులను ప్రదర్శించుచుండె. ఒకచో, గుఱ్ఱపుస్వారి చేయుచునో, గజము లేక రథమునెక్కియో విహరించుచుండె. మరియొకచోట పర్యంకమందు నిదురించుచుండె. వేరొకచో, వంధిమాగధులతనిని స్తుతించుచుండిరి. ఒక మహలునందు ఉద్ధవాది మంత్రి సత్తములతోనేదియో యొకగంభీర విషయమును గూర్చి మంత్రాలోచనము చేయుచుండె. వేరొకచోట, ఉత్తమోత్తమ వారాంగనా పరివృతుడై జలక్రీడ లొనర్చుచుండె. మరియొకచోట బ్రాహ్మణోత్తములకు, వస్త్రాభూషణాద్యలంకృతములగు గోవులను దానమిచ్చుచుండె. ఇంకొకచోట యితిహాస-పురాణశ్రవణము చేయుచుండె. ఇంకొకపత్ని యింటియందు, ప్రియురాలితో హాస్యప్రసంగములు చేయుచు నవ్వుచు వినోదించుచుండె. ఒకచోధర్మమును, వేరొకచోట అర్థకామములు సేవించుచుండె ఒకచోటనేకాంతముగ గూర్చుండి, ప్రకృతికంటె పరుడగు పురాణపురుషుని ధ్యానించుచుండె. ఇంకొకచోట గురుజనుల కభీష్టములగు భోగసామగ్రు

లను సమర్పించి వారికి సేవా-శుశ్రూషలొనర్చుచుండె. ఇంకొకచోట యుద్ధ చర్చలు జరుగుచున్నవి. వేరొకచోట సంధి ప్రసంగములు సాగుచుండె. మరియొకచోట బల రామ సహితుడైయుండి సత్పురుషులకు శుభములు కల్గించు విషయములగూర్చి విచా రించుచుండె. వేరొకచోట, తన పుత్రులకు, పుత్రికలకు తగిన వధూ వరులతో మహా వైభవముగ వివాహమహోత్సవముల జరుపుచుండె. వేరొక గృహమునందు, సకల లాంచనములతో కూతురిన త్తవారింటికనుపుచుండె. ఇంకొకచోట కూతురిని పుట్టింటికి పిలుచుకొని వచ్చు ప్రయత్నములు జరుగుచున్నవి. యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుని, యీ వివిధ లీలలనుగాంచి లోకులు విస్మితులగుచుండిరి. ఇంకొకచోట, గొప్ప యజ్ఞములద్వారా, సమస్తదేవతారాధనలు జరుగుచుండగా, వేరొకచోట, నూతుల త్రవ్వించుట, తోటల నిర్మాణము, మఠములు నిర్మించుట మొదలగు యిష్టా పూర్త ధర్మాచరణ మొనర్చుచు భగవానుడగుపడియె. ఇంకొకచోట, యాదవ శ్రేష్ఠులతో గూడి సైంధవాశ్వములనెక్కి, వేటాడుచుండగా, మరియొకచోట యజ్ఞార్థము మేధ్య పశువుల వధించుచుండె. ఒకచోట ప్రజలయందు, అంతఃపురములయందు, మారు వేషములదాల్చి, వారియభిప్రాయముల దెలుసుకొనుటకై గుప్తరూపమున సంచరించు చుండె. అతడు యోగేశ్వరుడుగదా.

ఈ విధముగ మనుష్యునివలె లీలలొనర్చుచున్న హృషీకేశుడగు భగవానుని యోగమాయా వైభవమును తిలకించిన దేవర్షియగు నారదుడు, చిరునవ్వునవ్వుచు భగవానునితో నిట్లు పల్కె.

"యోగేశ్వరా, ఆత్మస్వరూపా, నీ యోగమాయ బ్రహ్మాది మాయావులకు గూడ నగమ్యమై యుండునట్టిది. కాని మేము నీయోగమాయారహస్యమును యెఱు గుదుము. ఏలననగా, మేము నీ చరణముల సేవించువారము గావున. ఆ యోగ మాయ తనంతట తానే తనస్వరూపమును ప్రకటితము గావించుచుండును. దేవాధి దేవా! పదునాలుగు భువనములును నీ కీర్తిచే నిండి యున్నవి. భువనపావనమగు నీయశోగానము చేయుచు నన్నిలోకములందు తిరుగుటకు నాకాజ్ఞయొసంగు" మని నారదుడు వేడగా, భగవానుడిట్లనియె.

"దేవర్షీ, నారదా, ధర్మములనుపదేశించు వాడను నేనే. వాటిని పాలించు వాడను, వానిననుష్ఠించు వారలనను మోదించువాడను గూడనేనే. కావున, ప్రపం చమునకు ధర్మము నేర్పుటకై, యీ విధముగ నేను ధర్మము నాచరించుచుందును. ప్రియకుమారా, నీవీ యోగమాయను గాంచి మోహితుడవు గాకుము"

ఈ రీతిగా, భగవానుడు, గృహస్థులను పవిత్రులగావించునట్టి పరమ ధర్మ ములనాచరించుచుండె. అతడొక్కడేయైనను, నారదుడాతనిని ప్రతిభార్య యింటి యందునను వేర్వేరు రూపములతో దర్శించినాడు. భగవానుని యోగమాయా ప్రభావమును గాంచిన కొలదియు, నారదుని విస్మయాశ్చర్యముల కంతు లేకుండె

బోయినది. ద్వారకానగరము నందు భగవానుడు గృహస్థునివలె, తనకు ధర్మార్థ కామములందెంతయో శ్రద్ధయున్నటులే ప్రవర్తించినాడు. దేవర్షియగు నారదుని ఘనముగ సన్మానించినాడు. నారదుడును అత్యంత ప్రసన్నుడై, భగవానుని స్మరించుచు ద్వారకను వీడిచనియె.

రాజా, శ్రీమన్నారాయణుడు జగత్కల్యాణార్థము, అచింత్యమగు తనయోగ మాయా మహాశక్తిని స్వీకరించి, యీ ప్రకారము మనుష్యునివలె లీలలను చేయుచుండును! ద్వారకా నగరమునందు పదునారువేలకు మించిన యతని భార్యలు సిగ్గుతో గూడిన ప్రేమ భరితములగు చూపులచేతను, చిరునగవులచేతను నతనిని సేవించుచు, నతనితో గూడి విహరించుచుండిరి. భగవానుడొనర్చిన లీలలను మరియొకడు చేయలేడు. విశ్వోత్పత్తిస్థితిలయములకాతడు పరమకారణుడు. భగవానుని లీలల నెవడు గానముచేయునో, యెవడు వినునో, యెవడు గాన-శ్రవణముల చేయువారినను మోదించునో, వానికి, మోక్షమార్గ స్వరూపములగు భగవానుని చరణములందు ప్రేమ యుక్తమగు పరమ భక్తి లభించు"నని శ్రీశుకులు, పరీక్షిన్మహారాజుతో పలికిరి.

# డెబ్బదియవ యధ్యాయము

## శ్రీకృష్ణుని దినచర్య-జరాసంధ బంధితులైన రాజుల సందేశము

ద్వారకా నగరమందు, తెల్లవారు సమయమందు కూయు కుక్కుటములను శ్రీకృష్ణ పత్నులు తిట్టుచుండిరి. అంతవరకు శ్రీకృష్ణుడు తమ కంఠము నందు తన బాహువులుంచి నిదురించుచుండి, యీకోడి కూతతో లేచి పోవునుగనుక, తమ సౌఖ్యమునకు వియోగము కలుగునని వ్యాకులము చెంది, వారట్లు కోళ్ళను తిట్టుచుండిరి. పారిజాతసుమసుగంధ భరితమగు వాయువు మందమందముగ వీచుచుండ, తుమ్మెదలు ఝుంకారములొనర్చుచుండ, వంది జనములవలె పక్షులు తమ కలరవముతో మేల్కొలుపులు పాడుచుండ, నత్యంత శోభనమగు నట్టి యా బ్రాహ్మ ముహూర్తమును గూడ, ప్రియాలింగన విశ్లేషము కల్గునను శంకచే, రుక్మిణీదేవి యసహ్యించుకొనుచుండెడిది. శ్రీకృష్ణుడు బ్రాహ్మ ముహూర్తమందేలేచి, ముఖ సమ్మార్జన మొనర్చి, కాలుసేతులు కడుగుకొని, మాయాతీతమగు తన యాత్మ స్వరూపమును ధ్యానము చేయుచుండెడువాడు. ఆ యాత్మ స్వరూపము, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితము, అఖండము, అద్వితీయము. దాని యందెట్టి వంటి యుపాధిగాని, యుపాధికి కారణమగునట్టి యితరవస్తువులుగాని లేవు. అది

యవ్యయము. సత్యము. చంద్రసూర్యాదులునేత్రేంద్రియము ద్వారాను, నేత్రేంద్రియము చంద్ర సూర్యులద్వారాను ప్రకాశితములగునట్లుగా, ఆత్మస్వరూపము యితర వస్తువులచే ప్రకాశింపబడునట్టిదిగాదు. అది స్వయం ప్రకాశము. తన స్వరూపమందే యెల్లప్పుడు కాలమునకతీతముగ అఖండైకరసముగ నుండుటచేత, అవిద్య యను నది దానిని స్పృశింపజాలకుండును. ఇందుచేతనే ప్రకాశ్య—ప్రకాశక భావమందు లేదు. జగదుత్పత్తిస్థితిలయములకు కారణమగు బ్రహ్మశక్తి విష్ణుశక్తి, రుద్రశక్తుల ద్వారా, అదియేకరసమనియు, సత్తారూపమనియు, ఆనంద స్వరూపమనియు, కేవలమూహింపబడుచున్నవి. దానిని తెలుసుకొనుటకై "బ్రహ్మ" యను పేరుతో వ్యవహరింపబడుచున్నది. శ్రీకృష్ణభగవానుడట్టి యాత్మ స్వరూపమునే నిత్యము ధ్యానించుచుండును.

అనంతరమతడు, శాస్త్రోక్తముగ పవిత్రజలములందు స్నానమాచరించి శుభ్రవస్త్రములు ధరించి, యథావిధిగ సంధ్యావందనాది నిత్య కర్మలనాచరించును, హవనము లొనర్చును. మౌనియై గాయత్రిని జపించును. అతడు సత్పురుషుల కాదర్శముగ ప్రవర్తించుచుండును.

అనంతరము సూర్యోదయ సమయమందు సూర్యోప స్థానమొనర్చి, కాల స్వరూపులగు, దేవతలకు, ఋషులకు, పితరులకు తర్పణములిచ్చును. కులవృద్ధులకు, బ్రాహ్మణులకు పూజలు చేయును. అనంతరము, పాలిచ్చునట్టి మొదటి యీత యావులను, సాధువులైనట్టి వానిని చక్కగా నలంకరించి, సవత్సకముగా బ్రాహ్మణులకు దాన మొసంగును. ప్రతి దినము నట్టి గోదానమును పదమూడు వేల యెనుబదినాలుగింటిని చేయుచుండును. అనంతరము తన విభూతి రూపములగు, గోబ్రాహ్మణులకు, కులవృద్ధులకు, గురుజనములకు, సమస్త ప్రాణులకు నమస్కరించి మంగళద్రవ్యములను స్పృశించును. భగవానుని సహజసౌందర్యమే మానవ లోకమున కలంకారభూతమై యున్నప్పటికిని, పీతాంబరాది దివ్యవస్త్రములతోడను, కౌస్తుభమణి మొదలగు ఆభరణములతోను, చందనాది దివ్యాంగరాగములచేతను తనను చక్కగా నలంకరించుకొనుచుండును. అద్దమునందు తన ముఖారవిందమును సరిచూచుకొని, గోవులు, యెద్దులు, బ్రాహ్మణులు, దేవతామూర్తులను దర్శించును. పిమ్మట నంతఃపురవాసులయొక్కయు, నగరమందున్న నాలుగువర్ణముల ప్రజల యొక్కయు వాంఛితములను దీర్చి, యనంతరమితర ప్రజల (గ్రామవాసుల) యొక్క కోరికలనుగూడ సఫలమొనర్చుచుండును. వారందరు ప్రసన్నులై యుండుటగాంచి తానానందించుచుండును. పుష్పమాలలు, తాంబూలములు, చందనము, అంగరాగాది వస్తువులను ముందుగా బ్రాహ్మణులకు, స్వజనులకు, బంధులకు, మంత్రులకు రాణులకు పంచియిచ్చి, మిగిలిన వానిని తానుపయోగించుకొనుచుండును. భగవానుడీ పనియంతయు పూర్తి గావించునంతలో, దారుకుడను సారథి

శైబ్య, సుగ్రీవ, మేఘపుష్పవలాహకములను నాల్గుగుర్రములు పూన్చిన యద్భుత మగు రథమునుదెచ్చి, భగవానునకు వినయముగ నమస్కరించి నిలుచుండిపోవును.

శ్రీకృష్ణుడుద్ధవ సాత్యకి సహితముగ వచ్చి, దారుకుని కేలందుకొని, యుదయాచలముపై భువనభాస్కరుడగు సూర్యుడధిరోహించునట్లు, రథారూఢు డగును. ఆ సమయమందు రాణివాసమునందలి స్త్రీలు, సిగ్గు-ప్రేమ పెనగొనుచున్న చూపులతో స్వామినే వీక్షించుచు, నతికష్టముతో నతనికి వీడ్కోలు చెప్పుచుందురు. భగవానుడు మందహాసము చేయుచు వారి చిత్తముల దొంగిలించుచు, భవనమునుండి బయలుదేరును.

అచటినుండి బయలుదేరి యాతడు, సమస్త యాదవులతోగూడినవాడై, సుధర్మాసభను ప్రవేశించును. ఆ సభయొక్క మహిమ యెట్టిదనగా, నందుండు వారిని, ఆకలిదప్పులు, శోక-మోహములు, జరామరణములునను షడూర్మలు బాధింపకుండును.

ఈ ప్రకారము భగవానుడు ప్రతిరాణివాసమునుండియు వేర్వేరుగా వీడ్కొలొసంగబడినవాడై, యేకరూపముననే సభను ప్రవేశించి యున్నతాసనమందుపవిష్టు డగును. అతని శరీరకాంతిచే దిక్కులన్నియు ప్రకాశవంతములగును. ఆకాశమందు తారకలమధ్య చంద్రుడు శోభాయమానమగుచుండునట్లు, యదువంశ శిరోమణియగు గోవిందుడు యాదవవీరులమధ్య సభలో విరాజమానుడగుచుండును. సభయందలి విదూషకులు వివిధ ప్రకారములగు హాస్యవినోదములచేతను, నాట్యాచార్యులు అభి నయముచేతను, నర్తకీమణులు కళాపూర్ణములగు నృత్యములచేతను, తదనుగుణ మగు మృదంగవీణామురజ వేణుతాలాది స్వర్గములచేతను, భగవానుని సేవించు చుందురు. స్తుతించుచుందురు. వ్యాఖ్యాన కుశలురగు బ్రాహ్మణులు కొందరు వేద మంత్రములకు వ్యాఖ్యానములు చెప్పుచుందురు కొందరు, పవిత్ర కీర్తిగలిగిన పూర్వనరపతుల కథలను వినిపించుచుందురు.

ఒకనాడు ద్వారకాపురమందావిధముగ రాజసభ జరుగుచుండగా, సభా ద్వారమునొద్దకొక నూతన పురుషుడేతెంచె. ద్వారపాలకుడు భగవానునకా సమా చార మెఱిగించి, యతని యనుమతితో నూతన పురుషుని సభలో ప్రవేశపెట్టినాడు ఆ పురుషుడు చేతులు జోడించి భగవానునకు నమస్కరించి, జరాసంధుని సార్వ భౌమత్వమున కంగీకరింపని కారణముచేత నతనిచేనిర్జించబడి బందీలుగానున్న. యిరువదివేలమంది రాజుల దుఃఖమును, శ్రీకృష్ణునకీ విధముగ నివేదించినాడు.

"సచ్చిదానంద స్వరూపా, శ్రీకృష్ణా, నీవు మనోవాచామగోచరుడవు. నిన్ను శరణొందిన వారల సర్వభయములను పోగొట్టునట్టి దయామూర్తివి. ప్రభూ, మా భేదబుద్ధి నశించలేదు. మేము జనన మరణరూపమగు సంసారచక్రమందు

పరిభ్రమించుచు, భయభీతులమై నిన్ను శరణు వేడుచున్నారము. జీవులలో నెక్కువ మంది నీచే నుపదేశింపబడిన పరమ కల్యాణకారములగు కర్మలనుండి, నీ యుపాసనలనుండి విముఖులై జీవన సంబంధములగు ఆశలు - అభిలాషలయందు పరిభ్రమించుచున్నవారై, అందుకనుగుణమగు సకామకర్మలయందును, మరియు నిషిద్ధకర్మలయందును నిమగ్నులై పోవుచున్నారు. కాని, నీవు మహాబలవంతుడవు. కాలరూపముతో నీవెల్లపుడు సావధానుడవై యుండి, వారి యాశాలతలను సమూలముగ పెకలించి వేయుచుందువు. అట్టి కాలరూపుడవగు నీకు మేము నమస్కరించుచున్నాము. నీవు స్వయముగ జగదీశ్వరుడవు. సజ్జన రక్షణార్థము, దుర్జన శిక్షణార్థము నీవు జగత్తునందు నీ జ్ఞానబలాది సర్వకళలతో నవతరించుచుందువు. అట్టి స్థితియందు, జరాసంధాదులగు కొందరు రాజులు నీ కోరికకు ఆజ్ఞకు విరుద్ధముగ మావంటి వారికెట్లు దుఃఖము కల్గించుచుండిరో మాకవగతమగుటలేదు. జరాసంధుడు మాకు కష్టము కలిగించుటలేదు అతనిని నిమిత్తముగా జేసుకొని మా పాపకర్మయే మాకు దుఃఖము కలిగించుచున్నదని పల్కుచూ, ఆ మాటగూడ సరియైనదిగాదు. ఏలననగా, మేము నీవారమైయుండగా, మా దుష్కర్మ మాకు పాపఫలితములనొసంగుటకెట్లు సమర్థమై యుండగలదు? కావున మాయందు దయగలవాడవై వెంటనే మమ్మీ క్లేశమునుండి యుద్ధరించి కాపాడుము. ప్రభూ,రాజసుఖములు,ప్రారబ్ధాధీనములనియు మేమెరుగుదుము. నిజము చెప్పవలెనన్నచో, యీ రాజసుఖము అత్యంత తుచ్ఛములు, నశ్వరములు. ఆ భోగము లనుభవించునట్టి యీ శరీరముగూడ శవప్రాయమే శతవిధములగు భయము లెల్లపుడును యీ శరీరమునంటియే యుండును. కాని మేమీ శరీరముతోడనే జగత్తునందనేక కష్టములను సహించుచు కాలము గడుపుచుంటిమి. మూలకారణమేమనగా, నిష్కామభావము, నిస్సంకల్పము నగు నంతఃకరణముచే లభించునట్టి యాత్మసుఖమును మేము పరిత్యాగమొనర్చితిమి. నిజముగా మేము మహామూఢులము. నీ మాయాజాలమునందు తగుల్కొనినవారమై దుఃఖముమీద దుఃఖము ననుభవించుచున్నారము. స్వామీ, నీ చరణకమలముల శరణువేడినవారల సమస్తశోకములను మోహములను నశింపజేయునట్టి మహానుభావుడవు నీవు. కావున జరాసంధరూపమున నున్న మా కర్మబంధములత్రుంచివేయుము. మమ్ము ముక్తులగావింపుము. వాడొక్కడే పదివేల యేనుగుల బలముగలవాడు. సింహము మేకలనువలె, వీడు మమ్ముల బంధించి బాధించుచున్నాడు. చక్రపాణీ, నీవు పదునెనిమిదిమారులా దుర్మార్గునితో దురమొనర్చియుంటివి. అందు పదునేడు పర్యాయములు వాని బలమునంతయు సర్వనాశన మొనర్చియు వానిని చంపకుండ విడిచితివి. కాని పదునెనిమిదవమారు నిన్నాతడు జయించినాడు. నీ శక్తి, బలపౌరుషము లనంతములని మాకు దెలియును. అయినను మానవులవలె ప్రవర్తించుచు నీ

వోడిపోయినట్లభినయించితివి. కాని దానిచే వానిగర్వమినుమడించినది. అజితా, మేము నీ భక్తులమనియు, నీ ప్రజలమనియు తెలిసిన జరాసంధుడు మమ్మధికముగ బాధించుచున్నాడు" అని యా రాజుల సందేశమును వినిపించి, యాదూత భగవానునితో ప్రభూ, జరాసంధ బంధితులైన రాజుల ప్రార్థనను నీకు విన్నవించితిని. ఆ రాజులందరును నీకు శరణాగతులై, నీ దర్శనముకొరకు నిరీక్షించుచున్నారు. దయతో నీవా దీనులకు శుభము కలిగించవేడుచున్నా"నని పలికె.

పరీక్షిన్మహారాజా, రాజులు పంపిన దూత ఈ విధముగ విన్నవించుచున్న సమయమందే పరమ తేజస్వియగు నారదమహర్షి సభకేతెంచె. అతని పింగజటాభార ముదయించుచున్న సూర్యకాంతిని తిరస్కరించుచుండె. సాక్షాత్తు సూర్యుడే దిగివచ్చెనాయను భ్రాంతి కల్గినది సభాసదులకు. సర్వలోకేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుడు తనవారందరితో నాసనములనుండి లేచి, తలవంచి దేవర్షికి నమస్కరించి, యుచితాసనాసీనుం గావించి, యథావిధిగ పూజించి, తన మధురములగు మాటలతో నాతని సంతసింపజేయుచు నిట్టులనియె "దేవర్షీ, ముల్లోకములందు యిప్పుడందరు కుశలముగా నున్నారా? నీవు ముల్లోకములందు సంచరించుచుందువుగాన, మేమింటివద్దనుండియే సర్వలోక సమాచారములను తెలుసుకొను లాభమును మీవలన బొందగలుగుచుంటిమి. ఈశ్వర కర్తృకములగు లోకములందు నీకు తెలియని విషయమేమియు నుండదు. అందుచే నీవలన, యుధిష్టిరాది పాండవులీ సమయమందేమి చేయదలచుచుండిరో తెలియగోరుచుంటి"నని పలికిన భగవానునితో నారద మహర్షి యిట్లనియె.

"సర్వవ్యాపివగునో యనంతా, నీవు విశ్వనిర్మాతవు. మహామాయావులగు బ్రహ్మాదులుగూడ నీ మాయయొక్క సారమును తెలియలేనంత, మహా గొప్ప మాయావివి. కాష్ఠములన్నిటియందగ్ని నిగూఢముగా నుండునట్లు, నీవు సర్వభూతములయందు నీ యచింత్యశక్తిచే వ్యాపించియుందువు. లోకులదృష్టి సత్త్వాది గుణములయందు తగుల్కొని యుండుటచే వారు నిన్ను దర్శింపలేకున్నారు. నేనొక పర్యాయముగాదు అనేక పర్యాయములు నీ మాయను స్వయముగ దర్శించితిని.

అందుచే నీవేమియు తెలియనివానివలె నన్ను పాండవుల సమాచారముతెలుపుమని యడిగి నందులకేమియు నాశ్చర్యపడను. నీ మాయచేతనే నీవీ జగత్తును రచించి, లయము చేయుచున్నావు. నీ మాయ కారణముచేతనే యీ జగత్తు అసత్యమైనను సత్యముగా ప్రతీతమగు చున్నది. నీ వెప్పుడేది చేయదలచెదవో, యెవడెఱుగగలడు? సర్వదా నీ స్వరూపము చింతనీయము. నేను నీకు పునఃప్రణామములు గావింతును. శరీరము, శరీర సంబంధములగు వాసనలయందు చిక్కుకొని పోయిన జీవుడు, సంసారచక్ర మందు పరిభ్రమించుచుండి, యీ శరీరము నుండి ముక్తుడగు మార్గమును దెలియకున్నాడు. వాస్తవములో, జీవునకు హితము చేకూ

ర్చుటకే, నానాప్రకారములగు నవతారములెత్తి, అనర్థకారియగు శరీరము నుండి విముక్తి పొందుటకనువగు నీ పవిత్ర యశమను దీపమును నీవు ప్రకాశింప జేయు చుందువు. కావున నేను నిన్ను శరణందుచున్నాను. నీవు స్వయముగ పరబ్రహ్మ వయ్యుండియు మనుజ లీలలను నటించుచు నన్నడుగుచుంటివి. కావున, నీ మేనత్త కుమారుడగు యుధిష్ఠిరుడేమి చేయదలచు చుండెనో నేను నీకు వినిపించెద. వినుము. ఎవనికైనను బ్రహ్మలోకమందు లభించునట్టి భోగములు, ధర్మజునకిహ లోకము నందే సంప్రాప్తమై యున్నవనుటలో నెట్టి సందియమును లేదు. అయినను పార మేష్ఠ్యకాముడై యాతడు రాజసూయ మఖము ద్వారా నిన్నారాధింపవలయునని యోచించుచున్నాడు. నీవు దయతో నాతని యీ యభిలాష నామోదించుము. ప్రభూ, ఆ శ్రేష్ఠమగు యజ్ఞయందు నిన్ను దర్శించుటకై దేవతలు నరోత్తము లందరు నొక చోట సమావేశము కాగలరు. నీవు విజ్ఞానానంద ఘనుడవు. నిన్ను శ్రవణ కీర్తన, ధ్యానము లొనర్చి నంతమాత్రముచేతనే అంత్యజుడు గూడ పవిత్రుడైపోవును. అట్టిచో నీ దర్శన స్పర్శన భాగ్యము లభించిన యదృష్ట వంతుల విషయము వేరే చెప్పవల యునా? భువన మంగళా, నిర్మలమగు నీకీర్తి సమస్త దిక్కుల యందును, స్వర్గ మర్త్య పాతాళ లోకములయందుగూడ, నీ చరణామృత ధార స్వర్గమందు మందా కినిగను, పాతాళమునందు భోగవతిగను మర్త్యలోకమందు గంగయను పేరుతోను ప్రవహించుచు విశ్వమునంతను పవిత్రమొనర్చుచున్నటులనే వ్యాపించి ప్రపంచమును పావన మొనర్చుచున్నది" అని నారదుడనియె.

సభ యందున్న యాదవులందరును, ముందు జరాసంధునిపై దాడి వెడలి యాతనిని జయింప వలయునను నుత్సాహము వెలిబుచ్చిరి. అందువలన, నారదుని పలుకులు వారికి రుచించలేదు. కేశవుడు చిరునగవు నగుచు మధురముగ నుద్ధవుని గాంచి, యిట్లు పల్కె.

"ఉద్ధవా, నీవు నా హితమును గోరు సుహృద్వరుడవు. చక్కని మంత్రా లోచన మొనర్పగల సమర్థుడవు. నీతికోవిదుడవు. అందుచే నిన్ను నాయుత్తమమగు నేత్రముగా పరిగణించుచున్నాను. ఇపుడీ పరిస్థితి యందు మనమేమి చేయవలయునో తెలుపుము. నీ మాటయందు నాకెక్కువ విశ్వాసము గలదు. నీ సూచనాను సార ముగ మనము ప్రవర్తించుదమ"ని పలుక, సర్వజ్ఞుడయ్యు భగవానుడేమియు తెలి యని వానివలె తనసడుగు చుండెనని గమనించియు, నతనియాజ్ఞను శిరోధార్యముగ భావించి యుద్ధవుడు యిటుల చెప్పసాగె.

# డెబ్బది యొకటవ యధ్యాయము

## భగవానుని యింద్రప్రస్థ గమనము

శ్రీశుకులు పరీక్షిత్తుతో నిట్లు పల్కుచుండిరి.

"రాజా, శ్రీకృష్ణ భగవానుని వచనము లాలించి, మహామతియగు నుద్ధవుడు దేవర్షియగు నారదుని యొక్కయు, సభాసదులయొక్కయు, భగవానునియొక్కయు మనో గతాభిప్రాయములను విచారించి, యిటుల చెప్పసాగె.

"మహాప్రభూ, దేవర్షియగు నారదుడు, పాండవుల రాజసూయ మందు సమ్మిళితులై వారికి సాహాయ్యము చేయవలయునని సూచించినారు. వారి సూచనచక్కగనే యున్నది. దానితో శరణాగతులను రక్షించుటయను యవశ్య కర్తవ్యము తీరును. దశదిశల యందుగల రాజుల నందరిని జయించినవాడే రాజసూయయాగముచేయుట కర్హుడను దృష్టితో చూచినచో, పాండవుల యజ్ఞము శరణాగతరక్షణము అను రెండు పనులు సాధించుటకు గూడ, జరాసంధుని జయించుట తప్పని సరియను నిర్ణయము నకు రాక తప్పదు. కేవలము జరాసంధుని జయించుట చేతనే మన యుద్దేశ్యము సఫలమగుటయే గాక అతనిచే బంధితులైన రాజులందరిని విడిపించుటయు తద్వారా మీకు గొప్ప యశస్సు లభించుటయు జరుగును.

పదివేల యేనుగుల బలముగల వాడగుటచే జరాసంధుడు, గొప్ప గొప్ప రాజులను గూడ నతడు జయించినాడు. అతనిని జయింపగలవాడెవడైన యున్నచో అది సమాన బలయుతుడగు భీమసేను డొక్కడే. ద్వంద్వ యుద్ధములో నతని జయించుటయే యుత్తమ విధానము. శతాక్షౌహిణీయుతుడైయుండు జరాసంధునెదిరించుట సులభము గాదు. జరాసంధుడు గొప్ప బ్రాహ్మణ భక్తుడు. బ్రాహ్మణుడేది కోరి నను నతడు నిరాకరించడు. కావున భీమసేనుడు బ్రాహ్మణ వేషమున వెళ్ళి యుద్ధ భిక్షను యాచించినచో నతడు కాదనడు. నీ సమక్షమందు భీమసేన జరాసంధుల ద్వంద్వ యుద్ధము జరిగిన యెడల, భీమసేను డాతనిని తప్పక వధించగలడు. ప్రభూ, నీవు సర్వశక్తిమంతుడవు. రూపరహిత కాల స్వరూపుడవు. విశ్వసృష్టి లయములు నీ శక్తిచేతనే సంభవించుచున్నవి. విధి, శంకరులు నిమిత్తమాత్రులు. (అటులనే జరాసంధ వధయు నీ శక్తిచేతనే సంభవించును. భీముడు కేవలము నిమిత్త మాత్రుడగునని భావము.)

ఈ ప్రకారము జరాసంధుని వధించినచో, జరాసంధుని కారాగారమందు గ్రుమ్గుచున్న రాజుల పత్నులు మీ యీ విశుద్ధలీలను గానము చేయుచు, తమ శత్రువును సంహరించి తమ భర్తల విముక్తులగావించిన నీ యశస్సును కీర్తించెదరు. గోపికలు శంఖచూడుని వలన విముక్తిగాంచిన లీలను గానము చేసినట్లు, శరణాగతు

అగు ముని గణములు, నీ గజేంద్ర రక్షణ లీలను, జానకీ విముక్తి లీలను గానము చేసినట్లును అటులనే కంసుని వధించి నీ తలిదండ్రుల విముక్తులజేసిన నీ లీలను మేము గానము చేసినట్లును, రాజపత్నులు నీ లీలాగానము చేసెదరు. గావున ప్రభూ, జరాసంధుని వధించుట స్వయముగ ననేక ప్రయోజనముల సిద్ధింపజేయును. బద్ధులైన నరపతుల పుణ్యపరిపాకముచేగాని, లేక జరాసంధుని యొక్క షాప పరిణామముచేగాని. నీవిపుడు రాజసూయ క్రతువునకేగుటయే నీ యభిమతమైయున్నది. (కావున ముందు ఇంద్ర ప్రసస్థమునకు బయలుదేరుడు).

ఉద్ధవుని యాలోచన సర్వవిధముల హితకరముగను, నిర్దోషముగనున్నది. నారదుడు, యదువృద్ధులు, స్వయముగ శ్రీకృష్ణుడు గూడ నతని యాలోచనను సమర్థించిరి. అనంతరము గోవిందుడు, వసుదేవాది గురు జనముల యనుమతిని గైకొని దారుకజైత్రాది భృత్యుల నింద్రప్రస్థ యాత్రకు సన్నాహములు చేయవలసినదిగా ముదలయిచ్చినాడు.

యదురాజగు నుగ్రసేనుని యొక్కయు బలరాముని యొక్కయు ఆజ్ఞలను గూడ పొంది, శ్రీకృష్ణుడు తన భార్యాపుత్రులంపరితో బయలుదేరి, దారుకుడు తెచ్చిన గరుడధ్వజ మండితమగు రథమారోహించి, చతురంగ బల సమన్వితముగ యింద్రప్రస్థమునకు ప్రయాణము సాగించినాడు. మంగళతూర్యములుమ్రోగుచుండినవి. సతీ శిరోమణియగు రుక్మిణీదేవియు, గోవిందుని వేలకొలది యితర పత్నులందరును, తమ తమ సంతాన సహితముగ సర్వాలంకారశోభితలై బంగారు శిబికల నెక్కి గోవిందు ననుగమించిరి. ఆయుధముల ధరించిన సైనికులు వారి వెంట రక్షకులుగా నడుచుచుండిరి. ఈ విధముగ పుత్రమిత్ర పరివార సమేతుడై గోవిందుడు, వలయు సామగ్రులను గూడ బటులుగొని వచ్చుచుండ, వివిధ వాహనముల పై పరివారమంతయు తరలిరాగా, తిమింగిలిముల చేతను ఉత్తుంగ తరంగముల చేతను క్షుభితమగు సాగరమువలె, శ్రీకృష్ణుని సేనావాహిని శోభాయమానముగ తరలిపోవుచుండె.

దేవర్షియగు నారదుడు, శ్రీ కృష్ణుని నిశ్చయము విని మహానందభరితుడాయె. భగవానుని దర్శనముచే నతని హృదయముప్పొంగిపోయినది. వీడ్కోలు చెప్పునప్పుడాతనిని, భగవానుడు వివిధోపచారములచే పూజించినాడు. అతనికి మనస్సునందే ప్రణామములర్పించి, యతని దివ్యమూర్తిని హృదయమునందు ప్రతిష్టించుకొని, నారదుడాకాశ మార్గమున ద్వారక నుండి వెడలిపోయె. నారదుడేగిన పిదప జరాసంధ బంధితరాజసమూహము పంపిన దూతను గాంచి భగవానుడు, "మీరు భయపడకుడు. మీకు శుభము కలుగును. నేను జరాసంధుని సంహరించెదను" అని మీ రాజులతో చెప్పుమని పలికె. భగవానుని యాజ్ఞా ప్రకారమాతడు గిరి వ్రజమున

కేగి, యా రాజులతో శ్రీకృష్ణ సందేశమును యథాతథముగ వినిపించె. ఆరాజులును తమను కారాగార విముక్తుల గావించుటకై యరుదెంచు గోవిందుని శుభదర్శనము నకై యెదురు చూచుచుండిరి.

శ్రీకృష్ణభగవానుడు, ఆనర్త, సౌవీర, మరు, కురుక్షేత్రములను, మధ్యమధ్య వచ్చు, పర్వత, నదీ, నగర, గ్రామాదులను, దాటుకొనుచు ముందుకు సాగినాడు. దృషద్వతి, సరస్వతీ నదుల నతిక్రమించి, పాంచాల, మత్స్యదేశముల గుండా పయనించి, యింద్రప్రస్థపురము చేరినారు. అత్యంత దుర్లభమగు శ్రీకృష్ణుని దర్శనము కలుగబోవుచున్నదని తెలిసిన ధర్మజుని ముఖమానందముతో వికసించినది. తమ పురోహితులను, స్వజన-సంబంధులను వెంటనిడుకొని, యతడచ్యుతునకు స్వాగత మొసంగుటకై నగరము వెలువడియె. మంగళ వాద్యములు మ్రోగుచుండ నుచ్చైఃస్వరమున బ్రాహ్మణులు వేద ఘోష యొనర్చుచుండిరి. ఈః ప్రకారము యింద్రియములు ముఖ్యప్రాణముతో కలియుటకై వెళ్ళుచున్నట్లత్యంతోత్సాహముతో వెళ్ళి, ధర్మరాజు, శ్రీకృష్ణునిగాంచి, స్నేహాతిరేకముచే గద్గదకంఠుడాయె. చాలదినముల తరువాత నతనికి ప్రియతముడగు భగవానుని దర్శనమైనది. అందుచే నతడు భగవానుని పునఃపునరాలింగనము లొనర్చుకొన దొడగినాడు. భగవానుని శ్రీమూర్తి, మహాలక్ష్మీదేవికి పరమపవిత్రమగు నిత్యనివాసస్థానము. అట్టి శ్రీమూర్తి నాలింగనముచేసుకొని, ధర్మజుడు, సమస్త పాపతాప శాంతినందినాడు. పరమానంద సాగర మగ్నుడైనాడు. నేత్రమందశ్రువులు నిండినవి. పులకాంకితుడైనాడు. లోకవిభ్రమము తొలగిపోయినది. అనంతరము భీమసేనుడు గూడ నతని నాలింగన మొనర్చియానందించినాడు. హృదయమందు పొంగి పొరలిన ప్రేమాతిరేకముచే నతనికి బాహ్య విస్మృతి కలిగినది. నకుల, సహదేవులును, అర్జునుడుగూడ భగవానునాలింగన మొనర్చి యానందించినారు. అంబరినేత్రముల యందానంద బాష్పములు ప్రవహింప సాగినవి. అర్జునుడు గోవిందుని మరల కౌగలించుకొనగా, కవలలభివాదన మొనర్చిరి. బ్రాహ్మణులకును, కురువృద్ధులకును శ్రీకృష్ణుడు యథోచితముగ నమస్కరించె. కురు, సృంజయకేకయ నరపతులు గూడ మాధవుని సమ్మానించగా నతడును వారిని తగినటులయాదరించె. సూత, మాగధవందిజనములు, బ్రాహ్మణులు భగవానుని స్తుతించసాగిరి. గంధర్వ, నట, విదూషకులు, వివిధములగు వాయిద్యముల మ్రోగించుచు, భగవానుని కానందము కలుగజేయుటకై నృత్యములు చేయుచు గానము చేయుచుండిరి. సుహృజ్జన సహితముగ గోవిందుడీరీతి పూజింపబడినవాడై సుందర మగు నింద్రప్రస్థపురమును ప్రవేశించె ప్రజలందరును పరస్పరము శ్రీకృష్ణుని గూర్చి ప్రశంసించుకొనుచుండిరి.

ఇంద్రప్రస్థ నగరవీథులన్నియు మదగజముల మదజలముచే సుగంధితములై యున్నవి. సుగంధజలముచే తడుపబడియున్నవి. రంగురంగుల పతాకములెగుర

వేయబడియున్నవి. బంగారు తోరణములు కట్టబడియున్నవి. హేమజలకలశము లచ్చటచ్చట శోభిల్లుచున్నవి. నగరనర–నారీరత్నములందరును సుస్నాతులై, చక్కగా నలంకరించుకొని, దివ్యాంబరాభరణభూషితులై తిరుగాడుచుండిరి. ప్రతి యింటియందును దీపములు వెలుగుచున్నవి. జాలరంధ్రములనుండి ధూపసువాసనలు నల్గడల వ్యాపించుచున్నవి. ప్రతియింటిపైనను స్వర్ణకలశములు కాంతులీనుచున్నవి. శ్రీకృష్ణభగవానుడు, సుసంపన్నమైన పాండవుల రాజధానియొక్క సౌందర్యమును తిలకించుచు ముందుకుపోవుచుండె. మానవనేత్రములకు పానపాత్ర (అనగా దర్శనీయుడు)యగు గోవిందుడు రాజవీధియందరుదెంచుచుండెనను వార్తవినగానే, నగరమందలి యువతులాతని దర్శించు నుత్సాహముచేత వారి కొప్పుముడులు, దుకూల బంధములు సడలిపోయినవి. గృహకృత్యము లెక్కడివక్కడ వదలినారు. తమ ప్రక్కన పరుండియున్న పతులనుగూడ వీడినారు. రాజమార్గమువైపునకు పరుగెత్తినారు. రాజమార్గమునందు చతురంగబలములు క్రిక్కిరిసియున్నవి. అందుచే నాయువతులు పైయంతస్తులకెక్కి, రాణులతో గూడియున్న శ్రీకృష్ణుని దర్శించిరి. వారిపై పుష్పవర్షము గురిపించిరి. మనసునందే భగవానునాలింగనము జేసుకొని, ప్రేమపూరితములగు చూపులతోను, చిరునగవులతోను సుస్వాగతము పలికిరి. నగరస్త్రీలు, రాజపథమందు చంద్రునితోగూడి ప్రకాశించు తారకలవలెనున్న శ్రీకృష్ణుని పత్నీమండలమునుగాంచి, పరస్పరమిట్లు చెప్పుకొనుచుండిరి. "సఖీ, యీ సౌభాగ్యవతులగు రాణులు, పూర్వమందెట్టి పుణ్యమాచరించి యుండిరోగాని, యిపుడా పురుషశిరోమణియగు భగవానుడు, తన యున్ముక్తహాస్య విలాసభరితములగు కటాక్షవీక్షణములచే వారివంక జూచుచు, వారి నేత్రములకు పరమానందమును ప్రసాదించుచున్నాడు." ఈ విధముగ ప్రశంసింపబడుచు భగవానుడు రాజవీధియందు సాగుచుండ, పౌరులనేకులు మంగళవస్తుహస్తులై వచ్చి పూజించి, దాస్యాలర్పించుచు, నివ్వెరపడుచుండిరి.

అంతఃపురస్త్రీలు జనార్దనుని గాంచి, యానందోత్సాహ సంభరితలై, ప్రేమ వికసిత నేత్రములతో స్వాగత మొసంగిరి. వారి స్వాగత సత్కారముల స్వీకరించుచు భగవానుడంతఃపురము ప్రవేశించె. త్రిభువనేశ్వరుడగు తన మేనల్లుడు వచ్చుటను గాంచి, కుంతీదేవి యొక్క హృదయము ప్రేమతో నుప్పొంగిపోయినది. తన కోడలగు ద్రౌపదిదేవితో కూడ నామె పర్యంకముపై నుండి లేచి యెదురేగి, శ్రీకృష్ణుని గాఢాలింగన మొనర్చినది. భగవానుని రాజమహలులోనికి గొనివచ్చిన యుధిష్ఠిరునకు ఆదరానందోద్రేకము చేత ఆత్మ విస్మృతి గల్గినది. అతనినే క్రమముగ నర్చించవలయున్నది యాతడు మఱచినాడు. శ్రీకృష్ణుడు తన మేనత్తయగు కుంతికి, గురుపత్నులకు నభివాదన మొనర్చినాడు. అతని చెల్లెలగు సుభద్రయు, ద్రౌపదియు నతనికి నమస్కరించిరి. అత్తగారి పనుపున, ద్రౌపది, శ్రీకృష్ణుని పట్టపురాణు

లగు, రుక్మిణి, సత్యభామ, భద్ర, జాంబవతి, కాళింది, మిత్రవింద, లక్ష్మణ, సత్యలను, అటులనే శ్రీకృష్ణుని యితర భార్యలను గూడ, వస్త్రాభరణ మాల్యాదులచే సత్కరించినది. ధర్మరాజు, శ్రీకృష్ణునకు, సతనిసేనకు, సేవకులకు, మంత్రులకు, భార్యలకు, నెట్టి లోపము లేకుండ నిత్య నూతనములగు భోగసామగ్రులు లభించు నట్టి రమ్య ప్రదేశమునందు, వసతి గల్పించినాడు. పూర్వ మర్జునసహితముగ భగవానుడు, అగ్నిహోత్రునిచే ఖాండవ దహనము చేయించి తృప్తి పరచి, మయాసురుని గాపాడి యుండె. భగవానుని యాజ్ఞచే నామయాసురుడు, ధర్మజునకొక దివ్య సభ నిర్మించి యిచ్చె.

శ్రీకృష్ణభగవానుడు, యుధిష్ఠిర మహారాజును సంతోషపరచుటకై, కొన్ని నెలల వరకు యింద్రప్రస్థపురము నందుండిపోయినాడు. అప్పుడప్పుడర్జున సహితుడై రథమధిరోహించి యచ్చటచ్చట విహరించుచుండె. అప్పుడు వారి వెంట వీర సైనికులు గూడ వెడలుచుండెడువారు.

# డెబ్బది రెండవ యధ్యాయము

## రాజసూయప్రయత్నము - జరాసంధమోక్షము

ఒకనాడు యుధిష్ఠిరుడు, అనేకమంది మునులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, భీమసేనాది సోదరులు, బంధువులు, కుటుంబ సభ్యులందరితో,సభయందు గూర్చుండి యుండె అందరి యెదుట, శ్రీకృష్ణుని సంబోధించుచు, ధర్మజుడిట్లు వచించె.

"గోవిందా, నేను సర్వోత్తమమగు రాజసూయయజ్ఞము ద్వారా, నిన్నూ, నీ పరమ పావన విభూతి స్వరూపులగు దేవతలను పూజింపదలచుచుంటిని. దయతో నీవు నాయీ సంకల్పమును సిద్ధింపజేయ ప్రార్థన. కమలనాభ, నీ చరణకమలముల పాదుకలే, సమస్త యశుభములను పోగొట్టజాలు నట్టివి. ఎవరు నిరంతరము వానిని సేవించుచుందురో, ధ్యానించుదురో, స్తుతి యొనర్చుదురో, వారే నిజముగా పవిత్రులు. వారే యీ జన్మమృత్యు రూపమగు సంసారము నుండి విముక్తులగుదురు. అట్టివారు సాంసారిక విషయములయందభిలాషనగుపరచినను, వారి కవియు లభించును. కానీ నీ చరణకమలము లాశ్రయింపని వారలకు ముక్తిలభింపనే లభింపదు. సాంసారిక భోగములుగూడ లభింపవు. దేవదేవా, సంసారమందు పరిభ్రమించుచుండు ప్రజాసమూహము నీచరణకమల సేవయొక్క ప్రభావమును గాంచ వలయునని నేనభిలషించుచున్నాను. కురు, సృంజయ వంశీయులగు నరపతులందు, నిన్ను సేవించునట్టి వారికి, సేవించనట్టివారికి గల యంతరమును ప్రజలకు జూపిం

పుము. నీవందరికి ఆత్మస్వరూపుడవు. సమదర్శివి. ఆత్మానందసాక్షాత్కారుడవు. పరబ్రహ్మవు. "ఇది నేను. ఇది యితరుడు. ఇది నాది, ఇది ఇతరునిది"యను భేదభావము నీయందు లేదు. అయినను, నిన్ను సేవించువారలకు, కల్పవృక్షమును సేవించువారలకువలె, వారి భావనానుసారమగు ఫలము లభించుచునే యుండును. ఆ ఫలములయందెచ్చు తగ్గులు, వారొనర్చిన సేవయందలి భేదముల ననుసరించియేయుండును. దీనిచే నీయందు విషమత్వ, నిర్దయత్వాది దోషములు కలుగనేరవు" అని పలుక శ్రీకృష్ణుడతనితో నిటులపల్కె.

"శత్రుంజయా, ధర్మజా, నీనిశ్చయము సర్వోత్తమము. రాజసూయయజ్ఞము చేయుటచే, నీ మంగళమయమగు కీర్తి సర్వలోకములయందు విస్తరించగలదు. ఈ మహాయజ్ఞము, దేవ, ఋషి, పితరులకు, బంధువులకు, మాకు, సమస్తప్రాణులకు గూడ యిష్టమైనట్టిది. పృధివియందలి నరపతులనందరిని జయించి, పృధివినంతను వశపరచుకొని, యజ్ఞ సంభారములనన్నిటిని సమకూర్చుకొని, యీ మహాక్రతువున నుష్ఠించుము. నీ నలుగురు సోదరులు, వాయు, యింద్రాది దేవాంశసంభూతులు. మహావీరులు. నీవు యింద్రియనిగ్రహము గలవాడవు. మనస్వివి. మీ సద్గుణములచే నన్ను మీరు వశమొనర్చుకొని యుంటిరి. ఇంద్రియములను, మనస్సును వశమొనర్చుకొనలేని వారు నన్ను వశమొనర్చుకొనజాలరు. సంసారమందు గొప్ప గొప్ప దేవతలు గూడ, తేజైశ్వర్యయశ స్సౌందర్యాదులచే నా భక్తులను తిరస్కరింపజాలరు. అట్టిచో, "రాజులు తిరస్కరించెదరు" అను యూహ మాత్రమేల కలుగును?

భగవానుని మాటలకు పాండవాగ్రజుని మానసమానందోత్ఫుల్లమైనది. ముఖకమలము వికసించినది. తన సోదరులను దిగ్విజయము చేయుడని యాదేశించినాడు. భగవానుడు వారియందు తన శక్తి సంచారముగావించి వారి నత్యంత ప్రభావయుక్తులగావించినాడు. ధర్మరాజు, సృంజయ వంశ వీరులతో గూడ సహదేవుని దక్షిణదిగ్విజయయాత్రకు బంపినాడు. మత్స్యదేశీయ వీరసహితముగ నకులుని పశ్చిమదిశకును, కేకయదేశీయ వీరసహితముగ నర్జునుని యుత్తరదిశకును, మద్రదేశీయ వీరులనిచ్చి భీమసేనుని పూర్వదిగ్విజయమునకును బంపినాడు. భీమసేనాది వీరులందరును తమ బల పౌరుషములచే నాయాదిక్కులయందలి నరపతులను గెల్చి, యజ్ఞమును తలపెట్టిన యన్నగారి కనంత ధనరాసులగొనివచ్చి, సమర్పించినారు. కాని యంతవరకు జరాసంధుడు జయింపబడలేదను విషయము గ్రహించిన ధర్మజుడు చింతాక్రాంతుడైనాడు. అప్పుడు శ్రీకృష్ణుడాతనికి, తనకుద్ధవుడు సూచించిన యుపాయము దెలిపినాడు.

అనంతరము, భీమసేనుడు, అర్జునుడు, శ్రీకృష్ణుడు, ముప్వురును బ్రాహ్మణ వేషములదాల్చి గిరివ్రజమునకేగినారు. జరాసంధ మహారాజు బ్రాహ్మణ భక్తుడు,

గృహస్థ ధర్మాచరణము చేయునట్టివాడు నగుటచేత, నతడతిథి సత్కారముచేయు సమయమునకు, క్షత్రియ బ్రాహ్మణులు ముప్వురు నతని సమీపించి, యతనినిట్లు యాచించిరి.

"రాజా, నీకు శుభమగుగాక. మేము ముప్వురము నీకతిథులము చాలదూర మునుండి వచ్చుచున్నారము. మేమిచటికొక విశేషప్రయోజనము నాశించి వచ్చియుం టిమి. కావున మేము కోరునది తప్పకయిమ్ము. తరించవలయునను కోరువాడేది సహించకయుండును? దుష్టుడగు పురుషుడు, నీచాతి నీచమగు యేపనినైనను చేయ కుండునా? ఏ పురుషుడు సమర్థుడయ్యు నశ్వరమగు యీ శరీరముచేత, గొప్ప గొప్ప సత్పురుషులుగూడ కీర్తించునట్టి యవినాశమగు కీర్తిని సంపాదించకుండునో, యట్టివాడత్యంత శోచనీయుడగును. హరిశ్చంద్ర చక్రవర్తి, రంతిదేవుడు, కేవల ముంఛవృత్తిచే జీవనము గడిపిన ముద్గలుడు, శిబి, బలి, వ్యాధుడు, కపోతము మొద లగు వ్యక్తులతిథుల కొరకు తమ సర్వస్వముమ దానమొనర్చి, నశ్వరమగు శరీరము ద్వారా శాశ్వతమగు పరమపదప్రాప్తి నందగల్గియుండిరను విషయము నీ వెరుంగు దువు గదా. కావున నీవు మమ్ము నిరాశపరచవలదు" అని పలికిరి.

జరాసంధుడు, వారి కంఠస్వరములు, ముఖవర్చస్సులు, ముంజేతులయందల్లె త్రాటితో నేర్పడిన గుర్తులు గాంచి వారు బ్రాహ్మణులు గారనియు, క్షత్రియులై యుందురనియు గుర్తించినాడు. ఎక్కడనో చూచినట్టులున్నదనియు తలచినాడు. అయినప్పటికిని "వీరు క్షత్రియులై యుండియు భయము చేత బ్రాహ్మణ వేషములు దాల్చి వచ్చిరిగాన, యాచక దశకు దిగజారిన వీరికి వారు కోరిన దిచ్చి పంపెదను గాక దుస్త్యజమగు శరీరమొసగుట యందు గూడ నాకెట్టి సంకోచమును లేదు. విష్ణు భగవానుడు బ్రాహ్మణ వేషము దాల్చి, యాచన గావించి, బలిచక్రవర్తి యొక్క సర్వస్వమును హరించినాడు. అయినను బలియొక్క పవిత్రకీర్తి దిగ్దిగంతములందు వ్యాపించినది. నేటికి గూడ ప్రజలాతని యశస్సు నాదరముతో గానము చేయుచు న్నారు. ఇంద్రుని రాజ్యమును బలిచక్రవర్తినుండి లాగుకొని యింద్రునకు తిరిగి యిచ్చుటకే హరి బ్రాహ్మణ వేషము దాల్చెననుటలో సందేహమేమియులేదు. దైత్య రాజగు బలికీ విషయము తెలియును. గురువగు శుక్రాచార్యుడు వారించినను గూడ, పృథ్వీదాన మివ్వనే యిచ్చినాడు. ఈ శరీరమెపుడో యొకప్పుడు నశించుట తప్పదు. ఈ శరీరముచే విపులమగు కీర్తినార్జించని జీవితమును, బ్రాహ్మణుని కొరకై జీవింపని క్షత్రియుని జీవితమును వ్యర్థము" అని వితర్కించినాడు.

రాజా, నిజముగా జరాసంధుని బుద్ధి మిక్కిలి యథార్థమైనట్టిది. అందుచే నతడు బాగుగా విచారించి, వారితోనిట్లుపల్కె. "బ్రాహ్మణులారా, మీకేమి కావల యునో కోరుకొనుడు. మీరు కోరినచో నాశిరమైన నిచ్చెద"నని పల్కె.

అప్పుడు శ్రీకృష్ణుడతనితో, రాజేంద్రా, మేమన్నముకోరివచ్చిన బ్రాహ్మణులముగాము. క్షత్రియులము. మేము యుద్ధముగోరివచ్చినారము. నీకిష్టమైనచో మాకు ద్వంద్వ యుద్ధ భిక్ష నొసంగుము. చూడు, ఇతడు పాండు పుత్రుడగు భీమసేనుడు. అతని తమ్ముడీతడర్జునుడు. వీరిరువురికి మేనమామ కొడుకును నేను, కృష్ణుడను" అని పలుకగనే, జరాసంధుడు పెద్దగా నవ్వుచు, కోపించి యిట్లులనియె.

"ఓరీ, మూర్ఖుడా, మీకు యుద్ధవాంఛయున్నచో, మీ ప్రార్థనను నేనంగీకరించుచున్నాను. కాని, కృష్ణా, నీవు చాల పిరికివాడివి. యుద్ధమందు నీవు కాతరుడవగుచుందువు. నీవు నాకు భయపడియేగదా, మథురను వదలి సముద్రుని శరణుజొచ్చితివి! కావున నేను నీతో యుద్ధముచేయను. ఈ యర్జునుడు గూడ పెద్దయోధుడుగాడు. వయసునందును బలమునందుగూడ నాతో సమానుడుగాడు. కావుననాతనితో గూడ నేను యుద్ధము చేయను. ఈ భీమసేనుడు నాతో సమానమగు బలముగలవాడగుటచే నాకు జోడు" అని పలుకుచు, జరాసంధుడు భీమసేనునకొక పెద్ద గద యిచ్చి, తాను రెండవది గ్రహించి, నగర బహిఃప్రదేశమునకు బయలుదేరె. విచిత్రమగు మండలభ్రమణము లొనర్చుచు, భీమసేన జరాసంధులిద్దరు గదా యుద్ధము చేయసాగిరి. రంగస్థలమందిరువురు నటకులుగదా యుద్ధము నభినయించుచున్నటుల గనుపించుచుండ, ప్రేక్షకులానందించుచుండిరి. రెండు యేనుగులు పోరాడుచున్నట్లుండె. వారిరువురు గదలచే నొండొరుల ప్రహరించు కొనుచుండ యిరువురి గదలును చూర్ణములైనవి. అందుచే వారు ముష్టి యుద్ధము ప్రారంభించిరి. వారి పిడిగ్రుద్దుల శబ్దములు, పిడుగులవలె మ్రోగసాగినవి. ఇద్దరును సమానశక్తివంతులు, ఉత్సాహసమన్వితులగుటచే, యిరువురి శక్తులు క్షీణించకుండనున్నవి. జయమెవరికిని సిద్ధించకుండనున్నది. వీరు లిర్వురును రాత్రులందు స్నేహితులవలె మసలుచు, పగటి సమయములందు ద్వంద్వ యుద్ధమొనర్చుచు, నీరీతిగా యిరువదియేడు దినములు యుద్ధ మొనర్చిరి.

ఇరువది యెనిమిదవదినమందు భీమసేనుడు, శ్రీకృష్ణునితో, "కృష్ణా, నేను జరాసంధుని యుద్ధమందు జయింపలేకుంటి"నని పల్కె. శ్రీకృష్ణునకు జరాసంధుని జన్మ వృత్తాంతము తెలియును. అతని మృత్యు రహస్యము గూడ తెలియును. జర యను రాక్షసి యాతని రెండు శరీర ఖండములను సంధాన మొనర్చి జీవన దానమొనర్చినది. అందుచే భగవానుడు భీముని శరీరమందు తన శక్తిని సంచరింపజేసి, జరాసంధవధోపాయమును గూర్చి యాలోచించినాడు. భగవానుని జ్ఞానమమోఘము. అతడొక చెట్టుపుల్లను నిలువుగా చీల్చి చూపులద్వారా, జరాసంధవధోపాయమును భీమసేనునకు సూచించినాడు. వీర శిరోమణియగు వృకోదరుడు,

భగవానుని సూచనను గ్రహించి, జరాసంధుని క్రిందబడ వైచి, తన కాలితో నతని పాదము నొకదానిని త్రొక్కిపెట్టి, రెండవపాదమును పట్టుకొని, గజేంద్రము వృక్షశాఖను చీల్చునట్లు, నిలువుగా చీల్చివైచినాడు. జరాసంధుని శరీరము నిలువుగా రెండు ఖండములగుట జనులందరు గాంచినారు. జరాసంధుడు హతుడగుటచే ప్రజలందరు హాహాకారము లొనర్చినారు. కృష్ణార్జునులు భీముని యాలింగ మొనర్చి, ప్రశంసించిరి. శ్రీకృష్ణుని స్వరూపమునుగాని, యాలోచనలనుగాని యెవరును తెలియజాలరు. నిజమునకాతడే సర్వులకు జీవన ప్రదాత. జరాసంధుని రాజ సింహాసనముపై నాతని తనయుడగు సహదేవునకు పట్టాభిషేకము జరిపించి, జరాసంధుడు బంధించియున్న రాజు లందరిని కారాగార విముక్తుల గావించినాడు గోవిందుడు.

# డెబ్బది మూడవయధ్యాయము

## రాజుల వీడ్కోలు – భగవానుడింద్రప్రస్థము చేరుట

జరాసంధు డనాయాసముగనే యిరువదివేల యెనిమిదివందల రాజులను జయించి, గిరిసానువులందలి యొకకోట యందు వారిని బంధించియుండె. భగవానునిచే వారు విడిపింపబడి నప్పుడు, వారి శరీరములు, వస్త్రములన్నియు చాల మలినములుగానున్నవి. ఆకలిచే వారు దుర్బలులై యుండిరి. వారి ముఖములు వాడిపోయి యున్నవి. అంగములన్నియు శుష్కించి యున్నవి. కారాగారమునుండి బయటకు రాగానే వారి యెదుట శ్రీకృష్ణుడు సాక్షాత్కరించి యుండె. నీలమేఘ శ్యామల శరీరము, దానిపై పీతాంబరము, నాల్గు భుజములు, వానియందు శంఖ చక్ర గదా పద్మములు సుశోభితములై యున్నవి. శ్రీవత్స లాంఛనము, పద్మ గర్భమువలె నరుణములైన నేత్రములు గల సుందర వదనము ప్రసన్నతకు సదనమై యున్నది. కర్ణకుండలములు తళుకు లీనుచున్నవి. కిరీట, హార, కటక, కటి సూత్ర, అంగదములాయా స్థానములందు శోభిల్లుచున్నవి. మెడలో కౌస్తుభమణి ప్రకాశించుచున్నది. వనమాల వ్రేలాడుచున్నది. ఆ విధముగ సాక్షాత్కరించిన భగవానుని దివ్యరూపమును గాంచిన యారాజన్యుల పరిస్థితి యెట్లుండెననగా, వారు నేత్రములతో నా దివ్యరూపమును త్రాగుచున్నటులను, ముక్కుతో వాసన చూచుచున్నటులును, బాహువులతో నాలింగనము చేసుకొనుచున్నటులను, గన్పట్టినది. భగవానుని సందర్శనముచే వారి పాపములన్నియు దులిపివేయబడినవి. వారు శ్రీకృష్ణుని చరణములపై తమ శిరముబుంచి నమస్కరించిరి. చెరసాల యందు వారనుభవించిన క్లేశమునంతయు మరపించునట్టి మహానందము వారికి

కలిగినది. చేతులు జోడించి, వినమ్రులై, వారీ రీతిగా భగవానుని స్తుతి గావింప దొడగిరి.

"శరణాగతులగు వారి సమస్త దుఃఖములను, భయమును తొలగించునట్టి దేవదేవేశ్వరా, సచ్చిదానంద స్వరూపా, అవ్యయా, శ్రీకృష్ణా నీకు నమస్కారము. నీవు జరాసంధుని కారాగారమునుండి మమ్ము విడిపించితివి. జనన–మరణ రూప మగు యీ ఘోర సంసార చక్రమునుండి గూడ మమ్ముద్ధరించుము. ఈ సంసార మందు దుఃఖములన్నియు అనుభవించి, విసిగి, మేము నీకు శరణాగతులమై తిమి. ప్రభూ, మమ్ము రక్షింపుము.

మధుసూదనా, జరాసంధుని యందు దోషమెద్దియు మాకు కన్పించుటలేదు. రాజులమని పిలువబడుచుండిన మాకురాజ్యచ్యుతి కల్గించి, నీవు మాయెడల గొప్ప యనుగ్రహమునే చూపితివి.

అట్లుగానిచో రాజ్యైశ్వర్యమదముచే నున్మత్తులగువారికి నిజమగు సుఖమెన్నటి కిని సంప్రాప్తింపజాలక యుండును. నీ మాయామోహితుడగువాడు అనిత్యములగు ప్రాపంచిక విషయ సుఖములే శాశ్వతములని భావించుచుండును.

మూర్ఖులు యెండమావులయందు కనిపించు జలమునే జలాశయమనిభావించు నట్లు, ఇంద్రియలోలురగు అజ్ఞానపురుషులు, పరివర్తన స్వభావముగల యీ మాయనే సత్యమని భ్రమించుచుందురు.

ప్రభూ, మేము మొదట ధనసంపత్తియొక్క మత్తుచే నష్టమైన దృష్టిగల వారమై యుంటిమి. ఈ పృథివిని జయించుటకై యొండొరులతో కలహించు చుంటిమి. మా స్వంత ప్రజలనే పీడించుచుంటిమి. నిజముగా మా జీవనము లత్యంత క్రూరత్వముచే నిండియుండినవి. నీవు మృత్యురూపముతో మా సమీప మందే యుంటివను విషయము కొంచెముగూడ పట్టించుకొననంతటి మత్తెక్కి యుంటిమి.

సచ్చిదానంద స్వరూపా, కృష్ణా, కాలగతి దురవగాహము. అత్యంతబలము గలది. కాలము నెవడును దాటజాలడు. ఆ కాలము నీ స్వరూపమేగదా, ఆ కాలమే యిపుడు మమ్ముల నైశ్వర్యహీనులుగను నిర్ధనులుగను జేసినది. నీయహైతుకమగు ననుగ్రహముచే మా గర్వము ఖర్వమైనది. ఇపుడు మేము నీ చరణకమలముల స్మరించుచుంటిమి.

ప్రభూ, యీ శరీరము దినదినము క్షీణించిపోవుచుండును. రోగములకిది జన్మభూమి. ఇపుడీ శరీరముతో విషయభోగములనుభవించవలయుననెడికోరిక మాకే మాత్రమును లేదు. ఇది మృగతృష్ణయందలి నీటివలెనే మిథ్యయని మేము గ్రహించితిమి. అంతేగాదు. కర్మఫలముగా మరణానంతరము లభించునట్టి స్వర్గాది

భగవానుని సూచనను గ్రహించి, జరాసంధుని క్రిందబడ వైచి, తన కాలితో నతని పాదము నొకదానిని త్రొక్కిపెట్టి, రెండవపాదమును పట్టుకొని, గజేంద్రము వృక్షశాఖను చీల్చునట్లు, నిలువుగా చీల్చివైచినాడు. జరాసంధుని శరీరము నిలువుగా రెండు ఖండములగుట జనులందరు గాంచినారు. జరాసంధుడు హతుడగుటచే ప్రజలందరు హాహాకారము లొనర్చినారు. కృష్ణార్జునులు భీముని యాలింగ మొనర్చి, ప్రశంసించిరి. శ్రీకృష్ణుని స్వరూపమునుగాని, యాలోచనలనుగాని యెవరును తెలియజాలరు. నిజమునకాతడే సర్వులకు జీవన ప్రదాత. జరాసంధుని రాజ సింహాసనముపై నాతని తనయుడగు సహదేవునకు పట్టాభిషేకము జరిపించి, జరాసంధుడు బంధించియున్న రాజులందరిని కారాగార విముక్తుల గావించినాడు గోవిందుడు.

# డెబ్బది మూడవయధ్యాయము

## రాజుల వీడ్కోలు – భగవానుడింద్రప్రస్థము చేరుట

జరాసంధు డనాయాసముగనే యిరువదివేల యెనిమిదివందల రాజులను జయించి, గిరిసానువులందలి యొకకోట యందు వారిని బంధించియుండె. భగవానునిచే వారు విడిపింపబడి నప్పుడు, వారి శరీరములు, వస్త్రములన్నియు చాల మలినములుగానున్నవి. ఆకలిచే వారు దుర్బలులై యుండిరి. వారి ముఖములు వాడిపోయి యున్నవి. అంగములన్నియు శుష్కించి యున్నవి. కారాగారమునుండి బయటకు రాగానే వారి యెదుట శ్రీకృష్ణుడు సాక్షాత్కరించి యుండె. నీలమేఘ శ్యామల శరీరము, దానిపై పీతాంబరము, నాల్గు భుజములు, వానియందు శంఖ చక్ర గదా పద్మములు సుశోభితములై యున్నవి. శ్రీవత్స లాంఛనము, పద్మ గర్భమువలె నరుణములైన నేత్రములు గల సుందర వదనము ప్రసన్నతకు సదనమై యున్నది. కర్ణకుండలములు తళుకు లీనుచున్నవి. కిరీట, హార, కటక, కటి సూత్ర, అంగదములాయా స్థానములందు శోభిల్లుచున్నవి. మెడలో కౌస్తుభమణి ప్రకాశించుచున్నది. వనమాల వ్రేలాడుచున్నది. ఆ విధముగ సాక్షాత్కరించిన భగవానుని దివ్యరూపమును గాంచిన యారాజన్యుల పరిస్థితి యెట్లుండెననగా, వారు నేత్రములతో నా దివ్యరూపమును త్రాగుచున్నటులను, ముక్కుతో వాసన చూచుచున్నటులును, బాహువులతో నాలింగనము చేసుకొనుచున్నటులను, గన్పట్టినది. భగవానుని సందర్శనముచే వారి పాపములన్నియు దులిపివేయబడినవి. వారు శ్రీకృష్ణుని చరణములపై తమ శిరముల నుంచి నమస్కరించిరి. చెరసాల యందు వారనుభవించిన క్లేశమునంతయు మరపించునట్టి మహానందము వారికి

కలిగినది. చేతులు జోడించి, వినమ్రులై, వారీతీగా భగవానుని స్తుతి గావింప దొడగిరి.

"శరణాగతులగు వారి సమస్త దుఃఖములను, భయమును తొలగించునట్టి దేవదేవేశ్వరా, సచ్చిదానంద స్వరూపా, అవ్యయా, శ్రీకృష్ణా నీకు నమస్కారము. నీవు జరాసంధుని కారాగారమునుండి మమ్ము విడిపించితివి. జనన–మరణ రూపమగు యీ ఘోర సంసార చక్రమునుండి గూడ మమ్ముద్ధరించుము. ఈ సంసారమందు దుఃఖములన్నియు అనుభవించి, విసిగి, మేము నీకు శరణాగతులమైతిమి. ప్రభూ, మమ్ము రక్షింపుము.

మధుసూదనా, జరాసంధుని యందు దోషమెద్దియు మాకు కన్పించుటలేదు. రాజులమని పిలువబడుచుండిన మాకురాజ్యచ్యుతి కల్గించి, నీవు మాయెడల గొప్ప యనుగ్రహమునే చూపితివి.

అట్లుగానిచో రాజ్యైశ్వర్యమదముచే నున్మత్తులగువారికి నిజమగు సుఖమెన్నటికిని సంప్రాప్తింపజాలక యుండును. నీ మాయామోహితుడగువాడు అనిత్యములగు ప్రాపంచిక విషయ సుఖములే శాశ్వతములని భావించుచుండును.

మూర్ఖులు యెండమావులయందు కనిపించు జలమునే జలాశయమనిభావించునట్లు, ఇంద్రియలోలురగు అజ్ఞానపురుషులు, పరివర్తన స్వభావముగల యీ మాయనే సత్యమని భ్రమించుచుందురు.

ప్రభూ, మేము మొదట ధనసంపత్తియొక్క మత్తుచే నష్టమైన దృష్టిగలవారమై యుంటిమి. ఈ పృథివిని జయించుటకై యొండొరులతో కలహించుచుంటిమి. మా స్వంత ప్రజలనే పీడించుచుంటిమి. నిజముగా మా జీవనములత్యంత క్రూరత్వముచే నిండియుండినవి. నీవు మృత్యురూపముతో మా సమీపమందే యుంటివను విషయము కొంచెమైనగూడ పట్టించుకొననంతటి మత్తెక్కియుంటిమి.

సచ్చిదానంద స్వరూపా, కృష్ణా, కాలగతి దురవగాహము. అత్యంతబలముగలది. కాలము నెవడును దాటజాలడు. ఆ కాలము నీ స్వరూపమేగదా, ఆ కాలమే యిపుడు మమ్ముల నైశ్వర్యహీనులుగను నిర్ధనులుగను జేసినది. నీయహైతుకమగు ననుగ్రహముచే మా గర్వము ఖర్వమైనది. ఇపుడు మేము నీ చరణకమలముల స్మరించుచుంటిమి.

ప్రభూ, యీ శరీరము దినదినము క్షీణించిపోవుచుండును. రోగములకిది జన్మభూమి. ఇపుడీ శరీరముతో విషయభోగములనుభవించవలయుననెడికోరిక మాకే మాత్రమును లేదు. ఇది మృగతృష్ణయందలి నీటివలెనే మిథ్యయని మేము గ్రహించితిమి. అంతేగాదు. కర్మఫలముగా మరణానంతరము లభించునట్టి స్వర్గాది

లోకములను గూర్చిన కోరికయు మాకులేదు. ఎందుకనగా, అవియన్నియు నిస్సార ములనియు, కేవలము వినుటకు మాత్రమే ఆకర్షములుగ నుండుననియు మేము గ్రహించితిమిగాన.

నీ చరణకమలముల నెప్పుడు మరువకుండునట్లును, సర్వదా వానిని స్మరించు చుండునట్టి యుపాయమును సూచించి, మమ్ము కృతార్థులజేయుమనీ వేడుచున్నాము. మేము సంసారమందెట్టి జన్మయెత్తినను ఆ స్మృతి మాకు కలుగునట్లనుగ్ర హింపుము.

ప్రణతులగు వారి క్లేశముల దొలగించునట్టియు, వాసుదేవ, హరి, శ్రీకృష్ణ పరమాత్మాది నామములుగల గోవిందుడవగు నీకు పునఃపునః ప్రణామములు.

కారాగార విముక్తులైన నరపతులీవిధముగ కరుణావరుణాలయుడగు మురళీ ధరుని స్తుతించగా, శరణాగతత్రాణుడగు పరమాత్మ మధురములగు వాక్కులతో వారికిట్లనియె.

"నరపతులారా, మీరు కోరినట్లుగనే నేటినుండి మీకు నాయందు నిశ్చయము గనే దృఢమగు భక్తి కలుగును. నేనందరికి ఆత్మస్వరూపుడననియు, స్వామిననియు గుర్తించుడు. మీరు చేసుకున్న నిశ్చయము నిజముగా మీకు, శ్రేయస్సును కల్గిం చును. మీరు నాతో పల్కిన పల్కులన్నియు యథార్థములు. ధనసంపద, యైశ్వ ర్యములచే మదించినవారు, ఉచ్ఛృంఖలముగ ప్రవర్తించుచుందురు. హైహాయ (కార్త వీర్యార్జునుడు) నహుషుడు, వేనుడు, రావణుడు, నరకాసురుడు మొదలుగాగల దేవదానవ మానవ నరపతులు ధనమదాంధులై తమ స్థానమునుండి, పదవినుండి చ్యుతులైనారు. శరీరము, దానికి సంబంధించినవన్నియు పుట్టుచున్నవి గావున నవి యన్నియు తప్పక నశించునవేయని మీరు గుర్తింపుడు. కావున వానియందాసక్తి పెంచుకొనకుడు. బహుజాగరూకతతో, మనస్సును యింద్రియములను వశమునం దుంచుకొని, యజ్ఞములద్వారా నన్నారాధించుచు, ధర్మముగా ప్రజాపాలనగావిం పుము. మీ వంశ పరంపరను కాపాడుటకు మాత్రమే—భోగములకొరకు గాకుండ— సంతానోత్పత్తిని చేయుడు. ప్రారబ్ధానుసారము, లభించునట్టి జనన మరణములను, సుఖదుఃఖములను, లాభనష్టములను, సమాన భావముతో నా ప్రసాదముగ స్వీక రించి, యనుభవించుచు, మీ చిత్తమును నాయందు హత్తుకొని యుండునట్టు చేసి, జీవితమును గడుపుచుండుడు. దేహము దేహసంబంధములగు వాటియందాసక్తి నుంచక యుదాసీనులైయుండుడు. ఆత్మారాములై యుండుడు. ఆశ్రమానురూపము లగు వ్రతములనాచరించుచు నన్ను సేవించుచుండుడు. మీ మనస్సులను నాయందే లగ్నమొనర్చిన యంతమందు బ్రహ్మసాయుజ్యమందగలరు."

భువనేశ్వరుడగు భగవానుడీ రీతి రాజులకుపదేశించి వారికి స్నానాదికముల

చేయించుట కనేకమంది స్త్రీ–పురుషుల నియోగించినాడు. జరాసంధ పుత్రుడగుసహదేవునిచే, వారికి రాజోచితములగు వస్త్రాభూషణాదులను, మాలాచందనాదులను యిప్పించి, వారిని సర్వాలంకార శోభితుల గావించినాడు. ఉత్తమోత్తమగు పదార్థములను భుజింపజేసినాడు, రాజోచితములగు ననేక భోగ్యపదార్థములచే వారినిసంతృప్తులగావించినాడు. భగవానుడీ విధముగ రాజులందరిని ఘనముగసత్కరింపజేయుటచేత, వర్షాకాలానంతరము ఆకసమునందలి నక్షత్రములవలెవారు పరిశుద్ధముగ ప్రకాశించుచుండిరి. వారికి మఱి సువర్ణాదికానుకలిప్పించి, యుత్తమ హయములు బూన్చిన రథములపై నెక్కించి యెవరిరాజ్యములకు వారినంపె. వారందరును జగత్పతియొక్క రూప, గుణ, లీలాగానము లొనర్చుచు తమ తమ రాజధానులకు పయనించిరి.తమ రాజ్యములందున్న వారికి భగవానుని లీలల గురించి వినిపించుచు, భగవానుని యాదేశానుసారమువారు జీవితములు గడపసాగిరి.

ఈ ప్రకారము భీమసేనుని ద్వారా జరాసంధు నంతమొందించి, జరాసంధ నందనుడగు సహదేవునిచే సమ్మానితుడై భగవానుడు యింద్రప్రస్థమునకు పయనమాయె. విజయులగువారు నగరము సమీపించి శంఖధ్వానము చేయగా, వారిమిత్రులకు సుఖమును, శత్రువులకు దుఃఖమును కల్గినది. ఆ శంఖధ్వనిచే నగరవాసులకానందము కల్గి, జరాసంధవధ జరిగినదనియు, యిక ధర్మజరాజసూయము నిర్విఘ్నముగ నెరవేరగలదను విశ్వాసము గలిగినది. శ్రీకృష్ణ భీమార్జునులు ధర్మరాజునకు నమస్కరించి సర్వవృత్తాంతము వివరించిరి. శ్రీకృష్ణుని పరమానుగ్రహమును గూర్చి, ధర్మరాజు ప్రేమభరితుడైనందుచేత, నతని కనులనుండి యానందబాష్పములు దొరలినవి. ఆ యుద్వేగముచే నతడు మాటాడలేకపోయె" నని పరీక్షిత్తుతో శ్రీశుకయోగి వచించె.

# డెబ్బది నాల్గవ యధ్యాయము

## భగవానుని యగ్రపూజ - శిశుపాల మోక్షము.

యుధిష్ఠిరుడు, జరాసంధవధను, శ్రీకృష్ణుని యద్భుత మహిమను గూర్చి విని ప్రసన్నుడై యతనితో నిట్టులనియె.

"సచ్చిదానంద స్వరూపా, శ్రీకృష్ణా, ముల్లోకనాథులగు విధి, శంకరేంద్రాదులందరును నీ యాజ్ఞను పాలించు నవకాశమునకై యెదురు చూచుచుందురు. అట్టి యవకాశము లభించినచో తలదాల్చి నెరవేర్చుచుందురు. మేము చాల స్వల్పులము.

కాని, నరపతులము-భూపతులమని యహంకరించుచుందుము. అట్టి స్థితిలో మేము దండ్యులమైనప్పటికిని నీవు మా యాజ్ఞను స్వీకరించి పాలించుచుందువు. సర్వశక్తిమంతుడగు భగవానునకు యిది మనుష్యలీల నభినయించుట మాత్రమే యగును. ఉదయాస్తమయములచేత సూర్యుని తేజస్సునందు పెరుగుట తరుగుటలులేని విధముగనే, నీకు యేకర్మలవల్ల గూడ ఉల్లాస, హ్రాసములు కలుగనేరవు. ఏల ననగా, నీవు త్రివిధభేదరహితుడవు. అద్వితీయ పరబ్రహ్మవు, అజితుడవు. "ఇది నేను. ఇది నాది, అటులనే ఇది నీవు. ఇది నీది" అను వికారముతోగూడిన భేద బుద్ధి, పశుస్వభావము. నీ యందనన్య భక్తిగలవారలకు వారి చిత్తమందట్టి భేద భావములెన్నటికిని కలుగవు. నీ భక్తులకే లేవన్నవో, నీకెటులుండును? (కావున నీవు ప్రదర్శించునది కేవలము లీలా మాత్రమే యని భావము).

అని పలికి పాండవజ్యేష్ఠుడు, భగవానుని యనుజ్ఞ గైకొని, యుచితమగు సమయమందు, యజ్ఞకర్మలయందు నిపుణులగు వేదవేత్తలగు బ్రాహ్మణులను, ఋత్విజులు, ఆచార్యులుగ నియంత్రణ మొనర్చినాడు. కృష్ణద్వైపాయనుడు, భరద్వాజుడు, సుమంతుడు, గౌతముడు, అసితుడు, వసిష్ఠుడు, చ్యవనుడు, కణ్వుడు, మైత్రేయుడు, కవషుడు, త్రితుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, సుమతి, జైమిని, క్రతుడు, పైలుడు, పరాశరుడు, గర్గుడు, వైశంపాయనుడు, అధర్వా, కశ్యపుడు, ధౌమ్యుడు, పరశురాముడు, శుక్రాచార్యుడు, అసురి, వీతిహోత్రుడు, మధుచ్ఛందా, నీరసేనుడు, అకృతవ్రణుడు ననువారలు, వరణమొనర్పబడిన వారిలో నుండిరి. వీరుగాక, ద్రోణాచార్య, భీష్మాచార్య, కృపాచార్య, ధృతరాష్ట్రులను, దుర్యోధనాది నూర్గురు సోదరులను, విదురుడు మొదలగు వారినిగూడ, ధర్మరాజు ఆహ్వానించినాడు. రాజసూయమును దర్శించుటకై, దేశమందలి రాజులందరును మంత్రి పరివారసమేతముగ విచ్చేసిరి. కర్మచారులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులను నాలుగువర్ణముల వారందరును క్రతు సందర్శనార్థ మరుదెంచిరి.

పిమ్మట బంగారు నాగలిచే యజ్ఞభూమిని దున్నించి, శాస్త్రానుసారముగ రాజునకు యజ్ఞదీక్ష నొసంగిరి. పూర్వము వరుణ దేవుడొనర్చిన యజ్ఞమందువలెనే, యీ యజ్ఞమందుగూడ యజ్ఞపాత్రలన్నియు స్వర్ణ నిర్మితములై యేయున్నవి. ధర్మరాజుచే నాహూతులై, బ్రహ్మ, శంకరుడు, యింద్రాది లోకపాలురు, తమ తమ గణములతో సిద్ధులు, గంధర్వులు, చారణులు, విద్యాధరులు, నాగులు, మునులు, యక్షరాక్షసులు, పక్షులు, కిన్నరులు, పత్నీసమేతముగ గొప్ప గొప్పమహారాజులు, అందరును విచ్చేసినారు. అందరును ధర్మరాజు రాజసూయ మొనర్చుట కర్హుడని యంగీకరించిరి. ఏలననగా, శ్రీకృష్ణభక్తుడగు ధర్మరాజీక్రతువును గావించుట యేమంత గొప్ప విషయము కాదనియే వారందరును తలచినారు. దేవసమానులగు

యాజకులు యుధిష్ఠిరునిచే విధిపూర్వకముగ క్రతువును చేయించిరి. (సౌత్యేహని) సోమలతనుండి రసము దీయుదినమందు మహాభాగులగు యాజకులను, సదసస్పతులను యథావిధిగ శ్రద్ధతో, మహారాజు పూజించినాడు.

సభాసదులందు అగ్రపూజ యెవనికి చేయవలయునను విషయమాలోచనకు వచ్చినది. మతులెన్నియుండునో మతములన్ని యుండును. సర్వసమ్మతితోనే నిర్ణయమును జరుగజాలదు. అట్టి స్థితిలో, సహదేవుడు లేచి "యదువంశ శిరోమణియు భక్తవత్సలుడునగు శ్రీకృష్ణభగవానుడే సదస్సులలో సర్వశ్రేష్ఠుడుగావునను, సర్వదేవతాస్వరూపుడు గనుకను, దేశ, కాల ద్రవ్యాది సమస్త వస్తురూపములందున్నదియు నతడే గనుకను, అగ్రపూజకతడే సర్వవిధముల నర్హుడు. విశ్వమంతయు శ్రీకృష్ణరూపమే. యజ్ఞస్వరూపుడు. అగ్ని, ఆహుతులు మంత్రముల రూపమందున్నదియు నతడే. జ్ఞానమార్గము, కర్మమార్గములను రెండును, శ్రీకృష్ణప్రాప్తికి హేతువులగుచున్నవి. సభాసదులారా, యెంతని వర్ణింపగలను? అఖండైకరసస్వరూపుడు, అద్వితీయుడునగు పరబ్రహ్మయతడు. అతనియందు సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు నామమాత్రముగానైనను లేవు. జగత్తంతయు నతని స్వరూపమే. అతడాత్మారాముడు. షడ్భావవికారములతనికి లేవు. తన సంకల్పమాత్రముచేతనే సృష్టి స్థితిలయము లొనర్చుచుండును. జగత్తంతయు శ్రీకృష్ణుని యనుగ్రహము చేతనే, యనేక ప్రకారములగు కర్మానుష్ఠానముల జేయుచు, చతుర్విధ పురుషార్థలాభముల నందుచున్నది, అందుచే నందరికంటె గొప్పవాడగు శ్రీకృష్ణభగవానునికే యగ్రపూజ జరుగవలయును. ఇతనిని పూజించుటచేత, సమస్త ప్రాణులను, తనను తాను గూడ పూజించినట్లగును. తానొసర్చిన దాన-ధర్మములకు అనంత ఫలముల గోరువాడు, సమస్తప్రాణులకు సమస్త పదార్థములకు, అంతరాత్మయు, భేదభావరహితుడును, పరమ శాంతుడును, పరిపూర్ణుడునునగు, శ్రీకృష్ణభగవానునకే దానమొనర్చవలయును.

అని, భగవానుని మహిమను, ప్రభావమును గుర్తించినట్టి సహదేవుడు పలికి యూరకుండెను. సభయందున్న సజ్జనులందరును సహదేవుని పలుకులకామోదము దెలుపుచూ సాధువాదములు పలికిరి. సభాసదుల యభిప్రాయమును, బ్రాహ్మణుల యాదేశమును విని ప్రేమానంద విహ్వలుడైన ధర్మరాజు యథావిధిగ కృష్ణున కగ్రపూజగావించినాడు. తన భార్య సహోదరులు, మంత్రులు, కుటుంబ సభ్యులందరితోగూడి, భగవానుని పాదములు ప్రక్షాళనముగావించి, పరమపావనములగు నా పావనజలమును శిరములందు ధరించె. పట్టు పీతాంబరములను, బహుమూల్యములగు నాభరణములను సమర్పించినాడు. ధర్మరాజునకు ప్రేమానంద బాష్పములు కనులందు, గ్రమ్మగా, భగవానునతడు సరిగా చూడలేకపోయినాడు. సభయందున్న వారందరును భగవానుడీ విధముగ పూజితుడగుట గాంచి, యానంద

తన్మయులై 'నమోనమః, యనుచు నమస్కరించి, జయజయధ్వానములు పల్కిరి. ఆకాశము నుండి పుష్పవృష్టి గురియసాగినది.

"పరీక్షన్మహారాజా, తన యాసనమందుపవిష్టుడైయున్న శిశుపాలుడిదియంతయు గమనించుచున్నాడు. శ్రీకృష్ణుని గుణానువర్ణనమువిని యాతనికితీవ్రక్రోధము గలుగగా లేచి నిలువబడినాడు. సభయందందరు వినుచుండగా, చేతులు విసరుచు, నిర్భయముగా, నత్యంత నిష్ఠురముగ భగవానుని గూర్చి యీ విధముగ బలుకసాగినాడు.

"సభాసదులారా, కాలమే యీశ్వరుడని చెప్పిన శ్రుతివాక్యము పరమ సత్యము. లక్షప్రయత్నము లొనర్చినను కాలము తనపని తాను చేసియే తీరును. దానికి ప్రత్యక్షప్రమాణమిచట గాంచుచునేయున్నాము. బాలురు, మూర్ఖులునగు వారి మాటలచేత, వయోవృద్ధులు జ్ఞానవృద్ధులునగు వారి మతులు గూడ గతులు దప్పినవి. అగ్రపూజకు యోగ్యమగు పాత్రుని నిర్ణయించుటకు మీరందరు సమర్థులని నాకు తెలియును. శ్రీకృష్ణుడగ్రపూజ కర్హుడని పలికిన బాలకుడగు సహదేవుని పలుకులను మీరామోదించకుండ నుండవసినది. ఈ సభయందు గొప్ప గొప్ప తాపసులు, విద్వాంసులు, వ్రతనిష్ఠులు, జ్ఞానముచే పాపతాపశాంతినందిన మహానుభావులు, పరమజ్ఞానులగు పరమఋషులు, బ్రహ్మనిష్ఠులు మొదలగు వారలెందరో యున్నారు. వారిని లోకపాలురు గూడ పూజించుచుందురు. యజ్ఞమునందలి లోపాలోపముల వివరించగల సదసస్పతులున్నారు. వారందరిని వదలిపెట్టి యీకులకళంకుడగు గొల్లవాడెటుల నగ్రపూజకర్హుడైనాడో యర్థమగుటలేదు. కాకియెన్నడైనా పురోడాశమునకర్హమగునా? ఇతనికి వర్ణములేదు. ఆశ్రమములేదు. కులమా ఉన్నత కులముగాదు. సర్వధర్మబహిష్కృతుడు. వేదమార్గమును, కులధర్మములను వదలి, తనకుతోచినట్లు స్వేచ్ఛగా సంచరించుచుండునట్టివాడు. గుణహీనుడు. ఇట్టివాడెట్లగ్రపూజకర్హుడైనాడు? ఇతని వంశమునకు యయాతిమహారాజు శాపమొసంగెనను విషయము మీకు తెలిసియేయుండును. అందుచేతనితని వంశము సత్పురుషులచే బహిష్కరింపబడినది. వీరందరెల్లపుడు మధుపానాసక్తిగలిగి యుందురు. అట్టివోనగ్రపూజకు యోగ్యుడెట్లాయె? ఈ యాదవులందరును బ్రహ్మర్షిసేవితములగు మధురాదిదేశముల పరిత్యజించి, అబ్రహ్మ వర్చస (వేదచర్చారహితమగు)మగు సముద్రమందు కోటను నిర్మించుకొని యున్నారు. అచటినుండి వెలువడుచుదొంగల వలె వీరు ప్రజలను బాధించుచుందురు." అని పలికె. పరీక్షన్మహారాజా, శిశుపాలుని శుభమంతయు నశించిపోయియేయున్నది. అందుచే నతడింకను కటువులగు పదజాలముచే శ్రీకృష్ణుని దూషింపసాగినాడు. కాని సింహము నక్కకూతలను లక్ష్యపెట్టకుండునట్లు, శిశుపాలుని మాటలను శ్రీకృష్ణుడేమియు పట్టించుకొనక మౌనము

వహించియుండె. సభాసదులు మాత్రము శిశుపాలుని నిందావాక్యములను సహింపలేక పోవుచుండిరి. కొందరు తమ చెవులు మూసుకొని, కోపముతో శిశుపాలుని తిట్టు కొనుచు సభనుండి బయటికేగిరి. భగవానునిగాని, భగవద్భక్తులనుగాని దూషించు ప్రదేశమును వీడిపోవకుండువాడు పుణ్యకర్మలనుండిచ్యుతుడై యథోగతినందును.

శిశుపాలుని శిక్షింపుటకై పాండవ, మత్స్య, కేకయ, సృంజయ వంశీయు లగు నరపతులందరును కోపముతో ఖడ్గ హస్తులై లేచి నిలువబడిరి. కాని శిశుపాలు డేమియు బెదరలేదు. ముందు వెనుక లాలోచించక, యాతడు డాల్కత్తులగైకొని, కృష్ణ పక్షపాతులను సవాలు చేయసాగినాడు. వారందరు కలహించుట గాంచి శ్రీకృ ష్ణుడు లేచి, తన పక్షమువారిని వారించి, తాను కోపించి, తన పైకి లంఘించుచున్న శిశుపాలుని శిరమును చక్రముచే ఖండించివైచినాడు. సభయందు కోలాహలము చెల రేగినది. శిశుపాలుని యనుయాయులగు రాజులందరును ప్రాణభయముచే సభను వీడి పర్విడిరి. ఆకాశమునుండి రాలునట్టి యగ్నిజ్వాల (తోకచుక్క) భూమియందు లయించునట్లు, శిశుపాలుని శరీరమునుండి యొక జ్యోతి వెడలి, యందరు చూచు చుండగా, భగవానుని యందు లీనమైనది. శిశుపాలుని యంతఃకరణమందు మూడు జన్మలనుండియు వైరభావమభివృద్ధి చెందుచుండినది. వైరభావముచేతనే యైనను, శ్రీకృష్ణునే ధ్యానించుచు నాతడు తన్మయత్వము నంది, విష్ణుపార్షదుడైనాడు. మర ణానంతరము కలుగుగతికి భావమే కారణమగును. శిశుపాలునికి సద్గతి కలిగిన యనంతరము, యుధిష్టిర చక్రవర్తి, సదస్యులను, ఋత్విజులను, పుష్కలమగు దక్షిణలచే తృప్తుల గావించి, ఇతరుల నందరిని గూడ యథోచితముగ సత్కరించి, విధి పూర్వకముగ నవబృథ స్నానమాచరించె.

ఈ ప్రకారము,యోగేశ్వరేశ్వరుడు ధర్మజుని రాజసూయయాగమును పరిసమాప్తి గావించి,తన స్నేహితులు-బంధువులు ప్రార్థించగా, మాధవుడు మఱికొన్ని మాసము లింద్రప్రస్థమందే యుండిపోయినాడు. అనంతరము, యుధిష్ఠిరున కిష్టము లేకపోయి నను బలవంతముగ నతని యనుమతిని పొంది, తన రాణులు, మంత్రులు మొద లగు వారందరిని తీసుకొని, ద్వారకాపురమునకు భగవానుడు బయలుదేరినాడు.

"పరీక్షిన్మహారాజా, ఈ యుపాఖ్యానమును నీకు విస్తరముగా నిదివరకే (యేడవ స్కంధమందు) వినిపించియుంటిని. వైకుంఠవాసులగు జయ విజయులే సనకాది బ్రహ్మ మానస పుత్రుల శాపముచే మూడు మారులు జన్మనెత్తవలసి వచ్చె నని యట జెప్పి యుంటిని.

అవబృథ స్నాన మొనర్చిన యనంతరము యుధిష్ఠిర చక్రవర్తి, బ్రాహ్మణ క్షత్రియ సభా మధ్యమందు, దేవరాజగు యింద్రునివలె శోభిల్లుచుండె. ధర్మజునిచే

పూజితులై సుర, మానవ, ఖేచరులందరును, శ్రీకృష్ణుని, రాజసూయక్రతువును ప్రశంసించుకొనుచు మహానందముతో, తమ తమ లోకముల కేగినారు. అందరును సంతోషించిరి. కాని దుర్యోధనుడు మాత్రము పాండవులయొక్క యీ యున్నతిని సహించలేకపోయినాడు. ఏలననగా, స్వభావముచేతనే యతడు పాపాత్ముడు. కలహప్రియుడు. కురుకుల నాశనమునకొరకు మహారోగమును వంటివాడు.

"రాజా, భగవానుని ఈ లీలను అనగా శిశుపాలవధ, జరాసంధవధ-బంధిత రాజలోక విముక్తి—రాజసూయయాగముతో గూడిన దానిని కీర్తించువాడు, సమస్త పాపములనుండి విముక్తుడగున"ని శ్రీశుకులు పలికిరి.

# డెబ్బది యైదవ యధ్యాయము

## రాజసూయ సమాప్తి-దుర్యోధనాపమానము

"స్వామీ, అజాతశత్రువగు ధర్మజుని రాజసూయ యజ్ఞమహోత్సవమును తిలకించి, మనుష్యులు, మనుజాధిపతులు, దివిజులు, దివిజాధిపతులు, మునులు, ఋషులు మొదలగు వారందరును మహానంద మందగా, దురోధ్యనుడొక్కడు మాత్రము దుఃఖితుడాయెనని మీరు వక్కాణించితిరి. ఇందుకు కారణమేమియో సెలవీయుడ"ని, ప్రశ్నించిన పరీక్షన్నరేంద్రునకు శ్రీశుకయోగి యిట్లనియె.

మీ పితామహుడగు యుధిష్ఠిరుడు మహాత్ముడు. అతనియందలి ప్రేమచేత, బంధువులందరును రాజసూయయాగమందు, విభిన్న సేవాకార్యములను స్వీకరించి యుండిరి. భీమసేనుడు మహానసాధిపత్యము వహించినాడు. దుర్యోధనుడు కోశాధ్యక్షుడైనాడు. సహదేవుడభ్యాగతుల సత్కరించుటకు నియుక్తుడుకాగా, నకులుడు వివిధములగు సామగ్రులను సేకరించుటయందు నియమితుడైనాడు. అర్జునుడు గురుజనుల సేవాశుశ్రూషలొనర్చుచుండ, స్వయముగా శ్రీకృష్ణభగవానుడు వచ్చిన యతిథుల పాదప్రక్షాళనా కార్యక్రమమును స్వీకరించినాడు. ద్రౌపదీదేవి భోజనపదార్థముల వడ్డించుచుండినది. మహామతియగు కర్ణుడు దానము లిచ్చుటయందు నిమగ్నుడై యుండె. ఈ ప్రకారము సాత్యకి, వికర్ణుడు, హార్దిక్యుడు, విదురుడు, భూరిశ్రవుడు మొదలుగాగల బాహ్లీకపుత్రులు, సంతర్దనుడు మొదలగువారందరు రాజసూయయజ్ఞమందు విభిన్నకర్మములందు నియుక్తులైరి. అందరును యుధిష్ఠిరునకు ప్రియము, హితము కలుగునటులనే ప్రవర్తించుచుండిరి.

ఋత్విజులు, సదస్యులు, సర్వజ్ఞులునగు వారి యొక్కయు, బంధుమిత్రుల

యొక్కయు, మధురములగు పలుకులతోను, వివిధ ప్రకారములగు పూజాసామాగ్రులు దక్షిణాదులతోను సత్కారములు జరిగి, శిశుపాలుడు భక్తవత్సలుడగు భగవానుని యందు లీనమైన పిమ్మట, ధర్మరాజు గంగాజలముల యందవభృథ స్నానమొనర్చినాడు. అతడు స్నానము చేయుచుండగా, మృదంగ, శంఖ, నగారాద్యనేక వాద్యములు మ్రోగుచుండె. నర్తకీమణులు నాట్య మొనర్చుచుండిరి. గాయకులు గానము చేయుచుండిరి. అతుములమగు ధ్వని యాకసమందు ప్రతిధ్వనించుచుండె. బంగారు హారముల ధరించిన, యదు, సృంజయ, కాంభోజ, కురు, కేకయ, కోసల దేశాధిపతులు చిత్రవిచిత్రములగు ధ్వజ పతకాదులతో గూడిన సర్వాలంకృతములగు గజేంద్రములపైనను, రథములపైనను, హయములపైనను అధిరోహించి, సుసజ్జితులగు సైనికులు వెంటరాగా, యుధిష్ఠిర చక్రవర్తిననుసరించి, భూమిని కంపింపజేయుచు, వచ్చుచుండిరి. సదస్యులు, ఋత్విజులు, యితర బ్రాహ్మణోత్తములు, బిగ్గరగా వేదమంత్రములుచ్చరించుచుండిరి. దేవతలు, ఋషులు, పితృదేవతలు గంధర్వులు మొదలగు వారాకసమునుండి పుష్పవృష్టి గురిపించుచుండిరి. ఇంద్రప్రస్థపురమందలి స్త్రీ పురుషులు, సుగంధద్రవ్యములను, పుష్పహారములను, చిత్రవిచిత్రములగు వస్త్రములను, బహుమూల్యములగు ఆభరణములను ధరించి యలంకరించుకొని, యొకరిపైనొకరు, జలమును, తైలములను, పాలు, వెన్న మొదలగు గవ్యపదార్థములను జల్లుకొనుచు, తడుపుకొనుచు, ఒకరికొకరు పులుముకొనుచు, ఆనందముతో క్రీడించుచు నడచుచుండిరి. వారాంగనలు పురుషులను, తైలములు, గోరసములు, సుగంధితజలములు పసుపు కుంకుమలచే ముంచివేయుచుండ, పురుషులుగూడ వారినటులే తడిపివేయుచుండిరి.

ఆ సమయమందుత్తమోత్తమములగు విమానముల నధిరోహించి, దేవతామూర్తులాకసమందు విచ్చేసిన విధముగనే, సైనికులచే సురక్షితలై, సుందరములగు పల్లకీలనెక్కి యింద్రప్రస్థ రాజమహిళలనేకులీయుత్సవమును తిలకించుటకై వచ్చియుండిరి. మారుతియుడగు శ్రీకృష్ణుడు, నతని సఖులును వారిపై రంగుతంగుల వసంతములు జల్లుచు వినోదించుచుండిరి. ఆ రాజస్త్రీల ముఖములును సిగ్గుతోగూడిన చిరునగవులతో వికసించుచున్నవై శోభాయమానములుగ నుండినవి. వారి వస్త్రములన్నియు రంగునీళ్ళతో తడిసిపోయినవి. దానిచే వారి యంగ ప్రత్యంగ సౌందర్యము ప్రకటితమగుచుండె. వారును పిచికారీలతో రంగునీళ్ళను తమ మరదులపైనను వారి చెలికాండ్రపై జల్లుచుండిరి. ప్రేమమౌత్సుక్యముచే వారికేశబంధములు, వస్త్రబంధములు సడలిపోవుచుండె. తలయందలి పుష్పములు నేలపై రాలుచుండె. ఈ మధురమును, పవిత్రమునగు ఆనందోత్సవమును తిలకించుచున్న మలినాంతఃకరణములుగల పురుషుల చిత్తములు చంచలములగుచుండ, వారు కామమోహితులగుచుండిరి.

చక్రవర్తియగు ధర్మజుడు, ద్రౌపది మొదలగు రాణులతోగూడి, బంగారు హారములతో నలంకరింపబడి, యుత్తమాశ్వములు పూన్చబడిన సుసజ్జితమగు రథముపై గూర్చుండి, అంగేష్టులతోగూడి మూర్తీభవించిన క్రతురాజమగు రాజసూయము వలె, ప్రకాశించినాడు. ధర్మజునకు ఋత్విజులు పత్నీసంయాజమును (యజ్ఞకర్మ), అవభృథస్నానసంబంధమగు కర్మను జరిపించి, ద్రౌపదీ సహితముగ పిమ్మట గంగాస్నానము చేయించిరి. అపుడు మానవుల దుందుభులతోపాటుగా దేవదుందుభులు గూడ మ్రోగినవి. దేవతలు, ఋషులు, మానవులు మొదలగు వారందరును కుసుమ వర్షము గురిపించిరి. చక్రవర్తి స్నానము ముగించిన పిదప, సర్వవర్ణాశ్రమముల వారును గంగయందు స్నానమాచరించిరి. ఆ స్నానముచే మహాపాపియగువాడుగూడ నాక్షణమందే పాపవిముక్తుడగును. అనంతరము ధర్మరాజు పట్టుధోవతి, యుత్తరీయములదాల్చి వివిధాభరణాలంకృతుడాయె. పిమ్మట, ఋత్విజులను, సదస్యులను, బ్రాహ్మణులను, వస్త్రాభరణాదు లొసంగి పూజించినాడు. యుధిష్ఠిరుడు భగవత్పరాయణుడు. అతనికందరియందు భగవానుడే కనుపించుచుండును. అందుచేతనే యతడు, సోదరులను, కుటుంబసభ్యులను, బంధువులను, నరపతులను, యిష్టమిత్రులను, హితైషులను, ప్రజలందరినిగూడ, పూజించి, గౌరవించుచుండును. ఆ సమయమందందరును మణికుండలములను, బహుమూల్యములగు నాభరణములను, పుష్పహారములను, తలపాగలను, దీర్ఘములగు కంచుకములను, ఉత్తరీయములను ధరించి దేవతామూర్తులవలె వెలిగిపోవుచుండిరి. స్త్రీల ముఖములు కర్ణకుండలకాంతితోడను వక్రాలకములతోడను ప్రకాశించుచుండ, వారి కటిభాగములు బంగారు వడ్డాణములతో విరాజమానములగుచుండినవి.

రాజసూయమునకు విచ్చేసిన, దేవ, మానవ, ఋష్యాదులనందరిని ధర్మజుడు యథోచితముగ సత్కరించి పూజించిన యనంతరము, వారందరతని యనుమతి గైకొని, తమ తమ నివాస స్థానములకు వెడలిపోయిరి. మనుష్యుడేవిధముగ నమృతపానమొనర్చినచో నెంతకును తృప్తినందకుండునో, యటులే, ప్రజలందరును ధర్మజుని రాజసూయ యాగ ప్రశంసనెంత గావించినను తృప్తినందజాలకుండిరి. అనంతరము, ధర్మజుడు, తనవారందరిని వదలజాలక, బంధువులందరిని, శ్రీకృష్ణ సహితయుగ తనవద్దనే యుండ బలవంతముజేసి యుంచినాడు. భగవానుడును, సాంబాది యాదవవీరులనందరిని ద్వారకకు బంపి, తాను మాత్రము యుధిష్ఠిరుని కోరిక దీర్చుటకై యతని కానందము కల్గించుటకై యింద్రప్రస్థపురమునందే యుండిపోయినాడు.

ఈ ప్రకారము ధర్మనందనుడు అపారమగు తన మనోరథపారావారమును, శ్రీకృష్ణుని యనుగ్రహముచే సునాయాసముగ దాటగలుగుటచేత, నతని చింతయంతయు నశించినది.

పరమభక్తుడగు యుధిష్ఠిరుని యంతఃపుర సౌందర్య సంపదను, రాజసూయ యజ్ఞము ద్వారా లభించిన మహత్త్వమునుగాంచి, దుర్యోధనుని మనము శాంతితో తపించిపోసాగినది.

పాండవుల కొరకై మయాసురుడు నిర్మించి యిచ్చిన సభయందు, నరపతులకు, సురపతులకు దైత్యపతులకు సంబంధించిన వివిధ విభూతులు, సౌందర్యములు ప్రతి స్థలమందును ప్రతీతములగుచు శోభాయమానములుగ నున్నవి. వాని ద్వారా, మహారాణియగు ద్రౌపదీదేవి తన భర్తలను సేవించుచుండె. ఆ రాజభవనమునందు కృష్ణభగవానుని వేలాదిమంది రాణులు నివసించుచుండిరి. బృహన్నితంబ భారలగుటచే వారా భవనమందు మంద మంద గమనములు చేయుచుండునపుడు నూపుర ధ్వనులు నలువైపుల వ్యాపించుచుండెడివి. వారికటి భాగములు మహాసుందరములై యుండినవి. వారి వక్షఃస్థలములందలి కుంకుమాంగరాగ కాంతిచేత తెల్లని ముత్యాల హారములు గూడ నెర్రగా గన్పట్టుచుండె. కుండలముల యొక్కయు ముంగురుల యొక్కయు కదలికలచేత వారి మొగముల శోభ వింతగా శోభిల్లుచుండె. యిది యంతయు గాంచిన కొలదియు దుర్యోధనుని హృదయము జ్వలించిపోవుచున్నది.

ఒకానొకనాడు ధర్మరాజ చక్రవర్తి తన సోదరులు బంధువులతోడను, నయన తారయగు భగవానునితోడను మయసభ యందలి స్వర్ణసింహాసనమందు గూర్చుండియుండగా, నతని భోగసామాగ్రి, యతని రాజ్యలక్ష్మి, బ్రహ్మైశ్వర్యముతో సమానముగనుండె. వందిజనమతనిని స్తుతించుచుండిరి.

అదే సమయమందభిమానధనుడగు దుర్యోధనుడు దుశ్శాసనాది సోదరసహితముగ నచటికి వచ్చినాడు. అతనికి శిరమందు కిరీటము, గళమందు మాలలు, చేతి యందు కరవాలమున్నది. ద్వారపాలకులను క్రోధముతో బెదిరించుచువచ్చుచుండె. ఆ మయసభయందు, దుర్యోధనుడు స్థలమందు జలమను భ్రాంతియు, జలమందు స్థలమను భ్రాంతియు పడునంతటి మాయను మయదానవుడు విస్తరించియున్నాడు. స్థలమందు జలభ్రాంతి కల్గి వస్త్రములెత్తుకొని నడచినాడు. జలమందు స్థలభ్రాంతితో చలించి క్రిందపడినాడు. అతడు పడుటగాంచిన రాణివాస జనము, భీమసేనుడు, యితర నరపతులు గూడ నవ్వసాగినారు. యుధిష్ఠిరుడు వారిని వారించుచునే యున్నాడు. కాని శ్రీకృష్ణుడు సైగలతో వారిని ప్రోత్సహించినాడు. దుర్యోధనుడు మహాలజ్జితుడైనాడు వాని రోమ రోమము క్రోధముతో జ్వలించినది. మొగముప్రేలాడవైచుకొని మౌనముగ సభాభవనమునుండి నిర్గమించి, హస్తినాపురమునకు వెడలిపోయినాడు. ఈ ఘటనను గాంచిన సత్పురుషులు హాహాకారము లొనర్చినారు. ధర్మరాజు హృదయముగూడ కొంత భిన్నమైనది. ఇంత జరిగినను కృష్ణుడు మౌనము వహించియుండె. పృథ్వీభారము తొలగించుటయే యతని ముఖ్యోద్దేశ్యము. నిజమే మన, అతని దృష్టిచేతనే దుర్యోధనునకా భ్రమకల్గినది. రాజా నీవు కోరినట్లు దుర్యోధనున కసూయకల్గిన కారణము చెప్పితి"నని శ్రీశుకయోగి వచించె.

# డెబ్బదియారవ అధ్యాయము

## శాల్వునితో యాదవుల యుద్ధము

"మానవ లీలలవంటి లీలలను ప్రదర్శించుచున్న శ్రీకృష్ణభగవానుని యొక యద్భుతలీలను చెప్పెద వినుమని శ్రీ శుకయోగి పరీక్షిత్తుతో నిటుల చెప్పదొడగె.

"ఈ లీలయందు 'సౌభ'మను విమానమున కధిపతియగు శాల్వుడు భగవానునిచేతిలో నేవిధముగ మడిసినది చెప్పబడును. శాల్వుడు శిశుపాలుని సఖుడు. శ్రీరుక్మిణీ వివాహ సమయమందు శిశుపాలుని తరపు పెండ్లిబృందమందతడుగూడ నుండె. యాదవులతో జరిగిన యుద్ధమందు జరాసంధాదులతోపాటు శాల్వుడుగూడ నిర్జితుడాయె. ఆనాడతడు "నేను భూమియందు యాదవుడనువాడు లేకుండజేసెదను. అందరును నా పౌరుషము గాంచెదరుగాక" యని రాజులందరిముందు ప్రతిజ్ఞగావించి యుండె. ఆ మూర్ఖుడావిధముగ ప్రతినగావించి, పశుపతి నారాధింపమొదలిడినాడు. ఆ యారాధనా దినములందతడు పిడికెడు ధూళినిమాత్రమే సక్నత్తుగా నాహరించుచుండెడువాడు. ఆశుతోషుడగు శంకర భగవానుడు కోరినవరము లొసంగువాడైనను, శాల్వుని దుష్టసంకల్పము గ్రహించినందున సంవత్సరమైన పిమ్మట నతనికి ప్రత్యక్షమాయె. శరణాగతుడైన శాల్వుని వరము గోరుకొమ్మనగా, నతడు "స్వామీ, దేవాసుర మనుష్య గంధర్వ, నాగయక్షరాక్షసు లెవరును భేదింపలేనట్టియు కామగమనముగలట్టియు, యాదవుల కత్యంత భయదాయకమునగు నొక విమానమును ప్రసాదింపు"మని వేడుకొనియె. శంకరుడు "తథాస్తు"ని పలికి, మయాసురునిచే నట్టి ప్రభావముగల లోహనిర్మితమగు విమానము నాతనికిప్పించె. ఆ విమానమొక నగరమువలెనున్నది. దానిపేరు సౌభము. అది యంధకారమయము. ఇతరులు దానిని చూడలేరు. పట్టుకొనలేరు. కోరిక ననుసరించి యెచటికైనను పోగలశక్తిగలది. శాల్వుడా విమానముపైనెక్కి ద్వారకాపురము మీదికి దాడి వెడలినాడు.

తన గొప్ప సేనతో శాల్వుడు ద్వారకాపురమును నలువైపుల ముట్టడించినాడు. ఫలపుష్పములచే నిండియున్న యుపవనములను, ఉద్యానవనములను, పీకించివేయుచుండె. నగర ద్వారములు, గృహములు, రాజప్రసాదములన్నియు ధ్వంసమొనర్పబడుచుండునవి. విమానముపైనుండి ద్వారకానగరముపై శస్త్రవర్షము గురియుచుండె. ప్రాచీనకాలమునందు త్రిపురాసురుడు పృథివిని పీడించినట్లు, యీ శాల్వుడీనాడు ద్వారకాపురమును పీడింపసాగినాడు. పెద్ద పెద్ద బండలు, వృక్షములు, పిడుగులు సర్పములు కురియుచుండినవి. తుపానుగాలులు వీచుచు, నాలుగువైపుల దుమ్మురేగుచుండె. నగరమందలి స్త్రీ పురుషులందరును క్షణకాలముగూడ శాంతిలేని

వారైరి. నగరమందున్న ప్రద్యుమ్నుడీ భీభత్సమునుగాంచి, రథారూఢుడై ప్రజలకభయమొసంగి, సాత్యకి, చారుదేష్ణ సాంబాది సోదరులు వెంటరాగా, శాల్వునెదుర్కొనియె. అక్రూర, కృతవర్మ, భానువింద, గద, శుక, సారణులతోగూడిన మహాసైన్యముగూడ వారి ననుసరించినది. చతురంగబలములతో గూడిన యీ మహాసైన్యము, శాల్వసైన్యముతో తలపడగా, నది ప్రాచీనకాలమందు జరిగిన దేవాసుర మహాయుద్ధమును తలపించినది. చూచువారలకు రోమహర్షణముగానుండె. ప్రద్యుమ్నుడు తన దివ్యాస్త్ర జాలముచే శాల్వుని మాయనంతను వమ్ముచేసెను. స్వర్ణపుంఖములు నయోముఖములు గలిగిన యాతని బాణము లెక్కడబడుచుండెనో యెరుగరానంత లాఘవముగ ప్రద్యుమ్నుడు బాణప్రయోగము చేయుచుండె. ఇరువదియైదు బాణములతో శాల్వుని సేనాపతి నతడు గాయపరచి, నూరుబాణములతో శాల్వుని గొట్టినాడు. ప్రతి సైనికునిపై నొక్కొక్క బాణమును, సారథులపై మూడేసి బాణముల చొప్పున ప్రయోగించి బాధించినాడు. అతని కౌశలమును ప్రత్యర్థులుగూడ ప్రశంసించిరి.

శాల్వుని విమానమత్యంత మాయామయము. అదియొకప్పుడనేక రూపములతో గనుపించుచు, నొకప్పుడేకరూపమున గనుపించి, మరియొకప్పుడదృశ్యమైపోవుచుండెను. వాడెక్కడనుండినదియు యదువీరులకు జాడతెలియకుండె. ఆ విమానమొకప్పుడు భూమిపై దిగియుండును. మరుక్షణ మందాకసమందుండును. ఒకప్పుడు పర్వతాగ్రమందుండి, వెంటనే జలమందు తేలుచుండును. అలాతచక్రమువలె తిరుగుచు నొకక్షణముగూడ నా సౌభముస్థిరముగ నుండుటలేదు. కాని యది యెచ్చటికేగినను యాదవులు దానిపై బాణవర్షమును కురిపించుచునేయుండిరి. దానిచే శాల్వుని నగరాకారమగు విమానము, సేనయు మహాక్షుభితములైనవి. యాదవ బాణములచే శాల్వుడు గూడ మూర్ఛిల్లినాడు.

శాల్వ సేనాపతులుగూడ యాదవవీరులపై బాణవర్షముగురిపించుటచే, వారును పీడితులైనారు. కాని వారు యుద్ధమును వీడిపోలేదు. విజయమో, వీరస్వర్గమోయను నిశ్చయముతో వారు యుద్ధము చేయుచుండిరి. శాల్వుని మంత్రిద్యుమంతుడనువాడు మహాబలవంతుడు. ప్రద్యుమ్నుడు వాని నిరువదియైదు బాణములతోగొట్టి యుండినందున వాడత్యంత క్రోధముతో తనయొక్క గదతో ప్రద్యుమ్నుని వక్షఃస్థలమందు గొట్టి యార్చినాడు. గదాఘాతముచే నతని యురము పగిలినట్లుకాగా, దారుకతనయుడగునతని రథసారథి, సారథి ధర్మముననుసరించి, రథమును రణాంగణమునుండి తప్పించె. రెండు ఘడియలనంతరము మూర్ఛదేరిన ప్రద్యుమ్నుడు సారథితో, "సారథీ, నీవు చాల యనుచితమగు పనియొనర్చితివి. అయ్యో, నీవు నన్ను రణభూమినుండి తప్పించితివే. మా వంశమందలి వీరుడెవ్వడు నింతవరకు రణభూమి నుండివైదొలగెనని విని యుండలేదు. ఈ కళంకము కేవలము నాకే సంభవించినది.

సూతా,నీవుపిరికివాడవు. నపుంసకుడవు. నేనిపుడు మా పెదతండ్రియగు బలరాముని తోడను, తండ్రియగు గోవిందునితోడను యేమని చెప్పవలయునో, నీవే చెప్పుము? నేను యుద్ధమునుండి పారిపోతినని యందరును చెప్పుకొందురా లేదా? వారడిగినచో, నాకనురూపమగు సమాధానము నేనేమని చెప్పుకొనగలుగుదును? నా మరదళ్ళందరును, పరిహాసముగా నన్నుగాంచి, "బావగారూ, మీరు నపుంసకులెట్లైతిరి? యుద్ధమందు ప్రత్యర్థులు మిమ్ము నీచముగానెట్లు చూడగలిగిరి? అని ప్రశ్నించినచో నేనేమి సమాధానమీయగలను? సూతా, నిజముగా నీవు నన్ను రణభూమి నుండి తప్పించి, యనంతమగు నపరాధ మొనర్చితివి." అని పలికిన ప్రద్యుమ్నునితో నతని సారథి వినయముగా నిట్లు విన్నవించె.

"ఆయుష్మంతుడా, నేను చేసినదంతయు సారథియొక్క ధర్మమును బాగుగా తెలుసుకొనియే చేసియుంటిని. ప్రభూ, సంకటమగు పరిస్థితి సంభవించినపుడు, సారథి రథికుని రక్షించవలయును. అటులనే రథికుడు సారథిని రక్షించవలయును. ఇట్లిరువురు నొండొరుల రక్షించుకొనవలయుననునది యుద్ధధర్మము. ఈ ధర్మము నెరిగియే నేను మిమ్ము రణభూమినుండి తప్పించితిని. శత్రువు మీపై గదాఘాతము చేయగా, మీరు మూర్ఛిల్లితిరి. అట్టి సంకట పరిస్థితిలో నేనటుల చేయవలసివచ్చినది" అని సారధి వచించె.

# డెబ్బదియేడవ యధ్యాయము

## శాల్వ మోక్షము

ప్రద్యుమ్నుడంత కాలు సేతులు కడుగుకొని, కవచము ధరించి, ధనుర్బాణాదులు గైకొని, సారథితో, "నన్ను ద్యుమంతుని వద్దకు మరల గొని పొమ్మని, పలికె. ఆ సమయమందు ద్యుమంతుడు యాదవసేనను చీకాకుపరచుచుండె. ప్రద్యుమ్నుడాతని నిరోధించి, నవ్వుచు నతనిపై యెనిమిదిబాణముల ప్రయోగించె.నాలుగు బాణములచే నతని రథాశ్వముల నాల్గింటిని, యొక్కొక్క బాణముచే నతనిసారథిని ధనుస్సును, పతాకమును, అతని శిరస్సును నరికి వైచినాడు. గద, సాత్యకి సాంబాది వీరులు శాల్వుని సైన్యమును సంహరింపసాగిరి. సౌభ విమానముపై నున్న సైనికుల యొక్క శిరములు తెగుచుండ నవి సముద్రమందు బడసాగినవి. ఈ విధముగ, శాల్వ, యాదవ సైనిక సంగ్రామ మతి ఘోరముగ, నిరువది యేడురోజులు జరిగినది.

ఆ సమయమందు గోవిందుడు, ధర్మజుని యాహ్వానముపై నింద్రప్రస్థమందుండినాడు. రాజసూయ యాగము సమాప్తమైనది. శిశుపాల వధయు పూర్తియైనది. అచట శ్రీకృష్ణునకు భయంకరములగు దుశ్శకునములు కలుగసాగినవి. అందుచే

నతడు కురువృద్ధులు, కుంతి, పాండవులందరి యనుమతి గైకొని ద్వారకకు పయన మైనాడు. తన మనసు నందు "నేను పూజ్యుడగు బలరామునితో గూడ యిచటికి (యింద్రప్రస్థమునకు) వచ్చి యుంటిని. శిశుపాల పక్షపాతులగు క్షత్రియులు ద్వారక పై దండెత్తి యుందురు" అని తలపోయుచు, ద్వారక సమీపించగనే, యాదవులు మహావిపత్తు నందుండుటను గాంచినాడు. వెంటనే బలరాముని నగర రక్షణకై బంపి సౌభపతియగు శాల్వుని గాంచుచు, తన సారథియగు దారుకునితో నిట్లు పల్కె. "దారుకా, నీవు శీఘ్రముగ రథమును శాల్వుని వద్దకు గొనిపొమ్ము. ఈ శాల్వుడు మహామాయావియైనను నీవేమియు భయపడవలదు." భగవానుని యాదేశము నందు కొని, దారుకుడు రథమును శాల్వుని వద్దకు పోనిచ్చెను. గరుడ చిహ్నితమగు భగ వానుని రథమును జూడగనే, యాదవవీరులును, శాల్వ సైనికులు గూడ, భగవాను డేతెంచినట్లు గుర్తించినారు.

అప్పటికే శాల్వుని సేన దాదాపుగ నంతయు నశించి పోయినది. శాల్వుడు కృష్ణుని గాంచగనే, దారుకునిపై నొకగొప్ప శక్త్యాయుధమును ప్రయోగించె. పెద్ద తోకచుక్కవలె పైబడవచ్చుచున్న యా శక్తిని గాంచి, శౌరి దానిని తన బాణము లచే నూరు ముక్కలుగా ఖండించివైచె, అనంతరము భగవానుడు శాల్వుని పదు నారు బాణములతో గొట్టి, ఆకసమందు పరిభ్రమించుచున్న యాతని సౌభము ననేక బాణములతో జల్లెడవలె తూట్లుపడునట్లు గొట్టినాడు. సూర్యుని కిరణములచే నాక సము నిండిపోయినట్లు, భగవానుని బాణములచే సౌభము నిండిపోయినది. శార్ఙ్గధను స్సును ధరించి యున్న యెడమ బాహువుపై శాల్వుడొనర్చిన బాణాఘాతమునకు, భగవానుని బాహువు నుండి ధనుస్సు జారిపడినది. ఇది మహాద్భుతమగు సంఘ టన! భూమ్యాకాశములందుండి యుద్ధమును గాంచుచున్నవారు హాహాకారము లొన ర్చిరి. శాల్వుడు సింహగర్జన గావించుచు శ్రీకృష్ణునితో "మూఢుడా, మేమందరము చూచుచుండగా, మా సోదరుడు, సఖుడునగు శిశుపాలుని పత్నినపహరించితివి. అటులనే, నిండు సభయందు, మా శిశుపాలుడు ప్రమత్తుడై యుండగా నాతనిని సంహరించితివి. నీవు అజేయుడవని తలచుచుంటివని నేనెఱుంగుదును. నీవు నా యెదుట స్థిరముగా నిల్చినచో, మరల తిరిగి రాని చోటికి నిన్ను బంపెద"నని పల్కెను.

అందుకు భగవానుడు, "ఓరీ, మందమతీ, వ్యర్థముగా వాగెదవేల? నీతలపై మృత్యుదేవత తాండవించుచున్నట్లు గుర్తించకున్నావు. శూరుడగు వాడు తన వీర త్వమును చేతలలో జూపునేగాని, వ్యర్థ ప్రలాపము లొనర్పడు" అని పలుకుచు, భగవానుడు వేగవంతమగు తన గదతో శాల్వుని జత్రు స్థానము [కంఠెముక]

నందు ప్రహరించగా, శాల్వుడు నెత్తురు గ్రక్కుచు కంపించిపోయినాడు. గద గోవిం దుని చేరగా, శాల్వుడంతర్థానమైపోయినాడు. పిమ్మట, రెండు గడియలు గడచు చుండగా, నొక మనుజుడు, భగవానుని వద్దకు వచ్చి, శిరము వంచి నమస్కరించి, రోదించుచు నిట్లు వచించె. "స్వామీ, దేవకీదేవి పంపగా వచ్చితిని. ఆమె మీకిటుల సందేశమంపినది. "పితృవత్సలా, కృష్ణా, శాల్వుడు మీ తండ్రియగు వసుదేవుని, కసాయివాడు పశువును బంధించి వధ్యశాలకు గొంపోవు విధమున, బంధించి తీసు కొని పోయినాడు." అని యా మనుజుడు చెప్పగనే, భగవానుడు మనుష్యునివలెనై పోయినాడు. అతని ముఖమందౌదాసీన్య భావము ప్రస్ఫుటమైనది. సాధారణ మాన వుని వలె నత్యంత దీనముగ కరుణ స్వరమున నిట్లు పలుకసాగినాడు. "అయ్యో, నా యన్నయగు బలరాముని, దేవతలుగాని యసురులుగాని జయింపజాలరే. అత డెప్పుడును సావధానుడై యుండునే. శాల్వుని బల పౌరుషములాతని ముందత్యం తాల్పములు, అయినను వీడు బలరామునెట్లు జయించి మా పితృదేవుని బంధించి తీసుకొని పోగలిగినాడు? నిజముగా ప్రారబ్ధమెంత బలవత్తరమైనది?" అని భగ వానుడనుకొనుచుండునంతలోననే, శాల్వుడొక మాయా వసుదేవుని గొనివచ్చి శ్రీకృష్ణునితో నిట్లు పల్కె. "ఓరీ మూర్ఖా, చూడుము. ఎవరికోసము నీవు జీవించి యుంటివో, అట్టి నీ జనకుని గొనివచ్చితిని. నీవు చూచుచుండగనే యితనినంత మొందించెదను. నీకు బల పౌరుషములేమైన నున్నచో నితనిని గాపాడుకొనుము." అని భగవానుని బెదిరించుచు, కృత్రిమ వసుదేవుని శిరమును ఖండించి, దానిని గైకొని తన విమానమందు గూర్చుండె.

శ్రీకృష్ణభగవానుడు స్వయంసిద్ధజ్ఞానస్వరూపుడు. మహానుభావుడు. ఈ దృశ్య మునుగాంచి యాతడు ముహూర్తకాలము, తన తండ్రియందలి ప్రేమచే, సాధారణ మానవునివలెనే శోకమందుమునిగిపోయినాడు. కాని బాగుగా విచారించిన పిమ్మట, నది శాల్వుని మాయాకల్పితమని గ్రహించి, యుద్ధభూమియందు సచేతనుడైచూడగా నచట దూతలేడు. వసుదేవుని శరీరమూలేదు. స్వప్నదృశ్యమువలె నంతయు మాయమైపోయినది. శాల్వుడు విమానముపై నాకసమందు సంచరించుచుండుటయే గానవచ్చినది.

ఈ విధముగ, పూర్వాపరములను బాగుగా విచారించనట్టి కొందరు ఋషులు పలుకుచుందురు. శ్రీకృష్ణుని విషయములో వారట్లు పలుకుట, వారి వచనములకే విరుద్ధమగును. అజ్ఞానులందుండునట్టి, శోక, మోహ, భయ, స్నేహములెక్కడ? జ్ఞానవిజ్ఞానైశ్వర్యములఖండమై కరసన్స్వరూపుడు, పరిపూర్ణతముడునగు శ్రీకృష్ణ భగవానుడెక్కడ? [అతనియందట్టి భావముల నూహించుటయైన కుదురునా?]. గొప్ప గొప్ప ఋషులు, మునులుగూడ శ్రీకృష్ణుని చరణకమలములనాశ్రయించి, యధ్యాత్మవిద్యాప్రాప్తి నందుచుందురు. వానిద్వారా, శరీరాదులందు ఆత్మబుద్ధి రూప

మగు అనాద్యవిద్యను తొలగించుకొనుచు, ఆత్మ సంబంధమగు ననంతైశ్వర్య లాభమును పొందుచుందురు. అట్టి పరమపద స్వరూపుడగు శ్రీకృష్ణభగవానుని యందు, మోహమనునది యెట్లుండగలదు?

శాల్వుడు మరల భగవానునిపై బాణవర్షము కురిపింపసాగినాడు. అమోఘ శక్తిసంపన్నుడగు భగవానుడాతనిపై బాణములు ప్రయోగించి యతనిని గాయపరచినాడు. అతని కవచమును ధనుస్సును, శిరమందలిమణిని ఛిన్నాభిన్న మొనర్చినాడు. గదాఘాతముచే నతని విమానమును చూర్ణముగావింపగానది, సముద్రమందు గూలినది. విమానము కూలుటకు ముందుగనే శాల్వుడు దానినుండి దూకి, సావధానుడై శ్రీకృష్ణునిపై లంఘించినాడు. గదగొనియ్యతనపై నాక్రమించుచున్న శాల్వునిగాంచి భగవానుడు బల్లెముతో గదాసహితమైన యాతని బాహువును ఖండించె. అతనిని సంహరించుటకై యద్భుతదర్శనమగు సుదర్శన చక్రమును ధరించిన భగవానుడు సూర్యునితో గూడియున్న యుదయాచలమువలె ప్రకాశించినాడు. ఆ చక్రముతో, సకిరీటకుండలమండితమగు శాల్వుని శిరమును శరీరమునుండి వేరుగావించినాడు గోవిందుడు. శాల్వుని సైనికులందరత్యంత దుఃఖముతో హాహాకారములు గావించినారు. పాపాత్ముడగు శాల్వుడీవిధముగ మరణించగా, గదాఘాతముచే సౌభము చూర్ణమై సముద్రమందుగూలగా, దేవదుందుభులాకసమందు మ్రోగినవి. సరిగా నదే సమయమందు దంతవక్త్రుడు, తన మిత్రులగు శిశుపాలాదుల వధకు ప్రతీకారమొనర్పదలచి, మహాక్రోధముతో నేతెంచె"నని శ్రీశుకమహర్షి పరీక్షిత్తుతోననియె.

# డెబ్బదియెనిమిదవ యధ్యాయము

## దంతవక్త్ర విదూరథుల మోక్షము

## తీర్థయాత్రలో బలరామునిచే సూతవధ

శిశుపాల, శాల్వ, పౌండ్రకులు సంహరింపబడగా, మిత్రత్వఋణమును దీర్చుకొనదలచి, దంతవక్త్రుడొంటరిగనే పాదచారియై, యుద్ధభూమి కేతెంచినాడు. క్రోధముతో వాడు మండిపడు చుండె. అతని చేతి యందొక్క గదాయుధము మాత్రమే యున్నది. కాని యాతని పదాఘాతమునకు భూమికంపించుచున్నది. వాడటుల భయంకరముగ వచ్చుచుండుట గాంచి శ్రీకృష్ణుడుగూడ గదగైకొని, రథమునుండి క్రిందకు దుమికి, చెలియలికట్ట సముద్రము నడ్డుకొనినట్లు, దంతవక్త్రునడ్డగించె. దుర్మదుడైన కరూషనరేశుడగు దంతవక్త్రుడు గదనెత్తిపట్టి, శ్రీకృష్ణునితో నిట్లుపలికెంచె. "అదృష్టవశమున నీవీనాడు నా యెదుట బడుట యెంతయు సంతోషించదగిన విషయము. కృష్ణా, నీవు మా మేనమామ కొమరుడవు కావున నిన్ను

చంపగూడదు. కాని నీవు మా మిత్రులనందరిని చంపితివి. నన్నుగూడ చంపదలచి యుంటివి. కావుననో మందమతీ, నిన్ను నేడు నాగదాఘాతముచే చూర్ణము గావించెదను. నీవు మాకు బంధువేయైనను శత్రువుగనే యుంటివి. శరీరమందుండు రోగము శరీరమునే బాధించుచున్నట్లునది నీ విధానము. నేను నా మిత్రుల యెడల మిక్కిలి ప్రేమగలవాడనగుట చేత నేను వారికి ఋణపడి యున్నాను. నిన్నీనాడు సంహరించి వారి ఋణమునుండి విముక్తుడనయ్యెద." నని, మావటీడు అంకుశము చేత గజమును గాయపరచునట్లు,తన కటుభాషణములచేత భగవానుని బాధించుచునే దంతవక్త్రుడు భగవానుని శిరముపై గదాఘాతమొనర్చి, సింహగర్జన గావించె. అచ్యుతుడా గదాఘాతముచే నేమియుచలించలేదు.తనకౌమోదకీ గదను చేబట్టి దంతవక్త్రుని వక్షఃస్థలముపై నొక్కిపెట్టు బెట్టగా నతని హృదయము వ్రక్కలైనది. నోటినుండి రక్తము స్రవించినది. కేశములు చెల్లాచెదరైపోవగా, కాళ్ళు చేతులు బారచాచి, విగతజీవుడై యాతడు భూమిపై బడిపోయినాడు. శిశుపాలుని మరణ సమయమందువలెనే, దంతవక్త్రుని శరీరమునుండి యొక సూక్ష్మజ్యోతి వెడలి మహా విచిత్రముగ భగవానుని యందు లీనమైనది.

దంతవక్త్రుని సోదరుడు విదూరథుడు. సోదరుని మరణముచే శోకాకులుడైన యాతడు క్రోధముచే వేడినిట్టూర్పులు విడుచుచు, డాల్కత్తులచేబూని శ్రీకృష్ణుని సంహరించుటకై వచ్చె. అతడు తనపై ప్రహరించబోవుచుండుట గమనించిన భగవానుడు, నిశితమగు తన చక్రముచే కిరీటకుండల మండితమగు విదూరథుని మస్తకము నుత్తరించె.

ఈ ప్రకారము భగవానుడు, శాల్వుని, సౌభమను నతని విమానమును, దంతవక్త్రుని, విధూరథుని–యితరులకు జయింప సాధ్యము కానట్టి వారి - నందరిని వధించి, యనంతరము ద్వారకాపురము ప్రవేశించినాడు. అపుడు, దేవతలు, మనుష్యులందరును భగవానుని స్తుతించుచుండిరి. సిద్ధచారణ గంధర్వాదులందరును, వాసుకి మొదలుగాగల నాగులు విజయగీతము నాలపించుచుండిరి. భగవానుడు పురప్రవేశ మొనర్చు నవసరమున నగరమంతయు శోభాయమానముగ నలంకరింపబడినది. యాదవ ముఖ్యులందరాతని ననుగమించుచుండిరి. యోగీశ్వరుడగు జగదీశ్వరుడీ విధముగ లీలలొనర్చుచుండె. పశుబుద్ధిగల యవివేకులు కొందరాతడోడి పోవుటను గాంచుచుందురు. కాని వాస్తవముగా నతడెల్లపుడును విజయియే.

ఒకానొక సమయమందు దుర్యోధనాదులు పాండవులతో యుద్ధము చేయ ప్రయత్నించుచుండిరని తెలిసిన బలరాముడు, తానేవైపునను జేరక మధ్యస్థుడై యుండదలచినవాడై, తీర్థయాత్రల జేయునెపముతో ద్వారక వదలి వెళ్ళిపోయినాడు. ప్రభాసక్షేత్రమున కేగి యట ప్రభాస తీర్థమందు స్నానమొనర్చి, తర్పణములిచ్చి,

బ్రాహ్మణ సంతర్పణముల ద్వారా, దేవ, ఋషి, పితృ, మానవగణముల సంతృప్తుల గావించినాడు. అచటి నుండి యాతడు కొందరు బ్రాహ్మణుల వెంటనిడుకొని సరస్వతీ నదిపుట్టిన ప్రదేశమున కేగెనాడు. క్రమముగా, పృథూదకము, బిందుసరస్సు, త్రితకూపము, సుదర్శనతీర్థము, విశాలాతీర్థము, బ్రహ్మతీర్థము, చక్రతీర్థము, పూర్వవాహిని యగు సరస్వతి మొదలగు తీర్థములన్నిటిని సేవించి, గంగా యమునానదీ తీర ప్రాంతములందలి ప్రధాన క్షేత్రముల గుండ పయనించి, నైమిశారణ్య క్షేత్రమును జేరె. నైమిశారణ్యమందా సమయమున ఋషులు సత్రయాగ మొనర్చుచుండిరి. దీర్ఘ సత్రయాగనిష్ఠులైయున్న ఋషులందరును బలరాముడు వచ్చుచుండుట గాంచి, తను తమ యాసనముల నుండి లేచియతనికి స్వాగత సత్కారములనెరపి, యథాయోగ్యముగ, ప్రణామ–ఆశీర్వచనములజేసి, యతనిని పూజించిరి. తనవెంట వచ్చిన వారందరితోపాటు ఆసనమందుపవిష్టుడై పూజలందుకొనిన పిమ్మట, వ్యాస భగవానుని శిష్యుడగు రోమహర్షణుడు, వ్యాసపీఠమందు కూర్చుండియుండుటను, బలరాముడు చూచినాడు. రోమహర్షణుడు సూతజాతియందు పుట్టినవాడైనను, అచటనున్న బ్రాహ్మణోత్తములందరి కంటె నెత్తయిన యాసనమందు గూర్చుండి యుండుటను, తాను వచ్చినప్పుడు గూడ లేచి నమస్కరించక, స్వాగతసత్కారము లొనర్పక యుండుటను గూడ బలరాముడు గమనించి, క్రోధపరవశుడైనాడు,

ఈ రోమహర్షణుడు ప్రతిలోమజాతియందుద్భవించిన వాడైనను, యీ బ్రాహ్మణోత్తములకంటెను, ధర్మరక్షకులమగు మాబోంట్లకంటె గూడ నున్నతమగు స్థానమందుపవిష్టుడై యున్నాడు గావున యీ దుర్బుద్ధి మృత్యుదండమున కర్హుడు. వ్యాసభగవానుని శిష్యుడై యితడనేక యితిహాస, పురాణ, ధర్మశాస్త్రాద్యనేకశాస్త్రముల నధ్యయనముగూడ గావించియున్నాడు. కాని యిప్పటికినియితనికి మనోనిగ్రహమనునది లేకున్నది. ఇతడు వినయము లేనివాడు. ఉద్దండుడు. అజితేంద్రియుడు. పండితమ్మన్యుడు. నటకుని చేష్టలన్నియు నభినయ మాత్రములే యైయుండునట్లు, యితని యధ్యయనమంతయు కృత్రిమము. దానివలన యితనికి లాభములేదు, ఇతరులకును ప్రయోజనము కలుగదు. కేవలము ధర్మచిహ్నములను మాత్రము దాల్చి ధర్మాచరణము గావింపనివారు మహాపాపులు. వారు నాచే వధింపబడుటకు యోగ్యులు. ఈ ప్రపంచమందు నేనవతరించుటయందలి ముఖ్యోద్దేశ్యమిదియేగదా!" అని తలచిన బలరాముడు, తీర్థయాత్రా కారణముచేత తాను దుష్టసంహారమునకు దూరముగా నుండినప్పటికిని, తన చేతియందున్న యొక కుశాగ్రమునే సూతుని గొట్టగా నతడు వెంటనే మరణించె. భవితవ్యమటుల జరిగినది. ఋషులందరును హాహాకారము లొనర్చిరి. అందరి చిత్తములుత్తలపాటుసందినవి. వారు భగవానుడగు బలరామునితో నిట్లు పల్కిరి. "ప్రభూ, నీవు చాలధర్మవిరుద్ధమగు పనిని చేసితివి. ఆ రోమహర్షణుని మేమే బ్రాహ్మణోచితమగు నాసనమందు

గూర్చుండబెట్టితిమి. మాయీ దీర్ఘసత్రయాగము సమాప్తమగువరకు నతనికెట్టి శారీరకబాధలు కలుగకుండునట్టి యాయువును గూడ ప్రసాదించి యుంటిమి. ఇది తెలియని నీవు బ్రహ్మహత్యాసదృశమగు నిట్టిపని యొనర్చితివి. నీవు యోగీశ్వరుడవనియు, వేదము గూడ నిన్ను శాసింపజాలదనియు మేమెఱుగుదుము. అయినను, నీ యవతారము లోకులను పవిత్రము చేయుటకొరకే యుద్దేశింపబడినదగుటచేత, యితరుల ప్రేరణ లేకుండ స్వేచ్ఛచేతనే యీ బ్రహ్మహత్యకు ప్రాయశ్చిత్తము గావించుకొన్నచో, లోకులతది యాదర్శముగా నుండగలదని, మేము నిన్ను ప్రార్థించుచున్నారమని, వినయముగ విన్నపించిరి.

అందుకు బలరాముడిట్లు పల్కె. "నేను లోకులకుపదేశముగ నుండుటకును, లోకుల ననుగ్రహించుటకును యీ బ్రహ్మహత్యకు ప్రాయశ్చిత్త మొనర్చుకొనియెదను. దాని కుత్తమమగు ప్రాయశ్చిత్తమేదియో, మీరు విధించుడు. ఈ సూతునకు యెట్టి దీర్ఘాయువు, బలను, యింద్రియశక్తి మొదలగునవి యివ్వదలచెదరో చెప్పుడు. నా యోగబలముచే సర్వమును సుసంపన్న మొనర్చెద"నని పలికిన బలునితో ఋషులిట్లనిరి.

బలరామా, నీ శస్త్రము, పరాక్రమము, యీ సూతుని మృత్యువు గూడ వ్యర్థము గాకుండునట్టియు, మేమీతనికిచ్చిన వరదానముగూడ సత్యమగునట్టి యుపాయమేదో నీవే యాలోచించు" మనగా, బలరామ భగవానుడిట్లు పల్కె.

"ఋషులారా, ఆత్మయే (తానే) పుత్రరూపమున నుత్పన్నుడగుచుండుసని వేదమాత పలుకుచున్నది. కావున రోమహర్షణుని స్థానమంతతని తనయుడు మీకు పురాణముల వినిపించును. అతనికి నేను నా శక్తిచే, దీర్ఘాయువును యింద్రియశక్తిని, బలమును యిచ్చెదను. ఇందుకు భిన్నముగా మీరింకేదైన కోరినచో, నాకు తెలుపుడు. నేను మీ కోరికను నెరవేర్చెదను. తెలియక నేనొనర్చిన యపరాధమునకు ప్రాయశ్చిత్తముగూడ మీరు బాగుగా నాలోచించి చెప్పుడు. మీరా విషయమునందు విద్వాంసులుగాన యడుగుచుంటి"నని బలరాముడు వచించగా, ఋషులిట్లు తెల్పిరి.

"బలరామా, యిల్వలుని పుత్రుడు బల్వలుడను భయంకర దానవుడొకడున్నాడు. వాడు పర్వసమయములందిచటికి వచ్చి, మాయీసత్రయాగమును దూషితము గావించుచున్నాడు. చీము, నెత్తురు, మలమూత్రములు, సుర, మాంసములను, వాడు మాపై వర్షించుచుండును. ఆ పాపిని నీవు సంహరింపుము. ఇది మాకు మహోపకారమగును. అనంతరము, నీవు యేకాగ్రచిత్తముతో, తీర్థస్నానము లొనర్చుచు, పండ్రెండు మాసముల పర్యంతము భరతవర్షమందు పర్యటించుము. దీనితో నీవు శుద్ధుడవయ్యెదవ"ని, ఋషులు వచించిరి.

అని పరీక్షిత్తుతో శుకయోగి ప్రవచించె.

# డెబ్బదితొమ్మిదవ యధ్యాయము

## బల్వల మోక్షము-బలరాముని తీర్థయాత్ర

పర్వకాలము సమీపించగనే, నైమిశమందు ప్రచండమగు గాలిదుమారము లేచినది. పాంసువర్షము గురియుచుండ, సర్వత్ర చీముయొక్క దుర్వాసన వ్యాపించినది. యజ్ఞశాలయందు బల్వలుడు మలమూత్రములను, మాంసశోణితములు మొదలగు నపవిత్ర వస్తువులను వర్షింపసాగినాడు. అనంతరము చేతియందు త్రిశూలము దాల్చి యారక్కసుడు ప్రత్యక్షమైనాడు. కాటుకకొండవంటి బృహత్కాయము గలిగి యున్నాడు. వాని కేశములు, మీసములు, గడ్డము అన్నియు రాగిరంగులోనున్నవి. మహాభయంకరముగ నున్న యాతనిని గాంచిన బలరాముడు, పరసైన్య విదారణములగు తన హలముసలాయుధముల స్మరించినాడు. స్మరించినంత మాత్రముచేతనే యవి యచట నతనింజేరినవి. ఆకాశముసందు పరిభ్రమించుచున్న బల్వలుని, బలరాముడు తన హలాగ్రముచేలాగి, ముసలాయుధముచే నతని శిరముపై మోదగా నతని శిరముపగిలి, వజ్రాఘాతముచే పగిలిన పర్వతము గైరికాదిధాతువులచే నెర్రనై క్రిందపడునట్లుగా, నెత్తురు గ్రక్కుచు రక్కసుడు క్రిందబడియె. అదృష్టవంతులైన నైమిశారణ్యవాసులగు ఋషులు బలరాముని స్తుతించిరి. ఆశీర్వాదములు గుప్పించిరి. దేవరాజగు యింద్రునభిషేకించునట్లు బలరాము నభిషేకించిరి. అనంతరము, బలరామునకు దివ్యవస్త్రాభూషణాదు లొసగి, సౌందర్యమున కాశ్రయమగు నట్టియు, యెన్నడు వాడనట్టిదియునగు నొక వైజయన్తీమాలనుగూడ యిచ్చిరి.

అనంతరము, నైమిశారణ్యవాసులయొద్ద సెలవు గైకొని, వారి యాజ్ఞానుసారము, బలరాముడు, బ్రాహ్మణ సహితముగ కౌశికీనదీతటమును జేరినాడు. అచట స్నానమొనర్చి, సరయూనదికుత్పత్తి స్థానమగు సరోవరమును జేరి, యచటినుండి సరయూనదీ తీరమువెంట పయనించుచు కొంతదూరమేగి, యటనుండి ప్రయాగ చేరినాడు. అట స్నానమొనర్చి దేవఋషి పితృతర్పణము లొనర్చి, యటనుండి పులహాశ్రమమునకేగె. అటనుండి గండకి, గోమతి, విపాశ నదులయందు గ్రుంకి, శోణనదముచేరి యందును స్నానమొనర్చె. అనంతరము గయజేరి, యచట తండ్రి యగు వసుదేవుడు సూచించినట్లు పితరుల పూజించి, గంగాసాగర సంగమమునకేగె. అచట స్నానమొనర్చి తీర్థవిధుల నెరవేర్చి మహేంద్రపర్వతము జేరి యచట పరశురాముని దర్శించి వందన మాచరించె. అనంతరము, సప్త గోదావరులను, వేణానది, పంపా, భీమ రథ్యాది నదులయందు గ్రుంకులిడుచు, కార్తికేయ స్వామిని దర్శించి గిరిశాలయమగు శ్రీశైలమునుజేరినాడు రాముడు. పిమ్మట ద్రవిడ దేశమందు పరమ పుణ్యస్థానమగు వేంకటాచలము జేరి యట వేంకటపతిని సందర్శించి, యటనుండి కామాక్షి నిలయమగు కంచి జేరి యట కామాక్షిని, శివకాంచీ,

విష్ణుకాంచిని దర్శించి, సరిద్వరమగు కావేరి యందు స్నానమొనర్చి, పుణ్యమయ మగు శ్రీరంగక్షేత్రము జేరినాడు. శ్రీరంగమందు విష్ణుభగవాను డెల్లపుడును విరాజ మానుడగుచుండును. అటనుండి విష్ణు క్షేత్రమగు ఋషభ పర్వతము జేరి, యట నుండి దక్షిణ మధురా క్షేత్రమును, పిమ్మట సేతుబంధ యాత్రను గావించె. అచట బలరాముడు బ్రాహ్మణులకు పదివేల గోదానములొనర్చె. అటనుండి బయలుదేరి కృతమాలా, తామ్రపర్ణీనదులయందు స్నానమాడి, మలయ పర్వతము చేరినాడు. అది సప్తకుల పర్వతములలో నొకటి. అచట విరాజిల్లుచున్న యగస్త్య మహామునిని దర్శించి బలరాముడతని కభివాదన మొనర్చి యాశీర్వాదములందినాడు. అతని యనుమతి నంది బలరాముడు దక్షిణ సముద్ర యాత్ర గావించినాడు. అచట కన్యా కుమారీ రూపముననున్న దుర్గాదేవి నతడు సందర్శించినాడు. అనంతరము ఫాల్గున తీర్థమగు పంచాప్సరస్తీర్థమును సేవించి, అనంతశయనుని సందర్శించి, యచట పది వేల గోదానము లొనర్చినాడు బలరాముడు.

బలరాముడటనుండి బయలుదేరి, కేరళత్రిగర్త దేశములనుండి పయనించుచు, శంకర భగవానుని క్షేత్రమగు గోకర్ణమును చేరినాడు. శంకర భగవానుడచట సర్వదా స్థితుడైయుండును. అచట శంకరుని సేవించి, ద్వైపాయనియగు ఆర్యాదేవిని దర్శించి, యా ద్వీపమునుండి శూర్పారకక్షేత్రయాత్ర గావించినాడు. అనంతరము తాపీ, పయోష్ణినిర్వింధ్య నదులయందు తానమాడి, యతడు దండకారణ్యము ప్రవేశించినాడు. అటనుండి నర్మదాతీరము జేరి, యాపవిత్ర నదీతీరము నందున్న మాహిష్మతీపురమునకేగి యట మునితీర్థమందు స్నానమొనర్చి, తిరిగి ప్రభాస తీర్థముచేరినాడు. అచట బ్రాహ్మణులవలన, కురుపాండవ యుద్ధమందు క్షత్రియు లనేకులు మరణించిరనియు, పృథ్వీభారము చాలవరకు తగ్గిపోయినదనియు తెలుసు కొనియె. దుర్యోధన భీమసేనులు గదాయుద్ధము చేయు దినమందు దానిని వారించు టకై యాతడు కురుక్షేత్రమేగె.

ధర్మరాజు, నకుల సహదేవులు, కృష్ణార్జునులు బలరాముని గాంచి నమస్క రించిరి. వారు మనస్సునందే, యితడేమిచేయుట కిచటికి వచ్చెనోయని భయపడు చునేయుండిరి. ఆ సమయమందు భీమసేన దుర్యోధనులిరువురు గదల గైకొని యొండొరుల జయించు నుద్దేశ్యముతో క్రోధో్ద్ధిక్తులై విచిత్రములగు మండలభ్రమ ణములొనర్చుచుండిరి. వారినిగాంచి బలరాముడు, దుర్యోధన భీమసేనులారా, మీరిరువురును వీరులే. బలపౌరుషములుగూడ మీ యిరువురకు సమానములే. భీమ సేనునకు బలాధిక్యమున్నదనియు,దుర్యోధనునకు శిక్షాధిక్యము గలదనియు నాయభి ప్రాయము. మీవంటి సమాన బలశాలురలో నెవరికిని జయ పరాజయములు కలు గుటనెక్కడను చూడము. కావున వ్యర్థమగుయుద్ధము మానివేయుడు. ఇక్కడికాపి వేయుడు." అని పలికినాడు. అతనిమాట లిర్వురకును హితకరములే. కాని వారి

యందు వైర భావము ధృఢముగ పాదుకొని యుండుటచేవారు బలరాముని మాట లను పాటించరైరి. ఒకరినొకరు కటుభాషణములు చేసుకొనుచు, దుర్వ్యవహారముల స్మరించుకొనుచు నున్మత్తులై యుండిరి. "వీరి ప్రారబ్దమిటులయున్నది." యని తల చిన బలరాముడు, వారిపై విశేషాగ్రహముజూపక ద్వారకకు వెడలిపోయె. ద్వారక యందుగ్రసేనాది గురుజనులు, యితర బంధువులందరును మహాదరముతో బలరా మునకు స్వాగతముపలికిరి. అచటినుండి బలరాముడు మరల నైమిశారణ్యమేగినాడు. అచటి ఋషులు, యుద్ధాదులనుండి విరాగియై యేతెంచిన బలరామునిచే నన్నివిధము లగు యజ్ఞములు చేయించిరి. యజ్ఞములన్నియు వాస్తవమునకు బలరాముని యంగ ములే. కావున యతని యజ్ఞానుష్ఠానము కేవలము లోకహితార్థమనియే గ్రహింపవల యును. సర్వసమర్థుడగు రాముడచటి ఋషులకు తత్త్వోపదేశము గావించినాడు. దానిచే జనులు సర్వప్రపంచమును తమయందే, తమను సర్వవిశ్వమందున్నట్టి యనుభవమును పొందగలుగుదురు. అనంతరము బలరాముడు తన భార్యయగు రేవతీసహితముగ నవబృధ స్నానమొనర్చినాడు. సుందర వస్త్రాభరణాదులదాల్చి, తన బంధుజనులమధ్య, చంద్రిక–తారలమధ్య ప్రకాశించుచుండునట్టి చంద్రునివలె విరాజిల్లినాడు. అతడు స్వయముగ ననంతుడు. అతని స్వరూపము మనస్సునకు వాక్కునకు నందునట్టిదిగాదు. లీలార్థమే యతడు మానవుడుగా నవతరించినాడు. బలరాముని యిట్టి చరిత్రలకంతములేదు. ఏ మానవుడు, అనంతుడు, సర్వవ్యాప కుడు, అద్భుతకర్ముడు, నగు బలరామ భగవానుని చరిత్రలను, సాయంప్రాతఃకాల ములందు స్మరించునో, యతడు భగవానున కత్యంత ప్రియుడగును.

# ఎనుబదవ యధ్యాయము

## సుదామో (కుచేలో) పాఖ్యానము

"మహాత్మా, ప్రేమ, ముక్తుల నొసంగునట్టి పరబ్రహ్మ పరమాత్మయగు శ్రీకృష్ణభగవానుని శక్తి యనంతము. మీరింతవరకు చెప్పినట్టి భగవానుని యితర లీలలనుగూడ వినగోరుచున్నాను. ఈ జీవుడు విషయసుఖముల కొరకై యెల్ల ప్పుడు పాటుపడుచు నత్యంత దుఃఖము ననుభవించుచున్నాడు. ఆ విషయసుఖము లను బాణములు జీవుని చిత్తమునెక్కుడుగ బాధించుచున్నవి. అట్టిస్థితిలో, మంగళ మయములగు భగవానుని లీలావిశేషములను వినియు వానియందు విముఖుడగునట్టి రసికు (విశేషజ్ఞుడగు పురుషుడు) డెవడుండును? భగవానుని గుణగానము చేయునట్టి వాణియే వాణి. భగవానుని సేవకు పనికివచ్చు చేతులే నిజమగు చేతులు. చరాచర

ప్రాణులయందంతర్యామిరూపమున నివసించునట్టి వాసుదేవుని స్మరింనునట్టి మనస్సే నిజమగు మనస్సు. భగవానుని పుణ్యకథాశ్రవణమొనర్చునట్టి కర్ణములే కర్ణములని చెప్పబడుటకు యోగ్యములు. చరాచర జగత్తంతయు భగవానుని ప్రతిమా స్వరూప మేయని భావించి, నమస్కరించునట్టి శిరస్సే శిరస్సు. సర్వత్ర భగవంతునేదర్శించు నట్టి నేత్రములే నిజమగు నేత్రములు. భగవానుని, భగవద్భక్తులను వారి పాదోదక మును సేవించునట్టి యింద్రియములే నిజమగు యింద్రియములు. అట్టివాని జీవితము మాత్రమే సార్థకము, సఫలము.

అని పరీక్షిన్మహారాజు పలుకగా, శ్రీశుకుని హృదయము వాసుదేవునియందు లీనమైనది. తన్మయుడై యాతడు పరీక్షిత్తుతో నిటులపలికె.

"రాజా, శ్రీకృష్ణునకాప్త మిత్రుడగు బ్రాహ్మణుడొక డుండెడువాడు. అతడు గొప్ప బ్రహ్మజ్ఞాని. విషయ విరక్తుడు. శాంతచిత్తుడు. జితేంద్రియుడు. గృహస్థు డయ్యు యదృచ్ఛాలాభసంతుష్టుడైయుండె. అతను ధరించిన వస్త్రములు చినిగిపోయి యుండెడివి. ఆ కుచేలుని భార్య పరిస్థితియు నటులేయుండె, ఆమెయు భర్తతో సమానముగనే ఆకలితో దుర్బలురాలైయుండె. మూర్తీభవించిన దరిద్రదేవతవలె దుఃఖార్తయైయున్న యా పతివ్రత యొకనాడాకలితో నలమటించుచు, పతిదేవుని సమీపించి, వాడిపోయిన మోముతో నిట్లు పల్కినది. "స్వామీ, సాక్షాత్‌లక్ష్మీపతియగు శ్రీకృష్ణభగవానుడు మీకు స్నేహితుడుగదా, అతడు భక్తుల కోరికలుదీర్చు కల్పత రువు. శరణాగతవత్సలుడు. బ్రాహ్మణులకు భక్తుడు. అతడు సాధువులకు, సత్పురు షులకును, యేకమాత్రాశ్రయుడు. మీరాతనివద్దకు వెళ్ళుడు. మీరు బహుకుటుంబీకు లనియు, నన్నములేక యల్లాడుచుండిరనియు నామహానుభావునకు తెలిసినచో, మీకు అధికమగు ధనము నొసంగగలడు. ప్రస్తుతమాతడు, భోజ, వృష్ణి, అంధకవంశీయు లగు యాదవులకు స్వామిగా, ద్వారకయందే నివసించుచున్నాడు. అతని చరణకమ లముల స్మరించిన భక్తులకు తననుతాను సమర్పించుకొనునంతటి యుదారుడాతడు. ఇట్టిస్థితిలో జగద్గురువగు నతడు, తన భక్తులగు వారలకు, ధనము, విషయసుఖము లవంటి స్వల్పవాంఛలను దీర్చుటలో నేమంత యాశ్చర్యముండును?" అని యీ ప్రకారము కుచేలుని పత్ని యత్యంత వినయ పూర్వకముగా విన్నవించగా నతడిట్లా లోచించినాడు. "ధనముమాట యెటులున్నను శ్రీకృష్ణభగవానుని దర్శనము లభిం చునుగదా. నా జీవితమునకిది మహాలాభము" అనితలచి, "కల్యాణీ, ఆ భగవాను నకు కానుకగానిచ్చుటకేమైన యింటిలోనున్నచోనిమ్ము" అని పలికె. ఇంటియందేము న్నది? ఆమె యిరుగుపొరుగు బ్రాహ్మణ గృహములకేగి నాల్గుపిడికెళ్ళ యటుకులను యాచించి తెచ్చి, భగవానునకుపాయనముగ, చేలఖండమున గట్టియిచ్చినది. ఆ బ్రాహ్మణుడది గైకొని "నాకు భగవానుని దర్శనమెటుల కలుగును?" అని యాలో చించుచు, ద్వారకకు పయనమైనాడు.

ద్వారకను ప్రవేశించి, యాతడితర బ్రాహ్మణులతోగూడి, మూడుగుల్మము (సైనికస్థావరము)లను దాటి, మూడుకక్ష్యలనుగూడ దాటి, యగమ్యములగునంధక, వృష్ణి వంశీయుల గృహములను సమీపించినాడు. వానిమధ్య భగవానుని షోడశసహస్రాధిక రాణివాసములున్నవి.అందు గొప్పగా కనుపించుచున్న యొక రాణివాసమును కుచేలుడు ప్రవేశించినాడు. అందు ప్రవేశించుచుండగనే యతనికి బ్రహ్మానందానుభవము గల్గినది. ఆ సమయమందు శ్రీకృష్ణభగవానుడా మందిరమందు, తన ప్రాణవల్లభయగు రుక్మిణీదేవి పర్యంకమందుపవిష్టుడైయుండె. దూరమునుండియే సుదాముని (కుచేలుని) గాంచిన భగవానుడు పర్యంకమునుండి వెంటనే లేచి యాతని కెదురేగి, తన బాహువులతో నతనిని గాఢముగ నాలింగన మొనర్చె. పరమానంద స్వరూపుడగు భగవానుడు తన ప్రియమిత్రుని యంగస్పర్శచే పరమానందభరితుడైనాడు. కమలాక్షుడు తన కనులవెంట ప్రేమానంద బాష్పములు కార్చినాడు.పిమ్మట సుదామునిలోనికి గొంపోయి,తన పర్యంకముపై గూర్చుండబెట్టి, పూజగావించినాడు. శ్రీకృష్ణుడందరిని పావనము చేయునట్టి మహానుభావుడు. స్వయముగా తాను కుచేలుని పాదప్రక్షాళన మొనర్చి, యాపాదోదకమును తన శిరముపై జల్లుకొని, యతని శరీరమునందు, చందనాగరుకుంకుమాది దివ్య గంధములలదినాడు.ధూపదీపాదులతో నతనికి హారతి యెత్తినాడు. పూజానంతరము తాంబూలమొసగి గోవును దానమిచ్చి, స్వాగతము పల్కినాడు.

ఆ బ్రాహ్మణుడు ధరించిన వస్త్రములు చిరిగిపోయియున్నవి. శరీరమత్యంత మలినముగను దుర్బలముగ నున్నది. దేహమందలి నరములన్నియు కనుపించుచున్నవి. భగవతియగు రుక్మిణీదేవి స్వయముగ వింజామర వీచుచు సేవించుచున్నది. ఇదియంతయు చూచుచున్న యంతఃపుర స్త్రీలత్యంత విస్మయాశ్చర్యములకు లోనగుచు, పవిత్ర కీర్తిగలిగిన భగవానుడీ మలిన వస్త్రధారియై యవధూత వలెనున్న బ్రాహ్మణునింతగానేల గౌరవించుచుండెనాయని తలపోయుచుండిరి. వారు పరస్పర మిట్లు చెప్పుకొనుచుండిరి.

"ఈ జీర్ణాంబరదారి, నిర్ధనుడు, నికృష్ట భిక్షుకుడు, జగద్గురువును,శ్రీనివాసుడునగు శ్రీకృష్ణునిచే నిట్టి సపర్యలందుకొనుటకు, పూర్వమందెట్టి పుణ్యకర్మలొనర్చియుండెనోగదా! భగవానుడీ పుణ్యాత్ముని తన పర్యంకముపై గూర్చుండబెట్టి, లక్ష్మిరూపిణియగు రుక్మిణినిగూడ వదలి, తనయన్నయగు బలరామునితో సమానముగ నితనిని కౌగిలించినాడు. చూచితిరా?" యని చెప్పుకొని యక్కజపడుచుండిరి.

పరీక్షిన్మహారాజా, శ్రీకృష్ణసుదాములిరువురును నొకరిచేతులొకరు పట్టుకొని, తమ చిన్ననాటి యానందదాయకములగు సంఘటనలను నెమరువేసుకొనుచు, గురుకులవాసమందలి విషయములను ముచ్చటించుకొనసాగిరి.

శ్రీకృష్ణుడు సుదామునితో నిట్లులనియె. "ధర్మజ్ఞా, నీవు గురువునకు దక్షిణ యొసంగి, గురుకులమునుండి వెడలిన యనంతర మనురూపవతియగు పడతిని పరిణయమాడితివా లేదా? నీవు గృహస్థుడవైనప్పటికిని, నీ చిత్తము విషయభోగాసక్తమై యుండదని నాకు తెలియును. ధనాదులందు నీకెట్టి ప్రీతియు లేదనియు నేనెఱుంగుదును. భగవన్మాయా నిర్మితములగు విషయవాసనలను త్యజించి, విషయవాసనలు లేకున్నను కేవలము లోకసంగ్రహార్థము, నావలె కర్మలు చేయువారు చాలనరుదుగ నుందురు. బ్రాహ్మణోత్తమా, మనమిరువురము గురుకుల మందున్నపుడు జరిగిన యానాటి సంఘటన నీకు గుర్తున్నదా? నిజముగా గురుకులమునందే, ద్విజాతులకు తాము తెలుసుకొనవలసిన వస్తువుయొక్క జ్ఞానము కలుగుచుండును. అట్టి జ్ఞానము చేతనే యజ్ఞానాంధకారము దాట వీలగును.

ఈ సంసారమందు శరీరమునకు జన్మ నొసంగిన జనకుడు ప్రథమగురువు. అనంతర ముపనయన సంస్కారమొనర్చి సత్కర్మ శిక్ష నొసంగు వాడు రెండవ గురువు. అతడు నాతో సమానముగ పూజనీయుడు. తదనంతరము జ్ఞానోపదేశము గావించి పరమాత్మ ప్రాప్తిని గల్గించు గురుడు, నా స్వరూపుడే యగుచున్నాడు. వర్ణాశ్రమ ధర్మ నిరతులగు వారికి విధముగా గురువులు ముగ్గురగుచున్నారు. ప్రియ మిత్రమా, గురు రూపమున నున్నది నేనే. ఈ జగత్తునందు వర్ణాశ్రమవంతులు, గురుదేవుని యుపదేశానుసార మనాయాసముగ భవసాగరమును తరించుచున్నారు. వారే, స్వార్థమును పరమార్థమును నిజముగా గుర్తించినవారు. నేను సర్వులకు ఆత్మ స్వరూపుడను. అందరి హృదయములందునను, అంతర్యామి రూపముననున్నదియు నేనే.నేను, గురు సేవా-శుశ్రూషలచే సంతోషించినంతగా-గృహస్థ ధర్మములగు పంచ మహా యజ్ఞాదులచేగాని, బ్రహ్మచర్య ధర్మములగు వేదాధ్యయనాదులచేగాని, వానప్రస్థ, సంన్యాస ధర్మములచేగాని సంతుష్టి చెందను.

గురుకులవాసము చేయునప్పుడొకనాడు గురుపత్ని సమిధల దెచ్చుటకై మన నడవికిబంపిన విషయము నీకు గుర్తున్నదా? ఆనాడు మనమొక ఘోరారణ్యమున కేగియుంటిమి. అది సమయము గాకపోయినను పెద్దగాలి వచ్చినది. ఉరుములు, మెరుపులతో భయంకరముగానుండె. సూర్యాస్తమయమగుటచే గాఢాంధకారము వ్యాపించినది. భూమియంతయు జలమయమైపోవుటచే మిట్ట పల్లములు తెలియరాకుండె. అది సామాన్యవర్షమా? చిన్నప్రళయమువలె నుండినది. ప్రచండమగువాయువుచేతను, వర్షధారలచేతను మనమందరము భయపడినవారమై, యొకరిచేతులొకరు బట్టుకొని, యడవియందిటునటు తిరుగుచుండిపోయితిమి. సాందీపమునికి విషయము తెలిసి సూర్యోదయముకాగానే మనలను వెదుకుచు నడవికేతెంచి, యత్యంతాతురులమై యున్న మనలను గాంచినాడు. "పుత్రులారా, ఆశ్చర్యాశ్చర్యము. మీరందరు నా కొరకై యెంతటి కష్టమనుభవించితిరి. ప్రాణులందరికి తమ శరీరమత్యంత ప్రియమై

యుండును. అట్టిచో మీరు ప్రాణములను లక్ష్యపెట్టక నా సేవయందు నిమగ్నులై తిరి. గురు ఋణమునుండి ముక్తులగుటకు సచ్ఛిష్యులీరీతిగనే విశుద్ధ భావముతో తమ సర్వస్వము గురుసేవార్థము సమర్పించుకొనవలయును. ద్విజ శిరోమణులారా, నేను మీ యెడల నత్యంత ప్రీతుడనైతిని. మీ సమస్తమనోరథములు, అభిలాషలు సిద్ధించు గాక. మీరు నావద్ద చేసిన వేదాధ్యయనము సర్వదా మీకు కంఠస్థమైయుండి, యిహ పరలోకము లందెన్నటికి నిష్ఫలము గాకుండుగాక" అని మన గురూత్తముడు పల్కియుండె.

మిత్రమా, మనము గురుకులవాసముచేయుచుండినప్పుడిట్టి సంఘటనలెన్నియో జరిగినవి. గురుదేవుని దయచే మానవుడు శాంతి కధికారియై పూర్ణత్వమును పొందు ననుటలో నెట్టి సందియమునులేదు" అని శ్రీకృష్ణుడు చెప్పిన మీదట, కుచేలుడిట్ల నియె.

"దేవాధిదేవా, జగద్గురూ, సత్య సంకల్పుడవగు నీతో గూడి గురుకులము వాస మొనర్చు నదృష్టము గలిగిన మాకింక చేయవలసిన దేముండును? ఛందోమ యములగు వేదములు, చతుర్విధ పురుషార్థములకును మూలములు. ఆ వేదములు నీ శరీరము. అట్టి నీవే, వేదాధ్యయన మొనర్చుటకై గురుకులవాసమొనర్చితివి. ఇది మనుజ లీలాభినయముగాక మఱియేమి?" యని, కుచేలుడనియె"నని పరీక్షిత్తుతో శ్రీశుకులు వచించిరి.

# ఎనుబది యొకటవ యధ్యాయము

## సుదాముని కైశ్వర్య ప్రాప్తి

"పరీక్షిన్మహారాజా, శ్రీకృష్ణభగవానున కందరిమనోగత విషయములన్నియు తెలియును. అతడు బ్రాహ్మణ భక్తుడు. వారి క్లేశముల దొలగించుచుండును. పైన నుదహరించిన ప్రకారము కుచేలునితో చాలసేపు సంభాషించిన యనంతరము, భగ వానుడు నవ్వుతూ ప్రేమ భరితములగు చూపులతో నతని గాంచుచు వినోదముగ నిట్లులనియె.

"బ్రాహ్మణోత్తమా, మీ యింటినుండి నాకేమి యుపాయనము గొనివచ్చి తివి? నన్ను ప్రేమించునట్టి భక్తులు నాకే చిన్ని కానుక గొని వచ్చినను నేను దానితో మిక్కిలి సంతుష్టుడనగుచుందును. కాని నా భక్తులు గానివారు నాకు గొప్ప గొప్ప కానుకలిచ్చినను నేను సంతుష్టి చెందను. ప్రేమ భక్తిచే నొసంగిన, ఫల, పుష్ప, పత్ర జలములనైనను నేను స్వీకరించుటయేగాక, యా ప్రేమోపహారము నకు తగిన భోగముల నాతనికి కలుగజేయుదును" అని భగవానుడు సూచించినప్పు

టికిని కుచేలుడు లజ్జావశుడగుటచేత, తాను దెచ్చిన యటుకుల నాతనికి సమర్పింప లేకపోయినాడు. సంకోచముచే నతడు తలవంచుకొని యుండెను. బ్రాహ్మణుడు వచ్చిన కారణమును, నతని మనోగతాభిప్రాయమును భగవానుడు గ్రహించినాడు. "ఇతడు నా సఖుడు, ఇతడెన్నడును సంపదల కోరి నన్ను భజించి యుండలేదు. ఇప్పుడు గూడ పతివ్రతయగు తన భార్యకు ప్రియము గల్గించుటకై యామె ప్రేరణ చేతనే యిచటికి వచ్చియున్నాడు. నేనిప్పుడితనికి, దేవతలకుగూడ నత్యంత దుర్లభమగు నైశ్వర్య మొసంగెద"నని యాలోచించి భగవానుడు, కుచేలుని వస్త్రమందున్న మూటనుగాంచి 'ఇది యేమ'ని పలుకుచు, మూటను లాగుకొనియె. మిక్కిలి యాదర ముతో "మిత్రమా, నాకు మిక్కిలి యిష్టమగు కాన్కను గొనివచ్చితివే? ఈ యటు కులు కేవలము నన్ను మాత్రమే గాక సమస్త ప్రపంచమునకుగూడ తృప్తి గల్గింప జాలునట్టివ"ని పలుకుచు నొక పిడికెడటుకులను భక్షించి, రెండవ పిడికెడు భక్షించ బోవుచుండగా, లక్ష్మీరూపిణి యగు రుక్మిణిదేవి యాతని చేయి బట్టుకొని వారించి నది. ఆమె శ్రీకృష్ణ పరాయణయగుటచే, నతనిని వదలి యెచటికిని బోజాలదు. "విశ్వాత్మా, చాలు చాలు. మనుష్యునకు యిహలోకమందు పరలోకమందు గూడ సమస్త సంపత్ప్రాప్తిని కల్గించుటకు, మీ యనుగ్రహమునకు కారణమైన, పిడికెడటు కులే యెక్కువ!" అని పల్కుచు రుక్మిణీదేవి రెండవసారి యటుకులు భక్షింపకుండ నాపినది.

కుచేలుడారాత్రి శ్రీకృష్ణుని మందిరమందే యుండిపోయినాడు. ఆహార పానీ యముల సేవించి, వైకుంఠమందుండి నట్టి యనుభూతిని పొందినాడు. శ్రీకృష్ణుని వలన ప్రత్యక్షముగా తన కేమియు లభింపలేదు. అయినను కుచేలుడతని నేమియు యాచించలేదు. తెల్లవారినది, శ్రీకృష్ణ సందర్శనముచే కలిగిన యానందమునందోల లాడుచు తన యింటికి పయనమైనాడు కుచేలుడు. తన మనసు నందీ విధముగ నాలోచించుచు పోవుచుండెను. "ఆహా, యెంతటి యానందకరము ఆశ్చర్యకరమునగు విషయము! బ్రహ్మణ్యుడగు శ్రీకృష్ణభగవానుని బ్రాహ్మణ భక్తి నేడు నేను కను లార గాంచగల్గితిని. ధన్యుడను. వక్షఃస్థలమందు స్వయముగా లక్ష్మీదేవి వసించి యుండునట్టి భగవానుడు నా వంటి పరమ దరిద్రు నాలింగనము చేసుకొనియెనే! అత్యంత పాపాత్ముడను, దరిద్రుడనగు నేనెక్కడ? శ్రీదేవి కాశ్రయభూతుడగు భగ వానుడెక్కడ? 'ఇతడు బ్రాహ్మణుడ'ను పూజ్య భావముతో, నతడు తన బాహువు లతో నన్ను పరిరంభించినాడు. అంతేగాదు, తన ప్రాణ ప్రియురాలగు రుక్మిణీదేవి శయనించు పర్యంకమునందు, తన యన్నయగు బలరామునివలె నన్ను శయనింప జేసినాడే! ఎంతని వర్ణింపను? నేనలసి యుండుటచేత, పట్టపురాణియగు రుక్మిణిదేవి తన చేతితో నాకు వింజామర వీచుచు సేవించినది! ఆహా! దేవతల కారాధ్యదేవు డగు తాను, బ్రాహ్మణులను తన యిష్ట దైవములుగా భావించుచు, భగవానుడు నా

పాదము లొత్తి, యాహారపానీయములు స్వయముగ సమర్పించి, నాకు సేవా-శుశ్రూష లొనర్చి, దైవసమానముగా నన్ను పూజించినాడు. స్వర్గమోక్షములు, భూలోక పాతాళలోకములందలి సంపదలు, సమస్త యోగ సిద్ధులు లభించుటకు మూలకారణ మతని చరణ కమలసేవయే యగును. అయినను భగవానుడు నాకు కొంచెమైనను ధనమీయకుండుటకు కారణమేమై యుండును? ఈ దరిద్రునకు ధన మొసంగినచో, ధనమదాంధుడై, వీడు నన్ను బొత్తుగ మరచి పోవునని యాలోచించియే, నాకు ధన మొసంగలేదు" అని యీ విధముగ తనలో తాననుకొనుచు, కుచేలుడు తన గృహ సమీపమున కేగె.

కాని యా ప్రాంతమంతయు, సూర్యాగ్ని చంద్రసమానములగు తేజస్సుగలిగిన, రత్న నిర్మితములగు ప్రాసాదములచే నిండియున్నది! విచిత్రములగు నుద్యానవన ములు, ఉపవనములు కనుబడుచున్నవి. వానియందు రంగురంగుల పక్షులు కలరవము లొనర్చుచున్నవి. సరోవరములు, వానియందు రంగురంగుల కమలములు, కుముద ములు గానవచ్చుచున్నవి. సుందరనారీమణు లిటునటు నడయాడుచుండిరి. అది యంతయుగాంచి, కుచేలుడు "ఇదియేమి? ఇది యెవరి ప్రదేశము? ఇది నేనిదివరకు వసించిన స్థానమేయైనచో యీ మార్పెట్లు సంభవించినది?" అని తర్కించుచుండు నంతలోననే, దేవతాసమానలగు సుందర స్త్రీ పురుషులు మంగళ వాద్యములతో బ్రాహ్మణునకెదురు వచ్చి స్వాగతము పల్కిరి. పతిదేవతయొక్క శుభాగమనమునకు సంతసించుచు, నతని పత్ని, మహానందముతో త్వరితముగ నింటిలోనుండి వచ్చినది. ఆమె కమలవనమునుండి విచ్చేసిన సాక్షాల్లక్ష్మీదేవివలెనున్నది. అతనిని గాంచుచునే పతివ్రతయగు నామె నేత్రములందు, ప్రేమావేగముచే, నశ్రువులు నిల్చినవి. నేత్రములు మూసుకొని మహాభక్తితో నతనికి నమస్కరించి, మనసునందే యతని నాలింగన మొనర్చినది.

బ్రాహ్మణపత్ని, బంగారుహారములుధరించియున్న దాసీజనమధ్యమందున్నది. విమానస్థితయైయున్న దేవాంగనవలె, దేదీప్యమానముగ వెలిగిపోవుచున్నది. ఆమెనా రూపములో జూచిన బ్రాహ్మణుడత్యంత విస్మితుడైనాడు. ప్రేమతో నామె వెంటనతడు గృహములోనికేగినాడు. ఆ మహలెటులనున్నది? దేవేంద్ర భవనము వలెనున్నది. అనేకమణి స్తంభములున్నవి. ఏనుగు దంతములతోను, బంగారముతోను నిర్మింప బడిన పట్టెమంచములు, పాలనురుగువలె తెల్లనైనపాన్పులు, కోమలములగు దుప్పట్లు పరచియున్నవి. బంగారు దండములు గల చామరములచటనున్నవి. బంగారు సింహా సనము శోభాయమానముగనున్నది. దానిపై కోమలములగు మెత్తలున్నవి. ముత్య ముల జాలరులుగల వితానములున్నవి. మరకతమణులతో నగిషీలు చేయబడిన స్ఫటికనిర్మితములగు కుడ్యములందు, రత్ననిర్మితములగు స్త్రీ మూర్తుల చేతులందు రత్నదీపములు ధగద్ధగాయమానముగ వెలుగుచున్నవి. ఇట్టియైశ్వర్యలాభమునకు

ప్రత్యక్షకారణమేమియు గనుపించక కుచేలుడు, నాకిట్టి సంపత్తి యెచటినుండివచ్చినదని, గంభీరముగ నాలోచింపసాగె. "నేను జన్మచేతనే భాగ్యహీనుడను. దరిద్రుడను. ఈ సంపత్సమృద్ధికి కారణమేమైయుండును? ఇది తప్పక పరమైశ్వర్యశాలియైన యదువంశ శిరోమణియొక్క కృపాకటాక్షవీక్షణమేగాని వేరొండుగాదు. ఇదియంతయు నతని యనుగ్రహమే. స్వయముగా నతడు పూర్ణకాముడు, లక్ష్మీపతియునగుటచేత ననంతభోగ సామగ్రి యుక్తుడైయుండును. యాచకులగు భక్తులమనోభావముల గ్రహించి వారి మనోరథముల నీడేర్చుచుండును. కాని యాతనినెవరును కొంచెమైనను గ్రహింపజాలకయుందురు. నా ప్రియసఖుడగు శ్యామసుందరుడు నిజముగా మేఘుని కంటెగూడ యుదారుడు. సముద్రమునుగూడ నింపగలశక్తిగలవాడయ్యును, కర్షకుని యెదుట వర్షించక, యతడు నిద్రించిన పిమ్మట రాత్రియందు వర్షించును. పెద్దగ వర్షించియు కొంచెమనియే భావించుచుండును. శ్రీకృష్ణుడధికముగనే యిచ్చును. కాని యాతనిని గౌరవించునది చాల తక్కువ. అతనిని ప్రేమించు భక్తులేకొంచెమొసగినను, దానినాతడధికముగ భావించును. ఇపుడు జరిగినదేమి? నేను కేవలమొక పిడికెడటుకులుపాయనముగా సమర్పింపగా, నుదారశిరోమణియగు శ్రీకృష్ణుడు యెంత ప్రేమతో స్వీకరించినాడు! నాకు ప్రతిజన్మయందును, అతనియందు ప్రేమ, సౌహార్దము, మైత్రి, అతనికిదాస్యము చేయునదృష్టము లభించుగాక. నాకు సంపత్తితో పని లేదు. సదా, సర్వధా, సమస్త కల్యాణగుణాకరుడగు శ్రీకృష్ణభగవానుని చరణకమలములయందు అనురాగము వృద్ధిపొందుచుండుగాక. భక్తులసత్సంగములభించుచుండుగాక. భగవానుడు సంపదలు మొదలగు వానియందుగల దోషములెఱుంగును,

పెద్ద పెద్ద భాగ్యవంతులు, ధనైశ్వర్యమదములచే పతనము చెందుచుండుట గాంచి యాతడు, ముందుచూపులేని తనభక్తు లెంతవేడుచున్నను వారికి, రాజ్యమును సంపదలు మొదలగువాని నివ్వకుండును." అని యీ ప్రకారము తన బుద్ధితో తర్కించి, కుచేలుడు త్యాగపూర్వకమైన యనాసక్త భావముగలవాడై, తనపత్నీ సమేతముగ, భగవత్ప్రసాదలబ్ధములైన విషయముల ననుభవించుచుండె. అతని ప్రేమ భక్తి దినదిన ప్రవర్ధమానము కాదొడగినది.

పరీక్షిన్మహారాజా, దేవదేవుడు, భక్తభయహారి, యజ్ఞపతియునగు భగవానుడు, స్వయముగా బ్రాహ్మణులను తన ప్రభువులుగను, యిష్టదైవములుగను భావించుచుండును. కావున బ్రాహ్మణులకు మించిన గొప్ప ప్రాణులు జగత్తునందెవ్వరును లేరు. ఈ ప్రకారము శ్రీకృష్ణునకు ప్రియసఖుడగు సుదాముడు, "భగవంతుడజితుడయ్యును, యెవని యధీనమందును లేకుండినను, తనను సేవించువారలకతడధీనుడై యుండును"ని గ్రహించినాడు. సుదాముడు భగవానుని ధ్యానమునందే

తన్మయుడై యుండిపోయినాడు. ధ్యానదార్ఢ్యతచేత నతని యవిద్యాగ్రంధి యూడిపోయినది. కొలదికాలమునందే, సత్పురుషులకు గతియగు, పరంధామము నతడు పొందినాడు.

పరీక్షిన్మహారాజా, బ్రాహ్మణులను తన యిష్టదైవములుగా పరిగణించునట్టి శ్రీకృష్ణభగవానునియొక్క యీ బ్రహ్మణ్యత నెవరు విందురో, వారికి భగవానుని చరణములందు ప్రేమభావ ముదయించి, వారు కర్మబంధమునుండి విముక్తులయ్యెదరు" అని శ్రీశుకులు వచించిరి.

# ఎనుబది రెండవ యధ్యాయము

## శ్రీకృష్ణబలరాములతో గోపీగోపకుల సమాగమము(సూర్యగ్రహణము)

ఈ విధముగ బలరామకృష్ణులు ద్వారకయందునివసించుచున్న సమయములో నొకప్పుడు సర్వగ్రస్త సూర్యోపరాగము సంభవించినది. జ్యోతిశ్శాస్త్రము ద్వారా మానవులకు సూర్యగ్రహణ విషయము ముందుగనే తెలిసియుండుటచేత, సందరును తమకు శుభములు కల్గుటకుగాను పుణ్యము సంపాదించుకొను తలంపుతో కురుక్షేత్ర మందలి స్యమంతపంచక క్షేత్రము చేరినారు. ధనుర్ధరులలో శ్రేష్ఠుడగు పరశురాముడు యిరువదియొక్కమారు క్షత్రియుల వధించి, యా రాజుల రుధిరధారచే నైదు పెద్ద కుండములు నేర్పరచియుండె. అవియే స్యమంతక పంచకమను పేర ప్రసిద్ధికెక్కినవి. సాధారణ మానవుడు తన పాపనివృత్తికొరకై ప్రాయశ్చిత్తము చేసుకొనునట్లు, పరశురాముడుగూడ, తనకు కర్మసంబంధమేమియు లేకపోయినను, లోకమర్యాదను గాపాడుటకై యా స్యమంత పంచకక్షేత్రమందు యజ్ఞ మాచరించియుండె.

ఈ మహాతీర్థయాత్రా సమయమందు, భారత వర్షమునందలి యన్ని ప్రాంతముల వారును, కురుక్షేత్రమేతెంచిరి. వారిలో, అక్రూరుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలగు వృద్ధులును, గద, సాంబ, ప్రద్యుమ్నాది యాదవులును తమ తమ పాపక్షయార్థము కురుక్షేత్రము చేరిరి. అనిరుద్ధుడు, సేనాపతి యగు కృతవర్మయు, సుచంద్ర, శుక, సారణాదులతో నగరరక్షణకై ద్వారకయందుండిపోయిరి. యాదవులు సహజముగనే పరమతేజస్వంతులు. దానికి తోడుగా కంఠమునందు బంగారుహారములు, దివ్యములగు వస్త్రాభరణాదులు, కవచాదులచే

సుసజ్జితులైయుండుటచేత వారి శోభ యింకను వృద్ధిచెందినది. తీర్థయాత్రాపథమందువారు, దేవతావిమాన సహానములగు రథములు, సముద్రతరంగములవలె చలించు తురంగములు, మేఘములతో సమానమగు విశాలకాయములుగల్గి ఘీంకరించు గజబృందములతోను, విద్యాధరులతో సమానులగు మానవులు మోయుచున్న పల్లకీల యందాసీనులైయున్న పత్నీసమూహములతోను కూడి పయనించుచు, స్వర్గమందలి దేవతలు యాత్రచేయుచుండిరా యనునట్లు తేజరిల్లిరి. అందరును కురుక్షేత్రము చేరి యేకాగ్రచిత్తముతో యింద్రియ నిగ్రహముతో, శ్యమంతపంచకమందు స్నానమొనర్చి, గ్రహణ సందర్భముగా నిశ్చితకాలమువరకు నుపవాసము చేసిరి. బ్రాహ్మణులకు గోవులను దానమొనర్చిరి. వానిని వస్త్రాభరణాదులతోను, పుష్పమాలలతోను అలంకరించిరి. అనంతరము గ్రహణమోక్షకాలమునందు మరల రామహ్రదములందు యథావిధిగ స్నానమొనర్చి బ్రాహ్మణులకు మృష్టాన్నభోజనములు పెట్టిరి. అందరును తమ మానసములందు, శ్రీకృష్ణచరణారవింద భక్తి కలుగవలయునని యాపవిత్రసమయమందు సంకల్పించిరి. శ్రీకృష్ణునే తమ యాదర్శముగను, యిష్టదైవముగను భావించుచుండునట్టి యాదవులు బ్రాహ్మణుల యనుమతితో తాము భోజనములు ముగించుకొని, దట్టమగు శీతలవృక్షచ్ఛాయలందు, తమ యిచ్ఛానుసారముగ, విశ్రమించిరి. అనంతరము, యాదవులు, అచటికి చేరియున్న స్నేహితులు, బంధువులగు రాజులు మొదలగువారిని కలుసుకొని ముచ్చటించ మొదలిడిరి. మత్స్య, ఉశీనర, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ కేకయ, మద్ర, కున్తి, ఆనర్త కేరళాది రాజ్యములనుండి తమ మిత్రులు, శత్రువులునగు ననేక రాజన్యులు విచ్చేసియుండిరి యాదవుల కత్యంత సన్నిహితులగు నందాది గోపాలురు, యెంతోకాలమునుండి భగవానుని దర్శనమునకై తహతహలాడుచుండిన గోపికలు గూడ వచ్చియుండుటను, యాదవులు చూచినారు. ఒకరి నొకరు చూచుకొనుట, కలిసి కబుర్లు చెప్పుకొనుట అందరికి మహానందదాయకముగనుండె. అందరి హృదయకమలములు, ముఖపద్మములు వికసించినవి. పరస్పరము భుజములపై చేతులుంచుకొనుచు యాలింగనములు చేసుకొనుచుండ, వారి కనులవెంట నానందబాష్పములు రాలజొచ్చినవి. పులకరించిపోవుచుండిరి. ప్రేమోద్వేగముచే కంఠములు స్తంభించిపోవుచుండ, మాటలాడకపోవుచుండిరి. అందరు నానంద సముద్రమందోలలాడుచుండిరి. పురుషులతోపాటు స్త్రీలుగూడ తమతమ బంధుమిత్రుల జూచి యానందించుచుండిరి. ప్రేమభరితములగు చూపులతోను, మునిమునినగవులతోను, ఆలింగనములతోను ఒకరినొకరు గౌరవించుకొనుచుండిరి. కనులనుండి ప్రేమాశ్రువులు కారుచుండినవి. వయస్సు మొదలగు వానిలో చిన్నలైనవారు పెద్దలగువారికి నమస్కరించుచు తమకంటె చిన్నవారివద్దనుండి ప్రణామ

ములు స్వీకరించుచుండిరి. ఒకరికొకరు స్వాగతములు చెప్పుకొనుచు, కుశలప్రశ్న లొనర్చుకొనుచుండిరి. అందరును శ్రీకృష్ణుని లీలలను పరస్పరము చెప్పుకొను చుండిరి.

కుంతీదేవి, వసుదేవుడు మొదలుగా గల తన సహోదరులను, చెల్లెండ్రను, వారి పుత్రులను, తల్లిదండ్రులను, వదినెలను, శ్రీకృష్ణ భగవానుని దర్శించి, వారితో మాటలాడుచు, తన సమస్త దుఃమును విస్మరించినది.

కుంతి, వసుదేవునితో "అన్నయ్యా నేను నిజముగా చాల దురదృష్టవంతు రాలిని. నా కోరిక యొక్కటియు సఫలముగాలేదు. నీ వంటి సాధు స్వభావముగల సజ్జనుడగు సోదరుడు గూడ, నా యాపత్సమయములలో నా సంగతి పట్టించుకొన లేదు. ఇంతకంటె దుఃఖకరమగు విషయమేముండును? దైవోపహతులగు వారిని, బంధుమిత్రులు, పుత్రులు, మాతాపితరులు గూడ మరచిపోయెదరు. ఇందులో మీ దోషమేమున్నదిలే"యని నిష్ఠురముగా బలుక వసుదేవు డిట్లులనె.

"చెల్లీ, మమ్ము నిందింపకుము మమ్ము వేరుగా భావింపకుము. మానవులంద రును దేవుని చేతిలోని యాటబొమ్మలు. జగత్తంతయు ఈశ్వరాధీనమైయుండి, కర్మలజేయుచు వాటి ఫలముల ననుభవించుచున్నది. కంసునివలన యిడుములగుడు చుచు నస్థిరులమైయుంటిమి. ఈశ్వరుని కృప వలన కొలది కాలమునుండి మేము మరల మా స్థానముల పొందగల్గితిమి" అని కుంతి నూరడించె.

అచటికి వచ్చిన నరపతులందరిని ఉగ్రసేన, వసుదేవాది యదు వంశీయులు చక్కగా నాదరించినారు వారందరును శ్రీకృష్ణ దర్శనమును పొంది పరమానంద భరితులైరి. భీష్మపితామహుడు, ద్రోణాచార్యుడు, ధృతరాష్ట్రుడు, దుర్యోధనాదిపుత్ర సహితముగ గాంధారీదేవి, పత్నీయుతముగ పాండవులు, కుంతి, సృంజయ, విదుర, కృపాచార్య, కుంతిభోజ, విరాట, భీష్మక నగ్నజిత్తు, పురుజిత్తు, ద్రుపద, శల్య, ధృష్టకేతు, కాశీరాజ, దమఘోష, విశాలాక్ష, మిధిలాధీశ, మద్రనరేశ, కేకయ నరేశ, యుధామన్యు, సుశర్మ, తన పుత్ర సహితముగ బాహ్లీకుడు, యితరులగు యుధిష్ఠిరాను యాయులగు రాజులును, శ్రీకృష్ణుని శ్రీనికేతనమగు శ్రీమూర్తిని, అతని రాణులను గాంచి యత్యంత విస్మితులైరి. బలరామకృష్ణులచే బాగుగ పూజి తులై, వారు శ్రీకృష్ణుని స్వజనులగు యాదవులను ప్రశంసించిరి. ముఖ్యముగా ఉగ్రసేన మహారాజును సంబోధించుచు వారు, "ఉగ్రసేన మహారాజా, యీ జగత్తు నందలి మనుజులలో నిజముగా మీరే ధన్యులు. మీ జీవితములే సఫలములు. ఏల ననగా, మహా మహా యోగీశ్వరులు గూడ దర్శించుటకు దుర్లభుడైన శ్రీకృష్ణుని మీరు నిత్యము, నిరంతరము దర్శించుచుందురు. వేదములాదరముతో శ్రీకృష్ణ భగ

వానుని కీర్తిని గానము చేసినవి. అతని పాద జలమగు గంగ, వాక్కులగు శాస్త్రములు, అతని కీర్తి, సర్వజగత్తును మిక్కిలి పవిత్ర మొనర్చుచున్నవి.

మా జీవిత సంఘటనలనే చూడుడు. కాలగతిచే పృథ్వియొక్క సమస్త సౌభాగ్యము నశించిపోయినది. కాని భగవానుని చరణకమల స్పర్శచే పృథ్వియందు మరల సమస్త శక్తి సంచారముగలిగి, మా మనోరథములు నెరవేరసాగినవి. మహారాజా, మీకు కృష్ణునితో, గోత్ర సంబంధము, వైవాహిక సంబంధములు కలిగియుండుటయేగాక, యెల్లపుడును నతనిదర్శన, స్పర్శనసౌభాగ్యము లభించుచున్నది అతనితో విహరించుచుందురు. మాటలాడుచుందురు. శయ్యాసన భోజనాదులు చేయుచుందురు. మీరు గృహస్థ ఝుంఝూటములందు దగుల్కొని యుండినను, యెవని దర్శనమాత్రముచేతనే స్వర్గమోక్షాభిలాషలు గూడ నశించిపోవునో, అట్టి సర్వవ్యాపియగు విష్ణు భగవానుడు, సగుణ శ్రీకృష్ణ రూపమున, మీ గృహములందే నివసించుచున్నాడు" అని యెంతయు ప్రశంసించిరి.

శ్రీకృష్ణాది యదువంశీయులందరును కురుక్షేత్రమునకు వచ్చి యుండిరను వార్త నందునకు తెలియగనే, గోపాలురందరితో గూడి, తమ సామగ్రినంతయు బండ్లపైకెత్తించి, ప్రియపుత్రులగు రామకృష్ణులు మొదలగు వారిని జూచుటకై, వారున్న ప్రదేశమునకు వచ్చినాడు. నందాది గోపకులను గాంచి యదువంశీయులందరును మహానందమందిరి. మృత శరీరమందు ప్రాణ సంచారము గలిగినట్లు వారందరు నొక్కపరి లేచి, ప్రేమతో గాఢాలింగనముల గావించుకొనిరి. ఆనంద విహ్వలుడైన వసుదేవుడు నందుని తన హృదయమునకు హత్తుకొనియె.

ఒక్కొక్కటిగా సర్వ విషయములతనికి గుర్తుకు రాసాగినవి. ఏ ప్రకారము కంసుడు తనను బాధించినది, యే ప్రకారము తన సద్యోజాత శిశువును గోకులమునకు గొంపోయి నందుని యింట నుంచి వచ్చినది, సమస్తము జ్ఞాపకమునకు వచ్చినది. శ్రీకృష్ణ బలరాములు, యశోదా మాతను, నందబాబును ఆలింగనముచేసుకొని నమస్కరించిరి. ప్రేమచే నా యిద్దరన్నదమ్ముల కంఠములు రుద్ధమైనవి ఏమియు మాట్లాడలేకపోయిరి. మహాభాగులగు యశోదానందులు పుత్రులిరువురిని యొడియందు జేర్చుకొని, గాఢాలింగనము గావించిరి. చిరకాలము నుండి వారిని కలియకుండుటచే వారి హృదయములందు గూడు కట్టుకొని యున్న దుఃఖము యిపుడు తొలగి పోయినది. దేవకీ రోహిణులు, వ్రజేశ్వరియగు యశోదను పరిష్వంగమొనర్చి, యామె యొనర్చిన మిత్ర కృత్యమును స్మరించుచు, బాష్పకంఠులై యిట్లు పలికిరి. "యశోదారాణీ, నీవును, వ్రజేశ్వరుడగు నందరాజును, మా యెడల గావించిన మైత్రీ వ్యవహార మెన్నటికిని మరపునకు వచ్చునది గాదు. మేమిందైశ్వర్యము పొందినను నీ ఋణము దీర్చుకొనజాలము. నీవపుడు మా కొనర్చిన యుప

కారమును మరచిపోవునట్టి కృతఘ్నుడెవడుండును? బలరామ కృష్ణులు తమ తలిదండ్రులను చూడ గూడని సమయమందు, వారి భారమును మీ యందలి విశ్వాసముతో మీ కప్పగించినపుడు వారిని మీరు, కనులను కనురెప్పలవలె, గాపాడినారు. తినిపించుట, త్రాగించుట, ముద్దాడుటలు చేసి పోషించినారు. వీరి సౌభాగ్యము కొరకనేక మంగళోత్సవములు గావించినారు. నిజముగా మీరే వారి మాతాపితలు. మీ పోషణలో వారికెట్టి భయముగాని, కష్టముగాని లేకుండ పెరిగినారు. అది మీ సహజ స్వభావము. సత్పురుషుల దృష్టిలో, (తమది-పరాయిది) స్వ-పరభేదభావముండదు. నిజముగా మీరు మహానుభావులు." అని ప్రశంసించిరి.

"పరీక్షిన్మహారాజా, గోపికలకు పరమ ప్రియతముడు, జీవన - సర్వస్వము, శ్రీకృష్ణుడేనని నీకిదివరకే చెప్పి యుంటిని గదా. అతనిని దర్శించు సమయమందు వారి కను రెప్పలు వ్రాలుచుండునప్పుడు, ఆ కనురెప్పలు సృష్టించిన విధాతను వారు తిట్టుచుండెడివారు. అట్టి వారి ప్రేమమూర్తియగు శ్రీకృష్ణునినేడు గోపికలు బహు కాలానంతరము, దర్శించుట సంభవించినది. ఇట్టి దర్శనము కొరకై గోపికల మానసము అందెంతటి తీవ్ర వాంఛ (లాలస) యున్నదో యూహించుటకు గూడ శక్యము గాదు. వారు, నేత్ర మార్గము ద్వారా, శ్రీకృష్ణుని తమ హృదయములోనికి గొంపోయి, పరిరంభించి, మానసికాలింగన సౌఖ్యముచేతనే తన్మయులై పోయిరి. ఎంతని చెప్పను? నిత్య నిరంతర యోగాభ్యాసము చేయు యోగులకు కలుగునట్టి సమాధి స్థితి వారికి కల్గినది. వారి కట్టి తాదాత్మ్య స్థితి కల్గినదని గ్రహించిన భగవానుడు, యేకాంతమందు వారిని సమీపించి, యాశ్లేషించి, కుశల ప్రశ్న గావించి, నవ్వుతూ, వారితో నిట్లు వచించె.

"చెలులారా, మేము మా స్వజన—బాంధవుల పనులు పూర్తి గావించుటకై వ్రజము నుండి బయటకు వచ్చియుంటిమి. మీవంటి ప్రియురాండ్రను వదలి శత్రు సంహారము చేయుట యందు మునిగిపోయి యుంటిమి. చాల రోజులు గడచినవి. ఎప్పుడైనా మీరు మమ్ము స్మరించుకొనుచుందురా? నన్ను అకృతజ్ఞునిగా భావించి మీరు నన్ననుమానించి, నన్ను చెడుగా తలచుట లేదుగదా? నిస్సందేహముగా, ప్రాణుల సంయోగ వియోగములకు భగవానుడే కారణము. వాయువేవిధముగా మేఘములను, తృణములను, తూలమును, ధూళి కణములను, కలుపుచు, మరల నెగురగొట్టుచుండునో యటులనే, సమస్త పదార్థ నిర్మాత యగు భగవానుడు, తన యిచ్ఛానుసారము సంయోగ వియోగముల కల్పించుచుండును. సఖులారా, మీయందరికిని, నా ప్రాప్తిని కల్గించునట్టి, నా యందలి ప్రేమ మీకిది వరకే లభించియుండుట సంతోషించవలసిన విషయము. ఏలననగా, నా యెడల చూపునట్టి ప్రేమభక్తి ప్రాణులకు అమృతత్వమును (పరమానందధామప్రాప్తి) కల్గించుటకు సమర్థమగును.

ప్రియ గోపికలారా, ఘటపటాది భౌతిక పదార్థములన్నిటికిని, ఆది మధ్యాంతములందును, లోపల వెలుపలను, వానికి మూల కారణములగు పృధివ్యాపస్తేజో వాయురాకాశములు ఓతప్రోతములై యున్నవి. అటులనే, పదార్థములన్నిటికిని, ముందు, వెనుక, లోపల వెలుపల నంతట నేనే నిండియున్నాను. ఈ విధముగనే సర్వప్రాణుల శరీరములందుగూడ యీ పంచభూతములే కారణ రూపముతో నున్నవి. ఆత్మ భోక్త, లేక జీవ రూపమున నున్నదా శరీరములందు నేను, వీటి రెంటి కతీతముగ నున్న, యవినాశియగు సత్స్వరూపుడను. ఈ రెండును నా యందే ప్రతీతమగుచుండును. మీరిట్టియనుభవమును పొందుడు."

భగవానుడీ విధముగ గోపికల కధ్యాత్మ విద్యాబోధ గావించె. అతని యుపదేశమును మననము చేసుకొనుచు గోపికల జీవకోశము లింగశరీరము, నశించిపోగా వారు భగవానుని యందైక్యభావము నందిరి. ఆత్మానుభూతి నందిరి. వారతనితో "కమలనాభా, అగాధబోధ సంపన్నులగు యోగేశ్వరులు తమ హృదయకమలముల యందు, నీ చరణ కమల చింతన చేయుచునుందురు. అగాధమగు సంసారకూపమందు బడియుండు జీవులు, అందుండి వెలువడుటకు నీచరణ కమలములే యేకైకాధారము. కావున, ప్రభూ, అట్టి నీ చరణ కమలములు, మేము గృహస్థ కార్యములు చేసుకొనుచుండినను, సర్వదా మా హృదయములందు విరాజమానమగుచుండునట్లు, వాని నెన్నడు మేము మరువ కుండునట్లును మమ్మనుగ్రహింప వేడుచుంటి"మని ప్రార్థించిరి.

# ఎనుబది మూడవ యధ్యాయము

## శ్రీకృష్ణ పత్నులతో ద్రౌపదీ సంభాషణము

గోపికలకు గురువు, పరమగతియునగు భగవానుడు గోపికల కారీతి యనుగ్రహోపదేశ మొనర్చి యనంతరము యుధిష్ఠిరాదుల వద్దకేగి కుశల ప్రశ్న గావించె. భగవానుని దర్శనముచే వారి యశుభము లన్నియు నశించినవి. భగవానుడు కుశల ప్రశ్న గావించుటచే వారమందానందమందిరి.

"స్వామీ, మహా పురుషులందరును తమ మానసములందు నీ చరణారవింద మకరంద రసాస్వాదన మొనర్చుచుందురు. అప్పుడప్పుడు, వారి ముఖ కమలముల నుండి యా మకరందము నీ లీలా కధారూపమున జాలువారుచుండును. అదియెంత యద్భుత దివ్యరసమనగా, దానినే కొంచెమైనా పానము చేయువాడు, జన్మ మృత్యు ప్రవాహమందు బడద్రోయునట్టి విస్మృతి లేక యవిద్యను పోగొట్టుకొనగల్గును. ఆ మకరందమును యెవరు తమ రెండు చెవుల ద్వారా కడుపునిండా త్రాగెదరో, వారికి

యశుభములు కల్గునను యనుమానము మాత్ర మెక్కడ కల్గును? నీవు జ్ఞానైక స్వరూపుడవు. ఆనంద సముద్రుడవు. బుద్ధి వృత్తులకు కారణములగు జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలును, నీ స్వయం ప్రకాశ స్వరూపము వరకు చేరనే జాలక దూరమందే నశించిపోవుచున్నవి. నీవు పరమహంసలకు గతివి. కాలప్రభావముచేత వేదములకు క్షీణ దశ గల్గినపుడు, వాని నుద్ధరించుటకై నీవు, నీ యచింత్యమగు యోగ మాయా శక్తి ద్వారా, మనుజుడవుగా నవతరించుచుందువు. నీ చరణములకు నమస్కరించుచున్నాము"ని వచించిరి.

"ఇతరులందరు శ్రీకృష్ణ భగవాను నీ విధముగ స్తుతించుచున్న సమయ మందు, యాదవ కౌరవ కుల స్త్రీ లందరొక చోట జేరి, త్రిభువన విఖ్యాతములగు భగవానుని లీలలను వర్ణించుకొనుచుండిరి. వారి సంభాషణల వివరించెద వినుమ"ని పలికి శ్రీశుకయోగి పరీక్షిత్తుతో నిటుల చెప్పసాగె.

"రుక్మిణీ, భద్రా, జాంబవతీ, సత్యా, సత్యభామా, కాలిందీ, శైబ్యా, లక్ష్మణా, యితర కృష్ణ పత్నులారా, శ్రీకృష్ణుడు తన మాయచే, లోకా చారము ననుసరించి, మీతో నెటుల పాణిగ్రహణ మొనర్చెనో నాకు చెప్పగోరు చుంటి"నని ద్రౌపది యడుగగా, మొదట రుక్మిణీదేవి యిటుల చెప్పసాగె.

"ద్రౌపదీ, జరాసంధాది నరపతులందరును నా వివాహము శిశుపాలునితో జరుగవలెనని వాంఛించుచుండిరి. అందుకై వారు చతురంగబలములతోగూడి యుద్ధ సన్నద్ధులై వచ్చియుండిరి. కాని భగవానుడు, గొర్రెల మందలోనున్న తన భాగ మును స్వీకరించునట్టి సింహమువలె, నన్ను హరించుకొనిపోయె. జగత్తునందున్న వీరులందరి మకుటములపై గూడ భగవానుని చరణధూళి శోభాయమానమగుచుం డును. సమస్త సంపదలకు, సౌందర్యములకు ఆశ్రయ భూతములగు భగవానుని చరణ కమలములు జన్మ జన్మలయందును నేనారాధించుకొనుట కులభించి, నేను వానిని సేవించుకొనుటయందే నిమగ్నురాలనై యుండుటయే నాయభిలాష" యని వచించినది.

అనంతరము సత్యభామ, "ద్రౌపదీ, నా తండ్రి తన సోదరుడగు ప్రసేనుని మరణముచే నతి దుఃఖితుడైయుండి, యాతని మరణమునకు శ్రీకృష్ణుడే కారణమని, కళంకము నతనిపై యారోపించె. ఆ కళంకమును తొలగించుకొనుటకై భగవానుడు జాంబవంతుని నిర్జించి, యా స్యమంతకమణిని గొని వచ్చి నా తండ్రి కొసగె. మిథ్యాకళంకము నారోపించినందులకు నా తండ్రి భయపడి, నన్నితరుల కిచ్చెదనని వాగ్దానమొనర్చియుండియు, స్యమంతకమణి సహితముగ నన్ను భగవానుని చరణ ములకు సమర్పించె"నని చెప్పె.

జాంబవతి, "నా తండ్రియగు జాంబవంతునకు శ్రీకృష్ణుడే తన ప్రభువగు

సీతాపతియైన శ్రీరామచంద్రుడని తెలియక యిరువదేడు రోజులు భీకరముగ నత నితో పోరినాడు. పరీక్ష పూర్తియైన పిమ్మట భగవానుడు సాక్షాత్తు శ్రీరామచంద్రుడే యని గ్రహించి, యాతని పాదములకు ప్రణమిల్లి స్యమంతకమణి సహితముగ నన్నాతనికి సమర్పించె. జన్మ జన్మల యందును భగవానునకు దాసిగానుండవలయు ననియే నా కోరిక" యని చెప్పె.

పిమ్మట కాళింది యిట్లు పల్కినది. "ద్రౌపదీ, భగవానుని చరణకమలప్రాప్తి కొరకే నేను తపము చేయుచుంటినని గ్రహించిన భగవానుడు, తన మిత్రుడగు నర్జునునితోగూడి యమునా తటమునకు వచ్చి నన్ను స్వీకరించినాడు. నేనాతని గృహ సమ్మార్జనము చేయు దాసిని."

అనంతరము మిత్రవింద యిట్లు వచించినది. "ద్రౌపదీ, నాకు స్వయంవరము జరుగుచుండ, భగవానుడు రాజులందరిని, సింహము కుక్కలను గొట్టునట్లు గొట్టి, శోభామయమగు తన ద్వారకానగరమునకు గొంపోయి యచట వివాహమాడె. నా సోదరులు నన్ను విడిపింప జూచిరి గాని, భగవానుడు వారిని గూడ నిర్జించె. ప్రతి జన్మయందు, నాకు భగవానుని పాద ప్రక్షాళమొనర్చు భాగ్యము కలుగు గాక యని కోరుచుంటిని."

సత్యాదేవి యిట్లు చెప్పెనపె. "ద్రౌపదీ, నా తండ్రి నా స్వయంవరమునకు విచ్చేసిన రాజుల బల పౌరుషములు పరీక్షించుటకై, మహా బలవంతములై పదునైన కొమ్ములుకల యేడెద్దుల నుంచినాడు. ఎందరో మహావీరుల గర్వము నా వృషభము లణచినవి. భగవానుడా వృషభముల నవలీలగా పట్టి బంధించినాడు. చిన్నపిల్లలు చిన్న చిన్న మేక పిల్లలను బట్టి నంత సులభముగా వానిని వశపరచుకొనియె. ఈ విధముగా భగవానుడు తన బల పౌరుషముల ద్వారా నన్ను పొంది, చతురంగ బలముతోడను, దాసీ గణముతోడను నన్ను ద్వారకకు గొంపోయె. దారిలో నడ్డగించిన రాజులను గూడ జయించె. ఇతనిని సేవించు నవకాశము నాకెప్పుడును కలుగు చుండవలయునను నదియే నా యభిలాష."

భద్రాదేవి యిట్లు పల్కినది. "ద్రౌపదీ, భగవానుడు నాకు మేనమామ తనయుడు. నా చిత్తమతని యందను రక్తమైయుండె. అదిగాంచిన నా జనకుడు, స్వయముగా భగవానుని రావించి, యక్షౌహిణీ సేనను, అనేక దాసీజనమును యిచ్చి నన్ను తని చరణకమలముల కర్పణ గావించినాడు. కర్మానుసారముగా నాకే జన్మ కలిగినను, ఆ జన్మలన్నిటి యందుగూడ యితని చరణకమల స్పర్శ నాకు కలుగుటయే పరమ కల్యాణమని నేను భావించుచుంటి."

అనంతరము లక్ష్మణాదేవి యిటుల వచించె. "ద్రౌపదీ, దేవర్షియగు నారదుడు మాటి మాటికి భగవానుని యవతారములను, లీలలను గానము చేయుచుండెడు

వాడు. వానిని యూహించియు, లక్ష్మీదేవి లోకపాలురనందరిని వర్జించి భగవానునే వరించుటయందలి విశిష్టతను విచారించియు, నా చిత్తము భగవానుని చరణకమలములందాసక్తమైనది. నా తండ్రియగు బృహత్సేనునకు నాపై ప్రేమ మెండు. నా యభిప్రాయమును గ్రహించి యాతడు నా కోర్కెదీర్చుటకై యొక యుపాయమును బన్నినాడు. మహారాణీ, యే ప్రకారము పాండవవీరుడగు నర్జునుడు తన కల్లుడుగా లభించుటకై నీ తండ్రియగు ద్రుపదమహారాజు, స్వయంవరమందు మత్స్యయంత్రమునేర్పాటు చేసెనో, అదేవిధముగ మా తండ్రిగూడ మత్స్యయంత్రము నేర్పాటు గావించె. మీ మత్స్యయంత్రముకంటె యిందు విశేషమేమనగా, యిందు మత్స్యము బయటికి కనుపడదు. జలమందు దాని ప్రతిబింబము మాత్రమే కనుపడును. ఈ సమాచారము తెలిసిన రాజులనేకులు తమ గురుసహితముగ మా రాజధానికి రాదొడగిరి వచ్చిన వారందరికి వారి వారి యంతస్థుకు తగినట్లుగా మా తండ్రి సత్కరించినాడు. వారందరు నన్ను పొందుటకై స్వయంవరసభయందుంచబడినధనుర్బాణముల నెత్తిరిగాని చాలమంది యెక్కుబెట్టనేలేకపోయిరి. ధనుర్బాణముల నచటనే యుంచి వెడలిపోయిరి. జరాసంధాది ప్రసిద్ధవీరులు, శిశుపాలుడు, భీమసేనుడు, దుర్యోధనుడు, కర్ణుడు, మొదలగువారు ధనుస్సు నెక్కుబెట్టిరిగాని వారికి మత్స్యముయొక్క జాడ తెలియరాలేదు. అర్జునునకు మత్స్యముయున్నచోటు తెలిసినది. బాణప్రయోగము చేసినాడు కాని యాబాణము దానిని స్పృశించెనేగాని కొట్టజాలకపోయినది. ఈ ప్రకారమనేక నరపతుల గర్వము ఖర్వమైనది. ఎక్కువమంది నన్ను పొందవలెనను కోరికనుగూడ వదలుకొనిరి. అప్పుడు భగవానుడు ధనుస్సునెత్తి సునాయాసముగ నెక్కుబెట్టి జలమందు నీడ జూచుచుగొట్టగా మత్స్యము తెగి క్రిందబడినది. అది మధ్యాహ్నము. సర్వార్థసాధకమగు అభిజిత్ ముహూర్తము. ఆ సమయమందు జయధ్వానములు మిన్నుముట్టినవి. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి గురిసినది. అదే సమయమందు నేను స్వయంవర సభను ప్రవేశించితిని. నా పాదములందు నూపురములుధ్వనించుచున్నవి. సర్వాంగ సుందరముగ నలంకరించుకొనియుంటిని. మోమునందు సిగ్గుతో గూడిన చిరునగవు చిందులాడుచుండ, చేతియందు రత్నహారము ధరించి, యొక్కమారు తలయెత్తి నలువైపుల క్రిగంటితో జూచి, నెమ్మదిగా వరమాలను భగవానుని కంఠమునందు వైచితిని. నా చిత్తము భగవానునియందు మొదటినుండియు ననురక్తమైయున్నటు లిదివరకే చెప్పియుంటిని గదా. నేను వరమాల వేయగనే మంగళవాద్యములు మ్రోగినవి. నర్తకీమణులు నాట్యమాడిరి. గాయకులు గానమొనర్చినారు.

ద్రౌపదీ, నేనీప్రకారము భగవానుని వరించగనే కామాతురులగు నరపతులకు హృదయక్లేశము గల్గినది. భగవానుడునన్ను, నాల్గుగుర్రములు పూన్చిన తన రథము నెక్కించి, శంఖమును పూరించి యుద్ధసన్నద్ధుడై రథమందు నిలచినాడు. దారుకుడు,

రాజులందరు చూచుచుండగనే, ద్వారకామార్గమున రథమును నడపినాడు. కొంత మంది రాజులు యుద్ధము చేయతలచి మావెంటబడిరి. కాని వారి ప్రయత్నము, కుక్కలు సింహము నడ్డగించ చూచునట్లు హాస్యాస్పదముగనుండె. శార్ఙ్గధనుస్సు నుండి వెడలిన తీవ్రబాణాఘాతములచే కొందరి చేతులు తెగినవి. కొందరి కాళ్ళు తెగినవి. కొందరికి మెడలే తెగినవి. చాలమంది యుద్ధభూమియందే దీర్ఘ నిద్ర జెందగా, ననేకులు రణరంగమువీడి పారిపోయిరి.

అనంతరము భగవానుడు సూర్యునివలె, స్వర్గ, మర్త్యలోకములందు ప్రశంసింపబడుచున్న ద్వారకానగరమును ప్రవేశించె. ఆనాడు ద్వారకానగరము సర్వాంగసుందరముగ నలంకరించబడి యున్నది. నా కోరిక నెరవేరుటచే మా తండ్రి మహానంద భరితుడాయె. అతడు తన స్నేహితులు, బంధువులు, హితైషులగు వారినందరిని యథోచితముగ సత్కరించినాడు. భగవానుడు పరిపూర్ణుడు. అయినను మా తండ్రి నా యందలి ప్రేమచే ననేకమంది దాసీలను, వివిధరకములగు సంపదలను, సైనికులను, రథగజతురగములను, బహుమూల్యశస్త్రాస్త్రములను, భగవానునకు సమర్పించినాడు. మేము పూర్వజన్మయందు ప్రాపంచిక విషయ వాంఛలనెల్లవిడనాడి యేదో గొప్పతపస్సు చేసియుండుటచేతనే మాకీజన్మయందు ఆత్మారాముడగు భగవానుని యింటి దాసీలగు మహాభాగ్యము లభించినద"ని పల్కినది.

పిమ్మట పదునారువేలమంది రాణుల తరఫున, రుక్మిణీదేవి యిటుల పల్కినది. "భౌమాసురుడు, దిగ్విజయ సందర్భమున ననేక రాజుల జయించి వారికన్యలమగు మమ్ము, తన సౌధమందు బందీలుగ నుంచినాడు. ఇది తెలిసిన భగవానుడు భౌమాసురుని యతని సైనికులను యుద్ధమందు సంహరించి, తాను పూర్ణకాముడయ్యును, మమ్ము విడిపించి మా పాణిని గ్రహించి, (పాణిగ్రహణమొనర్చి] మమ్ము తన దాసీలుగ చేసుకొనియె. మేమెల్లపుడును, జనన మరణరూపమగు సంసారమునుండి విముక్తిని చేకూర్చునట్టి, యాచరణకమలములనే ధ్యానించుచునుందుము. సాధ్వీ, మేము యింద్రపదవినిగాని, సామ్రాజ్యమునుగాని, లేక వీని వలన లభించు భోగములనుగాని, బ్రహ్మపదమునుగాని, మోక్షమునుగాని, సాలోక్య సారూప్యాది ముక్తులనుగాని-వేనిని కోరము. మాప్రియతమ ప్రభుడగు శ్రీకృష్ణుని చరణారవింద పరాగమును సర్వదా శిరమునందు ధరించుటను మాత్రమే మేమెపుడును కోరుచున్నాము. ఆ పరాగము లక్ష్మీదేవి వక్షఃస్థలమందలి కుంకుమ సువాసనచే సుగంధితమైనట్టిది. ఉదారశిరోమణియగు భగవానుని యే చరణకమల స్పర్శను, గోవులగాచు సమయమందు, గోపాలురు, గోపికలు, భిల్లవనితలు, తృణములు, లతలు, పొందగోరుచుండిరో, అట్టి యా పాదస్పర్శనే మేమును వాంఛించుచుంటిమి."

# ఎనుబదినాల్గవ అధ్యాయము

## వసుదేవుని యజ్ఞోత్సవము

భగవానుని పత్నులకు యెంత ప్రేమ యున్నదను విషయమును, వారి మాటలవలననే కుంతి, గాంధారి, ద్రౌపది, సుభద్రా, యితర రాజపత్నులు, గోపికలుగూడ తెలుసుకొనగలిగిరి. అందరును వారి యలౌకిక ప్రేమనుగాంచి, యత్యంతము ముగ్ధులగుటయేగాక విస్మితులుగూడనైరి. అందరి నేత్రములందునను ఆనందాశ్రువులు తొణికిసలాడినవి. ఈ విధముగ పురుషులు పురుషులతోడను, స్త్రీలు స్త్రీలతోడను మాటలాడుచుండగా, నచటికనేకమంది ఋషులు, మునులు బలరామకృష్ణులదర్శించు కోరికతో విచ్చేసిరి. అందు, శ్రీకృష్ణద్వైపాయనుడగు వ్యాసుడు, దేవర్షియగు నారదుడు, చ్యవనుడు, దేవలుడు, అసితుడు, విశ్వామిత్రుడు, శతానందుడు, భరద్వాజుడు, గౌతముడు, శిష్యసహితముగ పరశురాముడు, వశిష్ఠుడు, గాలవుడు, భృగుడు, పులస్త్యుడు, కశ్యపుడు, అత్రి, మార్కండేయుడు, బృహస్పతి, ద్వితుడు, త్రితుడు, ఏకతుడు, సనక, సనందన, సనాతన, సనత్కుమారులు, అంగిరసుడు, అగస్త్యుడు, యాజ్ఞవల్క్యుడు, వాసుదేవుడు మొదలగు వారుండిరి, ఋషులనుగాంచి, యటగూర్చునియున్న నరపతులు, యుధిష్ఠిరాది పాండవులు. శ్రీకృష్ణ బలరాములు వెంటనే లేచి, విశ్వవందితులగు మహాత్ములకు నమస్కరించిరి. వారికి షోడశోపచార పూజలొనర్చిన యనంతరము, రాజులు శ్రీకృష్ణబలరాములు, వారిని సుఖాసీనులగావించి, వారు ఆరామముగానుపవిష్టులైన పిదప తాము గూర్చుండిరి. ధర్మరక్షణార్ధ మవతరించిన భగవానుడప్పుడా ఋషులతో నీ క్రింది విధమున పలుకుచుండగా, సభ యంతయు నిశ్శబ్దముగా నుండి భగవానునివాక్యము లాలకించుచుండె.

"ఋషులారా, మేము ధన్యులము. దేవతలకు గూడ దుర్లభమగు మీవంటి మహానుభావులందరి దర్శన భాగ్యము లభించుటచే, జన్మ యెత్తి నందులకు పూర్తి ఫలము లభించినది గాన మా జీవితములు సఫలములైనవి. గొప్ప గొప్ప తపస్సులొనర్చియు, నెవరు సమస్త ప్రాణులయందును తమ యిష్టదైవమును సందర్శించజాలక, కేవలము మూర్తి విశేషములందు మాత్రమే భగవానుని దర్శించుచుందురో యట్టి వారికి, మిమ్ము దర్శించి, స్పృశించి, కుశలప్రశ్నగావించి, నమస్కరించి, మీ పాద పూజ గావించునట్టి మహద్భాగ్యమెప్పుడు కల్గును? కేవలము జలమయ తీర్థములే తీర్థములు కావు. కేవలము మృత్తుతోను, శిలలతోను చేసిన విగ్రహములే దేవతామూర్తులు గావు. సత్పురుషులే నిజముగ తీర్థములు, దేవతామూర్తులునగుదురు. ఆ తీర్థములు, మూర్తులు బహుకాలమునకు గాని పవిత్రము చేయజాలవు.

ఇట్టి సత్పురుషుల నెవరు సేవించెదరో వారు వెంటనే పవిత్రులయ్యెదరు. దర్శన మాత్రముచేతనే యితరుల పవిత్రము చేయ సమర్థులు వారు. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, పృథివి, జలము, ఆకాశము, వాయువు, వాక్కు, మనస్సులకు అధిష్ఠాతృ దేవతలనుపాసించినను వారు పాపము పూర్తిగా నాశనము చేయజాలరు. ఏలననగా, వారి యుపాసన భేద బుద్ధిని నశింపజేయజాలక పోగా, దానినింకను అభివృద్ధి చేయును కాని యొకటి రెండు ఘడియలైనను, జ్ఞానులగు మహాత్ములను సేవించినచో, వారు సర్వపాపములను పోగొట్టజాలుదురు. వారు భేద బుద్ధిని పోగొట్టునట్టివారు. సభాసదులారా, యే మానవుడు, వాత పిత్త శ్లేష్మములచే నేర్పడి యున్న యీ శవతుల్యమగు శరీరమునే యాత్మగా భావించి, దానియందు 'నే', నను భావమును, స్త్రీ పుత్రాదులందు 'మమ' [నావి] కార భావమును కలిగి యుండి, మట్టి, రాయి, కొయ్యలతో చేయబడిన పార్థివమూర్తులనే యిష్టదైవములుగ భావించునో, అటులనే కేవల జలమునే తీర్థములుగ భావించునో, జ్ఞానులనట్లు భావింపక యుండునో, అట్టివాడు మనుష్యుడైనను పశువులలో గూడ నీచమగు గోఖరము వంటి వాడగును. [పశువులకు గడ్డి మొదలగు బరువులను మోయు గాడిద, గోఖరము].

అఖండ జ్ఞాన సంపన్నుడగు శ్రీకృష్ణుడీ విధముగ గూఢార్థముతో బలుకగా నచటకు విచ్చేసిన మునులకు మతి భ్రమణము కలిగినది. చాల సేపటికిగాని వారు గ్రహించ లేకపోయినారు. భగవానుడు సర్వేశ్వరుడైనప్పటికిని, యీ ప్రకారము సామాన్యునివలె, కర్మ పరతంత్రుడైన జీవునివలె వ్యవహరించుట కేవలము లోక సంగ్రహార్థ మేనని గుర్తించినవారై, నవ్వుచూ, జగద్గురువగు శ్రీకృష్ణునితో నిట్లు పలికిరి.

ప్రభూ, నీ మాయచే ప్రజాపతుల కధీశ్వరులగు మరీచ్యాది ప్రముఖులును, తత్త్వ విదులగు మావంటి వారును మోహితులై పోవుచున్నారు. నీవు స్వయముగ నీశ్వరుడవయ్యు, మనుష్య చేష్టలచే నీ స్వరూపమును గుప్త మొనర్చుకొని, సామాన్య జీవునివలె వ్యవహరించుచుంటివి. నిజముగా నీ లీల చాల విచిత్రమైనది. పరమాశ్చర్యమయము. పృథివి, తన వికారములేయగు వృక్షములు, శిలలు, ఘటములు మొదలగు ననేక వస్తువుల ద్వారా, ననేక నామ రూపముల దాల్చునట్లు, నీ యంతట నీవే భిన్న రూపములు దాల్చి, విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయముల జేయుచున్నావు. ఇన్ని చేయుచున్నను, నీవు దేనితోను లిప్తుడవు గాకుండనుందువు. స్వజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేని యఖండైక రసుడవునీవు. అనంతుడవు. ఈ నీ చరిత్ర యంతయు లీలమాత్రమే గానిచో మఱి యేమి? ఆహా నీ లీల యెంత ధన్యమైనది! నీవు ప్రకృతి కంటె పరమగు పరమాత్మవేయయ్యు, అవ

సరము వచ్చినప్పుడెల్లి, దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించుటకుగాను సత్త్వమయ శ్రీ విగ్రహమును దాల్చి, సనాతనమగు వైదిక ధర్మమును రక్షించుచుందువు. వర్ణాశ్రమ ధర్మ రూపమున ప్రకటితమగుచుండినది నీవే గదా! వేదము నీ విశుద్ధ హృదయము. తపస్సు, స్వాధ్యాయము, ధారణ, ధ్యానము, సమాధుల ద్వారా, దానియందు నీ సగుణ నిర్గుణ రూపములును, ఆ రెంటికి నధిష్ఠాన స్వరూపమగు పరమాత్మ సాక్షాత్కారమును కలుగుచున్నవి. పరమాత్మా, బ్రాహ్మణులే వేదముల కాధారభూతమగు నీ స్వరూపమునకు పలబ్ధిస్థానములు. కావుననే నీవు బ్రాహ్మణులను సన్మానించుచుందువు. కావుననే నీవు బ్రాహ్మణ భక్తులలో నగ్రగణ్యుడవగుచుంటివి. సర్వములగు కల్యాణ సాధనములకును నీవు చరమావధివి. సత్పురుషులకేక మాత్రాశయుడవు. నిన్ను నేడు కలుసుకొనుట చేత, మా జన్మ, విద్య, తపస్సు, జ్ఞానములన్నియు కృతార్థత గాంచినవి. అన్నిటికిని పరమ ఫలము నీవే గదా! ప్రభూ నీ జ్ఞానమనంతము. సచ్చిదానంద స్వరూపుడవు. పరబ్రహ్మవు. నీ యచింత్య శక్తియగు యోగ మాయ ద్వారా నీ మహిమను దాచుకొనియుందువు. నీకు నమస్కారము. ఈ సభ యందున్న రాజలోకము గాని యితరులుగాని, నీతో నిత్య మాహారవిహారాదుల జేయుచుండు యదు వంశీయులుగాని, నిన్ను యథార్థముగా నెఱుగరు.

ఏలననగా, నందరికి ఆత్మ స్వరూపమును, జగత్తునకాది కారణము నియామకమును నగు నీ స్వరూపమును, మాయ యను తెరలో దాచి యుంచితివి. మానవుడు కలగను చుండునపుడు స్వప్నమందు గనపడు మిథ్యా వస్తువులనే సత్యమని భావించి, నామ మాత్రములగు యింద్రియములచే ప్రతీతమగు స్వప్న శరీరమునే యథార్థ శరీరమని భ్రమించుచుండును. ఆ స్వప్నముండునంతవరకు, తనకు స్వప్న శరీరముకంటె భిన్నమగు జాగ్రత్ శరీర మొకటి యున్నదను విషయమే బొత్తుగా నతనికి తెలియకయుండును అదే విధముగ జాగ్రదవస్థయందుగూడ, యింద్రియములకు ప్రవృత్తి రూపమగు మాయచే చిత్తము మోహితమై నామమాత్రములగు విషయములందు పరిభ్రమించుచుండును. ఆ సమయమందు గూడ, చిత్తభ్రమణము చేత వివేచనాశక్తి కప్పబడినదైపోగా, జీవుడు, యీ జాగ్రత్సంసారమున కంటె, వేరుగా (విలక్షణముగా) నీవుంటివను విషయము తెలియనివాడైయుండును. గొప్ప గొప్ప ఋషులు అత్యంత పరిపక్వములైన యోగసాధనల ద్వారా, సర్వపాపముల నశింపజేయు గంగాజలముల కాశ్రయభూతములగు, నీ పాదారవిందములను, తమ హృదయములందు ధారణమొనర్చెదరు. మేమీనాడట్టి నీ చరణకమలముల దర్శింపగల్గుట మా యదృష్టము. ప్రభూ, మేము నీ భక్తులము. లింగ శరీర రూపమగు జీవ కోశము నీయందలి యుత్కృష్ట భక్తి ద్వారా నశించునట్టి భక్తులకు మాత్రమే నీ పరమ పదము లభించుగాన, మాపైనట్టి యనుగ్రహముంచుము."

అని యీ విధముగ భగవానుని స్తుతించి, ఋషులు, భగవానుని వద్ద, ధృతరాష్ట్రుని వద్ద, యుధిష్ఠిరుని వద్ద సెలవుగైకొని, తమ తమ యాశ్రమములకు పోవుటకుద్యుక్తులయిరి. పరమ యశస్వియగు వసుదేవుడు వారి యభిప్రాయము గ్రహించినవాడై, వారి పాదములు బట్టుకొని నమస్కరించి, వినయముగా వారికిట్లు విన్నవించుకొనియె.

"మహాత్ములారా, మీరు సర్వదేవస్వరూపులు. మీకు నమస్కరించుచున్నాను, దయతో నా ప్రార్థన నాలించుడు. ఏ కర్మలన నుష్ఠించుటచేత,కర్మలు, కర్మ వాసనలన్నియును పూర్తిగా నశించి, మోక్షము గల్గునో, వానిని నాకుపదేశింపుడ"ని వేడగా ఋషులందున్న దేవర్షియగు నారదుడు యిట్లు పలికె.

"ఋషులారా, వసుదేవుడు శ్రీకృష్ణుని తన బాలకునిగా భావించి, శుద్ధజిజ్ఞాసా భావముతో తనకు కల్యాణదాయకములగు సాధనలను చెప్పుమని మనల నడుగుచున్నాడు. ఇందాశ్చర్యపడవలసిన విషయమేమియులేదు. ప్రపంచమందత్యంత సన్నిహితులై యుండుట మనుష్యుల కనాదరణ కారణమగుచుండును.గంగాతీరమందుండు మానవులు గంగాజలమును వదలి, తమ పవిత్రత కితర తీర్థములకు వెళ్ళుచుందురు. శ్రీకృష్ణుని యనుభూతి (ఆత్మానుభూతి) కాలానుసారముగ జరుగుచుండు సృష్టిస్థితిలయాదులచే నశించునదిగాదు. అది స్వయముగనే, యితర నిమిత్తములచేగాని, గుణములచేగాని, క్షీణించునట్టిదిగాదు. జ్ఞానమయమగు నతని స్వరూపము, అవిద్యా, రాగద్వేషాదిక్లేశములచేగాని, పుణ్యాపాపమయమగు కర్మలచేగాని సుఖదుఃఖాది కర్మఫలములచేగాని, సత్త్వాదిగుణప్రవాహముచేగాని ఖండితమగునట్టిదియుగాదు. అది యద్వితీయము. పరమాత్మ· అతడు తననుతాను, తన శక్తులగు ప్రాణాదులచే గుప్తపరచుకొన్నప్పుడు, మూర్ఖులగువారు సూర్యుడు, గ్రహణముచేగాని, మేఘములు లేక మంచుచేగాని గప్పబడినప్పుడు, లేక వారు కనులు మూసుకున్నప్పుడు, సూర్యుడు కప్పబడియెనని తలంచుచుండు నటులనే, పరమాత్మ కప్పబడిపోయెనని భావించుచుందురు" అని పలికె.

అనంతరము, ఋషులందరి సమక్షమందు వసుదేవునితో నిట్లు పల్కిరి.

"కర్మలద్వారా, కర్మవాసనలను, కర్మఫలములను సర్వనాశనముగావించుటకన్నిటికంటె ముఖ్యమగు నుపాయమేమనగా, యజ్ఞములద్వారా యజ్ఞేశ్వరుడగు విష్ణునారాధించుటయే. త్రికాలదర్శులగు జ్ఞానులు శాస్త్రదృష్టిచే, నిదియే చిత్తశాంతికుపాయమనియు, సుగమమగు మోక్షసాధనమనియు, చిత్తమందానందోల్లాసము కలిగించు ధర్మమనియు చెప్పియున్నారు. న్యాయార్జితమగు విత్తముచేత శ్రద్ధాపూర్వకముగా పురుషోత్తము నారాధించుటయే, ద్విజాతులగు గృహస్థులకు పరమకళ్యాణదాయకమగు మార్గము. వివేకవంతులగు పురుషులు యజ్ఞదానాదులద్వారా ధనమందలి కోరికను, గృహస్థోచితములగు భోగములనుభవించుటద్వారా దారసుతేషణను, ఆత్మ

విచారముచే స్వర్గాదిలోకేషణను నష్టమొనర్చుకొనవలయును. ఈ విధముగ ధీరుడగు వాడు యీషణత్రయమును వదలి, తపోవనమార్గము ననుసరించును. వసుదేవా, ద్విజాతులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు మువ్వురును మూడు ఋణములతో-ననగా దేవ, ఋషి, పితౄణములతో-జన్మించెదరు. యజ్ఞములద్వారా దేవఋణమును, అధ్యయనముద్వారా ఋషిఋణమును, సంతానోత్పత్తిద్వారా పితౄణమును తీరి పోవును. వసుదేవా, నీవింతవరకు ఋషి, పితౄణములనుండి విముక్తుడ వైతివి. ఇప్పుడు యజ్ఞము లొనర్చి దేవతా ఋణమునుండిగూడ విముక్తుడ వగుము. ఈ ఋణములనుండి విముక్తుడుగాకుండ సంసార త్యాగము చేయువాడు పతనము చెందును. సర్వఋణ విముక్తుడవై గృహమును త్యజించి భగవానుని శరణు జొచ్చుము. నీవు నిజముగనే పరమభక్తితో పరమేశ్వరు నిదివరలో నారాధించి యున్నందుననే, జగదీశ్వరుడు నీ కిరువురు కుమారుల రూపమున జన్మించినాడు."

అని ఋషులు పలుకగా, మహామతియగు వసుదేవుడు, వారి పాదములకు శిర మానించి నమస్కరించి, వారిని ప్రసన్నుల గావించుకొని, ఋత్విజులుగా వారినే వరణ మొనర్చినాడు. వారును పరమ పవిత్రమగు కురుక్షేత్రమందు వసుదేవునిచే, ఉత్తమోత్తమములగు సామగ్రులతో గూడిన యజ్ఞములు చేయించినారు. వసుదేవుడు యజ్ఞ దీక్షితుడుకాగా, యాదవులు సుస్నాతులై సర్వాలంకార విభూషితులైరి. రాజులుగూడ సర్వాలంకృతులైరి. వసుదేవుని భార్యలుగూడ సర్వాలంకారశోభితలై మహానందముతో మంగళ ద్రవ్యముల గైకొని యజ్ఞశాలకేతెంచితిరి. మేళతాళములు మ్రోగుచుండ నర్తకీ జనమునాట్య మొనర్చుచుండిరి. సూతమాగధులు స్తోత్ర పాఠ ములు చేయుచుండిరి. గంధర్వులు గానము చేయుచుండిరి. వసుదేవుడు ముందుగా నేత్రముల కంజనమును శరీరమునకు నవనీతమును రాచుకొనియె. దేవకీదేవి మొదలుగాగల వసుదేవుని భార్యలు పదునెనిమిదిమందితో సహా వసుదేవునకు, మహాభిషేక విధానముతో ఋత్విజులభిషేకము చేయించినారు. పూర్వకాలమందా విధ ముగ తారకా సహితుడగు చంద్రునకటులనే యభిషేకము చేయబడినది. యజ్ఞదీక్షితు డగుటచే వసుదేవుడు మృగ చర్మమును ధరించె. కాని యతని భార్యలు మాత్రము సుందరములగు వస్త్రాభరణాదులు దాల్చిరి. వసుదేవుని ఋత్విజులు, సదస్యులు, రత్నజటితములగు నాభరణములను, పట్టు వస్త్రములను ధరించి, పూర్వ మింద్రుని యజ్ఞము నందువలె, సుశోభితులై యుండిరి. ఆ సమయమున రామకృష్ణులు తమ బంధుజనుల తోడను, భార్యాపుత్రులతోడను, తమ శక్తులతో గూడియున్న సంకర్షణ నారాయణ స్వరూపులుగా ప్రకాశించిరి.

వసుదేవుడు ప్రతి యజ్ఞమందును, జ్యోతిష్టోమ, దర్శపూర్ణమాసాది ప్రాకృత యజ్ఞములను, సౌర సౌక్ర్యతాది వైకృత యజ్ఞములను, అగ్నిహోత్రాది యితర

యజ్ఞములను గావించి, వాని ద్వారా ద్రవ్య క్రియా మంత్రములకు స్వామియగు విష్ణు భగవానుని యారాధించినాడు. అనంతర ముచిత సమయమునందు ఋత్విజులను వస్త్రాలంకారములచే నలంకరించి భూరి దక్షిణలను, ధన సహితముగ నలంకృతములగు గోవులను, భూమిని, సుందర కన్యలను దానమిచ్చి సత్కరించినాడు. అనంతరము మహర్షులు, పత్నీ సంయాజమను యజ్ఞాంగమును, అవబృథ స్నానమునకు సంబంధించిన యవశిష్టములన్నిటిని పూర్తిజేయించి, పరశురామునిచే నిర్మితమగు రామహ్రదము నందు, వసుదేవుని ముందుంచుకొని యందరు స్నానమాచరించిరి. స్నానానంతరము వసుదేవుడు నతని పత్నులు, వందీ జనమునకు తమ వస్త్ర భూషణాదుల నొసంగిరి. నూతన వస్త్రాభరణాదుల ధరించి, బ్రాహ్మణులు మొదలుకొని కుక్కల వరకు నున్న సర్వ జీవులకు నన్నదాన మొసర్చిరి. అనంతరము తమ బంధువులకు, సమస్త దేశాధీశులకు, సదస్యులకు, ఋత్విజులకు, దేవతలకు, మనుష్యులకు, భూతములకు. పితరులకు, చారణులు మొదలగు వారందరికి, వీడ్కోలు సందర్భముగా ననేక కానుకల నొసంగి సన్మానించినారు. అనంతరము వారందరును లక్ష్మీపతియగు శ్రీకృష్ణుని యనుమతిగైకొని, యజ్ఞప్రశంస గావించుచు తమ తమ స్థానములకు వెడలిపోయిరి.

ఆ సమయమందు ధృతరాష్ట్రుడు, విదురుడు, యుధిష్ఠిరుడు, భీమార్జునులు, భీష్మ ద్రోణులు, కుంతి, నకుల సహదేవులు, నారదుడు, వ్యాస భగవానుడు,ఇతర స్వజన-సంబంధులు, బాంధవులు మొదలగు వారందరును తమ హితైషులు బంధువులు నగు యాదవులను విడిచి వెళ్ళుటకు విరహవ్యథ ననుభవించుచుండిరి. స్నేహార్ద్రచిత్తులై యాదవుల నాలింగనము చేసుకొనుచు, నతికష్టముమీద నెట్టులో వారిని విడిచి, తమ తమ నెలవులకు జనిరి ఇతరులుగూడ నటులే కురుక్షేత్రము నుండి వెడలిపోయిరి. శ్రీకృష్ణ బలరాములు, ఉగ్రసేనాదులు, నందుడు మొదలగు గోపాలురను గొప్పగా పూజించి, సత్కరించిరి. ప్రేమపరవశులై వారు చాల దినము లచటనే యుండిపోయిరి. వసుదేవుడ నాయాసముగనే తన మనోరథ మహాసాగరమును తరించినాడు. అతనియానందమున కంతులేకుండె. ఆత్మీయులగుస్వజనులందరతనివెంటనే యుండిరి. నందరాజు చేయిబట్టుకొని వసుదేవు డతనితో నిట్లుపల్కె.

"సోదరా, భగవానుడు మనుజులకు గొప్పబంధ మొకటి గల్పించినాడు. ఆ బంధనము యొక్క నామమే స్నేహము. ప్రేమపాశము. గొప్ప గొప్ప శూర వీరులు, యోగులు, యతులు గూడ ఆ పాశమును త్రెంచుకొనుట కసమర్థులైయున్నారు. అకృతజ్ఞులగు మా యెడల నీవు నిరూపమానమగు మైత్రీ వ్యవహారమునునెఱపి యుంటివి. నీవంటి సత్పురుష శిరోమణులకు సహజ స్వభావమది. దానికి బదులుగా మేము నీకెట్టి యుపకృతి గావించియు నీ ఋణము దీర్చుకొనలేము.

అయినను మన యామైత్రీబంధమెన్నటికి విడిపోవునదిగాను. నీవటులే దానిని గాపాడుచుందువు. సోదరా, మొదట కారాగారమందు బంధితుడినై యుండుటచేత, నేను నీకేమియు హితమును కలిగించలేకపోతిని. ఇపుడు ధనసంపత్తి కలిగినది. దానిచే శ్రీమదాంధులమై పోయియుంటిమి. నీవు మాకు సమీపమందేయున్ననుమేము నీవంక జూడకయుంటిమి. ఇతరులను సన్మానించుచు, సన్మానము (తనకు)గోరనట్టి ప్రియసోదరా, శుభము గోరువానికి రాజ్యలక్ష్మి లభింపకయుండుటయందే క్షేమమున్నది. ఎందుకనగా మనుజుడు రాజ్యలక్ష్మి మదముచే గ్రుడ్డివాడై తన బంధుబాంధవులను, సోదరులను, స్వజనులను గాంచకుండును" అని వసుదేవుడు నందునితో ననియె.

ఈ ప్రకారము చెప్పుచునే వసుదేవుని హృదయము గద్గదికమైపోయినది. అతనికి నందుడు తనకు గావించిన యుపకారమంతయు గుర్తునకు వచ్చినది. నేత్రములందు ప్రేమాశ్రువులు పొంగిపొరలినవి. దానిచే నతడు రోదించసాగినాడు. వసుదేవుని ప్రసన్నుని జేయుటకును, శ్రీకృష్ణబలరాముల ప్రేమపాశబద్ధుడగుటచేతను, నందుడు నేడు-రేపు అనుచు మూడు మాసములవరకచటనే యుండిపోయె. అనంతరమనేక దివ్యవస్త్రాభూషణాదులను, నానా ప్రకారములగు భోగవస్తువులను నందాదులకు కానుకలనొసంగి,సంతృప్తుల గావించినాడు.వసుదేవుడు. ఉగ్రసేనుడు, శ్రీకృష్ణబలరాములు, ఉద్ధవుడు మొదలుగాగల యాదవులందరు వేర్వేరుగా వారికనేక కానుకలొసంగిరి.అన్నియు గైకొని నందుడతి కష్టముతో వ్రజమండలమునకు తరలినాడు. నందునియొక్కయు, గోపీగోపకులయొక్కయు చిత్తములు, యెంత ప్రయత్నమొనర్చినను మరలింపలేనంతగా, శ్రీకృష్ణుని చరణకమలముల యందు లగ్నమైపోయినవి. చిత్తరహితముగనే వారు మధురకు పయనమైపోయిరి.

అందరు వెళ్ళిన యనంతరము వర్షఋతువు సమీపించుటగాంచి, శ్రీకృష్ణదేవత లగు యాదవులుగూడ ద్వారకకు వెళ్ళి, వసుదేవుని యజ్ఞమహోత్సవముగూర్చియు, ప్రియసమాగమము గూర్చియు తమవారికి వినిపించిరి.

# ఎనుబదియైదవ యధ్యాయము

## భగవానునిచే వసుదేవునకు బ్రహ్మజ్ఞానోపదేశము
## దేవకీదేవికి అర్భకపుత్రుల జూపించుట

పరీక్షిన్మహారాజా, అనంతరమొకనాడు శ్రీకృష్ణ బలరాములు ప్రాతఃకాల వందన మాచరించుటకై తలిదండ్రులవద్దకేగిరి. ప్రణామానంతరము వసుదేవుడు

వారినభినందించి, యిట్లు పల్కె. వసుదేవుడు మహర్షులవలన భగవానుని మహిమను గూర్చి వినియుండె. తాను స్వయముగా నామహిమలను చూచియుండుటచేత, వీరు సాధారణ మానవులుగారనియు, సాక్షాత్తు భగవత్స్వరూపులేయనియు నతనికివిశ్వాసము గల్గినది. అందుచే నతడు ప్రేమపూర్వకముగ పుత్రుల సంబోధించుచు నిట్లు పల్కె.

"సచ్చిదానందస్వరూపా, శ్రీకృష్ణా, మహాయోగీశ్వరా సంకర్షణా, మీరిరువురు సనాతనులు.సమస్త జగత్తునకు కారణస్వరూపులగు ప్రధాన- పురుషులును నియమించు పరమేశ్వరులు మీరని నేను గుర్తించితిని. ఈ జగత్తునకు ఆధారము నిర్మాత, నిర్మాణసామగ్రి, సమస్తముగూడ మీరే. ఈ జగత్తునకు ప్రభువులుగూడ మీరే. మీ క్రీడకొరకే యిది నిర్మించబడినది. ఇది యెప్పుడేరూపమున నెట్లుండునో అదియంతయు మీరే. ఈ జగత్తునందు ప్రకృతిరూపమున భోగ్యముగను, పురుషరూపమున భోక్తగను, రెంటికంటె నతీతముగనుండి రెంటిని నియమించునట్టి భగవానుడుగనున్నదియు మీరే. ఇంద్రియాతీతా, పుట్టుట, ఉండుట మొదలగు షడ్భావవికారములులేనట్టి పరమాత్మా, ఈ చిత్ర విచిత్రమగు జగత్తును నీవే నిర్మించి, యందు ఆత్మరూపమున నీవే ప్రవేశించి యుంటివి. నీవు ప్రాణ (క్రియాశక్తి) రూపమున, మఱియు జీవ [జ్ఞానశక్తి] రూపమున ఈ జగత్తును పరిపాలించుచు పోషించుచున్నావు.క్రియాశక్తి ప్రధానములగు. ప్రాణాదులయందున్న ప్రాపంచిక వస్తువుల సృష్టించు సామర్థ్యము, నీదేగాని, యాప్రాణాదులదిగాదు. ఏలననగానవి నీవలె చేతనములుగావు. అచేతనములు. స్వతంత్రములుగావు. పరతంత్రములు. అందుచేత చేష్టాశీలముగల ప్రాణాదులయందు కేవలము చేష్టమాత్రమే యుండును గాని శక్తి యుండదు. ఆ శక్తి నీదే. ప్రభూ, చంద్రునియందలి కాంతి, అగ్నియొక్క తేజస్సు, సూర్యుని ప్రకాశము, నక్షత్రములు, విద్యుత్తు మొదలగువాని యందు స్ఫురణరూపముతో సత్త [శక్తి], పర్వతములయందలి స్థిరత్వము పృథివి యందలి సాధారణశక్తి రూపవృత్తి, గంధరూపమగు గుణము, లివియన్నియు వాస్తవముగ నీశక్తులే. పరమేశ్వరా, జలమునందు తృప్తి గల్గించునట్టియు జీవనమిచ్చునట్టియు శుద్ధి గల్గించునట్టియు గుణములేవిగలవో, అవియన్నియు నీస్వరూపములే. జలము, దానియందలి రసగుణముగూడ నీవే. ప్రభూ, అంతఃకరణము యొక్క శక్తి, ఇంద్రియశక్తి, శరీరశక్తి, దానిచలనశక్తి, యీవాయుశక్తులన్నియు నీకు చెందినవే. దిక్కులయందలి యాకాశము, దిక్కులు నీవే. ఆకాశము దాని యందుగల స్ఫోటశక్తి—శబ్దతన్మాత్ర లేక పరావాణియగు నాదము [పశ్యంతి] ఓంకారము [మధ్యమా] అటులే వర్ణములు [అక్షరములు]. అటులనే పదార్థములను వేరు వేరుగా నిర్దేశించునట్టి పదరూపమగు వైఖరీవాణి గూడ నీ స్వరూపమే. ఇంద్రియములు, వానియందుగల విషయప్రకాశినీశక్తి, వాని యధిష్ఠాన దైవతము

లన్నియు నీ స్వరూపములే. బుద్ధియొక్క నిశ్చయాత్మకశక్తియు, జీవునియొక్క స్మృతియు నీవే. భూతములందు వానికి కారణమగు తామసాహంకారము, యింద్రియములందు, వానికి కారణమగు తైజసాహంకారము, యింద్రియాధిష్ఠాతృదేవతలయందు వానికి కారణమగు సాత్త్వికాహంకారము, జీవులయందు గమనాగమన కారణమగు మాయాశక్తియు నీస్వరూపములే. మహాభాగా, మట్టి మొదలగు వస్తువుల వికారములగు, వృక్షములు ఘటములు మొదలగువానియందు నిరంతరము మట్టియే వర్తమానమగుచుండునట్లు, వాస్తవమున కవియన్నియు కారణముల యొక్క స్వరూపములేయగునట్లు, యీనశ్వర పదార్థములన్నింటియందు కారణరూపమున, వినశ్వరముగానున్న తత్త్వము నీవేయైయున్నావు. నిజమునకివియన్నియు నీస్వరూపములే. ప్రభూ, సత్త్వ, రజస్తమోగుణములు, వానివృత్తులు (పరిణామములు) మహత్తత్త్వాదులన్నియును పరమాత్మయగు నీయందు యోగమాయద్వారా కల్పితములైయున్నవి. కావుననే నీయందు షడ్భావవికారములు లేనేలేవు. నీయందు వీటికల్పన చేయబడినప్పుడు నీవావికారముల కనుగతుడవైనట్లు తెలియబడుచుందువు. ఆ కల్పనానివృత్తి కలిగినప్పుడు, నిర్వికల్పపరమార్థ స్వరూపమందుండిపోవుదువు. ఈ జగత్తు త్రిగుణములయొక్క ప్రవాహము. దేహము, యింద్రియములు, అంతఃకరణము, సుఖము, దుఃఖము రాగలోభాదులన్నియును ఆ త్రిగుణములయొక్క కార్యములే. వీనియందు అజ్ఞానులు నీ సర్వాత్మకమగు సూక్ష్మస్వరూపమును తెలియజాలకున్నారు. దేహాభిమానరూపమగు తమ యజ్ఞానకారణముచేతనే కర్మబంధమునందు చిక్కినవారై, మరల మరల పుట్టుచు, చచ్చుచు పరిభ్రమించుచున్నారు. పరమేశ్వరా, నా పుణ్యప్రారబ్ధముచేత, యింద్రియాది సామర్థ్యయుక్తమగు నత్యంత దుర్లభమైన మానవదేహము సంప్రాప్తమైనది. కాని నీ మాయామోహితుడనై యథార్థస్వార్థ – పరమార్థమునందజాగ్రత్తగ నుండిపోతిని. నాయాయువంతయు గడచిపోయినది. ప్రభూ, ఈ శరీరమే నేను, యీ శరీరమునకు సంబంధించినదంతయు నాది, యను అహంకార మమకారరూపమగు స్నేహ [ప్రేమ] పాశముచే సర్వజగత్తును నీవు బంధించి యుంచితివి. మీరిరువురును నా పుత్రులుగారనియు సంపూర్ణ ప్రకృతికి, జీవులకు స్వాములనియు నేనెరుగుదును. పృథ్వికి భారభూతులుగానున్న రాజుల సంహరించుటకే యవతరించిన మహానుభావులనియు తెలయును. ఈ మాట మీరు నాతో చెప్పిగూడ యున్నారు. దీనబాంధవా, శరగతవత్సలా, నేను నీచరణముల నాశ్రయించుచున్నాను. ఏలననగా, నవి శరణాగతులగునట్టివారి సంసారభయము పోగొట్టునట్టివి. ఇంతవరకు జరిపిన యింద్రియలోలుపత్వమికజాలును. విసిగివేసారితిని. మరణశీలమగు శరీరమునందు, యింద్రియలోలత్వకారణముచేతనే, ఆత్మబుద్ధి కలిగినవాడనై పరమాత్మవగు నీయందు పుత్రబుద్ధి కలిగియుంటిని. ప్రభూ, నీవు సూతికాగృహమునందే, "నేను

జన్మలేనివాడనైనప్పటికిని, నాచే కల్పింపబడిన ధర్మమర్యాదను రక్షించుటకుగాను, ప్రతియుగమందునను, మీ యిరువురి ద్వారా యవతరించుచుందు"నని మాతో చెప్పి యుంటివి. నీవు ఆకాశమువలె ననేక శరీరములదాల్చుచు. విసర్జించుచుందువు. వాస్తవములో, నీవనంతుడవు. సదేక రసస్వరూపుడవు. ఆశ్చర్యకరమగు నీయోగమాయా రహస్యము నెవడు తెలుసుకొనగలడు? అందరును నీ కీర్తినే గానము చేయుచుందురు."

వసుదేవుని యీ పలుకులాలించి, యదువంశ శిరోమణియగు గోవిందుడు, చిరునగవు చిందించసాగినాడు. వినయవినమితోత్తమాంగుడై మధురముగ నిట్లు భాషించినాడు.

"తండ్రీ, మేము నీకు పుత్రులమే. నీవు మమ్ములనుద్దేశించి బ్రహ్మోపదేశము గావించితిని. నీవు వచించిన ప్రతియంశముగూడ యుక్తియుక్తముగ నున్నవి. నీవు, నేను, బలరాముడు, ద్వారకావాసులు సమస్తచరాచరప్రపంచము, సర్వము బ్రహ్మస్వరూపముగనే భావించవలసియున్నది. తండ్రీ, ఆత్మయొక్కటియే కాని యది తనయందే గుణములను సృష్టించుకొని గుణముల ద్వారా నిర్మితములైన పంచభూతములందు, ఒక్కటియయ్యు అనేకముగను, స్వయంప్రకాశమైయున్నను దృశ్యముగను, తన స్వరూపమేయైయున్నను తనకంటె భిన్నముగను, నిత్యమైనను అనిత్యముగను. నిర్గుణమయ్యు సగుణముగను, ప్రతీతమగుచున్నది. పంచమహాభూతములు తమ కార్యములగు, ఘట, కుండలములందు-ప్రకటముగను ఆ ప్రకటముగనుండి పెద్ద–చిన్న, యెక్కువ-తక్కువ, ఏకము-అనేకములను భేదములతో ప్రతీతమగుచుండును. కాని వాస్తవముగ, సత్తారూపముతో నవియన్నియు నొకటియే యైయున్నవి. అటులనే ఆత్మయందుగూడ ఉపాధిభేదముచేతనే నానాత్వప్రతీతి కలుగుచున్నది. అందుచే నేనే యీ సర్వము అను దృష్టితో నీవు పల్కినది సమంజసముగనే యున్నది."

అని భగవానుడీరీతి బలుకగా, వసుదేవుడు నానాత్వబుద్ధిని విడనాడినాడు. ఆనందమగ్నుడై యాతడు, వాక్కుతో మౌనముగానుండి, మనస్సుతో సంకల్ప రహితుడాయె. ఆ సమయమందచట సర్వదేవమయియగు దేవకిదేవిగూడ కూర్చుండి యున్నది. అంతకుముందే వారి సంభాషణ వినుచు నామె విస్మితురాలగుచుండినది. రామకృష్ణులు తమ గురుపుత్రుని యమలోకమునుండి తెచ్చియిచ్చిరను సమాచారము విన్ననాటినుండియు యామెకాశ్చర్యము కలుగుచునేయుండె. ఇప్పుడామెకు కంసునిచే చంపబడ్డ తన యార్గురుపిల్లలు జ్ఞాపకమువచ్చి యామె హృదయమత్యంతాందోళనకు గురియైనది. కనులనుండి యశ్రువులు కారసాగినవి. మహాకరుణస్వరమున, నామె రామకృష్ణుల సంబోధించుచు యిటుల పల్కినది,

"లోకాభిరామా, రామా, నీ శక్తి యమోఘము. మనోవాగతీతము. యోగేశ్వరేశ్వరా, శ్రీకృష్ణా, మీ యిరువురును ప్రజాపతులకు గూడ ప్రభువు, ఆదిపురుషుడు నగు నారాయణ స్వరూపులు. కాలక్రమముగ, ధైర్యము, నిగ్రహము, సత్త్వగుణములను గోల్పోయి, శాస్త్ర శాసనముల నుల్లంఘించి స్వేచ్ఛాచార పరాయణులగుచు, భూమికి భారముగా పరిణమించిన దుష్ట రాజుల సంహరించుటకే మీరు నా గర్భవాసముననుదయించిరని గూడ నేనెఱుంగుదును. విశ్వాత్మా, నీ పురుష రూపాంశచే నుత్పన్నమైన మాయచే గుణము లుత్పన్నమగుచున్నవి. వాని లేశ మాత్రముచేతనే జగదుత్పత్తి, వికాస, ప్రళయములు సంభవించుచున్నవి· నేను హృదయ పూర్వకముగ నిన్ను నేడు శరణందుచున్నాను. మీ గురువగు సాందీపని యొక్క తనయుడు గతించి బహుదినములైనది. గురుదక్షిణకై గుర్వనుమతితో, కాలప్రేరణ ననుసరించి, మీరు యమలోకము నుండి గురు పుత్రుని దెచ్చి యిచ్చితిరని నేను విని యుంటిని. మీరిరువురు యోగీశ్వరేశ్వరులు. కావున నా యీ చిన్న కోరికను మన్నించి సఫలముగావించుడు. కంసునిచే వధించబడిన నా యార్గురు తనయులను తెచ్చి, నాకు వారిని చూచు భాగ్యము కలుగజేయుడు" అని ఆర్తితో వేడినది.

తల్లిమాట లాలించి రామకృష్ణులు, యోగమాయ నాశ్రయించి సుతలలోకమున కేగిరి. వారి యాగమనమును గాంచిన దైత్యరాజగు బలి చక్రవర్తి హృదయమానంద తరంగితమైనది. కుటుంబ సహితుడై యాతడాసనము నుండి లేచి, భగవానుని పాదములకు నమస్కరించి, వారిరువురి నుత్తమాసనాసీనులంగావించి, వారి పాదముల గడిగి, యాపాదోదకమును, పరివార సహితముగ శిరస్సుపైదాల్చినారు. భగవానుని పాదజలము బ్రహ్మాది స్తంబ పర్యంతము సమస్త జగత్తును పవిత్రము చేయునట్టిది. అనంతరము దైత్యరాజు, బహు మూల్యములగు వస్త్రాభూషణ, చందన, తాంబూల, ధూప దీపాదులతోడను, అమృతముతో సమానమగు భోజనముతోడను, అనేకములగు యితర సామగ్రులతోడను వారిని పూజించి, తన సమస్త పరివారమును, ధనమును, శరీరముతో సహా ఆత్మ సమర్పణ యొనర్చినాడు. భగవానుని చరణ కమలములను తన వక్షః స్థలమందు, శిరము నందు నుంచుకొనుచు, దైత్యరాజు, ప్రేమ విహ్వలుడాయె. నేత్రము లందానందాశ్రువులు ప్రవహింపసాగినవి. అతని యొడలు పులకరించినది. గద్గద స్వరమున నిట్లు స్తుతి యొనర్పసాగినాడు.

"బలరామా, నీ వనంతుడవు· శేషుడు మొదలగు సర్వ విగ్రహములు నీ యందంతర్భూతములై యుండును.సచ్చిదానంద స్వరూపా శ్రీకృష్ణా,నీవు సకల జగన్నిర్మాతవు. జ్ఞాన, భక్తి యోగముల రెంటికి నీవే ప్రవర్తకుడవు. నీవు పరబ్రహ్మ స్వరూపుడవు. మీ యిరువురికి నమస్కరించుచున్నాను. మీ యిరువురి దర్శనము ప్రాణుల కత్యంత దుర్లభము. అయినను మీ కృప యున్నహో నది సులభమే

యగును. రజస్తమో గుణ స్వభావము గల్గియున్న దైత్యులమగు మాకు మీ దర్శనము, నేడు మీ దయచే సంభవించుటయే యందులకు నిదర్శనము. మేము, మాతో సమానులగు యితర దైత్య, దానవ, గంధర్వ, సిద్ధ, విద్యాధర, చారణ, యక్ష, రాక్షస, పిశాచ, భూత, ప్రమథ నాయకాదులు, నీ యందు ప్రేమతో నిన్ను సేవించకపోగా, నీతో నెల్లప్పుడు వైరభావము గలిగి యుండుదుము. నీ శ్రీ విగ్రహము సాక్షాత్తు వేదమయము. విశుద్ధ సత్త్వస్వరూపము. కావున మాలో ననేకులు దృఢమగు వైరభావముతోను, కొలది మంది భక్తితోను, కొలదిమంది కోరికలతోను, నిన్ను స్మరించుచు, నీ సమీపవర్తులై సత్త్వ గుణ ప్రధానులగు దేవతాదులుగూడ పొందజాలనట్టి, పరమ పద ప్రాప్తి నందియుండిరి. యోగేశ్వరేశ్వరా, గొప్ప గొప్ప యోగేశ్వరులు గూడ నీ యోగమాయయననేదియో, యెట్లుండునో యను విషయము తెలియజాలక యుందురన, మా బోంట్ల విషయము వేరే చెప్పవలయునా? కావున, స్వామీ, యెట్టి కోరికలులేని పరమహంస పరివ్రాజకులు నిత్యమన్వేషించుచుండునట్టి నీ చరణ కమలములయందు, నా చిత్తవృత్తి యెల్లప్పుడును లగ్నమై యుండునట్లుగా, నన్ననుగ్రహించుము. వాని నాశ్రయించి, నేను దానికంటె భిన్నమగు యీ గృహసంబంధమగు చీకటి నూతి నుంచి బయటపడెదను. సమస్త జగత్తునకును యేకమాత్రాశ్రయమగు నీ చరణ కమలముల నాశ్రయించి శాంతచిత్తుడనై యేకాకిగా విహరించెదను. ఎవరితోనైనా సాంగత్యము చేయవలసి వచ్చు నెడల, సత్సాంగత్యమే లభించుగాక. ప్రభూ, నీవు సమస్త చరాచర జగత్తునకు, నియంతవు, స్వామివి. నీవు మమ్మాజ్ఞాపించి పాపరహితమగునట్లు చేయుము. ఏలననగా, శ్రద్ధాయుక్తుడై నీ యాజ్ఞా పాలనము చేయువాడు, విధి నిషేధ బంధనము నుండి ముక్తుడగును" అని బలుకగా, శ్రీకృష్ణ భగవానుడిట్లనియె.

"దైత్యరాజా, స్వాయంభువమన్వంతరము నందు, మరీచి ప్రజాపతి యొక్క పత్నియగు ఊర్ణాదేవి గర్భము నుండి యార్గురు పుత్రులుదయించిరి. వారందరు దేవతలు. వారందరును, బ్రహ్మదేవుడు తన పుత్రికతో సంగమింపనుద్యుక్తుడగుట గాంచి, పరిహసించిరి. అందుచే బ్రహ్మ వారిని శపింపగా, వారు హిరణ్యకశిపునకు పుత్రులై జన్మించిరి. వారిని యోగమాయాదేవి, దేవకీ గర్భమందు ప్రవేశపెట్టగా, పుట్టిన వారిని పుట్టినట్లు కంసుడు వారిని సంహరించినాడు. దైత్యరాజా, మాతల్లియగు దేవకీదేవి, యాపుత్రులకొరకత్యంత శోకాతురయైయున్నది. ఆ బాలకులు నీవద్ద నున్నారు. కావున మా తల్లి శోకముడుపుటకై వారిని మేమిచటినుండి గొంపోయెదము. దానితో వారికి శాపవిముక్తి లభించి, యానందపూర్వకముగ తమలోకము చేరగలరు" వారి నామము తేవియన, స్మరుడు, ఉద్గీథుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభృత్తుడు, ఘృణి. నా యనుగ్రహముచే వారికి మరల సద్గతిలభింపగలదు." అని పలికి భగవానుడు మౌనము వహించె.

దైత్యరాజు వారిని పూజించి యా బాలకుల నివ్వగా, రామకృష్ణులు వారిని ద్వారకకు గొనివచ్చి తల్లికి సమర్పించిరి. వారిని గాంచిన దేవకికి వాత్సల్యస్నేహము పొంగినది. స్తనములందు పాలుగారినవి. వారిని తనయొడియందుంచుకొని ముద్దాడుచు మాటిమాటికి మూర్ధమాఘ్రాణింపసాగినది. పుత్రస్పర్శచే కలిగిన యానందమునందు తలమునకలగుచు నామె వారికి స్తన్యమొసగినది. విష్ణుమాయచే నామె మోహితురాలై పోయినది. సృష్టి చక్రమంతయు నా మాయచేతనే తిరుగుచున్నదిగదా! దేవకీదేవి స్తన్యము సాక్షాత్తుగ నమృతమేయైయున్నది. ఎందుకుండదు? అది, శ్రీకృష్ణుని పీతశేషముగదా! అట్టి యమృతమయమగు స్తన్యము త్రాగుటచేతను, శ్రీకృష్ణ భగవానుని యంగసంస్పర్శవలనను, వారికాత్మసాక్షాత్కారము కలిగినది. అనంతరము వారు మాతాపితరులకును, రామకృష్ణులకును నమస్కరించి, యందరి సమక్షమందే దేవలోకమున కేగిరి. దేవకీదేవి యిదియంతయుగాంచి, చనిపోయిన పిల్లలు వచ్చుట, మరల వెడలిపోవుటను జూచి, యత్యంత విస్మితయైపోయినది. ఇదియంతయు శ్రీకృష్ణుని లీలాకౌశలమేయను నిశ్చయము కలిగినదామెకు. శ్రీకృష్ణుడు స్వయముగ పరమాత్మయే. అతనిశక్తి యనంతము. ఇట్టి యద్భుతములను పూర్తిగా నెవరును తెలియజాలరు.

శౌనకాదిఋషులారా, భగవానుని కీర్తియమరము. అమృతమయము. సమస్త పాపతాపశాంతిని కల్గించునట్టిది. భక్తులకానందదాయకము. శుకయోగి వర్ణించిన యీ చరిత్రను శ్రవణమొనర్చినవారలకు, వినిపించినవారలకు భగవద్భక్తి కలిగి, వారు పరమపదప్రాప్తి నందగలరని" సూతుడనియె.

# ఎనుబదియారవ యధ్యాయము

## సుభద్రాహరణము—భగవానుడు మిథిలయందు జనకమహారాజ శ్రుతదేవ బ్రాహ్మణ గృహములకొకేసారి వెళ్ళుట

"శుకమహర్షీ, మా పితామహుడగు నర్జునుడు, శ్రీకృష్ణబలరాముల సోదరియగు మా నాయనమ్మయగు సుభద్రాదేవి నెట్లు వివాహమాడెనో తెలుసుకొన కుతూహల పడుచుంటి"నని, పరీక్షిత్తు పలుక, శుకయోగి యిట్లు వివరింపదొడగె.

"రాజా, ఒక సమయమందత్యంత శక్తిశాలియగు ధనంజయుడు తీర్థయాత్రల జేయుచు భూమిపై పర్యటించుచు ప్రభాసతీర్థమును చేరియుండె. తన మేనమామ కొమరితయగు సుభద్రను, బలరాముడు దుర్యోధనునకిచ్చి వివాహము చేయ

లచుచుండెననియు, దానికి వసుదేవ శ్రీకృష్ణాదులు సుముఖముగా లేరనియు, నతని చట దెలియవచ్చినది. అర్జునుని మనస్సునందు సుభద్రను పొందవలయునను తీవ్ర ాంచ యుదయించినది. అందుచే నతడు సంన్యాసి వేషము ధరించి ద్వారక ప్రవే ంచి, స్వార్థసాధనకై యట చాతుర్మాస్యదీక్ష బూనియుండె. ద్వారకాపురవాసులు, లరామదేవుడు నతనికి బాగుగా సపర్యలు గావించుచుండిరి. అతనర్జునుడని యెవరి ని తెలియకుండె.

ఒకనాడు స్వాములవారిని భిక్షకై, బలరాముడు తమ యింటికి గొనిపోయి, హాశ్రద్ధతో నతనికి భోజనము పెట్టినాడు. భోజనసమయ మందర్జునునకు, వివాహ యోగ్యమగు వయసునందున్న సుభద్రయగుపించినది. ఆమె సౌందర్యాతిశయము హావీరుల చిత్తములనుగూడ హరించుచుండినది. అర్జునుని నేత్రములు ప్రేమతో కసించినవి. ఆమెను పొందవలయునను తీవ్రకాంక్షచే నతని మనస్సు క్షుబ్ధమైనది. మెను పరిణయమాడవలయునని గట్టిగా నిశ్చయించుకొనినాడు. రాజా, మీ పితామ ుడగు నర్జుడునుగూడ మహాసుందరుడు. అతని శరీరసౌష్ఠవము, భావభంగిమలు ారీజన హృదయంగమములై యుండెడివి. అతనిని గాంచిన సుభద్రాదేవియు నత నే పతిగా చేసుకొనవలయునని దృఢనిశ్చయ మొనర్చుకొనియె. చిరునవ్వు వ్వుచు, సిగ్గుతోగూడిన చూపులతో నర్జునుని చూడసాగినది. తన హృదయమాతనికి మర్పించినది. అప్పుడర్జునుడు డామెనే తలచుకొనుచు, నామెను హరించు నవకాశ ుకొర కెదురుచూచుచుండె. సుభద్రను పొందవలయునను తీవ్రవాంఛచే నతని ునస్సు తత్తరపడుచుండుటచే, నతనికి కొంచెముగూడ శాంతి లేకుండబోయినది.

ఒకనాడు సుభద్రాదేవి దేవదర్శనార్థము రథముపైనెక్కి ద్వారకాదుర్గము లుపలకేగినది. ఆ సమయమందే శ్రీకృష్ణుని యొక్కయు దేవకీవసుదేవుల యొక్కయు ననుమతితో, సుభద్రను మహారథియగు నర్జునుడపహరించె. రథారూ ుడై యతడు ధనుస్సును ధరించి, తన కడ్డము వచ్చిన సైనికుల బాణపీడితుల ావించి వెడలగొట్టినాడు. వారందరు నాక్రోశించుచుండగా, సింహము తనవేటను ొంపోవు విధమున, సుభద్రను గైకొని వెడలిపోయె. ఈ సమాచారమును విన్న లరామునకు తీవ్రక్రోధము కల్గినది. పున్నమినాడు సముద్రమువలె బలరాముడు ్షుభితుడైనాడు. కాని శ్రీకృష్ణభగవానుడు, యితర బంధుమిత్రులందరు నతని పాద ములబట్టి, యెంతగానో యనునయించగా నతడు శాంతుడాయె. ప్రసన్నుడై యాతడు ధూవరులకు చాలధనములను, సామగ్రులను, యేనుగులు, గుర్రములు, రథములు, ాసదాసీజనమును పారిబర్హముగా బంపినాడు.

"పరీక్షిన్మహారాజా, విదేహ రాజధానియగు మిథిలయందు శ్రుతదేవుడను నొక గృహస్థ బ్రాహ్మణుడుండెడివాడు. ఆతడు, శ్రీకృష్ణునకు పరమభక్తుడు. భగవద్భక్తిచేతనే యతడు పూర్ణమనోరథుడై పరమ శాంతుడుగను, జ్ఞానియు, విరక్తుడునై యుండె. గృహస్థాశ్రమమందుండియు నతడు భుక్తికై యెట్టి ప్రయత్నమును గావించక, దొరికిన దానితో సంతృప్తిచెందుచు జీవితమును వెళ్ళబుచ్చుచుండె. ప్రారబ్ధానుసారమతనికి నిత్యము జీవన నిర్వాహమునకు చాలినంతధనమే లభించుచుండెడిది. అధికముగా లభించెడిదిగాదు. దానితోడనే సంతృప్తి చెందుచు తన వర్ణాశ్రమ ధర్మములను చక్కగా నిర్వర్తించుచుండెడివాడు.

ఆ దేశపురాజు గూడ బ్రాహ్మణునితో సమానముగనే శ్రీకృష్ణుని యందు భక్తి గలిగియుండె. ఆ రాజు యొక్క పేరు బహులాశ్వుడు. అతనికి అహంకారమనునది యే కోశమందునను లేకుండె. శ్రీకృష్ణునకు, శ్రుతదేవ బహులాశ్వులిరువురును పరమ భక్తులై యుండిరి.

ప్రసన్నుడైన భగవాను డొక మారు భక్తులిర్వురుని చూచుటకై, దారుకునిచే రథము సిద్ధము గావింపజేసి, దానిపై మిథిలకు బయలుదేరినాడు. భగవానుని వెంట, నారద, వామదేవ, అత్రి, వేదవ్యాస, పరశురామ, అసిత, అరుణి, నేను (శుకదేవుడు) బృహస్పతి, కణ్వ, మైత్రేయ, చ్యవనాది ఋషులందరును మిథిలకు బయలుదేరిరి. మార్గమందలియన్ని ప్రదేశములందలి నాగరికులును, గ్రామ వాసులును, పలువిధములగు పూజా సామగ్రులను గైకొని భగవానుని పూజింపసాగిరి. వారందరి కతడు, గ్రహసహితుడైన సూర్యనారాయణమూర్తివలె గోచరించసాగినాడు. ఆ యాత్రయందు వారు, ఆనర్త, ధన్వ, కురుజాంగల, కంక, మత్స్య, పాంచాల, కుంతి, మధు, కేకయ, కోసల, అర్ణాద్యనేక దేశములందలి, స్త్రీ పురుషులందరును, తమ నేత్రములను దొప్పలతో, శ్రీకృష్ణ భగవానునియొక్క యున్ముక్త హాస్య, మధురావలోకనములతో గూడిన ముఖారవింద మకరందరసమును తనివిదీర త్రాగుచుండిరి. భగవానుని దర్శనముచే వారి యజ్ఞానదృష్టి తొలగిపోవుచుండినది. తనను దర్శించిన వారలందరికిని, పరమకల్యాణమును, తత్త్వజ్ఞానమును ప్రసాదించుచు భగవానుడు ముందునకు సాగిపోవుచుండె. ప్రతి స్థానమందును, మనుజులు, దేవతలు నందరును, దశదిశల ప్రకాశింపజేయునట్టిది, సమస్త పాపములను శమింపజేయునట్టిదియు నగు భగవానుని కీర్తిని గానము చేయుచు వినిపించుచుండిరి. ఈవిధముగ పయనించుచు, భగవానుడు నెమ్మదిగా, విదేహ రాజ్యము చేరినాడు.

శ్రీకృష్ణ భగవానుని శుభాగమన సమాచారమును విని, మిథిలానగర వాసులందరును మహానందభరితులైరి. అందరును పూజా సామగ్రులను గొనివచ్చి యెదురేగి, భగవానుని దర్శించి, ప్రేమానంద భరిత హృదయులైరి. భగవానునకు, నాప

ములు మాత్రమే విని యింతవరకు దర్శించ నటువంటి మునులకును, చేతులు జోడించి తలవంచి, యందరు నమస్కరించిరి.

మిథిలాధిపతియగు బహులాశ్వుడును, శ్రుతదేవుడును, తమ నను(గహిం చుట కొరకే భగవానుడు విచ్చేసినాడను భావముతో, భగవానుని పాదములపైబడి ప్రణమిల్లిరి. ఇద్దరు నొకేమాదు చేతులు జోడించి, మునిమండల సహితముగ తమ యాతిథ్యము స్వీకరించుటకై తమ యింటికి రావలసినదిగా ప్రార్థించినారు. భగవానుడు వారి యిద్దరిని సంతోషపెట్టదలచినవాడై యొకే సమయమునందే, వేరు వేరు రూపములతో యిరువురి యిండ్లకును వేంచేసినాడు. తమ యింటికి గాక వేరొక యింటికి గూడ వెళ్ళినట్లు వారిరువురికిని తెలియదు.

మహా మనస్వియగు బహులాశ్వ మహారాజు, దుష్టులకెవరి నామము విను టకు గూడ కుదరదో, యట్టి శ్రీకృష్ణ భగవానుడు ఋషి—ముని సహితముగ తన యింటికి వచ్చుటగాంచి, మహా సుందరములగు నాసనములను దెప్పించివైచి యంద రిని సుఖాసీనులను గావించినాడు. బహులాశ్వుని పరిస్థితి విచిత్రముగ నున్నది. ప్రేమ భక్త్యుద్రేకముచే నతని హృదయము నిండిపోయినది. నేత్రము లశ్రువులతో నిండిపోయినవి. పూజ్యులగు వారందరికిని భగవానునితోసహా, నమస్కరించి, పాద ములు కడిగి, యా లోకపావనమగు పాద జలమును తన కుటుంబ సభ్యులందరితో పాటు తన శిరమందు జల్లుకొనినాడు. భగవానునికి మునులందరికిని, ధూప దీప మాల్యాద్యుపచారములన్నియు సమర్పించి, గోదానాదులు గూడ చేసినాడు. ఇష్ట మృష్టాన్నములతో నందరిని సంతృప్తిపరచిన యనంతరము, బహులాశ్వుడు, భగ వానుని చరణములను తన యొడియందుంచుకొని, నెమ్మది నెమ్మదిగా, నతని పాద ములొత్తుచు నతని నీరీతి స్తుతించసాగినాడు.

ప్రభూ, నీవు సమస్త ప్రాణులకాత్మ స్వరూపుడవు, సాక్షివి. స్వయం ప్రకా శుడవు. మేమెప్పుడును నీ పాదకమలములనే స్మరించుకొనుచుందుము. అందుచేతనే నీవు మాకు దర్శనమొసంగి మమ్ము కృతార్థులగావించినావు.

"నాయందనన్య ప్రేమగలిగియుండు భక్తులగువారు, నాకు, నా స్వరూపుడే యగు బలరామునికంటెను, అర్ధాంగివియగు లక్ష్మికంటెను, పుత్రుడగు బ్రహ్మ కంటెను,యెక్కువ ప్రియు"లని నీవే వచించియుంటివి. ఆ మాటలను సత్యమొనర్చు టకే నీవు మాకు దర్శనమొసంగినాడవు. ఇట్టి నీ పరమదయాళుత్వమును, ప్రేమ పరవశత్వమును తెలిసియుండియు నీ చరణకమలముల పరిత్యజించు పురుషుడెవ్వ డుండును? జగత్తునందలి సమస్తపదార్థములను, చివరకు శరీరాదులనుగూడ మానసి

క్త్యాగమొనర్చి యుండునట్టి పరమశాంతమూర్తులగు మునులకు నీవు సమర్పించుకొందువు. నీవు యదువంశ మందవతరించి సంసారచక్ర

మందు పరిభ్రమించుచున్న మనుష్యుల నుద్ధరించుటకొరకే, ముల్లోకములకు పాప తాప శాంతులొసంగునట్టి నీ పవిత్ర యశస్సును జగత్తునందు విస్తరించుచుందువు. ప్రభూ, నీవచింత్యుడవు. అనంతైశ్వర్య మాధుర్యములకు నిధివి. సర్వుల చిత్తము లను నీవైపునకాకర్షించుటకై నీవు సచ్చిదానంద స్వరూపమగు శ్రీకృష్ణ రూపమున నున్నావు. నీజ్ఞానమనంతము. పరమశాంతిని విస్తరింపజేయుటకై నీవే నారాయణ ఋషిరూపమున తపస్సాచరించుచుందువు. నీకు నమస్కారము చేయుచుంటిని. అఖండానందైక రసస్వరూపా,కొలది దినములు నీవు మునిమండల సహితముగ మా వద్దయుండి నీపాదరజస్సుచే మానిమి వంశమును పావనమొనర్ప ప్రార్థించు చున్నాను" అని వేడుకొనగా, బహుళాశ్వుని ప్రార్థనను మన్నించి, మిథిలాపుర వాసు లకు ముదము కల్గించుచు భగవానుడచట కొలది దినములుండిపోయె.

పరీక్షిన్మహారాజా, మహారాజానందించుచున్నటులనే శ్రుతదేవ బ్రాహ్మణుడు గూడ మహానంద నిమగ్నుడగుచుండె. మునిగణ సహితముగ తన యింటికి వేం చేసిన శ్రీకృష్ణ భగవానుని గాంచి నమస్కరించి, యానందవిహ్వలుడై యాతడు తన యుత్తరీయము నెగురవైచుచు నానందతాండవము చేయసాగె. చాపలు, పీటలు, దర్భాసనములు పరచి వారందరిని గూర్చుండబెట్టి, స్వాగత సంభాషణములద్వారా వారిని ప్రశంసించి, పత్నీసహితుడై శ్రుతదేవుడు వారందరికి పాదప్రక్షాళన మొనర్చి, యా పవిత్ర పాదజలముచే, తన ఇంటిని కుటుంబ సభ్యుల నందరిని తడిపివైచి నాడు. అతని మనోరథములన్నియు దీరిపోయినవి. హర్షాతిరేకముచే నతడున్మత్తుని వలె నైనాడు. తదనంతరము; సువాసితమగు నిర్మలమధురోదకములు, మృత్తు, తులసీ, కుశ, కమలాది సులభ లభ్యములగు వస్తువులచే, సాత్త్వికాహారముచే నంద రిని యథావిధిగ నర్చించినాడు.

ఆ సమయమందు తన మనమున శ్రుతదేవుడీరీతి తర్కించుకొనసాగినాడు. "గృహమను చీకటి నూతియందుబడియున్న నావంటి యభాగ్యునకు, శ్రీకృష్ణ భగవానునియొక్కయు, నతనికి నివాసస్థానములై సమస్త తీర్థములనుగూడ తమ పాదరజముచే పవిత్రీకృతముచేయు మహానుభావులగు ఋషులయొక్కయు, సమా గమమెటుల లభించినది?" అందరు నాతిథ్యమును స్వీకరించి సుఖముగ విశ్రమించి యున్న సమయమందు, శ్రుతదేవుడు తన భార్యాబిడ్డలందరితోగూడి వారికి సేవ చేయుచుండె. అప్పుడు శ్రీకృష్ణ భగవానుని పాదములు స్పృశించి, శ్రుతదేవుడాత నితో నిట్లు వచించె.

"ప్రభూ, నీవు వ్యక్తావ్యక్తమగు ప్రకృతికంటెను జీవులకంటెనుగూడ పరుడ వగు పురుషోత్తముడవు. నీ దర్శనము నాకీనాడే కలుగలేదు. నీవు యేనాడు స్వీ సర్వశక్తులతో జగత్తును రచించి ఆత్మసత్తారూపముతో దానియందు ప్రవేశించితివో

ఆనాటినుండియు లోకులందరితో కలిసి యున్నావు. నిదురించుచున్న పురుషుడు స్వప్నావస్థయందవిద్యావశుడై, తన మనస్సునందే జగత్తును సృష్టించుకొని, దాని యందుపస్థితుడై, యనేక రూపములతో ననేక కర్మలు చేయుచున్నటుల యెట్లు ప్రతీతుడగుచుండునో, అదేవిధముగ, నీవు నీయందే నీమాయచే జగత్తును కల్పించి, దానియందు నీవు ప్రవేశించి, యనేక రూపములతో ప్రకాశించుచున్నావు. ఏ మానవులు సర్వదా నీలీలాకథలను శ్రవణ-కీర్తనములు చేయుచు, నీ ప్రతిమలకు అర్చన-వందనాదుల చేయుచు, పరస్పరము నిన్ను గూర్చియే చర్చించుకొనుచుందురో, వారి హృదయములు విశుద్ధము లగును. అపుడు నీవు వానియందు ప్రకాశించెదవు. ఎవరి చిత్తములు లౌకిక వైదికాది కర్మవాసనలచే బహిర్ముఖములై యుండునో, వారి హృదయములందు నీవున్నప్పటికిని వారికి చాల దూరమునందే యున్నట్లుందువు. కాని, యెవరు నీగుణసంకీర్తనము గావించుచు, తమ యంతఃకరణములను సద్గుణ సంపన్నములు గావించుకొందురో, వారికి, చిత్తవృత్తులచే నగ్రాహ్యుడవగు నీవు, అత్యంత నికటవర్తివై యుండెదవు. ఆత్మతత్త్వము నెఱిగిన వారలకు, ఆత్మ రూపముగనే నీవు స్థితుడవై యుందువు. శరీరాదులనే యాత్మగాభావించుచుండు వారలకు నీవు, అనాత్మను పొందెంచునట్టి మృత్యురూపివై యుండెదవు. మహత్త్వాది కార్యద్రవ్యములను, ప్రకృతిరూపమగు కారణమును నియమించు శాసకుడవు నీవు. నీమాయ నీదృష్టిపై తన తెరను గప్పలేదుగాని, ఇతరుల దృష్టిని గప్పివేయగలిగి యుండును. నీకు నమస్కరించుచుంటిని. మేము నీ సేవకులము. మేము నీకేమి సేవజేయవలయునో ఆజ్ఞాపింపుము. నేత్రములద్వారా నిన్ను సందర్శించనంతవరకే జీవులకు క్లేశములు కలుగుచుండును. ఆ క్లేశములన్నియు నీ సందర్శనముతో పరిసమాప్తి చెందును"

శరణాగత త్రాణపరాయణుడగు భగవానుడు శ్రుతదేవుని ప్రార్థనను విని, తనచేతితో నతని కరమును గ్రహించి, మందహాసము చేయుచు నిటుల పలికె.

"ప్రియశ్రుతదేవా, యీ మహర్షులందరును నిన్ననుగ్రహించుటకే యిచటికేతెంచియున్నారు. వీరందరును లోకులను లోకములను తమ పాదధూళిచే పవిత్రము గావించుచు, నాతోపాటు విహరించుచుందురు. దేవతలు, పుణ్యక్షేత్రములు, తీర్థములు, మొదలగునవి దర్శన, స్పర్శన, అర్చనాదులద్వారా, క్రమక్రమముగా చాలదినములకుగాని పవిత్రము చేయజాలవు. కాని, సత్పురుషులు తమ దృష్టిప్రసార మాత్రముచేతనే సమస్తమును పవిత్రము గావించుచుందురు. అంతేగాదు. దేవతాదులందున్న పవిత్రీకరణశక్తిగూడ సత్పురుషుల దృష్టిచేతనే ప్రాప్తించుచున్నది. శ్రుతదేవా, బ్రాహ్మణుడు జన్మచేతనే సర్వప్రాణులలోను శ్రేష్ఠుడు. అట్టివాడు, తపస్సు, విద్య, సంతోషము, నాయుపాసన,స నాభక్తిగూడ కలిగియున్నచో నిక

చెప్పెడిదేమి? నాయీ చతుర్భుజరూపముగ ద బ్రాహ్మణుల కంటె నాకెక్కువ ప్రియ
తరముగాదు. బ్రాహ్మణులు సర్వవేదమయులు. నేను సర్వదేవమయుడను. దుర్బుద్ధి
యగువాడీ విషయమును గుర్తించక, కేవలము మూర్త్యాదులందే పూజ్యబుద్ధిగలవాడై
గుణములందు దోషాన్వేషణ యొనర్చుచు, నా స్వరూపములు అనగా ఆత్మ స్వరూ
పులేయగు-జగద్గురువులగు-బ్రాహ్మణులను ద్వేషించుచుందురు. బ్రాహ్మణుడు నా
సాక్షాత్కారమును పొంది, తన చిత్తమునందు, ఈ చరాచర జగత్తు, దానికి సంబం
ధించిన భావనలు, దానికి కారణములయిన ప్రకృతి మహత్తత్త్వాదులు అన్నియును
ఆత్మస్వరూపుడగు భగవానుని రూపములేయను నిశ్చయము గలిగి యుండును.
కావున, శ్రుతదేవా, యీ బ్రహ్మర్షుల నందరిని నా స్వరూపులుగనే భావించి నీవు
వారిని పూజించుము. అట్లొనర్చినచో, ననాయాసముగ, నన్ను పూజించిన ఫలము
నీకు కలుగును. కానిచో, బహుమూల్యములగు పదార్థములతో నన్ను పూజించినను,
నీకట్టి ఫలము లభింపనేరదు" అనియె.

"భగవానుని యాదేశము పొంది శ్రుతదేవుడు, యేకాత్మభావముతో బ్రహ్మ
ర్షులనందరి నారాధించి వారి యనుగ్రహముచే భగవత్స్వరూపమును పొందినాడు.
బహులాశ్వునకుగూడ నట్టి సద్గతియే లభించినది. భక్తులు భగవానునియందు భక్తి
కల్గియుండునట్లే భగవానుడు భక్తులందు భక్తిగల్గి యుండును. తన యిద్దరు భక్తు
లను తృప్తిపరచుచు కొన్నిదినములు మిథిలయందుండి సదుపదేశములు గావించి
శ్రీకృష్ణుడు ద్వారకకేగె.

# ఎనుబది ఏడవ యధ్యాయము

## వేదస్తుతి (శ్రుతిగీతలు)

"మహాత్మా, బ్రహ్మ కార్యకారణముల కతీతుడు. త్రిగుణములు బ్రహ్మపదా
ర్థమునందు లేవు. మనస్సు, మరియు వాక్కు యొక్క సంకేత రూపములచే నిర్దేశిం
చుటకు వీలులేనట్టిది. రెండవవైపు శ్రుతులయొక్క విషయములు గుణయుక్తములే
యైయున్నవి. (అనగా, యే విషయమును వర్ణించినపుడద్దానికి సంబంధించి, గుణము,
జాతి, క్రియ, లేక రూఢినే నిర్దేశించుచుండును.) అట్టిచో గుణ వృత్తులుగల శ్రుతులు
నిర్గుణ బ్రహ్మనెట్లు ప్రతిపాదించుచున్నవి? ఏలననగా నిర్గుణ వస్తు స్వరూపము వాని
కందునదిగాదు గదా" యని ప్రశ్నించిన పరీక్షిత్తునకు శ్రీశుకయోగి యిట్లు సమాధాన
మొసంగె.

"మహారాజా, [భగవానుడు సర్వశక్తి సమన్వితుడు. గుణములకు గని.
శ్రుతులు స్పష్టముగా సగుణ నిరూపణమే చేయుచున్నవి. కాని విమర్శించినచో వాని

తాత్పర్యము నిర్గుణమేనని తెలుచున్నది). భగవానుడు జీవులకు బుద్ధిని, ఇంద్రియములను, మనస్సును, ప్రాణములను సృష్టించినాడు. వాని ద్వారా వారు, స్వేచ్ఛగా, చతుర్విధ పురుషార్థములను సాధించగలుగుదురు. (ప్రాణములద్వారా జీవన ధారణము, శ్రవణాదీంద్రియముల ద్వారా, మహా వాక్యాది శ్రవణము, మనస్సు ద్వారా, మననము, బుద్ధి ద్వారా నిశ్చయము గావించిన శ్రుతుల తాత్పర్యమగు నిర్గుణ సాక్షాత్కారము కలుగును. కావున శ్రుతులు సగుణమును ప్రతిపాదించినను, వస్తుతః నిర్గుణ ప్రతిపాదకములే యగుచున్నవి.)

బ్రహ్మ ప్రతి పాదకములగు నుపనిషత్తుల స్వరూపమిదియే. ఆద్యులగు సనకాదులు ఆత్మ నిశ్చయము ద్వారా దీనిని ధరించియుండిరి. ఏ మానవుడు శ్రద్ధా పూర్వకముగ దీనిని ధారణ యొనర్చునో, వాడు సమస్త బంధములకు కారణములగును పాధులనుండియు, అనాత్మభావములనుండియు ముక్తుడై తన పరమ కల్యాణ స్వరూపమగు పరమాత్మ ప్రాప్తినందగలడు. ఈ సందర్భమున నీకొక గాథ వినిపించెదను. ఆ గాథతో స్వయముగ నారాయణునకు సంబంధముగలదు. ఆ గాథ దేవర్షియగు నారదునకు నారాయణ ఋషికి జరిగిన సంవాదము.

ఒకానొక సమయమున భగవానుని ప్రియ భక్తుడగు నారదుడు, విభిన్న లోకములందు సంచరించుచు, సనాతన ఋషియగు నారాయణ ఋషిని దర్శించుటకై బదరికాశ్రమమునకేగె. నారాయణ ఋషి, మానవాభ్యుదయమునకును, పరమనిఃశ్రేయసము (మోక్షము)నకును, భారత వర్షమందు, కల్ప ప్రారంభ సమయమునుండియే, ధర్మ, జ్ఞాన సంయమము గలవాడై గొప్ప తపస్సాచరించుచుండె. ఒకనాడతడు కలాప గ్రామ వాసులగు సిద్ధ ఋషుల మధ్య గూర్చుండియుండె. అప్పుడు నారదుడతనికి నమస్కరించి, వినయపూర్వకముగ, నీవిపుడు నన్నడిగినట్టులనే యతనిని ప్రశ్నించినాడు. పూర్వ కాలమందు జనలోకనివాసులు పరస్పరము, వేదముల తాత్పర్యము, బ్రహ్మస్వరూప సంబంధ విషయములను విచారించు సమయమందు చెప్పబడిన యొక కథను, నారాయణ ఋషి, ఋషుల నిండు సభయందు, నారద మహర్షికి వినిపించినాడు.

"నారదా, ప్రాచీన కాలమునకు సంబంధించిన విషయము. ఒకమారు జనలోకమందు నివసించుచున్న బ్రహ్మమానస పుత్రులగు సనక, సనందనాది బ్రహ్మర్షులు, బ్రహ్మసత్రమును (బ్రహ్మవిషయకమగు విచారములేక ప్రవచనము) చేయుచుండిరి. నీవపుడు, నాశ్వేతద్వీపాధిపతియగు అనిరుద్ధరూపమును సందర్శించుటకై శ్వేతద్వీపమునకు వెళ్ళియుంటివి. అపుడచట బ్రహ్మవిషయకమగు సుందరమగు చర్చ జరుగుచుండినది. శ్రుతులుగూడ నిర్ణయించలేక మౌనము వహించి, తాత్పర్యరూపమున లక్షింపజేయుచు సుఖముగ నుండిపోయినవి. ఆ బ్రహ్మ సత్రమందు, నీ విపుడొసర్చిన ప్రశ్నయే వచ్చినది. సనక, సనందన, సనత్సుజాత, సనత్కు

మారులను నల్వురు బ్రహ్మమానస పుత్రులును, శాస్త్రీయజ్ఞానము, తపస్సు, శీల స్వభావములందు సమానులే. శత్రు,మిత్ర, ఉదాసీన భావములు లేకుండువారు. అయి నను వారు తమలోనివాడగు సనందనుని వక్తగా నొనర్చి, మిగిలినవారు శ్రోతలై బ్రహ్మవిచారమును ప్రారంభించిరి. అపుడు సనందను డిట్లులనియె.

"ప్రాతఃకాలము కాగానే, నిదురించుచున్న సార్వభౌముని మేల్కొలుపుటకై యాశ్రితులగు వందీజన మేతెంచి, యతని పరాక్రమాదిసుయశమును గానముచేయుచు నతనిని మేల్కొలుపుచుండు విధముగా, పరమాత్మ తాను సృష్టించిన జగత్తునంతయు తనయందే లీనమొనర్చుకొని, సర్వశక్తి సంయుతుడై నిదురించుచుండునపుడు, ప్రళ యాంతమున శ్రుతులు బ్రహ్మ ప్రతిపాదకములగు వాక్యములతో, యీ విధముగా పరమాత్మను మేల్కొలుపుచుండును.

# శ్రుతి గీతలు

"అజితా, సర్వశ్రేష్ఠుడవగు నీకు జయమగుగాక. నీవు సమస్త ఐశ్వర్య పరి పూర్ణుడవుగావున, చరాచరప్రాణుల బంధించుచున్న యీ మాయను నాశన మొన ర్పుము. గుణమయమగు యీ మాయదోషముకొరకే-అనగా జీవులకు సహజమగు ఆత్మస్వరూపము నాచ్ఛాదించుటకే, సత్త్వాదిగుణముల గ్రహించియున్నది. జగత్తు నందుగల సమస్తసాధనములు, జ్ఞానము, క్రియ, మొదలగు శక్తులన్నిటిని జాగృ తము చేయునట్టివాడవు నీవేగనుక, నీవు తొలగించిననేగాని యీ మాయ తొలగి పోదు. (ఇందుకు ప్రమాణము నీ శ్వాసభూతలగు శ్రుతులే-అనగా మేమే) మేము నిన్ను యథార్థముగ వర్ణింపలేకపోయినను, యెప్పుడైనా నీవు మాయద్వారా జగ త్తును సృష్టించి సగుణరూపము దాల్చియో, లేక దానిని నిషేధించి స్వరూపస్థితికి చెందిన లీలగావించుచునో, లేక సచ్చిదానంద స్వరూపమగు శ్రీ విగ్రహమును ప్రక టించి క్రీడించుచునో, యున్నప్పుడు, యేకొద్దిగనో మేము నిన్ను వర్ణించుటకు సమర్థులమై యుందుము.

మా ద్వారా యింద్రాది దేవతలు గూడ వర్ణింపబడుచున్నారు. కాని మా (శ్రుతులయొక్క) మంత్రములన్నియును, మంత్రద్రష్టలగు మునీశ్వరులందరు గూడ, ప్రతీతమగుచున్న యీ సమస్త జగత్తును బ్రహ్మ స్వరూపముగనే యనుభ వించుచున్నారు. ఏలననగా యీ ప్రపంచములేనపుడు గూడ నీవు శేషించుయుండుట చేత. ఘటశరావాది వికారములన్నియు, మట్టినుండే పుట్టి మట్టియందే లయించు చున్నట్లు, యీ జగత్తంతయును నీయందే పుట్టి నీ యందే లయించుచున్నది, అట్టిచో నీవును పృథివలె వికారములు కలవాడవా? కావు. నిర్వికారుడవు. కావున

యీ జగత్తు నీ యందుత్పన్నము కాలేదు, అయినట్లగుపించుచున్నది. కావున ఘట శరావాదుల వర్ణనగూడ, మట్టివర్ణన యే యగుచున్నటుల, యింద్రవరుణాదుల వర్ణన గూడ నీవర్ణనయేయగును. ఈ కారణముచేతనే విచారణ స్వభావముగల ఋషులు, మనసునందేది యాలోచించుచున్నను, యేది మాటాడినను, నీయందే స్థితులైయుండి, నిన్నే దర్శించుచుందురు. మనుజుడు తన పాదములు దేనిపైనుంచినను-యిటుకపై గాని, రాతిపైగాని లేక కొయ్యపైగాని—సర్వము పృథివీ స్వరూపమే యగుటచేత, పృథివిపైనుంచినట్లేయగును. కావున, మేమే నామమును వర్ణించినను, యే రూపమును వర్ణించినను అదియంతయు నీ నామము, నీ రూపమేయగును.

మహాభాగా, త్రిగుణాత్మకమగు మాయచే నిర్మితమైన మంచి-చెడు భావములు, లేక క్రియలలో, యీ లోకులు చిక్కుపడియుందురు. కాని నీవా మాయా నటికి స్వామివి. దానిని నాట్యము చేయించువాడవు. అందుచే విచారశీలురగు పురుషులు, నీ లీలా కథామృత సాగరమందు మునుకలువేయుచు, తమ పాప తాపములను క్షాళనమొనర్చుకొందురు. నీ లీలా కథలు సర్వజీవుల మాయామలములను నష్టమొనర్చునట్టివేగదా! పురుషోత్తమా, అట్టిచో ఆత్మజ్ఞానముచే రాగద్వేషాదులను (అంతఃకరణయందలి) శరీరముయొక్క కాలకృతములగు జరామరణములు మొదలగు దోషములను నాశనమొనర్చుకున్న మహాపురుషులు, నిరంతరము నీ స్వరూపానుభూతియందు నిమగ్నులైయుండువారు, తమ పాపతాపములను సంపూర్తిగా భస్మమొనర్చుకొని శాంతులైయుందురను విషయము వేరే చెప్పవలయునా?

ప్రాణధారులయొక్క జీవన సాఫల్యత, నిన్ను భజించి, సేవించుటయందే యున్నది. నీ యాజ్ఞ పాలించుటయందేయున్నది. అట్లు చేయనిచో వారి జీవితము వ్యర్థము. వారి యందూపిరి యాడుట కొలిమితిత్తియందలి గాలివంటిదేయగును. మహత్తత్త్వాహంకారాదులు నీ యనుగ్రహముచేతనే—నీవు వానియందు ప్రవేశించినందుననే యీ బ్రహ్మాండమును సృష్టించగల్గుచున్నవి. పంచకోశములందు పురుష రూపముననుండి "నేను-నేను" అను స్ఫూర్తి కల్గించుచున్నది నీవే. నీయునికిచేతనే ఆ కోశములయొక్క అస్తిత్వానుభవము కల్గుచున్నది. అవిలేకున్నను అంతిమావధిరూపమున నీవు విరాజమానుడవగుచుందువు. ఈ ప్రకారము వానితో కూడియుండి, అన్నింటికి నవధిగానున్నప్పటికిని నీవు అసంగుడవేయైయుందువు. ఏలననగా, వృత్తులద్వారా "ఉన్నది", "లేదు" అనురూపములలో ననుభూతియగుచున్న సమస్త కార్యకారణములన్నింటికి నీవు నిజముగ నతీతుడవుగదా. "నేతి,నేతి"యను వాక్యములచే సర్వము నిషేధింపబడగా శేషించువాడవు. దానికి సాక్షివి నీవే. ఏకమాత్ర సత్స్వరూపుడవు. (నీ భజనలేని జీవితము వ్యర్థము. ఏలనన, వాడీ సత్యము నుండి వంచితుడగుచున్నాడు.)

"ఋషులు నిన్ను పొందుట కనేక మార్గముల నాలోచించినారు. వారి యందు స్థూలదృష్టిగలవారు, మణిపూరక చక్రమందు అగ్నిరూపముతోనున్న నిన్నుపా సించుచున్నారు. అరుణ వంశీయులగు ఋషులు, సమస్తనాడులకు కేంద్ర స్థానమగు హృదయమునందు నీ పరమ సూక్ష్మరూపమగు దహర బ్రహ్మనుపాసించు చున్నారు. హృదయము నుండియే, నిన్ను పొందుటకు శ్రేష్ఠమార్గమగు సుషుమ్నా నాడి, బ్రహ్మరంధ్రమువరకు వ్యాపించియున్నది. ఆ జ్యోతిర్మయ మార్గము ననుస రించినవాడు దానిగుండా పైకివెళ్ళి, మరల జన్మమృత్యురూపమగు సంసారమునందు బడకయుండును.

ప్రభూ, దేవ, మనుష్య పశుపక్ష్యాది యోనులన్నింటిని నీవే యేర్పరచితివి. సదా, సర్వత్ర, సర్వరూపము లందునను నీవే యున్నాడవు. కావున, కారణరూప మున నీవు వానియందు ప్రవేశింపకున్నను, వానియందు ప్రవేశించినట్లే భావింపబడు చున్నావు. విభిన్నములగు ఆకృతుల ననుకరించి, ఒకచో నుత్తమ, మఱియొకచో నధమ రూపములతో ప్రతీతుడవగుచుందువు. అగ్ని పెద్ద-చిన్న కర్రలద్వారా లేక కర్మలద్వారా అధిక, అల్ప పరిమాణములుగను, లేక ఉత్తమాధమ రూపములతోను గోచరించునటులనే, నీవును కనపడుచుందువు. అందుచే సత్పురుషులు, లౌకిక, పారలౌకిక వ్యాపారమునుండి, వానిఫలములనుండి విరక్తులై, తమ నిర్మలబుద్ధిచే, సత్యాసత్యములను, ఆత్మానాత్మలను గుర్తించి, జగత్తుయొక్క మిథ్యారూపమందు జిక్కుకొనక యుందురు. సర్వత్ర సమభావముతోనుండు నీ సత్యస్వరూప సాక్షా త్కారమును పొందుచుందురు.

"ప్రభూ, జీవుడే శరీరమందున్నను, ఆ శరీరములన్నియు వాని కర్మద్వారా నిర్మితములై నట్టివే. ఆ యావరణములకు ఉనికియే లేనందున, వాస్తవముగా జీవుడు కార్యకరణ రూపములగు ఆవరణలు లేనివాడే. వాడు, సమస్త శక్తులను ధారణ చేయునట్టి నీస్వరూపమేనని తత్త్వజ్ఞానులగు పురుషులు వచించుచున్నారు. నీ స్వరూపుడే యగుటచేత నతడు నీ యంశే గాకపోయినను, అంశయని చెప్పుచు న్నారు. మరియు, నిర్మింపబడినవాడు గాకపోయినను, నిర్మితుడని పలుకుచున్నారు. ఇందుచేత, బుద్ధిమంతులగువారు జీవుని యథార్థ స్వరూపముపై విచారణ యొనర్చి, పరమవిశ్వాసముతో నీ చరణముల నుపాసించుచున్నారు. సమస్త వైదిక కర్మలకు సమర్పణ స్థానములు, మోక్షస్వరూపములు నీ చరణములే గదా!

ప్రభూ, పరమాత్మ తత్త్వజ్ఞానము సంపాదించుట చాల కఠినము. ఆ జ్ఞానము కలిగించుటకే నీ వనేక యవతారములు దాల్చుచుందువు. ఆ యవతారములద్వారా, అమృత మహాసాగరముకంటె గూడ మధురములు, మాదకములునగు లీలలొనర్చు

చుందువు. ఆ లీలలను సేవించువారు తమ శ్రమసంతయు దూరము గావించుకొని, పరమానంద మగ్నులగుచుందురు. కొందరు ప్రేమభక్తులు నీ లీలాకథలను విడిచి మోక్షమునుగూడ నభిలషించరసగా, స్వర్గాదుల మాట వేరే చెప్పవలయునా? వారు, నీ చరణకమలముల ప్రేమించుచుండు పరమహంసల సత్సంగమందు నీకథ లాలించుచు, యీ జీవితమందు తమకు లభించిన గృహారామాదులనుగూడ త్యజించునంతటి సుఖమును పొందుచుందురు.

"స్వామీ, ఈ శరీరము నీ సేవాసాధనమై, నీ మార్గమందనురాగము కలిగియుండునపుడు, ఆత్మ, శ్రేయోభిలాషి, స్నేహితుడు, ప్రియవ్యక్తివలె వ్యవహరించును. నీవు జీవునకు నిజమగు హితైషివి, ప్రియతమ ఆత్మ స్వరూపుడవు. జీవుని నీలోనైక్య మొనరించుకొనుటకే యెల్లపుడును ప్రయత్నించుచుందువు. ఇంత సౌలభ్య ముండియు, దాని కనుకూలమగు మానవ శరీరము లభించిననుగూడ, మానవులు సఖ్యభావాదులతో నిన్నుపాసించక, నీయందే క్రీడించక, ఈ నశ్వరమగు శరీరము, దానికి సంబంధించిన వానియందే రమించుచున్నారు. వానినే యుపాసించుచున్నారు. ఈ విధముగ నాత్మహత్య గావించుకొనుచు అధోగతి పాలగుచున్నారు. ఇది యెంత బాధాకరమగు విషయము! దీని ఫలితముగ నతని మనోవృత్తులన్నియు, సమస్త వాసనలును, శరీరాదులందే లగ్నమైపోయి, వాని కారణముగ పశుపక్ష్యాది నీచ జన్మలెత్తవలసి వచ్చుచుండును. ఈ విధముగ నత్యంత భయావహమగు జన్మ మృత్యురూప సంసారమందు పరిభ్రమించవలసి వచ్చుచుండును.

మనసశీలురగు యోగులు, యతీశ్వరులు, తమ ప్రాణేంద్రియ మనస్సులను వశమందుంచుకొని దృఢమగు యోగాభ్యాసముద్వారా, హృదయమందు నిన్నుపాసించుచుందురు. కాని యాశ్చర్యకరమగు విషయమేమనగా, వారికెట్టి సద్గతి లభించుచున్నదో యట్టిగతి, నిన్ను ద్వేషించుచుండు శత్రువులకుగూడ లభించుచున్నది. ఏలననగా, శత్రువులుగూడ వైరభావముతోనైనప్పటికిని నిన్ను స్మరించుచునే యున్నారుగాన. ఇంకా యెంతని చెప్పగలము? అజ్ఞానవశముచే నిన్ను పరిచ్ఛిన్నునిగా భావించి, యురగేంద్రునివలె సుకుమారములగు నీ భుజములందు కామభావముతో నాసక్తిగలవారైన యాస్త్రీలకు, యెట్టి పరమపదము లభించినదో, అట్టిపరమ పదమే - నిన్నెపుడు సేవించుచు నాత్మానుభూతి కలిగియుండు (శ్రుతులకు) మాకును లభించుచున్నది. వారు మేము సమానమే గదా! ఏలకాదు? నీవు సమదర్శివిగదా!నీదృష్టిలో, ఉపాసకునియొక్క, పరిచ్ఛిన్న-లేక-అపరిచ్ఛిన్న భావములలో భేదము గానరాదు.

మహాభాగా, నీవు అనాదివి. అనంతుడవు. జన్మమరణములు కాలముచే పరిమితము చేయబడినవారు నిన్నెట్లు తెలుసుకొనజాలుదురు. స్వయముగ పరమేష్ఠియు, నివృత్తపరాయణులగు సనకాదులు, ప్రవృత్తి పరాయణులగు మరీచ్యాదులుగూడ, చాలకాలము తరువాత నీచే నుత్పన్నులైనవారే. సర్వమును లయ

మొనర్చి నీవు నిదురించి యుండునప్పుడు, సాధనములన్నిటితో నిదురించియుండు జీవునకు, నిన్ను తెలుసుకొను సాధనమేమియు మిగిలియుండదు. ఆకాశాది స్థూల జగత్తుగాని, మహత్తత్త్వాది సూక్ష్మజగత్తుగాని యప్పుడుండవుగదా. వీటి రెంటిచే నేర్పడిన శరీరము, దానికి నిమిత్తములగు, క్షణముహూర్తాది కాలాంగములు గూడ నుండవు. అప్పుడేమియు నుండదు. శాస్త్రముగూడ నీయందే లయించియుండును. (అట్టి స్థితియందు నిన్ను తెలుసుకొనవలయునని ప్రయత్నించక,నిన్ను భజించుటయే సర్వోత్తమమగు మార్గము.)

"ప్రభూ, కొందరు అసత్తునుండి జగత్తుత్పన్నమగుచున్నదని చెప్పుచు న్నారు. కొందరు సత్తునుండి కల్గుచున్నదనుచున్నారు. సత్తువలన, దుఃఖనాశము కలుగుటయే ముక్తియని కొందరనుచున్నారు. కొందరాత్మ యనేక మనుచుండ, మఱికొందరు కర్మలద్వారా లభించు లోక-పరలోక వ్యవహారము సత్యమని వాదించుచున్నారు. అన్ని వాదనలు భ్రాంతి జనితములేనని, ఆరోపించియే యిట్లుప దేశించుచున్నారనుటలో సందేహములేదు. పురుషుడు త్రిగుణాత్మకుడు. ఇట్టి భేద భావము కేవలము అజ్ఞానముచేతనే కలుగుచున్నది. ఈ యజ్ఞానమున కతీతుడవు నీవు. కావున జ్ఞానస్వరూపుడవగు నీయందు యెట్టి భేదభావమును లేదు.

ఈ త్రిగుణాత్మకమగు జగత్తు కేవలము మనస్సుచే కల్పితము. అంతేకాదు. పరమాత్మకంటె, జగత్తుకంటె వేరుగా కనుపించు పురుషుడుగూడ కల్పనామాత్రుడే, ఇది వాస్తవముగా అసత్తేయైనను తన కధిష్ఠానమగు నీ సత్తచేత, సత్తువలె ప్రతీతమగుచున్నది. అందుచే భోక్త, భోగ్యము వీటి రెంటి సంబంధమును సిద్ధము చేయునట్టి యింద్రియాదులచే నిండియున్న జగత్తునంతటిని, ఆత్మజ్ఞానులగువారు, ఆత్మరూపముతో సత్యమని యంగీకరించుచుందురు. బంగారుచే చేయబడిన కంకణ ములు, కుండలములన్నియు స్వర్ణరూపములేగదా, కావున వానినారూపముతో జూచు వాడు, అంతయు బంగారమేయని గ్రహించినవాడై వానిని విడువకయుండును. అదే విధముగ యీ జగత్తు ఆత్మయందు కల్పితమై, ఆత్మచేతనే వ్యాప్తమైయున్నందున, ఆత్మజ్ఞానులు దీనిని ఆత్మరూపముగనే దర్శించుచుందురు.

ప్రభూ, నీవు సమస్త ప్రాణులకు, పదార్థములకు అధిష్ఠానమని గుర్తించిన వారు, సర్వాధారుడవగు నిన్ను సర్వాత్మ భావముతో సేవించుచుందురు. వారు మృత్యువును గూడ తుచ్ఛముగ భావించి, దానితలపై తన్నెదరు. అనగా మృత్యుం జయులగుదురు. నీయందు విముఖులగువారు, వారెంత గొప్ప విద్వాంసులైనను, వారిని నీవు కర్మ ప్రతిపాదకములగు శ్రుతులచే పశువులతో సమానముగ బంధించి యుంతువు. అందుకు భిన్నముగా, నీతో ప్రేమ సంబంధము కలిగియుండువారు, తాము తమనేగాక, యితరులను గూడ పవిత్రము గావించి, జగత్తుయొక్క బంధ

ముల నుండి విడిపించుచుందురు. ఇట్టి యదృష్టము, నీ యెడల విముఖులై యుండు వారలకెట్లు లభించగలదు?

ప్రభూ, నీవు మనస్సు, బుద్ధి,యింద్రియాది కరణములును, చింతన-కర్మాది సాధనములును లేనివాడవు. అయినను సమస్త అంతఃకరణములతోను, బాహ్యకరణముల శక్తులతోడను సర్వదా సంపన్నుడవై యుందువు.స్వతస్సిద్ధ జ్ఞాన స్వరూపుడవు, స్వయం ప్రకాశుడవు నగుటచేత, నీవేపని చేయుటకైనను యింద్రియముల యవసరముండదు. చిన్న చిన్న సామంత రాజులు తమ ప్రజల నుండి పన్నులు వసూలుచేసి, తాము తమ సార్వభౌమునకు కప్పము చెల్లించునట్లు, మనుష్యులకు పూజ్యులగు దేవతలు, దేవతలకు పూజ్యులగు బ్రహ్మాదులు గూడ, తమ నాశ్రయించు ప్రాణుల పూజలను స్వీకరించి, మాయకధీనులై, నిన్ను పూజించుచుందురు. నీవు వారి నెక్కడ ఏవిధముగ పనిచేయుటకు నియమింతువో, వారా పనులనావిధముగా నక్కడ-నీయందు భయభక్తులుకలవారై-నిర్వర్తించుచు, నిన్ను ఆ ప్రకారము పూజించుచున్నారు.

నిత్యముక్తా, నీవు మాయాతీతుడవు. అయినను యీక్షణమాత్రము చేతనే,-సంకల్పమాత్రముచేతనే-మాయతో క్రీడించుచుందువు. నీ సంకేతము పొందగనే, జీవులయొక్క సూక్ష్మశరీరములు, వానియందు నిద్రాణములైయున్న కర్మవాసనలు [సంస్కారములు] జాగృతములై చరాచర ప్రాణి సృష్టి జరుగుచున్నది. ప్రభూ, నీవు పరమ దయాళుడవు. ఆకాశమువలె సర్వసముడవై యుండుటచేత, నీకునీవాడు పరాయివాడు అను భేదము లేకుండును. నిజమునకు నీ స్వరూపములోనికి,మనస్సు, వాక్కుచేరజాలవు. (మనోవాచా మగోచరుడవు). నీయందు కార్యకారణరూపమగు ప్రపంచముయొక్క అభావముండుటచేత, బాహ్యదృష్టికి నీవు శూన్యుడవుగ గోచరించుచుందువు. కాని యా దృష్టికి గూడ అధిష్ఠానుడవగుటచేత నీవు పరమ సత్య స్వరూపుడవు.

"స్వామీ, నీ వఖండైక రసస్వరూపుడవు. జీవులసంఖ్యాకులై, వారందరు నిత్యులు సర్వవ్యాపకులునైనచో, వారందరును నీతో సమానులే యగుదురు. అట్టి పరిస్థితిలో వారు శాసితులు, నీవు శాసకుడవు నగుట కుదరనే కుదరదు. అపుడు వారిని నీవు నియమించనే జాలవు. వారు నీచే నుత్పన్నులై, నీకంటె తక్కువవారై యుండునపుడే నీచే నియంత్రితులగుట సంభవించును. సమస్త జీవులు వారి యేకత్వము గాని, విభిన్నత్వముగాని, సర్వము నీ నుండి కలిగినవే. కావుననే, నీవు వారియందు కారణ రూపమున నున్నప్పటికిని, నీవు వారి నియామకుడవే. యథార్థముగా నీవు వారియందు సమరూపమున స్థితుడవై యున్నావు. కానీ నీరూప మెటులుండునో యెవరు నెఱుగ జాలకయుందురు. తమకు తెలుసునని భావించువారు, యథార్థముగా నిన్నెరుగరు. వారు తమ బుద్ధికి విషయమగు (గోచరమగు) దానిని

మాత్రమే తెలుసుకొనిరిగాని, నీవా బుద్ధికంటె పరుడవు గదా! మతుల ద్వారా తెలుసుకొనబడు వస్తువులన్నియును, మతములందలి విభిన్నత్వముచేత, భిన్న భిన్నములుగా నుండును. ఇందుచే వాని యందలి దుష్టత్వము, ఒకమతముతో మఱియొక మతమునకు గల వైరుధ్యము మనకు ప్రత్యక్షముగ గోచరించుచునే యున్నవి. కావున, నీ స్వరూపము సర్వమతముల కతీతమై యున్నది.

"స్వామీ, జీవుడు నీ వలన నుత్పన్నుడగుచున్నాడని చెప్పుటలో, నీవు జీవ రూపమున పరిణమించితివని యర్థముగాదు. సిద్ధాంతమేమనగా, ప్రకృతి, పురుషులిర్వురును జన్మరహితులే. అనాదులే. అనగా వారి వాస్తవిక స్వరూపము నీవే. వృత్తులలోని కెన్నడు దిగువాడవుగావు. జన్మను స్వీకరించవు. అప్పుడు ప్రాణులకు జన్మ యెట్లు కలుగును? అజ్ఞాన కారణమున, ప్రకృతిని పురుషునిగను, పురుషుని ప్రకృతిగను గ్రహించుట చేత, ఒకరికి మరియొకరితో సంయోగము గలుగుటచేత జలబుద్బుదమువలె జన్మ కలుగుచున్నది. జలబుద్బుదము స్వతంత్ర వస్తువుగాదు. కాని యుపాదాన కారణమగు జలము, నిమిత్త కారణమగు వాయువుల సంయోగముచే దాని సృష్టి జరుగుచున్నది. ప్రకృతియందు పురుషుని, పురుషునియందు ప్రకృతిని అధ్యాస (ఒకరి యందు మఱియొకరి కల్పన) గావించుట చేత జీవులకు వివిధ నామములు, గుణములు కల్పింపబడుచున్నవి. చివరకు, సముద్రమందు నదులన్నియు కలిసిపోవునట్లు, అన్ని పుష్పములయందలి రసము తేనెయందు కలిసి పోవునట్లు, వారందరును ఉపాధి రహితుడవగు నీ యందు లయించి పోవుదురు. [కావున జీవుల భిన్నత్వము, వారి పృథగస్తిత్వము నీచే నియంత్రితములగుచున్నవి. వారి స్వతంత్ర, సర్వ వ్యాపకత మొదలగునవి, సత్యమును గుర్తించని కారణము చేతనే భావింపబడుచున్నవి.]

"భగవానుడా, జీవులందరును నీ మాయచే భ్రాంతియందు మునిగియున్నారు. తాము నీకంటె భిన్నులమని భావించుచు సంసారసాగరము నీదుచున్నారు. కాని బుద్ధిమంతులగు వారు యీ భ్రమను గుర్తించి, సంపూర్ణ భక్తిభావముతో నీకు శరణాగతులగుచున్నారు. ఏలననగా, నీవు సంసార చక్రమునుండి తప్పించువాడవు గదా. శీత, గ్రీష్మ, వర్షాకాలము లను విభాగము కలిగిన కాలచక్రము, నీ భ్రూవిలాస మాత్రమేయైయున్నది. అది నిన్ను సేవించని యందరిని భయభీతులను గావించును. కాని నీకు శరణాగతి యొనర్చిన భక్తులకు, జనన మరణ ప్రవాహ రూపమగు సంసార భయమెట్లు కలుగును?

"జన్మరహితుడవగు ప్రభూ, తమ ప్రాణేంద్రియములను వశపరచుకొనిన యోగులుగూడ, గురుదేవుని చరణముల నాశ్రయించక, ఉచ్ఛృంఖలము చంచలమునగు తమ మనస్సను గుఱ్ఱమును వశమొనర్చుకొను ప్రయత్నము చేసినచో వారు సఫలీకృతులు కాజాలరు. మాటిమాటికి దుఃఖము కలుగుచుండును. అనేక విపత్తుల

నెదుర్కొనవలసి వచ్చుచుండును. శ్రమ కలుగును. సముద్రమందు కర్ణధారుడు (చుక్కాని పట్టువాడు) లేని నావయందు ప్రయాణముచేయు వ్యాపారులవలె, దిక్కు తెలియని దశ వారికి కలుగును. [తాత్పర్యమేమనగా: మనస్సును వశమొనర్చుకొనవలయునను ప్రయత్నము చేయువారలకు, కర్ణధారునితో సమానుడగు గురువు యొక్క అవసరము తప్పనిసరి. గురువున్నచో, సాధన యొడుదుడుకులు లేకుండ సక్రమముగ సాగిపోగలదు).

"ప్రభూ, నీవఖండానంద స్వరూపుడవు. శరణాగతుల కాత్మస్వరూపుడవు. నీవుండగా స్వజనులు, పుత్రులు, దేహము, స్త్రీ, ధన, గృహ, పృథ్వీ, ప్రాణరథాదులతోనేమి ప్రయోజనము? ఇట్టి సత్య సిద్ధాంతమును తెలియనివారు స్త్రీ-పురుష సంబంధమందు కలుగు సుఖములందే రమించుచుందురు. సంసారమందలి సమస్త వస్తువులును నశించు స్వభావముగలవియే గనుక, వారికందు సుఖము కల్గించునదేది యున్నది? అవియన్నియు సహజముగనే సారహీనములు, సత్తాహీనములు, అవి యేమి సుఖము నివ్వగలవు?

ప్రభూ, ఐశ్వర్యము, సంపద, విద్యా, జాతి, తపస్సు మొదలగు వానిచే కలుగు గర్వములేనివారై యుండు సత్పురుషులీ పృథ్వీతలమందు పరమ పవిత్రులు. వారి హృదయములందు నీచరణారవిందము లెప్పుడును విరాజమానములగుచుండుట చేత, వారందరిని పవిత్రము చేయగల నిజమగు పుణ్యతీర్థ స్థానములైయుందురు. ఆ కారణముచేతనే, యట్టి పుణ్యపురుషులయొక్క చరణామృతము సమస్త పాప తాపముల శాశ్వతముగ నశింపజేయు సామర్థ్యత కలిగియుండును. నీవు నిత్యానందాత్మస్వరూపుడవు. ఏ జీవుడైన నొక్కమారైనను తనమనస్సును నీకు సమర్పించినచో-నీయందు మనస్సును లగ్నమొనర్చినచో, నతడు, జీవుని వివేకము, వైరాగ్యము, ధైర్యము, క్షమా, శాంత్యాది గుణములను సర్వనాశము గావించునట్టి దేహగేహాదిభ్రాంతిలో నెన్నటిని జిక్కుపడడు. అతడు నీయందే క్రీడించుచుండును.

"భగవానుడా, మట్టితో తయారగు ఘటము మట్టిరూపమే యగునట్లు, సత్తు నుండి పుట్టిన జగత్తు సత్తేయగునను మాట యుక్తియుక్తముగాదు. ఏలననగా, కార్యకారణ నిర్దేశములే వాని భేదద్యోతకములగుచున్నవి. భేదమును నిషేధించుటకు మాత్రమే యటుల చెప్పబడినచో, తండ్రి కొడుకులందు, దండము-ఘటనాశము నందు, కార్యకారణ భావమున్నప్పటికిని, అవిపరస్పరభేదము గల్గియేయున్నవి. ఈ ప్రకారము, కార్యకారణముల యేకత్వమున్నిచోట్ల నొక్కటిగా గానుపించుటలేదు. కారణశబ్దమనగా, అమిత్తకారణము గ్రహించకుండ కేవలము ఉపాదాన కారణమే గ్రహించినచో, [కుండలమునకు బంగారమువలె] అప్పుడుగూడ నప్పుడప్పుడు, కార్యముయొక్క యసత్యత ప్రమాణితమగుచుండును. [త్రాటియందు సర్పము వలె]. ఇచటను పాదానకారణము సత్యమేయైయున్నను, దానికార్యమగు సర్పము

సర్వదా అసత్యమేయగుచున్నది. అచట, ప్రతీతమగుచున్న సర్పమునకు ఉపాదాన కారణము కేవలము త్రాడేగాక, యవిద్యా [భ్రమ] సంబంధము గూడ నున్నదని చెప్పినచో, అవిద్య మరియు సద్వస్తువుల సంయోగముచేతనే యీ జగత్తుత్పన్న మగుచున్నదని గ్రహింపవలసియుండును. కావున త్రాటియందు ప్రతీతమగు సర్పము మిథ్యయైనటులనే, సర్వవస్తువులంప విద్యా సంయోగముచే ప్రతీతమగు చున్న నామరూపాత్మకమగు ప్రపంచముగూడ మిథ్యయే యగుచున్నది. కేవలము వ్యవహారసిద్ధికి మాత్రమే జగత్తుయొక్క సత్యత్వమంగీకరించినచో ప్రమాద మేమియులేదు. ఎందుకనగా, నది పారమార్థికసత్యముగాక, వ్యావహారిక సత్యత్వమే యగునుగాన.

ఈః భ్రమ, వ్యావహారిక జగత్తునందంగీకరింపబడుచున్న కాలదృష్టితో, అనాదియైయున్నది. అజ్ఞానులగు వారెట్టి విచారణయు చేయక, పూర్వ పూర్వ భ్రమ లచే ప్రేరితులై అంధ పరంపరగా దీనినే యంగీకరించుచువచ్చుచున్నారు. ఇట్టి స్థితిలో, కర్మ ఫలము సత్యమని పలుకు శ్రుతులు కేవలమట్టివారినే–అనగా-కర్మ యందే మూఢ విశ్వాసము గలవారై, వీని తాత్పర్యము కర్మఫలము నిత్యమని చెప్పుటలో గాక కర్మలయందాసక్తి కల్గించుటకు మాత్రమే ప్రశంసించబడినదని దెలియని వారిని మాత్రమే-భ్రమలో పడవేయుచున్నవి.

ప్రభూ, యదార్థమేమనగా, యీ జగత్తు ఉత్పత్తికి పూర్వము లేదు. ప్రళయా నంతరముండదు. కాని ఉత్పత్తి-ప్రళయముల మధ్య కాలమందుగూడ, అఖండైక రససత్యస్వరూపుడవగు నీయందు మిథ్యగనే ప్రతీతమగుచున్నదని, సిద్ధించుచున్నది. ఇందుచే శ్రుతులమగు మేము, మట్టి యందు కుండలు మొదలగునవి లోహమునందు శస్త్రాదులు, బంగారము నందు కుండలాదులవలెనే నామమాత్రములైయున్నవనియు యథార్థముగా నందున్నది, మట్టి, లోహము-బంగారమే యనియు, అటులనే పర మాత్మయందు వర్ణించబడిన జగత్తు నామమాత్రమేయై, సర్వథా మిథ్యయనియు మనః కల్పన మాత్రమేననియు యిట్టి దృష్టాంతములతో జగద్వర్ణన చేయుచుంటిమి.

తెలియని మూర్ఖులు మాత్రమే యీ జగత్తు సత్యమని భావించుచుందురు.

భగవానుడా, జీవులందరును మాయామోహితులై యవిద్య నాశ్రయించి యుందురు. అప్పుడు, వారి స్వరూపభూతములగు ఆనందాది గుణములావరింపబడి యుండును. జీవుడెపుడు, గుణజన్యములగు వృత్తులందును, ఇంద్రియములందును, దేహములందును చిక్కుపడి యుండునో, అవియన్నియు స్వంతములుగా భావించి వానిని సేవించుచుండునో, అప్పుడు వాని జన్మ మృత్యువులే తన జనన మరణము లని భావించుచు సంసార చక్రమందు పరిభ్రమించుచుండును. సర్పము తన కుబుస ముతో సంబంధము పెట్టుకొనక వదలివేయునట్లు, నీవు మాయా-అవిద్యతో నెట్టి

సంబంధమును పెట్టుకొనక, నెప్పుడును దానిని విడిచియే యుందువు·దానిచే నీ సంపూర్ణైశ్వర్యమెప్పుడును నీతోనే యుండును. అణిమాద్యష్టైశ్వర్యములతో గూడిన పరమైశ్వర్యమందే నీ స్థానము. అందుచే, నీ యైశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపద, జ్ఞాన వైరాగ్యముల పరిమితములై, యనంతములై యుండును. అవి దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితములై యుండును.

"ప్రభూ. మనుజులు, యోగులు, యతులునై యుండియు,తమ హృదయము నందలి విషయ వాసనలను సమూలముగ పెరికివేయకున్నచో, అట్టి యసాధకులగు వారికి నీవు హృదయమునందే యుండియున్నను, తన కంఠమునందేయున్న మణిని మఱచి యూరంతయు వెదకుచుండువానివలె, దుర్లభుడవేయైయుందువు. తన యింద్రియములను తృప్తి పరచుటయందే నిమగ్నుడై యుండుచు విషయముల నుండి విరక్తుడుగాకుండ నుండు సాధకుడు జీవితకాలమునందును, జీవితానంతరముగూడ దుఃఖమునే యనుభవించవలసివచ్చును. ఏలననగా నతడు సాధకుడుగాడు. దాంభికుడు. అతనికింకను మృత్యువునుండి ముక్తికలుగలేదు. లోకులను సంతోష పెట్టుట,ధనము సంపాదించుట మొదలగు పనులందు క్లేశములుపడుచునేయుండును. నీ స్వరూపము తెలియకుండిన కారణముచేత, ధర్మకర్మ పరిత్యాగము చేయుటచేత, పరలోకాదులందు నరకప్రాప్తి కలుగునను భయమూతని వీడకయుండును.

నీ యథార్థస్వరూపమును తెలుసుకొనిన పురుషుడు, నీచే నొసగబడిన పుణ్య పాపకర్మఫలములగు సుఖదుఃఖముల గురించి తెలుసుకొనడు. వానిని భోగించడు. భోగ్య, భోక్తృత్వముల కతీతుడైయుండును. దేహాభిమానము గలవారలకు చెప్ప బడిన విధినిషేధ ప్రతిపాదకములగు శాస్త్రములాతనికి వర్తింపవు. అతనికి ఆ శాస్త్ర ములధ్యాసయేయుండదు. నీ స్వరూపజ్ఞానము లేనివాడుగూడ, ప్రతి దినము యుగ యుగములందలి నీలీలలను గుణములను శ్రవణమొనర్చుచు, వానిద్వారా నిన్ను తన హృదయమునందు విలుపుకొనియున్నచో, అనంతాచింత్య దివ్యగుణగణవిధానా— ప్రభూ, అట్టి నీ ప్రేమభక్తుడుగూడ పుణ్యపాపఫలములగు సుఖదుఃఖములకు, విధి నిషేధములకు నతీతుడైయుండును. నీవే యతనికి మోక్షస్వరూపగతివై యుందువు. (కాని మిగిలినవారందరు శాస్త్రబంధితులై, వాని నుల్లంఘించినచో దుర్గతినందెదరు)

"మహాభాగా, స్వర్గాదిలోకముల కధిపతులగు, యింద్రబ్రహ్మాదులు గూడ, నీ పారమును దెలియకుందురు. ఆశ్చర్యమేమన, నీకు గూడ నీ యంతము దెలియదు· ఏలననగా, అంతమే లేనప్పుడు [అనంతుడవు] అంతము దెలియుట యెట్లు సంభవించును? ఆకాశము నందు గాలిచే నెగురగొట్టబడిన చిన్న చిన్న ధూళి కణము లెగురుచుండునట్లు, నీయందు, కాలవేగముచేత, తనకంటె నుత్తరోత్తరము దశ గుణితాధిక్యముగల సప్తావరణ సహితములగు బ్రహ్మాండములనేకము లొకేసారి

పరిభ్రమించుచున్నవి. అట్టి స్థితి యందు నీ పొర్లమెట్లు తెలియును? శ్రుతులమగు మేము గూడ సాక్షాత్తుగా నిన్ను వర్ణించజాలక, నీకంటె భిన్నమగు వస్తువులసన్నింటిని నిషేధించి, చివరకు మమ్ములను గూడ నిషేధించుకొని, నీసత్తయందే లయించి, సఫలులమై పోవు చుంటిమి" అని శ్రుతులు పల్కినవి.

నారాయణఋషి నారదునితో, దేవర్షీ, యీ ప్రకారము, సనకాదిఋషులు జీవ బ్రహ్మైక్యమునకు సంబంధించిన యుపదేశముల విని ఆత్మస్వరూపమును గ్రహించినవారై, నిత్యసిద్ధులైనను, కృతకృత్య భావముతో సనందనుని పూజించిరి. సృష్టి ప్రారంభకాలము వారగుటచే సనకాదులందరికి పూర్వజులు. నీవుగూడ వారితోసమానుడవగు బ్రహ్మమానసపుత్రుడవు. వారి జ్ఞానసంపదకుత్తరాధికారివి. ఈ బ్రహ్మ విద్యను శ్రద్ధతోధారణయొనర్చి, స్వేచ్ఛగా విహరించుము. ఇది సమస్త వాసనాక్షయ కరమ"ని, పలికె.

"పరీక్షన్మహారాజా, దేవర్షియగు నారదుడు మహానుభావుడు,పూర్ణకాముడు. జ్ఞాని. నైష్ఠిక బ్రహ్మచారి. విన్నదంతయు ధారణచేయుశక్తిగలవాడు· నారాయణఋషి యుపదేశమునంతను మహాశ్రద్ధతో నాలించి, యాతనితోనిట్లు పల్కె.

"మహాత్మా, నీవు సచ్చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణుడవు. నీ కీర్తి పరమ పవిత్రము. సమస్త ప్రాణులకు పరమకల్యాణమగు మోక్షము ప్రసాదించుటకే నీవు కమనీయ కళావతారము దాల్చుచుందువు. నేను నీకు సమస్కరించుచుంటి"

అని పల్కి' నారదాది ఋషులు, నారాయణ ఋషికి, అతని శిష్యులకు సమస్కరించి, మా (శుకయోగి) తండ్రియగు వేదవ్యాసుని యాశ్రమమునకేగిరి. యథోచిత స్వాగతసత్కారములు జరిగినపిమ్మట, వారందరు నుపవిష్టులైయుండగా, నారదమహర్షి. నారాయణఋషి యుపదేశమును మా తండ్రికి వినిపించె. అది నీకు వివరించితిని, మనస్సుకు వాక్కునకు నగోచరమగునట్టియు, ప్రాకృతగుణరహిత మైనట్టియు పరమాత్మ వర్ణనము శ్రుతులేవిధముగచేసిరి? దానియందు మనస్సేవిధమున ప్రవేశించును? అనియేగదా నీవు ప్రశ్నించితీవి. అది సర్వము తెలిపితిని.

భగవానుడే ఈ విశ్వమును సంకల్పించును. ఆది మధ్యాంతములందతడే స్థితుడై యుండును. ప్రకృతికి, జీవునకు గూడ నతడే ప్రభువు. సృష్టించి, జీవసహితముగ పరమాత్మ, యందు ప్రవేశించినాడు. శరీరముల నిర్మించి, యతడే వానిని నియంత్రణము చేయుచున్నాడు. గాఢనిద్ర (సుషుప్తి) యందు పురుషుడేవిధముగ తన శరీరముతో సంబంధము లేకయుండునో, యటులనే భగవానునిపొంది యీ జీవుడు మాయనుండి ముక్తుడగును. భగవానుడు విశుద్ధుడు. కేవలచిన్మాత్రతత్త్వము

అతనియందు జగత్కారణమగు మాయలేక ప్రకృతియొక్క యస్తిత్వము లేశ మాత్రము గూడలేదు. యథార్థమగు నభయస్థానమదియే. నిరంతరము దానినే చింతన చేయుచుండవలయును."

అని శ్రీశుకయోగి పరీక్షిత్తుతో పల్కెనని, సూతుడు శౌనకాదులతో ననియె.

# ఎనుబది యెనిమిదవ యధ్యాయము

## శివుని సంకట మోచనము

"శుకయోగీంద్రా, శంకర భగవానుడు సర్వభోగ పరిత్యాగియైయున్నను, నతని నుపాసించు సర్వదేవ, అసుర, మనుష్యులందరును, తఱచుగా, ధనవంతు లగుటయు, భోగసంపన్నులగుటయు గాంచుచున్నాము. విష్ణుభగవానుడులక్ష్మీపతి. కాని యతని నుపాసించువారు సాధారణముగ భోగభాగ్యములకు దూరమగు చున్నారు. ఈ మహానుభావులిరువురును, భోగ, త్యాగదృష్టితో జూచినచో పరస్పర విరుద్ధ స్వభావముగలవారు. కాని వారిని సేవించిన వారలకు, వారి (శివకేశవులు) స్వభావములకు విరుద్ధమగు ఫలితము లభించుచున్నది. త్యాగినుపాసించిన భోగము గలుగుట, లక్ష్మీపతి (భోగి) నుపాసించిన త్యాగము గలుగుట యెట్లు సంభవించు చున్నదని నాకు గొప్ప సందేహ ముదయించుచున్నది. ఈ సందేహ నివారణ మొనర్ప ప్రార్థించుచుంటి"నని పరీక్షిన్నరేంద్రు డడుగగా, శుకయోగి యిట్లు వచించె.

"రాజా, మహా శివుడెల్లపుడును తన శక్తితో గూడి యుండును. అతడు సత్త్వాదిగుణయుక్తుడు. అహంకారమున కధిష్ఠాత. అహంకారము.మూడువిధములు. వైకారికము, తైజసము, తామసము అనునవి. త్రివిధాహంకారముల వలన పదు నారు వికారములు గలిగినవి. అవియేవన, దశేంద్రియములు, మనస్సు పంచమహా భూతములనునవి. అందుచే వీని యధిష్ఠాతృదేవతలందే యొకరిని నుపాసించినను, సమస్త ఐశ్వర్యప్రాప్తియు లభించును. కాని రాజా, శ్రీహరి, ప్రకృతికంటెపరుడు, పురుషోత్తముడు. ప్రాకృత గుణరహితుడు. సర్వజ్ఞుడు. సర్వాంతఃకరణములకు సాక్షి. అతనిని సేవించువారు గూడా గుణాతీతులై పోయెదరు. మీ తాతయగు ధర్మ రాజశ్వమేధ యాగము చేసిన పిదప, భగవాను డతనికి వివిధ ప్రకారములగు ధర్మ ములను గూర్చి వినుపించుచున్న సమయమం దతడు గూడ యిదే ప్రశ్నయొనర్చె నాడు శ్రీకృష్ణుడు సర్వశక్తిశాలియగు పరమేశ్వరుడు. మనుష్య కళ్యాణము కొరకే యతడు యదువంశమునందవతరించియుండె. ధర్మజుని ప్రశ్నవిని, యతనిశ్రవణా

సక్తిని గమనించి, భగవానుడు ప్రసన్నతా పూర్వకముగ, నీ విధమున చెప్ప సాగినాడు.

శ్లో. యస్యాహమను గృహ్ణామి హరిష్యే తద్ధనంశనైః
తతోఽధనం సంత్యజంతి స్వజనాదుఃఖ దుఃఖితం

"రాజా, నాయనుగ్రహ మెవనిపై ప్రసరించునో, వాని ధనమును నేను నెమ్మది నెమ్మదిగా హరించెదను. అతడు నిర్ధనుడు కాగానే యతని బంధుమిత్రులందరు నతనిని పరిత్యజించెదరు. అతని దుఃఖాకుల చిత్తమును వారు లక్ష్యపెట్టరు. మరల నతడు ధన సంపాదనా ప్రయత్నములు చేయ ప్రారంభించును. నే నా ప్రయత్నములనుగూడ నిష్ఫలము గావించెదను. అతని ప్రయత్నములన్నియు వ్యర్థము లగుటచే, ధన సంపాదనాయత్నములందతని మనస్సు విముఖత గలదియైనందున దానిని దుఃఖప్రదములుగా భావించినవాడై, యతడా ప్రయత్నములు మాని, నన్ను ప్రేమించు భక్తులనాశ్రయించి, వారితో సంగముకలవాడైనపుడు నేనతనిపై నా ప్రేమను వర్షింపజేసెదను. నా యనుగ్రహముచే నతనికి సచ్చిదానంద స్వరూప మగు పరబ్రహ్మ ప్రాప్తి లభించును. కావున నాయనుగ్రహము సంపాదించుట, నన్నారాధించుట యనునవి చాల కఠినము. అందుచే సాధారణముగ మానవులు నన్ను వదలి యితర దేవతలను—వారందరును నా స్వరూపములే—ఆరాధించుచుం దురు. ఆ దేవతలు శీఘ్రముగ ప్రసన్నులై మానవుల కోరికల దీర్చుచుందురు. వారికి సామ్రాజ్యలక్ష్మి నొసంగుచుందురు. వారట్టి లాభమును పొంది, ప్రమత్తులై, యున్మత్తులై, తమకు వరము లొసంగిన దేవతలను గూడ మరచిపోయి, యవమా నించుచుందురు" అని పలికె.

"పరీక్షిన్మహారాజా, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముప్వురును శాపమిచ్చుట కును, వరము లొసంగుటకును సమర్థులు. కానియందులో, బ్రహ్మ శంకరులిర్వురును శీఘ్రముగ ప్రసన్నులై వరము లొసంగుచుందురు. అటులనే శీఘ్రముగ రుష్టులై శాపములను గూడ యిచ్చుచుందురు. కాని విష్ణు భగవానుడట్లుగాదు. ఈ విషయమై మహాత్ములగు వారొక ప్రాచీనమగు నితిహాసమును చెప్పుచుందురు. శంకర భగ వాను డొక పర్యాయము, వృకాసురునకు వరమొసంగి మహాసంకటమందు బడి పోయె.

వృకాసురుడు, శకుని కుమారుడు. వాడు మహాదుర్మతి. మార్గమం దొక నా డతనికి నారదమహర్షి తారసపడగా, "త్రిమూర్తులందు శీఘ్రముగ ప్రసన్నుడగు దేవుడెవ్వడ"ని ప్రశ్నించె. నారదుడు, "వృకాసురా, నీవు శంకర భగవాను నారా ధించుము. దానిచే నీ మనోరథము త్వరగా నీడేరగలదు. కొలది సుగుణముల చేతనే శంకరుడు ప్రసన్నుడైపోవును.

అటులనే తొందరగనే కుపితుడుగూడ నగును. రావణ బాణాసురులు, వందీ జనమువలె కేవలము స్తుతియొనర్చినంత మాత్రముననే, శంకరుడు వారికి ప్రసన్నుడై, యతులితైశ్వర్య సంపన్నుల గావించినాడు. అటు తరువాత, రావణుడు కైలాస పర్వతమెత్తినపుడును, బాణాసుర నగరరక్షణమందు, నతడు సంకటము గూడ ననుభవించినాడు" అని పలికె.

నారదుని యుపదేశమును పొంది, వృకాసురుడు కేదార క్షేత్రమందు, అగ్నిని శంకరునియొక్క ముఖముగా భావించి, తన శరీరమందలి మాంసఖండముల గోయుచు నగ్నియందు హోమము చేయుచు, నారాధించసాగినాడు. ఈ విధముగ నారురోజులుపాసించినను శంకరుని దర్శనము కానందున, నతనికి మహాదుఃఖము కల్గినది. అందుచే, నేడవదినమందాతడు, కేదారతీర్థమందు స్నానమొనర్చి, తన తడితలనే ఖండించి హోమకుండమునందు హోమము చేయదలపెట్టె. సాధారణ ముగ జగత్తునందెవడైనా యాత్మహత్య గావించుకొన బోవుచుండ, చూచిన వారు కరుణావశులై యతనిని రక్షించుచుందురు గదా. అటులనే పరమదయాళుడగు శంకరభగవానుడుగూడ, వృకాసురుడు శిరము ఖండించుకొనుటకు పూర్వమే యగ్ని కుండమునుండి యగ్నిదేవునితో సమానమగు రూపమున ప్రత్యక్షమై, యతనిని వారించినాడు. భగవానుని స్పర్శామాత్రము చేతనే, అంగములన్నియు యథాపూర్వ ముగనై పోయినవి. భగవానుడతనితో, "వృకాసురా, నీ యుపాసన చాలింపుము. నేను ప్రసన్నుడైతిని వరము గోరుకొమ్ము, నేను నా శిరముపై నభిషేకించిన మాత్రముననే సంతుష్టుడనగుచుందును. నీవనవసరముగ నీ శరీరము నేల హింసించు కొందువు" అని పలుక, దుర్మార్గుడగు వృకాసురుడు, సమస్త ప్రాణులకును భీతా వహమగు వరము గోరినాడు. "నేనెవని శిరమందు నాచేయి యుంచిన వాడు చని పోవునటుల వరమొసంగుము"ని యాతడు శంకరుని వేడినాడు. శంకరుడు మొదట కొంచెము విమనస్కుడయ్యు, పిమ్మట నవ్వుచు నతనికా వరమొసంగె. సర్పమున కమృతమిచ్చినట్లైనది, వృకునకా వరమొసంగుట.

భగవానుడట్లు వరమొసంగుటచే, వృకాసురునకు పార్వతీదేవిపై లాలసగల్గి, యామెను హరింప సమకట్టినాడు. శంకరుని వరము పరీక్షించదలచి, యాతడు శంక రుని శిరముపైననే చేయియుంచబోయినాడు. తానిచ్చిన వరము తనకే భయ కార ణముకాగా, శంకరుడు పరువిడసాగె. రాక్షసుడాతని వెంబడించె. దశదిశలకు బరు విడసాగిరి. దీని నాపునుపాయము దేవతలకెవరికి దెలియరాదాయె. చివరకు శంకరుడు వైకుంఠమునకు బరువిడినాడు. సర్వులకు పరమగతియగు నారాయణుడట నివసించుచుండె. సమస్త జగత్తునకు నభయదాన మొసంగుచు నతడు శాంతభావ ముతో నటస్థితుడై యుండె.

వైకుంఠము చేరిన జీవునకు మరల జన్మించవలసిన యవసరముండదు. శంకరుడు మహాసంకటమందు బడియుండుటను జనార్దనుడు గమనించినాడు. తన యోగమాయా ప్రభావముచే నతడొక బ్రహ్మచారి వేషముదాల్చి, వృకాసురునివైపు రాసాగె. కటిప్రదేశమందు ముంజగడ్డితో చేయబడిన మేఖల, నల్లని మృగచర్మము, దండము, రుద్రాక్షమాల ధరించియున్నాడా బ్రహ్మచారి. అతని ప్రత్యంగము నుండియు, అగ్నితేజస్సు వెలువడుచుండినది. చేతియందు కుశలు పట్టుకొనియుండె. వృకాసురుని గాంచి, యా కపట బ్రహ్మచారి, మహావినయముగ నమస్కరించి, యిట్లు పల్కె.

"శకునినందనా, వృకాసురా, నీవు చాల నలసినట్లగుపడుచుంటివి. చాల దూరమునుండి వచ్చుచుంటివా యేమి? కొంచెము విశ్రమించరాదా ! చూడు, ఈ శరీరమే సమస్త సుఖానుభూతికి ఆధారము. దీనిచేతనే కోరికలన్నియు దీరుచుం డును. దీనికెక్కువ కష్టము కలిగించరాదు. నీవన్ని విధముల సమర్థుడవు. ఇపుడు నీవేమి చేయదలచుచుంటివి? నేను తెలుసుకొనుటకు యోగ్యమగు విషయమగుచో, చెప్పగోరెదను. ఏలననగా, సంసారమందనేక పనులు, సహాయకులద్వారా సాధింప బడుచుండుటను మనము చూచుచున్నారము." అని నేర్పుగా బలికె.

భగవానుని ప్రతి శబ్దమునందు నమృతము తొణికిసలాడుచుండినది. బ్రహ్మ చారి యటుల బలుకగనే, వృకాసురుడు, కొంచెము సేదదీరి, పిమ్మట తాను తపస్సు చేయుటయు, వరదానము, దానిని పరీక్షింపదలచి తాను శంకరుని వెన్నంటుటయు మొదలుగాగల వృత్తాంతమంతయు నతనికి వివరించినాడు.

అప్పుడు భగవానుడు "అదియా విషయము? అట్లైనచో మనమాతని మాటను విశ్వసింపరాదు. నీకు తెలియదా యేమి? దక్షప్రజాపతి శాపముచే నతడు పిశాచ భావ మును పొందియున్నాడు. ప్రస్తుతమాతడే ప్రేతములకు, పిశాచములకు సార్వభౌ ముడై యున్నాడు. నీవింత గొప్పవాడవై యుండియు, యింతటి చిన్నమాటలనేల విశ్వసించుచుంటివి? నీవింకను శంకరుని జగద్గురువుగా భావించుచున్నచో, అతని మాటలయందు విశ్వాసము గలిగియున్నచో, వెంటనే నీ శిరముపై చేయియుంచు కొని పరీక్షించుకొనుము. శంకరుని మాట యేవిధముగనైన నసత్యముగా పరిణ మించినచో వెంటనే యాతని వధింపుము. అట్టి యసత్యవాది, యింక ముందెవ్వ రితోగూడ నబద్ధములు పలుకుట జరుగకుండును." భగవంతుని సమ్మోహనకరము లగు తీయని మాటలకు, దానవుని వివేకబుద్ధి నశించిపోయినది. విస్మృతిగలిగి, యాతడు తన శిరమునందే చేయియుంచుకొనియె. వెంటనే యాతని శిరముప్రక్కలై యాతడు భువిపై బడిపోయినాడు. విద్యుద్ఘాతము తగిలినట్లు సద్యోమరణము సంభ వించినది. దేవతలందరు నమోవాక్యములు జెప్పుచు జయజయ ధ్వనులొనర్చిరి.

సాధువాదములును చెలరేగినవి. పాపాత్ముడగు వృకాసురుని మరణముచే, దేవ ఋషి పితృ గంధర్వాదులందరును మిక్కిలి ప్రసన్నులై పుష్పవృష్టి గురిపించిరి. శంకరభగవానుడా వికటసంకటమునుండి విముక్తుడాయె. పురుషోత్తముడపుడు శంకరుని గాంచి, "మహాదేవా, యీ దుష్టాత్ముడు తన పాపములచేతనే హతుడగుట యెంతయు నదృష్టము. హర్షింపదగిన విషయము. మహాపురుషుల కపకారము దలపెట్టిన యే ప్రాణియైనను, కుశలముగా యుండుట యెట్లు కుదురును? అందులో నీవు స్వయముగా జగద్గురువగు పరమేశ్వరుడవు. నీకే యపకారమొనర్పదలచిన కుటిలాత్ముడు కుశలముగా నుండగలడా?" యని పలికె.

భగవానుడనంత శక్తి సాగరుడు. అతని ప్రతి శక్తియు మనోవాక్కుల కందరానిది. అతడు ప్రకృతి కతీతుడగు పరమాత్మ. అతడు శంకరుని సంకటమును తొలగించిన యీ దివ్యలీల నెవడు చెప్పునో, యెవడు వినునో, వాడు సంసార బంధములనుండియు, శత్రుభయమునుండియు ముక్తుడగును." అని పరీక్షిత్తుతో శ్రీశుకయోగి వచించె.

## ఎనుబదితొమ్మిదవ యధ్యాయము

### భృగువు త్రిమూర్తుల పరీక్షించుట—చనిపోయిన బ్రాహ్మణ బాలకులను భగవానుడు తిరిగితెచ్చుట

"పరీక్షన్మహారాజా, ఒక పర్యాయము సరస్వతీ నదీతీరమందు యజ్ఞము ప్రారంభించుటకై, మహాత్ములగు ఋషులందరొకచో సమావేశమైరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవరు శ్రేష్ఠులను విషయమై యా సభయందు వాద వివాదములు కలిగినవి. ఈ విషయము తెలుసుకొనుటకై, త్రిమూర్తులను పరీక్షింపదలచి, యా మహానుభావులందుకు, బ్రహ్మపుత్రుడగు భృగుమహర్షిని నియోగించిరి. భృగువు ముందుగా, బ్రహ్మయొద్దకేగె. బ్రహ్మయొక్క ధైర్యాదులను పరీక్షింపదలచి, యతడు, సభయందున్న బ్రహ్మకు సమస్కరింపక, స్తుతించక యుండిపోయె. బ్రహ్మ కోపముతో మండిపడినాడు. కాని యాతడు తన పుత్రుడేయగుటచేత, వివేక బుద్ధితో కోపమును మనసునందే యణచుకొని, అరణి మథనముచే నుత్పన్నమైన యగ్నిని జలముచే శాంతింపజేయునట్లు, శాంతి వహించె.

భృగుమహర్షి యటనుండి కైలాసమేగినాడు. దేవాధిదేవుడగు శంకరుడు, తన సోదరుడగు భృగువేతెంచెనని జూచి, ఆనందముతో లేచి యాలింగనము చేయుటకై చేతులుజాచగా నతని యాలింగనమును మహర్షి స్వీకరించక, నీవు లోక మర్యాదను, వేదమర్యాదను గూడ నుల్లంఘించితివి. నేను నిన్ను కలియను" అని

పలికె. రుద్రునకు క్రోధముకల్గి, త్రిశూలముతో నతని పొడువబోవగా, భగవతి యగు సతీదేవి, శంకరుని చరణములపై వ్రాలి, యనునయ వినయములతో నెట్టులో యతనిని శాంతింపజేసినది.

అనంతరము భృగుమహర్షి నారాయణుని నివాసమగు వైకుంఠమునకేగినాడు. ఆ సమయమందు నారాయణుడు లక్ష్మీదేవి యుత్సంగమందు శిరసుంచి విశ్రమించి యున్నాడు. భృగుమహర్షి యాతని వక్షఃస్థలమందు పదాఘాతమొనర్చె. భక్త వత్సలుడగు భగవానుడు, లక్ష్మీసహితముగ శయ్యనుండి క్రిందికిదిగి, మునికి శిరమువంచి నమస్కరించి, "బ్రాహ్మణోత్తమా, మీకు స్వాగతము. మీరీయాసన మందు కొంచెము విశ్రమించుడు. మీరు వచ్చుచున్న సమాచారము నాకు తెలియ నందున మీకెదురువచ్చి తీసుకురాలేకపోతిని. నా యపరాధమును క్షమింపుడు. మునీ శ్వరా, మీ చరణకమలములత్యంత సుకుమారములు" అని పల్కుచు భగవాను డాతని పాదములబట్టి యొత్తుచు మరల నిటులబల్కె. "మీ పాదజలము తీర్థములను గూడ పవిత్రము జేయునట్టిది. అట్టి పాదములతో మీరు వైకుంఠమున నన్ను, నా యందుండు లోకములను లోకపాలురనందరిని గూడ పవిత్రమొనర్చుడు. మీ చరణ కమలస్పర్శచే నా పాపములన్నియు క్షాళితములైపోయినవి. స్వామీ, నేడు నేను లక్ష్మి కే కైకాశ్రయుడను కాగలిగితిని. మీ చరణ చిహ్నితమైన నా వక్షమందు లక్ష్మి యెల్లపుడును వసించియుండగలదు" అని పలికె.

భగవానుడీవిధముగ గంభీరములగు వాక్కులతో, పలుకగా, భృగుమహర్షి యత్యంత తృప్తుడాయె. భక్త్యుద్రేకము చేత నతనికంఠము గద్గదికమై, కన్నుల నుండి యశ్రువులు కారజొచ్చె. మౌనముగా నుండిపోయినాడు. భృగుమహర్షియట నుండి మరలి, మునులున్న ప్రదేశమునకేతెంచి, త్రిమూర్తులవద్ద తనకు గలిగిన యనుభవముల వివరించినాడు మునులందరత్యంత విస్మితులైనారు. వారి సందేహము తొలగిపోయినది. వారానాటినుండి, శాంతి-అభయముల కుత్పత్తిస్థానమగు విష్ణువే సర్వశ్రేష్ఠుడని భావించ మొదలిడిరి. విష్ణువువలననే, ధర్మ, జ్ఞాన వైరాగ్యములు, అష్టైశ్వర్యములు, చిత్తశుద్ధి కల్గించు యశస్సును కలుగును. శాంతులకు, సమ చిత్తముగలవారలకు, అకించనులకు, మఱియు నందరికి నభయమొసంగునట్టి మునీ శ్వరులకు, నతడే పరమగతియని శాస్త్రములు నొక్కివక్కాణించుచున్నవి. అతనికి ప్రియమగు స్వరూపము, యిష్టదైవము బ్రాహ్మణులు. నిష్కాములు, శాంతులు, నిపుణబుద్ధులనగా వివేకసంపన్నులు, నతనిని సేవించుచుందురు. గుణమయియగు మాయ, రాక్షసులు, అసురులు, దేవతలునను మూడు రూపముల నతనికి కల్పించి నది. అందు సత్త్వగుణోపేతమగు దేవమూర్తి యతని యుపలబ్ధిస్థానము. అతడు సమస్త పురుషార్థస్వరూపుడు.

"పరీక్షిన్మహారాజా, సరస్వతీ తీరస్థులైన ఋషులు, తమకొరకు గాక మానవుల సందేహము తొలగించుటకే యీ యుపాయము బన్నియుండిరి. పురుషోత్తముని చరణకమలముల సేవించి వారతని పరమపదప్రాప్తిని పొంది తరించిరి." అని శ్రీశుకులు చెప్పిరని, శౌనకాదులతో చెప్పుచు, సూతుడిట్లనియె.

"ఋషులారా, పురుషోత్తముని యీ కమనీయమగు కీర్తికథ, జన్మమృత్యుస్వరూపమగు సంసారభయమును పోగొట్టునట్టిది. వ్యాసనందనుడగు శుకదేవుని ముఖారవిందమునుండి స్రవించు సురభితమధురసుధారసధార యిది. సంసారమను సుదీర్ఘమగు మార్గమందు పయనించు బాటసారి యెవడు, తన రెండుచెవులతో యీ సుధారసమును పానమొనర్చునో, అతనికి శ్రమయంతయు తొలగిపోయి సుఖించగలుగు"నని వచించె.

శ్రీశుకులు మరల చెప్పుచుండిరి. "రాజా, ఒకనాడు ద్వారకాపురమందొక బ్రాహ్మణి గర్భమునుండి యొకపుత్రుడుదయించె. భూమియందు బడగనే యాతడు చనిపోయె. బ్రాహ్మణుడు బాలకుని మృతశరీరమును గొనివచ్చి, రాజప్రాసాదద్వారమందుబడవైచి, యతిదుఃఖముతో విలపించుచు నిటులబలుకసాగె. "బ్రాహ్మణద్రోహి, ధూర్తుడు కృపణుడు, విషయలాలసుడునగు రాజుయొక్క కర్మదోషము చేతనే నాపిల్లవానిచావు సంభవించెననుట నిక్కువము. ఏ రాజు, హింసాపరాయణుడు, దుశ్శీలుడు, నజితేంద్రియుడునై యుండునో, యతనిని రాజుగాభావించి సేవించుచుండు ప్రజలు దరిద్రులై దుఃఖము వెంట దుఃఖము ననుభవించుచునేయుందురు. వారికి సంకటములు కలుగుచునేయుండును అని పలికినాడు.

అదేవిధముగ నతని రెండవ పిల్లవాడు, మూడవవాడు గూడ పుట్టినవెంటనే చచ్చిపోవుటయు, రాజద్వారమువద్ద శవములనుంచి యాతడు విలపించుటయు జరిగినది. ఈరీతిగా తొమ్మిదిమంది సంతానము మరణించగా, బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని వద్దకువచ్చి, తనగోడు వినిపించె. ఆ సమయమందు కృష్ణునివద్దనున్న యర్జునుడు, బ్రాహ్మణునిగాంచి, బ్రాహ్మణోత్తమా, మీ నివాసస్థానమందు ధనుర్ధారులగు క్షత్రియులేలేరా ? ఈ యాదవులు బ్రాహ్మణులై, ప్రజాపాలనము మానివైచి, యేదో యజ్ఞమందుపస్థితులై యున్నటులవోచుచున్నది. ఎవని రాజ్యమందు ధన, స్త్రీ, పుత్రరహితుడై బ్రాహ్మణుడు దుఃఖించుచుండునో, యతడు క్షత్రియుడుగాడు. క్షత్రియవేషముదాల్చి యుదరపోషణగావించు కొనుచుండు నటకుని వంటివాడతడు. అతని జీవితము వ్యర్థము. భూసురుడా, పుత్రమరణముచే మీ దంపతులెంతవంతజెందుచుందురో నేనూహించగలను. మీ సంతానమును నేను రక్షించెదను. అటుల చేయలేకున్నచో, నగ్నియందు దుమికి ప్రాణత్యాగమొనర్చి, యందుకు ప్రాయశ్చిత్తముగావించుకొనియెద." నని ప్రతిజ్ఞచేయగా, బ్రాహ్మణుడిట్లనియె.

"అర్జునా, యిచట బలరాముడు, శ్రీకృష్ణభగవానుడు, ధనుర్ధరశిరోమణియగు ప్రద్యుమ్నుడు, అద్వితీయయోద్ధయగుననిరుద్ధుడును నా బాలకుల రక్షించుటయందు సమర్థులైయుండగా, జగదీశ్వరులగు వారికే సాధ్యముగాని దానిని, నీవెటుల సాధించ గలవు? నిజముగానిది నీ మూర్ఖత్వము. నీ మాటపై నామ బొత్తుగా విశ్వాసము కలుగుటలేదు." అని వచింప నర్జునుడిట్లనియె.

"బ్రహ్మన్. నేను బలరాముడనుగాను, శ్రీకృష్ణుడనుగాను, ప్రద్యుమ్నుడంత కన్నగాను. విశ్వ విఖ్యాతమగు గాండీవమును ధరించిన యర్జునుడను నేను. బ్రాహ్మణదేవా, నీవు నా బల పౌరుషముల శంకించి యవమానింపవలదు. నేను నా పరాక్రమముచే శంకరుని గూడ తృప్తినందించితినని నీవెఱుంగవు. నీకధికముగ నే నేమి చెప్పను? నేను యుద్ధమందు మృత్యువునైనను జయించి, నీ బాలకుల నీకప్ప గించెదను" అని దృఢముగ బలికె.

అర్జునుడీ విధముగా బ్రాహ్మణునకు విశ్వాసము కలిగించగా, నతడందరితో నర్జునుని గూర్చి ప్రశంసా వాక్యముల బలుకుచు, సంతోషముతో నింటికేగె. తన భార్య ప్రసవించు సమయము సమీపించగా, బ్రాహ్మణుడాతురుడై యర్జునుని సమీపించి, "యీ మారు నా పిల్లవానిని రక్షించు"మని వేడుకొనియె. అర్జునుడు శుద్ధ జలముతో నాచమించి, శంకర భగవానునకు నమస్కరించి, దివ్యాస్త్రముల సంస్మరించి, గాండీవమునుగైకొని, యభిమంత్రించిన యస్త్రములతో ప్రసవ గృహమున కాచ్ఛాదన గల్పించి రక్షగావించె. అస్త్రపంజరమందలి సూతికాగృహమున బ్రాహ్మణి శిశువును ప్రసవించినది. నవజాత శిశువుయొక్క రోదనము వినబడినది. కాని చూచుచుండగనే యా శరీర మాకసమందంతర్ధానమైపోయినది. బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని సమీపమందే యర్జునుని నిందింపసాగినాడు.

"నా మూఢత్వముగాంచుడు. నే నీనపుంసకుని దంభపు మాటలను విశ్వసించి మోసపోతిని. ప్రద్యుమ్నానిరుద్ధ బలరామ శ్రీకృష్ణులకు గూడ నా పిల్లలను రక్షించుట సాధ్యము గానిది యితరులకెవరికి సాధ్యమగును? మిథ్యా వాదియగు నర్జునునకు ధిక్కారము. ఆత్మస్తుతి గావించుకొను అర్జునుని యొక్క గాండీవమునకు ధిక్కారము. ప్రారబ్ధముచే మా నుండి వేరు చేయబడిన మా బాలకుని, మూఢత్వముచే తిరిగి తెచ్చెదనని పల్కిన యీతని దుర్బుద్ధి గాంచుడు" అని ఈ విధముగ

శపించుచుండగా, అర్జునుడు తన యోగబలముచే యముని నివాసమగు సంయమనీ లోకమునకు పోయినాడు.

అచట నతనికి బ్రాహ్మణ బాలకుడగుపించనందున క్రమముగా నతడు, యింద్రాగ్ని నిర్వృతి, సోమ, వాయువరుణాది లోకపాలకుల లోకములకును, అత లాది యధోలోకములకును, స్వర్గమునకు పైనున్న మహర్లోకాదులకును పోయి చూచినను, బాలకుడగుపించలేదు. అతని ప్రతిజ్ఞ నెరవేరలేదు. అగ్నిప్రవేశము చేయ బోవుచున్న అర్జునుని శ్రీకృష్ణుడు నివారించుచు నిట్టులనియె. "అర్జునా, నిన్ను నీవు అవమానించుకొనకుము. బ్రాహ్మణుని బాలకులనందరిని నీకు జూపెదరమ్ము. నిన్నీ నాడు నిందించు లోకులే, మరల మననిర్మలమగు కీర్తిని స్థాపించగలరు" అని పలికె.

సర్వశక్తిమంతుడగు భగవానుడీరీతి నర్జునుని సముదాయించి, యతనితోగూడ తన దివ్యరథ మధిరోహించి పశ్చిమ దిక్కునకు పయనించినాడు. సప్త సప్తకుల పర్వతములతోగూడిన సప్తద్వీపములను, సప్తసముద్రములను, లోకాలోక పర్వత మును గూడ దాటి వారి యరథము ఘోరాంధకారమున ప్రవేశించినది. ఆదివ్య రథ మునకుగల, శైబ్య సుగ్రీవ మేఘ పుష్పవలాహకములను నాల్గు దివ్యాశ్వములా చీకటి యందు మార్గముదప్పి యటునిటు తిరగసాగినవి. వానికేమియు కనుపడక యుండె. గుర్రముల స్థితిగమనించిన యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుడు, తేజస్వంత మగు తన సుదర్శన చక్రమును ప్రయోగించె. భగవన్నిర్మితమేయగు నా చక్రము జ్యోతిర్మయమై యంధకారము జీల్చుచు ముందుకు పోవుచుండ, గుర్రములా వెలు తురులో ముందుకు పోసాగినవి.

ఆ సమయమందు, రామబాణము ధనుస్సు నుండి విడువబడినదై రాక్షస సేనను జీల్చుకొనుచు పోవుచున్నట్లనిపించినది. ఈ విధముగ సుదర్శన చక్రము చూపిన మార్గము ద్వారా, వారంధకారాంత ప్రదేశము చేరిరి. అచట పారావార రహితమైన పరమజ్యోతిస్సు ధగద్ధగాయమానముగ వెలుగుచుండినది. ఆ వెలు గును చూడజాలక యర్జునుని కన్నులు మూతబడిపోయినవి. వివశుడై యాతడు నేత్రములు మూసుకొనియే యుండిపోయె.

అనంతరము భగవానుని రథము దివ్యజలరాశియందు ప్రవేశించినది. మహా తేజస్సుగల తుఫాను చెలరేగుటచేత నా జలరాశియందుత్తుంగ తరంగములు లేచు

చుండె. ఆ జలరాశి మధ్యమందొక సుందర హర్మ్యము. దానియందు వేలకొలది మణిస్తంభములు తళతళ మెరయుచుండినవి. దానికి నాల్గువైపుల దివ్యజ్యోతి వెలుగుచుండె. ఆ సౌధమునందాదిశేషుడు విరాజమానుడై యుండె. అతని శరీరమత్యంత భయానకముగను అద్భుతముగ నుండినది. అతనికి వేయిపడగలు. ప్రతి పడగపైన సుందరములగు మణులు ప్రకాశించుచుండినవి. ప్రతి శిరమునందును భయంకరములగు రెండు నేత్రములున్నవి. శరీరమంతయు కైలాసపర్వతమువలె తెల్లగానుండ, మెడ, నాలుక మాత్రము నీలవర్ణములో నుండినవి. ఆదిశేషుని సుఖమయమగు దివ్యశయ్యపై, సర్వవ్యాపక పరమ ప్రభావశాలియగు పురుషోత్తముడు విరాజమానుడై యుండుట నర్జునుడు గాంచినాడు. నీలమేఘశ్యామల శరీరము కలిగి, అత్యంత సుందరమగు పీతకౌశేయము ధరించియున్నాడా యాదిపురుషుడు. మోమునందు ప్రసన్నత తాండవించుచున్నది. విశాలనేత్రములెంతయు కాంతివంతములై యలరారుచున్నవి. అమూల్యమణి గణఖచితమగు కిరీటము, కుండలములకాంతిచేత, ముంగురులు మెరయుచున్నవి. ఆజానులంబితములగు దీర్ఘబాహువు లెనిమిది యున్నవి. గళమందు కౌస్తుభమణి, వక్షఃస్థలమందు శ్రీవత్స చిహ్నము,వనమాలయు కాంతులీనుచున్నవి. నంద, సునందాది పార్షదులును, రూపములు దాల్చి యున్న సుదర్శనాద్యాయుధములును, పుష్టి, శ్రీ, కీర్తి, యోగమాయలను నాల్గు శక్తులున్ను, బ్రహ్మాదిలోకపాలురందరి కధీశ్వరుడగు నా భగవానుని సేవించుచుండిరి. శ్రీకృష్ణుడు, తన స్వరూపమేయగు ఆ యనంత భగవానునకు ప్రణమిల్లినాడు. అర్జునునకంతయు నయోమయముగనుండి కొంచెము భయభీతుడైనాడు. అతడుగూడ ఆ యాదిదేవునకు నమస్కరించినాడు. అప్పుడా మహాపురుషుడు, కృష్ణార్జునుల వంక జూచి నవ్వుచు, "నేను మీ యిరువురను దర్శించు నుద్దేశ్యముతోనే యా బ్రాహ్మణబాలకుని నావద్దకు దెప్పించుకొంటిని. భూభారమును దీర్చి-భారరూపులగు దైత్యుల సంహరించి శీఘ్రముగ మీరు నా సమీపమునకు రండు. మీ యిరువురును నరనారాయణులను, దివ్యఋషులు. మీరు పూర్ణకాములు, సర్వశ్రేష్ఠులైనప్పటికిని, జగత్తుయొక్క స్థితికొరకు, లోకసంగ్రహముకొరకు ధర్మాచరణము చేయుచుండుడని యాదేశించె.

శ్రీకృష్ణార్జునులిర్వురా మహాపురుషుని యాదేశమును స్వీకరించి, మరల నమస్కరించి, యా బ్రాహ్మణ బాలకులనందరిని తీసుకొని, మహానందభరితులగుచు

వచ్చిన మార్గముననుసరించి, తిరిగి ద్వారకకు వచ్చిరి. బ్రాహ్మణుని బాలకులు తమ వయస్సు తగిన రూపములతో నుండిరి. వారందరిని కృష్ణార్జునులు బ్రాహ్మణునకు సమర్పించిరి. విష్ణుభగవానుని పరంధామమును గాంచిన యర్జునునియాశ్చర్యమునకు మేరయే లేకపోయినది. జీవులయందున్న బలపౌరుషములన్నియు శ్రీకృష్ణుని యనుగ్రహ ఫలములేనని యాతనికి విశదమైనది.

"రాజా, భగవానుడిట్టి ప్రభావాన్వితములగు లీలలనెన్నిటినో గావించినాడు. లోకదృష్టిలో సామాన్య మానవునివలె సాంసారిక విషయ భోగములనుభవించినాడు. మహారాజులవలె యజ్ఞము లాచరించినాడు. ఆదర్శ మహాపురుషునివలె చరించుచు, యింద్రుడు సమయానుకూలముగ వర్షించుచుండునట్లు, లోకులందరికి కాలానుగుణముగ మనోరథముల సిద్ధింపజేయుచు నందరిని నను్గ్రహించుచుండె. అధర్మపరాయణులగు రాజులనేకమందిని స్వయముగ తాను సంహరించియు, అనేకమంది నర్జునాదులద్వారా సంహరింపజేయుచు, శ్రీకృష్ణుడు భూభారమును దీర్చినాడు. ధర్మరాజాది ధార్మికులగు రాజులచే సునాయాసముగ పృథివియందు ధర్మమర్యాదను స్థాపింపజేసినాడు" అని శ్రీశుకులు పరీక్షిత్తుతో పలికిరి.

# తొంబదియవ యధ్యాయము

## శ్రీకృష్ణ భగవానుని లీలావిహార వర్ణనము

ద్వారకానగర శోభ యలౌకికము. రాజవీధులన్నియు, మదగజములు, సుసజ్జితులగు యోధవరులచేతను, గుఱ్ఱములు స్వర్ణమయములగు రథసమూహములతోను, యెల్లపుడు నిండియుండును. ఎచ్చట జూచినను పచ్చ-పచ్చని యుద్యానవనములు, ఉపవనములు, కాంతివంతములై గానవచ్చుచుండును. వృక్షపంక్తులు పుష్పసంభరితములై యుండును. ఆ కుసుమములపై మధుపములు ఝుంకారము లొనర్చుచుండును. రకరకములగు పక్షులు కలరవములు జేయుచుండును. నగరము సర్వసంపత్సమృద్ధమై యలరారుచుండినది. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన యాదవవీరులు ఆ నగరమును సేవించగల్గుట తమ యదృష్టమని భావించుచుందురు. ఆ నగరమందలి స్త్రీలు సర్వాలంకార శోభితలై యుందురు. వారి ప్రతి యంగమునందును యౌవనశోభ తొణికిసలాడుచుండును. ప్రాసాదములందు వారు కందుకాది క్రీడ

లొనర్చుచుండు సమయమందు వారి శరీరభాగమేదైన గనుపించినచో, మెఋపు మెఱిసినట్లుండును. లక్ష్మీపతియగు భగవానుని నివాసస్థాన మీ ద్వారకానగరము. షోడశ సహస్రాధికలైన భార్యలకు శ్రీకృష్ణుడేకైక ప్రాణవల్లభుడు. ఆ భార్య లందరికిని, పరమైశ్వర్య సంపన్నములగు ప్రత్యేక ప్రాసాదములున్నవి. ఎందరు భార్యలుండిరో, అన్ని రూపములుదాల్చి భగవానుడు వారితో విహరించుచుండును. పత్నులందరి ప్రాసాదములందును, సుందర సరోవరములున్నవి. వానియందలి నిర్మలజలము, చక్కగా వికసించిన, నీల, పీత, శ్వేత, రక్తవర్ణములు గలిగిన కమలపరాగముచే పరిమిశితమై యుండును. వానియందు హంసకారండవాది సుందర పక్షిగణము విహరించుచుండును. శ్రీకృష్ణుడా జలాశయము లందునను, అప్పుడ ప్పుడు నదులందునను ప్రవేశించి పత్నీయుతుడై జలక్రీడలాడుచుండును. జలక్రీడ లాడునప్పుడాతని పత్నులతనిని తమ భుజపాశములతో బంధించి యాలింగనము చేసుకొనగా వారి వక్షఃస్థలములందలి కుంకుమ పత్రభంగము లాతని శరీరమందంటు కొనుచుండును. గంధర్వులాతని యశోగానము చేయుచుందురు. సూత మాగధ వందీజనము లానందముతో మృదంగ వీణాదుల గైకొని లయవిన్యాసము చేయు చుందురు.

భగవానుని భార్యలప్పుడప్పుడు పిచికారీలతో నీళ్ళు జల్లుచు భగవానుని తడు పుచు నవ్వుచుందురు. అతడు గూడ వారి నటులే తడుపుచుండును. యక్షరాజగు కుబే రుడు తన పత్నులగు యక్షిణిలతో విహరించునట్లు భగవానుడీరీతి తన భార్యలతో క్రీడించుచుండును. భార్యలు వస్త్రములతో తడిసిపోగా, వారి యంగసౌందర్యము ప్రస్ఫుటముగ గానవచ్చుచుండును. కొప్పుముడులు వీడి పూలన్నియు రాలిపోవు చుండును. అతని నుండి పిచికారీలాగుకొను నెపముతో వారాతని సమీపించి యాలిం గనమొనర్చుకొను చుందురు. పతిసంస్పర్శచే వారి హృదయములందు ప్రేమభావము ప్రవృద్ధమగును. దానిచే వారి ముఖకమలములు వికసించును. ఆ సమయములందు సౌందర్యమతిశయించుచుండును. భగవానుని మెడయందలి వనమాల, వారి వక్షము నందలి కుంకుమచే రాగరంజితమగుచుండును. విహారమందత్యంత మగ్నులై యుండుటచేత మొగమునందలి ముంగురులు స్వేచ్ఛగా నల్లలాడుచుండును. కరిణీ పరివేష్టితుడైన గజరాజువలె, శ్రీకృష్ణుడు తన భార్యలతో నీవిధముగ విహరించు చుండును. జలక్రీడానంతరము శ్రీకృష్ణుడు అతని భార్యలు, తమతమ వస్త్రాభూష ణాదులను, అచటనున్న నటకులకు, నర్తకీలకు యిచ్చివేయుచుందురు. భగవానుడీ

రీతిగా తన రాణులతో విహరించుచు, తన మధుర మందహాసములతోడను, హాస విలాసములచేతను, ఆలింగనాదులచేతను చాతుర్య సంభాషణలచేతను, వారి చిత్త వృత్తులను తనవైపున కాకర్షించుకొనుచుండును. ఆ రాణులకు మఱియొక విషయమే స్మృతిపథమందు గోచరింపకయే యుండును. రాణుల జీవన సర్వస్వము హృదయే శ్వరుడగు శ్రీకృష్ణుడే. వారా శ్యామసుందరుని చింతనమందెంతగా నిమగ్నులై యుందురనగా, వారు కొంతసేపటివరకు మాటలేకయుండి పిమ్మటనున్మత్తులవలె యసంబద్ధ ప్రలాపము లొనర్చుచుందురు. అప్పుడప్పుడు, శ్రీకృష్ణుని సముక్షమందే, ప్రేమోన్మాదకారణముచే, విరహవ్యథననుభవించుచుందురు. ఏమేమియో మాటాడు చుందురు. మచ్చునకు, వారిమాటలు నీకు కొన్ని వినిపించెదను.

"ఓసీ, కురరీ (ఆడుక్రౌంచపక్షి). ఇప్పుడు చాల రాత్రియైనది. ప్రపంచ మంతట నిశ్శబ్దము అలముకొన్నది. చూడు ఇపుడు, భగవానుడు తన యఖండ బోధస్వరూపమును దాచుకొని, నిదురించుచున్నాడు. నీకు నిదురయేవచ్చుటలేదా యేమి? నీవిటుల రాత్రులందు మేలుకొనియుండి యేలవిలపించుచుంటివి? కమలనయ నుని మధురహాస్య—లీలాభరితమగు ఉదారకటాక్షవీక్షములచే, నీహృదయముగూడ మావలెనే తూట్లుపడలేదుగదా?

ఓసీ, చక్రవాకమా, నీవు రాత్రిసమయమందేల కనులు మూసుకుంటివి? నీవిటుల దీనముగ విలపించుచుండుటకు కారణమేమి? నీభర్తయేదైన విదేశమేగి యుండెనా? అయితే నీవు చాల దుఃఖితురాలివే. కాని,ఏమైనాగానీ, నీ హృదయమందు గూడ, మావలెనే భగవానునికి దాసిగావలయునను భావము జాగృతమైనది. నీవాతని చరణకమలములయందు సమర్పింపబడియున్న పూలమాలను నీకొప్పునందు ధరించ దలచుచుంటివా?

"ఓహో, సముద్రుడా, నీవెల్లపుడును గర్జించుచుందువు. నీకు నిదురవచ్చుట లేదాయేమి? నీకు నిదురపట్టని రోగమేదైన కలిగినదా? కాదు. కాదు. అర్థమైనది. నీధైర్యగాంభీర్యాది గుణములను మాప్రియతమ శ్యామసుందరుడపహరించినాడు. నీవందుచేతనే, మావలె, మందులేనట్టి వ్యాధికిలోనై బాధపడుచుంటివా?

"చంద్రదేవా, నీకు రాజయక్ష్మమను మహావ్యాధి కల్గినది. అందుచేతనే నీవింతగా క్షీణించుచుంటివి. అయ్యో, నీకిరణములచే నీవంధకారమును గూడ పోగొట్టలేని స్థితియందుంటివే! మావలెనే నీకు గూడ శ్యామసుందరుని తీయనిసంభాషణలు మరచుటచే నోరు మూగవోయినదా? ఆ చింతతోనే నీవు మౌనముగ నుంటివా?"

"మలయానిలమా, నీవు మా హృదయములందు కామ సంచారముగావించు చుంటివే. నీకు మేమేమి యపరాధముగావించితిమి? నీకు తెలియదాయేమి? భగవానుని క్రీగంటిచూపుచే మా హృదయ మిదివరకే గాయపడినది."

మేఘమా, నీ శరీరసౌందర్యము మా ప్రియతముని వలెనేయున్నది. నీవు తప్పకయదువంశ శిరోమణియగు శ్రీకృష్ణునకు ప్రియమిత్రుడవైయుందువు. కావుననే నీవుగూడ మావలెనే ప్రేమపాశబద్ధుడవై యతనిని ధ్యానించుచుంటివేమో. చూడు చూడు. నీహృదయము చింతాభరితమైయున్నది. నీవతని కొరకత్యంత ముత్కంఠితుడవై యున్నావు. కావుననే మాటిమాటికి అతనిని జ్ఞాపకము చేసుకొనుచు, మావలెనే, యశ్రుధారల గార్చుచున్నావు. శ్యామఘనా, ఘనశ్యామునితో సంబంధము పెట్టుకొనుట, నిజముగ పీడ కొని తెచ్చుకొనుటయే సుమా:"

"ఓ కోకిలా, నీకంఠస్వరమతి మధురము. తీయని పలుకులు పలుకునట్టి మా ప్రాణప్రియునితో సమానముగనే, నీవు మధురముగా గూయుచుందువు. నిజముగా నీ కంఠధ్వనియందు, ప్రియావిరహముచే మరణించిన వారలను జీవింపజేయునట్టి యమృత రసాయనమున్నది. నీవేచెప్పుము. ఈ సమయమందు నీకు ప్రియము చేకూర్చుటకై మేమేమి చేయవలె?"

"ప్రియపర్వతరాజమా, నీవు గొప్ప విచారణచేయు స్వభావముగలవాడవు. ధరణిని ధరించియుంటివి. నీవు కదలవు. మెదలవు. పలుకవు వినవు. ఏదో గొప్ప విషయమై చింతానిమగ్నుడవై యున్నట్లు గాన్పించుచుంటివి. సరే, తెలిసినది. నీవు గూడ మావలెనే, మా స్తనసదృశములగు నీశిఖరములపై భగవానుని చరణకమలముల ధరింప గోరుచుంటివి."

"సముద్ర పత్నులగు నదులారా, ఇది గ్రీష్మఋతువు. మీ ప్రవాహము లన్నియు నెండియున్నవి. మీ కుండలములందిపుడు వికసిత కమల సౌందర్యము

కనుపించదు. మీరు చాల కృశించియున్నారు. మేము, మా ప్రియతముడగు శ్యామసుందరుని ప్రేమ పూరిత వీక్షణముల పొందజాలక, శూన్యహృదయముగలవారమై శుష్కించి యున్నటులనే, మీరు గూడ, మేఘుని ద్వారా మీ ప్రియతముడగు సముద్రుని జలమును పొందజాలక, యిటువంటి దీనావస్థను గల్గియున్నటుల గానుపించుచున్నది."

"రాజ హంసమా, రమ్ము, రమ్ము. వచ్చితివా, నీకు సుస్వాగతము. యీ యాసనమందు గూర్చుండుము. ఇదుగో, యీ పాలు త్రాగుము. ప్రియహంసమా, శ్యామసుందరుని మాటలేవైన వినిపించుము. నీ వాతని దూతగా మేము భావించుచున్నాము. ఎవరికిని వశుడుగానట్టి యా శ్యామసుందరుడు కుశలముగా నున్నాడా? అతని స్నేహితమత్యంతచపలము. క్షణభంగురము సుమా! ఒక్కమాట చెప్పు. "మీరే నాకత్యంత ప్రియతము"లని యాతడు మాతో పల్కియున్నాడు. ఆతనికీ మాట జ్ఞాపకమున్నదా? వెళ్ళు, వెళ్ళు. మేము నీ యనునయ వాక్యములు వినము. అతడు మమ్ము లక్ష్యపెట్టనపుడు మేమతనివెంక నేలబడవలె? క్షుద్రమాతా, మేమతనివద్ద కేగము. ఏమంటివి? మా మనోరథముల పూర్తి చేయుటకే యతడిచటికి రాగోరు చుండెననుచుంటివా? మంచిది. అట్లయినచో నతని నిటకు గొనిరమ్ము. మాతో మాటాడించుము. కాని లక్ష్మిదేవిని మాత్రమతనితో రానీయకుము. లక్ష్మిదేవిని వీడి యాతడిటకు రాదలుచుటలేదా? ఇదెట్టిమాట? స్త్రీలందరిలో లక్ష్మిదేవికే భగవానుని యందనన్య ప్రేమయున్నదా? మాలో నొక్కరుగూడ నట్టివారులేరా?"

"పరీక్షిన్మహారాజా, యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణుని భార్యలతని యందట్టి యనన్య ప్రేమనే కలిగి యుండిరి. దానిచేతనే వారు పరమపద ప్రాప్తినందిరి. శ్రీకృష్ణుని లీలలు అనేక విధములుగా ననేక గీతములు గానము చేయబడినవి. వానిని విన్నంతమాత్రముననే స్త్రీల చిత్తములు బలవంతముగా భగవానుని వైపున కాకర్షితములగునంత మధుర మనోహరముగా నుండునట్టివి, ఆ లీలలు. అట్టిచో, నతనిని తమ నేత్రములతో జూచుచుండు వారి విషయము చెప్పెడిదేమి? ఏ సౌభాగ్యవతులగు స్త్రీలు, జగద్గురువగు శ్రీకృష్ణ భగవానుని తమ పతిగా పొంది, యతని పాద సంవాహనము చేయుచు, స్నానము చేయించుచూ, భుజింపజేయుచు, వివిధములగు సేవలు చేయుచు నుందురో వారి తపస్సును వర్ణించుట యెవరితరము?"

శ్రీకృష్ణభగవానుడు సత్పురుషులకేకమాత్రాశ్రయుడు. వేదోక్తధర్మములను తానాచరించుచు, గృహస్థాశ్రమమే ధర్మార్థకామములకు సాధనాస్థానమని లోకులకు చూపించినాడు. అందుచే గృహస్థోచితములగు శ్రేష్ఠధర్మములను ఆశ్రయించి వ్యవహరించుచుండెడువాడు. * అతని భార్యలు పదునారువేల నూటయెనిమిదిమందియని నీకిదివరకే చెప్పియుంటిని. వారిలో రుక్మిణీదేవి మొదలగు యెనిమిదిమంది పట్టపు రాణులు, వారి పుత్రుల విషయము నీకిదివరకే వివరించియుంటిని, మిగిలిన భార్య లందతనికి, ఒక్కొక్క భార్యకు పదిమంది చొప్పున, పుత్రులుదయించిరి. భగవానుడు సర్వశక్తి సమన్వితుడు, సత్యసంకల్పుడు నగుటచేత, యిది యేమంత యాశ్చర్యకరమగు విషయముగాదు. భగవానుని పుత్రులందు పదునెనిమిదిమంది మహారథులు. వారి యశస్సు జగద్విదితము. వారి నామములు చెప్పెద వినుము ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మధువు, బృహద్భానుడు, చిత్రభానుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, వేదబాహుడు, శ్రుతదేవుడు, సునందనుడు, చిత్రబాహుడు, విరూపుడు, కవి, న్యగ్రోధుడు ననువారలు. రాజేంద్రా, శ్రీకృష్ణుని యీ పుత్రులందరిలో శ్రేష్ఠుడు, రుక్మిణీతనయుడగు ప్రద్యుమ్నుడు. అన్ని గుణములలో నతడు తండ్రియగు శ్రీకృష్ణునితో సమానుడు. ఆ ప్రద్యుమ్నుడు, రుక్మి కుమార్తెతో పాణిగ్రహణ మొనర్చియుండె. ఆమెకు అనిరుద్ధుడు కుమారుడుగా జన్మించె. అతడు పదివేల యేనుగుల బలముగలవాడు. అతడు రుక్మి పౌత్రిని వివాహమాడగ నామెయందు వజ్రుడుద్భవించె. బ్రాహ్మణ శాపముచే కల్గిన ముసలముచేత యాదవవంశము నశించిపోగా, వజ్రుడొక్కడు మాత్రమే వంశాంకురముగ మిగిలినాడు. వజ్రుని పుత్రుడు ప్రతిబాహుడు, ప్రతిబాహునకు సుబాహుడు, అతనికి శాంతసేనుడు, అతనికి శతసేనుడునను వారు వరుసగా పుత్రులైరి. ఈ వంశమందు బహుసంతానములేని వారుగాని, నిర్ధనులు, అల్పాయువులు, అల్పశక్తియుతులునగు వారెవ్వరును లేకుండిరి. అందరును బ్రాహ్మణ భక్తులైయుండిరి. వేయి సంవత్సరములలో గూడ లెక్కింపరానట్టి, వీరులనేకులు యదువంశమందుద్భవించి యుంటిరి. యదువంశమందలి బాలకులకు విద్యగరపుటకై

---

* శ్లో. అస్థితస్యపరం ధర్మంకృష్ణస్య గృహమేధినాం
ఆసన్ షోడశసాహస్ర మహిష్యోఒష్ట శతాధికం

మూడుకోట్ల యెనభైయెనిమిదివేల మంది యుపాధ్యాయులు నియమింపబడి యుండి రని నేను వినియుంటిని. అట్టి స్థితిలో యదువంశీయుల సంఖ్య చెప్పుట యెట్లు సాధ్య మగును? స్వయముగ నుగ్రసేన మహారాజసైన్యము దాదాపుగానొక 'నీల' ముండి నది. (నీలము=10000000000000).

"పరీక్షిన్మహారాజా, ప్రాచీన కాలమందు దేవాసుర సంగ్రామమున భయం కరులగు రక్కసులందరును మడిసిరి. వారే మరల మనుజుల యందుద్భవించి, గర్విష్ఠులై మానవుల బాధింప సాగిరి. వారిని సంహరించుటకై భగవానుని యాదేశాను సారము దేవతలు యదువంశమందుద్భవించిరి. వారి కులములు నూటయొక్కటి యుండినవి. వారందరును శ్రీకృష్ణునే తమ యారాధ్య దైవముగను, తమ కాదర్శ ముగను భావించుండిరి. అతని ననుసరించి ప్రవర్తించిన యదువంశీయులందరికిని యున్నతి లభించినది. వారందరు, కూర్చున్నను, తిరుగుచున్నను, మాట్లాడుచు న్నను, మజ్జన భోజనాదులు గావించుచున్నను గూడ, తమ శరీరములను మఱచి పోయి, చిత్తములను భగవానుని యందు లగ్నమొనర్చుచుండిరి. తమ శరీరమేమి చేయుచుండెనను ధ్యాసయే వారికి లేకుండ బోవుచుండెడిది.

భగవానుని పాద శౌచనీరమగు గంగ, తీర్థము లన్నిటిలోకి గొప్పది. పవి త్రమైనది. పరమ తీర్థ స్వరూపుడగు భగవానుడు యదువంశమునందవతరించగా, నతని సుయశస్సను తీర్థ దృష్టిలో గంగాజలము యొక్క మహిమ తనంతట తానే తగ్గిపోయినది. భగవానుని స్వరూపము యొక్క మహిమ యెంత గొప్పది! అతనిని ప్రేమించు భక్తులకు, ద్వేషించు శత్రువులకు గూడ నతని స్వరూప ప్రాప్తి లభించి నది. ఏ మహాలక్ష్మి ప్రాప్తికొరకై, గొప్ప గొప్ప దేవతలుగూడ ప్రయత్నించు చుందురో, ఆ లక్ష్మి దేవియే నిరంతరము భగవంతుని సేవించుట యందు లగ్నమై యుండును. భగవన్నామము నొక మారు విన్నను, లేక యుచ్చరించినను, సర్వ అమంగళములును నశించిపోవును. ఋషుల వంశములందు ప్రచలితములై యున్న ధర్మములన్నిటికిని సంస్థాపకుడు శ్రీకృష్ణ భగవానుడే. అతడు కాలరూపమగు చక్ర మును తన చేతి యందు ధరించియుండును. అట్టివాడు పృథ్వీ భారము తొలగించు టలో పెద్ద విశేషమేమున్నది? శ్రీకృష్ణభగవానుడే సర్వ జీవుల కాశ్రయస్థానము. అతడు సర్వత్ర ఉపస్థితుడై యున్నను, చెప్పుకొనుటకై యాతడు దేవకి గర్భము నుండి జన్మించాడు. యదు వంశీయులు వీర పార్షద రూపమున నతనిని సేవించు

చుండిరి. తమ భుజబలముచే వారధర్మము నంతమొందించుచుండిరి. భగవానుడు సహజముగనే చరాచర జగత్తు యొక్క దుఃఖమును తొలగించుచుండును. మంద హాస యుక్తమగు నందనందనుని సుందర వదనార విందము, వ్రజ స్త్రీలకును, పుర స్త్రీలకును హృదయమందు ప్రేమ భావసంచారము గావించుచుండెడిది. పృథి విపై నతనిదే నిజమగు విజయము-భగవానునకు జయము—జయమగుగాక.

ప్రకృతి కతీతుడగు పరమాత్మ, తన ద్వారా స్థాపితమైన ధర్మ మర్యాదను రక్షించుటకై, దివ్యలీలా శరీరమును ధరించి, దానికనురూపములగు ననేకాద్భుత చరిత్రలనభినయించినాడు. అతని ప్రతి కర్మయు స్మరించువారల కర్మబంధముల ఛేదించునట్టిది. యదువంశ శిరోమణియగు శ్రీకృష్ణుని చరణ కమలసేవ కధికారము లభింపవలయునని గోరువారు, భగవానుని దివ్య లీలలనే శ్రవణ మొనర్చవలయును. ప్రతి క్షణము భగవానుని మనోహరములగు దివ్య లీలా కథల నధికాధికముగ శ్రవణ మొనర్చుచు, కీర్తించుచు, చింతించుచు (మననము చేయుచు), నున్నచో, నట్టి భక్తియే మానవుని, భగవానుని పరంధామమును చేర్చును. కాలగతిని దాటిపోవుట చాల కఠినమేయైనను, భగవానుని ధామమునందు, కాలము యొక్క పప్పులుడుకవు. (కాలమేమియు చేయజాలదని యర్థము). కాలమా పరంధామమును చేరజాలదు. ఆ పరంధామ ప్రాప్తికొరకే, యనేక సార్వభౌములు, తమ రాజ పదవుల వదలి, తపస్సాచరించుటకై వనములకేగి యుండిరి. కావున మనుజుడు భగవానుని లీలాకథ లనే, తప్పక శ్రవణ మొనర్పవలయును.

=దశమస్కంధము సంపూర్ణము=

# దశమ స్కంధము నందలి

## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 21 | నిర్జంప | నిర్జింప |
| 3 | 7 | ఆలపించ | ఆలసించ |
| 4 | 6 | గమనించిక | గమనించిన |
| 6 | 2 | సత్వ | సర్వ |
| | 27 | నందుండి | నందుంచి |
| 9 | 18 | తర్యామి | అంతర్యామి |
| 19 | 14 | నందలి | నందవి |
| 23 | 10 | నాది | ఆది |
| 25 | చివరిపంక్తి | బాహు | బహు |
| 26 | 11 | చడిద | చంద |
| 27 | 17 | కనుక | కనుల |
| | 18 | విముక్తులుగా | విముక్తులగావించి |
| | 26 | వస్తువునే | వస్తువుచే |
| 28 | 14 | యింనివల్రదున | యింద్రునివలన |
| | 25 | నూతన | సనాతన |
| 29 | 21 | దుష్టాంత | దృష్టాంత |
| 30 | 30 | సర్వదా | సర్వధా |
| 44 | 23 | గృహత్యము | గృహకృత్యము |
| 48 | 2 | కపష | కవేష |
| | 14 | కింకరితి | కింపితరితి |
| 76 | 23 | నన్ను | నున్న |
| 79 | ర 8 | వస్త్రాిదు | వస్తాడు |
| | 9 | శక్తుల | భక్తుల |
| | 14 | లొసంగెను | లొసంగెడు |
| 81 | 12 | గోవరు | గోపకు |
| 83 | 12 | కులకు | కులు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 22 | నన్తానీన్దైక | నన్తానన్దైక |
| 6 | 23 | శుద్ధిగాని | శుద్ధిగావి |
| 9 | 21 | యెవ్వడు | యెవ్వడుతెలియ |
| 10 | 14 | చేవను | చేతను |
| 11 | 9 | ముప్పల్లి | ముప్పతిల్లి |
| 18 | 10 | సర్వోవ | సర్వోప |
| 19 | 16 | లై నను | లై నవై |
| 22 | 2 | ఒకగాడు | ఒకనాడు |
| | 16 | శ్రీకృష్ణుని | శ్రీకృష్ణుడు |
| | | సుదాముడు | సుదాముని |
| 23 | 13 | కామాన | కామన |
| 24 | 8 | సడాంటు | సమంటు |
| 25 | 24 | చెప్పబడిన | గప్పబడిన |
| 28 | 23 | భ్రమను | శ్రమను |
| 29 | 23 | సుఖమును | దుఃఖమును |
| 32 | 14 | వారల | ధారల |
| | 25 | కనుల | కమల |
| 35 | 19 | రమణో | రరుణో |
| 38 | 19 | గావించు | గావించి |
| 39 | 31 | హేమలత | హేమంత |
| 43 | 26 | అంతయు | అంతము |
| 44 | 8 | ద్వేదీ | ద్వైధీ |
| 55 | 25 | కేవల్య | కైవల్య |
| 57 | 28 | ప్రతీయతే | ప్రలీయతే |
| 58 | 25 | కుసేదము | కుసీదము |
| 59 | 22 | కుమారుడ | కుమారుడుగ |
| 66 | 8 | సతని | తన |
| | 22 | విగ్రహ | నిగ్రహో |
| 69 | 13 | వరణుడు | వరుణుడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 170 | 6 | మునకు | మనకు |
| 172 | 12 | మహితులై | మోహితులై |
| | 26 | బడన | బడిన |
| 174 | 13 | గోదోహస | గోదోహన |
| | 31 | ప్రియ | యప్రియ |
| 175 | 25 | యుపదేశము | యుపదేశాను |
| 176 | 4 | పై లక్షణ్య | వై లక్షణ్య |
| 177 | 4 | గతభ | గతాభ |
| | 15 | నీవత | నీవవత |
| 182 | 34 | చూపులొనుచు | చూపుకొనుచు |
| 183 | 19 | తెతిపి | తెలిపి |
| 189 | 20 | బారిచే | వారిచే |
| 190 | 29 | చుందురు | చుందును |
| 195 | 7 | వృక్షము | వక్షము |
| 197 | 19 | భవవానుని | భగవానుని |
| 199 | 32 | యందించు | యందుంచు |
| 204 | 19 | చున్వాడు | చున్నాడు |
| 208 | 16 | రసక | రసిక |
| | | రసిరాజు | రసరాజు |
| 210 | 28 | ప్రతి | పతి |
| 212 | 18 | ప్రస్తుతః | వస్తుతః |
| 223 | 15 | యందిలి | యందరి |
| 234 | 2 | వృక్షస్థ | వక్షస్థ |
| 246 | 19 | నరోమ | నీరోమ |
| | 24 | మనూమయ | మనోమయ |
| 253 | 32 | దర్శనముచే | దర్శనమునే |
| 258 | 23 | మంద | మద |
| 275 | చివరిపంక్తి | చుంననది | చుండినది |
| 278 | 6 | జంగము | జంగమము |
| | 28 | భాషించుకొకు | భాషించుకొను |
| 282 | 15 | చేసనందు | చేసినందు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 284 | 13 | వినియోగ | వియోగ |
| 285 | 16 | లీలలచే | లీలలనే |
| 287 | 24 | యావేదను | యావేదనను |
| 296 | 25 | మిమ్ము | మమ్ము |
| 309 | 13 | వత్రాప్తి | వత్ర్యాప్తి |
| | 16 | వుప్రత్తమై | ప్రమత్తమై |
| 313 | 30 | బ్రాహ్వణ | బ్రాహ్మణ |
| 314 | 8 | గలవాడై | గలవాగై |
| | 19 | తోఒగతాపం | తోఒంగతాపం |
| 316 | 14 | రుక్మిణీ | రుక్మి |
| | 25 | జేరి, | జేరె. |
| 322 | 28 | ఖశాయి | భూశాయి |
| 332 | 13 | నాగకన్య | నాకన్య |
| 334 | 31 | నిధనభర్త | నిధనవార్త |
| 339 | 31 | కంటె | నీ కంటె |
| 344 | 13 | మహిత్త | మహత్త |
| 349 | 14 | డెక్కడశన్ను | డెక్కడ |
| 352 | చివరి పంక్తి | సకాలము | సకాము |
| 353 | 26 | పించునది | పించినది |
| 355 | 12 | వారు | చారు |
| 359 | 2 | లందరి | లదరి |
| 361 | 26 | వక్షమున | పక్షమున |
| 362 | 8 | కూషాండ | కూష్మాండ |
| 370 | 25 | సర్వమోక్ష | స్వర్గమోక్ష |
| 376 | 29 | కుంరిత | కుంఠిత |
| 384 | 13 | కాండవ | కారండవ |
| 385 | 21 | అద్భుతము | అమృతము |
| 390 | 21 | స్వర్గము | స్వరము |
| 397 | 32 | వలయున్నది | వలయునన్నది |
| 405 | 4 | ఉర్తమోత్తమగు | ఉత్తమోత్తమమగు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 405 | 8 | మణి | మణి |
| 406 | 19 | నీర సేను | వీర సేను |
| 411 | 30 | ప్రేమమౌ | ప్రేమౌ |
| 412 | 28 | సహితయుగ | సహితముగ |
| 421 | 31 | మునే | ముచే |
| 425 | 24 | చెప్పినట్టి | చెప్పునట్టి |
| 431 | చివరిపంక్తి | ధగద్దగామా | ధగద్దగాయమా |
| 445 | 10 | మాతాశయు | మాత్రాశ్రయు |
| 448 | 31 | నిరూప | నిరుప |
| 449 | 2 | గాను | గాద |
| | 7 | కుభము | శుభము |
| 450 | 3 | గూర్కి | గూర్చి |
| | 8 | పురుషులును | పురుషులను |
| | 25 | లుది | యిది |
| | 29 | శరిర | శరీర |
| 451 | 30 | శరగత | శరణాగత |
| 460 | చివరిపంక్తి | నాయుపాన, స | నాయుపాసన |
| 469 | 21 | స్వతంత్ర | స్వతంత్రత |
| 470 | 31 | అమిత్త | నిమిత్త |
| 473 | 2 | పార్ల | పా |
| 486 | 15 | వీక్షముల | వీక్షణము |
| vi | 5 | ద్దార్మా | ద్ధరా |
| vii | 20 | యనును | మ |
| viii | 8 | ఖాతే | ఖాస |
| xii | 4 | ధనికుల | ఆధునిక |

## విషయసూచిక

| | | | |
|---|---|---|---|
| xvii | 90 | 488 | 48 |

—0—

# రచయిత పరిచయము



రచయిత :

## రాయసం వీరేశ్వరశర్మ

జననము :

**20-2-1920**

విద్య : ఆంధ్రా యూనివర్శిటీ బి.ఏ.

వృత్తి : ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ సహకారశాఖలో డిప్యూటీ రిజిష్ట్రారుగా పనిచేసి 1975 వ సంవత్సరం ఫిబ్రవరి మాసాంతమున పదవీ విరమణ.

అభిరుచులు : 1] సంస్కృతాంధ్రములలో సాహిత్య సేవ.
2] అఖిల భారత శ్రీరామ నామ కోటి లేఖన మహాసంఘం [హైద్రాబాద్] ఉపాధ్యక్షుడుగా శ్రీరామ నామ లేఖన ప్రచారము.

ముద్రిత ఆంధ్రానువాద రచనలు :

1] శ్రీమద్భాగవత మహా పురాణము (వ్యాసకృతము) [పన్నెండు స్కంధములు]
2] శ్రీమద్రామాయణసార సంగ్రహము.
3] బ్రహ్మోత్తర ఖండము (స్కాంద పురాణాంతర్గతము)
4] శ్రీ దేవీ మహాభాగవత మహాపురాణము.

అముద్రిత ఆంధ్రానువాద రచనలు :

1. శ్రీ దేవీ భాగవత మహాపురాణము (12 స్కంధములు-వ్యాసకృతము)
2. గర్గ సంహిత
3. బ్రహ్మవైవర్త పురాణము (వ్యాసకృతము)
4. ఆదిశంకర సంగ్రహ చరిత్ర
5. ఆనంద రామాయణము.
6. సూతసంహిత (స్కాంద పురాణాంతర్గతము)
7. హరివంశము
8. శ్రీ మహాభారత సంగ్రహము
9. శ్రీ మత్స్య పురాణము (వ్యాసకృతము)
10. శ్రీ వాసుదేవ మనన సారము.

శ్రీకృష్ణ సదనము, 23-23-28, శివరావు వీధి, యస్. యన్. పురం,
విజయవాడ.